# మ లి నా ం చ లం

స్వాతంత్ర్యం లభించిన తరువాతి భారతీయజీవితాన్ని ఎంతో కళాత్మకంగా, యథార్థంగా చిత్రించే నవల 'మలినాంచలం'. బీహారులోని ఒక కుగ్రామం మేరీగంజ్ నివాసుల జీవితం వర్ణించినా సమస్త భారతీయ గ్రామజీవితానికి ఈ నవల ప్రతిబింబ మనవచ్చు. ఆదివాసులు, తక్కువజాతికి చెందిన ప్రజలు మూఢాపట్టిన తమ జాతి వర్గ వ్యవస్థల నుంచి బైటపడాలని అనుభవించే తపన, అందుకు జరిగిన అలజడి ఈ నవలలో చిత్రించబడ్డాయి. ఇది రష్యనుభాషలో అనువదింపబడింది. రష్యను ప్రజల మన్ననల్ని విశేషంగా అందుకుంది.

శ్రీ ఫణీశ్వరనాధ్ రేణు పరిణితి చెందిన రచయిత. వీరి గ్రామీణ భాషాశైలీ, రచనాత్మక ప్రతిభలతో హిందీభాష ఎంతగానో వికాసం పొందింది.

# మలినాంచలం

రచన :
ఫణీశ్వరనాథ్ 'రేణు'

అనువాదము :
దండమూడి మహీధర్



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా
న్యూఢిల్లీ

1976 (1898)

© ఫణీశ్వరనాథ్ 'రేణు'.

తెలుగు అనువాదం: నేషనల్ బుక్ ట్రస్ట్,
కాపీరైటు ఇండియా.

రూ. 12-75

*Original Title:* **MAILA ANCHAL** (Hindi)
*Telugu Title:* **MALINAANCHALAMU** (Telugu)

డిస్ట్రిబ్యూటర్సు:
ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్,
రాష్ట్రపతి రోడ్డు, సికింద్రాబాదు.

PUBLISHED BY THE DIRECTOR, NATIONAL BOOK TRUST, INDIA,
A-5, GREEN PARK, NEW DELHI-16,
PRINTED AT THE FREEDOM PRESS, MADRAS-600021.

# మొదటి ముద్రణ పీఠిక

ఇది 'మలినాంచలం' మాండలిక నవల. ఈ నవలకు కథారంగం పూర్ణియా. పూర్ణియా బీహారులో ఒక జిల్లా. దీని కొకపక్క నేపాల్, మరొక పక్క పాకిస్తాన్, పశ్చిమ బెంగాల్ ఉన్నాయి. దక్షిణాన సంథాల్ పరగణా. పడమట మిథిల సరిహద్దు రేఖ గీయడంతో విభిన్న సరిహద్దులతో కూడుకున్న దీని నిర్మాణం పూర్తవుతుంది. నే నీ జిల్లాలోని ఒక భాగంలో వున్న ఒకే ఒక గ్రామాన్ని - వెనుకబడినగ్రామానికి ప్రతీకగా ఎంచుకొని, ఈ నవలకు కథాక్షేత్రంగా చేశాను.

ఇందులో పువ్వులూ ఉన్నాయి. ముళ్ళూ ఉన్నాయి. దుమ్మూ ఉన్నది. సింధూరమూ ఉన్నది. బురదా ఉన్నది. మంచిగంధమూ ఉన్నది; అందమున్నది. అందవికారమూ ఉన్నది। వేటినుంచీ నేను తప్పుకొని బయట పడలేకపోయాను.

ఈ కథలోని సమస్త గుణదోషాలతోసహా సాహిత్య ప్రాంగణంలోకి వచ్చి నిలబడ్డాను; ఇది మంచిదని అవునో, కాదో నాకు తెలియదు. ఏది ఏమైనా నా ప్రయత్నంలోమాత్రం ఎటువంటి లోపమూ ఉన్నదని అనుకోను.

ఫణీశ్వరనాథ్ 'రేణు'

పాట్నా.

9, ఆగస్టు, 1954.

# 'మైలా అంచల్': తొలిపలుకు

'గోదాన్' హిందీ ప్రఖ్యాత రచయిత ప్రేమచంద్ చివరినవల, కాగా, 'మైలా అంచల్' సమకాలిక కథారచయిత ఫణీశ్వరనాథ్ రేణు తొలినవల. 1954 లో 'మైలా అంచల్' వెలువడినవెంటనే ఎందరో విమర్శకులు దీన్ని 'గోదాన్' నవలతో పోల్చి చూపారు. సమీక్షకులు స్వర్గీయ నళినవిలోచనశర్మ - 'ఈ నవల 'గోదాన్' తరువాత హిందీలో అంత మహోన్నతమైన రచన' అని సాధికారకంగా పేర్కొన్నారు. 'గోదాన్' ప్రేమచంద్ రచనలన్నింటిలోనూ ఉన్నత కళాఖండం లాంటిది; అన్నిటికంటె మరింత ప్రౌఢమైనట్టిదికూడాను; ఆనాడు ఈనాడుకూడా ఇంతవరకు హిందీలో వెలువడిన నవల లన్నింటిలోనూ 'గోదాన్' మకుటాయమానమైనదని అనేక విమర్శకులు పేర్కొనడం జరిగింది. 'గోదాన్' తరువాత అదేకోవకు చెందిన నవలగా 'మైలా అంచల్'ను తదుపరి యశపాల్ 'ఝూఠా-సచ్' నవలను మినహాయించి హిందీలో వెలువడిన ఏ ఇతర కృతినిగురించి ఇంత సాధికారకంగా పేర్కొనడం ఇంతవరకు జరగలేదు.

ఈ దృష్టితో పరిశీలించినప్పుడు ఈ నవలనుగురించి ఒక తిరుగులేని సత్యం బహిర్గతమవుతున్నది. అదేమిటంటే - 'గోదాన్'వంటి వాస్తవికతా దృక్పథంతో కూడుకున్న ఈ ప్రౌఢరచనను హిందీపాఠకులకు అందించడానికి ప్రేమచంద్‌కు ముప్ఫయిసంవత్సరాల సుదీర్ఘ సాహిత్యకృషి జరపవలసిన అవసరం ఏర్పడింది. అంతకుముందు రాసిన నవలలకు, 'గోదాన్' నవలకు కళాత్మకపటుత్వం, అనుభూతి శబలత, భావనాబలం విషయంలో అస్తిమకాంతర భేదమున్నది. వాస్తవంగా 'గోదాన్' పరంగా చూసినా 'సేవాసదన్' 'ప్రేమాశ్రమ్' 'కాయకల్ప' 'రంగభూమి' 'గబన్' మొదలైన ప్రేమచంద్ నవలలకు ఎంతో విలువున్నది. వాటిలో సజీవపాత్ర చిత్రణలోపం, జీవితవాస్తవాలకు ఉటోపియన్ సరళ పరిష్కారమార్గాలను ప్రవేశపెట్టడంవంటి లోపాలు అనేకం మనకు కనిపిస్తాయి. ఈ కారణం వల్ల వాస్తవికత, కళాత్మకత దెబ్బతినడం జరుగుతున్నది. అయితే ఈ రచనలను ఆయన ప్రతిభ సంపన్నతకు, నిత్య సాంఘిక చైతన్యప్రగతికి ప్రాతిపదికలుగా భావించి లోపాలను పరిహరించవలసి వుంటుంది. ఈ సందర్భంలో 'మైలా అంచల్' 'గోదాన్'తో సరితూగగల మరో మహోత్కృష్టరచనగా స్వీకరించడం జరుగుతున్నదీ అంటే - దీని అర్థం ముప్ఫయి సంవత్సరాల సాహిత్యకృషి అనంతరం ప్రేమచంద్ అందుకున్న ఉన్నతశిఖరాలను 'రేణు' ప్రారంభదశలోనే అందుకొని తన సాహిత్య వ్యాసంగానికి నాంది వాచకం పలికినట్టు బోధ

పడుతున్నది. మరోవిధంగా చెప్పాలంటే - ఎంతటి పటువైన, విశాల, సార్వజనీన, అనుపమాన ప్రజ్ఞాప్రాభవాల ఉపలబ్ధికి ప్రేమచంద్ ముప్ఫయిసంవత్సరాలపాటు సాహిత్యక్షేత్రపు అనేక ఇరుకైన వంకరటింకర సందుగొందులవెంబడి దారితప్పి తిరగవలసి వచ్చిందో, 'రేణు'కూడా అంతటి ప్రౌఢమైన విశాల, సార్వజనీన, అనుపమాన ప్రజ్ఞాప్రాభవాల ఉపలబ్ధికి కావలసిన మూలతత్త్వాన్ని సంతరించుకొని సాహిత్యరంగంలో పాదం మోపినట్లు చెప్పవచ్చును.

ఒక వాస్తవాన్ని సూచనాప్రాయంగా తెలియజేయడానికే ఈ విషయం ప్రస్తావించడం జరిగింది. దీన్ని గుణదోషవివేచనగా భావించరాదు. ప్రపంచ సాహిత్యచరిత్రను పరిశీలించి చూస్తే ఈ విషయమే బోధపడుతుంది. టాలస్టాయ్, దాస్టోవస్కీ, డికెన్స్, హార్డీ వీళ్ళ ప్రారంభరచనలు వీళ్ళకు ప్రపంచఖ్యాతిని ఆర్జించిపెట్టిన ఉత్తమోత్తమ నవలలముందు తీసికట్టుగా కన్పిస్తాయి. అయితే వాటిలో ప్రకృతి చిత్రణమీద మక్కువ, వ్యక్తిత్వంలేని పాత్రల బాహుళ్యం, సంఘటనల ఆధిక్యత, ఆదర్శవాదంతో రంగరించిన సరళపరిష్కార మార్గాలను బలవంతంగా ప్రవేశపెట్టాలనే ప్రవృత్తి కన్పించకపోవచ్చు। అయితే ఆయా రచయితల తొలిరచనలుకూడా స్వతంత్రధోరణిని కలిగినవిగాను, అఖండమైన కళాఖండాల స్థాయిని అందుకున్నట్లుగానూ మనకు కన్పిస్తాయి. అయితే వాటి కాన్వాస్ చాలా స్వల్పమైనది కావడంవల్ల ఖ్యాతి నార్జించుకున్న ఆ తరువాత రచనలలో కన్పించే విశాల జీవిత చిత్రణ మనకు కన్పించదు.

ప్రపంచసాహిత్యాన్ని పరికిస్తే కొన్ని పట్టువిడుపులు కన్పించకపోవు; ఉదాహరణకు 'డాన్ క్విక్ సోట్' రచయిత సర్వాంతే లేదా 'డోన్, నెమ్మదిగా ప్రవహించు।' రచయిత షోలోఖోవ్ రాసిన ప్రప్రథమ రచనలే ప్రపంచసాహిత్యంలో ప్రముఖస్థానాన్ని అందుకున్నాయి. ఆతరువాత వీటితో తులతూగగల మరొక నవల సర్వాంతేగాని, షోలోఖోవ్ గాని రచించలేకపోయారు. ప్రపంచసాహిత్యంవిషయం అలావుంచి పరిమితహిందీ సాహిత్య క్షేత్రాన్ని పరికించిచూపినా 'అజ్ఞేయ్' లాంటి రచయిత 'శేఖర్: ఏక్ జీవనీ' తరువాత రాసిన నవలలలో ఆ స్థాయిని అందుకోలేకపోయారు. యశపాల్, అమృతలాల్ నాగర్, ఉపేంద్రనాథ్ అశ్క్, నాగార్జున్ - వీళ్ళల్లో ప్రతిఒక్కరి సృజనాత్మకప్రతిభ దశలు దశలుగా అభివృద్ధిచెంది పరిణామదశకు చేరుకున్నది.

'మైలా ఆంచల్' ఈ సామాన్యసూత్రాన్ని అతిక్రమించిన సశక్తమైన అపవాదం। ఈ రకంగా 'రేణు' పునరావృతం కావడం అసంభవం కాకపోయినా, అతి కష్టం కాతగినంతటి సమున్నతదృష్టాంతాన్ని సృష్టించాడు. సర్వాంతే లేదా షోలోఖోవ్ వలె 'రేణు'కు కూడా ఉన్నతశిఖరాలను అందుకొని, ఆ పైని దివినుంచి భువికి దిగి రావలసినపరిస్థితి

ఏర్పడవచ్చునని విమర్శకులకు సందేహం కలిగింది. అయితే అదృష్టవశాత్తు ఆ తరువాత రెండు సంవత్సరాలకు 'రేణు' రచించిన 'పరతీ-పరికథ' అనే మరొకనవల వెలువడడంతో ఈ అనుమానానికి ఆస్కారం లేదని రుజువు చేసింది.

'గోదాన్' 'మైలా ఆంచల్' - ఈ రెండూ సమష్టిమూలకమైన నవలలుగా పేర్కొం టూనే నళినీ విలోచనశర్మ ఒక చిత్రమైనతర్కాన్ని లేవదీశాడు. 'గోదాన్' ప్రధానపాత్ర 'సమగ్రభారతీయ జీవితం' కాగా 'మైలా ఆంచల్' ముఖ్యపాత్ర 'బీహారుకుచెందిన ఒక చిన్న మారుమూల ప్రదేశం' ఇక ఆయన రెండవతర్కం: 'గోదాన్' వాస్తుశిల్పం 'మహా కావ్యో చితమైనది' కాగా 'మైలా ఆంచల్' 'సుసంబంధ వాస్తుశిల్పంతో కూడుకున్న' నవల: 'మైలా ఆంచల్' విలువను తగ్గించేందుకే ఈ తర్కాలను లేవదీయడం జరిగిందని భావించ వలసివస్తున్నది. వాస్తవాలను ఆధారంచేసుకొని ఈ విమర్శలు చేసినట్టు కన్పించదు. ఒకవేళ ఆవిధంగా చేసినప్పటికీ విలువ కట్టవలసినపద్ధతి ఇది కాదు. 'గోదాన్'లో అయోధ్యకు చెందిన బెలారి, సేమరి అనే గ్రామాలకుచెందిన కథావస్తువును స్వీకరించడం జరిగింది. ఇందులోని ముఖ్యపాత్రలు: హోరి, జమీందారు అమరపాల్‌సింగ్। వీటితో కూడుకున్న ఈ నవలను 'సమగ్రభారతీయ జీవితానికి' ప్రాతినిధ్యం వహించేదిగా భావించడం జరిగితే - మిథిలకుచెందిన మేరీగంజ్ గ్రామానికిచెందిన కథ 'సమగ్రభారతీయ జీవితానికి' ప్రతీకగా ఎందుకు భావించకూడదు? పరిశోధకుడు డా॥ గణేశన్‌మాటల్లో చెప్పాలంటే - 'ఇందులో సామాజికజీవితాన్ని కళ్ళకుకట్టినట్టు చిత్రించడం జరిగింది' అని, 'రేణు రాసిన ఈ నవ లలు ('మైలా ఆంచల్' 'పరతీ పరికథ') నవలలు కాదు; ఇవి కొన్ని జీవితాలు।'....పైగా 'సమగ్రభారతీయ జీవితాన్ని' ప్రతిబింబింపచేయడానికి ఏదో ఒక 'చిన్న పల్లెవాసాన్ని' కథాక్షేత్రంగా స్వీకరించవలసివుంటుంది. అది కలకత్తా, బొంబాయివంటి పెద్ద నగరాల పేట లకు సంబంధించివుండవచ్చు; లేదా అయోధ్య, బీహారు, పంజాబు, కేరళకుచెందిన ఏదో ఒక కుగ్రామానికి చెందినదీ కావచ్చు।

నవలపేరు 'మైలా ఆంచల్'. 'రేణు' తన నవల తొలివలుకు ప్రారంభంలోనే — 'ఇదొక మలినాంచలం. ఇదొక మాండలిక నవల।' అని చెప్పనే చెప్పాడు. ఇందులోని 'మాండలిక నవల' అనేపదాన్ని తీసుకొని విమర్శకులు రకరకాల వ్యాఖ్యానాలు కురిపిం చారు. ఈతరం యువరచయితలకు తమ సంకీర్ణ, పరిమిత మధ్యతరగతి అనుభూతులకు, అసమర్థతలకు 'ఆధునికత' అనే లేబిల్ తగిలించుకునేందుకు ఒక మంచి అవకాశం లభిం చినట్లయింది. తన నవలను మాండలిక నవలని ప్రకటించడం 'రేణు' తన అల్పత్వాన్ని తానే నిర్వచించుకోవడం అయిందని యువతరం రచయితలంతా 'గ్రామకథలు' 'నగరకథలు' అనే కొత్తనినాదం ఒకటి లేవదీశారు. పట్టణనాగరికత రోజురోజుకూ పెరిగిపోతున్నదని ఆధు

నిక మానవజీవితం, ఆ జీవితంలోని వేర్పాటుతత్వం, ఏదో నిర్వచించడానికి వీల్లేని భయం, బెంగ, బెంబేలుతనం - వీటిని దర్పణప్రాయంగా చూపించాలంటే నగరకథవల్లనే వీలవు తుందని వాళ్ళ అభిప్రాయం. అంటే పట్టణ మధ్యవర్గప్రజల జీవితంలోని వివిధ అను భూతుల ఆవిష్కరణ, అక్కడి జీవితచిత్రణ ప్రతిబింబింప చేయడంవల్లనే ఇది సుసాధ్యం కాగలదని వాళ్ళ వాదన! పల్లెపట్టులజీవితాలు ఒక మారుమూలప్రదేశానికిమాత్రమే చెందిన పని, కూపస్థమండూకాలని, మార్పు అనేది లేకుండా, మారుతున్న కాలంతో ప్రమేయం లేకుండా వెనుకబడివున్నాయని - కనుక ఈనాటి చైతన్యానికి ఈ జీవితాలు ప్రాతినిధ్యం వహించవని వీళ్ళవాదన. ఈరకమైన తర్కంవెనుక ఇమిడివున్న భావం ఏమిటంటే - మాండలిక నవల వాస్తవంగాచూస్తే 'ఆధునికమైనది' ఏమాత్రం కానేరదని; లేదా దాని కథా వస్తువు 'ఆధునికజీవితాన్ని' ప్రతిబింబింపచేయడానికి అనువైనది కాదని. మాండలికం అన బడే గ్రామీణకథ నవలా సాహిత్యవికాసానికి ఎంతమాత్రం తోడ్పడదు సరికదా పైపెచ్చు ఒక అడుగు వెనక్కు నడిపిస్తుందట! వాస్తవంగాచూస్తే 'మైలా ఆంచల్' అన్న పేరు సుమిత్రానందన్ పంత్ రాసిన 'భారతమాతా!' అన్న కవితనుంచి 'రేణు' స్వీకరించడం జరి గింది. ఆ కవితలో భారతమాత 'గ్రామవాసిని'గా వర్ణించబడింది. 'పొలాల్లో శ్యామలమైన, ధూళితో వ్యాపించిన 'మలిన అంచలం!' అని అంటాడు పంత్, ఆ కవితలో. అయితే ఈ 'అంచలం' దేశంమొత్తానికి ప్రతీక, దేశంలోని ఏదో ఒక 'చిన్నభాగానికి' కాదు. ఒక చిన్నగ్రామాన్ని 'వెనుకబడినగ్రామాల ప్రతీకగా భావించుకొని ఈ పుస్తకానికి కథారంగాన్ని ఎన్నుకున్నాను.'—అని 'రేణు' పుస్తకం పీఠికలో స్వయంగా అన్నాడు. భారతదేశంలోని గ్రామాలన్నీ ఇప్పటికీ వెనుకబడేవున్నాయి. అసలు భారతదేశమే వెనకబడిన దేశం. అందు వల్ల 'గోదాన్'వలె 'మైలా ఆంచల్'కూడా 'సమగ్ర భారతీయ జీవితాన్ని' చిత్రిస్తుంది.

'మైలా ఆంచల్' 'పరితీ-పరికథ' నవలలలో ఉపయోగించిన భాషనుకూడా విమర్శ కులు నిశితంగా విమర్శించారు. 'మైలా అంచల్'లోని భాషవల్ల హిందీ సమృద్ధవంతమైనది. 'గ్రామీణభాష' మామూలు 'నియమబద్ధమైనభాషలో కలిసిమెలిసిపోయేట్టుగా 'రేణు' నేర్పుగా ఒక శైలిని సృష్టించాడు'— అని నళిన విలోచనశర్మ నిష్పాక్షిక విమర్శ! ఈ మాటల్లోని విమర్శ వైజ్ఞానికమైంది కాకపోవచ్చు! కాని 'రేణు'భాషను ఆయన ఆమోదించాడనడంలో సందేహం లేదు. 'రేణు' భాషలో మైథిలీశబ్దాలూ, ఆ శబ్దాలధ్వనిని యథాతథంగా రాయ డమూ కన్పిస్తాయి. కాని దీనివల్ల అర్థగ్రహణానికేమీ అటంకం కలగదు. ఈ టకమైనభాష లేకపోతే 'రేణు' చిత్రించిన చిత్రం స్పష్టంగా వుండదు. ఈశిల్పాన్ని అనువాదంలో చూపడం కష్టమే కావచ్చు; కాని అసంభవంమాత్రం కాదు. 'మైలా అంచల్' రసాస్వాదనం ఉపేంద్ర నాథ్ 'అశ్క్'కి కష్టంగా తోచింది. 'శైలి పూర్తిగా కొత్తది కావడమూ' తర్వాత 'స్థానిక' పదా లెక్కువగా వుపయోగించడమూ ఇందుకు కారణాలు. ఈ శబ్దాల్ని 'గ్రామీణ' శబ్దాలుగా

'అశ్క్' పేర్కొన్నాడు. 'నగరాలలోని శబ్దాలన్నీ గ్రామాల్లోకివెళ్ళి పాడైపోయిన శబ్దా' లన్నాడు. మిగతా నవలాకర్తలు, పరిశోధకులూ వీటిని 'స్థానిక' శబ్దాలుగా పేర్కొన్నారు. స్టీన్‌బెక్ నవల 'గ్రేప్స్ ఆఫ్ రాత్'లో గ్రామీణశబ్దాలు ఎక్కువగా వున్నాకూడా అది 'రసాస్వాదనానికి' ఆటంకం కలిగించిందని వీరెవరూ అనలేదు. అందువల్ల ఈ వాదం 'మైలా ఆంచల్' విలువనుగాని, మైథిలీభాష విలువనుగాని తగ్గించలేదు. 'జేల్' అనడానికి 'జెహల్' అని; 'నౌ జవాన్' అనడానికి 'లౌ జమాన్' అని; 'వాలెంటియరీ' అనడానికి 'బోలటియర్' అని; 'జ్యోతిషీ'కి 'జోతఖీ' అని; 'డిస్ట్రిక్ట్ బోర్డ్' కు 'డిస్టోబోట్' అని ఈవిధంగా 'రేణు' ఉపయోగించిన ఇంగ్లీషు, సంస్కృత ఫార్సీపదాలు గ్రామీణపదాలు కాదు: ఇతరభాషలనుంచి మైథిలీలో కలిసిపోయిన శబ్దాలివి. లాటిన్‌లో 'కార్పొరేయర్' గ్రీక్‌లో 'కృప్టోకోస్' అన్న మాటలు ఇంగ్లీషువారి కంఠాల్లో 'కార్పొరేట్'గానూ 'క్రిప్టిక్'గానూ మారినట్టే ఈ మాటలు కూడా మైథిలీవారి నోళ్ళల్లోబడి పూర్తి మైథిలీగా మారిపోయాయి. కాని ఈ భాషావివాదం వల్ల 'మైలా ఆంచల్' గొప్పతనానికేమీ భంగం వాటిల్లదు. రష్యన్‌లోకి అనువదించబడిన 'మైలా ఆంచల్' ప్రథమ ఏడువేలకాపీల ముద్రణ వారంరోజుల్లో చెల్లిపోవడమూ, పాఠకులూ, విమర్శకులూ అసంఖ్యాకంగా వేనోళ్ళ ఆ నవలను ప్రశంసించడమూ జరిగింది. స్వాతంత్ర్యానంతరం భారతీయజీవితాన్ని కళాత్మకంగాను, వాస్తవికంగానూ కొత్తమోస్తరుగా చిత్రించి, చరిత్రను సృష్టించిన మైలురాయి 'మైలా ఆంచల్'.

'మైలా ఆంచల్'నుగురించి మరికొద్దిమాటలేచెప్పి ముగిస్తాను. సహృదయులైన భారతీయ భాషాపాఠకులు స్వయంగా ఈ నవలను చదివి, ఇందులోవున్న కథనీ, సజీవమైన పాత్రల్నీ, ఆయాపాత్రల కష్టసుఖాలను, వాటివెనక దాగివున్న భారతీయులందరి వ్యథనీ, వీటినన్నిటినీ సూక్ష్మంగా చిత్రించే భాషలోనియాసనూ, సొగసునూ, కళాత్మకతను తమకు తామే పరిశీలిస్తారు. అందువల్ల ఇదంతా వర్ణించి నేను పాఠకులకూ - నవలకూ మధ్యన అడ్డుగా నిలబడదలుచుకోలేదు. కేవలం ఒకటి, రెండు విషయాలుమాత్రం సూచిస్తాను.

'గోదాన్' 1936 లో ప్రచురితమైంది. స్వాతంత్ర్యం రాకముందున్న భారతదేశం, పేదరైతులు, ధనికరైతులు, జమీందార్లు; వారి పరస్పరసంబంధాలు - వీటన్నిటి యథార్థ చిత్రణ 'గోదాన్' లో కన్పిస్తే, 1954 లో వెలువడిన 'మైలా ఆంచల్'లో స్వాతంత్ర్యానంతర భారతదేశచిత్రణ కన్పిస్తుంది. ఈ రెండుచిత్రాల్లోనూ తగినంతభేదం వున్నది. 'గోదాన్'లో స్థిరంగావున్న ఒక సమాజం కన్పిస్తుంది. వర్ణవ్యవస్థలాగే ఆ సమాజంలోని వర్గాలన్నీకూడా మొదటినుంచీ సుస్థిరంగా పాతుకుపోయివున్నాయి. వాటిస్థితిని అతిక్రమించడం సాధ్యంకాదు. 'మైలా ఆంచల్'లో రైతులే కాదు; నిమ్న, నీచ జాతులవారుగా పరిగణించబడేవారు, ఆదివాసులుకూడా తలెత్తి తిరగడానికి, ఉన్నతమార్గాన్ని అందుకోవడానికి

చేసే గట్టిప్రయత్నంతాలూకు అలజడి కన్పిస్తుంది. కాని పురాతనవ్యవస్థతాలూకు పునాదులు గట్టివి కావడంవల్ల, నిమ్నవర్గాలవారు తల పైకెత్తినప్పుడల్లా పై వర్గాల, ఉన్నతజాతుల కుట్రలు, కుతంత్రాలవల్ల, డబ్బు, పక్షపాతవైఖరిమూలంగా మళ్ళీ తలవంచవలసి వచ్చేది. స్వాతంత్ర్యానంతరం వోట్లు, తదితర రాజ్యాంగబద్ధమైన హక్కులు, ప్రజాస్వామ్యపు హక్కులు, అభివృద్ధిప్రణాళికలు, పారిశ్రామికీకరణం - ఇవన్నీ వచ్చినాకూడా ఈ పరిస్థితి మరింత తీవ్రమైంది- దాని ఫలితమేమిటంటే - స్వాతంత్ర్యం వచ్చాక భారతదేశంలోని బీద వాళ్ళు మరింత బీదవాళ్ళయ్యారు, ధనవంతులు మరింత ధనవంతులయ్యారు. ఈ సంక్లిష్ట పరిస్థితి, సామాన్యులజీవితంలోని వేదన, సంక్షోభం, వీటన్నిటి యథార్థచిత్రణ 'మైలా అంచల్' లో అద్దం పట్టినట్టు కన్పిస్తుంది. ఉరవడిగా పరవళ్ళుతొక్కుతూ ఒక నిశితమైన, సూక్ష్మమైనశైలిలో మనస్సుకు హత్తుకుపోయే పసందైనబాణీలో, ప్రతిపదమూ కళ్ళఎదుట బొమ్మలు కట్టించే కొత్త అభివ్యక్తీకరణతో ఈ చిత్రణ కన్పిస్తుంది. 'మైలా అంచల్'లోని చిన్నచిన్న పాత్రల్లోకూడా స్వాతంత్ర్యం తరువాతి ప్రపంచ పరిస్థితులపట్ల జాగరూకత కన్పిస్తుంది. జీవిత సమస్యలపట్ల ఉదాసీనభావం ఎక్కడా కన్పించదు. అయితే వాళ్ళప్రతిక్రియ పట్టణాలలోని మధ్యతరగతిప్రజలకు అర్థం లేనివిగా, పల్లెటూరి బైతులపనులుగా అగుపించవచ్చు. కాని వాళ్ళల్లో క్షుద్రతగాని, విశృంఖలత్వంగాని ఏమాత్రం కన్పించదు. వాళ్ళ వ్యంగ్య, వినోదాలు కూడా తేలికైనవి కాదు; చౌకబారువికూడా కాదు; జీవితయథార్థాలు, బ్రతుకుభారాలూ, ఆకలి ఆరాటాలు మొదలైన సమస్యలయొక్క ఏదో ఒకరూపం వాటిలో ప్రత్యక్షమవుతుంది. పాత్రలన్నీ సజీవమైనవే. ఆ పాత్రలను పరిశీలిస్తే - 'రేణు' నవల రాయలేదు; నలువైపులా దఊన్లకొద్దీ 'సినీరమా' కెమేరాలుంచి, ఒక్కసారి గ్రామంలోని అన్నిదృశ్యాలను చిత్రీకరించా డనిపిస్తుంది. పాత్రలన్నీ సజీవమైనవి కావడంవల్ల వాటిని మనం విస్మరించలేము కూడాను. పెరిగిపోతున్న అన్యాయాలు, మూఢాచారాలు, ప్రజాద్రోహులు - వీటికి వ్యతిరేకంగా వామన్‌దాస్, కాళీచరణ్ పాత్రలుచూపే సంఘర్షణ - స్వాతంత్ర్యానంతర రాజకీయాలకన్నిటికీ ప్రతీకగా కన్పిస్తుంది. 'మైల అంచల్' లో అద్భుతమైన శబ్దశిల్పంతో యావత్ భారతదేశపు గాథయొక్క యథార్థం పాఠకులమనసులలో సమయానుగుణంగా ఎప్పటికప్పుడు వివిధరూపాలలో ముద్రితమవుతూ ఉంటుంది. ఇదే 'మైలా అంచల్' యొక్క కాలాతీతశక్తికి అన్నిటికంటే మించిన తార్కాణం.

—శివదానసింహ చౌహాన్

# ఒకటి

ఊళ్ళో ఈ వార్త కరెంటులాగా వ్యాపించింది — మిలిటరీవాళ్లు చెవిటి చేథమాని అరెస్టుచేశారని, లోబిన్‌లాల్ మాతిదగ్గర్నుంచి బొక్కెన కాస్తా తీసు కెళ్ళాడని।

1942 ప్రజా ఉద్యమసందర్భంలోకూడా ఈ వూళ్ళో మిలిటరీవాళ్ళ ఘోర కృత్యాలేవీ జరగలేదు సరిగదా, ఆ ఉద్యమంతాలూకు ఊపుకూడా ఇందాకా రానే లేదు; అయితే జిల్లాలో ఎక్కడెక్కడ ఏమేమి జరిగాయో వదంతులరూపంలో ఇక్కడికి చేరకపోలేదు ...

సేషన్‌లో ఒక తెల్లసిపాయి ఒక పచారీ దుకాణవారుడి కూతుర్ని లేవనెత్తుక పోయాడు। దీనిమీద సిఖ్ఖులకు, తెల్ల సిపాయిలకు మధ్య కొట్లాట జరిగి తుపా కులు కాల్చుకునేవాకా పోయింది వ్యవహారం. మేశాలతో ఊరిని ముట్టడించి నిప్పం టించారు. ఒక్క పిల్లవాడుకూడా తప్పించుకొని బయటికి రాలేకపోయాడు. మున హరుమామ స్వయంగా తన కళ్ళతోటి చూశాడట - నిప్పులమీద వేయించిన చేపల్లాగా మనుషులశవాలు నెలలతరబడి అలాగే ఉండిపోయాయట। కాకులుకూడా దగ్గరకు చేరలేదట। మిలిటరీవాళ్లు కాపలా ఉన్నారు. మునహరుమామ అన్న కొడుకు, ఫారబిస్ దొరదగ్గర వంటవాడు; అతగాడు అబద్ధం చెబుతాడా? నాలుగు సంవత్సరాలు గడిచినతరువాత ఇప్పుడీ గ్రామానికి మళ్ళా ఏదో ముప్పు వచ్చిపడింది. హే కాళీమాతా। హే నరసింహస్వామీ। మీరే రక్షకులు।

అసలిదంతా ఆ గొల్లలపేట బలియాకారణంగా వచ్చిపడింది.

బిరంచీదాసు కొంచెం గుండె నిబ్బరం చేసుకున్నాడు. వాకిట్లోకివచ్చి నలు వైపులా పరికించిచూశాడు. వెంటనే ఖామందులవీధివైపు పరుగెత్తాడు. తాసిల్దారు విశ్వనాథప్రసాద్‌కూడా ఈవార్త విని గాభరాపడిపోయాడు. 'ఈ లోబిన్‌గాడికి బొక్కెన ఎక్కడిదోయ్? ఎక్కడో కొట్టేసి ఉంటాడు। ఈ నాయాళ్లంతా ఇట్లా దొంగతనాలు చేస్తూఉంటారు; దీంతో ఊరికి చెడ్డపేరు వస్తుంది।'

ఈ వార్త ఖామందులవీధినుంచి రాజపుత్రులపేటకు పాకింది - కాయస్థుల

పేట విశ్వనాధప్రసాద్ ను, దూదేకు సాయిబులవీధి బిరంచీని మిలిటరీవాళ్ళు పట్టు కెళ్ళారని! 'ఈ దెబ్బతో తాసిల్దారు ఆటకట్టినట్టే! జమీందారీతాలూకు శిస్తు వసూలు చేసి భోంచేసివుంటాడు. తిన్నగా శ్రీకృష్ణజన్మస్థానానికే తీసుకెడతారు!' అని ఠాకుర్ రామకృపాల్ సింగ్ అన్నారు.

యాదవులపేటకు ఈ వార్త పొక్కడంతోనే అక్కడివాళ్ళంతా బాలదేవ్ అనబడే బలియాను గట్టిగా పట్టుకున్నారు. జాగ్రత్త. పారిపోయేను! తాళ్ళతో గట్టిగా కట్టెయ్యండి. ఈ మహానుభావుడు ఏదో ఒకరోజున ఈ వూరికి ముప్పు తెచ్చిపెడతాడని ఎప్పుడో అనుకున్నాం.

తాసిల్దారు విశ్వనాథప్రసాద్ ఒకసేరు నెయ్యి, అయిదుశేర్లు బాసుమతీ బియ్యం, చిన్నమేక నొకదాన్ని వెంటబెట్టుకొని మిలిటరీవాళ్ళదగ్గరకు బయలు దేరాడు. వెంట బిరంచీని తీసుకెళ్లాడు. 'సరిగా లెక్కచూడు! యాభై రూపాయల సామానుంది. వారంరోజుల్లో ఈ దబ్బంతా మీ పేటనుంచి, ఆ లోబిన్ వాళ్ళ పేట నుంచి వసూలుచేసి నాకు పంపించు. మీకు చాతకావడంలేదుగాని, లేకపోతేనా....' అని అన్నాడు.

మిలిటరీవాళ్ళు తోటలోని బంగళాలో మకాం బెట్టారు. తోటదగ్గరకు చేరడం తోనే విశ్వనాథప్రసాద్ జేబులోనుంచి టోపీతీసి పెట్టుకున్నాడు. కాళికాదేవి గుడి వైపుతిరిగి నమస్కరిస్తూ - 'కాళీమాతా! నువ్వే మాకు రక్ష!' అన్నాడు.

తోటలో తాసీల్దారుకు రెండు ఎడ్లబళ్ళు కనిపించాయి. ఎడ్లు గడ్డి మేస్తు న్నాయి. మిలిటరీవాళ్లు నేలమీద కంబళి పరుచుకుని కూర్చున్నారు. ఆరే! మర మరాలు బొక్కుతున్నారు! వాళ్లతో చేథరూగాడుకూడా కంబళిమీద కూర్చొని మర మరాలు బొక్కుస్తున్నాడు?

'అయ్యా! నమస్కారాలండి!'

బిరంచీ సామాను కిందికిదించి - 'దొరలకు నమస్కారాలు!' అని నమ స్కరించాడు. మేకపిల్లకూడా 'మేమే' అన్నది.

'అరే! ఇవన్నీ ఏమిటండీ? మీ రెవరండీ?' ఒక లావాంటతను అడిగాడు.

'అయ్యా! నేను ఈ పారబంగాప్రాంతానికి తాసిల్దారునండి! మీనాహూరు సర్కిల్!'

'ఓహో! అలాగండి. మీరు తాసిల్దారుగారా! బావుంది. మేము డిస్ట్రిక్ట్ బోర్డు ఆఫీసునుంచి వచ్చాం. ఇక్కడొక మలేరియా సెంటరు ఏర్పాటు చేయవలసిం దని పైనుంచి ఆర్డరొచ్చింది. ఇక్కడే ఈ తోటలోనే మార్టిన్‌గారు ఈ స్థలాన్ని డిస్ట్రిక్టుబోర్డుకు ఎప్పుడో ఇచ్చేశారు!'

తాసిల్దారు మరొకసారి నమస్కారంచేసి కూర్చున్నాడు. విరంచీ అలాగే చేతులు కట్టుకుని నిలబడ్డాడు.

రాజపుత్రవీధి రామకృపాల్‌సింగ్ బంగళాతోటకు చేరుకునేటప్పటికి తోటలో వడమరపక్క భూమికొలతలు జరుగుతున్నాయి. కొందరు లింకుల గొలుసును అటూ ఇటూ లాగుతున్నారు. టోపీపెట్టుకున్న ఆఫీసరు తాసిల్దారుతో నవ్వుతూ కబుర్లు చెబుతున్నాడు.

ఇంతలో యాదవులపేట జనం బాలదేవ్ చేతులకు, నడుముకూ తాళ్లు బిగించి కేకలు పెట్టుకుంటూ అక్కడికొచ్చారు. అతగాడి నడుంకు కట్టినతాడును అందరూ పట్టుకుని మరీ వచ్చారు. పరారీలోవున్న 'స్వరాజ్యం' మనుషుల్ని పట్టు కుని అప్పగిస్తే ప్రభుత్వం బహుమానాలిస్తుంది - వెయ్యి, రెండువేలు, ఐదువేలు! అయితే అధికారి వాళ్ళను చూడ్డంతోనే చిర్రుబుర్రు లాడారు - 'ఏయ్! ఏమి టిదంతా? ఈయన్ను ఎందుకిలా కట్టేశారు? ఏంచేశాడు?'

'అయ్యగారూ! ఈయన స్వరాజ్యం మనిషి! పేరు బాలదేవ్‌గోప్! ఈ వూళ్లో ఈయన పిన్నమ్మ ఉంది. ఖద్దరు కడతాడు. జైహింద్ అంటాడు!'

'అయితే ఈయన్ను ఎందుకు బంధించారు?'

'ఎవరు? బాలదేవ్ నువ్వా?' అధికారి వెంటవున్న గుమాస్తా బాలదేవ్‌ను గుర్తించాడు.

'సార్! ఈయన బాలదేవ్ - రామకృష్ణ కాంగ్రెసు ఆశ్రమ కార్యకర్త! చాలా ధైర్యవంతుడు సార్!'

యాదవుల బంధనాలనుంచి విముక్తుడైన బాలదేవ్ అధికారికీ, ఆయన గుమాస్తాకూ విడివిడిగా 'జైహింద్' చెప్పాడు. 'మీ వూళ్ళో మలేరియాకేంద్రం పెట్టబోతున్నాం. పెద్ద డాక్టరుకూడా వస్తున్నాడు. భవనం డిస్ట్రిక్టుబోర్డు తరపున

తయారవుతుంది. పోతే తక్కినవసమలన్నీ మీ సహాయంతోనే పూర్తికావాలి!' అని నవ్వుతూ అన్నారు అధికారి.

తాసిల్దారు జమీందారీపత్రాలూ, పటాలూ అవి సరిజూచి - 'అయ్యా! భూమి ఎకరంమీద పది డిస్మిల్ వుందండి!' అని అన్నారు.

ఠాకుర్ రామకృపాల్‌సింగ్‌కు అధికారికి నమస్కారంచేసే అవకాశమే దొరకలేదు. గెలుపు విశ్వనాధ్ ప్రసాద్‌దే! మొదటిసారిగా జీవితంలో సింగ్ తన మూఢత్వానికి బెంబేలు పడిపోయాడు. నిజంగా విద్యమహత్తు చాలా గొప్పది. భగవంతుడు మంచి ఆకారాన్ని ప్రసాదించాడు; పెద్దకుటుంబంలో పుట్టాడు. ఈ కారణంగానే చాలామంది అధికార్లతోనూ, ఆఫీసర్లతోను, ఆఫీసుల్లో పనిచేసే గుమాస్తాలతోనూ పరిచయాలు, సంబంధాలు ఏర్పడ్డాయి. కొంచెం అదును చూసు కొని - నమస్కారంచేస్తూ బిగ్గరగా - ప్రభువుగారికి నమస్కారాలు! తమరు బీదలకు మేలుచేయాలనే సంకల్పంతో శ్రమపడి ఇంతదూరం వేంచేశారు. తమకు సేవ చేయడం మా విధి! తులసీదాసుగారు రామాయణంలో అన్నాడుగదండీ- 'ప్రభుదర్శనంతో మేము ధన్యులమైనాం' అని! అయ్యా! నన్ను రామకృపాల్ సింగ్ అంటారండి! తండ్రిపేరు గరీబ్ నెవాజ్‌సింగ్. రాజపుత్రజాతి; గఢ్‌బుం దేల్, రాజపుత్రస్థాన నివాసులం, ప్రస్తుతనివాసం మేరీగంజ్!' అని అన్నాడు.

'సింగ్‌గారూ, మీరు మాకేమీ సేవచేయ నవసరంలేదు! మీసేవ చేయ డానికి మలేరియా సెంటర్‌ను తెరుస్తున్నాం. మీరంతా దీనికి చేదోడువాదోడుగా ఉండాలి! ఇంతకుమించినసేవ మరొకటి లేదు. ఏమంటారు!' అని నవ్వుతూ అన్నాడు అధికారి.

యాదవులపేట జనమంతా ఒక్కొక్కరే నెమ్మదిగా జారుకున్నారు. బాల దేవ్‌ను బంధించి తెచ్చినందుకు అధికారి కేసు పెడతాడేమోనని భయపడిపోయారు.

'ఇంకో వారంరోజుల్లో డిస్ట్రిక్టుబోర్డు మేస్త్రీలు వస్తారు. మీరంతా వాసాలు, గడ్డి, తదితర అవసరమైన వస్తువులిచ్చి సహాయపడాలి. తాసిల్దారుగారు మీరున్నారు; ఇక బాలదేవ్‌ప్రసాద్ వున్నాడంటే ఆయ నెలాగూ దేశసేవకుడే! సింగ్‌గా రున్నారు! మీరంతా తలా ఒకచెయ్యి వెయ్యాలి' అని అధికారి వెళ్ళేప్పుడు అన్నాడు.

అందరూ చేతులు జోడించి, తలలువంచి సరే నన్నట్టు తమ అంగీకారాన్ని తెలియజేశారు. అధికారి తన బలగంతో తిరిగి వెళ్ళిపోయాడు. మేక అరుస్తూనే ఉన్నది. బాలదేవ్ వాళ్ళబండివెంట ఊరి బయటివాకా వెళ్ళారు.

బాలదేవ్ తిరిగొచ్చి - 'డిస్ట్రిక్టుబోర్డు అధికారి బెంగాలీ ఆయన। పేరు ప్రఫుల్ల బెనర్జీ. ఆయన గుమాస్తాపేరు జీ త్తన్‌బాబు। ఇదివరలో కాంగ్రెసు ఆఫీసులో గుమాస్తాగా పనిచేశాడు।' అని చెప్పాడు.

## రెండు

పూర్ణియాజిల్లాలో నీలికొరల పేర్లతో కూడుకున్నగ్రామాలు. ఈగ్రామాలు అనేకం ఇప్పటికీ వున్నాయి. కారడవుల్లో, విశాలమైనావాల్లో విరిగివున్న నీలి దొరల ప్రాసాదాల శిధిలావశేషాలు ఆ దారివెంట వెళ్ళే ప్రయాణీకులకు నీలియుగానికి సంబంధించిన పాతగాధల్ని గుర్తుకు తెస్తూఉంటాయి. ఇప్పటికీ।....మను గుడుపు అయ్యాక కొత్త పెళ్ళికూతుర్ని వెంటబెట్టుకుని ఇంటికి తిరిగివెళ్ళే యువకుడు బండివాడితో - 'కొంచెం బండి నెమ్మదిగా పోనియ్యవయ్యా। పెళ్ళికూతురు దొరగారి బంగళా చూస్తుంది....' ఆ(....ఇదే మైకే దొరగారిబంగళా।....అదుగో, అదే నీలిమందు తయారుచేసే తొట్టి।

కొత్త పెళ్ళికూతురు మేలిముసుగు కొద్దిగా తొలగించి అటువైపు తొంగి చూస్తుంది - దట్టంగా కలగాపులగంగా పెరిగిన రకరకాల చెట్లమధ్య రాళ్ళూరప్పల గుట్టలు। బంగళా ఏదీ।

పెళ్ళికొడుకు మొహం గర్వంతో నిండిపోతుంది. అంటే ఒకప్పుడు మా వూరికిదగ్గరగా దొరగారి బంగళా ఉండేదని, ఇక్కడే దొర, దొరసాని ఉండేవారని అర్థం।

గంగాస్నానంనుంచి తిరిగివచ్చే తీర్థయాత్రికుల బళ్ళుకూడా ఇక్కడ కొంచెంసేపు ఆగిపోతాయి. పిల్లలూ, యువతులు బళ్ళల్లోనుంచి దిగి భయపడుతూ

భయపడుతూ శిథిలాలదగ్గరకు వెడతారు. ముసలివాళ్ళు చెట్లూ చేమల్లో వనమూలి కలు వెదుక్కుంటారు....

అటువంటిగ్రామాల్లో మేరీగంజ్ ఒకటి. రౌతహట్ స్టేషన్నుంచి ఏడు కోసులు తూర్పుగా, కోశీనదిదాటి పోవలపివుంటుంది. బహు ప్రాచీనమైన కోశీనది ఒడ్డున చాలాదూరంవరకు తాళ, ఖర్జూర వృక్షాలతోకూడుకున్న తోపులున్నాయి. ఈ ప్రదేశాన్ని ఇక్కడివాళ్ళు 'నవాబీ తడబన్నా' అని పిలుస్తారు. ఏ నవాబు ఈ తాటితోపును నాటాడో చెప్పడం కష్టం. అయితే వైశాఖమాసంనుంచి ఆషాఢం దాకా చుట్టుపక్కల పశువులకాపర్లు, నాగలిదున్నే నౌకర్లు ఈ తోపులో నవాబుదర్గా వెలిగిస్తారు. మూడణాలిస్తే తాటికల్లు। కారాపంది। అంటే తాటికల్లునిషాలో కారు ఒక లెక్కకాదు। తడబన్నా దాటాక ఒక విశాలమైదానం వస్తుంది. ఇది నేపాలు లోయనుంచి ప్రారంభమై గంగానది ఒడ్డుదాకా వుంది. లక్షలాది ఎకరాల భూమి. వట్టి చవిటిపర్ర। ఇందులో గరిక దుబ్బుకూడా మొలవదు। మధ్యమధ్యన ఇసుక మేటలు, రేగుచెట్ల పొదలూ ఉన్నాయి. కోసుదూరం దాటాక తూర్పుదిక్కున వల్లటితోపు కనిపిస్తుంది - అదే మేరీగంజ్ బంగళా।

ఇప్పటికి ముప్పైఅయిదు సంవత్సరాలపూర్వం డబ్ల్యూ. జి. మార్టిన్ ఇక్కడికొచ్చి ఈ బంగళాకు పునాది వేయించినరోజున చుట్టుపక్కలగ్రామాలలో చాటింపు వేయించాడు - ఈ రోజునుంచి ఈ ఊరిపేరు మేరీగంజ్ అని। మార్టిన్ కొత్తగా పెళ్ళి చేసుకున్నావిడపేరు మేరీ. కలకత్తాలో ఉంటూఉండేది. ఒకసారి పొరపాటున ఈ ఊరి రైతునోటినుంచి పాతపేరు వినిపించేటప్పటికి - కోపమొచ్చి ఏభై కొరడాదెబ్బలు కొట్టాడట - లెక్కబెట్టి మరీను। ఈ రోజువరకూ ఈ వూరి పాతపేరు ఎవరికీ గుర్తులేదు; గుర్తు తెచ్చుకుంటేనే వళ్లు గరపొడుస్తుంది. ఊరిపేరు మార్చి, రౌతహట్ స్టేషన్నుంచి మేరీగంజ్దాకా డిస్ట్రిక్టుబోర్డుచేత రోడ్డువేయించి, ఊళ్లో పోస్టాఫీసు తెరిపించి - ఆపైని కొత్తగా పెళ్ళిచేసుకున్న మేరీ దొరసానిని తీసుకరావడానికి కలకత్తా వెళ్లాడు మార్టిన్దొర। ఊళ్ళోకల్లా వృద్ధురాలైన బైరో తల్లి ఈ రోజున బతికివుంటే - 'ఆహా ఏమని చెప్పను ఆ దొరసాని అందచందాల్ని గురించి? అప్సరస। ఇంద్రలోకంనుంచి ఊడిపడ్డ అప్సరస। అని చెప్పవుండేది।

మార్టిన్దొర తలపెట్టిన కార్యక్రమానికి అవాంతరం వచ్చిపడింది. మేరీ

గంజ్ వచ్చిన వారంరోజులకే మేరీకి మలేరియాజ్వరం వచ్చేటప్పటికి పోస్టాఫీసు కంటే ముందు అక్కడొక డిస్పెన్సరీని ఏర్పాటు చేయించడం అవసరమని మార్టిన్ భావించాడు. క్వినైన్ బిళ్ళలతో మూడోరోజుకుకూడా మేరీకి సుఖవు కల్పించక పోయేటప్పటికి మార్టిన్ గుర్రాన్ని రౌతీహట్ స్టేషన్‌కు దౌడు తీయించాడు. రౌతీ హట్ స్టేషన్ చేరుకునేటప్పటికి - పూర్ణియావెళ్ళే రైలు అంతకు పదినిమిషాల క్రితమే వెళ్ళిపోయిందని తెలిసింది. మార్టిన్ వెనుకా ముందు ఆలోచించకుండా గుర్రాన్ని పూర్ణియావైపుకు తిప్పాడు. రౌతీహట్‌నుంచి పూర్ణియా పన్నెండుకోసు లుంది. మేరీగంజ్‌లో ఎవరినడిగినా మార్టిన్‌దొర రెక్కలగుర్రాన్నిగురించి బోలెడు కథలు చెబుతారు....మార్టిన్ పూర్ణియాలో సివిల్‌సర్జన్ బంగళా చేరుకున్నాకకూడా రైలు పూర్ణియాస్టేషన్‌కు రానేలేదు।

అయితే మార్టిన్ రెక్కలగుర్రం, సివిల్ సర్జన్ గాలివాహనం రెండూ మేరీగంజ్ చేరుకునేలోపునే మేరీని మలేరియా తనపొట్టన పెట్టుకుం. ట్యూబ్ వెల్ దగ్గర గుంటలోని వంద్రుమట్టిని తన ఉంగరాల పట్టుదారాల్లాంటి అందమైన జుట్టును పట్టిస్తూ పట్టిస్తూ మేరీ కన్నుమూసింది.

మేరీశవాన్ని పూడ్చిపెట్టిన తరువాతనే మార్టిన్ పూర్ణియా బయలుదేరి వెళ్లాడు. సివిల్ సర్జన్, డిస్ట్రిక్టు మేజిస్ట్రేటు, డిస్ట్రిక్టుబోర్డు చైర్మన్, ఆరోగ్య అధికారిని కలుసుకున్నాడు. ఒక చిన్న డిస్పెన్సరీ మంజూరీకోసం తలప్రాణం తోకకొచ్చేలా తిరిగాడు. డిస్పెన్సరీకోసరం తనస్థలాన్ని రిజిష్టరు చేయించాడు. వచ్చేసంవత్సరానికి డిస్పెన్సరీ తప్పకుండా ఏర్పాటవుతుందని అధికార్లు ఆయనకు మాటిచ్చారు. సరీగా ఆదేసమయంలో జర్మనీ శాస్త్రవేత్తలు నీలియుగాన్ని సమాప్తం చేశారు.

బొగ్గుద్వారా నీలిమందు తయారుచేయవచ్చుననే వైజ్ఞానికపద్ధతి సఫలం కావడంతో నీలిదొరల విశాలప్రాసాదాంగోడలు ఒక్కసారిగా కూలి నేలమట్ట మయ్యాయి. వాళ్ళంతా ఉన్నపళంగా తమ బంగళాలు అమ్ముకొని జమీందారీలు కొనడం ప్రారంభించారు. మరికొందరు వ్యాపారంలోకి దిగారు. మార్టిన్ ప్రపంచం అంతకుముందే మట్టిపాలయింది. పైగా మనసుకూడా చెడిపోయింది. చంకలో కాగితాలకట్ట ఒకటి పెట్టుకుని పగలంతా పూర్ణియా కలెక్టర్ ఆఫీసుచుట్టూ తిరుగుతూ

ఉండేవాడు. కల్పించిన ప్రతివ్యక్తితోనూ - 'గవర్నమెంటు డిస్పెన్సరీకి ఆర్డరు వేశారు. వచ్చేఏటికి వచ్చేస్తుంది' అని చెబుతూ ఉండేవాడు. ఒకవర్యాయం పాట్నా, ఢిల్లీలచుట్టూ చెప్పులు అరిగిపోయేట్టు తిరిగి చివరకు విచారంగా మేరీగంజ్ తిరిగొచ్చి రోజంతా ఏడుస్తూ కూర్చున్నాడని చెబుతారు. 'డార్లింగ్! డాక్టర్ రాడట' అని అన్నాడట. ఆ ఏడుపులోనే! ఆ తరువాత ఆయన ఉన్మాదం మరీ ముదిరి పోయింది. అధికారులు ఆయన్ను కాంకే పంపించివేశారు. చివరకు కాంకే పిచ్చాసు పత్రిలోనే శాశ్వతంగా కన్నుమూశాడు.

బంగళాతోటలో ఇంగ్లీషు పూలదిబ్బమీద ఇప్పటికీ మేరీగోరీ ఉంది. రావి చెట్లు, తుమ్మచెట్లు, చిల్లికంపచెట్లూ మొలిచి అదంతా ఒక అడవిలాగా తయారైంది. పగటిపూటకూడా ఎవరూ అటువైపుకు వెళ్ళరు. అంటుమామిడితోట తాసిల్దారు తన అధీనంలోకి తీసుకున్నాడు. ఈ కారణంగా అది కాస్తంత తిరగటానికి వీలుగా ఉంది. అయితే బంగళా ఆవరణలో పగటే నక్కకూతలు వినిపిస్తాయి. ప్రజలు వాటిని దయ్యమని అంటూఉంటారు. దూదేకుసాయిబులవీధి నందలాల్ ఒకసారి ఇటికలకోసం అటు వెళ్ళాడు. ఇటుక తీశాడో లేదో-పై ప్రాణాలు పైనే పోయాయి. గుబురుగావున్న చెట్లమధ్యనుంచి దయ్యమొకటివచ్చి నందలాల్‌ను కొరడాతో కొట్టిందట! తాచుపాము కొరడాతో! దాంతో నందలాల్ అక్కడికక్కడే కుప్పగా కూలిపోయాడు. ఆ దయ్యం పాలలాంటి తెల్లటి ఆకారంలో వున్నదట.

*మేరీగంజ్ ఒక పెద్దగ్రామం. అన్నిజాతులవాళ్ళూ ఉన్నారు. ఊరికి తూర్పున కమలానది అనేపేరుగల నది వున్నది. వర్షాకాలంలో అది నిండుగా ప్రవహిస్తుంది. తక్కినకాలాలలో పెద్దపెద్ద గుంటల్లోమాత్రం నీళ్ళు కన్పిస్తాయి. అవి చేపలతో, తామరపూలతో నిండివుంటాయి. పుష్య పౌర్ణిమనాడు ఈ నీళ్ళల్లోనే స్నానం చేయడానికి జనసమూహం ఉదయంనుంచి సాయంత్రందాకా వస్తూనే ఉంటారు. రౌతిహట్ స్టేషన్‌నుంచి మిఠాయిదుకాణాలవాళ్ళూ, చిల్లరసామాన్లు అమ్ముకునేవాళ్ళు వచ్చి దుకాణాలు తెరుస్తారు. ఇక కమలానది మహాత్మ్యాన్ని గురించి రకరకాలకథలు చెబుతూ ఉంటారు....ఊళ్ళో ఎవరింట్లోనైనా పెళ్ళి - పేరంటం, సాంవత్సరీకాలు, విందు లేమైనాజరిగితే యజమాని స్నానంచేసి, తడి బట్ట మొలకు చుట్టుకొని ఆకూ వక్క చేతబుచ్చుకునివెళ్ళి ఆ కమలమ్మతల్లిని ఆహ్వా

విస్తారు. వెంటనే నీళ్లల్లో సుడులు తిరుగుతాయట; మధించినప్పుడు నీలిమందు తొట్టిలో నీలిమందు తిరిగినట్టు। ఆ తరువాత వెండిపళ్లాలు, గిన్నెలు, గ్లాసులు ఒడ్డు మీద కుప్పగావచ్చి చేరతాయి। యజమాని పాత్రలన్నిటిని లెక్కబెట్టి మరీ ఇంటికి తీసుకెళ్ళి విందు ముగిశాక తిరిగి తీసుకొచ్చి కమలమ్మతల్లికి అప్పగించేవాడు. అయితే అందరిస్వభావాలు ఒకరీతిగా వుండవుకదా। ఒకపర్యాయం ఒక యజమాని పళ్లాలూ, గిన్నెలు దొంగిలించాడు. అంతే ఆ రోజునుంచి కమలానది పాత్ర దానాన్ని ఆపివేసింది. ఆ యజమాని వంశమంతా నిర్మూలనమైంది. అయితే ఆ వక్రబుద్ధి యజమానినిగురించి జనం రెండు రకాలుగా చెప్పుకుంటారు. రాజపుత్ర వీధివాళ్ళు - అలాచేసిన వ్యక్తి కాయస్థుడంటారు; కాయస్థవీధివాళ్ళు అలాచేసింది రాజపుత్రవీధికి చెందినవాడంటారు.

రాజపుత్రులకు, కాయస్థులకుమధ్య తగాదాలు, మనోమాలిన్యాలు తరతరాలుగా వస్తున్నవి. ఇక బ్రాహ్మణు లున్నారంటే - వాళ్ళసంఖ్య చాలాతక్కువ; వాళ్ళను తృతీయశక్తిగా పేర్కొనవచ్చు. ఇటీవల కొంతకాలంనుంచి యాదవులుకూడా తమ బలాన్ని ప్రదర్శిస్తున్నారు. యజ్ఞోపవీతాన్ని ధరించడం ప్రారంభించాకకూడా రాజపుత్రులు యదువంశక్షత్రియులను గుర్తించలేదు. పైపెచ్చు యాదవుల క్షత్రియత్వాన్ని గేలిచేస్తూ రెచ్చగొడుతూ ఉంటారు. ఒకసారి యాదవులు బహిరంగంగా వవాలు చేశారు. రెండువైపుల వాళ్ళమాటలు కోటలు దాటాయి. యాదవులకు కాయస్థులవీధి నాయకుడు తాసిల్దార్ విశ్వనాథప్రసాద్ మల్లిక్ మాటిచ్చాడు - కోర్టు వ్యవహారమంతా నేను చూసిపెడతానని। జమీందారీవ్యవహారాలు చూసే కోర్టువకీలు వసంతబాబు యాదవులను ప్రభుత్వం రాజపుత్రులుగా గుర్తించిందనికూడా చెప్పాడు. కనుక ఈ వ్యవహారం కోర్టుదాకా వెళ్ళవలసిందే। వకీల్ అన్నాడు ఈ మాట.

'మతానికి నష్టం వాటిల్లేసమయం ఆసన్నమైనప్పుడల్లా రాజపుత్రులే దాన్ని రక్షించారు। కలియుగం వచ్చేసింది. రాజపుత్రులు తమ పరాక్రమాన్ని ప్రదర్శించి మతాన్ని సంరక్షించుకోవలసిన తరుణం ఆసన్నమైంది' అని బ్రాహ్మణవీధి పండితులు నెత్తిననోరుబెట్టుకుని చెప్పారు. చివరకు ఎలాగో విషయం సమసిపోయింది. ధర్మయుద్ధం కాస్తా ఆగిపోయింది. ఇప్పటికీ బ్రాహ్మణవీధి వయోవృద్ధపండితులు

అంటూ ఉంటారు - 'ఈనాడు ప్రతిఒక్క జాతివాళ్ళు యజ్ఞోపవీతం వేసుకుని తిరుగుతున్నారు అంటే - ఆనాడు రాజపుత్రులు నోరు కట్టేసుకోవడంవల్లనే! ....ఈ భూమిదున్నే క్షత్రియులనుగురించి ఎప్పుడైనా కన్నామా? విన్నామా? ...శివ! శివ!!'

ఇప్పుడు ఊళ్ళో ముఖ్యంగా మూడు తెగలవాళ్ళున్నారు - కాయస్థులు, రాజపుత్రులు, యాదవులు. బ్రాహ్మణులు ఇప్పటికీ మూడవశక్తిగానే పరిగణింపబడుతున్నారు. ఊళ్ళోవున్న ఇతరవర్ణాలవాళ్ళుకూడా ఈ శ్రేణిలోకే వస్తారు.

కాయస్థులపేటకు నాయకుడు విశ్వనాథప్రసాద్ మల్లిక్! పారబంగా సంస్థానానికి తాసిల్దారు. ఈ తాసిల్దారుపదవి గత మూడుతరాలనుంచి ఈ వంశానికే సంక్రమిస్తూవస్తున్నది. ఈ కారణంగానే ఈనాడు తాసిల్దారుకు వెయ్యిబీఘాల (ఒక బీఘా ఇంచుమించు ఒక ఎకరం లేక ఎకరానికి మూడోవంతు నేల) కొండ ఏర్పడింది. కాయస్థులపేటకు ఊళ్ళోని ఇతరవర్ణాలవాళ్ళు యజమానులపేట అనికూడా పిలుస్తూ ఉంటారు. రాజపుత్రులపేటవాళ్లు 'కైథ్‌టోలీ' అంటారు.

ఠాకుర్ రామకృపాల్‌సింగ్ రాజపుత్రులపేటకు నాయకుడు. ఈయన తాత చంపావతి మహారాణీ సంస్థానంలో సిపాయిగా పనిచేశాడు; విశ్వనాథప్రసాద్ తాత తాసిల్దారుగా వుండేవాడు. మహారాణి చంపావతికీ, పారబంగా సంస్థానానికి మధ్యన దివానుగిరీవిషయంలో దావా జరుగుతున్నప్పుడు విశ్వనాథప్రసాద్ తాత పారబంగా సంస్థానంతో కలిసిపోయాడని, వాళ్ళకు మహారాణికి సంబంధించిన అనేక రహస్యపత్రాలు దొరికిపోయాయని, చివరకు మహారాణి వ్యాజ్యంలో ఓడిపోయిందని అనుకుంటూ ఉంటారు. కాశీ వెళ్ళడానికిముందు మహారాణి రామకృపాల్‌సింగ్‌కు మిగిలిన మూడువందల బీఘా భూమిని రాసివేసింది. అయితే రామకృపాల్‌సింగ్ - వాళ్ళతాత ఒకసారెప్పుడో బందిపోటు దొంగలనుంచి మహారాణిని రక్షిస్తే ఇందుకు బహుమతిగా ఈ ఆస్తి రాసి ఇచ్చిందని అంటూఉంటాడు ...! కాయస్థపేటవాళ్ళు రాజపుత్రులపేటను 'సిపాయిలపేట' అని వెక్కిరింతగా పిలుస్తూఉంటారు.

పోతే, ఇక యాదవులున్నారంటే - వీళ్ళకు పెద్దచరిత్రఅంటూ ఏమీ లేదు. వీళ్లనాయకుడు ఖేలావన్‌యాదవ్ పది సంవత్సరాలక్రిందట గొడ్లకాపరిగా ఉండే

వారని అంటారు. పాలూ, పెరుగు అమ్ముకొని బాగా డబ్బు కూడబెట్టారు. ఈ విషయం నలుగురికీ తెలిసేప్పటికి ఖేలావన్‌కు ముచ్చెమటలు పోశాయి. నెలల తరబడి తాసిల్దారుచుట్టూ తిరిగాడు. సర్కిల్ మేనేజరుకు కొంత అర్పించుకున్నాడు. పోలీసులకు పాలూ పెరుగు పోశాడు. చివరకు ఎలాగో తంటాలుపడి కమలానది ఒడ్డున ఏభై బిఘాలభూమిని సంపాయించుకోగలిగాడు. ఇప్పుడది పెరిగి నూట ఏభై బిఘాలయింది. పెద్దకొడుకు సకలదీప్ బైరగాఛీలో తాత ముత్తవలదగ్గ రుంటూ - హైస్కూల్లో చదువుకున్నాడు. ఖేలావన్‌సింగ్ యాదవ్‌ను - 'కొత్త మోతుబరి' అని జనం పిలుస్తారు. అయితే యాదవ క్షత్రియులపేటను ఇప్పు డెవ రికీ 'గొల్లలపేట' అని పిలవడానికి ధైర్యం చాలదు. యాదవులపేటలో సంవ త్సరంపొడుగునా సాయంత్రంపూట కుస్తీకేంద్రందగ్గర సందడిగానే ఉంటుంది. సాయంత్రం నాలుగుకావడం ఆలస్యం మాదిగ శోభన్ని డప్పు వాయిస్తూ కూర్చుం టాడు. ధాక్ ధిన్! ధాక్ ధిన్! డప్పుమోత చెవిన పడడంతోనే యాదవులపేట పిల్లా పీచూ, ముసలీ ముతకా - వయస్సు కుర్రాళ్ళూ అంతా అక్కడకుచేరి కుస్తీ కిటుకులు నేర్చుకుంటూ ఉంటారు.

మేరీగంజ్ ఊరు మొత్తంమీద లెక్కవేస్తే చదువుకున్నవాళ్ళు పదిమంది వున్నారు. చదువుకున్నవాళ్ళంటే అర్థం - సంతకంచేయడం దగ్గర్నుంచి తాసీలు కట్టి రావడంవరకూ అని! అయితే కొత్తగా చదువుకుంటున్నవాళ్ళు పదిహేను మందిదాకా వున్నారు.

ఊళ్ళో ముఖ్యంగా పండేపంటలు - వడ్లు, జనుము, బటాణీ, దాళ్ళ పంటలుకూడా అప్పుడప్పుడు బాగానే పండుతాయి.

## మూడు

డిస్ట్రిక్టుబోర్డు తాలూకు మేస్త్రీలు వచ్చారు. బాలదేవ్ ఉత్సాహానికి అంతు లేదు. అధికారి తాసిల్దారు రామకృపాల్‌సింగ్ ఎదుటే తనను దేశసేవకుడని పొగి డాడు. తక్కినవాళ్లుకూడా చాలామంది విన్నారు. ప్రపంచంలో డబ్బుండగానే సరి కాదు; తాసిల్దారుదగ్గర, సింగ్‌గారిదగ్గర బోలెడు డబ్బుంది. గౌరవమేదీ? బాలదేవ్

కున్న గౌరవం వాళ్ళకున్నదా? యాదవులపేటవాళ్ళంతా ఆరోజానే బాలదేవ్‌ను క్షమించమని కోరుకున్నారు - 'బాబూ బాలదేవ్! మేము అజ్ఞానులం. నువ్వు అన్నీ బాగా తెలిసినవాడివి. మేము అంధకారకూపంలోపడి కొట్టుమిట్టులాడేవాళ్ళం. నువ్వున్నావంటే ఎన్నోదేశాలు చూసివచ్చావు. పెద్దపెద్దవాళ్ళతో పరిచయాలున్నాయి. మా తప్పు మన్నించు!' అని.

ఆ రోజానుంచే ఖేలావన్‌సింగ్ యాదవ్ బాలదేవ్‌ను వాళ్ళింటిదగ్గరుండమని ఎంతగానో బతిమలాడుకున్నాడు - 'మనజాతి పేరు ప్రఖ్యాతులన్నీ మీలాంటివాళ్ళ చేతుల్లోనే వున్నాయి. నువ్వు మాకు పరాయివాడివేమీ కాదు; మీ పినతల్లి నాకు వ్వయాన మా బాబాయి భార్య. ఇప్పుడు మనమిద్దరం అన్నదమ్ములం!' అని.

ఖేలావన్‌భార్య పనిగట్టుకుని బాలదేవ్ ముసలి పినతల్లిదగ్గరికొచ్చి మా ఇల్లు మీ ఇల్లే అనుకోమని, మా ఇంట్లో పెద్ద దిక్కెవరు లేరుగనుక నువ్వొచ్చి మా ఇంట్లోనే ఉండిపోవలసిందని, లంకంత ఇంట్లో తనొక్కతే ఉంటున్నానని, పాల పనికి ఇంటిపనికీ కురుసటంలేదని ఏమేమో చెప్పివెళ్ళిందట!

బాలదేవ్ పినతల్లి పరిస్థితి చూస్తూచూస్తూఉండగానే ఒక్కసారిగా మారి పోయింది. నిన్నటిదాకా ఇంటింటికీతిరిగి దంపుడుపని చేస్తూఉండేది; ఈ రోజున ఒక గ్రామపెద్ద భార్యవచ్చి తన ఇంటికివచ్చి ఉండవలసిందని ఆహ్వానించి మరీ వెళ్ళింది.

మలేరియా సెంటర్ కట్టడానికి మేస్త్రీలు వచ్చారు. బాలదేవ్ ఊళ్లోని ప్రతి ఇంటికీ తిరిగి - 'డిస్ట్రిక్టుబోర్డు మేస్త్రీగారు వచ్చారు. రేపటినుంచి పని ప్రారంభం కావాలి. మలేరియాజ్వరం అనేది దోమకాటువల్ల వస్తుంది. అయితే క్వినైన్ బిళ్ళలు సేవిస్తేమటుకు ఎన్నిదోమలు ఎంతకుట్టినా పర్వాలేదు!' దేవాంగులవీధి మహంగూదాసు పెంటపోగు దిబ్బదగ్గర బాలదేవ్ చెబుతున్నమాటల్ని నోరు తెరచు కుని ఆశ్చర్యంగా వింటున్నారు. ఆడవాళ్ళుసైతం మొహంమీదికి పమిటిచెంగు లాక్కొని తడికలదగ్గిరనిలబడి మరీ వింటున్నారు. 'ఇక రాత్రిళ్లు పిడకలు కాల్చి పొగ వేసుకోవలసిన అవసరంలేదు. దోమలు ఎంతకుట్టినా ఫరవాలేదు!'

ఊళ్ళోవున్న వివిధజాతులవాళ్ళు - అందులోనూ విమ్నజాతులవాళ్ళు అంతా

ఒక్కమాటగా చెప్పారు. '....వారంరోజులదాకా మరోపని ముట్టుకునేదే లేదు. యజమానులతో కాస్త మరీ చెప్పండి - పొలంపనులన్నీ ఆపుచేస్తాం. మీపని మా కొకలెక్కా? ఒక ఆస్పత్రి, డాక్టర్‌కోసం ఇల్లు, వంటిల్లూ, అదనంగా మరో ఇల్లూ। అంతేగా? వారంరోజుల్లో పూర్తయిపోతాయి.'

ధనుష్మంతులవీథి తనుక్‌లాల్ ఒక ఎదురుప్రశ్న వేశాడు - 'వ్యవసాయం పనులు మానేస్తే యజమానులు మన కివ్వాలిసిన కూలిడబ్బులు మినహాయించు కుంటారేమో। ఒకరోజూ, అరరోజయితే ఫరవాలేదుగాని, వారంరోజులుపాటు కూలీనాలీ లేకుండా ఉండాలంటే కొంచెం కష్టమేమరి। యంత్రాలుకద్దే వీధివాళ్లకూ, పందులు కాచుకునే యానాదివాళ్ళకూ ఏ దిగులూలేదు। వాళ్ళ ఆడవాళ్ళు ఉదయ మెళ్ళి సాయంత్రందాకా కమలానదిలో ఒకటి రెండుసేర్లు వట్టగుసిపెలు పట్టినా వాళ్ళపని వెళ్ళబారిపోతుంది. నాలుగుసేర్ల గోధుమలతో సరిపోతుంది. లేదా యజ మానుల పాముల దొడ్లదగ్గర ఎలుకకన్నాలు తవ్వుకొని, బంగళాదగ్గర తోపులో దేశవాళీ 'బంగళాదుంపలు' పోగుచేసుకుని అమ్ముకుంటే - పబ్బం గడిచిపోతుంది. రౌతహట్ సంతలో కటిహార్‌మిల్లు కూలీలు సేరు నాలుగణాలవంతున దేశవాళీ బంగాళాదుంపలు ఆదేపనిగా కొనేస్తారు. ఇతరులవిషయం అలా కాదే మరి!'

'అయితే ఇప్పుడేమిటి చేయడం?' బాలదేవ్ నిరాశపడిపోయి ప్రశ్నిం చాడు.

తనుక్‌లాల్ సమాధానం ముందే ఆలోచించివుంచాడు. 'ఒక ఉపాయం ఉంది సార్! యజమానులు కనీసం అరరోజు కూలిఅయినా ఇవ్వడానికి ఒప్పు కుంటే మాకు కొంచెం సహాయంగా ఉంటుంది!'

తనుక్‌లాల్ అన్నమాటల్ని మననం చేసుకుంటూ బాలదేవ్ యజమానుల పేటవైపు బయలుదేరివెళ్ళాడు. విశ్వనాథ్‌ప్రసాద్ ఒప్పుకుంటాడు; సింగ్ విషయమే కొంచెం అనుమానం. సిపాయిలపేట బిరజూసింగ్ - 'సింగ్‌గారు ఆస్పత్రి విషయంలో అంతగా సహాయం చేయకపోవచ్చు. ఆస్పత్రి అజమాయిషీ అంతా ఆ విశ్వనాథ్‌దీ, ఆ బాలదేవ్‌దీ అని అంటున్నాడు!' అని అన్నాడు.

బ్రాహ్మణులపేటనుంచి ఏమైనా ఆశించడంకూడా అనవసరమే। ఆస్పత్రి

తెరవబోతున్నారనేవిషయం వాళ్ళకు తెలిసినప్పటినుంచి రకరకాలైన కథలు ప్రచారం చేస్తున్నారు. డాక్టర్లకు, ఇంగ్లీషుమందులకు వ్యతిరేకంగా! సిద్ధాంతిగారు అసలీ డాక్టర్లే వ్యాధుల్ని వ్యాపింపజేస్తారని, ఇంజెక్షన్‌ద్వారా విషాన్ని ఇస్తారని, మనిషిని శాశ్వతంగా బలహీనతపరుస్తారని సిద్ధాంతీకరిస్తున్నారు. కలరాసమయంలో నూతుల్లో మందుజల్లి కలరాను వ్యాపింపజేసి, గ్రామాలకు గ్రామాలు నాశనం చేస్తున్నారని ఆయనంటాడు. 'అసలు మలేరియాజ్వరం అనేది మనం ఎరుగుదుమా? ఇంగ్లీషువాళ్ళదగ్గర్నుంచి మలేరియా వచ్చినవాళ్ళరక్తాన్ని సీసాల్లో బిగించి మరీ తెచ్చారు వీళ్ళే! ఈనాడు ఎక్కడచూసినా మలేరియా జ్వరాలే!....పైగా విదేశౌషధాల్లో ఆవు రక్తంకూడా కలిపిఉంటుంది....'

భగత్ దుకాణందగ్గరే విశ్వనాథ్‌బాబు కనిపించాడు. తనుక్‌లాల్ అన్న విషయాన్ని ఆయనకు విన్నవించేప్పటికి మండిపడ్డాడు. 'ఆ విల్లంబులపేట తనుక్‌లాల్ కదూ? తానేదో పెద్ద తెలివిగలవాణ్ణనుకొంటాడు. ప్రతివానికీ అడ్డుపుల్ల వేసేరకం. బాలదేవ్! నువ్వు చాలా అమాయకుడవయ్యా! నువ్వడగలేకపోయావా, ఈ అన్నసత్రం కట్టేది కేవలం యజమానులకోసం కాదని!'

భగత్ నిత్యం తమలపాకులు నములుతూఉంటాడు. అతగాడు మాట్లాడుతూంటే మాటల్నికూడా నమిలేస్తున్నట్టే అనిపిస్తుంది - ఇది పదిమందికీ ఉపయోగపడుతుంది. అందుకని అందరూ దీనికి సహాయపడాలి. ఏమంటావు ప్రసాదూ?'

భగత్ కిళ్ళీకొట్టుదగ్గర ఎప్పుడూ అయిదారుగురు మనుషులు కూర్చునే ఉంటారు. విశ్వనాథ్‌బాబు మాటవిని మరో నలుగురైదుగురు మనుషులు అక్కడకువచ్చి చేరారు. ముసలి సుమిరతదాసు వట్టి తలలుమార్చే రకం. అయితే అప్పుడప్పుడు ఇట్టే అతికిపోయేమాటలు మాట్లాడేస్తాడు. అతగాడు అక్కడకు రావడంతోనే - 'ఏమండోయ్ తాసిల్దారుగారూ! తనుక్‌లాల్ అలా అన్నాడంటే అది వాడి బుద్ధికాదు. దీనికంతా కనెక్షన్ (సంబంధం) ఉన్నదండీ, కనెక్షన్! కొంచెం ఇవతలికి రండి చెబుతాను!' తాసిల్దారు సుమంతదాసు భగత్ దుకాణానికి కొంచెం ఎడంగావెళ్ళి మాట్లాడుకోవడం ప్రారంభించారు. కిళ్ళీబడ్డీదగ్గర కూర్చున్నవాళ్ళల్లో ఒకరికి ఇదిచూసి ఉక్రోషంవచ్చి - 'ఈ ముసలిపీనుగ వట్టి లుచ్చాకోరు! మాట

మాట్లాడితే రహస్యమని చెవులు కొరుకుతాడు!' అని అన్నారు. భగత్ కను సైగతో వారించాడు - 'బిగ్గరగా మాట్లాడకు. బాలదేవ్ వున్నాడు!'

సుమంతదాసు అవతలికి తీసుకెళ్లి ఏదో చెప్పేప్పటికి తాపిల్దారు కాస్తా చల్లబడ్డాడు. వచ్చి - 'ఏమయ్యా బాలదేవ్! నువ్వెళ్ళి ఆ మంత్రాలపీఠివాళ్ళతోను, ఆ దర్పానులపీఠివాళ్ళతోను ఏభై రూపాయలు చెల్లిబడి మినహాయింపుచేశావని చెప్పు! ఆ రోజున ఆ అధికారికి నీ ముందేగా ముడుపు చెల్లించాను. బిరంచీకూడా ఉన్నాడు....కొంచెం ఆ సిపాయిలపేటకుకూడా వెళ్ళి చెప్పిరాదు. వాళ్ళేమంటారో! ఎవరేమన్నా, మనధర్మం మనం నిర్వర్తించాలిగదా!' అని అన్నాడు.

బాలదేవ్‌సింగ్ గారింటికి చేరుకునేప్పటికి ఆయన గుర్రంమీదెక్కి కూర్చున్నాడు. బహుశా కటిహార్ వెళ్ళడానికి సన్నద్ధమైనట్టుంది. ప్రయాణానికిముందు ఏమీ అడగకూడదని బాలదేవ్ నోరు మెదపలేదు. కదపలేదు. సింగ్‌గారింటిముందు నలుగురైదుగురు కూర్చొనివున్నారు. ఎవరూ బాలదేవ్‌ను కూర్చోమనికూడా అనలేదు. అయితే బాలదేవ్ అందరివైపూ తిరిగి 'జైహింద్' చెప్పాడు. శివశంకర్‌సింగ్ కుమారుడు హరగౌరీ బాలదేవ్‌వైపు తిరిగి - 'ఏమండీ! నాయకులు బాలదేవ్‌గారూ! ఏమిటి సంగతులు?' అని అడిగాడు.

'మీ దయవల్ల అన్నీ బాగానేవున్నాయి. ఏమండీ బాబుగారూ! స్కూలునుంచి మీ రెప్పుడొచ్చారు?' బాలదేవ్ ఖాళీగావున్న ఎత్తుపీటమీదకూర్చుంటూ అడిగాడు.

'మీ నాయకత్వం మూడు పువ్వులు ఆరు కాయలుగా వున్నదని విన్నాను!'

'బాబూ! ఏదో బీదవాణ్ణి! నాకు నాయకత్వమేమిటి? నేను మీ అందరికీ సేవకుడులాంటివాణ్ణి!'

'మీ రిక్కడ నాయకులు అయిపోయారు; మరి అక్కడ కాంగ్రెసుఆఫీసులో కాఫీగ్లాసులవీ ఎవరు కడుగుతున్నట్టు?' హరగౌరీకి ఉన్నట్టుండి కోపమొచ్చింది - 'అందరూ కాశీకి బయలుదేరితే ఆకులు నాకేదెవరంట? జైలుశిక్ష అనుభవించిన ప్రతివాడూ పండిత జవహర్‌లాల్ అయిపోయినట్టు భావిస్తే ఎలాగు? కాంగ్రెసు ఆఫీసులో ఎంగిలిమెతుకులు గతికేవాడివి. ఇక్కడికొచ్చి నాయకుడివైనావు - ఏమీ

లేనిచోట ఆముదపుచెట్టు మహావృక్షమైనట్టూ। ఒళ్ళు బలిసిన గంగానమ్మ పేడ కుడుము అడిగిందట।'

'బాబూ। మీరు కొంచెం మితిమీరి మాట్లాడుతున్నారు। మీరు చదువుకున్న వారు; నేను బికారివాణ్ణి। నావల్ల తప్పేమైనాఉంటే చెప్పండి; అంతేగాని అంతలేని మాటలనకండి।'

'ఇక్కడినుంచి ముందు నువ్వు బయటికి నడుస్తావా లేదా? సిగ్గులేనివాడా। డిస్ట్రిక్టుబోర్డునుంచి ఆస్పత్రి అనుమతి వచ్చింది; దాంతో నాలుగుడబ్బులు కంటికి కనిపించాయి; కన్నూ మిన్నూ కానకుండా ఆ డబ్బు కాస్తా మింగేసి మనుషులచేత ఊడిగం చేయించడానికి ఆ ఇంటిచుట్టూ ఈ ఇంటిచుట్టూ తిరుగుతున్నావు। నీ దొంగ బతుకు ఎవరికి తెలియదనుకున్నావు? నడువు. ముందు బయటికి।'

హరగౌరికి ఎక్కడలేని ఆవేశం ముంచుకొచ్చింది. బాలదేవ్‌ను బయటికి గెంటడానికి లేవబోయాడు. అక్కడ కూర్చున్నవాళ్ళంతా అతన్ని గట్టిగా పట్టుకొని ఆపేశారు. బాలదేవ్‌మాత్రం అలాగే కదలా మెదలకుండా కూర్చున్నాడు. 'కొట్టండి। కొడితే మీకోపం చలారిపోతుందనుకుంటే - కొట్టండి।'

ఈ గొడవకు జనం పోగయ్యారు. హరగౌరీ అలా తొందరపడడం ఎవరికీ ఇష్టంలేదు. శివశంకర్‌సింగ్‌కూడా బాధపడ్డాడు. ఈ విషయం తెలుసుకొని, 'నాయకుడో, వినాయకుడో అయ్యాడే అనుకో। నీదేంబోయింది? నీకెందుకంత కుళ్ళు మోతుతనం? నువ్వేమైనా పెట్టి పోషిస్తున్నావా? బాబూ బాలదేవ్। ఏమో అనుకో వద్దు। చిన్నవాడు।'

'శివశంకర్ బాబాయ్। ఈయన నన్ను అనరాని మాటలని నన్ను కొట్ట డానికి మీదికొచ్చాడు. నేనేమైనా మాట మిగిలానేమో ఇక్కడ కూర్చున్నవాళ్ళను అడిగి తెలుసుకోండి. మహాత్మాగాంధీగా రన్నారు....'

వేపచెట్టుమీద కాకి అరిచింది.

హరగౌరీ కోపంతో కంపించిపోతున్నాడు...వీళ్ళంతా ఎంత విచిత్రమైన మనుషులు। గంటక్రితం బాలదేవ్‌ను అదేపనిగా విమర్శించారు. నాయకుణ్ణని చెట్టు పేరు చెప్పుకుని కాయలమ్ముకుంటున్నాడని తెగనాడిన మనుషులే మెత్తబడి

పోయారు. చివరకు తన తండ్రికూడా బాలదేవ్‌ముందు దాసోహమంటున్నాడు. ఈ గొల్లవాడు నాయకుడా...

'గొల్లలపేటవాళ్ళంతా గుంపుగా వచ్చేస్తున్నారు' ఒక కుర్రవాడు పరుగెత్తు కుంటూవచ్చి చెప్పివెళ్ళాడు. ఊరికి ఉత్తరాన కోలాహలంగావుంది. మేకులకు కట్టేసివున్న ఎడ్లు చెవులు నిక్కబొడుచుకొని నిలబడిపోయాయి. ఊరిబయట మేస్తున్న మేకలు అరుచుకుంటూ ఊళ్ళోకి పరుగెత్తుకొస్తున్నాయి. కుక్కలు మొరుగుతున్నాయి....అసలు విషయమేమిటో?

'ఒరేయ్ బాబూ! నాయనా గౌరీ! లోపలికి రారా, ఆ గొల్లలపేట కలియా పరుగెత్తికొస్తున్నాడట! అని హరగౌరితల్లి నెత్తీ నోరు కొట్టుకుంటూవచ్చి హర గౌరిని లోపలికి లాక్కెళ్ళింది. పిల్లలు ఏడుపు లంకించుకున్నారు.

'అసలు ఏం జరిగింది?'

'బల్లెం బయటికి తీయండిరా, బల్లెం!'

'నా బాణాకర్ర ఎక్కడుంది?'

'నా బాణం!'

'అసలు విషయమేమిటి?' ఆ గొల్లలదండు ఎందుకొస్తున్నట్టు? ...'

సమాధానం ఎవరు చెబుతారు? ఎవరికైనా తీరికవుంటేనా? అంతా హడా విడిగా వున్నారు. ఊరంతా ఒక్కసారిగా అట్టుడికినట్టు ఉడికిపోతున్నది. హరగౌరి తల్లి శివశంకర్‌సింగ్‌ను లోపలికి పిలుస్తున్నది. కేకలు పెడుతున్నది - గొల్లలపేట పెద్ద రౌడీ వచ్చాడు....గొల్లలపేట పెద్దా చిన్నా అంతా కోపోద్రేకాలతో వున్నారు. హరగౌరి బాలదేవ్‌ను చెప్పుతీసుకుని కొట్టాడట! తంతురూకొడుకు తలచరన హర గౌరి రక్తం కళ్ళజూస్తానని ప్రతిజ్ఞ పట్టాడట!....ఇదుగో మీరుకూడా లోపలికి వచ్చెయ్యండి!'

'ఓహో! అలాగా!' బాలదేవ్ పరుగెత్తుతూ అన్నాడు - 'మీరేమీ గాభరా పడకండి. వాళ్ళకేమీ తెలీదు. నే వెళ్ళి సమాధానపరుస్తాను.'

'ఏదీ, మీరంతా ఒక్కసారి ప్రేమతో అనండి - మహావీర్‌జీకి జై!'

జై! జై!! జై!!!

బాలదేవ్‌ను చూడడంతోటే యాదవసైన్యం సంతోషంతో జయజయ ధ్వానాలు చేసింది. ఏదీ మరొకసారి ప్రేమతో, గాంధీమహాత్మాకి జై! జై!! జై!!! చాలు, చాలు, శాంతి! శాంతి!! అంతా శాంతంగా వుండండి. బాలదేవ్‌గారు ఏదో మాట్లాడబోతున్నారు వినండి. వినండి....!

'సోదరులారా! ఇప్పుడు మీరు ప్రారంభించిన 'ఉద్యమం' ఏమీ బాగాలేదు. ఎవరో ఏదో అన్నారని విని తొందరపడితే ఎలాగు? కాని దానికి కలతలు మెండు అన్నారు. ఒక్కనిమిషం మీరే ఆలోచించండి! మీరు చేసినపని సబావయిందే నంటారా? మీరు హింసకు పూనుకోబోయారు. మీరుచేసిన ఈ పనికిగాను నేను ఉపవాసం ఉండవలసివస్తుంది. భారతమాత, మహాత్మాగాంధీజీ ఇటువంటిపనులకు ఎంతమాత్రం సమ్మతించరు.'

బాలదేవ్‌గారు నిజంగా మహాజ్ఞాని. ఉద్యమం. ఉపవాసం....ఇంకేమిటి? హింస ... ఈ మాటలు ఎవరికైనా అర్థమయ్యాయా? జ్ఞానులబోధలు అర్థం చేసు కోవడం అంత సులువైనపనా?....

'ఉపవాసం చేస్తాడా?'

'అంతా అబద్ధం!'

బాలదేవ్ ఉపవాసం చేస్తాడని కలియా అంటున్నాడు. కలియాను బాలదేవ్ స్వయంగా పిలిచి - 'కాలీచరణ్! నువ్వు చాలా బుద్ధిమంతుడవోయ్. అయితే ఉద్రేకం పనికిరాదు. ఉద్రేకం పడేముందు కొంచెం ఆలోచించుకోవాలి. అయినా నాకు చాలా సంతోషంగావుంది. ఉపవాసం చేసితీరాల్సిందే!' అని అన్నాడట?

'నిజంగా ఆ రోజు నేగనుక బాలదేవ్ సమయానికి రాకపోయినట్టయితే కాలీ చరణ్‌పని అటో ఇటో తేలిపోయేది....ఈ హరగౌరి ఏదో నాలుగుక్లాసులు చదివే టప్పటికి కలెక్టర్నైపోయాననుకుంటున్నాడు!'

'ఆఁ, ఏం చదువులేవోయ్! గడ్డం మీసాలుమాత్రం దట్టంగా వచ్చాయి. మా సకలదీప్‌గాడికంటె రెండుక్లాసులు తక్కువేనట! ప్రతిక్లాసులోనూ తప్పటమే!

ఈ సంవత్సరంకూడా తప్పారట. అతగాడితండ్రి మాష్టరుకు లంచంఇచ్చి ప్యాసు చేయించుకోవాలని చూశాడట। ఆ మాష్టరు వాణ్ణిగుతిట్టి మరీ వెనక్కు పంపించా డట।'

'వాడికేం చదువొస్తుంది? లాల్‌బాగ్ తిరునాళ్ళలో లల్లాయిపాటలు పాడా డని విన్నాను.'

'లల్లాయిపాటలా?'

కబుర్లు అతికినట్టు చెప్పడంలో దులరియాకు సాటి మరొకరు లేరు। ....'

ఆఁ, లల్లాయిపాటలు। హ్హాహ్హా....హ్హాహ్హా....హ్హా....హీ....హీ.... లల్లాయి పాటలు।'

థక్ ధిన్నా, థక్ ధిన్నా।

'అదుగో। కుస్తీకేంద్రంలో డప్పు మోగుతోంది. వెడదాం పద।'

## నాలుగు

ఓం సద్గురు। ఓం సద్గురు ।।

మహంతుగారు నిత్యం బ్రహ్మముహూర్తాన విద్రనుంచి లేస్తారు. 'ఏమ య్యోయ్ రామదాసూ। లే లే। లక్ష్మీనికూడా లేపు....ఓం సద్గురు। నీకెప్పుడూ లేపకుండా లేవరుగదా। రామదాసూ। ఓ రామదాసూ।'

రామదాసు కళ్ళు నులుపుకుంటూ లేస్తాడు. బయటికొచ్చి ఆకాశంమీద గుర కొయ్యలున్నాయేమో చూస్తాడు....ఉహూఁ. ఇంకా చాలా పొద్దుంది. మహంతుగారు ఈ రోజు కొంచెం ముందుగా లేవారు. మాఘమాసంలో చలి పులినికూడా తినే స్తుంది....'అయ్యగారూ। ఇంకా చాలా పొద్దున్నదండీ।'

'ఉంటే, ఉండనియ్। ఏం? ఒకరోజు కాస్త పెందలకడ లేస్తే ప్రమాద మేమీలేదులే। మళ్ళా పడుకునేవు। చలిమంటకు కట్టెలు సిద్ధం చెయ్యి. సామాన్లు కొట్టావిణ్ణికూడా లేపు. సద్గురుప్రభువు నాకు స్వప్నంలో కనిపించాడు.'

లక్ష్మి లేచింది. లేచి మహంతుగారి ఆసనంవద్దకు వచ్చింది. చేతులు జోడించి నమస్కరించి, కళ్ళు నులుముకుంటూ నూతివైపుకు వెళ్ళింది.

....లక్ష్మి అణువణువులోను సాధుస్వభావం ఉట్టిపడుతూంది. ఆదరణ లోను, అభిప్రాయాలలోను వినయమవిష్ట ఏర్పడింది. అంతా ఆ ప్రభువేచ్ఛ! ఇక ఈ రామదాసున్నాడంటే - ఇతగాడిస్వభావం ఎప్పుడు మారుతుందో ఏమో? బాల్యం నుంచి సాధువులచెంతన ఉంటూకూడా మనిషి ఏమాత్రం మారలేదు! ఇక ఇప్పు డేం మార్తారు? భక్తి ముక్తి అక్కర్లే దీయనకు! పొట్టకింత వుంటే చాలు! ఈయనలో రెండే రెండు గుణాలున్నాయి. సేవ చేయమంటే ఎంతయినా చేస్తాడు; అంతిరా బ్రహ్మాండంగా వాయిస్తాడు. 'ఏమోయ్ రామదాసూ....పళ్లా పడుకున్నావా ఏమయ్యా?....బిందెలో నీళ్లు నింపు!'

జాగహూ సత్‌గురుసాహెబ్, సేవక్ తుమ్హారే దరస్‌కో ఆయాజీ

జాగహో సత్‌గురు సాహెబ్....!

డిమిడిమిక్ డిమిక్ డిమిడిమిక్ డిమిక్!—'సద్గురుప్రభో మేలుకో! నీ సేవ కుడు నీ దర్శనార్థం వచ్చె. మేల్కో సద్గురుప్రభో!'

'ఎముకలు కొరికే మాఘమాసపు చలి! తెల్లవారుఝామునే మఠంనుంచి వెలువడే ప్రభాత గీతాలాపన శూన్యంలో పరిభ్రమిస్తున్నది. వృద్ధమహంతు మొదటి చరణం పలుకుతున్నారు. బోసినోరు కావడంవల్ల మాటలు స్పష్టంగా రావడంలేదు. గొంతులోని కంపనంవల్ల రాగంలో అపశృతి వచ్చేస్తున్నది. ఉబ్బసంతో జర్జరమై పోయిన శరీరంలో శక్తి ఉంటేనా?....అయినా లక్ష్మి అన్నివనులు సంబాళించు కొస్తున్నది. అయిదుసంవత్సరాలపూర్వం ప్రాతఃకాల వందనగీతం ఆలాపించే ప్పుడు ఆమె కనురెప్పలు నిద్రమైకంలో మూసుకునివుండేవి. మహంతుగారు గీతం లోని రెండవచరణం పాడుతుంటే విని నవ్వాపుకోలేక పోయేది.

....మరి ఇప్పుడో? అలా కాదు. ఆమె ఎంతో తియ్యగా మాట్లాడుతుంది. మధురంగా పాడుతుంది. తన్మయత్వంతో మృదుమధురంగా పాడుతూంటే మహంతుగారి అపశృతితో కూడుకున్న బొంగురుగొంతు కొంచెం అనవస్యంగా వినిపిస్తుంది. అయినా ఆ సంగీత నిర్మలప్రవాహంలో అవరోధం ఏర్పడదు. మహంతుగారి కంఠస్వరం లక్ష్మి కోమలకంఠస్వరానికి లయగా పనిచేస్తుంది! సన్నాయికి శృతిలాగా ఓం.ం.ం.ం.ం....!

రామదాసు ఝంఝిరా వాయిద్యం విశృద్ధవాతావరణంలో తరంగాలను ఉత్పన్నం చేస్తూంది. ఝంఝిరాకు కట్టిన గజ్జెలసవ్వడి మరింత ఆహ్లాదకరంగా వుంటుంది - పెంపుడు లేడిపిల్ల గంతులేస్తున్నట్లుగాను, నాట్యం చేస్తున్నట్టుగాను. ఢిం ఢిమిక్ । ఝనక్ ఝనక్ ॥

ప్రాతఃవందన తరువాత 'టీజక్' గ్రంథపఠనం జరుగుతుంది.

ఆ తరువాత సత్సంగసమావేశం. రోజూ ఈ సమయంలోనే ఈ సమావేశం జరుగుతుంది. ప్రభాతవందనగీతం వినిపించడంతోటే మఠంలోవున్న ఇతర సాధువులు, అతిథి అభ్యాగతులు, మఠంలోని కార్యకర్తలు మేల్కొంటారు. ప్రభాతవందనానికీ, గ్రంథపఠనానికి హాజరు అయినా కాకపోయినా ఫరవాలేదు. అయితే ఈ సమావేశానికిమాత్రం అందరూ హాజరు కావలసివుంటుంది. మఠం పాకశాలాధిపతి ఈ వేళప్పుడే రోజూ హాజరు తీసుకుంటాడు. ఈ వేళప్పుడు ఎవరైనా హాజరు కాకపోతే ఆ రోజుకు అయన పస్తుండవలసిందే। ఈ సమావేశంలోనే మహంతుగారు సాధువులకు, శిష్యులకు ఉపదేశా లిస్తూఉంటారు. ప్రశ్నలకు సమాధానాలు చెబుతారు. అజ్ఞానాంధకారాన్ని తమ ప్రబోధవచనాలతో దూరం చేస్తారు.

సత్ గురుసేవా సత్యకరి మానే సత్యవిచార్

సేవక్ చేలా సత్యకో గురువచనవిహార్

....సద్గురుసేవ ఒక్కటే సత్యమైనది. సేవకులు, శిష్యులు ఈ సత్యమార్గాన్ని పాటించాలి.

సత్సంగ సమావేశం పూర్తి కావడంతోనే పాకశాల వ్యవస్థాపకుడు ఎంత మందివున్నారో లెక్కించుకుంటాడు - రాణీగంజ్‌నుంచి వచ్చిన ముగ్గురుభక్తులూ వారంరోజుల్నుంచి ఇక్కడే మకాం చేశారు. వెళ్ళిపొమ్మని పోరుకాదితే వెళ్ళి మహంతుగారితో చెప్పుకున్నారు. ఆయన అనుజ్ఞ ఇచ్చేశారు. బేలామఠంనుంచి వచ్చినాయనకు జ్వరం వచ్చేసింది. రెండుపూటలా సగ్గుబియ్యం వండిపెట్టాలి కాబోలు....।

వంటశాలదాపి లక్ష్మి రోజూ ఈవేళప్పుడే నోరు పారేసుకుంటుంది. చాలా

అసహ్యంగా వుంటుంది. దాని రొద। సత్సంగసమావేశంలో విన్న నాలుగు మంచి మాటలూ ఇట్టే ఎగిరిపోతాయి. మనస్సులో పవిత్రత కాస్తా కరిగిపోతుంది. ఏమిటి చెయ్యడం? ఈ మతనియమాన్ని పాటించకపోతే ఈ సాధువులంతాకలిసి నెల రోజుల్లో ఈ మఠాన్ని స్వాహాచేసి పారెయ్యరూ? బయటనుంచివచ్చే సాధువులకు నాలుగురోజులుపాటు ఇక్కడుండేందుకు అవకాశం వుంది. కాని....'ఈ రాణీ గంజ్ సన్యాసులు ఈ నియమాన్ని అతిక్రమించేశారు। వాళ్ళు అర్థం చేసుకోవాలి. ఇక్కడేమైన కుబేరుడి భాండాగారం వున్నదా ఏమిటి?....।'

'లక్ష్మి।' మహంతుగారు చెప్పారు - 'ఈ రోజుకు ఉండనివ్వు వాళ్ళను। ఇవ్వాళ్ళ ఇక్కడెంతమందివున్నారో వాళ్ళందరికీ అల్పాహారం, భోజనం ఏర్పాటు చేయించు. భక్తులంతా కూర్చోవాలి. ఈ రోజున సద్గురు నాకు స్వప్నంలో కన్పించారు.'

చలిమంట భట్టీలో మళ్ళా చిన్నచిన్న కట్టిపుల్లలు వేశారు. భక్తులంతా చలి మంటకు నాలుగువైపులా గుండ్రంగా కూర్చున్నారు. లక్ష్మి మహంతుగారి సమీపం లోనే కూర్చుంటుంది....అందరూ మహంతుగారివైపు ఉత్సుకతో చూస్తున్నారు.

'విన్న మధ్య రాత్రివేళ సద్గురుమహారాజు నా దగ్గరకు వచ్చారు. నేను తక్షణమే లేచి గురుదేవునికి నమస్కరించాను. నన్ను ఆశీర్వదించి నాతో ఇలా అన్నారు: 'సేవాదాస్। నువ్వు నేత్రహీనుడివే అయినా నీ అంతరనేత్రాలజ్యోతి విలక్షణమైంది. నేను వేషం మార్చుకొనివచ్చాను; అయినా నువ్వు నన్ను గుర్తిం చావు. నీ జ్ఞాననేత్రాలలో దివ్యజ్యోతి వున్నది. మీ గ్రామంలో పరమార్థపరమైన కార్యమొకటి జరుగుతున్నది; కాని నీకావంగతి తెలియదు. గాంధీ నా భక్తుడే. ఆ గాంధీ ఈ ఊళ్ళో ఆస్పత్రి తెరిపించి పరమార్థకార్యాన్ని నిర్వర్తిస్తున్నాడు. నువ్వు గ్రామానికంతటికి సామూహిక విందొకటి ఏర్పాటు చేయించు' అనిచెప్పి అంతర్ధాన మయ్యారు. నాకు నిద్రాభంగమైంది. సద్గురువిరహంలో నా మనస్సు వికావికలై పోయింది. విరహాగ్ని నా శరీరాన్ని దహించివేసింది. చివరకు సద్గురు ఆదేశాన్ని గుర్తుకు తెచ్చుకొని ఊరట చెందాను. మనస్సు శాంతించింది.'

మహంతుగారి స్వప్నవృత్తాంతం వెంటనే ఊళ్ళో పాకిపోయింది. బాలదేవ్

హరగౌరి సంవాదం; యాదవసైన్యం తరలిరావడం. గ్రామతగాదాలలో కొత్త మలుపు తొక్కాయి. అందరిలోనూ కొత్తఊపు వచ్చింది. సిద్ధాంతిగారి ఉద్దేశ్య మేమిటంటే - 'యాదవులు మాట్లాడితే కర్రలు, బరిసెలు తీసుకొని బయలుదేరు తున్నారు. రాజపుత్రుల గాజులు తొడిగించుకుంటే పోతుంది. పోలీసుస్టేషన్‌లో రిపోర్టు రాయించు. వీళ్ళ అంతేమిటో తేల్చుకోవాలి. అయితే సింగుగారికి పోలీసు లంటే హడలు, వాళ్ళు మాట్లాడితే బూతులసంధాంగం విప్పుతారు. పోలీసులూ, కేసులు అనవసరం. వూరికే లోకువై పోతాం. మన బలహీనత బయటపడుతుంది. అందుకని సమయంకోసం వేచివుండి ప్రతీకారం తీసుకోవాలి. యాదవులవరకే అయితే పరవాలేదు; వాళ్ళతోపాటు కాయస్థులుకూడా వున్నారు. కాయస్థులతో పోరు తెచ్చుకోవడం అంటే కొరివితో తల గోక్కోవడమే అవుతుంది. పైగా ఈ విషయంలో హరగౌరిదే తప్పు. తనవాకిట్లో కూర్చున్న వ్యక్తిమీద చెయ్యి చేసుకో వడం. తక్షణం అక్కడనుంచి వెళ్ళిపొమ్మని తరిమేయడం మంచిపనికాదు' అని।

యాదవులపేటలో ఇప్పుడు మధ్యాహ్నమే డప్పు మోగుతున్నది - తక ధిమి... తకధిమి....। మాదిగ శోభన్నకు కొత్త పంచ, బనీనూ ఇచ్చారు. యాదవులపిల్లలు మధ్యాహ్నందాకా గొర్లను మేపుకొచ్చి కుస్తీక్షేత్రంలో బస్కీలు తీయడం ప్రారంభించారు. బాలదేవ్ ఉపవాసం ఉన్నరోజుసాయంత్రం ఖేలావన్ యాదవ్ ఇంటో భజనలు జరిగింది. బాలదేవ్ నేర్పిన స్వరాజ్యగీతం 'ధన్యుడు గాంధీజీ, రాజ్యం తిప్పే గాంధీజీ।' పాడారు. ఆ తరువాత బాలదేవ్ పచ్చి గేదె పాలుతాగి ఉపవాసాన్ని విరమించాడు. 'మళ్లా ఎప్పుడైనా హింసకు పూనుకుంటే ఉపవాసం చేస్తాను. ఈసారి రెండురోజులు।' అని అన్నాడు. జాతీయగీతాలు లహసన్ కొడుకు సునరా బాగా పాడుతాడు. బాలదేవ్ ఈసారి ఉపవాసం చేసి నప్పుడు వినాలి. ఇప్పుడిప్పుడే మరికొన్ని నేర్చుకుంటున్నాడు... సిపాయిలపేటలో వగలే గుర్లగూబలు అరుస్తున్నాయి. అందరూ చచ్చుబడిపోయారు. 'రాజపుత్రుల గర్వం బాగా అణిగింది. వాళ్ళ మిడిసిపాటు మాయమైంది. కాళీచరణ్ మంచి ధైర్యవంతుడనిపించుకున్నాడు' అని తాసిల్దార్ అన్నాడు.

అస్పత్రికి కావలసిన ఇళ్ళన్నీ తయారైనాయి. మట్టిపూత పనిమాత్రం

మిగిలిపోయింది. వంతాల్ పేట ఆడవాళ్ళంతా ఇవ్వాళ్ళవచ్చి గోడలకు మట్టిఅలికి పోతారని వాలరి విరసా చెప్పారు. మట్టిపనిలో వంతాల్ ఆడవాళ్ళకు పెట్టింది పేరు. ఎంతపెద్ద ఇల్లుఅయినా సరే - నిమిషాలమీద పూర్తిచేసివేస్తారు. వచ్చే శని వారంనాటికి డాక్టర్‌గారు వచ్చేస్తారు; బాలదేవ్ డిస్ట్రిక్ట్‌బోర్డునుంచి సామానులన్నీ తెచ్చారు. వైస్‌ఛైర్మన్‌గారు బాలదేవ్‌తో సంతకం చేయించుకున్నారు. వైస్ ఛైర్మన్‌గారుకూడా యాదవులే అయ్యివుంటారు. మరొకజాతివాళ్ళకు ఇటువంటి పేరుండదు, ఛైస్ చరమన్! తాసిల్దార్‌గారింటివిచూస్తే తెలుస్తుంది - కుర్చీలు, బెంచీలు, పెద్దపెద్ద మందులపెట్టెలు, బొక్కెన్లు, స్టేండు, పెద్ద లోటా! నీళ్ళుసంపు రౌతహట్ తిరునాళలో అమర్చినట్టు అమరుస్తారు కాబోలు!

మహంతుగారి విందుకూడా శనివారంనాడే! పూరీ జిలేబీల విందుభోజనం. ఊళ్ళోని ఆడ మగ, ముసలీ ముతక, ఉన్నవాళ్ళూ లేనివాళ్లు అందర్నీ మహంతు గారు ఆహ్వానించారు. ఆయనకు కల వచ్చిందిగా!

యాదవులపేట శిష్టు డంటాడు - అంధుడైన మహంతు తన పాపాలకు ప్రాయశ్చిత్తం చేసుకుంటున్నాడు; యోగి అయినవాడెవ్వడూ ఉంపుడుగత్తెను పెట్టు కోడు. పైకి బైరాగి, లోపల భోగి, దగాకోరు! ఏమంటారు? ఉంపుడుగత్తెకాదూ? దాసీయా? నమ్మేవాళ్ళకు చెప్పండి ఈ మాటలు! మఠంలో అయిదుసంవత్సరాలు పనిచేశాను; మఠంసంగతులు నాకుకాక మరెవరికి తెలుసు? ఎవరుచూసినా చూడక పోయినా పైనుంచి ఆ పరమేశ్వరుడు చూస్తూనే ఉంటాడు. మహంతు లక్ష్మని దాసీగా మఠానికి తీసుకొచ్చినప్పుడు ఆమె చాలా చిన్నది; చాలా అమాయకంగా వుండేది. ఒకచీరట్ట కట్టుకునేది. ఆ పిల్ల ఎక్కడ, ఏభై సంవత్సరాల వృద్ధుడెక్కడ? రోజూ రాత్రిపూట లక్ష్మి రాళ్ళు కరిగిపోయేంత దీనంగా ఏడుస్తూంది. నేను విన లేకపోయేవాణ్ణి. గొర్లను మేపడానికి వెళ్ళిపోయేవాణ్ణి. పాలు తీసుకెళ్ళడానికి రోజూ ఉదయంపూట గొర్లచావిడిదగ్గరకు వచ్చేది; కళ్లు రెండూ ఇంతెత్తున ఉబ్బి ఉండేవి. రాత్రి ఎందుకేడుస్తున్నావని అడిగితే కళ్ళప్పగించి చూసేది. తల్లిని పోగొట్టుకున్న అవుదూడకుమల్లే!.... మహాచండాలుడు - ఈ రామదాసుకూడా! వాడుకూడా గురు వుకుమించిన శిష్యుడే అవుతాడు! చూస్తూఉండండి....! మహంతు ఒకసారి నాలుగురోజులపాటు పూర్ణియా వెళ్లాడు. ఈ నాలుగురోజులన్నా లక్ష్మి హాయిగా

విద్రపోతుందనుకున్నా. కాని అలా జరగలేదు. పులిగాడినోట్లోమంచి గిలిగాడి నోట్లోకి వెళ్ళినట్లయింది. ఆ తరువాత లక్ష్మికి బాగా జబ్బుచేసింది. కింద పెట్టి నంతపనయింది. ఎలాగో బతికి బయటపడింది. అయితే పాపం ఎంతకాలం దాగుతుంది? రామదాసుకు మూర్ఛలరోగం వచ్చింది. మహంతు సేవాదాసు గుడ్డివాడై పోయాడు. అంతా తారుమారై పోయింది....నాకు మూడుసంవత్సరాలజీతంకూడా రావలసివుంది. విందు చేస్తున్నారా? సమిష్టివిందు! నేను వాళ్లను సాధువులుగా ఎంతమాత్రం పరిగణించను.'

మహంతు సేవాదాసుకు ఈ ప్రాంతంలో మంచి పేరు ప్రఖ్యాతులున్నాయి. మంచి జ్ఞానిఅయిన సాధుసత్తముడని అనుకుంటారు. సమస్తశాస్త్రాలను కాచి వడ పోసినవ్యక్తిగా భావిస్తారు. మఠంలో ప్రవేశించాక ప్రతిఒక్కరికీ ఆకలిదప్పులు మటుమాయమైపోతాయి. మఠాన్ని అత్యంత పవిత్రస్థానంగా భావిస్తారు. అయితే మహంతు దాసీని తెచ్చుకోవడంతో అందరి అభిప్రాయాలూ ఆయననుగురించి పూర్తిగా మారిపోయాయి. బసుమతియా మఠానికిచెందిన మహంతువిషయంలో కూడా ఈ దాసీవల్లనే పెద్ద రాద్ధాంతం జరిగింది. కొట్లాటలు జరిగాయి. చివరకు కోర్టుదాకా వెళ్ళింది వ్యవహారం. బసుమతియా మహంతు లక్ష్మి తండ్రి తనకు సహాధ్యాయుడని ఈ కారణంగా ఆమెతండ్రి మరణించాక ఆమెమీద పూర్తి అధి కారం తనదే అయిందని అన్నాడు। సేవాదాసువాదన, లక్ష్మితండ్రి పనిచేసినమఠం మేరీగంజ్‌మఠం ఆధీనంలోనిది కావడంవల్ల లక్ష్మిమీద అధికారం తనదేనని। చివరకు లక్ష్మి చట్టరీత్యా సేవాదాసు పరమైనది. 'మహంతుగారూ। ఈ పిల్లను చదివించి పెళ్ళి చెయ్యండి' అని సేవాదాసు వకీలు మహంతుతో చెప్పాడు. మహంతు వకీలుకు మాటిచ్చాడు - 'వకీలుగారూ। లక్ష్మిని నేను నా కూతురుగా చూసుకుంటాను' అని। కాని మనిషిబుద్ధి ఇట్టే మారిపోతుంది. కిశోరప్రాయంలో వచ్చిన లక్ష్మిని మహంతు మఠంలోకి రావడంతోనే దాసీగా వ్యవహరించడం ప్రారంభించాడు. ఇప్పుడు లక్ష్మికి యుక్తవయస్సు వచ్చింది. అయితే ఆమె యౌవనవతి కావడానికిముందే మహంతు తన కళ్ళజ్యోతిని పోగొట్టుకున్నాడు. ఒకవేళ కళ్లు పోకుండావుంటే లక్ష్మి యౌవనాన్నిచూసి అతగాడు ఏమైవుండే వాడో? ఇప్పుడు చాలామంది సేవాదాసుకు నమస్కారంకూడా చేయడం

లేదు.........ధర్మభ్రష్టుడైపోయాడు దొంగభక్తుడు. బ్రహ్మదారి కాదు, వట్టి వ్యభిచారి!

పూరి, జిలేబి, పెరుగు, పంచదార - వీటితో కూడిన విందు ఏర్పాటు చేస్తున్నట్టు ప్రకటించాక ప్రజాభిప్రాయం మారిపోవడం ప్రారంభమైంది....ఏది ఏమైనా ఆయన సాధుపుంగవుడు గదా! ఎవరైనా ఇంత పెద్దఎత్తున ఊళ్ళోవాళ్ళకు విందు ఏర్పాటుచేశారా, ఇదివరలో ఎప్పుడైనా? తాసిల్దారు తన తండ్రి శ్రాద్ధం జరిపించి నప్పుడు తన గోత్రీకులకు భోజనం, తక్కినవాళ్ళకు పెరుగూ, అటుకులూ పంచి పెట్టాడు. పింగ్‌గారు తన అత్తగారి శ్రాద్ధకర్మ జరిపించినప్పుడు తమ గోత్రీకులకు మృష్టగా భోజనంబెట్టి తక్కినవాళ్ళకు పెరుగూ, అటుకులూ పంచిపెట్టించాడు. భేలావన్ తల్లి చనిపోయినప్పుడు ఆతను ఎటువంటిభోజనం ఏర్పాటుచేశాడో అందరికీ తెలిసినవిషయమే. పైగా ఊళ్లోవాళ్ళందరికీ, ఆడ మగ, పిల్లా మేకా అనే భేదంలేకుండా ఇదివరలో ఎవరైనా ఏర్పాటుచేశారా అటువంటిభోజనం? పంచదార నామమాత్రానికికూడా దొరకదు. బ్లాకులో బస్తా పంచదారకు పచ్చనోటు ఖర్చుపెట్టాలని భగత్ అన్నారు. నాలుగుమణుగుల పంచదార కావాలంటే రెండు పచ్చనోట్లు ఖర్చుపెట్టవలసిందే!

దేవాంగులపేట, క్షత్రియులపేట, దర్భానులపేటలో నివసించేవాళ్ళల్లో చాలామందికి పూరీ, జిలేబీ రుచి ఎలా ఉంటుందో అసలు తెలియకనేపోవచ్చు. ఒకసారి విరంచి కోర్టులో సాక్ష్యం చెప్పడానికి వెళ్ళినప్పుడు తాసిల్దారు పూరీ, జిలేబీ తినిపించాడు. అయితే ఊళ్ళోవాళ్లంతా విరంచి తాసిల్దారు తినేసిన ఎంగిలి తిన్నాడని చెప్పుకున్నారు. ఈ ప్రకారం ఎవరుచేశారో ఏమో?...జంధ్యం వేయించడానికి బ్రాహ్మడొచ్చినప్పుడు, విరంచి తలమీద పదిగంటలపాటు వక్కలు కలశం ఉంచడం జరిగింది. అయిదువక్కలు, కలశంనిండా నీళ్ళు! పెద్దశిక్షే విధించారు. వీందె ఏమాత్రం కదిలి, ఒకచుక్కనీళ్ళు కిందపడితే పైనుంచి వీపుమీద చీపురు దెబ్బలు పడతాయి. తాసిల్దారు ఏంచేస్తాడు? కులమర్యాదలవిషయంలో జోక్యం కల్పించుకోకూడదు. అయిదురూపాయలు జరిమానావిధిస్తే అది చెల్లించుకొని బ్రాహ్మణుడికి ఒకజత పంచెలుపెట్టి తనకు కులపెద్దలు విధించిన శిక్షను అమల

విందాడు. ఆ దెబ్బతో తాతలు దిగొచ్చారు. పూరీ, జిలేబీలరుచి ఎలా వున్నదోకూడా మరచిపోయాడు.

'జీవన్‌దాస్!'

'బాలదేవ్‌గారు వచ్చినట్టున్నారు. నమస్కారం బాలదేవ్‌బాబూ!'

'నమస్కారం కాదు, జై హింద్ అనాలి, జై హింద్!.....అవునుగాని ఈ పేటలో ఎంతమంది వున్నారో కాస్త లెక్కవేసి చెప్పు. ఆడా మగతోపాటు పిల్లల్ని కూడా చేర్చు. ఆఁ, ఏమన్నావు? లెక్కబెట్టడం చేతకాదూ? బిరంచీ ఏడీ?'

బాలదేవ్ ప్రతిఇంటికీ తిరిగి జనాభాను లెక్కవేస్తున్నాడు. పేచీకోరు వ్యవహారమే ఇది. దర్వానులపేటలోనే ఏడు ఇరవైలమీద నలుగురున్నారు - కాదు కాదు - నాలుగు ఇరవైలమీద ఏడుగురు. బాజా భజంత్రీలపేటలో సరిగ్గా అయిదు ఇరవైలు - వందమంది వున్నారు. యానాదివాళ్ల పేటలో రెండు ఇరవైలు నలభై! కూరగాయ లమ్ముకునేవాళ్ళపేటలో ఆరు ఇరవైలమీద ముగ్గురున్నారు ...యాదవుల పేట జనాభాలెక్క కాళీచరణ్ చూస్తున్నాడు ఆ సిపాయిలపేటవాళ్ళు దీనికేం గొడవ లేవదీస్తారో ఏమో? మహాపేచీమనుషులు! బ్రాహ్మణులు విక్కచ్చిగా చెప్పేశారు. వాళ్ళకు ప్రత్యేకమైన ఏర్పాట్లు జరగకపోతే ఈ సమష్టివిందులో పాల్గొనే సమస్యే లేదని! బ్రాహ్మణులకు భోజనం పెట్టకపోతే ఆ విందుకూడా ఒక విందేనా? మహంతుగారితో చెప్పి ఒప్పించాలి. అసలు అయినా బ్రాహ్మణు లెంతమంది వున్నారు? మహావుంటే పదిళ్ళున్నాయేమో?

మహంతుగారు సంగతులన్నీ విని, 'హే సద్గురుప్రభో! సద్గురుప్రభో!!' అని ఇలా అన్నారు - 'బాలదేవ్‌బాబూ! అలా కానివ్వు. బ్రాహ్మణులకు ప్రత్యేకంగా భోజనసదుపాయాలు ఏర్పాటుచేయించు. దీనివల్ల మనకొచ్చిన నష్టమేమిటి? ఇంకోపని చెయ్యకూడదూ? వాళ్ళకు భోజనాలు మఠంలోనే ఏర్పాటుచేస్తే బావుంటుంది.'

ఆ సమయానికే లక్ష్మి అక్కడకువచ్చి 'సిపాయిలపేటవాళ్లు విందుకు హాజరు కారట! గొల్లలతోపాటు కూర్చొని మేము భోజనంచెయ్యమని హిందరన్

సింగ్‌గారబ్బాయివచ్చి చెప్పివెళ్లాడు. పప్పులూ, ఉప్పూ, బియ్యం వగైరా ఇస్తే ఆ వంటేదో మేమే చేసుకుంటామన్నాడు' అని చెప్పింది.

'హే సద్గురుప్రభూ! పెద్దసమస్యే వచ్చిపడింది. యాదవులు బోయీలతో కూర్చొని భోంచెయ్యమంటారేమో!'

'హిరన్‌సింగ్ కొడుకు మరోకమాటకూడా చెప్పివెళ్ళాడు. ఈ విందు ఏర్పాటు బాలదేవ్ చూస్తుంటేమటుకు వాళ్ళు రాకపోవచ్చునట!'

'హే సద్గురు! హే సద్గురు!'

'అయ్యా మహంతుగారూ! విచారించకండి. నే నుండడంవల్ల ఎవరికైనా ఇష్టంలేకపోతే - నేను తప్పుకుంటాను. ఇందుకు నేనేమీ అనుకోను!'

'బావుంది. ఇలాంటి గొంతెమ్మకోర్కెలకు అంతూ పంతూ ఉండదు. మహంతుగారూ! బాలదేవ్‌గారిని మినహాయించి మరెవరికి ఈ బాధ్యత అప్పగించినా విందు సక్రమంగా జరుగుతుందనే నమ్మకం నా కేమాత్రం కలగడంలేదు. ఈ ఊళ్ళో ప్రతిఒక్కర్నీ నేను కాచి వడపోశాను.'

బాలదేవు మొదటిసారిగా తల పైకెత్తి లక్ష్మివైపు చూశాడు. ఆమె విశాల నేత్రాలు అతన్ని ఇట్టే ఆకట్టివేశాయి. తనను తాను మరచిపోయాడు....బహుశా బాలదేవ్ ఆమె నేత్రాలలో ఇమిడిపోయాడేమో!

## అయిదు

మఠందగ్గర గ్రామంలోని పెద్దమనుషుల పంచాయతి ఏర్పాటైంది. బాలదేవ్‌కు మళ్ళా ఈరోజున ఉపన్యాసం ఇచ్చేఅవకాశం దొరికింది. అయితే గ్రామ పంచాయతీ అంటే - పూర్ణియా కోర్టు ఆవరణలోని రామూ పచారీ దుకాణం లాంటిది. ప్రతిఒక్కరూ తామే ముందు మాట్లాడాలని చూస్తూఉంటారు. ఆ చెప్పేది అందరూ ఒకేసారి చెప్పడానికి ప్రయత్నిస్తూఉంటారు. అసలువిషయం మరుగున బడి అనవసరమైన విషయాలమీద రభస పెరుగుతుంది. సింగ్‌మాత్రం గొంతు

చించుకుని మరీ మాట్లాడేస్తున్నారు - 'ఆ రోజునే గనుక నేను ఇంట్లో ఉన్న ట్లయితే రక్తం కాలువలు గట్టేది.' కాళీచరణ్ మాత్రం తక్కువ తిన్నాడా?

'ఆహా! ఇంటికొచ్చిన పెద్దమనిషిని అగౌరవపరచడం మనుషులు చేయవల సినపనేనా?' అని విరుచుకుపడ్డారు. 'ఆస్పత్రి అందరికోసరం ఏర్పాటవుతున్నది. దీనివల్ల నా కొక్కడికే ఒరుగుతుందని మీరు భావించనక్కర్లేదు. ఆ ఓవర్‌సీర్ గారు వెడుతూ వెడుతూ - తాసిల్దారుగారూ! ఈ పనిలో మీరు సహాయంచెయ్యాలి- అని చెప్పడంవల్ల ఈ పని నా నెత్తినేసుకున్నానేగాని - నా అంతట నేను ఈ బరువుభారం నామీద వేసుకోలేదు. ఏమంటావు ఖిలాదన్? నువ్వే చెప్పు!' అని తాసిల్దారు అన్నారు.

ముసలి సిద్ధాంతిగారు భవిష్యవాణి చెప్పారు - 'మీరు నమ్మండి, నమ్మక పోండి! ఈ ఊరిమీద కాకులు గద్దలు ఎగిరేరోజు వస్తుందని ఘంటాపథంగా చెబు తున్నాను. లక్షణాలు సక్రమంగా లేవు. గ్రహదలం చెడిపోయింది. ఈ గ్రామంలో హత్యాకాండ జరిగేరోజొస్తుంది. పోలీసులు వీధుల్లో స్వైరవిహారం చేస్తారు. ఇక ఈ ఆస్పత్రివిషయం - ఏమవుతుందో చెప్పలేను. బావుల్లో మందుగలిపి కలరా వ్యాధిని వ్యాపింపజేయడానికి తోడ్పడుతుంది. శివ! శివ!!'

బాలదేవ్ ఉపన్యాసం చెప్పేందుకు లేవబోతుండగా లక్ష్మి లేచి నిలబడి, 'పంచాయతీ పెద్దలారా!' అని చేతులు జోడించింది.

ఒక్కసారిగా ఎలక్ట్రిక్‌బల్బు వెలిగినట్లయింది. నిశ్శబ్దం ఆవరించింది. తెల్లటి సన్నచీరెచెరగు మెడలో వేసుకొని లక్ష్మి 'పంచాయతీ పెద్దలారా!' అని చేతులుజోడించి నిలబడింది.

'లక్ష్మి!' మహంతుగారు శూన్యంలోకి చేతులు ఊపుతూ అన్నారు-'లక్ష్మి నువ్వు మాట్లాడకు!'

అయితే లక్ష్మి ఆయనమాటను పాటించలేదు. 'సిద్ధాంతిగారు చెప్పిన మాటల్లో సత్యం లేకపోలేదు. గ్రహాలు సక్రమంగా లేవు. స్వల్పవిషయాలమీదనే ఐకమత్యంలేకుండా ఇలా కొట్లాడుకుంటూవుంటే ముందుముందు ఇంకేమైనా జరగవచ్చు. గ్రామపెద్దలే ఇందుకు బాధ్యత వహించవలసివుంటుంది. 'మైత్రి వున్న

చోటే స్వర్గం ఉన్నదని' సద్గురు అన్నారు. మానవజన్మ అనేది మాటిమాటికీ సంప్రాప్తించదు. మనుషులమై జన్మించి పరమార్థానికిబదులు స్వార్థాన్నిగురించి ఆలోచించడంకంటే మరోపాపం లేదు. పరమార్థకార్యంలో విఘ్నం కల్పించే వాళ్లు మనుషులు కారు. మీరంతా శాస్త్రపురాణాలు చదివినవారే। లోకభంగాన్ని కల్పించే వ్యక్తుల్నిగురించి పురాణాల్లో ఏమున్నదీ మీకు తెలియనిదికాదు. నేను చెప్పదలచుకున్న దేమిటంటే - ప్రతిఒక్కరూ భేదభావాన్ని త్యజించి ఒక్క త్రాటి మీద నిలబడి పరమార్థకార్యానికి మీ సహాయాన్ని అందించండి. 'పరమార్థకార్యం చేయని ఈ మనుష్యజన్మ నిరర్థకమని చెప్పనే చెప్పారు. ఈ విషయం మీకూ తెలుసు. చేతులు జోడించి పెద్దలకు విన్నవించుకుంటున్నాను. తగాదాలు మాన్పించి స్నేహాన్ని ప్రోత్సహించండి. ఆ భగవంతుడు మన గ్రామానికి మేలు చేకూరుస్తాడు. ఆ తరువాత మీ ఇష్టం।'

లక్ష్మి ఇలాచెప్పి కూర్చుండిపోయింది. ఆమె మొహం జేవురించింది. బుగ్గలు ఎర్రబడిపోయాయి. నుదుటిమీద చెమటబిందువులు మెరుస్తున్నాయి. అంతటా నిశ్శబ్దం ఆవరించింది. బాలదేవ్‌కు ఉపన్యాసం ఇవ్వాలనే ఉత్సాహం తగ్గిపోయింది. అతనికి శ్లోకాలేమీ రావు. శాస్త్రపురాణా లేవీ అధ్యయనం చెయ్యలేదు. జైల్లోఉండగా చౌదరిగారు చదువు చెబుతూఉండేవారు. మూడోపుస్తకంలో - 'ఉప్పుభారాన్ని మోయలేక గాడిద బాధపడేది' అన్నంతవరకు చదివేప్పటికి చౌదరిగారికి బదిలీ అయిపోయింది. ఆ రోజునుంచి అతనిచదువు కాస్తా మూలబడింది. అయితే ఆతగాడు ఈరోజున ఉపన్యాసం ఇవ్వాలని ఉవ్విళ్ళూరుతున్నాడు. లక్ష్మి వైపుచూసి ఒక్కసారిగా నిషావచ్చినట్టు లేచి నిలబడ్డాడు - 'సోదరులారా।'

'ఏదీ అంతా ఒక్కసారి గొంతెత్తి అనండి. గాంధీమహాత్మాకీ జై।' యాదవులపేట యువజనులంతా జయజయధ్వానాలు చేశారు.

'ప్రియమైన సోదరులారా। వంటావిడగారు చెప్పింది అక్షరాలా నిజం. తప్పంతా నాది। నావల్లనే గ్రామంలో పోట్లాటలు జరుగుతున్నాయి. నేను ప్రజాసేవకుణ్ణి। నేను పెద్ద విద్వాంసుణ్ణి కాదు; శాస్త్రాలు, పురాణాలు చదవలేదు. పేదవాణ్ణి; మూర్ఖుణ్ణి. అయితే గాంధిగారి పుణ్యమాఅంటూ భారతమాత ప్రతాపంవల్ల నాలో సేవాభావం ఉదయించింది. సేవ చేయాలని సంకల్పించుకున్నాను. మంత్రి

జయమంగళబాబును మీరందరూ ఎరుగుదురు. ఆయనకు సంతకం చెయ్యడంకూడా చేతకాదు. నిమ్నజాతికి చెందినవారు. బీదవారు; తెలివితేటలున్నవారు కాదు; అయితే ఏం - ఆయనలో సేవాభావం ఉంది; గాంధీగారు మెచ్చి మంత్రిని చేశారు. 'పరాయివారిబాధను అర్థం చేసుకున్నవాడే వైష్ణవుడు' అని గాంధీగారు చెప్పనే చెప్పారు. ఉద్యమంరోజుల్లో ఇంగ్లీషు సైనికులు నన్నుపట్టుకొని చితగ్గొడితే నాకు స్పృహ తప్పిపోయింది. మంచినీళ్లడిగితే మూత్రం పోశారు....'

బాలదేవ్ ఉపన్యాసం ప్రారంభం కావడంతోనే పంచాయతీ పెద్దలమధ్య మళ్లా గుసగుసలు మొదలయ్యాయి. రాజపుత్రవీధివాళ్ళు మరీ బిగ్గరగా మాట్లాడుకోవడం ప్రారంభించారు. బాలదేవ్ ఉపన్యాసంలోని ఈ అంశం కొంత ప్రభావాన్ని కలిగించింది. నోట్లో మూత్రం పోసేవారని చెప్పినప్పుడు ఒక్కసారిగా అక్కడ నిశ్శబ్దం తాండవించింది. బాలదేవ్ వెంటనే చొక్కా విడిచి, నాలుగు వైపులా తిరిగి తనవీపు అందరికీ చూపిస్తూ తన ఉపన్యాసం కొనసాగించారు. 'మీకు నమ్మకం లేకపోతే చూడండి!'

'బాబోయ్! పాపం వొళ్ళంతా మచ్చలుబడిపోయింది....ధన్యుడు!'

'ఈయన వీపు చూడండి!' యాదవపేట యువకుడొకడు అన్నాడు-'మేమంతా మహాత్మాగాంధీకి జై అని అంటే మీకేమో పాములు, తేళ్లు పాకినట్టుగా వుంటుంది. చూడండి మరి!'

'అంతా ఆ గాంధీజీ మహిమ. లేకపోతే ఈ బాధలన్నీ ఎవరు సహిస్తారు? తిట్లూ, తిరస్కారాలు సహించగలిగితేనే దానిమజా ఉంది.'

....'అందుకే సోదరులారా! నేను భారతమాత పేరు, మహాత్మాజీ పేరు ఉచ్చరించడం మానివేయలేదు. పోలీసులు నా గోళ్లలో గుండుసూదులు గుచ్చారు; అయినా నేను కిమ్మనలేదు. చివరకు జైల్లో పడేశారు. నాయకులు జైళ్ళు అంటే ఎలా భావించేది మీకు తెలిసినవిషయమే - 'అది జైలుకాదు, అత్తగారిల్లు; అక్కడికి వెళ్ళకోసం తరలివెడుతున్నాం!' అయితే జైల్లో ఇంగ్లీషుప్రభుత్వం మమ్మల్ని రకరకాలైనబాధలకు గురిచేసింది. అన్నంలో పురుగులు కలిపేవారు; గడ్డి గాదకూరగా వండేవారు. దాంతో మేమక్కడ ఉపవాసందీక్ష వహించాం. సోదరులారా!

ఐదురోజులపాటు వచ్చి మంచినీళ్లుకూడా తాగకుండా ఉపవాసం చేశాం. అప్పుడు కలెక్టరు ఎస్. పి; జడ్జి మా దగ్గరికొచ్చారు. మా కోర్కెల్ని మన్నించారు. పాలూ పళ్ళూ ఇస్తామన్నారు. 'పాలూ పళ్లు మా కక్కర్లేదు. అవి మా పిల్లల కివ్వండి; మాకు కొంచెం మంచి విద్యం ఇస్తే చాలని అన్నాం. సోదరులారా! సేవ చేయాలని సంకల్పించుకున్నాక, ఆ మార్గాన్ని నేను వదలలేను....'పోలీసుల లాఠీలకు భయంలేదు' మీ గ్రామంలో సేవచేసేఅవకాశం నాకు కల్పించకపోతే నేను చన్నన్ పటీ వెళ్ళిపోతాను. అక్కడ ఆశ్రమం ఉంది; అక్కడ ప్రతి ఇంట్లోను రాట్నం వడుకుతారు; ఆడా మగా అంతా చదువుకుంటారు. మహాత్మాజీ, జవహర్‌లాల్, రాజేంద్రబాబు, తదితర పెద్దపెద్ద దేశనాయకులు సంవత్సరంలో ఒకసారి తప్పక అక్కడకు వస్తూఉంటారు. చౌదరిగారు చాలాసార్లు కబురు చేశారు - 'బాలదేవ్! మావూరు వచ్చెయ్!' అని. 'అయ్యా చౌదరిగారూ, మీరు నాకు గురువులు. మీ మాట నేను కాదనలేను. అయితే మీ గ్రామం ఎంతో అభివృద్ధి చెందింది. అభివృద్ధి చెందని గ్రామాలకువెళ్ళి సేవచేయాలని వుంది. మేరీగంజ్‌ను చన్నన్‌పటీలాగా అభివృద్ధిచేయాలని వుంది. నేను మా స్వగ్రామంలో చీపురు పుచ్చుకుని వీధులు శుభ్రం చేస్తాను. ఇలాచేయడం మా కలవాటే. స్వయంగా మహాత్మాజీ చీపురు పట్టుకొని శుభ్రం చేసుకుంటాడు. శుభ్రంగావున్నచోటనే మనిషికూడా శుభ్రంగా వుంటాడు. మనస్సు నిర్మలంగా వుంటుంది. తెల్లకొరలను చూశారుగా? వాళ్ళదేశంలో చెట్లు-చేమాకూడా శుభ్రంగా వుంటాయి. బంగళా తోటలో కలెక్టరుగారి చెట్లను చూడండి; కొంగలాగా తెల్లగా ఉన్నది! మీరు నన్ను వద్దంటే వెళ్ళిపోతాను. మీకు నమ్మకం లేకపోతే మీలో చదువువచ్చిన వాళ్ళెవరైనా ఉంటే ఈ ఉత్తరం కాస్త చదవండి. ఇందులో ఏం రాసివుందో! సెపుచేసిన ఉత్తరమిది-రెండు సంవత్సరాలనాటిది!'

ఎవరు చదువుతారు! 'స్కూలు ఇంగిలిపీసు' చదువుకున్న కుర్రవాళ్ళు ఇంట్లోనే వున్నారు. చదవండి ఎవరైనా! ఖేలావన్ కొడుకు సకలదీప్‌తో - 'ఏదీ ఆ ఉత్తరం చదువు!' అతగాడికి చాలాసిగ్గు. 'హరగౌరీ! నువ్వు చదవయ్యా!' దర్బానులపేట రామచంద్ర అన్నకొడుకు సేవాలాల్ లేచి బాలదేవ్ చేతిలోనుంచి ఉత్తరం తీసుకొని చదవడం ప్రారంభించాడు.

'కొంచెం బిగ్గరగా చదువు। గొంతు కాస్త సవరించుకో। అలా గదగద వణికిపోతున్నావేమిటి?'

'బాలదేవ్‌గారి సమ్ముఖానికి - అయ్యా। కస్తూరబా స్మారకనిధి తాత్కాలిక కమిటీ ఒకటి ఏర్పాటుచేసేందుకుగాను ఒక ప్రత్యేకసమావేశం 8-12-46 వ తేదీన పూర్ణియానత్రంలో జరగబోతున్నదని ఇందుమూలంగా తెలియజేయడమైనది. ఈ సమావేశానికి బీహారుకుచెందిన మాజీమంత్రులుకూడా కొందరు హాజరవుతారు. ఈ విశేషమైన సమావేశానికి మీరు తప్పకుండా రావాలి. ఇట్లు, శివనాథ్ చౌదరి.'

నేవాలాల్, అర్థంకూడా చెప్పు। అక్కర్లేదులే। అర్థం ఏం చెబుతావులే; టైపుచేసిన ఆ ఉత్తరానికి అర్థమేం చెబుతావులే?

చౌదరిగారుకూడా బాలదేవ్‌గారి అభిప్రాయం తీసుకోకుండా ఏపనీ చెయ్యరు. బాలదేవ్‌వంటి వజ్రంలాంటి వ్యక్తి ఇక్కడ ఉండడం మనఊరి అదృష్టమనే చెప్పుకోవాలి. మనవూరుకూడా ఇక బాగుపడుతుంది తప్పకుండా....। సింగ్‌గారేదో చెప్పబోతున్నారు. వినండి.

'బాలదేవ్। నువ్వుగనుక ఈ వూరినుంచి వెళ్ళిపోతే మేరీగంజ్ దురదృష్టమనే అనుకోవాలి. అది మా అందరికీ సిగ్గుచేటుకూడాను. ఊరన్నతరువాత పొరపులు పోట్లాటలు లేకుండా ఎలా వుంటాయి? రెండుకుండలొకచోటవుంటే కొట్టుకోక మానుతాయా? గ్రామంలో ఐకమత్యాన్ని పెంపొందించి, గ్రామాభివృద్ధికి తోడ్పడడం మీలాంటివాళ్ళ పని. ఈ పనికి ఎవరైనా ఆటంకం కలిగిస్తే వాళ్ళు వట్టి బుద్ధిహీనులు. మీరంతా దేశసేవకులు. దుష్టుల్ని, దుర్మార్గుల్ని సన్మార్గాన పెట్టడం మీవంతు. గోసాయి - రామాయణంలో ముందుగా ఈ దుష్టశక్తుల్నే కీర్తించాడు. నువ్వు ఈ వూరు వదిలిపెట్టి వెళ్ళడానికి వీల్లేదు. తాసిల్దారు, నేనూ ఉన్నామంటే అన్నదమ్ముల్లాంటివాళ్ళం. చిన్నప్పటినుంచి కలిసి ఆడుకున్నాం, పోట్లాడుకున్నాం; మళ్ళా కలిశాం. అయ్యా తాసిల్దారుగారూ। మీరేమంటారు? కాయస్థులు, రాజపుత్రులుకలిసి మహారాణి చంపావతి ఎస్టేటును కాజేశారని జనం మన ఉభయ కుటుంబాలమీద అభాండాలు వేస్తూఉంటారు. ఇప్పుడు మనమంతా మరొకసారి ఒకటైపోవాలి।' సింగ్‌గారు తన సుదీర్ఘోపన్యాసాన్ని ముగిస్తూ పంచాయతీలో

కూర్చున్న సభికులవైపు చూశాడు. పంచాయతీలో కూర్చున్నవాళ్ళంతా ఒక్కసారిగా నవ్వారు. పొట్టలు చేత్తోపట్టుకొని మరీ నవ్వారు. సింగ్‌గారు ఉన్నది ఉన్నట్టు మొహంమీద అనేస్తారు. మనస్సులో ఒకటి. బయటికి ఒకటీ అనేతత్వం కాదు.

సింగ్‌గారు తాసిల్దారు చెయ్యి పుచ్చుకుని పైకి లేపారు. ఉభయులూ కౌగలించుకున్నారు. 'ఏదీ. అందరూ ఒక్కసారి ప్రేమతో అనండి — గాంధీమహాత్మాకు జై!'

'జై! జై!!'

ఇప్పుడిక సమష్టి విందుభోజనం బ్రహ్మాండంగా జరుగుతుంది. గత రెండు రోజుల్నుంచి విస్తట్లో వడ్డించిన పూరీలు. జిలేబీలు ఇట్టే మటుమాయమైనట్టుగానే అనుకోవటం ప్రారంభించారు. ఆరోజున సంకీర్తన, నాట్యం ఉంటాయి... ఆ చౌకీదారు ఆగమూవమన్నాడు? 'గాంధీగారి జెండా ఎగరవేయడానికి వీల్లేదు!' అతగాడు తన్నులు తింటాడు. వాడితాత ఇనస్పెక్టర్ని అడగమని చెప్పు. ఈ ప్రభుత్వం ఎవరిదో! ఉపవాసంచేస్తే గవర్నర్లు, కలెక్టర్లుకూడా దిగొస్తారు!

పంచాయతీలో కూర్చున్న ఇద్దరు వ్యక్తులకుమటుకు ఈ సమైక్యత రుచించ లేదు. వాళ్ళమీద వ్యతిరేకప్రభావం పడింది. ఖేలావన్ సింహయాదవ్‌ను సింగ్ తెలివితేటలతో తిప్పికొట్టడానికి ఎంతతెలివిగా ఎత్తువేసింది ఎవరికీ అర్థం కాలేదు. ఖేలావన్‌కు వ్యవహారమంతా పూర్తిగా అర్థమైంది. సింగ్ ఖేలావన్‌నుగురించి ప్రస్తావించనేలేదు. ఈ తాసిల్దారును చూడరాదూ! ఊసరవెల్లిలాగా రంగు మార్చేశాడు. అసలు వున్నపోట్లాట యాదవులపేటతోకాగా. సింగ్ తాసిల్దార్‌ను కౌగలించుకున్నాడు. ఖేలావన్ తక్కువ తిన్నాడని అనుకోవద్దు. ఇరవై ఏండ్ల అస్తాబస్తం అనుకోవద్దు. అందరికీ తెలివితేటలున్నాయి. బాలదేవ్ జ్ఞానబోధ అయితే చేశాడుగాని సింగ్ తాసిల్దార్‌తో ఎందుకు నేస్తం కడుతున్నాడో. అతగాడికి అర్థం కాలేదు. నేస్తంఅనేది నెరపవలసింది యాదవులపేట పెద్దతో! దేశసేవకుడై ఈయన ఒరగబెట్టిం దేమిటి? జాతిస్వభావం పోవిచ్చాడుకాదు. ఇంత మర్యాదగా చూసుకుంటూ. భోజనం పెడుతూఉంటే - సమయం వచ్చేప్పటికి ఏకు మేకై కూర్చున్నాడు.

సిద్ధాంతిగారు ఆవలిస్తే పేగులు లెక్కబెట్టేరకం. ఖేలావన్ మొహంచూపి విషయం ఇట్టే అర్థం చేసుకున్నారు. మొద్దుచర్మానికి చలనం కలిగింది. 'ఖేలావన్ బాబూ! అబ్బాయి సకలదీప్ జన్మపత్రిక కాశీనుంచి వచ్చిందా? వస్తే నా కొకసారి చూపించండి. నేను చెప్పినదాన్ని ఇంతవరకు కాశీ పండితులుకూడా కాదనలేదు.'

'అయ్యా సిద్ధాంతిగారూ! రేపుదయం రండి. ఈమధ్య మీ దర్శనమే కరువైంది. సకలదీప్ హైస్కూల్లో సంస్కృతంకూడా నేర్చుకుంటున్నాడు. వాడి సంస్కృతజ్ఞానం ఏపాటిదో కాస్త మీరు రేపొచ్చి పరీక్షించిచూడాలి!'

మధ్యాహ్నం ప్రారంభమైన పంచాయతీ సమావేశం సాయంత్రానికిగాని పూర్తి కాలేదు. చాలాకాలానికి ఊళ్లోవున్నవాళ్ళంతా పంచాయతీకి హాజరైనారు. మళ్ళా ఇంతకాలానికి అందరూ కలిసికట్టుగా ఒకచోట కూర్చున్నారు.

రేపే సమష్టి భోజనాలు. ఆస్పత్రి ముందున్నస్థలాన్ని శుభ్రంచేసి ఉదయానికే తడికలతో మూసివేయాలి. పందిరి ఏర్పాటు చేయాలి; రంగురంగుకాగితాలతో దాన్ని అలంకరించాలి. మిఠాయి వండేవాళ్ళు ఉదయమే వచ్చేస్తారు. పైగా ఇప్పుడు పగటిపొద్దుకూడా తక్కువ. విందు పూర్తయ్యేటప్పటికి సాయంత్రం అవుతుంది. డాక్టరుగార్ని తీసుకరావడానికి నాలుగు ఎడ్లబళ్ళను స్టేషన్‌కు పంపించాలి. వైస్ చైర్మన్‌గారు బాలదేవ్‌తో చెప్పారు. ఉదయం అందరూ ఆస్పత్రివద్దకు రావడంతో ఏ పనులు ఎవరుచేయాలో నిర్ణయించడం జరుగుతుంది. ఇంత పెద్ద విందుకు ఏర్పాటుచేయడం మాటలా మరి?

అందరూ వరుసగావచ్చి మహంతుగారికి నమస్కరించి శలవు తీసుకున్నారు. బాలదేవ్‌ను మహంతుగారు ఆపివేశారు. 'బాలదేవ్‌గారూ! మీరు కొంచెం ఉండండి. రేపు మళ్లా సమయం దొరకదు. ఇప్పుడే ఒకసారి ఖర్చుల్నిగురించి మాట్లాడుకుందాం. కూర్చొని బీజక్ గ్రంథపఠనం చేస్తూఉండండి. నిత్యకృత్యాలు ముగించుకుని ఇప్పుడే వచ్చేస్తాను. రామదాసూ! ఏమయ్యా రామదాసూ? ఎక్కడున్నావయ్యా? గంగాళంలో నీళ్ళు నింపావా?

బాలదేవ్ బీజక్ పేజీలు తిరగవేశాడు—

బీజక్ బతావే విత్ కో
జో చిత్త గుప్తేహోయ్
శబ్దబతావే జీవ్ కో
బూఝే బిర్ లాకోయ్।

—బీజక్ గుప్తమైన విత్తాన్నిగురించి చెబుతుంది. అందులోని ఉపదేశాలు జీవుణ్ణిగురించి చెబుతాయి.

లక్ష్మి లాంతరువెలిగించి ఎదుటపెట్టి వెళ్ళింది. అక్షరాలు మరింత స్పష్టంగా కన్పిస్తున్నాయి. 'సాధువుల్లారా, జనమంతా ఉన్మాదమైపోయింది।' లక్ష్మి శరీరం నుంచి ప్రత్యేకమైన 'సువాసన' ఏదో వెలువడుతున్నది. పంచాయతీ సమావేశంలో లక్ష్మి బాలదేవ్‌దగ్గర కూర్చున్నది. బాలదేవ్‌కు రామనగర్ ఉత్సవాలప్పుడు దుర్గ మందిరంలోకూడా ఇలాంటి సువాసనే వేస్తూఉండేది. మనోహరమైన సుగంధం: పవిత్రగంధం....ఆడవాళ్ళ శరీరాలనుంచి సాధారణంగా ఉల్లి, వెల్లుల్లి తదితర వంటింటివాసనలు వస్తూఉంటాయి.

## ఆరు

బాలదేవ్‌కు రాత్రిపూట నిద్ర పట్టడంలేదు.

మఠంనుంచి తిరిగి వచ్చేప్పటికి చాలా పొద్దుపోయింది. వచ్చేప్పటికి ఖేలావన్ ఆరోగ్యం సరిగాలేదని తెలిసింది. జ్వరం, జలుబు, లేదా తలనొప్పి వచ్చివుంటుంది. అసలు ఆడదిక్కులేని మగవాడు ఇంట్లో పడుకోవడం ఏమిటి? మగవాడు ఇంటిపట్టున వున్నాడూ అంటే దాని అర్థం అర్ధాంగినుంచి సేవలు అందుకోవడం। భోంచేస్తుంటే వదినెచెప్పింది - పొట్టలో వాయువు కూడుకున్నదని। పొట్టమీద నూనెతో మర్దన చేస్తుంటే 'బాబోయ్, బాబోయ్' అని కేకలు పెట్టాడు.

వదినెకూడా పట్టీపట్టనట్టుగా వున్నది. రోజూటిలాగా మాట్లాడడంలేదు. ఇదివరలో అయితే కుంపటిముందు కూర్చుని హుక్కా తాగుతూవుంటే బాలదేవ్ బైలుసంగతులు చెబుతూఉండేవాడు. పంచాయతీలో జరిగిన సంగతులన్నీ వదినెకు

వినిపించాలనుకున్నాడు; ఆమెవైపు ఓరిచూపి బాలదేవ్ మెదలకుండా పడుకోవడానికి వెళ్ళిపోయాడు.

నిద్ర పట్టడంలేదు. జైలువాళ్ళిచ్చిన కంబళి ఇవ్వాళ్ల బాగా గుచ్చుకుంటున్నది. ఖద్దరుధోవతి కొంచెం మురికిపడితే వంటికి చల్లగా తగులుతుంది.... మాటిమాటికి లక్ష్మి గుర్తుకొస్తున్నది. 'బాలదేవ్‌గారూ! ఇవ్వాళ్ల ఇక్కడే ప్రసాదం తీసుకోండి!' అని అన్నది, వచ్చేప్పుడు....ప్రసాదమా? లక్ష్మి శరీరం నుంచి వచ్చే సువాసన? ఇవ్వాళ్ళెందుకో అమ్మకూడా గుర్తుకొస్తున్నది. ఊళ్ళో వాళ్ళు బాలదేవ్‌ను 'టురవా' అని పిలుస్తూవుండేవారు. అలా పిలిస్తే అమ్మకు కోపం వచ్చేది. తండ్రి లేకపోతేమటుకు అనాథుడని పిలవడమేనా? తండ్రి లేకపోతే రాజా, తల్లిలేకపోతే అనాథుడునా బాలదేవ్ మహారాజా! నా బాలదేవ్ అనాథుడెంతమాత్రం కాదు....అమ్మ వీపు సవరించినట్లనిపించింది.

తల్లి చనిపోయాక బాలదేవ్ అజోధీ భగత్ బర్రెల్ని మేపాడు. అజోధీ భగత్ గుర్తుకొస్తేనే బాలదేవ్ పళ్ళు గరపొడుస్తుంది. ముసలిముండాకొడుకు మహాదుర్మార్గుడు! ఆ ముసలిది మరీ కర్కోటకురాలు! నిత్యం నక్కలాగా ఊళ పెడుతూవుండేది. పగలంతా గొడ్లు మేపుకొచ్చాక భగత్ వళ్ళుపట్టాలి. దాంతో చేతుల వేళ్ళన్నీ బాధతో గుంజుకుపొయ్యేవి. నిద్ర ముంచుకొచ్చేది. కళ్లుమూసినట్టు కన్పిస్తే చాలు, చెంప ఛెళ్ళుమనేది! ఆ ముసలాడి చేతివేళ్లు మండిపోయేవి. బాలదేవ్ బాల్యం నుంచీకూడా చెంపదెబ్బలు, బెత్తందెబ్బలు, కర్రదెబ్బలు అన్నీ తిన్నాడు. ముసలాళ్ళదెబ్బలు ఎట్లాగయినా కొంచెం చురుకుగానే వుంటాయి....అయితే రూపమతి హృదయం చాలా మంచిది. అంతటి నిర్దాక్షిణ్యమైన తలిదండ్రుల కూతురికి అంతటి దయార్ద్రమైన హృదయం ఎలా వచ్చిందో అర్థం కావడంలేదు. ముసలివాళ్ళిద్దరికీ రాత్రిపూట నిద్ర పట్టేదికాదు. అర్ధరాత్రివేళ లేపి గొడ్లను విప్పుకెళ్ళమనేవాళ్ళు. సరీఘా అర్ధరాత్రివేళ రావిచెట్టుమీద గుడ్లగూబ పిచ్చిగా అరిచేవేళకే ఇక్కడ ముసలాడు శనిగాడులాగా కేక పెట్టేవాడు - 'ఒరేయ్ అనాథపీనుగా! తెల్లవారిందిరా! లేచి గొడ్లను విప్పు!'....రూపమతి ఎప్పుడూ అనాథుడని అనేది కాదు. 'బల్లీ' అని చిన్నపేరు పెట్టింది. గేదెలు ఉదయం నాలుగుసేర్లు, సాయంత్రం మూడుసేర్ల పాలు ఇచ్చేవి. ముసలిది చిటికెడు కడిగినపాలుకూడా వాసన చూడ

విచ్చేది కాదు. రూపమతి రోజూ అన్నంతోపాటు ఇన్ని పాలుకూడా వాళ్ల చూడకుండా పంపించేది. ముసలివాళ్ళిద్దరూ ఇలా కూడబెట్టిన డబ్బు కాస్తా బందిపోటు దొంగలువచ్చి దోచుకెళ్లారు.... ఈమధ్య రూపమతి కన్పించింది. చాలాకాలానికి అత్తవారింటినుంచి వచ్చింది. ముగ్గురు పిల్లలు. పెద్దపిల్ల అచ్చు రూపమతిలాగానే వుంటుంది. నవ్వుకూడా అక్షరాలా అంతే।

....మాయాగారు గుర్తుకొస్తున్నారు. మాయాగారంటే రామకృష్ణబాబు భార్య. చన్పన్‌పట్టీలో మొదటిసారిగా మీటింగు జరిగినప్పుడు రామకృష్ణబాబు, ఆయన భార్య, చౌదరిగారు, తివారీగారూ వచ్చారు....ఎంత తేజగలమొహం రామకృష్ణ బాబుగారిది। తీర్చిదిద్దినట్టుంటుంది. పెద్దపెద్ద కళ్ళు. ఉపన్యాసంచెబుతూఉంటే సింహం గర్జించినట్టుగానే వుంటుంది. వకాల్తా చేసేరోజుల్లో ఆయన వాదించడం మొదలబెడితే కోర్టు పైకప్పు పెచ్చులు పెచ్చులుగా ఊడి కిందపడేదని చెప్పుకునే వాళ్ళు। జడ్జి ఈయనకు వ్యతిరేకంగా తీర్పు చెప్పడానికి జంకేవాడట। మహాత్మా గాంధి పిలుపు విని ఒక్కసారిగా అన్నిటినీ వదులుకొని వచ్చేశారు. భార్యను వెంట బెట్టుకుని గ్రామాలో పర్యటించారు. మాయగారి కాళ్ళచర్మం పగిలిపోయింది. కాళ్లు బొబ్బలెక్కి రక్తంతో నిండిపోయాయి. ఆమె బాధచూసి, రామకృష్ణగారి ఉపన్యాసం విని, తివారీగారి పాటలువిని తాను ఉండబట్టలేకపోయాడు. అప్పటి ఆవేశాన్ని సంబాళించుకోవడం ఎవరికైనా కష్టమే। ఎవరో తాడువేసి లాగుతున్నట్టుగా ఉండేది। అంత ఊషవుంది. అందులో।....'గంగా జమునా ధారగా ప్రవహించేలా కన్నీటిజాలుగా, భారతీయులస్థితినిగాంచి రోధించెరా భారతమాత అతి దీనురాలుగా।'

మాయగారి కాళ్ళచర్మం చిట్లింది. భారతమాత విలపించింది. అప్పుడే తను రామకృష్ణగారిదగ్గరికెళ్ళి - 'నా పేరుకూడా స్వరాజ్య ఉద్యమ కార్యకర్తగా రాసుకోండి।' అని చెప్పాడు. ఆ రోజు మీటింగులో మొత్తం ముగ్గురిపేర్లు రాసుకున్నారు. బాలదేవ్, బావన్‌దాసు, చున్నీగోసాయి. చౌదరిగారు అందర్నీ జిల్లా కార్యాలయానికి తీసుకెళ్లారు. మాయాగారు నిత్యం ఆఫీసుకు వస్తూఉండేది. ఆమెకు కోపం రావడం ఎప్పుడూ లేదు- మాట్లాడుతున్నంతసేపూ నవ్వుతూనే ఉంటుంది. ఒకపర్యాయం పల్లెటూళ్ళు పర్యటించి తిరిగివచ్చేప్పుడు తనకు జ్వర మొచ్చింది.

వళ్ళు మండిపోతున్నది. తల పగిలిపోతున్నది. స్పృహకూడా లేదు. ఎప్పుడో అర్ధ రాత్రివేళ కళ్లు తెరిచేప్పటికి కొంచెం వళ్ళు తేలికపడిన ట్లనిపించింది. 'ఎలా వున్నావు బాలదేవ్? ఎవరూ బావన్?' తల అటుతిప్పి చూసేప్పటికి దగ్గర్లోనే కుర్చీలో కూర్చున్న మాయ కన్పించింది. 'ఎలా వున్నది? జ్వరంగావుంటే ఈ ప్రయాణం ఎందుకు పెట్టుకున్నావు? పడుకో' మొహంమీద చేతితో నిమిరి ఆమె అన్నది - 'జ్వరం తగ్గిపోయింది. మాయగారి చేతిస్పర్శ తగలడంతో నాకు నిద్ర వచ్చేసింది. ఆ రెండోరోజున బావన్‌దాసు అన్నాడు. 'మాయాగారికి మీకు జ్వరంగా వున్నదని తెలియడంతోనే నన్ను వెంటతీసుకుని వెంటనే బయలుదేరి ఆఫీసు కొచ్చారు. ధర్మామీటరుతో జ్వరంచూసి - 'నీళ్ళు తీసుకరా, వినవక్ర ఇలా తే' అని అన్నారు వెంటనే నీళ్ళపట్టి నుదుటిమీదవేస్తూ కూర్చున్నారు - రాత్రి పన్నెండు గంటలవాకా..... 'ఆ భగవంతుడు కూడా మంచిమంచివాళ్ళకే చావు కల్పిస్తాడు. ఆ తరువాత రెండు మూడు సంవత్సరాలకే ఒక్కరోజు జ్వరంతోనే శాశ్వతంగా కన్ను మూశాడు. హే భగవాన్! ఆ రోజు మాయాగారివైపు ఎవరూ చూడలేక పోయారు. చూడడానికి అసలు ధైర్యమే చాల్లేదు ఆ రోజు ఆమెమొహం ... 'గంగా జమునలధారగా ప్రవహించెరా, కన్నీటిజాలుగా, భారతీయుఃస్థితినిగాంచి రోధించెరా భరతమాత అతి దీనురాలుగా!' అందరూ తమ దురదృష్టంగా భావించు కున్నారు. పెద్దకర్మ జరిగిన రోజునుంచే జిల్లా ఆఫీసుపేరు 'రామకృష్ణ ఆశ్రమం'గా మార్చివేశారు. ఆ మరురోజే మాయాగారు కాశీ వెళ్ళిపోయారు. రైలు ఎక్కబోయే ముందు పాదాలు స్పృశించి నమస్కారం చేసినప్పుడు మాయాగారు ఒక్కసారిగా పెద్దపెట్టున ఏడవటం ప్రారంభించారు - పల్లెటూరి ఆడవాళ్ళలాగా. బావన్‌దాసును మాయాగారు ఠాకుర్ అని పిలిచేవారు; నేలమీదపడి బెంబేలు పడిపోతున్న బావన్ దాసును పైకి లేవనెత్తుతూ మాయాగారు - 'మహాత్మాజీమీద నమ్మకం ఉంచు. ఆయన నీకు మేలుచేస్తాడు. మహాత్మాజీమార్గాన్ని ఎప్పుడూ వదలవద్దు' అని ఓదార్చి చెప్పింది. మాయాగారిప్పుడు ఎక్కడున్నారో ఏమో?

వేడివేడి కన్నీటిబిందువులు బాలదేవ్ చేతిమీద జారిపడ్డాయి. తన అమ్మ.... రూపమతి....మాయాగారు....లక్ష్మి! మాయాగారిలాగానే లక్ష్మికికూడా ఉపన్యసించడం బాగా తెలుసు. లక్ష్మి ఉపన్యాసం ఇస్తున్నది.

....విశాలమైన సభ। ఎటుచూసినా జనసందోహం। అడ్డంగా కట్టిన వాసాలను పడగొట్టుకుంటూ వేదికవైపుకు వచ్చేస్తున్నారు. వేదికమీద బాలదేవ్ పక్కనే లక్ష్మి కూర్చొనివున్నది. లక్ష్మి పాదాలచర్మంకూడా చిట్లిపోయింది. వేదికమీద తెల్లటి దుప్పటిమీద రక్తబిందువులు ఒక్కొక్కటీ టప్‌టప్‌మని శబ్దం చేసుకుంటూ పడుతున్నాయి. లక్ష్మి ఉపన్యసిస్తున్నది. ఎవరు? హరగౌరి? హరగౌరి లక్ష్మి మెడలో పూలదండ వేయడానికి ముందుకు వస్తున్నారు. లక్ష్మి పూలమాల వేయించుకోవడానికి ఇష్టపడలేదు; ఆ మాల తీసుకుని బాలదేవ్‌మెడలో వేసింది. బంతిపువ్వులదండ. ఆ పూలనుంచి లక్ష్మి శరీరపుసువాసన గుబాళిస్తున్నది. జనం వేదికవైపు తోసుకొస్తున్నారు. హరగౌరి ముందుకొచ్చాడు. లక్ష్మిని పట్టుకుంటున్నాడు. బాలదేవ్ అరవాలనుకుంటున్నాడు; కాని గొంతు పెకిలి రావడంలేదు. జనం గోలచేస్తున్నారు. బాలదేవ్ ఉన్నబలాన్నంతా ఉపయోగించి బిగ్గరగా కేక పెడుతున్నాడు - 'హరగౌరీబాబూ.'

గాంధీమహాత్మాకీ జై।

జై।

బాలదేవ్ ఉలిక్కిపడి లేస్తాడు. కళ్లు నులుముకుంటూ బయటకొస్తాడు- ఉదయమైంది. ఊళ్లోవున్న యువకులందర్నీ పోగుచేసి, ఊరేగింపు బయలుదేర దీసి కాళీచరణ్ జయజయధ్వానాలుచేస్తూ పెడుతున్నాడు. మహాబుద్ధిమంతుడవయ్యా కాళీచరణ్। సాహసవంతుడివికూడాను, బుద్ధిమంతుడివికూడాను. ఈ ప్రోగ్రాం ఎప్పుడు వేసుకున్నావయ్యా? బహుశా రాత్రే అనుకొనివుంటావు. మేరీగంజ్‌కూడా చన్నన్‌పట్టీలాగా మంచిపేరులోకి వస్తుంది. మరి, వేకువయామున వచ్చినకల?

'ఖేలావన్ అన్నా, ఎలావుంది ఆరోగ్యం?'

'రాత్రి నువ్వెప్పుడు తిరిగొచ్చావు? పీ కాలన్యం ఎక్కడైంది? పిపాయిల పేటలోనా? కాయస్థులూ, రాజపుత్రులూ ఏకమైనారు. ఇంకేముంది? స్వరాజ్యం వచ్చేసినట్టే। నువ్వేమైనా చెప్పు, బాలదేవ్। మనం వట్టి వెర్రిబాగులవాళ్ళమయ్యా. కాళీగాడ్ని కొంచెం కనిపెట్టివుండు. వాడిలో సద్గుణాలు చాలా వున్నాయి. ఆ విషయం ముందుముందు నువ్వే గ్రహిస్తావు. ఏదైనా ఉపద్రవం తెచ్చిపెడితే

మటుకు - ఆ బాధ్యత నాదికాదు. ఆ తరువాత యాదవులపేట పెద్దమీదికి ఏ మాటా రాకూడదు. ఈ కాయస్థుల్నీ, రాజపుత్రుల్నీ నమ్మనేకూడదు.'

మనసులోని బాధను ఎలా వెళ్ళగక్కుకోవాలో ఖేలావన్‌కు బోధపడలేదు. గొర్లకాపరి పాలు పిండడానికి పాత్రతీసుకొని వచ్చాడు. ఖేలావన్ ఈనాటికికూడా తానే స్వయంగా పాలు పిండుతూవుంటాడు. నలుగురి చేతులుపడితే బర్రెలు ఎండి పోతాయని ఖేలావన్ అంటూఉంటాడు. 'బర్రె చేపనేలేదు. పితకమని గొడవ చేశావు. ఎదవనాయాల! పూరీలు, జిలేబీలు ఇప్పుడే పంచిపెడుతున్నారా ఏమిటి? నీకు నోరూరుతున్నట్టుంది. ఇప్పటినుంచే! ....నమస్కారమండి, సిద్ధాంతిగారూ! నమస్కారం.'

సిద్ధాంతి చెవికి జంధ్యాన్ని తగిలించి, చేతులో చెంబుపుచ్చుకుని బావిదగ్గరకు బయలుదేరాడు. వెళ్ళేవాణ్ణి ఖేలావన్ ఆపివేశాడు - 'రండి సిద్ధాంతిగారూ, నీళ్ళక్కడికే తెప్పిస్తాను, రండి.'

'అబ్బాయి ఖేలావన్! చూస్తే ఊరికి స్వరాజ్యం వచ్చేసినట్టుగా కనిపిస్తున్నాది. మంచిదే! ఊళ్ళోని కుర్రకారంతా మంచి ఉత్సాహంగావున్నారు. వట్టి గొడ్డుకు అరుపులెక్కువన్నారు. అన్నిఉన్న విస్తరి అణగిమణగి ఉంటుంది. ఏమీ లేనిది ఎగిరిపడుతుందట. ఏమంటావు? ఇలాగే సిమర్‌బనీలోకూడా జరిగింది. సిమర్‌బనీలో మా మేనమామ వున్నాడు. పది పన్నెండు సంవత్సరాలక్రితం ఒక పర్యాయం మా మామయ్యగారింటి కెళ్లాను, వాళ్ళ పెద్దబ్బాయి యజ్ఞోపవీతానికి! ఉదయంలేచి చూద్దునుగదా. ఊళ్ళోని కుర్రకారంతా ఇలాగే జెండాలూ అవీ పుచ్చుకుని 'ఇంకిలాబ్ జిందాబాద్' అని అంటూ వీధులవెంట ఊరేగింపుగా బయలుదేరారు. 'ఏమిటి మామయ్యా విషయం?' అని అడిగాను. ఊళ్ళోని కుర్రజనమంతా వాలంటీర్లుగా చేరారని, 'ఇంకిలాబ్ జిందాబాద్' అంటే 'మేమంతా జీవించివున్న పులిపిల్లలం' అని చెప్పాడు. ఆ జీవించివున్న పులినికూడా ఆ సాయంత్రం చూశాను. స్కూలుకుపడమరగా పెద్దపెద్ద పొయ్యిలు ఏర్పాటుచేశారు. వాటిమీద కళాయిలుపెట్టి నీళ్ళను మరగబెడుతున్నారు. అదేమిటయ్యా అంటే కాంగ్రెసు తివారీగారు ఉప్పు తయారుచేస్తానన్నాడు. నేనూ అక్కడ నిలబడ్డాను. ఇంతలోకి జనంలో కోలాహలం బయలుదేరింది, పోలీసు లొస్తున్నారని. ఒక టోపీ పెట్టి

కున్న అధికారి, నలుగురు పోలీసులు స్కూలు అవరణంలోనుంచి రావడం చూశాను. ఇంకేముంది? నిల్చున్నవాళ్ళు నిల్చున్నట్టుగానే పలాయనం చిత్తగించారు. ఇంకిలాబ్ లేదూ, జిందాబాద్ లేదు. ఎక్కడిజెండాలు అక్కడ పడేసి అందరూ పరుగు లంగించుకున్నారు - బతుకుజీవుడా అనుకుంటూ। ఇనస్పెక్టరు తివారీని పట్టుకెళ్ళిపోయారు. ఆ తరువాత పోలీసులు ప్రతిఇంట్లోనూదూరి సోవాలు చేశారట। బజార్లో కేకలుపెట్టిన వాళ్ళెవరూ బయటికిరాలేదు అంతా గప్‌చుప్‌గా ఉండిపోయారు. ఆ తరువాత మళ్ళా కాంగ్రెసు ప్రభుత్వం వచ్చాక మళ్ళా ప్రతి ఒక్కడూ వాలంటీరుగా తయారైనాడని విన్నాను; మళ్ళా 'ఇంకిలాబ్ జిందాబాద్' అని వినాదాలు చేశారు. ఇనస్పెక్టర్ కనిపిస్తే చాలు, ఈ వినాదాలు మరింత మిన్నుముట్టేవి. 'ప్రభుత్వం మీది. ఎంత గొంతుచించుకున్నా మాకు పొయ్యేదేమీ లేదని పోలీసు ఇనస్పెక్టర్లు కోపాన్ని లోలోపల దిగమింగుకున్నారు. క్రిందటిసారి జరిగిన ఉద్యమసందర్భంలో ఆవేశంకొద్దీ పశువులమార్కెట్టు తగలబెట్టి సారాయిదుకాణం కొల్లగొట్టారు. ఆ రెండోరోజున నాలుగు లారీలనిండా తెల్ల మిలిటరీ వాళ్ళొచ్చారు. ఊరికి నిప్పంటించారు. ఆస్తిని దోచుకున్నారు, గంటలో ఊరిని ఒక కొలిక్కి తీసుకొచ్చారు. ఏభైమందిని అరెస్టు చేశారు; ఇద్దర్ని స్పృహతప్పేలా కొట్టారు. ఇంగ్లీషువాళ్ళను ఎదుర్కోవడం మాటలా? మత్తగజాలముందు ఊరకుక్కల అరుపు ఏపాటిది? ఈమధ్య కాస్తంత మెత్తగా వున్నారేమో, మళ్ళా ఎగిరెగిరి పడుతున్నారు। ఈసారి వాళ్ళు తలుచుకుంటే వీళ్ళపని ఖాళీయే।'

'అలా అనకండి సిద్ధాంతిగారూ।' ఆ తరువాత బాలదేవ్ వినలేకపోయాడు. 'క్రిందటిసారి ఉద్యమసందర్భంలో గవర్నమెంటును ముప్పుతిప్పలుబెట్టి ఏడాదు చెరువులనీళ్ళు తాగించారు. సిమర్‌బనీనిగురించి మీరు చెప్పాక, అక్కడికి మీరీమధ్య వెళ్ళారా? వెళ్ళలేదనుకుంటాను. ఒకపర్యాయం వెళ్ళి చూసిరండి. ఆస్పత్రి. స్కూలు, ఆడపిల్లలస్కూలు, చరఖాకేంద్రం - ఒకటేమిటి - ఎన్నో ఏర్పడ్డాయి. ప్రతిఇంట్లోనూ ఇంగ్లీషు చదువుకున్నవాళ్ళు కనిపిస్తారు. శివానందబాబును ఎరుగుదురా మీరు? వాళ్ళబ్బాయి రమానంద్ మాతోపాటు జైలులో వున్నాడు. ఈసారి ఆపీసరయిపోతాడు.'

ఖేలావన్‌కూడా ఏదో చెప్పబోయాడు. ఇంతలోనే గొడ్లకాడిబుడ్డాడు కేకేశాడు - బర్రె చేసిందని।

ఖేలావన్ పాలు పితకడానికి వెళ్ళిపోయాడు. బాలదేవ్‌కు కబుర్లుచెప్పే తీరిక లేదు. ఊళ్ళో ఎక్కడబడితే అక్కడ జయజయధ్వానాలు వినిపిస్తున్నాయి - 'గాంధీమహాత్మాకీకి జై!'

## ఏడు

ప్యారూచుట్టూ అందరూ గుమిగూడారు. ప్యారూ డాక్టరుగారి నౌకరు! డాక్టరుగా చెప్పుకొస్తారు? నీ పేరేమిటి? ఏం కులం? నిజంచెప్పు! అబద్ధం చెప్పకు! జంధ్యం లేదుగా?

బాలదేవ్ ప్యారూను ఆ గుంపులోనుంచి బయటికి తీసుకొచ్చాడు. ఏమయ్యోయ్? 'మీరు మనిషిని చూడలేదా ఏమిటి ఇంతకుముందు? మీపని మీరు చూసుకోండి. మిఠాయి వండేవాళ్ళదగ్గర ఎవరైనా వున్నారా? వాళ్ళ హెడ్‌గారు ఏమంటున్నారు?'

బాలదేవ్ అందరిపేరుచివరా 'గారు' తగిలిస్తాడు. రామకృష్ణ ఆశ్రమంలో నాయకులు ఇలాగే అందరిపేర్లచివర 'గారు' చేర్చి పిలుస్తూఉంటారు - 'డ్రైవరుగారు', 'కంట్రాక్టరుగారు', 'హరిజన్‌గారు'.

వాకబుచేయగా తెలిసినవిషయమేమిటంటే ప్యారూ డాక్టరుగారిదగ్గర నౌకరుగా పనిచేసేందుకు వచ్చాడు. రౌతహట్ స్టేషన్‌దగ్గర్లోవున్న హోమియోపతి డాక్టరుదగ్గిర ప్యారు అయిదుసంవత్సరాలపాటు నౌకరుగా వున్నాడు. ఆయన స్వదేశం తిరిగిపోయాడు. మేరీగంజ్‌లో ఆస్పత్రి పెడుతున్నారనితెలిసి డాక్టర్‌గారి దగ్గరికి నౌకరుగా పనిచేసేందుకు ఇక్కడికొచ్చాడు.

అటుకులు, బెల్లం ఫలహారం చేశాక ప్యారూ బాలదేవ్‌తో - 'అయ్యా, డాక్టరుగారిసామాను ఎక్కడున్నదో చూపించండి. కుర్చీ, బల్ల వగైరా సర్దుతాను. అలమరుతుడిచి శుభ్రంగా వుంచాలి. నీళ్ళపాత్రఒకటి వెడల్పు మూతిగలది కావాలి. దానిపక్కనే సబ్బు, తుండుగుడ్డ వుంచాలి. డాక్టర్‌గారు రావడంతోనే ముందు సబ్బుతో చేతులు కడుక్కుంటారు!' అని అన్నాడు.

ప్యారీ కుర్చీ, బల్ల వేశారు. మూడుకాళ్ళ ఇనపచువ్వల పీటమీద వెడల్పు మూతిగల కొయ్యపాత్రను గుండ్రని కడ్డీలో దిగేశారు. ఆ పాత్రకు పంపున్నది. పంపుతిప్పితే నీళ్ళు వస్తాయి. పెట్టెలోనుంచి తుండుగుడ్డతీసి వేలాడేశారు. గొర్రె బొచ్చులాంటి తుండుగుడ్డ. సబ్బు. సబ్బులేదా? బట్టలుతికే సబ్బుకాదు; వాసన సబ్బు కావాలి. భగత్ దుకాణంలో వాసనసబ్బు దొరకకేం? కటిహార్‌లో దొరుకు తుంది. తాసిల్దార్‌గా రమ్మాయి కమలి వాసనసబ్బుతో స్నానంచేస్తే ఊరంతా ఘుమఘుమలాడిపొయ్యేది. తాసిల్దార్‌గారు కమలినడిగి సబ్బు తెమ్మన్నారు..... మొత్తానికి ప్యారూ డాక్టరుదగ్గిర ఉద్యోగం చేయడానికి అనుభవంవున్న పాకనౌకరే! సమయానికి వచ్చాడు. లేకపోతే ఇవన్నీ అమర్చడం కొంచెం కష్టమయ్యేది. డాక్టరుగారుకూడా వచ్చేవేళయింది. 'గురకొయ్యలు పొడవకముందే ఎడ్లబళ్ళు పంపించాను—చౌకీదారు ఆగమూనిచ్చి!' అని తాసిల్దారుగా రన్నారు.

ఊరంతా గుబాళించిపోతున్నది. తిరునాళ్ళలోకూడా ఇలాంటివాసనే వేస్తూ ఉంటుంది. తాసిల్దారుగారి చావిట్లో మిఠాయి వండేవాళ్ళు ఉదయంనుంచే పూరీలు, జిలేబీ వండుతున్నారు. పూరీలు ఒకరా! బోశారు. ఊళ్ళోనిపిల్లలు అక్కడ ఏకం అయ్యారు. రాజపుత్రపేట, కాయస్థులపేట పిల్లలు వేరేపేటల పిల్లల్ని ఆ ఛాయ లకే రానివ్వడంలేదు. 'ఏయ్! అంటు తగులుతుంది. వెళ్ళిపోండి.' అని తరిమే స్తున్నారు.

సింగ్‌గారు స్వయంగా వెళ్ళి ఖేలావన్ సింహయాదవ్‌ను బలవంతంగా తీసు కెళ్ళారు.

'అయ్యా తాసిల్దారుగారూ! విందుకుముందే ఇతగాడిపొట్ట వాయువుతో ఉబ్బిపోయింది. ఇదుగో అబ్బాయ్! ఆడవాళ్ళలాగా సిగ్గుపడితే లాభంలేదు. ఏమం టారు తాసిల్దారుగారూ! అవునంటారా? మాటామాటావస్తే పోట్లాడుకుంటాం; మళ్ళా వెంటనే కలుసుకోవాలి. ఇలా ఎడమొహం పెడమొహంగావుంటే ఎలాగు? నీ ఆరోగ్యంసంగతి నా కిప్పుడే బాలదేవ్ చెబితే తెలిసింది. వెళ్ళి చూద్దునుగదా, మంత్రతంత్రాలు జరిపిస్తున్నారు. ఇదుగో బాలదేవ్, డాక్టరుగారు రావడంతోనే ముందుగా ఇతనికి వైద్యం చేయించు. ఏమంటావు? ఆఁ....ఎనిమిదోనెల అని కూడా చెప్పు....!'

అ హ్హ హ్హ హ్హ హ్హ హ్హ....అ హ్హ హ్హ।

'రామకృపాల్ అన్నగారూ। కుర్రవాళ్ళతోకూడా మీరు పరిహాసాలాడ తారు।....మంచివారే। సరే. ఇక నన్నొదలండి. మనవాళ్ళంతా ఇక్కడే వున్నారు. నేను లేకపోయినా ఫరవాలేదుగదా అని ఇంటిదగ్గరే వుండిపోయాను.'

సింగ్‌గారు చాలా హుషారైన మనిషి. ఉదయంనుంచి అందర్నీ నవ్విం చేస్తున్నారు. ఖేలావన్ కొంచెం పెడమొహంగా వుండడం గమనించి, ఇంటికెళ్ళి మరీ లాక్కొచ్చారు. సిద్ధాంతిగారు రాలేదు. పళ్ళు నొప్పిగా వున్నాయన్నారు. 'ఈమధ్య డాక్టర్లు నకిలీపళ్ళు కడుతున్నారు. డాక్టరుగారితో చెప్పి సిద్ధాంతిగారికికూడా పళ్ళు కట్టించనయ్యా। ఇదేమైనా పెళ్ళిచూపుల వ్యవహారమా ఏమిటి, పిల్లతరఫు వాళ్లు పళ్లు సరిగా వున్నాయో లేదో చూసి మరీ చూస్తారనుకోవడానికి?'

'డాక్టరుగారొస్తున్నారు।'

'వస్తున్నారా? ఏరీ?'

'అందుదు ఎడ్లబళ్లూ పల్లెవాళ్ళపేటదాకా వచ్చాయి. చౌకీదారు అగమూ ముందు వచ్చేస్తున్నాడు. పరుగెత్తుకుంటూ. డాక్టరుగారు తలమీద టోపీ పెట్టుకున్నారు.'

'అగమూ వచ్చేశాడు. భుజంమీద ఏమిటో వున్నది, పెట్టెమో?'

చేస్తున్న పనిపాటలువదిలేసి అందరూ గుంపుగా ఒకచోట చేరారు- 'డాక్టరు గారు వస్తున్నారు।'

'కొంచెం పక్కకు తప్పుకోండి.' అగమూ అంటున్నాడు - డాక్టరుగారు దీన్ని జాగ్రత్తగా పెట్టమన్నారు. దెబ్బ తగలకూడదట. కరెంటుతీగెలు లేనిమిషను.'

'దీన్ని రేడియో అంటారు. రేడియో। ఇక రోజూ మీరు బొంబాయి, కలకత్తాపాటలు వినవచ్చు. గాంధీగారి వార్తలు, బజారుధరలు అన్నీ వస్తాయి. తీగె నొక్కినొక్కడంతోనే కోపంవచ్చి మాట్లాడేస్తుంది - 'మూర్ఖుడా।' అని. 'ఇవ్వాళ్ళ మొహం కడుక్కోలేదా?' అని అడుగుతుంది. మొఖం కడుక్కోకుండా దాని కెదురుగా కూర్చుంటే। అని బాలదేవ్ చెప్పాడు.

'అన్యాయమైన సంగతులు।'

డాక్టరుగారు!

అందరూ చేతులు జోడించి నిలబడ్డారు. డాక్టరుగారు నవ్వుతూ అందరికీ నమస్కారిస్తున్నారు. బాలదేవ్ 'జై హింద్' అన్నాడు. ఆయననుచూసి ఈమధ్య కాళీయాకూడా మొదలుబెట్టాడు. ప్యారూ పందిరిలోకి కుర్చీ ఒకటితెచ్చి వేశాడు. డాక్టరుగారి చేతిలోనుంచి టోపీ తీసుకున్నాడు. డాక్టరుగారిమొహం బాగా ఎర్రగా వున్నది. మీసాలు పూర్తిగా తీసివేశారు.

బాలదేవ్ చేతులుజోడించే అడిగాడు - 'ప్రయాణంలో మరేమీ ఇబ్బంది కలుగలేదుగదండీ?....అన్నీ సిద్ధంగావున్నాయి. భోజనానికి లేవండి. అఁ.... చూడండి. ఈయనగారిపేరు విశ్వనాథప్రసాద్. పారబంగా ప్రాంతానికి తాసిల్దారు. వీరిపేరు రామకృపాల్‌సింగు. సిపాయి....రాజపుత్రపేటకు పెద్ద. ఈయనపేరు ఖేలావన్‌సింహయాదవ్. యాదవక్షత్రియపేట మూలవిరాట్టు ఈయన కాళీచరణ్. ఉత్సాహవంతుడైన యువకుడు. వీళ్ళంతా స్కూల్లో చదువుకునే కుర్రకారు!.... రండి. మీరంతా డాక్టరుగారితో మాట్లాడండి. ఈ పూరి మహంతుగారు ఆస్పత్రి ఏర్పాటవుతున్నసందర్భాన్ని పురస్కరించుకుని గ్రామస్థులకు సమష్టి విందొకటి ఏర్పాటుచేశారు.'

డాక్టర్‌గారు మరొకసారి అందరికీ నమస్కరించారు. 'చూడండి. నే నిప్పు డప్పుడే భోంచేయనులెండి. ముందు అందరిభోజనాలు కానివ్వండి.' అని అన్నారు.

నిజంగా ప్యారూ అనుభవమున్న నౌకరే! డాక్టరుగారు ముందుగా సబ్బుతో చేతులు కడుక్కున్నారు.

మఠంనుంచి మహంతుగారు, దాసి లక్ష్మి, రామదాసు, మరో ఇద్దరుభక్తులు వచ్చారు. మహంతుగారి ఎద్దుబండిముందు ఒక సాధువు కొమ్ముపాయిద్యం వూదు కుంటూ వస్తున్నాడు. ధు తు తు తు S S....ధు తు తు! ఇలాంటి వాయిద్యం విని పించినప్పుడల్లా ఊళ్ళోవున్న కుక్కలన్నీ మొరగడం ప్రారంభిస్తాయి. చిన్న చిన్న కుక్కపిల్లలుకూడా గొంతు బొంగురుపోయేట్టు అరుస్తాయి. కొత్తగా మొరగటం నేర్చుకున్నాయేమో! ముందుగా కాళీకాదేవిగుడిలో నైవేద్యం పెట్టడం జరుగు తుంది. ఆతరువాత బంగళాచుట్టూవున్న అడవిలోపలికి రెండుపూరీలు విసిరి

వేస్తారు - అడవిలోవుండే దేవీ దేవతలకు, భూతప్రేతాలకు నైవేద్యంగా। ఆ తరువాత సాధువులకు, బ్రాహ్మణులకు భోజనాలు వడ్డిస్తారు. బాలదేవ్ ఎంతచెప్పినా డాక్టర్‌గారు వినిపించుకోనేలేదు. ప్యారీ చెప్పింది నిజమే ననిపించింది. డాక్టర్లు మిఠాయి వండేవాళ్లు తయారుచేసే పూరీలు తినరట. మిషను పొయ్యిమీద ప్యారీ డాక్టర్‌గారికోసరం వంట వండుతున్నాడు. తొందరగా భోజనాలు పూర్తిఅయితే బావుండును; రేడియోలో పాటలు వినవచ్చు. ఈరోజు పాటలుండవా ఏమిటి? ఎలావుంటాయి పాటలు? కటిహార్ జంక్షన్‌లో రైళ్ళమోత, మిల్లులగోల - వీటి మధ్య ఆ వార్తలు ఎలా వస్తాయి? పాట ఎలా వినిపిస్తాయి?

'బిజయ్। బిజయ్।'

'ప్రతి పేటవాళ్లు వేర్వేరుగా కూర్చోండి. మీ పక్కన మీ ఆడవాళ్ళకు వేరుగా విస్తళ్ళు వేయండి. తక్కువా వద్దు, ఎక్కువా వద్దు.'

గొల్లలపేట ముసలి రౌదీని అందరూ ఏడిపిస్తున్నారు. రౌదీగోప్ ఊరూరూ తిరిగి పెరుగు అమ్ముతూ ఉంటాడు. ఆకారాది నడక, మాటకేక - అన్నీ ఆడవాళ్ళ విగా ఉంటాయి తలముడినుంచి. ఎవరురొమ్ములమీదినుంచి ఏమాత్రం గుడ్డ తొలగిపోయినా, ఆడవాళ్ళకుముల్లేనే వెంటనే సర్దుకుంటూ ఉంటాడు. మగవాళ్లతో మాట్లాడేప్పుడు సిగ్గుపడతాడు. ఆడవాళ్ళు అతనిముందర ఎలాంటి అరమరికలు పాటించరు. సంతకు వెళ్ళేప్పుడు, పల్లె తిరిగివచ్చేప్పుడుకూడా ఆడవాళ్ళతోనే వుంటాడు. అందరూకలిసి రౌదీని ఏడిపిస్తున్నారు - 'ని విస్తరి ఇంట్లో వేయిస్తాం. అదుగో, లాల్‌చన్ నీకోసరం విస్తరి వేయించాడు.'

ఓరే! పోండిరా సచ్చినోళ్ళలారా। ముసలివాళ్ళను ఎగతాళిచేయడానికి మీకు సిగ్గెట్లా లేదంట? మీ నాయనమ్మలతోను, అమ్మమ్మలతోకూడా ఇలాగే ఎకసక్కాలాడతారంట్రా? ఊళ్ళోని కుర్రకారంతా చెడిపోయారు। అన్నిటికీ మూలం ఈ సంఘవాగాడు। ముసలివాళ్ళతీరే ఇట్లావుంటే, ఇక పిల్లల్ని అనే పనేముంది।....
ఏమ్రా। నామాట నిజమేనంటారా?....ఊ!'

మహంతుగారు రాత్రిపూట భోంచెయ్యరు.

'హే సద్గురు। డాక్టరుగారూ। మీకు జీతమెంత? రెండొందలా? పైరాబడి

ఏమైనా వుంటుందా? 'ముఖ్యమైంది పైరాబడేగా?....మంచిదే. గాంధీజీ ఎలాగైనా అవతారపురుషుడు!....డాక్టరుగారూ! ఇప్పటికి ఏడుసంవత్సరాలపూర్వం నాకు కళ్లు వచ్చాయి. ఆ తరువాత రెండుమాసాలవరకు కళ్ళు ఎర్రగా వుండిపోయాయి. పూర్ణియాలోని సివిల్‌సర్జన్‌కు ఏభై రూపాయలఫీజు ఇచ్చుకుని పరీక్ష చేయించుకున్నాను. చాలారోజులు చికిత్సకూడా చేయించుకున్నా; కాని ఫలితం లేకపోయింది. ఇప్పుడు మీ రొచ్చారిక్కడకు! మీరు మా ఇంటి డాక్టరుతో సమానం!' ....

దాసి లక్ష్మి ఏకదీక్షగా డాక్టర్‌గారివైపు చూస్తున్నది....అబ్బా! ఎంత అందమైన మనిషి? పాపం, ఈ పాడుపల్లెటూళ్లో ఎలా తోస్తుందో ఏమో? ఏది ఏమైనా ఉద్యోగం ఉద్యోగమేగా! మనస్సంతా ఇంటిమీదే వుండివుంటుంది. పెళ్లాం పిల్లలు గుర్తుకొస్తూ ఉండవచ్చు. నాలుగురోజులుగడిస్తే అదే అలవాటవుతుంది. ఆ తరువాత వెళ్ళి పెళ్ళాం పిల్లల్ని తెచ్చుకుంటాడు. ఉండి ఉండి ఒక్కసారిగా ఆయన్ను ప్రశ్నించింది - 'ఏమండీ డాక్టరుగారూ! మీ ఇంటిదగ్గర ఇంకెవరున్నారండీ?'

'ఆఁ....ఏమన్నారు?' కొంచం నవ్వుతూ డాక్టర్ అన్నాడు - 'ఇంక నాకెవరూ లేరు. తల్లి దండ్రులిద్దరూ నా చిన్నతనంలోనే పోయారు.'

ఈ ప్రశ్న అడిగివుండవలసిందికాదని లక్ష్మి ఆ తరువాత అనుకున్నది. అసలు తానలాంటిప్రశ్న అడిగినందుకు తనకే ఆశ్చర్యం వున్నది. ఎందు కడగాలి?....నాకెవరూలేరు! 'లక్ష్మీ రామదాసును పిలువు. అయ్యో, డాక్టరుగారూ! నా కిక శలవిప్పించండి. మీరుకూడా భోజనంచేసి కాస్త విశ్రాంతి తీసుకోండి. వీలుచూసుకుని మఠాన్ని దర్శించండి. 'దర్శనం, స్పర్శ, సత్సాంగత్యంవల్ల మనసులోని మాలిన్యం మరుగుపడదే' అన్నారు సద్గురు!'

లక్ష్మి చేతులెత్తి నమస్కరించింది.

బ్రాహ్మణపేటవాళ్లు బాలదేవ్‌ను - 'డాక్టరుగారి నౌకరు హిందూ ఎరుకలవాడటగా! మరి డాక్టర్‌గారు ఏం కులస్థులో? ఎరుకలవాడు వంటజేస్తే భోంచేస్తారా. డాక్టర్‌గారు?' అని అడిగారు.

'మీరంతా ఒక్కసారి ప్రేమతో అనండి! 'మహాత్మాగాంధీకి జై!'

విందుభోజనం ముగిసింది. ఏ లోటూ రానివ్వలేదు. అందరికి సంతృప్తి కలిగింది. ఎవరైనా మిగిలిపోతే, వాళ్ళవంతు రేపువచ్చి పట్టుకెళ్లవచ్చు.

బాలదేవ్, చౌకీదారు అగమూ, బిరంచీలతోపాటే ఆస్పత్రిలో పడుకుంటారు. ఈ రోజు మొదటిరాత్రి।

## ఎనిమిది

లక్ష్మికికూడా నా అనేవాళ్ళెవరూ లేరు.

....ఏమన్నారూ?....నా కెవరూ లేరంది। లక్ష్మి ఆలోచనలో మునిగిపోయింది. తన మనస్సు ఎందుకిలా మెత్తబడిపోతున్నది? ఇలా ఎందుకు ఇంతగా ద్రవిస్తున్నది? ఇది మంచి లక్షణంకాదు. హే సద్గురూ। నాకు శక్తిని ప్రసాదించు।

ఆమెకు సద్గురు మినహా మరెవరూ లేరు. తల్లి ఎలా వుంటుందో తెలియనే తెలియదు. ససరాహా మఠానికి సమీపంలోవున్న తన గుడిసెమాత్రం బాగా గుర్తున్నది. ఉదయం కావడంతోనే తనతండ్రి భుజంమీద ఎక్కించుకొని మఠానికి తీసుకెళుతూ ఉండేవారు. మహంతు రామగోసాయి ఎంత ప్రేమగా వుండేవారు - 'వచ్చావా లచ్చీ? పటికిబెల్లం తింటావా। టీ తాగుతావా?' అని అడిగేవారు. ఒక గిన్నెలో టీ, అటుకులూ తెచ్చి ఇచ్చేవాడు - వంటతను। నాన్న అక్కడ కూర్చొని మహంతుగారికి గంజాయి తయారుచేసేవాడు. ఒకటి, రెండు, మూడు చిలుములు తయారుచేసి ఇచ్చేవాడు. గంజాయి తాగేప్పటికి మహంతుగారికళ్ళు చింతనిప్పుల్లాగా తయారయ్యేవి. అప్పుడప్పుడు నాన్నకూడా పడికిపోయేవాడు. వంటతను పెరుగుతెచ్చి ఇస్తూ - 'రామచరణ్। ఈ పెరుగుతిను. నిషా కాస్త తగ్గుతుంది' అనేవాడు. నన్నంటే మహంతుగారుకూడా ఎంతో ప్రేమగా వుండేవారు. ప్రత్యేకించి పనేమీ ఉండేదికాదు; పగలల్లా మహంతుగారిదగ్గర కూర్చొని గంజాయి గొట్టం నింపుతూ కూర్చునేవాడు. తిండీ తిప్పలన్నీ మఠంలోనే జరిగిపోయేవి.

ఊళ్లో ఒకపర్యాయం కలరావ్యాపిస్తే నాన్నతో మహంతుగారు - 'రామచరణ్। వచ్చి మఠంలోనే వుండు।' అని అన్నారు. ఆరోజుల్లో గంజాయిగొట్టం

అరవిచ్చేవారుకాదు. ఒకరోజున మహంతుగారి బీజక్ పారాయణగ్రంథం కాలి పోయింది. గంజాయి గొట్టంలోని నిప్పురవ్వలు ఆ గ్రంథంమీద పడివుంటాయి. మహంతుగారు కన్నీరుకారుస్తూ - 'రామచరణ్! అమంగళం జరిగిపోయిందయ్యా! భగవంతుడికి నామీద కోపంవచ్చింది. శిక్ష అనుభవించవలసిందే!' అని అన్నారు. ఆ రెండవరోజున మఠంలోని ఒక సాధువుకు విరేచనాలు కావడం ప్రారంభ మయ్యాయి. మూడవరోజున ఆ సాధువు కాస్తా కన్నుమూశాడు. దాంతో మహంతు గారికి జబ్బు చేసింది. నాన్న ఆయనకెంతో సేవచేశారు. ఆయన దేహంచాలించే ముందు - 'రామచరణ్! చివరిసారిగా నీ చేతులమీదుగా గంజాయి తాగించు!' అని అడిగారట!

నాన్న గంజాయిగొట్టంలో నిప్పు వేసుకరావడానికి అగ్నికుండందగ్గరకు వెళ్ళేప్పటికి అందులోనే వాంతి చేసుకున్నారు. మహంతుగారు సాయంత్రం కన్ను మూస్తే నాన్న ఆ ఉదయమే హరీ అన్నారు. వంటాయన దూరంనుంచి నాన్నను నాకు చూపించాడు. 'చనిపోయినమనిషికి దగ్గరగా వెళ్ళకూడదు!' అని ఆయన చెప్పారు.

'లక్ష్మి! ఓ లక్ష్మి!!'

'వస్తున్నా!' లక్ష్మి విసుక్కుంటూ లేచింది. ఆ రోజున బీజక్ పారాయణ గ్రంథంమీద ఒట్టు వేసుకొని మరీ చెప్పారు; మళ్ళా ఇవ్వాళ్ళ పిలవడం మొదలు బెట్టారు. 'హే సద్గురూ! ఈ దాసిని నీ దగ్గరకు పిలిపించుకోవయ్యా మహానుభావా!'

'లక్ష్మి!'

'మహంతుగారూ! మనస్సును ప్రశాంతంగా వుంచుకోవడానికి ప్రయత్నిం చండి. సద్గురుధ్యానంలో నిమగ్నులు కండి. మాయాప్రపంచాన్ని మరచిపోండి ...'

'లక్ష్మి! అంతా మాయ! జగమంతా మిధ్య! ఏదీ, ఒకసారి ఇలారా.... నా చెంతకు!'

అంధుడైనవాడి కబంధహస్తాలలో వెయ్యి ఏనుగులపట్టు వుంటుంది. ఆ పట్టు విడిపించుకోవడానికి లక్ష ప్రయత్నాలుచేసినా ప్రయోజనం శూన్యమే అవుతుంది. అది హస్తమా లేక కంసాలి పట్టకారా? తోపినోటి దుర్గంధం.... చొంగ.... !!

'మహంతుగారూ! మహంతుగారూ!! వినండి, నా మాట కాస్త వినండి. రామదాసు అగ్నికుండందగ్గరే వున్నాడండి! మహంతుగారూ! ఏమయ్యోయ్, రామదాసూ! ఓ రామదాసూ! త్వరగా ఇలా వచ్చి కాస్త చూడు, మహంతుగారి కేమిటో అయిందీ.'

మహంతుగారు సద్గురు సాన్నిధ్యాన్ని చేరుకున్నారు.

ఉదయానికి ఊళ్ళోవాళ్ళంతా ఏకమయ్యారు. మహంతుగారు మహా సిద్ధ పురుషుడు. అభీష్టించినవిధంగా మృత్యువు లభించింది. రాత్రికేమో ఊళ్లోవాళ్ళందరికి విందుభోజనం ఏర్పాటు చేయించారు. ఆ తరువాత శరీరత్యాగం చేశారు. ప్రపంచంలో అందరికీ అటువంటి స్వర్గప్రాప్తి సంప్రాప్తించదు. మహాజ్ఞాని. మహానుభావుడు!

'విందు ముగిశాక మహంతుగారు లోపలికొచ్చి ఆసనంమీద ధ్యానముద్రలో కూర్చుండిపోయారు. అప్పు డాయనశరీరంనుంచి జ్యోతి బహిర్గతం కావడం నాకు కన్పించింది. దోమతెర తరదామని వెళ్ళాను. వద్దని వారించారు. నేను ఈ అగ్నికుండందగ్గర కూర్చొని పరికిస్తూ ఉండిపోయాను. ఆ జ్యోతి మరింత తేజోవంతమైంది; మహంతుగారు శిశువుగా మారిపోయారు. ఆ తేజోవంతమైన కాంతికి నా కళ్ళు మూతబడ్డాయి. నేనక్కడే అగ్నికుండందగ్గర నిద్రపోయాను. దాసి లక్ష్మి కేకలుపెడితే మెలకువ వచ్చింది' అని రామదాసు చెప్పాడు.

లక్ష్మి ఏమీ మాట్లాడలేదు. సాధువులకు ధూళి పంచిపెట్టే విధానంకూడా ఆమెకు తెలీదు. జటాజూటాలు పెంచుకొని చేతిలో కమండలం పుచ్చుకుంటేవాలు సాధువైపోతాడు ...'చరణ్‌దాసూ! ముందుగా బీజక్ పారాయణం జరగాలి. ఆ తరువాతనే ధూళి వితరణ! సాధువులంతా సమాధిదగ్గరకు రావాలి. అక్కడ ధూళిపంచి పెట్టడం జరుగుతుంది. ఆమాత్రం తెలియదూ?'

అందరికంటే ముందుగా రామదాసు ధూళి వేశాడు. ఆ తరువాత లక్ష్మి గుప్పెటనిండా వున్నధూళిని మహంతుగారి తెల్లటి వస్త్రంమీద ధారవిడిచింది. ఆ తరువాత పుష్పమాలలు! సాధువులు పారలతో గోతిని మట్టితో నింపారు. 'మహంతుగారిని కలుపుకుని ఇప్పటికి పదిమంది మహంతులకు ధూళిని వేయించాను. ధూళి వేయించడమే తెలియదా?' అని అన్నాడు, చరణ్‌దాసు.

ఊళ్ళోని హరికథకులు కీర్తనలు పాడడం ప్రారంభించారు—

గూటి చిలుక లేదిరా!
చిన్నన్నగూడు చినబోయెరా।
మేలుకొనవే రాజహంసా।
మేలుకొనవే ఓ చైతన్యమా।
మేలుకొనవో కనులు తెరచీ
మేలుకోగదవే జీవా।

ఈ కీర్తనతరువాత రామదాసు ఖంజీరా వాయిస్తూ మరో వేదాంతతత్వం అందుకున్నారు—

ఈ హంస ఎక్కడనుంచి వచ్చెరా రామా
మరల ఎక్కడికి పోయెనురా!
డిమి డిమిక్ డిమిక్....
ఈ హంస ఎక్కడనుంచి వచ్చెరా రామా।

'జై సద్గురు మహాప్రభువుకీ జై। మహంతుగారికి జై। సాధుపుంగవులకీ జై।'

మఠమంతా శూన్యంగా కనిపిస్తుంది. జీవితంలో మొదటిసారి మహంతుగారి విలువను లక్ష్మి గుర్తించింది. కళ్ళు లేవు; ఏమీ కనిపించదు। రామదాసు సహాయంలేనిదే అడుగుతీసి అడుగు వేయగలిగేవారు కాదు; అయినా మఠంనిండా మనుషుల్ని కల్పించేవారు. అంతా నిండుగా వుండేది. మహంతు లేకపోయేటప్పటికి ప్రాణంలేని శరీరంలాగా అయిపోయింది — మఠం.

గాజు, కొయ్య పంజరమిది
దీపంలేదు, వత్తిలేదు
హంస ఆకాశానికి ఎగిరిపోయె
ఎవరూ వెంటలేరురా।

ఏది ఏమైనా మహంతుగారు ప్రపంచంలో ఎవ్వరికీ ఇవ్వనంత ప్రాముఖ్యం ఆమె కిచ్చారు. ఎంతో మిన్నగా ప్రేమించారు. యౌవ్వనంలోవున్నప్పుడు వద్దుర

కృపవల్ల ఈ మాయాప్రపంచాన్ని జయించి బ్రహ్మచారిగా వుండిపోయారు. వృద్ధా ప్యంలో ఇంద్రియాలు శిథిలమైపోతాయి. మాయామోహాలధాటిని తట్టుకోలేవు. అందుకే సాధువు - బ్రహ్మచారులు వృద్ధాప్యంలో మాయామోహజాలంలో చిక్కుకు పోతారు. ఇందులో మహంతుగారి దోషమేమీలేదు. దౌర్భాగ్యం ఆయన్ను ఆవరిం చింది - లేకపోతే మహంతుగారు సద్గురుపథంనుంచి చలించివుండేవారే కాదు. ఇది ధృవసత్యం. దోషమేదైనావుంటే లక్ష్మిదే। ఒక బ్రహ్మచారిని ధర్మభ్రష్టుణ్ణి కావించేపాపానికి ఆమె ఒడిగట్టింది. ఆమె కిప్పు డెవరు దిక్కు? ఎవరూ లేరు।

'మహంతుగారూ। మహంతుగారూ। మమ్మల్నివదలి మీ రెక్కడి కెళ్ళారు? ఈ దాసి తప్పుల్ని మన్నించండి మహాప్రభూ। జీవితంలో మీకు నేను హృదయ పూర్వకంగా సేవచేయలేకపోయాను। మరణించేసమయంలోకూడా మీకు నేను సుఖాన్ని అందించలేకపోయాను. ప్రభూ। నన్ను మన్నించండి.'

జీవితంలో ఇంతవరకు ఏకమైవున్న కన్నీరు కాస్తా ఈరోజు ప్రవహిస్తు న్నది. ఎంత ఆపినా ఆగటంలేదు.

'జైహింద్ లక్ష్మిగారూ।'

'సద్గురుదయ। బాలదేవ్‌గారూ. కూర్చోండి.'

బాలదేవ్ అన్నీ మరచిపోయాడు. లక్ష్మిని ఊరడించడానికి ఎన్నెన్ని సంగతులు ఆలోచించాడో. ఏమేమి వృత్తలు. కవిత్వాలు మనస్సులో అనుకున్నాడో అన్నీ మటుమాయమై పోయాయి. ఒక్కటీ గుర్తురాలేదు. మాయాగారు గుర్తు కొచ్చారు. మాయాగారి ఆ రూపం.... 'గంగా జమునలధారగా కన్నీరు ప్రవహిం చెగా....।'

బాలదేవ్ ఆలోచించిన సాంత్వనావచనాలు ఈ తీవ్రతముందు నిరర్థకంగా మారివుండేవి. బాలదేవ్ కళ్ళుకూడా చెమర్చాయి. ఫాల్గుణంలోకూడా వరద లొస్తాయి. మనస్సును దిట్టపరచుకొని - 'లక్ష్మిగారూ। అంతా ఆ పరమేశ్వరుని మాయ। మంచిచెడ్డలు. జీవనమరణాలు. జయాపజయాలు అనేవి అన్నీ ఆ బ్రహ్మ దేవుడిచేతిలో వున్నాయి. నేను సూర్యోదయానికిముందే డాక్టర్‌గారితో బయటికి వెళ్ళిపోయాను. డాక్టర్‌గారికి ఊరు చూపించాను. దక్షిణాన సంథాలపేటనుంచి

ప్రారంభించి ఎరుకలపేట వరకూవున్న సందుగొందులన్నీ తిప్పి చూపించేప్పటికి పదిగంటలయింది. అక్కడే మహంతుగారు దేహం చాలించారని ఎవరో చెప్పారు. డాక్టరుగారుకూడా చాలా బాధపడ్డారు. వారు ఆస్పత్రికి తిరిగివెళ్ళారు; తక్కిన పేటలు రేపు చూపిస్తాను. ఇవ్వాళ్ళ రౌతహట్ సంతలో దప్పు వేయించాలి - ఆస్పత్రి తెరిచారని! మాదిగ కోటన్నను అక్కడకు పంపించి నేనూ వచ్చాను' అని అన్నాడు.

లక్ష్మి కళ్ళనుంచి కన్నీళ్లు ప్రవహించడం ఆగిపోయింది. బాలదేవ్ సమయానికి వచ్చారు. మహంతుగారు బాలదేవ్‌ను ఎంతగానో ప్రేమించారు. వారం రోజుల పరిచయంతోనే బాలదేవ్‌ను ఆయన గుర్తించారు. రూపాయల్ని మోగించి చూస్తారు; మనిషిని - మాటతీరునబట్టి ఇట్టే అర్థం చేసుకోవచ్చు. మహంతుగారు బాలదేవ్‌ను - 'మంచి ఉన్నతాభిప్రాయాలు గలిగినవ్యక్తి! సంస్కారవంతుడు!' అని పొగుడుతూ ఉండేవారు. ఇంతకుముందు మహంతుగారెవ్వరినీ ఇంత గాఢంగా విశ్వసించలేదు. మఠానికి రోజూ ఎంతోమంది సాధువులు వస్తూఉండేవారు. మహంతుగారు రోజూ ఆమెతో ఇలా అంటూఉండేవారు - 'లక్ష్మి వీళ్ళెవర్నీ నమ్మకు. వీళ్ళు స్థిరమైనవాళ్ళు కాదు. వాళ్ళతో సంబంధాలు పెట్టుకోవద్దు ' యువకులైన సాధువులనుగురించి ఆయన ఇట్టే అర్థం చేసుకునేవారు. ఆయన అంతర్‌దృష్టి అమోఘమైంది. క్రిందటిసంవత్సరంలో ఒకరోజున సత్సంగసమావేశానికి ఒక సాధువువచ్చి కూర్చున్నాడు. రాత్రిపూట వచ్చాడు; వరాహక్షేత్రం వెడుతున్నాడు....అతడికళ్ళు చాలా చంచలమైనవి!....సత్సంగసమావేశంలో కూర్చొని లక్ష్మివైపు అదేపనిగా చూస్తున్నాడు. మహంతుగారు గురువచనాలను వ్యాఖ్యానించి చెబుతున్నారు. చివరిపంక్తి దగ్గరికొచ్చి ఆయన అకస్మాత్తుగా ఆగిపోయారు. 'ఏమయ్యోయ్ యువకసాధువూ. నేను చెబుతున్న గురువచనాలను శాన్త మనస్సు బెట్టుకొని వినవయ్యా! లక్ష్మి శరీరంమీద కళ్లుబెట్టి ఏం జూస్తున్నావయ్యా? ఈ మట్టిశరీరం ఉన్నది చూశావూ - మహా నశ్వరమైనది నాయనా! గురువచనాలు శాశ్వతమైనవి' అని అన్నారు. ప్రసాదంకూడా తీసుకోకుండా అతగాడు పలాయనం చిత్తగించాడు. అయితే బాలదేవ్ అంటే ఆయన కెంతో నమ్మకం. 'లక్ష్మి! విజమైన త్యాగంఅంటే వీళ్ళదే సుమా!'

బాలదేవ్ చూడడంతోనే లక్ష్మి దుఃఖం సగం మటుమాయమైంది. 'ఎంతో అదృష్టముంటేగాని అటువంటివ్యక్తుల దర్శనభాగ్యం లభించదు. నాకు దర్శనభాగ్యమైతే లభించిందిగాని, సేవాభాగ్యం సంప్రాప్తించలేదు. దురదృష్టవంతుణ్ణి' అని బాలదేవ్ అన్నాడు.

'బాలదేవ్‌గారూ. మీరు నిజమైన భక్తులు.'

'అవునండి. మా అమ్మకూడా చాలా భక్తిపరురాలు. చేపలు, మాంసం అంటుకునేదికాదు.'

'అయితే మీరు జన్మతః భక్తులే. మీరు రుద్రాక్షమాల ఎందుకు ధరించరండీ?'

బాలదేవ్ పెదాలమీద చిరునవ్వు తొంగిచూసింది. 'ఇదుగో లక్ష్మిగారూ. మనస్సు అనేది ముఖ్యంగాని - మాలలూ అవి బాహ్యమైన వస్తువులు.'

ఈ మాలలనేవి బాహ్యమైనవి - అనే మాట మరొక సాధువు వింటే - ఇద్దే కోపం తెచ్చుకుంటాడు. రామదేవ్‌గోసాయి అయితే వెంటనే గడిటబుచ్చుకుని వెంటబడి, బండబూతులు తిట్టేవాడు. లక్ష్మి ప్రశాంతచిత్తంతో ఆలోచించి ఇలా అన్నది - 'మాల అనేది బాహ్యవస్తువు అని నేను అనుకోను బాలదేవ్‌గారూ! అదొకవేషం. మీరు కొంచెం ఆలోచించిచూడండి. మీరు ఖద్దరు ధరించారు. సన్నని మిల్లువస్త్రాలు ధరించేవ్యక్తులు మహాత్మాగాంధీ సిద్ధాంతాల్ని నమ్మినా వాళ్ళను మీరు జాతీయాభిమానంగల వ్యక్తులుగా భావిస్తారా?'

లక్ష్మి మాటలకు సమాధానంచెప్పడం మాటలుకాదు. ఆమె మాట్లాడినప్పుడల్లా బాలదేవ్‌కు ఎన్నెన్నో కొత్తసంగతులు అవగతమవుతూ ఉంటాయి.

'మీరు చెబుతున్నారుగనుక - మాల ఒకటి ధరిస్తాను.'

'ఎవరిదగ్గర పుచ్చుకుంటారు?'

'ఎవరో ఎందుకు? మీరే ఇవ్వండి.'

లక్ష్మి నవ్వింది. శోకాకులవాతావరణానికి లక్ష్మి చిరునవ్వు ప్రాణం పోసినట్టయింది. ఈ బాలదేవ్‌కూడా మంచివారే! నన్ను గురువుగా ఎంచుకుంటారట. బావుంది.

'అబ్బే వద్దండి, బాలదేవ్‌గారూ! నేను మీకు ఆచార్యులవారి చేతిమీదుగా మాల ఇప్పిస్తాను. ఆచార్యులవారు కాశీలో ఉంటారు. నేను మీకు నా టీజక్ గ్రంథం ఇస్తాను. దీన్ని మీరు రోజూ పారాయణం చెయ్యండి. 'టీజక్' పారాయణంవల్ల మనస్సంతో నిర్మలంగా వుంటుంది. అంతర్జ్యోతి బహిర్గతమవుతుంది.'

టీజక్ ఒక చిన్నగ్రంథం. జ్ఞానవిధి. బాలదేవ్‌కు గుండె కొట్టుకోవడం ప్రారంభమైంది. 'ఎప్పుడో ఒకసారి కాశీనుంచి ఒక విద్యార్థి వచ్చారు. ఎంతో కుదిరికగా రాశారు. ముత్యాల్లాంటి అక్షరాలు! నా దగ్గరున్న 'టీజక్' అదే!' అని అన్నది లక్ష్మి.

టీజక్‌నుంచి లక్ష్మి శరీరపుసువాసన వెలువడుతున్నది. ఈ సువాసనలో ఏదో ఒక మత్తు వున్నది. ఈ గ్రంథంలోని ప్రతిపేజీని లక్ష్మి చేతివేళ్ళు స్పర్శించాయి.... 'పెద్దపెద్ద గ్రంథాలు ఎంతచదివినా పాండిత్యం అబ్బలేదు. రెండున్నర అక్షరాలుగల 'ప్రేమ'నుగురించి చదివినవాడు పండితుడైనాడు.'

లక్ష్మిని చూస్తూఉంటేనే మనస్సు పవిత్రమైపోతుంది.

## తొమ్మిది

డాక్టర్ ప్రశాంతకుమార్!

జాతి?

పేరడిగినతర్వాతే జాతి అడుగుతున్నారు. జీవితంలో చాలా తక్కువమంది ప్రశాంత్‌ను అతని జాతినిగురించి అడిగారు. కాని ఇక్కడ ప్రతిఒక్కరూ ముందుగా జాతినిగురించి వాకబు చేస్తున్నారు. ప్రశాంత్ నవ్వి - జాతి? 'డాక్టర్!' అని సమాధానం చెబుతూఉంటారు.

'డాక్టర్? జాతి - డాక్టర్! బెంగాలీయా, బిహారీయా?'

'భారతీయుడు!' డాక్టర్ సమాధానం చెబుతాడు.

జాతి చాలా ముఖ్యమైంది. కులాలను పాటించని వాళ్ళకికూడా ఒక కులం అంటూ ఉంటుంది. 'హిందువు' అని చెప్పడంతోనే సరిపోదు. బ్రాహ్మణునా

ఏ శాఖ? గోత్రమేమిటి? పట్టణాల్లో ఎవరూ కులాలనుగురించి ప్రశ్నించరు. కాని గ్రామాల్లో మీ కులం ఏమిటో తెలియకపోతే వచ్చి మంచినీళ్ళుకూడా పుట్టవు.

ప్రశాంత్ తన కులాన్నిగురించి, జాతినిగురించి ఏమీ చెప్పలేదు. దాచి వుంచాడు. అసలువిషయ మేమిటంటే - తనజాతి ఏమిటో ఆయనకే తెలియదు. ఒకవేళ తెలిసివుంటే చెప్పడానికి సందేహించేవాడుకాదు. కులాల భేదభావంమీద నమ్మకం పూర్తిగా తొలిగిపోయేది కాదేమో? అప్పుడు తాను బ్రాహ్మణుడని చెప్పు కొనడానికి సందేహించేవాడు కాదేమో! అలా చెప్పుకోవడం గర్వంగా భావించేవా దేమో?

హిందూ విశ్వవిద్యాలయంలో చేరినరోజునకూడా ఇదేరకమైన సమస్య ఎదురైంది. రాత్రి నిద్రకూడాపోలేదు....ప్రశాంతకుమార్. తండ్రిపేరు - అనిల్ కుమార్ బెనర్జీ. హిందువు. బ్రాహ్మడు. అంతా అబద్ధం! డాక్టర్ అనిల్ కుమార్ బెనర్జీ నేపాలులోయకు చెందిన ఏదో ఒకగ్రామంలో తన కుటుంబంతో సుఖంగా కాలక్షేపంచేస్తూ ఉండిఉంటాడు. ప్రశాంతకుమార్ అనే పేరుగల ఆయన కుమారు డొకడు హిందూ విశ్వవిద్యాలయంలో చేరబోతున్నాడనేసంగతినిగురించి కలలో కూడా అనుకోబోడు... అయితే ప్రశాంత్ తన తండ్రి అనబడే డాక్టర్ అనిల్ కుమార్‌ను ఎరుగు. మెట్రిక్‌పరీక్షకోసరం ఫారం నింపేరోజున డా॥ అనిల్ అతని తండ్రిగా ఎదురుగావున్న ఖాళీస్థలంలోకివచ్చి కూర్చున్నాడు.

బాల్యంనుంచికూడా తన జన్మగాథను వింటూనేవచ్చాడు. ఇంట్లోని పని మనిషికి, తోటలోని మాలికి, పక్కింటి మిఠాయి దుకాణపతనికి - అతని జీవితగాథ తెలుసు. తరుచు అతనివైపు జనం వేలెత్తిచూపి ఇలా అనుకోవడం కద్దు—'అదుగో ఆ కుర్రవాడు లేడూ. అతను ఉపాధ్యాయగారికి కోనేటిలో దొరికాడు. బెంగాలీ లేడీడాక్టరు పెంచి పెద్దవాణ్ణి చేసింది.' ఆ తరువాత ఆ వ్యక్తులమొహాలమీద కని పించే ఆశ్చర్యభావాలు, ఆ కళ్ళల్లో కన్పించే జాలి - ప్రశాంత్ కొన్నివందల పర్యా యాలు చూశాడు....వారసులులేని శవాన్నికూడా ప్రజలు అలాంటిదృష్టితోనే చూస్తారు.

ప్రశాంత్ తల్లి అతన్ని ఒక మట్టికుండలో పెట్టి వరదనీటితో ఉరకలువెట్టే

కోశనదికి అప్పగించింది. నేపాలుకుచెందిన ప్రఖ్యాత ఉపాధ్యాయకుటుంబం నేపాలు ప్రభుత్వంద్వారా బహిష్కరించబడి, ఆ రోజుల్లో సహర్సా అంచున ఒక ఆదర్శ ఆశ్రమాన్ని స్థాపించుకొనివుంటున్నది. ఒకరోజున ఉపాధ్యాయగారు వరదబాధితులకు సహాయపడవ నౌకదాన్ని తీసుకొనివెడుతూంటే ఒడ్డునున్న పొదలపక్కన మట్టికుండ కన్పించింది - కొత్త మట్టికుండ। ఆయన భార్యకు ఆ కుండలో ఏమున్నదో చూడాలనిపించింది. పడవను పొదలపక్కకు తీసుకెళ్ళేప్పటికి ఆ అలలకు కుండ కదిలింది; కుండలోనుంచి ఒకపాము తల పైకెత్తి 'పూ పూ' అన్నది. ఆ తరువాత నెమ్మదిగా నీళ్ళల్లోకి వెళ్ళిపోయింది. ఇంతలోనే ఆ కుండలోనుంచి ఒక పసిగుడ్డు ఏడుపు వినిపించింది - తల్లి జోకొట్టడం ఆపివేసినట్టు.... ఇదీ అతని జన్మగాథ। దీన్నే ప్రతిఒక్కరూ ఒక్కొక్కపద్ధతిలో చెబుతూఉంటారు.

ఆదర్శ ఆశ్రమంలో ఒక దీనురాలైన యువతి ఉండేది - స్నేహమయి. స్నేహమయిని ఆమె భర్త డాక్టర్ అనిల్‌కుమార్ బెనర్జీ వదిలేసి ఒక నేపాలీ ఆమెను పెళ్ళి చేసుకున్నారు. ఉపాధ్యాయగారి ఆశ్రమంలోవుంటూ కుందేళ్ళను, లేళ్ళను, నెమిళ్ళను, కోతిపిల్లల్ని ప్రేమగా పెంచుతూ, వాటిని పంజరాలలో బంధిస్తూ కాలక్షేపం చేస్తూఉండేది. ఉపాధ్యాయదంపతులు ఆ పసిగుడ్డును తీసుకెళ్ళి ఆమెచేతుల్లో పెట్టేప్పటికి ఆమె సంతోషానికి మేరలేకపోయింది. 'ప్రశాంత్ .... అమర్ ప్రశాంత్।' అని కేకబెట్టింది. ఆరోజునుంచి ప్రశాంత్ స్నేహమయి ఏకైకపుత్రుడైనాడు. కొన్నిరోజులకు నేపాలుప్రభుత్వం విశేషపుటుత్తర్వును రద్దుచేసి ఉపాధ్యాయకుటుంబాన్ని నేపాలుకు రప్పించుకోవడం జరిగింది - ఆశ్రమంలోని పక్షులతోసహా, స్నేహమయి, ప్రశాంత్ కూడా ఉపాధ్యాయపరివారంలోని సభ్యులే. ఉపాధ్యాయగారు నేపాలులోని బిరాట్‌నగర్‌లో ఆదర్శవిద్యాలయాన్ని స్థాపించారు. స్నేహమయి అదే విద్యాలయంలో కుట్టుపనినేర్పే టీచరుగా పని చేస్తున్నది.

స్నేహమయి స్నేహాంచలంలో పెరిగిన ప్రశాంత్‌మీద కార్యనిష్ఠాపరులైన ఉపాధ్యాయ పరివారపు ప్రభావం పడకుండా ఎలా వుంటుంది? రవీంద్రసంగీతం పట్ల ఆసక్తిలేకుండా ఎలా వుంటుంది? ఉపాధ్యాయగారి పెద్దకొడుకు బీహారు విద్యాపీఠ స్నాతకుడు; రెండో అతను దెహరాదూన్‌లోవున్న ఒక ఇంగ్లీషు స్కూలు

విద్యార్థి. కూతురు శాంతినికేతనంలో చదువు కొనసాగిస్తున్నది. కలవల్లో వాళ్ళంతా ఒకచోట ఏకమైతే శాంతినికేతనంలో చదువుకునే చెల్లెలు రాట్నం వడకడం నేర్పు కుంటే, విద్యాపీఠ్ స్నాతకుడు ఆశ్రమ భజనావళి పంక్తులకు రవీంద్రసంగీతపు బాణీని మేళవింపజేయడానికి ప్రయత్నం చేస్తాడు; ఇంగ్లీషు స్కూలు విద్యార్థి ద్రిల్లుకుచెందిన హిందీపదాలనుగురించి తర్జన భర్జనలు జరపడంలో నిమగ్నుడవు తాడు - 'ఎటెన్షన్' అనే మాటలోవున్న ఫోర్స్ 'సావధాన్' అనే హిందీపదంలో లేదు. ఎటెన్షన్ అనేమాట వినిపించడంతోనే ఒక్కసారిగా అనేక బూట్లచప్పుడు వినిపిస్తుంది!

ఇటువంటి వాతావరణంలోనే ప్రశాంత్ వ్యక్తిత్వం వికసించింది.

హిందూ విశ్వవిద్యాలయంలో ఐ ఎస్. సి; ప్యాసైనతరువాత పాట్నా మెడికల్ కాలేజీలో చేరాడు. అతడు డాక్టరు కావాలని తల్లి కెంతోకోరిక, అయితే తన ప్రశాంత్‌ను డాక్టర్‌గా చూడలేకపోయింది. కాశీయాత్రకువెళ్ళి, శాశ్వతంగా ఆమె ఎక్కడికో వెళ్ళిపోయింది.... ఒకపర్యాయం లాహోరునుంచి ప్రశాంత్ పేర ఒక మనీఆర్డరు వచ్చింది - ఆశీర్వాదాలు తెలుపుతూ. మనిఆర్డరు పంపించింది - శ్రీమతి స్నేహమయి చోపడా!.... ఒకతల్లి పుట్టగానే కోశీనదికి అప్పగించింది; మరోకామె జనసముద్రానికి సమర్పించింది.

డాక్టర్‌కోర్సు ప్యాసైనతరువాత హౌస్ సర్జన్‌గా చేస్తున్నప్పుడు దేశంలో 1942 ఉద్యమం ముమ్మరంగా సాగుతున్నది. నేపాలులో ఉపాధ్యాయ పరివారానికి చెందిన ప్రతిఒక్కరూ అరెస్టయ్యారు. ఉపాధ్యాయపరివారం భారతదేశంనుంచి పారిపోయివచ్చిన నాయకులకు సహాయం అందించడమేగాక, ఉద్యమాన్ని నడప డంలోకూడా వీరి అండదుండలున్నాయని ఇంగ్లీషుప్రభుత్వం భావించింది. రెండో కొడుకు బీహారు సోషలిస్టుపార్టీ కార్యకర్త. అతన్ని ముందుగానే డిటెన్యూ (అవిచారిత నిర్బంధితుడు)గా పట్టుకెళ్లారు. ప్రశాంత్‌కూడా ఉపాధ్యాయ కుటుంబం లోని సభ్యుడు కావడంవల్ల అతన్నికూడా డిటెన్యూగా తీసుకెళ్ళి జైల్లో బంధిం చారు. జైల్లో వివిధరాజకీయ పార్టీలకుచెందిన నాయకులతోనూ, కార్యకర్తల తోను సంబంధం ఏర్పడింది. అన్ని పార్టీలవాళ్ళూ అతన్ని ఎంతో ప్రేమించేవారు.

1946 లో కాంగ్రెస్ మంత్రిత్వం ఏర్పాటైనతరువాత అత నొకరోజున ఆరోగ్యమంత్రి ఇంటికెళ్లాడు. పూర్ణియాలోని ఏదో ఒకగ్రామంలో ఉండి మలేరియా, టైఫాయిడ్ జ్వరాలనుగురించి పరిశోధనచేయాలని అతని సంకల్పం. ఇందుకు ప్రభుత్వసహాయం కావాలి. 'నిన్ను ప్రభుత్వం స్కాలర్‌షిప్‌మీద విదేశాలకు పంపించాలనుకుంటున్నదయ్యా!' అని మంత్రి అన్నారు.

'నేను విదేశాలకు వెళ్లనండి!' పూర్ణియా, సహర్సాల దేశపటాలను చూపిస్తూ అన్నాడు - 'నే నీ పటాలలోవున్న ఏదో ఒకభాగానికివెళ్ళి వుండాలను కుంటున్నానండి. ఇలా చూడండి - ప్రతిసంవత్సరం కోశీనది తాండవనృత్యంచేసే సహర్సాప్రాంతం, ఇది పూర్ణియా తూర్పుభాగం. ఇక్కడ మలేరియా, టైఫాయిడ్ వచ్చి ప్రతిసంవత్సరం ఎంతోమంది మరణిస్తూ ఉంటారు.'

మంత్రి ప్రశాంత్‌ను బాగా ఎరుగు. ఈ విషయంలో ప్రశాంత్‌తో తర్కించి అతన్ని ఒప్పించడం కష్టమని ఆయనకు తెలుసు. కాని ప్రశ్న....?

'అయ్యా! ప్రశ్నలు సమాధానాలతో నాకు నిమిత్తం లేదు. నన్ను ఏదో ఒక మలేరియా కేంద్రానికి పంపించండి.'

'మలేరియా కేంద్రానికా? నువ్వు ఎం. బి., బి. ఎస్. డాక్టరువి; మలేరియా సెంటర్‌కు ఎల్. ఎమ్. పి. డాక్టర్లు సరిపోతారు.'

'రిసర్చి పూర్తి చేసేదాకా నే నేమీ కాననుకోండి, డిగ్రీ లెందుకండి?'

అతి కష్టంమీద పాత ఫైళ్ళన్నీ తిరగేసి, పూర్ణియా డిస్ట్రిక్ట్‌బోర్డు ఛైర్ మన్‌తో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి మంత్రి మిస్టర్ మార్టిన్ ఇచ్చిన భూమిని గురించి వివరాలు తెలుసుకున్నారు. ఇరవై రెండు సంవత్సరాలక్రిందట మంత్రి పూర్ణియాలోనే వకీలుగా వుండేవారు. పిచ్చివాడుగా మారిపోయిన మార్టిన్‌నుకూడా ఆయన చూశాడు.

చివరకు కేంద్రప్రభుత్వంతో సలహా సంప్రదింపులుజరిపి చివరకు ఒక రోజున ప్రెస్‌నోట్‌లో ఈ వార్త ప్రచురించబడింది. పూర్ణియాజిల్లాలో మేరీగంజ్ అనేగ్రామంలో మలేరియా స్టేషన్ తెరవబడుతుంది. (ది స్టేషన్ విల్ అండర్‌టేక్

మలేరియా అండ్ కాలా అజార్ ఇన్వెస్టిగేషన్ ఇన్ ఆల్ యాస్పెక్ట్స్. ప్రివెంటివ్, క్యూరేటివ్ అండ్ ఎకనామిక్.)

ప్రశాంత్ తీసుకున్న ఈ నిర్ణయాన్ని మెడికల్ కాలేజీ అధికారులు, అధ్యాపకులు, విద్యార్థులు వివిధరకాలుగా వ్యాఖ్యానించారు. ప్రఖ్యాత సర్జన్ డా॥ వర్ధన్ 'వట్టి మూర్ఖుడు' అని అన్నాడు.

ఇ. ఎన్. టి. ప్రధాన డాక్టర్ నాయక్-'తరువాతగాని కళ్లు తెరిపిడి పడవులే!' అని అన్నాడు.

మెడిసిన్ డాక్టర్ శరవ్‌దారు-'భావుకత్వపు ప్రాబల్యంకూడా ఒక ప్రమాదమైన జబ్బే సుమా! తెలుసా?' అని తన అభిప్రాయాన్ని వెల్లడించాడు.

అయితే ప్రిన్సిపాల్‌మాత్రం చాలా సంతోషించాడు_ 'ఇలాంటి నిర్ణయమే తీసుకుంటావని నే ననుకుంటూ నేవున్నాను. నీకు విజయం చేకూరాలని అభిలషిస్తున్నాను. నీ కేదైనా సహాయం కావలసివుంటే నాకు రాస్తూఉండు.'

ప్రశాంత్ కంఠం రుద్ధమైంది.

మద్రాసు మెడికల్ గజెట్ సంపాదకీయం రాసి డా॥ ప్రశాంత్‌ను అభినందించింది.

అతను పూర్ణియాకు బయలుదేరి వస్తున్నరోజున స్టీమరు బయలుదేరడానికి అయిదునిమిషాల వ్యవధిమాత్రమే మిగిలివుంది. ఒక యువతి మెట్లమీదినుంచి గబగబా కిందికి దిగిరావడం అతను చూశాడు. ఎవరామె! మమత! అవును మమతే!

రావడంతోనే అన్నది_'మొత్తానికి నీ మెదడుకూడా పాడైంది. ఎప్పుడూ ఈ విషయం చెప్పనేలేదేం? బ్రహ్మాండమైన పనిచేశావు. ప్రశాంత్! నువ్వు చాలా గొప్పవాడివి!....బెనారెస్‌నుంచి నే నిప్పుడే వస్తున్నాను. రావడంతోనే మన్నీ నీ ఉత్తరం నా కందించింది.'

జేబుగుడ్డలోనుంచి పూలూ, మారేడాకులూ తీసి ప్రశాంత్ తలకు తాకిస్తూ_ 'భగవాన్ విశ్వనాథ్ ప్రసాదం! విశ్వనాథ్ నీకు శుభాన్ని కలిగించుగాక! అక్కడకు చేరినవెంటనే ఉత్తరం రాయడం మరచిపోకు!' అని మమత అన్నది.

# పది

డాక్టర్ ఉత్తరం రాస్తున్నారు—

'మమతా,

చేరినవెంటనే ఉత్తరం రాయమని నువ్వు చెప్పావు। చేరిన వారంతరువాత ఈ ఉత్తరం నీకు రాస్తున్నాను. నీ భగవాన్ విశ్వనాధ్ నే నిక్కడకు రాకపూర్వమే ఒక దూతను పంపించాడు. ప్యారా నిజంగా దేవదూతలాగా వచ్చాడు. నువ్వేమీ బెంగ పెట్టుకోనవసరంలేదు నన్నుగురించి. అప్పుడే వారంలో రెండుసార్లు నామీద అలిగాడు—'పేరుకు డాక్టరు, కాని వేళప్రకారం భోజనం చెయ్యకపోతే, శరీరం మీద ఎటువంటి చెడ్డప్రభావం పడుతుందోకూడా తెలియదాయె।' దీన్నిబట్టి ప్యారా నీ కర్థమయ్యేవుంటాడు.

'ఇదొక కొత్తప్రపంచం. మంచి కట్టుదిట్టమైన పల్లెపట్టు। గ్రామపెద్ది వారాని కొకసారి పోలీసుఠాణాకు హాజరు చెప్పరావడానికి వెళ్ళవస్తాడు. అతడే నా పోస్టు తీసుకెడతాడు, పోస్టు తెస్తాడు.'

'పని ప్రారంభమైంది. ఉదయం ఏడుగంటలకే రోగులు వచ్చేస్తారు. ప్రస్తుతం జనరల్‌సర్వే జరుపుతున్నాను. రక్తం తీసుకొని పరీక్ష చేస్తున్నాను. ఇక్కడ కాకులకుకూడా మలేరియా వస్తుందని ప్యారా అంటాడు.

'....ఇక్కడ గుంటలు, చెరువులు తామరాకులతో నిండివుంటాయి. పూలు పూచేతరుణంలో చిన్నచిన్న గుంటల్లోసైతం రకరకాలైన తామరపూలు కనిపిస్తా యట।....అయితే ఇక్కడిజనాన్ని నువ్వు 'లోటస్ ఈటస్' అని అనడానికి వీల్లేదు. గుంటల్నికూడా పరీక్షిస్తున్నాను. ఇక్కడ భూమిచూస్తే సంవత్సరంలో పన్నెండు మాసాలూ నెమ్ముగానే ఉంటుందిలా వుంది.'

'గ్రామప్రజలు చాలా అమాయకంగా వుంటారు, అమాయకులంటే అర్థం—చదువురానివాళ్లు, అజ్ఞానులు, మూఢనమ్మకాలు కలిగినవాళ్ళూ అయితేమటుకు అమాయకులనే అనాలి. ఇక వ్యావహారికమైన తెలివితేటలవిషయంలోమటుకు నీలాంటి, నాలాంటివాళ్ళను రోజుకు అయిదుసార్లు మోసంచేయడంలో అద్వితీ

యులు. అయితే విశేషమేమిటంటే నువ్వు మోసపోయినా వాళ్ళ అమాయకత్వానికి అబ్బురపడిపోతావు. ఇది నా వారంరోజుల అనుభవం! ముందు ముందు ఈ నా అనుభవం పొరపాటు అభిప్రాయంగా మారిపోవచ్చు. మిథిల, బెంగాలుకుమధ్య వున్న ఈ భాగం నిజంగా ఎంతో మనోహరంగా వుంటుందంటే నమ్ము. ఆడ వాళ్ళు సాధారణంగా అందంగా వుంటారు. వాళ్ళ ఆరోగ్యాలుకూడా బాగానే వుంటాయి.'

'డాక్టరుగారూ!'

'ఎవరు?'

'విశ్వనాథప్రసాద్.'

'రండి, రండి! చెప్పండి.'

'డాక్టర్‌గారూ! మీ రొకసారి మా ఇంటికి రావాలండి. మా అమ్మాయి స్పృహతప్పి పడిపోయింది.'

'స్పృహతప్పి పడిపోయిందా? వయస్సెంత? ఇంతకుముం దెప్పుడైనా ఇలా స్పృహతప్పి పడిపోయిందా?'

'ఇదివరలో రెండు మూడు పర్యాయాలు ఇలాగే జరిగింది. వయస్సం టారా? పదహారు పదిహేడు సంవత్సరా లుంటాయి. కొంచెం త్వరగా బయలు దేరతారా?'

'పదండి!'

తలుపులు మూసినగదిలో మంచంమీద పీలంరంగు రజాయి ముసుగుతో మంచి యువతి ఎర్రటిమొహం బయటికి కనిపిస్తున్నది. జుట్టు విరబోసుకొని వున్నది. కళ్ళు మూతలుపడివున్నాయి. గదిలో లాంతరు మసక వెలుతురుమాత్రం ఉన్నది. వెలుతురు తక్కువ, పొగ ఎక్కువ.

డాక్టర్ కిటికీతలుపులు తెరవమని చెప్పి జేబులోనుంచి టార్చితీసి యువతి మొహంమీద వెలిగించాడు. మొహం బాగానే వున్నది. శ్వాస? బాగా నేవున్నది. నాడికూడా సరిగానే వున్నది.

డాక్టరు కళ్ళురెప్పలు తిప్పిచూశాడు - తామరపూలను తెరిచినట్టు। రైైట్। పొట్ట? మలబద్ధకం లేదుగదా?

ఎవరూ సమాధానం చెప్పడంలేదు. ఆడవాళ్ళు ముసుగువేసుకున్నారు. వాళ్ళల్లో వాళ్లు దగ్గరగా జరుగుతున్నారు. ఒక మధ్యవయస్కురాలు ముందుకొచ్చింది. యువతి తల్లి. 'మలబద్ధకం లేదండి।'

ఇంతలోవి పనిమనిషికి పర్ధాలేదు. 'డాక్టర్‌బాబూ। ఆ రబ్బరుతాడేసుకొని చూడండి' అని అన్నది.

రబ్బరుతాడంటే స్టెథస్కోప్. దీనిద్వారా డాక్టరు రోగికున్న సర్వరోగాలను అర్థం చేసుకోవచ్చునని ఇక్కడివాళ్ళ నమ్మకం. ఏమి తిన్నది. ఆ తిన్నది పొట్టలో జీర్ణమైందా లేదా అనేది అర్థమవుతుంది.

'సూది ఇస్తారా?'

'ఆఁ ఇస్తాము।'

డాక్టరు సిరింజి సరిజేసుకుంటున్నారు. యువతి కళ్ళు తెరిచింది—

'సూది ఇస్తారా?....వద్దు। అమ్మా నాకు సూదివద్దే।....బాబోయ్।....'

'సరే, సూదివ్వనులే। ఆరోగ్య మెలావుంది?....సరే, నీకు స్పృహ ఎందుకు తప్పింది? భయమేసిందా? ఊఁ....ఎటువంటి భయం?....ఊ? ఆ తరువాత? వళ్ళు తిరిగిందా?....సరే, ఇప్పు డెలావుంది? భయమేస్తున్నదా? మందు పంపిస్తాము, ఇక భయమెయ్యదు.'

'మందా? మందు వద్దమ్మా। నేను మందు తాగనే।'

'బావుంది। సూది తీసుకోనంటివి। మందుకూడా తాగవా?....తియ్యటి మందు।'

అంతా ఒక్కసారిగా నవ్వేశారు. యువతి కుష్కించిపోయిన ఎర్రటి పెదిమలమీదకూడా చిరునవ్వు తొంగిచూస్తుంది. కనురెప్పలు కొంచెం పైకెత్తి డాక్టర్‌ను కోప్పడుతున్నట్టుగా—'సరేలెండి। మందు ఎక్కడైనా తియ్యగా ఉంటుందా ఏమిటి?' అని అన్నది.

బయటకొచ్చి డాక్టరు తాసిల్దార్‌తో—'గాభరా పడవలసిన అవసరంలేదు. మందు పంపిస్తాను. ఇదివరలో ఎంతసేపు స్పృహలేకుండా వుండేది?' అని అన్నాడు.

దాదాపు గంటసేపటిదాకా ఉంటుంది. సిద్ధాంతిగారితో ఒకసారి యంత్రం కట్టించాను. మంత్రతంత్రాలుకూడా జరిపించాను. డాక్టర్‌గారూ! కొడుకైనా, కూతురైనా - ఈమె ఒక్కతే నాకు!....ఈమే నా సర్వసం!'

'ఏం ఫరవాలేదు. నయమవుతుంది.'

హాస్పిటల్‌కు తిరిగొచ్చాక డాక్టరు ఆలోచనలో పడిపోయాడు—'ఏమి మందివ్వాలి? తీపిమందు! కార్మినేటివ్ మిక్చరా? బ్రోమాయిడ్?....ఇదుగో ఏమయ్యా! నీ పేరేమిటి?'

'నా పేరాండి! పేరు రణజీత్ అండి!'

'తాసిల్దార్ గారింట్లో ఎంతకాలంనుంచి నౌకరుగా వున్నావు?

'చాలాకాలంనుంచి వున్నానండి. చిన్నప్పటినుంచి ఇక్కడే వున్నానండి.... ఒక బీడీ వుంటే ఇప్పించండి బాబుగారూ!'

'ప్యారీ! రణజీత్‌కు ఒక బీడీవుంటే ఇవ్వు!'

ప్యారీ ఒక బీడీ, అగ్గిపెట్టెతెచ్చి ఇచ్చివెళ్లాడు. బీడీ, వెలిగించుకొని రణజీత్ తనలోతాను అనుకుంటాడు—'డాక్టర్ బాబుగారూ! తాసిల్దారుగారికి ఈమె ఒక్కతే కూతురు. ఎన్నో మొక్కుబడులతరువాత కమలమ్మతల్లి దయజూపింది. కాని చివరకు ఆడపిల్లనే ప్రసాదించింది కాని....'

రణజీత్ బీడీనుసి దులిపేసి మౌనంగా ఉండిపోయాడు. రణజీత్ కాని.... అని అన్నాడేగాని వాక్యం పూర్తి చెయ్యలేదు. ఈ విషయం డాక్టరు గమనించక పోలేదు.

ఆఁ. 'కాని! అతరువాత?'

'ఆఁ. అదేనండి! మూడుచోట్ల పెండ్లిసంబంధాలు జరిగాయి. ఒకచోటైతే తాంబూలాలు పుచ్చుకోవడానికికూడా సిద్ధపడ్డారు. సరీగా ఆ రోజున కుర్రవాడితల్లి

చచిపోయింది. రెండవచోట అన్నీ పూర్తయ్యాక వాళ్ళింటికి నిప్పంటుకున్నది. మూడవచోట - కుర్రవాడికి స్ఫోటకంపోసి చచ్చిపోయాడు. ఇప్పుడు మగపిల్ల వాళ్ళెవరూ రావడంలేదు. రెండువేలు, అయిదువేల రూపాయలవరకు ఇవ్వడానికి ఈయన సిద్ధమే! కాని....చివరకు ఒకతన్ని ఇల్లరికంకోసరం తీసుకొచ్చారు. ఆ రోజునుంచే కమలమ్మకు మూర్ఛలరోగం రావడం మొదలైంది. కమలమ్మ నదీమాతకు ఈమె పెళ్ళిజరగడం ఇష్టంలేదని లోకులు అనుకుంటారు. నదీమాత కూడా అవివాహితురాలేనట! ఇక ఇప్పుడు మీరొచ్చారు. ఎలాగో ఆ అమ్మాయి గారికి జబ్బు నయం చెయ్యండి. మీరెంత డబ్బు అడిగితే అంత తాసిల్దారుగారు ఇచ్చేస్తారు.'

'ఇదుగో చూడు రణజీత్! ఈ మందు మూడుసార్లు ఇవ్వాలి. తియ్యటి మందు. మీ కమలమ్మకు నయమవుతుందిలే! రేపు ఉదయంవచ్చి చెప్పివెళ్ళు. ఎలా వున్నదో! తెలిసిందా?'

'మూడుసార్లాండి? మరి ఆహారం ఏమివ్వమంటారండి?'

'రొట్టి, పాలు!'

'రణజీత్!' ఒక మనిషి పరుగెత్తుకుంటూ వచ్చాడు.

'ఎవరూ? రామదేవ్! ఏమిటయ్యా?'

'కమలమ్మగారికి మళ్ళా స్పృహ తప్పిపోయింది. డాక్టర్‌గారిని కష్టమనుకోకుండా మరోసారి రమ్మని తాసిల్దారుగారు చెప్పిరమ్మన్నారు.'

డాక్టర్ గడియారం చూసుకుంటున్నాడు....తొమ్మిది పదినిమిషాలయింది. ఇంకొంచెం సేపట్లో వార్తలు వస్తాయి. డాక్టరు కొంచెం ఆలోచించి - 'రణజీత్! ఈ పెట్టికూడా తీసుకో!....వెడదాం పద!' అని అన్నాడు.

'వార్తల పెట్టె!'

'అవును! మీ కమలమ్మకు వైద్యం ఈ పెట్టెతోనే జరిపిస్తాను!'

కమల మళ్ళా వెనకటిలాగానే స్పృహతప్పి పడివున్నది. ఆమె కళ్ళు మూసుకొనివున్నది. జుట్టు చిందరవందరగా వున్నది. డాక్టర్‌కు వ్యాధిలక్షణాలు

అర్థమైనాయి. బ్యాగ్ లోపలినుంచి సీసాలు, సిరంజి మొదలైనవి బయటికి తీశాడు.

'సూది యిస్తారా? వద్దు!' కమలకు తెలివివచ్చింది.

'సూది ఇవ్వకపోతే మీ జబ్బు నయంకాదు.' డాక్టరు సిరంజి సరిచేస్తున్నాడు.

'ఏదైనా మందివ్వండి డాక్టరుగారూ! నేను సూది తీసుకోను!'

'మళ్ళా భయం వేసిందా.'

'అవునండి!'

'రణజీత్! మందుసీసా ఎక్కడున్నది? ఇలా తీసుకరా! పెట్టె తెచ్చి ఇక్కడపెట్టు!.....ఆc, ఇదుగోండి, మందు తాగండి, బావుంది. ఎలా వుంది మందు? తియ్యగా లేదూ?'

డాక్టర్ పోర్టబుల్ రేడియోపెట్టి మీటర్ సరిచేశాడు—'ఇది ఆల్ ఇండియా రేడియో! సమయం రాత్రి తొమ్మిదిం బావయింది. ఇప్పుడు మీరు హిందీలో వార్తలు వింటారు!.....'

'భయమేస్తున్నదమ్మా!'

'భయమెందుకు? ఏం ఫరవాలేదు వినండి.....!'

'నన్ను లేపమ్మా!'

'లేవకండి, అలాగే పడుకోండి!'

ఇప్పుడు మీరు సవితాదేవి పాడే మైథిలీ జానపదగేయాలు వింటారు!'

అమ్మా నేను పెళ్ళాడనే
నీ అల్లుడు ముసలాడే!

'అమ్మా!' కమల పకపకా నవ్వుతుంది—'పెళ్ళి పాటలు!'

ఆడవాళ్ళగుంపు ఏకమైంది. కమలమీద బ్రొమాయిడ్ ప్రభావం కనిపిస్తున్నది. ఆమె కళ్ళల్లోకి నిద్ర చొచ్చుకుని రాబోతున్నది.

డాక్టర్ తిరిగొచ్చి ఉత్తరం పూర్తిచేయడానికి కూర్చున్నాడు. ఉదయం ఏడుగంటలనుంచే రోగులు గుంపులు గుంపులుగా వచ్చేస్తారు. చౌకీదారు ఆగమా

రేపు వెడతాడు. పోలీసుతాణాకు. తెల్లవారుఝామున అయిదుగంటలకేవచ్చి లేపుతాడు. డాక్టరు రాయడం ప్రారంభించాడు—

'ఉత్తరం మధ్యలో ఆపి ఒక కేసు చూడ్డానికి వెళ్ళివచ్చాను. చాలా విచిత్రమైన కేసు. కేసు హిస్టరీకూడా చాలా ఆసక్తిదాయకమైంది. మీ శీలవుంచే నంతో నంతో గంతులువేస్తూ - హిస్టీరియా, ఫోబియా, కామవికృతి, పట్టుదల ప్రకృతి— అని ఏవేవో శబ్దాలు వల్లించివేసేది। శీలను కలుసుకున్నప్పుడు చెప్పు - నేను పోర్టబుల్ రేడియోద్వారా ఆమె మెదడునుకదిపి మరొకవైపు మళ్ళించడానికి ప్రయత్నించానని।....'

## పదకొండు

సఖితోరా ఆహో ప్యారీ
తేగ్ తరబరియాపే
నహితోరా పాస్మే తీర్జీ।

—పి దగ్గర కత్తిలేదు, చురకత్తిలేదు. బాణాలూ లేవు। ఎలాగు?

అప్పుడు సదాబ్రిజ్‌పట్ల మోహితురాలైన స్త్రీ అంటున్నది—

—నా అత్త చావాలి. నా తోడికోడలు చావాలి. కులంలో వున్నవాళ్ళందరూ చావాలి. నేను ప్రేమపాశంలో చిక్కుకున్నాను.

ఇలా అని ఆమె సదాబ్రిజ్ దగ్గరికొచ్చి తాగడానికి పిళ్ళచ్చి ప్రేమకబుర్లు చెప్పడం ప్రారంభించింది.

ఓహో రసికుడా। ఈరేయి ఇక్కడే గడపవోయి - యాయాయా।

తాంత్రికులపేటలో......హరికథ జరుగుతున్నది. మహగూదాస్ వెంట పోగుపక్కన జనం గుమిగూడారు. పూర్ణియా స్టేషన్‌నుంచి ఒక అతిథి వచ్చాడు. రైల్వేలో పనిచేస్తున్నాడట। తాంత్రికులపేటవాళ్ళు అతన్ని ఖలాసీ అంటున్నారు. ఖలాసి ప్రభుత్వఉద్యోగి. ఖలాసీ ఎర్రజెండా చూపితే మెయిలుబండికూడా ఆగిపోవల

పిందే. ఎందుకు ఆగిపోదు? ఎర్రజెండా కనిపిస్తే రైలుబండి ఆగిపోతుంది. ఎర్రటిముసుగు కప్పుకుని రైలెక్కుతుంటేకూడా రైలు ఆగిపోవలసిందే. ఖాసీ పేరుమోగిన భూతవైద్యుడు. సిద్ధుల్ని పూజిస్తాడు. భూతప్రేతాల్ని చెట్టుకు మేకు కొట్టి కట్టేసి రాగలడు. గొర్రాలికికూడా దేవీపూజలు జరిపిస్తాడు. కీర్తనలు పాడ డంలో ఆయనకు మరొకరు సాటిరారు. ఎంతో మంచి కంఠం. 'స్వరాజ్యఉద్యమం' పత్రికలో ఖాసీ - బైగన్‌బాడీ జమీందారుగా రబ్బాయి రైలుపట్టాలు పీకేశాడని రాశాడు. దాంతో అతనికి ఉరిశిక్ష వేశారు. హైకోర్టు కెళ్లారు; లండన్‌దాకా వెళ్లారు. కాని ఉరిశిక్ష ఖాయం చేశారు. మహగూదాసుకు ఎవ రెంతచెప్పినా వినేరకం కాదు. పాపం, ఖాసీ గత సంవత్సరంనుంచి మహగూదాసు వితంతువైన కూతురి పెళ్ళి విషయం ఖాయం చేసుకునేందుకు కాలికి బలపం కట్టుకొని తిరుగుతున్నాడు. వచ్చి నప్పుడల్లా సంచినిండా నేపాలు గంజాయి తెస్తూఉంటాడు; తాంత్రికులపేట పెద్దల్ని కలుస్తాడు. కీర్తనలు పాడతాడు. ఊళ్ళో ఎవరికైనా జబ్బుచేస్తే భూతవైద్యం చేస్తాడు. పోయినసారి ఉచితదాసు ఇంట్లో దేవీపూజలు జరిపించాడు. ఉచితదాసు ఇంకా నాలుగురోజులకు చచ్చిపోతాడనగా తనకు పుట్టిన సంతానాన్నికూడా చూసు కున్నాడు. ఇక మహగూదాసుకు నచ్చజెప్పడం ఎవరితరమూ కావడంలేదు. పైగా ఖాసీ ఇచ్చి పుచ్చుకునే విషయాలలోకూడా అనుకూలంగానే ఉన్నాడు. కొంత నగదు ఇస్తానంటున్నాడు. సగోత్రీయులకి ఒకపూట భోజనం పెట్టిస్తానంటున్నాడు. ఇంకేం కావాలి? ప్రభుత్వఉద్యోగస్తుడు అల్లుడు కాబోతున్నాడు. ఎప్పుడైనా తీర్థ యాత్రలకు బయలుదేరితే రైల్లో టిక్కెట్టు అక్కర్లేదు.

రమజూదాసు భార్య తాంత్రికులపేట ఆడవాళ్ళందరికి సర్దారులాంటిది. సంతకు వెళ్ళేప్పుడు, యజమానుల నాట్లు, కోతలకు వెళ్ళేప్పుడు పేటలోని ఆడవా ళ్ళంతా ఆమె యాజమాన్యాన్ని అంగీకరించవలసిందే. రాజపుత్రులు, బ్రాహ్మలు, యజమానులు - వీళ్ళకు సంబంధించిన పెద్దలందరితోను ఆమె ముఖాముఖిగా మాట్లాడుతుంది. పరాచకాలాడుతుంది. సమయమొస్తే చేతులు ఆడిస్తూ పోట్లాటకు కూడా దిగుతుంది. ఒకసారి పింగుగారిని గడగడ లాడించింది-'జుట్టు తెల్లబడింది. ముసలితనం వచ్చేసింది. అయినా అయ్యగారి మనస్సుమాత్రం మారలేదు!....నా నోరు తెరిపించకండి పింగ్‌గారు!'....ఆమె అంటే అందరికీ హడలు. ఏ విమ

షంలో ఎవరి రహస్యం బయటపెడుతుందో తెలియదు. అందుకే అందరూ ఆమెను పొగుడుతూ ఉంటారు - పేటలోని యువతులందరూ ఆమె గుప్పిట్లో ఉంటారు. ఎవరూ దూరంగా ఉండడానికి వీల్లేదు. ఈసారి ఖాసీ వస్తూవస్తూ లాల్‌బాగ్ తిరు నాళ్ళనుంచి అసలైన గిలెటిగాజులు తెచ్చారు. వెండిగాజుల్లాగా మెరుస్తున్నాయి.... 'పిన్నిగారూ! ఎలాగైనాసరే పులియాతో నాతో సంబంధం జరిగేలా చూడండి!'

మంచంమీద శయనించిన ప్రియురాలా! ఇదుగో, అందుకో ఆకూ వక్కా!

ఖాసీ ఇవ్వాళ్ళ మంచి రక్తికట్టేలా పాడుతున్నాడు. మనస్ఫూర్తిగా పాడు తున్నాడు.

పులియామాత్రం ఏం చేస్తుంది? తల్లిదండ్రుల చాటుపిల్ల. వాళ్ళను ఎలా కాదనగలుగుతుంది? లోలోపల బాధపడుతూనే వుంటుంది. కాని నోరుతెరిచి మాట్లాడలేదు. లోకులు ఏమనుకుంటారు? రమజాదాసు భార్యకు పులియా లోలోపల బాధపడుతున్న విషయం తెలుసు. అందుకే - 'అత్తయ్యా! ఈ సంగతి ఎవరితోనూ చెప్పకు. ఖాసీగారు ఇంతకాలంనుంచి తిరుగుతున్నా నాన్న అవుననో, కాదనో ఇంతవరకు చెప్పలేదు. ఎంతకాలమని ఆయన ఇలా తిరుగుతాడు? మనం కాదంటే మరొకచోట చూసుకుంటాడు. ప్రపంచంలో పిల్లలే దొరకరా? ఏదో ఒకనాడు ఏదైనా అఘాయిత్యం జరిగితే సహదేవమిశ్ర ఊరుకుంటాడా? అప్పుడు వెళ్ళి వాళ్ళ కాళ్లా వేళ్లా పడాల్సివస్తుంది! ఆ ఆకూ ఈ ఆకూ తినిపించి తిన్నది వాంతి చేసుకునేలా చేయవలసి రావచ్చు. సిద్ధాంతిగా రబ్బాయివిషయంలో ఏం జరిగింది? ఒక మేకనిచ్చి వదిలించుకోవలసివచ్చిందే' అని పులియా అన్నది.

—ఏ రూపు గుర్తుకు రావడంతోనే నా హృదయంలో బాణం గుచ్చుకొం టున్నది.

బాణందెబ్బ తగిలిన ఖాసిహృదయం కొట్టుకలాడుతున్నది. పులియా ఏం చేస్తుంది? మరి రమజాదాసు భార్యనోరు ఎవరు కట్టేయగలరు? 'ఏమమ్మోయ్ పులియా తల్లీ! మీకు ఎగ్గూ సిగ్గూ లేదనుకుంటాను. ఎంతకాలమని పిల్ల నింట్లో పెట్టుకుని కులుకుతావు? దేనికైనా ఒక హద్దు ఉంటుంది. యౌవ్వనంలోవున్న పితంతుపైనకూతురు పాలిచ్చే ఆవుతో సమానమని అంటారు. నేనూ ఒప్పుకుం టాను. పాలు వస్తున్నాయిగదా అని రక్తం వచ్చేదాకా పిండకూడదు.'

'నిజమే మరి। ప్రపంచంలో తప్పులు ఎన్నేవారు తండోపతండాలుగా వున్నారు. అయితే వాళ్ళు తమ తప్పులు తెలుసుకోలేరు। నువ్వేసుకున్న గాజు లెక్కడివో నాకు తెలియదనుకుంటున్నావా? ఆ ఖాసీకి ఒక పొట్లం కుంకుమ తెచ్చియిచ్చేపాటి తాహతున్నదా అంటున్నా?' పులియాతల్లి రమజాదాసు చేతిన గాజులు చూసినప్పటినుంచీ మండిపడుతున్నది. ఎవరినవి ఏమి ప్రయోజనం? ఆ ఖాసీకే బుద్ధిలేదు. రమజాభార్యను ఎక్కేసి. గాజులిచ్చి మధ్యవర్తిగా నిలబెట్టాడు. ఈమె చెప్పేమాటలు ఒప్పుకోవడానికి కాళికాదేవా ఏమిటి?

'నోరు కొంచెం సంబాళించుకొని మాట్లాడవే రంగేళి రత్తీ। ఖాసి ఎవరను కున్నావే। అతగాడు మా అక్కకొడుకే। మా అక్కకొడుకును అంతలేసితిట్లు తిడతావా? తిట్లు నాకు కాదు. నీకే తగులుతాయి। నీ సొంత అన్నకొడుకు తేతరాతో పారిపోలేదంటే నువ్వు? సిగ్గులేక నన్ను తిడుతున్నావా? సిగ్గు విడిచేసింది నువ్వే। పెద్దమనుషులమధ్య నువ్వు చేసినదానికి చీపురుదెబ్బలు తిన్నావు। నీ సంగతి నాకు తెలియదనుకుంటున్నావా। గొల్లలపేట కలయ్యతో రాత్రి అంతా గేదెమీద రాసలీలలు జరిపావు? నీ బతుకు ఎవరికి తెలియదనుకుంటున్నావే మట్టిగుజ్జారీ!'

'ఓసి నీ మొహం మండ। నీ వగరింపు నాకు తెలీదనుకుంటున్నావా? నువ్వు సింగ్‌గారి ఉంపుడుగత్తెవని లోకానికంతా తెలుసు। తాటితోపులో సింగ్ గారితో జరిపే నీ లీలలు ఎవరికి తెలియవు? నీ కొడుకు పుటకలకి సింగ్‌గారు నీ కిచ్చిన ఆవు ఇంకా నీ ఇంట్లోనే వున్నది। నోరు మూసుకోవే కులుకులాడీ।'

మహగూదాసు పెంటపోగుదగ్గర జరిగే హరికథ కాలక్షేపానికి ఈ ఆడవాళ్ళ పోట్లాట ఎటువంటి ఆటంకాన్నీ కలిగించలేదు. ఆడవాళ్ళ పోట్లాటనుగురించి మగ వాళ్ళు పట్టించుకుంటే ఇక అయినట్టే। ఆడవాళ్ళపోట్లాట లెంతసేపు? గొంతు చించుకొనివచ్చిన తిట్లన్నీ తిట్టుకొని. ఉన్నవీ లేనివీ తవ్వుకొని నువ్వు చావాలంటే నువ్వు చావాలని అనుకొని. గంటా. రెండుగంటలయ్యాక అన్నీ మాయమై పోతాయి। మళ్ళా స్నేహం కలుస్తుంది. ఉప్పూ పప్పూ అందిపుచ్చుకుంటారు. ఆకుకూర తీసుకెళ్ళి చిలకడదుంపలు పంపించుకోవడం జరుగుతుంది—'నిన్న సాయంత్రం యజమానుల పొలంలోనుంచి తవ్వుకొచ్చారు కుర్రాడు। యజ మానులుచూస్తే వీపు చిట్లివుండేది।'

ముందుగా పోట్లాట అనేది ఎప్పుడూ ఇద్దరి ఆడవాళ్ళమధ్యనే ప్రారంభిత్వం జరుగుతుంది. ఆ పోట్లాటసమయంలో చుట్టుపక్కలున్న ఆడవాళ్ళ సంగతి సందర్భాలుకూడా రావడంకద్దు. దాంతో పోట్లాడుకునే ఆడవాళ్ళసంఖ్య రెండు నుంచి మించిపోతుంది. ఈ పోట్లాటలకారణంగా వాళ్ళ పనిపాటలకుకూడా వాటి వంటి ఆటంకం వాటించదు. పనులు చేసుకుంటూనే పోట్లాడుకుంటూ ఉంటారు... ఊళ్ళోని ఆడవాళ్ళంతా పోట్లాటకు దిగినప్పుడు ఒకరిమాట ఒకరు వినిపించుకునే ప్రశ్నే లేదు. అయితే ఈ రోజున పులియా ఈ పోట్లాటలో పాలు పంచుకోవడం లేదు. తడికచాటున నిలబడి హరికథ వింటున్నది.........ఖాసీ గొంతులో ఏదో మహత్తువున్నది. భూతవైద్యం తెలిసినమనిషి గదా! కథాకాలక్షేపంలోబడి పులియా-సహదేవ్‌మిశ్ర బంగళాతోటలో తనకోసం సాయంత్రంనుంచి ఎదురుచూస్తూ దోమ కాట్లకు లోనవుతున్నాడనేవిషయాన్ని మరచేపోయింది....ఖాసీ కంఠంలో ఏదో ఇంద్రజాలం ఉన్నది.

'అత్తయ్యా!'

'ఏమిటి? మాట్లాడవేం? సహదేవమిశ్రదగ్గరకు వెడతావా?'

'కాదు అత్తయ్యా! ఒకసంగతి చెబుదామని వచ్చాను. ఈ చెడ్డపనిని గురించి ఎవరితోనూ చెప్పవద్దు!....ఖాసీగారు మీ ఇంట్లోనేగా మకాం? చెడ్డ పని!'

సురంగా - సదాశివ కథాకాలక్షేపం ముగిసింది. పోట్లాట, లంకా కాండ వరకు వచ్చి ఆగిపోయింది. సహదేవ్‌మిశ్ర ఎంతసేపని దోమలబాధ సహిస్తాడు? ....ఓరి నీ తప్పాదియ్యా ఖాసీగా!....నీ యక్క....ఎంతపని జేశావే!....నీ పని రేపు పడతాను!

గ్రామం మాటుమణిగింది. రమజాభార్య ఇంటో సురంగ సదాశివ్‌తో అంటున్నది—'ఇప్పుడేకాదు! నాన్న చమైనావిషయంలో ఒప్పుకోకపోతే అప్పుడు నేను నీతో పారిపోయివస్తాను.'

'అయన్ను ఒప్పించడం ఎలాగు? ఎవరో ఒక మిశ్ర అనే ఆతను వున్నాడని విన్నాను' అని సదాశివ్ సీరసంగా అంటాడు.

'ఇదంతా అబద్ధం. మవ్వు కొంచెం ఈ విషయమై బాలదేవ్‌గారితో మాట్లాడు!'

'ఎవరా బాలదేవ్? పూర్ణియా ఆశ్రమం అతనేనా?'

'ఆఁ! ఆయనే! అందరూ ఆయనమాటకు విలువిస్తారు. నాన్నా, అమ్మా కూడా వింటారు! ఆయనదగ్గరి కెళ్ళినప్పుడు 'నమస్కారమండీ!' అని అనకు. 'జై హింద్!' అను!'

'కాని అతగాడికి నామీద కోపంగా వున్నదే? దేశద్రోహులపట్టికలో నా పేరు వేయించాడు.'

'...మా అమ్మకు ఈసారి ముక్కుబులాకి ఒకటి తీసుకరా! ఇత్తడిది! అసలైన ఇత్తడి బులాకి!'

## పన్నెండు

మఠానికి ఆచార్యగురువు రాబోతున్నారు. కొత్త మహంతుకు దీక్ష ఇవ్వడానికి? ముజఫర్‌పూర్ జిల్లాకుచెందిన ఒక భక్తుడు వచ్చారు - నరసింహదాసు. ఆచార్యగురువు ముజఫర్‌పూర్ జిల్లా పుపడీ మఠానికి నమష్టివిందుకు హాజరైనారు. ఆచార్యగురువు రాబోతున్నారని కబురు తీసుకొని నరసింహదాసు వచ్చాడు— మఠంలోని భక్తజనానికి, తదితర గ్రామస్థులకు ముందుగా కబురు అందించాలనే ఉద్దేశ్యంతో!

రామదాసుకు మహంతుపదవికి అభిషేకం జరుగుతుంది. మహంతు సేవాదాసుకు ఏకైకశిష్యుడు ఈయనే! రామదాసు ఆలోచిస్తూఉంటాడు - ఖంజరు వాయించడమేగనుక వచ్చివుండకపోయినట్లయితే బేలాహీ జమీందారు దగ్గరెల్లి మేపుతూవుండేవాణ్ణని! మహంతుగారు అతను ఖంజరు వాయించడంవిని ముగ్ధుడైనారు. ఆ రాత్రికిరాత్రే మహంతుతోపాటు మేరీగంజ్ మఠానికి పారిపోయి వచ్చాడు....పదిహేను సంవత్సరాలనాటిమాట! పదిహేను సంవత్సరాలతరువాత రామదాసు అదృష్టం పండింది. జై వద్గురు ప్రభువుకీ!

నియమంప్రకారం పెద్దమనుషులఎదుట కొత్తమహంతు ఒక ప్రతిజ్ఞాపత్రం మీద - 'ఎల్లప్పుడూ లంగోటీధరించి సద్గురు ప్రదేశాన్ని పరిరక్షిస్తాను। ఏవిధమైనటువంటి మత్తుపదార్థాలను సేవించను. దాసీలను ఏర్పాటు చేసుకోను।' అని రాసి ఇవ్వవలసి ఉంటుంది. ఆ తరువాత ఆచార్యగురువు ఒక మహంతు పత్రంమీద సంతకంచేసి కొత్త మహంతుచేతి కందిస్తారు. ఆపైని అభిషేకవిధి జరుగుతుంది. పెరుగుతో తిలకం పెడతారు. శిరస్సుమీద ధాన్యం, గడ్డిపరకలు వేస్తారు. దీంతో కొత్తమహంతుగారు తొమ్మిదివందల బీఘాల చిన్న జమీందారీకి ఏకైక యజమాని అయిపోతారు.

నరసింహదాసు ఆచార్యులవారి సందేశం తీసుకొనివచ్చి, ఒక్కరాత్రి మేరీగంజ్ మఠంలో గడిపేటప్పటికి, అతనిలోకూడా మహంతు అయిపోవాలనే ఆశ అంకురించింది. తొమ్మిదివందల బీఘాల వ్యవసాయం. అంటుమామిడితోట। పది బీఘాలభూమిలో అరటితోట వుంది. ఒక్కొక్కగెలకు వెయ్యి అరటికాయలున్నాయి. నలభై ఆవులు, నాలుగు గుజరాతీ గేదెలు. అన్నిటికంటె విలువైన ఆస్థి - అమూల్యమైన నిధి - దాసి లక్ష్మి. మహంతుగారికి రామదాసు ఒక్కడే ఏకైక శిష్యుడని లక్ష్మి అన్నది. అయితే చట్టరీత్యా రామదాసే మహంతుపదవికి అర్హుడు. రామదాసు। పొడిచికొస్తే అక్షరముక్క రాదు. పట్టి మూర్ఖుడు। పంది కేమి తెలుసురా పన్నీరువాసన। హే సద్గురుప్రభో। ఇది అన్యాయం. రామదాసు మహంతు కావడానికి వీల్లేదు. చూడ్డానికి మంచిలాగా ఉంటాడు. ఇతడా మహంతు కావలసినవాడు? వీల్లేదు. ఎప్పటికీ వీల్లేదు. పోతే ఈ లక్ష్మి ....శపించబడ్డ అప్సరస।

నరసింహదాసు కళ్ళల్లో ఆమె కేసు కప్పించిందో ఏమో. లక్ష్మి అతని నీడనుకూడా తప్పించుకొని తిరుగుతున్నది. రాత్రిపూట తలుపు బాగా బిడాయించికొని పడుకుంటున్నది. గొళ్ళెంపెట్టి, ఎందుకైనా మంచిదని రోలు ఒకటి తలుపుకు అడ్డంగా పెడుతున్నది....నరసింహదాసుకు అతిమూత్రవ్యాధి వున్నట్టుంది. రాత్రిపూట పది పన్నెండుపర్యాయాలు కాలు మడుచుకోవడానికి లేవాడు. ప్రతిసారి అగ్నికుండందగ్గర పడుకున్న రామదాసు లేచి కేకవేయడం జరిగేది—'ఎవరూ?' నరసింహదాసు ఒక్కపర్యాయం అసలు సమాధానమే చెప్పేవాడుకాదు. విన్న

రాత్రి ఒక పర్యాయం అయితే కోపంగా అనేశాడు—'మహంతు కావడానికిముందే గుడ్డివాడయ్యావా ఏమిటి? కనిపించడం లేదా?....గురువుకుతగ్గ శిష్యుడివే!' రామదాసు కిక్కురుమనలేదు. ఉదయం సత్సంగసమావేశం జరిగినప్పుడు లక్ష్మి అతని మీద విరుచుకుపడింది—'మీ రెండు కలాంటిభాష ఉపయోగించారు?—మహంతు కావడానికిముందే గుడ్డివాడవయ్యావా ఏమిటి?.....గురువుకుతగ్గ ...! గురువింద విన్న చెవులు....! నేను గురుదూషణ వినలేను. సహించలేను. రామదాసును మీ రేమనుకుంటున్నారు? ఆయన ఈ మఠానికి మహంతు. మీలాంటి పోకిరీ సన్యాసులకు ఆయన రోజూ ప్రసాదం పంచిపెడతారు!....మాటాడడంకూడా తెలియదు. ఆచార్యులవారిని రానివ్వండి. చెబుతాను!'

'ఏదో రాత్రిపూటగదా అని వదిలేశాను. ఇప్పుడేమైనా మాట్లాడావంటే పడమరదారి పట్టిస్తాను. జాగ్రత్త!' అని రామదాసుకూడా అన్నాడు.

వంటతనుకూడా మహా దుష్టుడులాగా వున్నాడు. విన్నటినుంచే పోకిరీగా వ్యవహరించడం ప్రారంభించాడు. పప్పుగిన్నెలో నీళ్ళుమాత్రం ఉంచాడు. బంగాళా దుంపల బజ్జీలు రెండోసారి వడ్డించనన్నాడు. నెయ్యి అడిగితే - పప్పులో నెయ్యి వేశానన్నాడు. అరటిపళ్ళు సంతకు పంపించాడు. పాంలో నీళ్ళుకలిపి ఇస్తున్నాడు. నైవేద్యానికి ఇదివరలో పెరుగు. అటుకులు ఇచ్చేవాడు. ఇప్పుడు పెరుగు మానేశాడు.

పోకిరీసన్యాసి....ఈ ముండకు ఇంత ధైర్యమా! తనను పోకిరీవాడంటుందా? సరే. చూస్తాము!

లక్ష్మి ఇంతకుముం దెప్పుడూ తనను చూడలేదు. ఎలా చూస్తుంది? ఇదివరలో ఎప్పుడూ తనిక్కడ రానేలేదు ...పువరీ మఠంనుంచికూడా ఎవరూ ఇక్కడికి రాలేదు. సోనమతియానుంచి నీళ్ళుమోసే మనిషికూడా ఎప్పుడు వచ్చినపాపాన పోలేదు. అప్పుడెప్పుడో నీళ్ళుమోసే ఆవిడ తనకూతురు రథియాను వెదుక్కుంటూ ఇక్కడకుకూడా వచ్చిందేమో!

అవును! వచ్చింది రధియా! రథియాను మొదటిసారి చూసినప్పుడు తన మానసికస్థితికూడా ఇలాగే వున్నది. కళతలు ఎప్పుడూ వేడిగా వుండేవి. రథియా

ఎవరిపీ సరకుచేసే రకంకాదు. అయితే మొదట్లోనే తపవలలో చిక్కుకుపోయింది. లక్ష్మి అంటే కాస్త అనుభవం గడించిందాయె। ప్రపంచాన్ని కాచివడపోసింది. తను రథియాను తీసుకొని నాటకాలకంపెనీలో చేరి ఉండకపోయినట్లయితే రథియా నా నుంచి వేరై ఉండేదికాదు. నాటకాలకంపెనీ యజమాని ఒక్కడే అయితే తాను సహించేవాడేమో. హార్మోనియం, నగారావాళ్ళుకూడా రథియాను ఒక్కనిమిషం ఖాళీగా ఉండనిచ్చేవాళ్ళు కాదు. ఎప్పుడూ ఏదో ఒక రిహార్సలు అనేవాళ్ళు. రథియా కూడా పట్టి అనాకారి ముండ। దానికికూడా కళ్ళు పైకివచ్చాయి.

నరసింహదాసు తన తలమీదున్న మచ్చను చేతిలో తడిమిచూసుకొని మఫ్లర్ చుట్టేసుకున్నాడు - ఆ ఎదవనాయాలు - నగారా వాయించేవాడు సరీఫూ ఎదురుగా తలమీద కొట్టేశాడు దుడ్డుకర్ర పుచ్చుకొని।

మఠానికి తిరిగి వెళ్ళేప్పటికి మహంతు తన పావుకోళ్ళతో వళ్ళు హూనం హూనం చేశాడు. వారంరోజులపాటు ఉపవాసం ఉండడంచేత పారిపోయేబలం కూడా శరీరానికి లేకపోయింది. తలమీదగాయం ఇంకా అట్లాగే వుంది. మహంతు కాళ్ళమీద పడ్డాడు. ఆయన చాలా దయార్ద్రహృదయుడు. నరసింహదాసు అతని ఏకైకశిష్యుడు. గురువు క్షమించివేశాడు. మహంతు మరణించాక షపడీ మఠానికి అతడే మహంతు కావలసింది, కాని రామబరన్ అతనిబుర్ర చెడగొట్టాడు ... 'నరసింహదాసూ। నేపాలుగంజాయి మంచి లాభసాటిగా ఉంటుందయ్యా। పది రూపాయలకు తెచ్చి నలభై రూపాయలు చేసుకోవచ్చు. నేపాలులో గంజాయి పేరు ధర నాలుగణాలు. బరాహఛత్తర్ తిరునాళ్ళకు వెడదాం వచ్చెయ్।'

మహంతుగారు శరీరం త్యాగంచేసినప్పుడు అతడు జైల్లో వున్నాడు. మహంతుగారు చనిపోతూ జీవూత్‌దాసును శిష్యుడుగా స్వీకరించి వీలునామా రాసి వెళ్లారు. లేకపోతే అతడుకూడా ఒక మఠానికి మహంతు అయివుండేవాడు. అప్పుడు లక్ష్మి తనను పోకిరీసన్యాసికింద జమకట్టివుండేదా? అప్పుడు తనపాదాలు ప్రక్షాళనంచేసి, కాలిగోళ్ళను శుభ్రంగాకడిగి ఆ చరణోదకాన్ని ప్రేమగా పానం చేసి వుండేది। ఏనాటికైనా లక్ష్మికి చరణోదకం తాగించి తీర్తాడు.

'రామదాసూ।'

'ఏమిటి? రామదాసు అనకండి, అధికారిగారూ అనండి!'

'ఆ వంటలక్కతో చెప్పు, నరసింహదాసు ఇవ్వాళ వెళ్ళిపోతున్నారని!'

'వెడితే వెళ్ళండి!'

'నువ్వే ముందు ఆమెతో చెప్పు!'

'నువ్వు, నువ్వూ అని రెట్టిస్తే బావుండదు, బావుండదు. ఆమెకు చెప్ప వలసినపనేమీలేదు. దారిఖర్చుకు డబ్బు ఆమె నిన్ననే ఇచ్చింది.'

రామదాసు జోలిలోనుంచి అయిదురూపాయలుతీసి నరసింహదాసుముందు పారేశాడు.

ఆమె నన్ను అవమానం ఎందుకు చేయవలసి వచ్చిందో అడగాలనుకుంటు న్నాను. ఆమె నన్ను పోకిరి వాడంటుందా? మా ఆచార్యులవారిని తిడుతుందా?'

'ఆచార్యులవారిని ఎప్పుడు తిట్టింది?'

'తిట్టింది. తిట్టలేదా? పూజా పునస్కారాలు ఎప్పుడు ఆచార్యగురువులు, మామూలుసమయంలో పలుకే బంగారమవుతుంది. ఇవ్వాళ్ళ ఆచార్యగురువునని చెప్పుకుంటున్నాయన బండారం నాకు తెలియకపోలేదులే! నిన్నటిదాకా మామూలు మనిషే! ఇలా అనడం తిట్టుకాదా?'

'అయ్యా, సాధువుగారూ! ప్రపంచంలో సత్యం అనేదానికి కాస్తంత విలువ వుంచండి.'

లక్ష్మి లోపల్నుంచివస్తూ అన్నది—'సాధువులైనవాళ్ళు అబద్ధాలు మాట్లాడ కూడదు! ఛీ ఛీ!!'

'ఛీ ఛీ ఏమిటి? నన్ను పోకిరివాడంటావా? ఆఁ, నీ కెన్ని గుండెలు? ఆఁ....'

'రామదాసూ!' లక్ష్మి గర్జించింది—'మెడబట్టి బయటికి గెంటు! ఇతను సాధువు కాదు, మహా రాక్షసుడు! ఇతడిమెదడు సరిగా పని చెయ్యడంలేదు. మాయమోహంలోపడి కొట్టుకలాడుతున్నాడు. నేను ప్రొద్దున స్నానం చేస్తూంటే తడికసందులోంచి ఏం చూస్తున్నాడో అడుగు? వీడు మనిషా? పశువా?'

లక్ష్మి బుసలుకొట్టుకుంటూ లోపలికెళ్ళింది.

రామదాసు లేచి నరసింహదాసును మెడబట్టి బయటికి గెంటాడు. నరసింహదాసు మెట్లమీద పడ్డాడు. ముక్కులోనుంచి రక్తం కారుతున్నది.

'జై హింద్ రామదాసుగారూ! ఇదేమిటి? ఏం జరిగిందేమిటి?' బాలదేవ్ రక్తంచూసి గాభరా పడిపోతాడు.

'ఏమీలేదు. ధర్మవేషంలోవున్న సాధువు. శరీరంలో ఎక్కడా సాధుస్వభావం లేదు. లక్ష్మితో వాదానికి దిగాడు.'

'అయితే దెబ్బలాట ఎందుకు జరిగింది? పనులన్నీ శాంతంగా సమకూర్చుకోవాలి. హింసకు పూనుకోకూడదు.'

'రామదాసూ! బాలదేవ్‌గారిని లోపలకు పంపించు!'

నరసింహదాసు ముక్కునుంచి కారుతున్న రక్తాన్ని తుడుచుకుంటూ బాలదేవ్ అనే పేరుగల ఖద్దరుధారి లోపలికి వెళ్ళడం చూస్తున్నాడు. తిన్నగా లక్ష్మి గదిలోకే! 'జై హింద్ బాలదేవ్‌గారూ!'

బహుశా ఈ ఖద్దరుధారి, లక్ష్మి ఒకే ఆసనంమీద కూర్చున్నట్టుగా వుంది. దగ్గరదగ్గరగా ఒకరి శరీరం ఒకరికి తగిలేవిధంగా! సరే!

## పదమూడు

ఊరిగ్రహాలు సరిగాలేవు.

సిద్ధాంతిగా రొక్కరే కాదు. ఊళ్ళోని మోతుబరులంతా లోలోపల బాగా ఆలోచించి మరీ అంటున్నారు-ఊరిగ్రహాలు సరిగాలేవు.

తాసిల్దారును స్టేట్ వర్కిల్ మేనేజరు ఒంటరిగాపిలిచి 'సంవత్సరంనుంచి బకాయి ఎవరైతే వున్నారో, వాళ్ళందరిమీద ఫిర్యాదు చెయ్యి! 68 బి. నోటీసు అందరికీ ఇప్పించు. జప్తునోటీసు లిప్పించేందుకు నౌకరునుతీసుకొని వెళ్ళవలసిన అవసరంలేదు. కచేరీలో కూర్చొనే దస్తువేయించినట్టు రసీదు తీసుకో. ఇద్దరు

ముగ్గుర్ని సాక్షులుగా వేసుకో. స్టేటుతరపువాళ్ళకు డబ్బు లిప్పించుదాం. ఈ కాంగ్రెసువాళ్ళను నమ్మడానికి వీల్లేదు' అని చెప్పారు.

సింగ్, యాదవులంపేటలో రౌడీలు రొమ్ము విరుచుకుని నడవడం సహించ లేకపోతున్నారు. సిద్ధాంతి అన్నదాంట్లో తప్పేమీ కనిపించడంలేదు—మాట్లాడితే బాణాకర్ర, బల్లెమూ చూపిస్తారు. ఎదురుగా వచ్చేవాళ్ళను నమస్కరించడం మానే శారు - ఈ యాదవులు। కలియా కనిపించినప్పుడు వెటకారంగా నమస్కరిస్తాడు. పాములూ, జెర్రులూ పాకినట్టుగా ఉంటుంది. సింగ్‌గారుమాత్రం ఏం చేస్తారు? రాజపుత్రపేటలోని కుర్రవాళ్ళుకూడా నెమ్మదిగా యాదవులతో కలిసిపోతున్నారు. రోజూ సాయంత్రంపూట వాళ్ళ హరికథలకుకూడా హాజరవుతున్నారు. హరగౌరీ అన్నదాంట్లోకూడా అసత్యం లేకపోలేదు—పరిస్థితి ఇలాగేవుంటే, మరో అయిదు సంవత్సరాలతరువాత గొల్లలు మన ఆడపిల్లల్నికూడా అడిగేట్టున్నారు. హరగౌరీ చెప్పిన ఆ నల్ల నిక్కరువాళ్ళను పిలిపించుకోవలసిందే. కర్రలు, బల్లేలూ ఎలా ఉపయోగించాలో నేర్పేందుకు ఒక మాస్టరు వస్తాడట. ఏదో 'సంయోజక్' అనో 'సంచాలక్' అనో అన్నాడు. హిందూరాజ్యం - మహారాణాప్రతాప్, శివాజీల రాజ్యంగా మారిపోవాలి. హరగౌరీ ఈమధ్య పెద్దపెద్దమాటలేవో ఉపయోగిస్తున్నాడు.

సమిష్టి విందురోజున సింగ్ అలిగిన ఖేలావన్‌సింగ్ యాదవ్‌ను ఇంట్లో నుంచి బలవంతంగా వాటేసుకొని మరీ తీసుకెళ్ళాడు. అయినా ఖేలావన్‌సింగ్ ఎడమొహం పెడమొహంగానే ఉన్నాడు. సిద్ధాంతి రోజూవచ్చి వెడుతున్నాడు. సకల్‌దీప్‌కు పద్దెనిమిది సంవత్సరాల వయస్సులో తల్లి లేదా తండ్రి వియోగం రాసిపెట్టివున్నదని ఆయన అన్నాడు. ఇప్పుడు సకల్‌దీప్‌కు పదహేడో సంవత్సరం. సకల్‌దీప్‌తల్లి రోజూ కుర్రవాడికి పెళ్ళిచెయ్యమని గోలపెడుతూ ఉంటుంది. కొడుకు వకీలుకావాలని ఆతని కోరిక। కాని కాళీమాతకు ఇష్టం లేదు. పెళ్ళయిన తరువాత ఇంకేం చదువుతాడు? మాతాపితల వియోగం। బాలదేవ్ ఊళ్లో వున్న వాళ్ళందర్నీ ఉద్ధరించడానికి పూనుకున్నాడేగాని ఇంట్లోవాళ్ళనుగురించి ఆలోచించా లనే ఆసక్తే లేదు. పగలంతా తాసిల్దారుగారింట్లో కూర్చుంటాడు. సాయంత్రం సంకీర్తన. కమలానది ఒడ్డునున్న భూమి కలరూ పాస్వాన్‌తాత ఎప్పుడో పాలుకు తీసుకున్నారు; ఆ పట్టాకాస్త కలరూనడిగి మళ్ళా తిరిగి రాయించడమో, రిజిష్టరు

చేయించడమో చూడవయ్యా అంటే చెవికెక్కించుకోనేలేదు. నాగలిదున్నే గోనాయ
విన్నటినుంచి నాగలిపనికి రావడం మానేశాడు. అదేమిటిరా అంటే, కిందటి
సంవత్సరం తనకు రావలసిన బకాయి ఇప్పించకపోతే వచ్చేదిలేదన్నాడు. బాల
దేవ్ కళ్ళప్పగించి చూశాడు; మాట్లాడనే లేదు. పైగా - బీదవాళ్ళకు ఇవ్వవలసిన
జీతం ఇచ్చివేయడం మంచిదన్నయ్యా అని సలహాకూడా చెప్పాడు.

సిద్ధాంతి పద్దెనిమిదిసంవత్సరాల నూతనవధువు కంచీరావాలికి భోజనం
చేశాక కడుపునొప్పిగా ఉంటున్నది. గత సంవత్సరంనుంచి అన్నతరువాత పొట్ట
చేత్తోపుచ్చుకొని పడుకుంటుంది. ఈ సంవత్సరం ఆ బాధ మరింత పెరిగింది.
డాక్టరుకు చూపిస్తే? వద్దు, వద్దు!! డాక్టరు పొట్ట మోగించి మరీ చూస్తాడు; నాలుక
చూస్తాడు; కనురెప్పలు పైకితీసి చూస్తాడు. మలమూత్రాలనుగురించి ప్రశ్నిస్తాడు.
పైపెచ్చు రక్తంకూడా పరీక్షచేయాలని అనవచ్చు. ఈమధ్య రోజా అంటున్న
దామె - డాక్టరుగారు దంపకు ఒక్క ఇంజెక్షన్ ఇచ్చేప్పటికే వ్యాధి పూర్తిగా నయ
మైందట! ఇలాగే ఆమెకుకూడా కడుపునొప్పి బాధే! ఆడవాళ్ళకు నచ్చజెప్పడం
ఆ బ్రహ్మతరంకూడా కాదు. ఆడవాళ్ళంతా ఒకటే. పట్టు పట్టారంటే వదలరు.
సిద్ధాంతికి నలుగురు భార్యల అనుభవం వున్నది. మొదటిభార్య ఎప్పుడూ తిరు
నాళ్ళకూ, జాతర్లకూ ఎగబడేది. ఎంత చిన్నదైనా వదిలేదికాదు. తిరునాళ్ల అనడం
తోనే సిద్ధాంతికి పరమానన్‌యూ గుర్తుకొచ్చేవాడు. ఇక అతనిదగ్గరికెళ్ళి సొగు
డుతూ కూర్చునేవాడు. అతని బండిమీదనే తిరునాళ్ళకు పంపించాలి! న్యాయాన
పరమానన్ బండితోలుకొని మరీ తీసుకెళ్ళేవాడు. ఎప్పుడూ బాడుగ అడిగినపాపాన
పోలేదు. చివరకు దానిచావు తిరునాళ్ళలోనే జరిగింది. ఆ సంవత్సరం అర్ధోదయ
మేళాలో కలరావ్యాధి తీవ్రంగా వ్యాపించింది. ఇక రెండోదానికి హుక్కా తాగే
అలవాటున్నది. బ్రాహ్మణకులంలోపుట్టి హుక్కా తాగడమా? సిద్ధాంతి ఏం
జేస్తాడు? ఆడదానిమాట! ఆవిడకు జబ్బుచేసినప్పుడల్లా తనే హుక్కా తయారు
చేసి ఇచ్చేవాడు. అసలే దగ్గుమనిషి. అట్లాగే దగ్గుతూ దగ్గుతూనే కన్నుమూసింది.
ఇక మూడోభార్య ఊళ్ళోవున్న మగపిల్లలతో సరదాగా నవ్వుతూ మాట్లాడడం
మానెయ్యనన్నది. ఈ కంచీరావాలీకేమో డాక్టరు మందుమీద మోజుగా వున్నది.
పట్టుపట్టి కూర్చున్నది. ఉన్న ఏకైకపుత్రుడు రామనారాయణ 'పండిత పుత్రుడు'గా

తయారైనాడు. కుంత! విద్యాపతి నాట్యం నేర్చుకున్నాడు. తాంత్రికులపేటలో మఠాం. బ్రాహ్మణులపేటలో వాళ్ళగురించి గుసగుసలు ప్రారంభమయినాయి. పిల్లనిచ్చేవాడు ఎవరూ కన్పించడంలేదు. సిద్ధాంతిగారుమటు కేం జేస్తాడు? హస్తం చూద్దామంటే - ఊర్ధ్వరేఖ చిన్నగా చూపుడువేలుదాకా వెళ్ళిపోయింది. దశమ గదిలో శని వున్నది. నెత్తిన నోరుబెట్టుకొని మరీ చెప్పాడతను — ఒరేయ్ పేరు రామనారాయణమిశ్ర అని చెప్పుకోరా అని. వింటేనా? పల్లెటూరివాళ్ళలాగానే పేరును హ్రస్వంచేసి 'నామ్‌లరైన్' అని చెప్పుకుంటాడు. రామనారాయణనిచ్చి కచేరీరావాలని డాక్టర్‌దగ్గరకు పంపిస్తే ఫీజు తీసుకుంటాడు.

నరసింహదాసు ఊళ్ళోని ప్రతిఇంటికీవెళ్ళి గ్రామపెద్దలందరితోనూ చెబుతున్నాడు - ఆచార్యులుంగారు వస్తున్నారు. మఠానికి తానే మహంతు కాదగినవాడు. ఆ పదవి తనకే లభించాలి. మహంతు ఉంపుడుగత్తెకు. దాసీకి మఠానికి సంబంధించిన వ్యవహారాలలో మాట్లాడేఅధికారం ఎంతమాత్రం లేదు. రామదాసు గొర్ల కాపరి. ఇంతపెద్ద మఠాన్ని నిర్వహించడం ఆ బైతుకేం తెలుసు? రామదాసుని వట్టి మట్టిబుర్ర! బర్రె బుర్ర అంటాడు. తాను బి.ఏ. దాకా చదివాడు. టీజక్ గ్రంథపఠనం ఇంగ్లీషులో జరిపిస్తాడు. క్రాపింగ్ పెట్టుకున్నాడు. ధోవతి చొక్కా ధరిస్తాడు, మీసాలు సగంవరకే ఉంచుతాడు. మఠంలో ఒక స్కూలు పెట్టిస్తాడు. ప్రజలకు వీలైనంతమేలు చేకూర్చడానికి పాటుపడతాడు. మీరంతా తెలివిగలవాళ్ళు. ఆలోచించండి. దాసీముండ మఠాన్ని నట్టేట్లో ముంచేసింది. సాధుధర్మాన్ని మంటగలిపేస్తూంది. ఈ విషయమై మీరు గట్టిగా ఆలోచించి చూడండి.

తాంత్రికులపేటలో పంచాయతీసమావేశం జరిగింది. ఆ పేటలోని ఆడవాళ్ళెవరూ ఇకముం దెప్పుడు యజమానులపేటలో అడుగుపెట్టకూడదని కట్టడి చేయడం జరిగింది. వాళ్ళింట్లో పని ముట్టుకోకూడదని శాసించారు. యజమానులు సాయంత్రంపూట పేటవైపుకువస్తే రావచ్చు. కాదనేదిలేదు. అయితే ఎవరింట్లోకి రావడానికి వీల్లేదు. కూలినాలిపల్ల వచ్చినదాంతోనే సరిపెట్టుకోవాలి. పై ఆదాయం కోసం పాకులాడకూడదు. నోఖేను. ఉచితదాసును కాపలా ఉంచడం జరిగింది. వీళ్ళ ఎవరైనా దారితప్పితేమటుకు తోలు ఒలిచేస్తారు.

తాంత్రికులపేట ఈ కట్టడినిచూసి కుమ్మర్లపేట, దర్జీలపేట, మాల

దాసర్లపేట మొదలైన తదితర పేటలవాళ్ళుకూడా ఇలాంటికట్టడే చేశారు.... యజ్ఞోపవీతం వేసుకుంటేనే సరిపోయిందా? ఆచరణలోకూడా ఉండాలి. బ్రాహ్మణుడా! బ్రాహ్మణుడా! నీ ఆచారమెంత అంటే నీటికొద్దీ అన్నాడట! యజమానుల పేటనుంచి వాళ్ళబాబులు సంథాల్‌పేటకు వెడతారు. సాయంత్రంపూట, రాత్రిపూట కూడాను! వాళ్ళ ఆడవాళ్ళతో పరాచకాలుకూడా ఆడవచ్చు!....సంథాలపేటవాళ్ళు ఎప్పుడూ ఎల్లంబులు గురిబెట్టి మరీ కూర్చొనివుంటారు!

కుమ్మరిపేట యువకులంతా నిన్నరాత్రి శివశంకర్‌సింగ్‌ను నీళ్లు తాగించి సంతపని చేశారు. పేటచివర, సిపాయిలపేట వెదురుపొదలపక్కనున్న రుబరీ ఇంట్లో దూరబోయాడు. పొదలచాటున కుర్రాళ్లు పొంచివున్నసంగతి అతగాడికేం తెలుసు? రుబరీకి పదిరూపాయల జరిమానా వేయడం జరిగింది. ఎట్లాగైనాసరే, ఇచ్చుకోవలసిందే! లేకపోతే వెలివేయడం జరుగుతుంది. శివశంకర్‌దగ్గర తీసుకుని చెల్లిస్తేసరి. ఈసారి లాల్‌బాగ్‌తిరునాళ్ళలో పెట్రోమాక్స్‌లైటు కొనాలి. అంతపెద్ద లైటు లేకపోతే పంచాయితీకి విలువలేదు. లైటు కొనడానికి ఇంకో ఇరవైరూపాయలు తక్కువగావుంది. మరొకరోజున మళ్ళీ వెదురపొదల్లో ఒకగంటసేపు నక్కివుండి దోమలబాధ సహించాలి. శ తప్పదు!

కాళీచరణ్ కుస్తీకేంద్రంలో ఈమధ్య మంచికోలాహలంగా ఉంటున్నది. సాయంత్రంపూట పాటలుకూడా బాగా పాడుతున్నారు. కొత్త హార్మోనియం కొన్నారు. గంగామేళానుంచి ఢోలక్‌కూడా తెచ్చారు. ఢంగుమని మోగుతున్నది.

బాలదేవ్‌కు పాటలు పద్యాలంటే ఇష్టమేగాని ఈ గండీలంటే సదభిప్రాయం లేదు. కుస్తీలంటే ఈసడించుకుంటాడు. కండలుపెరిగితే హింసాప్రవృత్తి పెరుగుతుంది. కావలసింది మనోవికాసం! బుద్ధిబలంతో గాంధీజీ ఇంగ్లీషువాళ్ళను ఓడించాడు. గాంధీజీదేహంలో పిట్టంత మాంసంకూడా లేదు. కాంగ్రెసు నాయకులు చాలామంది బక్కప్రాణాలే!

అయినా కాళీచరణ్ కుస్తీకేంద్రాన్ని మూయడం అంటూ జరగదు. డోలు మోతలో కుస్తీపట్టేయువకుల రక్తం ఉప్పొంగించేశక్తి ఏదో వున్నది.

తాక్‌ధిమీ, తాక్‌ధిమీ!

మాదిగకోటన్ డోలుమీద దెబ్బవేశాడూ అంటే వళ్ళు గగుర్పాటు చెందాలి సిందే।

ధిమీ ధిమీ. ధిమీ ధిమీ॥

అందరూ గరిడీకొచ్చి చేరుకున్నారు. గోచీలు. చడ్డీలు పెట్టుకుని. ఒక గుప్పెడు మట్టితీసుకుని నెత్తిమీదవేసుకుని 'అ జ్జా జ్జా జ్జా జ్జా' అనుకుంటూ మైదానంలో దిగుతారు. కాశీచరణ్. 'అ-అ-అలీ' అని మైదానంలో దిగుతాడు. చంపావతి తిరునాళ్ళలో పంజాబీ పహల్వాను ముస్తాక్ ఇలాగే అలీ (లేవా అలీ) అనుకుంటూ మైదానంలో ప్రవేశించేవాడు.

అప్పుడు కోటన్ తాళం మారుస్తాడు—

తకధిమి తకఝుణు. తకధిమి తకఝుణు।

రావోయ్ రావోయ్। కుస్తికి రావోయ్।

గరిడీలో పహల్వాన్లు కుస్తీపట్టే కిటుకులు మార్చేస్తున్నారు. ఎవరూ మరొకరికి చెయ్యికూడా తాకనివ్వడంలేదు. ఎవరికివాళ్ళు మొదటిపట్టు ఎలా పట్టడమా అనే ఆలోచనలో వున్నారు. అదుగో పట్టుకున్నారు—

తకధిమి. తకఝుణు. తధిగిణతోం।

గట్టిగా పట్టుకో।

తాకధిమీ. తాకధిమీ

పట్టెయ్। పట్టెయ్।

తధిగిణతోం తధిగిణతోం।

కొట్టెయ్। కొట్టెయ్॥

కొట్టెయ్యడమయితే జరిగింది. చిత్తుచేయడం మాటలు కాదు. మట్టిని పట్టుకున్నాడు। ఒకడికి మించినవాడు. మరొకడు। ఎత్తుకు పై ఎత్తులు।

తాక్ ధిమీ। తాక్ ధిమీ।

తప్పుకో. బయటికిరా।

ఎత్తుకు తిప్పికొట్టి బయటికొచ్చేశావు. వీరుడవోయ్। మళ్లా ఒకపట్టు పట్టు। డోలు లయకుబట్టి కుస్తీ నడుస్తున్నది.

కాళికాదేవిగుడిలో కాళీపూజ ఉత్సవాలప్పుడు ఈ డోలు లయవిన్యాసం మారిపోతుంది. ధ్వనిలోకూడా మార్పు వచ్చేస్తుంది - ధాగిడ ధిమి, ధాగిడ ధిమి।

జై జగదంబా। జై జగదాంబా।।
మా పూరిని రక్షించు మాత జగదంబా।

## పధ్నాలుగు

వదినా। వదినా।
అదిరేనే నా ఒడలూ
మదిలో రేగెను గుబులూ
నా వదుచుదనం
దూడిదలో పోసిన
పన్నీరేనా వదినా?
నా పెళ్ళెప్పుడు వదినా?

రోడ్డుమీద బళ్ళవాళ్ళు వదినె మరదళ్ళపాటలు పాడుకుంటూ, ఎడ్లను అదిలిస్తున్నారు. 'అహాయ్। పీ యమ్మ। నడవదేంరా। వాపటికి - అరే, గుర్రాన్ని చూసి బెదిరిపోతున్నదీ ఎద్దు।....'

చేతికి గోరింతాకు పెట్టావే వదినా।
చెప్పేదాకా కదలవద్దని ఆదేశించావే వదినా।

మరదలు హృదయంలోవిబాధ బండివాళ్ళకంఠంలోనుంచి కేకలా బయటికి వస్తున్నది. వదినె? కమలకు వదినెలెవరూ లేరు. మనసులోనిబాధ ఎవరితో చెప్పుకోవాలి? 'ప్రేమసాగర్' చదువుదామంటే మనస్కరించడం లేదు—'శుకదేవుడిలా అన్నాడు—'ఓ రాజా। ఒకరోజున శ్రీ కృష్ణుడు మురళిని మోగించుకుంటూ కదంబవృక్షంమీదికెళ్ళి కూర్చున్నాడు.' శ్రీ కృష్ణుడు గోపికలచీరెలు దొంగిలించినప్పటిచిత్రం చూస్తుంటే కమలకు ఏమిటోగా ఉంటుంది. ఆమె 'ప్రేమసాగర్'ను మూసివేస్తుంది.

ఉదయం ప్యారీ వచ్చాడు. ఎంతమంచివాడు ప్యారీ!.... ఇవ్వాళ వంటకాలేం తిన్నావమ్మా? డాక్టరుగారూ ఇవ్వాళ్ళ సమయానికి భోజనం చేశారా? లేక సీసాలు ముందుబెట్టుకొని కూర్చున్నారా? ప్యారీ నవ్వి ఎప్పటిలాగానే సమాధానం చెబుతాడు—'ఏమిటి మీరడిగేది? డాక్టరుగారి విషయమేనా? సరే! ఆయనగారి విషయం నాకేమీ అర్థం కావడంలేదు. ఇవ్వాళ్ళ భోజనం త్వరగా వండమని రోజూ చెబుతారు! కాని యథాప్రకారంగానే తింటారు. పగలు రెండుగంటలకు, రాత్రి పదకొండుగంటలకు! ఇవ్వాళ్ళ క్యాబేజీపులుసు చేశాను. కారం, మసాలా అంటు కునేపనే లేదు. అసలు తిండివిషయంలో ఆసక్తే లేదు! ఏంజేస్తే అది తింటాను... ఇక సీసాలంటారా? ఏం చెప్పమంటారు? చిన్న దోమలు, నల్లులు, కీచురాళ్ళు - వీటిని బెట్టుకొని కూర్చున్నారు. ఇవ్వాళ్ళ సంథాల్‌పేట పల్లెవాడితో చెబుతున్నారు- నాలుగు కుందేళ్ళు, ఒక డజను ఎలుకలు పట్టుకురమ్మని! మంచి బహుమానంకూడా ఇస్తారట!'

ప్యారీ అంటే ఊళ్లోని ఆడవాళ్ళందరికీ ఇష్టమే. ఊళ్లో అతనికి అత్తయ్యలు, పిన్నిలు, అమ్మమ్మలు అనేకమంది వున్నారు. ఊళ్ళోవున్న యువతులందరిహృదయాలను డాక్టర్ పెదవులమీది చిరునవ్వు ఇట్టే కట్టిపడవేస్తుంది. వస్తూనే నవ్వుతూ వస్తారు - భయంగా ఉన్నదా అంటాడు. అవును, భయంగానే వుంటుంది. నీకెందుకు? నీకు నవ్వులాటగానే వుంటుంది నవ్వు. ఆ మెడలో రబ్బరు పంపొకటి ఎప్పుడూ వుంటుంది. ఛాతీమీద, వీపుమీద పెట్టి హృదయంలోని జబ్బును తనిఖీ చేస్తాడు! అంతా అబద్ధం! ఇన్నిరోజులైంది? నా జబ్బేమిటో. నా మనస్సులోవున్నదేమిటో తెలుసుకోగలిగావా? లేకపోతే తెలిసికూడా తెలియనట్టు నటిస్తున్నావా డాక్టర్? నీ నవ్వునుబట్టి ఇలాగే అనుకొనవలసివస్తున్నది. సరేలే డాక్టర్! నిజం చెప్పు? అలా నవ్వుతావెందుకు? నన్ను బాధపెట్టడానికే వచ్చావా ఈ వూరు? కాదు, కాదు! నిజంగా నువ్వు వచ్చివుండకపోయినట్లయితే నేను పిచ్చిదాన్ని అయిపోయేదాన్ని! రోజూ కలలో కమలానది వరదలలో ప్రవహించుకుపోతున్నట్టు అనిపించేది! పెద్దపెద్ద సర్పాలు! నన్ను కాటువేయడానికి మీదికొచ్చేవి! నువ్వొచ్చావు. నన్ను రక్షించావు. నా కనురెప్పలు పైకెత్తిచూడు! నా వీపుమీద గొట్టంబెట్టి పరీక్షించు. నా హృదయంలోనిమాట విను. నన్ను

కోప్పడుతూవుంటే నా కెంతో హాయిగా ఉంటుంది. సూదిపేరుచెప్పి నన్ను భయ పెడతావు: ఏడ్పిస్తావు. నా కెంతో బాధవుంటుంది....మళ్ళా తియ్యటిమందు పంపి స్తాను. అడగటమెందుకు. అలాగే పంపించు. నీ మాటలు తియ్యగాలేవా? నువ్వు తప్పకుండా ఒకసారి వచ్చివెడుతూ ఉండు. రాకపోతే నాకు భయంగా ఉంటుంది. సిపాయిలపేట కుసుమ - డాక్టరు నన్ను తియ్యటిమందు కావాలా? అవి అడిగాడని చెప్పింది. నేను నమ్మలేదు. డాక్టరు అటువంటివాడు కాదు. కుసుమ అబద్ధం చెప్పింది. తియ్యటిమందు మరొకరికి ఇవ్వడానికి వీల్లేదు. డాక్టర్! జాగ్రత్త! కుసుమ కొంచెం కొక్కిరాయి పిల్ల! చాలామందికి అపకీర్తి అంటగట్టింది. హర గౌరి ఆమె పినతల్లి కాదుకే! అయితే....పోనిద్దూ! ఎందుకు? ఆమె అత్తగారి వూరు పారబిస్ గంజ్. భర్త ఒక మార్వాడీదగ్గర సిపాయిగా ఉంటున్నారు. రాత్రి అంతా పహరా ఉంటాడు. కుసుమ సినిమా చూడ్డానికి వెడుతుంది....

'....శుకదేవు డిలా అన్నాడు-హే రాజా! ఒకరోజున యశోమతి గొల్లవా ళ్ళందర్నీ పిలిపించింది.'

'కమలా!'

'ఏమిటి అమ్మా!'

'చదవటం ఆపెయ్! డాక్టర్‌గారు వద్దన్నారు. మందు తాగు. ఆ పుస్తకం తీసుకెళ్ళి పెట్టెలో బెట్టి తాళం వేస్తానుండు. లేకపోతే వద్దంటే వినవు.'

'చదివితే ఏమవుతుందమ్మా?'

'అమ్మాయి! నా మాట వింటావా లేదా? చదివితే ఏమవుతుందో ఆ డాక్టర్ గారినే అడుగు!'

'డాక్టర్‌గారినా?....అమ్మా నీ డాక్టర్ ఎటువంటివాడో తెలుసా? వట్టి మట్టి మహాశంకరుడు!'

అమ్మ గొల్లున నవ్వుతుంది—'ఒక్కొక్క మాట. ఎక్కడెక్కడినుంచో వెదికి మరీ తెస్తావు! సరే, ఉండు! డాక్టర్‌గారిని రానివ్వు చెబుతాను!

కమల ఆతని తల్లిదండ్రులకు గారాబుబిడ్డ. తాసిల్దారు కూతురికి ఇష్టం

లేకుండా ఏపనీ చెయ్యడు. ఆమె నోరుతెరిచి అడగకముందె ఆమె అభీష్టాలను నెరవేర్చడానికి ఆమెతల్లి పూనుకుంటుంది. తండ్రి - రామాయణం, మహాభారతం. శివపురాణం, సావిత్రీ సత్యవంతుడు, పార్వతీపరిణయం మొదలైన గ్రంథాలు చదివించాడు. కమల రోజూ శివుణ్ణి పూజిస్తుంది - ఓం శివశంకర సుఖకర, నాథ వరదాయక మహాదేవ్ । శంకర్ ।... పట్టి మట్టి మహాశంకరుడు।

'డాక్టర్‌గారూ । కమల మిమ్మల్ని పట్టి మట్టిమహా '

'అమ్మా । మాట్లాడకే।'—కమల తల్లిని కౌగలించుకొని చేతితో నోరు మూసింది—'అమ్మా అడగవే మీ డాక్టర్ని. కుంచేళ్ళను ఎందుకు పెంచుతున్నారో?'

డాక్టరు సమాధానం చెప్పలేదు. చిరునవ్వునవ్వి ఊరుకున్నారు. ఆపైని గాంభీర్యాన్ని తెచ్చుకొని - 'అయితే సూది ఇవ్వవలసిందే। మందువల్ల స్పృహ తప్పడం పోయిందిగాని. పిచ్చి....' అని అన్నారు.

అందరూ ఒక్కసారిగా నవ్వారు—తాసిల్దారు, తల్లి, ప్యారూ। కమల మొహం ఒక్కసారిగా ఎర్రబడిపోయింది. నేనివ్వాళ్ళ రక్తపుపోటుపరీక్ష చేయించుకోను. సరే, నేను పిచ్చిదాన్ని।'

'దీదీ (అక్కా)।' తాసిల్దారు కూతుర్ని దీదీ అని పిలుస్తారు—'రామ్మా। డాక్టరుగారికి ఆలస్యమవుతోంది.'

బ్లడ్ ప్రెషర్ పరీక్ష చేసేప్పుడు డాక్టర్ గాంభీర్యంగా యంత్రంవైపుచూస్తూ ఉంటాడు. కమల క్రీగంటిచూపులతో డాక్టర్ని చూస్తుంది. ఏమన్నావు? నేను పిచ్చిదానినా? నన్ను పిచ్చిదాన్ని చేస్తున్నదెవరు?

ఊళ్ళో తాసిల్దారు ఒక్కడే టీ తాగుతాడు. అందులోనూ మేలురకమైన తేయాకు ఉపయోగిస్తాడు. డాక్టరు ప్రతిరోజూ ఇక్కడకు టీ తాగడానికి వస్తాడు. కమలతల్లి బలవంతం చేసింది - రోజూ సాయంత్రంవచ్చి టీ తాగి వెళ్ళమని।

డాక్టరు ఇంటిమనిషి అయిపోయాడని తాసిల్దారు అంటూఉంటాడు. డాక్టర్‌కుకూడా తాసిల్దార్‌తో ఘనిష్టసంబంధం ఏర్పడిపోయింది. తాసిల్దారు ఊళ్ళోని సంగతులు, ఇంట్లోనిసంగతులు, జిల్లాలోనిసంగతులు, కొత్తవీ పాతవి ఎన్నెన్నో చెబుతూఉంటాడు. పార్‌బంగా ఎస్టేట్ జనరల్ మేనేజరు దఫ్ ప్రస్తుతం భార

దేశ వేషభూషణలకు అలవాటైపోయాడు. ధోవతి చొక్కా వేసుకుంటాడు. అప్పు డప్పుడు బొట్టుకూడా పెట్టుకుంటాడు. పారదంగా రాజకుమార్ అతను ఎంతచెబితే అంత! దఫ్గారికూతు రిక్కరున్నంతవరకు రాజకుమార్ ఆయనను ఉద్యోగం నుంచి తొలగించేదే లేదు....మహారాణి చంపావతి అడవిమూలిక అమ్మకునేజాతికి చెందింది. రాజా భూపత్‌సింగ్‌కు ఇంగ్లీషు భార్యవల్ల ఇద్దరుకొడుకు లున్నారు. రాజా భూపత్ మహా భోగలాలసుడు మంచి పోలోఆటగాడు. డార్జిలింగు గుర్రపు పందేలలో ప్రతిసంవత్సరం ఆయనగుర్రం గెలుస్తుంది. ప్రస్తుతం ఇరవై రెండు గుర్రాలున్నాయి. మహావిషయలంపటుడు. పూర్ణమాసంలో బెనారెసు, అలహాబాదు, లక్నోపట్టణాలనుంచి వేశ్యలొస్తారు. మూడురోజులు రాత్రిందంగళ్ళు గానాబజానా సంరంభం - కొనసాగుతూనేవుంటుంది. ఒక నిమిషంపాటుకూడా ఆగిపోదు. ప్యారిస్ మద్యం పేపిస్తాడు. అసలైన పిసలైన రాజాఅంటే ఈయనే: పారదంగా రాజా వట్టి పిసినారి రకం. జిల్లా అంతటికీ మోతుబరిఅయిన రైతు, బోలాబాబు. ముప్పైవేల బీఘాలభూమి వున్నది. దహావా ఎస్టేటుకుచెందిన గురుబంశిబాబు కూడా రైతే! ఆయనకు ఆయనే సాటి! దానకర్ణుడు. వార్‌ఫండు (యుద్ధనిధికి)కు అందరికంటే ఎక్కువ దట్టిచ్చారు. కాంగ్రెసు నిధికికూడా ఎక్కువ ఇచ్చింది ఈయనే! దీన్నే న్యాయమంటారు. ఇంత దానధర్మాలు చేసినందుకు ఫలితం ఏం దక్కిందో తెలుసునా? ప్రజలు దొంగనోట్లు అచ్చు గొట్టించాడని పుకార్లు లేవ దీశారు. కోశి, గంగానదితీరానవున్న వేలాది ఎకరాలభూమే నోట్లు అచ్చు గొట్టించి ఇస్తుంది. దున్నవలసిన పనిలేదు; కూలినాలి అవసరంలేదు. వరదనీరు తీశాక ఆ వండ్రుమట్టిలో శనగ, మినుము, బటాణీ, అవాలు చల్లితేచాలు. చల్లడం ఒక్కటే శ్రమ. కోశి, గంగానదీజలాలలో స్నానమాడిన భూదేవి మనసారా తన ఐశ్వ ర్యాన్ని అందిస్తుంది... జిల్లాకాంగ్రెసు నాయకుల్లోకల్లా శివనాథచౌదరి చెప్పుకోతగిన వాడు!... ఆయనను మీరు ఎరుగుదురుగా? ఆయనకూడా పెద్ద రైతే!....పూర్ణియా న్యాయస్థానంలో న్యాయవాదిగా పి. పి. మంచి పేరుప్రఖ్యాతులు గడించాడు. మరొక రెవరూ ఆయనకు సాటిరారు. హైకోర్టు బారిష్టరుకూడా ఆయన అవునన్నదాన్ని కాదనలేకపోయేవారు. ఒకపర్యాయం ఒక ఖూనీకేసులో రాజా భూపతి పదివేల రూపాయలు ఫీజుగా ఇవ్వజూచాడు. ఆయన తన నిజాయతీకి పిళ్ళు వదలలేదు.

మాటంటే మాటే! కోర్టుగడప తొక్కలేదు. కాగితాలు చదివి ఒక్కచోట ఒకపంక్తి కొట్టేశాడు; మరొకచోట ఒక్క అక్షరం తొలగించాడు. రాజా భూపతి నిర్దోషిగా విడుదలయ్యారు ... ఇప్పు డానాటి అయోధ్య లేదు. ఆనాటి శ్రీరామచంద్రుడూ లేడు.

'నాన్నా!'

'ఏమిటమ్మా!'

'డాక్టరుగా రివ్వాళ్ళ ఇక్కడే భోజనం చేస్తారు.'

'ప్యారీతో పోట్లాట కొనితెచ్చుకోవాలనుకుంటున్నావా తల్లీ!'

'ప్యారీకి ముందే చెప్పేశాను.'

'అయితే డాక్టరుగారూ! నాకెప్పుడూ ధైర్యం చాలలేదు. చెప్పడానికి! అమ్మాయి చెబుతున్నది మీ కావిడమీద వాత్సల్యంవుంటే....'

వాత్సల్యం విషయం కాదనుకోండి!....'

'కారం, మసాలా తినరు!' కమల మధ్యలోనే అనేసింది—'ఉడకబెట్టిన కూరలుమాత్రమే తింటారు ఇంకేగా!'

డాక్టర్ లోలోపల అనుకున్నాడు - వ్యాధి ప్రతిరోజూ పెరిగిపోతూనే వున్నది ....శీల వుంటే ఏదో ఒకటి చెప్పేది. 'భావాత్మక సంక్రమణం' లేదా 'ప్రత్యావర్తస్థితికి వ్యాధి చేరుకున్నదనో ఏదో చెప్పేది!'

## పదిహేను

సుమరితిదాసును ప్రజలు పట్టి బూనాచిమషిషి అంటారు. అయితే అతగాడు అప్పుడప్పుడు అద్భుతమైనసంగతులు పట్టుకొస్తాడు. ప్రస్తుతం అతన్ని 'విస్తంత్రి వార్తాహరుడు' అని అంటున్నారు. అంతా! సంక్షిప్తంగా అనాలంటే విస్తంత్రి. విషయం చిన్నదైనా, పెద్దదైనా సరే కొత్తదైతే చాలు. ఆ వార్త ప్రతిఇంటికీ అందవలసిందే! తాసిల్దారుగారి పందమందే కోర్టుపక్షి సాక్ష్యం ఇస్తూ ఇస్తూ

వృద్ధుడైపోయాడు. ఆస్తు వసూళ్ళసందర్భంలో తాసిల్దారుపక్కన నిలబడివుంటాడు. భూమిసంబంధమైన ఏ సమస్యవున్నా. తాసిల్దారుకంటే ముందు సుమరితదాసుతో మాట్లాడాలి. రైతుల్ని ఒంటరిగాతీసుకెళ్ళి - తాసిల్దారు నే నెంతచెబితే అంత ! టీ తాగడానికి ఎంతో కంత నువ్విచ్చినానరే, ఇవ్వకపోయినా సరే - నీ ఇష్టం-అయితే తాసిల్దారుగారి చేతిలో నువ్వెంత పెట్టదలచుకున్నావో అది ...' అని అంటాడు.

స్వల్పమైన వస్తువుల రైతులనుంచి తాసిల్దారు ఎలా అడుగుతాడు ? వాటివి సుమరితదాసే వసూలు చేస్తూవుంటాడు - సొరకాయలు, వంకాయలు, కాకర కాయలు, పసుపుగొమ్ములు, ఆవనూనె ఇలాంటివే। ఇవన్నీ సుమరితదాసు తన కోసం తీసుకుంటాడు. అయితే ఈ వస్తువులు తీసుకొనేప్పుడు రైతులతో ఏకాం తంగా—'ఇవన్నీ నా కెందుకూ ? నేనేం చేసుకుంటాను ? నాకు ఇల్లా, వాకిలా ? ఒక పొట్టకోసం ఎంత కావాలి ? ఇవన్నీ....' అని అంటాడు.

ఎప్పుడూ తాసిల్దారుగారింట్లో కూరగాయలే కొనరు. సుమరితదాసు ఎవరి నైనా ఎందుకు దేబిరిస్తాడు ? ఆతనిస్థితి సరిగా లేకపోయినంతమాత్రాన వంశ మర్యాదనుకూడా మంటగలుపుతాడా ? అతని ముత్తాతలు ఐశ్వర్యంతో తులతూగారు. అంతా విధిలిఖితం... సుమరితదాసునోట్లో ఏ మాటా దాగదు. అందుకే కాళీచరణ్ అంటాడు - నోట్లో పళ్ళులేవు. అందుకే ఏమాటా నోట్లో ఆగదు। విస్తంత్రి।

విస్తంత్రికి చాలా సంగతులు తెలిశాయి. మొదటిసంగతి ఏమిటంటే— పరమరనుంచి మఠానికి ఆచార్యగురువు వస్తున్నారని, నరసింహదానును మహం తుగా కలెక్టరుకూడా ఒప్పుకున్నాడనేది। ఇక రెండవసంగతి : 'రేపటినుంచి కళ్ళం ప్రారంభమవుతుంది. భాద్రపదమాసపు పంట వచ్చింది. తాసిల్దారుగారు రేపు మంచి రోజన్నారు।' అని.

తాసిల్దారు కల్లంతోపాటే ఊళ్ళోని ఇతరరైతుల కల్లాలుకూడా ప్రారంభ మవుతాయి. తాసిల్దారుగారిది పెద్దకల్లం। రెండువేల మణుగులధాన్యం అవుతుంది. ....మూడవసంగతి చెప్పడమే మరచాడు విస్తంత్రి। తిరిగొచ్చి మరీ చెప్పివెళ్లాడు- 'బట్టలు, నూనె, పంచదార కార్డులు పంచేపని బాలదేవ్ కిచ్చారు. డాక్టర్‌గారి పేరు కూడా అందులో వున్నది; అయితే. ఆయన - నాకు తీరిక లేదన్నాడు. నన్ను

పిలిచి 'దాసుగారూ! నాపని మీరెందుకు చేయకూడదు? అని అన్నారు. నాకూ తీరిక లేదని నేను చెప్పాను.'

ఆచార్యగురు రాకవిషయం పెద్ద విలువైనది కాకపోవచ్చుగాని తక్కిన రెండువిషయాలు - ఒకవేళ నిజమైతేమటుకు నిజంగా విలువైనవే!

నిజమేనని బాలదేవ్‌కూడా అన్నాడు.

కల్లాము!

సంవత్సరంపొడుగూ గడించిన పంటలాలూకు లెక్కా-డొక్కాలన్నీ ఈరోజే తేలిపోతాయి. రెండునెలలు కోతలు, ఒకనెల నూర్పిడి, ఆతరువాత పొలాల పనులు! కళ్ళంలో ధాన్యం నూర్చి సంవత్సరంపొడుగూ చేసిన అప్పుల లెక్కాలు చూపి తీర్చవలసివుంటుంది. ఇంకా ఇవ్వవలసిన బాకీలు మిగిలివుంటే మళ్ళా తెల్ల కాగితంమీద వేలిముద్రవేసి ఇవ్వు. లేదా అప్పులన్నీ తీర్చాలనివుంటే ఎడ్లనూ ఆవుల్నీ కుదవపెట్టు! లేకపోతే మళ్లా అప్పు చెయ్యి. ఈ చక్రం ఇలా నడుస్తూనే ఉంటుంది. కళ్ళంలో ఎడ్లమందమతోలి నూర్పిడి చెక్కడం జరుగుతుంది. ఎడ్ల మూతులకు చిక్కాలు తొడుగుతారు. పేదసాదల, భూమిలేనివాళ్ళ పరిస్థితికూడా కళ్ళంలోని ఎడ్లతో సమానమే. నోటికి చక్కం! కళ్ళం వ్యామోహం! ఎప్పుడూ ఉంటూనే ఉంటుంది. గుర్రికొయ్యలు పొడవకముందే లేచి కళ్ళం నూర్చడానికి లేవవలసి వుంటుంది. ఇక సూదిలాగా వంటికి గుచ్చుకునే తెల్లవారుఝాము మాఘ మాసపు చలిగాలి శరీరానికి అంటనే అంటదు! ధాన్యంమీదుండే వ్యామోహం అలాంటిది!

జోరునపడే మంచుకి కళ్ళంతా తివ్వన లాగుతుంది. చేతితో ముక్కు అంటుకోవడంకూడా కష్టంగానే ఉంటుంది. అప్పుడు మళ్ళా ఎండుగడ్డి కాస్తంత వేసి చలిమంటదగ్గర కూర్చోవలసివస్తుంది. చలిమంటలో చిలకదదుంపలు మగ్గుతూ ఉంటాయి. చలిమంటదగ్గర వళ్ళు వెచ్చజేసుకునేవంతు వచ్చినవాళ్ళువచ్చి ప్రభాత గీతాలు పాడుతూఉంటారు - 'హరిబినూకే పూరిహై, ధోరేసు అరథ్. హరిబినుకే' లేదా - నిర్బల్‌కే బలరామ్‌హో సంతో, నిర్బల్‌కే రామ్!

పగలంతా గడ్డి తిరగేస్తూ, ఆతరువాత ధాన్యం తూర్పారపట్టడం జరిగింది.

మళ్ళా నూర్పిడి ప్రారంభమైంది. సాయంత్రం చలిమంటదగ్గర కథా కాలక్షేపం జరుగుతుంది.

రామరామ దైవమా, ఈశ్వరా మహదేవా
వామపార్శ్వంలో దుర్గా, కుడివైపున కాకము
మానిక్ సర్దార్ తనలో అనుకొనె -
కన్నౌజాగొల్లడు మాటలతో వివరవి

బట్టలు, మానె, పంచదార కార్డులు ఇదివరలో కమలదాహాకుచెందిన కమరుద్దీ వంచిపెడుతూ ఉండేవాడు. మేరీగంజ్‌నుంచి కమల్‌దాహా పదికోసులదూరంలో వున్నది. పదికోసులదూరం పెద్దదూరంలో లెక్కకాదుగాని, కార్డు దొరకడమే పెద్ద అదృష్టంగా భావించడం జరిగేది! కమరుద్దీబాబు కూరగాయ లమ్ముకునేవాడు. వంకాయల అమ్మకంతో జమీందారయ్యాడు. ముస్లింలీగు లీడరు కూడాను. కటిహార్, పూర్ణియా రోడ్డుపక్కనే వుంది ఇల్లు. ఎప్పుడూ అధికార్లు ఆయనింటికి వస్తూ పోతూ ఉంటారు. నెలకు అరవైకోళ్ళు సఫా అవుతూవుంటాయి. కొత్త ఎస్. డి. ఓ. వచ్చినప్పుడు ఆయన పెద్ద ఆఫీసరని ఆ ప్రాంతంలో మోగిపోయిం దని లోకులు అనుకుంటూ ఉంటారు. ఎక్కడికీ వెళ్ళేవాడు కాదట! అయితే కమరుద్దీబాబు మనుషుల్ని అంత తేలికగా వదిలేరకం కాదుగా! ఎస్. డి. ఓ. డ్రైవరు మహమ్మదీయుడు. కురాను పేరుజెప్పి అతనికి తమలపాకులబీడా అందించాడు. ఒకసారి కటిహార్‌నుంచి తిరిగొస్తూఉంటే కమరుద్దీబాబు ఇంటిముందుకొచ్చేప్పటికి ఎస్. డి. ఓ. కారు చెడిపోయింది. రాత్రి పదిగంటలకు ఆయనెక్కడికి వెడతాడు? ....ఆ తరువాతనుంచి కమరుద్దీబాబు కళ్ళుమూసుకుని బ్లాక్ చెయ్యడం ఆరంభించాడు. ఒకసారి పూర్ణియా సమావేశంలో కాంగ్రెసుకుచెందిన ఖుషాయ్‌బాబు అధికారితో - ప్రజ గోలపెడుతున్నారని చెప్పాడు. కమరుద్దీబాబు నవ్వుతూ హిందూ ప్రజా, ముస్లిం ప్రజా అని అడిగాడు. అధికారికికూడా అర్థమైంది - కమరుద్దీబాబు ముస్లిం లీగుకు చెందినవాడు, అందుకే ప్రజలు దోష మారోపిస్తున్నారు. ఇప్పుడు బాలదేవ్ కార్డులు వంచిపెడతాడు, బాలదేవ్‌కు విదేశవస్త్రాలతో పనేమిటి? ఖద్దరు తప్పించి మరోబట్టను అంటుకోరు కూడాను....అంటుకుంటారు, అంటుకొనడానికి అభ్యంతరమేముంది?

'జై! గాంధీమహాత్మునికి జై!' రేపు నూర్పిడికళ్ళం ప్రారంభమవుతుంది. కిందటిసారి నూర్పిళ్ళప్పుడు జాలింపింగ్ నాట్యం ఏర్పాటయింది. జాలింపింగ్ సిపాయిల కులస్థుడైవుండి మాదిగమ్మాయిని పెళ్ళి చేసుకున్నారు. ఈసారి కీర్తనలు పాడాలి. స్వరాజ్యగీతాలు! విస్తంత్రి. ఈసారి విద్యాపతి నాట్యం జరుగుతుందని అన్నాడు. డాక్టరుగారు విద్యాపతినాట్యం చూస్తారట! తాసిల్దారు పొట్ట చెక్కలయ్యేట్టు నవ్వారు. అట్నే అది చాలా పాతపక్కీ నాట్యమని ఎంతగానో చెప్పారు. అందులో హాస్యంపాలు ఎక్కువగా వుంటుంది. డాక్టర్‌గారు—'పరవాలేదులెండి. విద్యాపతినాట్యమే ఏర్పాటు చేయించండి' అని అన్నాడు. దర్పానులవీధి లిబడూ దర్పానుకు కబురంపడం జరిగింది. లిబడూ ఈ నాట్యదళానికి మూలగైను. 'మూలగైను' అంటే సంగీతదర్శకుడు.

కాళీచరణ్ గీతాలుండవా? పరవాలేదు. డాక్టర్‌గారికి మరోరోజు అతని కీర్తనలు వినిపించవచ్చు.

బాల్‌దేవ్‌కు డాక్టరుగారి తెలివితక్కువతనాన్నిచూసి ఆశ్చర్యం వేసింది. విద్యాపతినాట్యం ఎలా చూస్తారంట? అది చాలా చెడ్డనాట్యం. మర్యాదస్తులైన వాళ్ళెవరూ ఆ నాట్యాన్ని చూడరు. ఆ పాటలుకూడా చాలా చెడ్డవిగా వుంటాయి. నాట్యమే చూడాలని ఆయనకు ఒకవేళ పట్టుదలగావుంటే సిమరబనీ గ్రామంనుంచి థియేటరు కంపెనీవాళ్ళను పిలిపించవలసింది. తాసిల్దారుగారు. పాతికమందికి తిండీ తిప్పలు. రానూ పోనూ ఖర్చులిస్తే చాలు. ఆమాత్రం తాసిల్దారుగారు భరించలేరా ఏమిటి?....గ్రామస్తుల కళ్ళు తిరిగిపోవలసిందే! సిమరబనీ థియేటరు కంపెనీ అంటే ఎంత పేరు! మహావీర్ దుర్యోధనుడి వేషంవేసుకొని, చేతిలో కత్తి పుచ్చుకొని గర్జిస్తూ బయటికి వచ్చాడంటే అతనిగొంతు మైలుదూరంవరకు స్పష్టంగా వినిపిస్తుంది - ఈ మృదంగవాయిద్యాన్ని ఆపివెయ్యండి; ఇది నాకేమాత్రం నచ్చదు!

తకాధిమీ తకాధిమీ ధిమీ

తధిగిణతోం తధిగిణతోం!

విద్యాపతి నాట్య మృదంగం మోగుతున్నది - పదండి! పదండి! పదండి!!

ధినక్ ధినక్‌ధా తిరకిటిధిన్నా

ధినక్ ధినక్‌ధా తిరకిటిదిన్నా।

ఊళ్ళోవాళ్ళంతా తాసిల్దారుగారి ధాన్యపుకళ్ళం దగ్గరకువచ్చి చేరుకున్నారు. పెద్ద పందిరిఒకటి వేశారు. పందిరి జనంతో క్రిక్కిరిసిపోయింది. డాక్టరుగారు. సింగ్‌గారు. ఖేలావన్‌సింగ్‌యాదవ్ కుర్చీలో కూర్చున్నారు. కాళీచరణ్ తన బృందంతో వచ్చారు. సిద్ధాంతిగారు రాలేదు. సింగ్‌గారు - 'ఇవ్వాళ ఆయన పళ్ళు తీపుగా వున్నాయిలెండి।' అని అనడంతో అందరూ పగలబడి నవ్వారు. సిద్ధాంతి గారు రానికారణం అందరికీ తెలుసు - ఆయన కుమారుడు నామలర్త్రైన్‌కూడా విద్యా పతి నాట్యబృందంలో వున్నాడు. ఎంత అపచారం। బ్రాహ్మణకుటుంబంలో పుట్టి భాగోతుల్లో కలిశాడు। రామనారాయణ కులం చెడగొట్టాడు। శివ। శివ।....బాలదేవ్ రాలేదా? మర్యాదస్తు లెవరూ విద్యాపతినృత్యం చూడరు।

'ఓహో। నాయకా।'

విదూషకుడు వచ్చారు. జనం మొదటిసారిగా పెద్దపెట్టున నవ్వారు. వంద లాది ముక్తహృదయాల నవ్వులు। గజ్జెల గలగలలు।

మొహానికి మసి. సున్నం పూసుకొని. చిరిగిపోయిన పైజామా వేసుకొని లౌకాయదాసు విదూషకుడుగా ప్రవేశించాడు. అతగాడు జన్మతహా విదూషకుడే। భగవంతుడు అరవిన్ని విదూషకుడుగా పంపించాడు. పై పెదవి త్రిభుజాకారంలో వుంటుంది; ముందుపళ్ళు ఎప్పుడూ ఆకాశంవైపే చూస్తూఉంటాయి. స్ఫోటకంవచ్చి ఒక కన్ను గుడ్డిదై పోయింది. మాటలు చెప్పడంలో మహానేర్పరి.

'....ఓహో। హాయ్ హాయ్ నాయకా।'

'ఆఁ. ఏమిటోయ్?'

'తకతకమని విప్పిస్తున్న దేమిటయ్యా?'

'తకాధిమీ తోం....మృదంగం మోగుతోంది. కరతాళధ్వనులు మోగు తున్నాయి.'

'తెలుస్తూనేవున్నది లేవయ్యా। ఈ 'ధిమీతో ధిమీతోం' అని ఎందుకు వాయిస్తున్నట్లు ఈ గణపతి గంగారావు?'

'నాట్యం జరగబోతున్నదయ్యా నాట్యం। విద్యావతి నాట్యం।'

'ఓహో। అలాగా। వేలంపాట తప్పు అనుకున్నానులే। అయితే అర్థమైంది - ఈ మృదంగవాయిద్యం ఎందుకు మోగుతున్నదో?'

ధిమితాక ధిమీ ధిమితాకా।
ఆహే ఉత్తరహిరాజ్ సే ఆమ్‌ల్ హే నటుకవా కీ ఆహే హైయా
కీ ఆహే హైయా సరోసతిబన్నో విహెతాహోర్।

—వచ్చితిమయ్యా మేము ఉత్తరరాజ్యంనుంచి। నటులమయ్యా మేము। హే మాతా సరస్వతీ। ప్రప్రథమంగా మీకు వందనం చేస్తున్నాం.'

'ఓహో। నాయకా।' హాస్యగాడు బిగ్గరగా కేక పెడతాడు. లయకూడా తప్పుతుంది. లయ తప్పినప్పుడే హాస్యగాడు అరవాలి. అందుకని మృదంగ లయ జ్ఞానం అతనికికూడా ఉండాలి.

'నువ్వు ఎలాంటి మూర్ఖుడవయ్యా?'

'ఏమయ్యోయ్ నాయకా। మీరు ఎవరివి స్తోత్రం చేశారు?'

ఆహాహాహా।....హాహాహా। మరొకసారి నవ్వులు.

'మూర్ఖుడా। సరిగా వినలేదా? సరస్వతిమాతను స్తోత్రం చేశాం।'

'ఏమన్నావు' సురస్సు. సుర....సరోస్వతీ మాతను నువ్వెప్పుడైనా చూశావా? నువ్వు నన్ను ఏమన్నావు? మూర్ఖుడంటావా? నువ్వే మూర్ఖుడివి. ఏమయ్యోయ్। ఈ సరస్వతి స్తోత్రం చదువుకున్న పండితులు చేస్తారు।'

'హా। హా। హా। హా।' జనసందోహంలోనుంచి నవ్వులు।

'అయితే మరి మేము ఎవరివందనం చెయ్యాలి?'

'నువ్వు మురిగిపోయిన నేతివి। ఎందుకోజనంలో ఈ మురిగిపోయిన నేతితోనే పూరీలు చేశారు. ఆ పూరీలు తినేప్పటికి నేను పదిరోజులపాటు మంచంమీద నుంచి కాలు కిందపెట్టలేదు. నిన్ను చూస్తుంటే కత్తిలేని మురిగిపోయిన మూర్ఖుడివిలాగా కప్పిస్తున్నావు. ఎవరి వందనంచెయ్యాలో అమాత్రం తెలియదటయ్యా? అయితే విను।

ఆ॥ వాళ్ళను కాస్త వాయించమను—

'తకధిమితోం। తదిగిణతోం।'

'ఓ పప్పుసేవకులారా। భోజనప్రియులారా। ఆకుకూరల ప్రియులారా। ఇప్పటివరకు సారంలేని వాటివిగురించి విన్నారు. ఇప్పుడిక సారమున్నవాటిని గురించి వినండహో। ఓ శనగపప్పు సేవకులారా। బజ్జీలు. బోండాలు భోంచేసే ఓ బొజ్జ గణపయ్యల్లారా।'

....హో హో హో; హో। హో।

'ఇక పళ్ళూ ఫలాలు। జామపండు ప్రియులారా। దానిమ్మపండు ప్రియులారా। పండినపళ్ళు సేవించే మహా మహులారా।'

....హో హో హో హో। పందలాది నవ్వుల గలగలలు।

'నాగటిపద్దే సేవకులారా। గేదెలుకాచే సేవకురాలారా। అందరిపైనా భగవంతుడు।' హాస్యగాడు మొహం వంకరగా తిప్పుతాడు.

చటక్ చటక్‌మని పటక్ పటక్‌మని
పడుతుందోయ్ భూతం తలమీద।
అన్నిటికీ మించినదేదో తెలుసా
మీ బాబుగార్ల కాళ్ళ చెప్పులజోడే॥

హాస్యగాడు ఫేలావన్ తొడుక్కున్న చెప్పులకు నమస్కారం చేస్తాడు.

డాక్టర్ ఆశ్చర్యంలో మునిగి నాట్యాన్ని తిలకిస్తున్నారు. ఈసారి నాట్యం బాగానే రక్తి కడుతుంది. ఇవన్నీ పాతకాలం సంగతులు గదా। సంగతులన్నీ సరిగా చెబుతున్నట్టేగా।

ధిన్నా ధిన్నా ధిన్నా తిన్నా। మండలిసభ్యులు పాడడం ప్రారంభించారు.

మృదంగ లయప్రకారం నటుడు ప్రవేశిస్తాడు. తాళయుక్తంగా నడిచి ముందుగావెళ్ళి మృదంగానికి నమస్కరిస్తాడు. ఆ తరువాత తక్కినవాయిద్యాలకు। చివరన సంగీతదర్శకుడికీ లిబడూ పాదాలతాకి మరీ నమస్కరిస్తాడు. దర్శామల పేట ఛీత్రనదానుకొడుకు చలిత్తర్ ఆడవాళ్ళకుమల్లే పొడుగాంటిజుత్తు పెంచు

కున్నారు నటుడు అతనే! వేషం అదీ వేసుకునేప్పటికి కుర్రాడు దేవీలాగా కన్పిస్తున్నాడు. చెవులకు పెట్టుకున్న లోలాకు లెవరివి? కమలవా? ఉహూంమతిగా ఈ లోలాకుల్ని సంపాయించుకోగలిగావంటే అసలైన విద్యావతి కృష్ణుడు నువ్వే నని పించుకుంటావు! ఉచితదాసు మృదంగం వాయిస్తున్నారు. ఏమన్నావు? అసలైన విద్యావతా? నేను సహర్షా మృదంగవిద్వాంసుడు గైమా కృష్ణుడికి కృష్ణుణ్ణి!

....ఒకసారి గైమ తన బృందంతో నాట్యం అయ్యాక తిరిగి వస్తూంటే దొంగలకు తెలిసింది - ఒక్కొక్కరూ సందేసిరూపాయల నగదు. రోవతి. చొక్కా. అంగవస్త్రం తీసుకొనివస్తున్నారని! మధ్యలో దొంగలు అడ్డగించారు. అప్పు డేమైందో తెలుసా? తెలియదూ? ఆఁ....మృదంగం తీసుకొని ఒకదెబ్బ వేశాడు. చేతిపేళ్ళు నాట్యం చేశాయి - ధిరకిట ధిన్నా నా ఏన్నా నా ఏన్నన నా. చర్మానికి ప్రాణం వచ్చినట్టయింది మనిషిలాగా మాట్లాడింది — 'దొంగలూ! దొంగలూ! దొంగలొచ్చె దొంగలు!'

....లిఁదూదాసు బృందంఅంటే మాటలుకాదు! నాట్యం చెయ్య బిడ్డా! నాట్యం చెయ్య:

ధిరనాగి ధిరనాగి ధిరనాగి ధినతా
ఆహా తననన లనన మదన సహతోరహే
ఆహా దామినీ....

'వాహ్వా! వాహ్వా! వాహ్వారే!' హాస్యగాడు రొమ్ము పుచ్చుకొని మొహం వికృతంగా పెడతాడు!

ధినక్ ధినక్ తా, ధినక్ ధినక్ తా
ఆహే దామిని తూపర్ ఉగలయచాన్ హే!

విదూషకుడు మూర్ఛపోతాడు—'అయ్యో బాబోయ్!'

'ఏమైంది?'

'బాబోయ్!'

'ఏమైందో చెప్పవయ్యా!'

'అయ్యో నాయకా! ఒకవిషయం చెప్పండి. త్వరగా చెప్పండి. ఆకాశం మీది చంద్రుడు భూమిమీదికి దిగివస్తే, భూమిమీది చంద్రుడు పైకి వెళ్ళాలిగా!

'భూమిమీద ఎక్కడైనా చంద్రుడుంటాడా?'

'వింటున్నారా ఈయన మాటలు? అందుకే అన్నాను - కంపు నెయ్యి అని! నా బల్బు ఒకటి పనిచేయడం లేదు, చూస్తే పీ రెండుబల్బులు ఫ్యూజ్ అయిపోయి నట్టున్నాయి. ఈ మధ్య రైళ్ళలో లైట్లు వెలగడంలేదని విన్నాను. బ్లాకౌట్.... అయితే బ్లాక్ మార్కెట్!'

అహో హా హా హా!....నాయాల కటిహార్ అమ్మమ్మదగ్గరకు ఎప్పుడూ వెడుతూనే ఉంటాడు. రైలును తప్పు పడుతున్నాడు. కామెర్లకంటికి ప్రపంచ మంతా పచ్చగానే కనిపిస్తుందట! వినండి కాస్త! భూమిమీద చంద్రుదంటున్నాడు! ఎవరో ఏమిటో వినాలి.'

'ఏమయ్యోయ్! మూర్ఖనాయకా! భూమిమీది చంద్రుడు తన ముప్పైఆరు కళలతో పీ ఎదుటే నిలబడివున్నాడుగదయ్యా! పీ కళ్ళు మిరుమిట్లు గొల్పడం లేదూ? షష్ఠమలైటు వేసుకొని చూడు!'

అహహా హా హా!....నాయాల ఏమేమిటో మాట్లాడేస్తున్నాడు.'

'షష్ఠమలైటు - తెలియదా? పంచమలైట్ అంటే ఈ అయిదుగురు పంచా యతీ పెద్దలమధ్య వెలిగేది!....షష్ఠమలైటు ప్రస్తుతం మీ ఇళ్ళల్లో వెలుగు తున్నదే అది! కిరసనాయిలు దొరకడంలేదుగా! జనపనారతో కాగడా ఒకటి తయారుచేయించుకొని వెలిగించుకొని నిలబడు; గ్యాస్‌లైట్‌లాగా వెలుగుతుంది. ప్రస్తుతం నేనిలాగే చేస్తున్నాను. అయ్యా పెద్దలారా! చూడండి! నాకంటే అంద గాడు ఇక్కడ మరెవ్వరైనా ఉన్నాడా? చెప్పండి!'

'లేదు, లేదు! మీది సాక్షాత్తు కామదేవ అవతారం.' పింగ్‌గా రన్నారు.

అహాహా హా హా హా! నాట్యమాడరా చెలికాడా! మనస్ఫూర్తిగా నాట్య మాడు!

ధినాగి ధిన్నా, తినాగి తిన్నా
ధినక్ ధినతా తిటకత గ-ద-ధా

నిన్ను గూడెదనయ్యా నా సామి
నీ మీది మోహమూ కృష్ణుడా
నేను పట్టలేకున్నాను కృష్ణుడా
వట్టి మాటలచేత కృష్ణుడా
యింత వాదేల పోదాము కృష్ణుడా,

తాంత్రికులపేట ఆడవాళ్ళ సమూహంలో కూర్చున్న పులియా మనస్సు లాగుతున్నది.... నేను పట్టలేకున్నాను కృష్ణుడా!

తాపీల్దారుగారి మహలు కెదురుగావున్న కిటికీ తెరిచేవున్నదా? కమలకూడా చూస్తున్నదా? చూడకపోతే బహుమానం ఇచ్చేదెలాగు?

ఒరేయ్ కొడుకా! బొమ్మలాగా ఆడరా!

తామరపూవులాగా నీ పావడా పుష్పించవలెనోయ్!

'ఏమయ్యోయ్! నాయకా! ఒకమాట చెప్పండి. ఆమె నన్నొదిలి ఎక్కడకు వెళ్ళిపోతున్నదయ్యా? తిరనాళ కెడుతూన్నదా? విందుభోజనానికి పరుగెడుతున్నదా? లేకపోతే బటలకార్డు లేమైనా పంచిపెడుతున్నారా?'

'అదేమిటయ్యా! ఆమె నీదగ్గరకే వెడుతున్నది. నువ్వేగా కొంటె క్రిష్ణయ్యవి? నీ అందచందాలకు మోహితురాలై ందట!'

'ఓహో, అలాగా! అదే నేనూ అంటున్నాను - నన్నొదిలి నా రాణి ఎక్కడికి పోతున్నదా అని! అయితే నేను క్రిష్ణయ్యనే! క్రిష్ణయ్య తండ్రిపేరు నందుడు గదా? మరి మా నాన్న పేరు ఉపద్రవదాసు!'

అహా, హా హా!, హాహా!!

'ఏమయ్యోయ్, ఉలూకదాసూ! మీ నాన్న పేరు ఉజాగిరదాసు గదా? ఉపద్రవదాసు మార్పా పేమిటి?'

'నిజమే నాయనా! మా నాన్న పేరు, ఆయన అమ్మా నాన్నలు ఉజాగిరదాసనే పెట్టారు. గొడ్లకాపరిగా ఈయన ఏ ఇంట్లో జేరితే, ఆ ఇంటియజమాని కొన్నిరోజులతరువాత తన్ని తగిలేయడం జరుగుతూఉంటుంది. ఎందుకంటే మా

నాన్న ఉన్నారే - ఆయన మేపడానికి గొర్లను తోలుకెళ్ళి, యజమాని పొలంలోనే వదిలేసి నిద్రపోయేవాడు. అవి ఇష్టంవచ్చినట్లు మేసేవి. ఈ ఉపద్రవాన్ని పరికించి ప్రజలు మా నాన్నకు 'ఉపద్రవదాసు' అనే మారుపేరు ప్రదానం చేశారు.'

నటుడు గంజాయి దట్టించివచ్చాడు. ఇక ఇప్పుడు చూడాలి ఈయన నాట్యం! నాగా ర క్తి కట్టించేలా ఉన్నాడు-ఇవ్వాళ్ళ ఈ ఉద్దండపిండం.

ధినాగి ధిన్నా....

ఆహా కుంజభవన్ పే వికలల్ హో

ఆహా సఖి రోకల గిరధారీ!

'దొంగతనంగా ఇంటినుంచి బయటికొచ్చేసి బంగళా తోటలోకి వెళతావు: అక్కడ రావలీలలు జరిపేందుకు ఎటువంటి ఆటంకమూ లేదు. మంచిదే!' హాస్య గాడు తనలోతాను మాట్లాడుకుంటున్నాడు.

నటుడు రెండుచేతులు జోడించి పరుగెత్తిన తాచుపాములా కదులుతూ నడుం పట్టుకొని కూర్చుంటున్నాడు. నేలమీద పావడా తామరాకులాగా పరుచుకోబడింది. పేరుకొంటున్నది....వాహ్వా! రంగేళీరాజా! ఊరిపేరు నిలబెట్టావురా!

'యదుపతీ వదలరా!

నా కొంగు వదలరా!

పారిపోకుమా నటవరీ

నా కొంగు వదలరా!'

'అవును సోదరా! కోటా కంట్రోలు కాలమిది! బట్టలు దొరకడంలేదు. కొంచెం తెలివిగా....'

'ఓహో! మహాపతివ్రత బయలుదేరిందర్రా! వెనకటి కెవరో నా పాతి వ్రత్యం నా మొదటి పెనిమిటికి తెలుసునన్నదట!' విదూషకుడు మధ్యమధ్యలో ఏదో ఒకటి అంటూ ఉంటాడు.

ఆహా వంగ్ కే సఖి అగు ఆయల్ హో

ఆహో కాన్హా హయ్‌హం ఏక్ నరినారి!

....'కృష్ణా! నేను నీ సాన్నిధ్యం కోరి వచ్చాను. నే నొంటరిదాన్ని! హరితో నాకే భయమూ లేదు.'

'....అవునవును, ఒంటరిదే!'....

'అవునులే! హరితో కులికితే తప్పులేదు. మాతో సరసాలాడితే తప్పు! ఆయన ఎన్ని రాసక్రీడలైనా జరపవచ్చు! మేము జరిపితే మా వీపులు విమానాల మోత లెత్తుతాయి. నలుగురిలో నిలబెట్టి చెప్పుదెబ్బలు తినిపిస్తారు!'

'ఏమైంది? ఏమైందేమిటి? డాక్టరుగారి కుంటినొకరొచ్చి ఏమిటో చెప్పి వెళ్లారు? కమల దీదీ లోలకులు ఇచ్చేసిందా?....వాహ్వా! పేరు తెచ్చావురా కుర్రాడా! భళి భళి!!

హాస్యగారుమాత్రం ఏం తక్కువ తిన్నారు? అతగాడుకూడా థై థై అని తైతక్క లాడతాడు. ఇవ్వాళ్ళ నాట్యం బాగా రక్తి కట్టింది. 'హాయ్ హాయ్ నాయకా! నా బాధను పట్టించుకునే నాధుడే లేడాయె! వినే మహానుభావుడే కరువాయె! హా హతవిధీ!'

'ఏమయిందయ్యా?'

'ఎలా చెప్పనయ్యా?' హాస్యగారు తాసిల్దారువైపు చూపించి భయపడు తున్నట్టు మొహం బెట్టాడు.

'ఓహో! అదా విషయం! అయితే వాకు తెలిసిందిలే! నోటితో చెప్ప వయ్యా.' తాసిల్దారు అర్థం చేసుకుంటాడు. 'ఏమయ్యా ప్రపంచంలో నే నొక్కణ్ణేనా తాసిల్దారుని? నువ్వనేమాటేదో మంచిగానే అంటావనుకో! వింటున్నారా డాక్టరుగారూ? అతగాడు నన్ను హాస్యం బట్టించబోతున్నాడు!'

'అయ్యా నాయకా! నన్ను ఓదార్చేవాళ్ళే కరువాయెనా? ఏమయ్యా. అయెనా? గవర్నమెంటు కోపినపకి ఆనకట్ట కట్టబోతున్నారని విన్నాను! కాని నా హృదయానికి ఆనకట్ట కట్టేమనిషే కరువాయెనా?'

'విషయమేమిటో చెప్పవయ్యా?'

'అయితే విను! ఎబ్బై సంవత్సరాలముందుమంచి వినిపిస్తాను - సర్వే సెటిల్ మెంటు సంవత్సరంమంచి!'

వినండి. వినండి! ఏదో కొత్తవిషయమే చెప్పబోతున్నాడు. ఇతగాడు కూడా బహుమానం కొట్టేసేలా కవిపిస్తున్నాడు.

'కొంచెం వాయించమని చెప్పవయ్యా - తాకధిన తాకధిన!'

ఎవరివి ఓదార్చనయ్యా? ఎవరి నోదార్చను?
ముద్దాయి కరణంగారివి ఓదార్చనా?

'కోశీ సర్వే జరుగుతున్న రోజులవి!'

భూమి పదిమూరలు కొలిచి
లెక్కరాసింది అయిదుమూరలు!

—అయిదుమూర్లా? ఆహ్హా హ్హా!
ఇంకేం కొలిచారయ్యా అంటే—

పందుగొందులు కొలిచారు
రాయీ రప్ప కొలిచారు
రేవులు దారులు కొలిచారు
తాలూకాలూ కుంటలూ కొలిచారు!

'ఇక ఇటు జమీందారుగారి సిపాయిలు మిద్దెమీదున్న సొరకాయలు, దోసకాయలు, మేకపోతు, నాలుగుజతల పావురాళ్ళు సాక్షుల్ని తీసుకొచ్చే ఖర్చుకింద స్వాహా చేశారు.'

'ఆ తరువాత?'

కుండా చట్టి అమ్ముకొని
కరణంగారికి ముడుపు చెల్లించుకున్నారు
మిగిలింది రాయించుకున్నాక
శాంతి కలిగింది మాకు!

'అప్పుడు.'

కబీరు ఏమన్నాడంటే—
ఖంజీర మోగించుకుంటూ

పాటలు పాడుకుంటూ
కాలక్షేపం చెయ్యండి
స్ఫటికనాద్ మ స్మరించుకుంటూ!

అ-హ్హా-హ్హా-హ్హా - ఖి-ఖి-ఖి - హహ....పందిరి ఎగిరిపోయేలా వున్నది. నాయాలు బాగా చేశాడు.

శెబాష్ లౌకాయదాసూ!

డాక్టరు తాపిల్దారును—'పాటలు విద్యాపతివే పాడుతున్నాడు. హాస్యగాణ్ణి ఎవరు సృష్టించారు?' ప్రశ్నించాడు.

'మీరు భలేవారండి, డాక్టరుగారూ!' తాపిల్దారు నవ్వాడు—'దీన్ని సృష్టించట దానికి తులసీదాసు, వాల్మీకివంటి కథలు కావాలా? పొలాల్లో పనిచేసుకుంటూ లయ యుక్తంగా మాటలు కలిపేస్తారు.'

డాక్టరు విదూషకుడికి ఏమిచ్చారు?....ఐదు దమ్మిడీల లోటా ఇచ్చారా?

ఆహే పరథమ్ సమాగమ్ పహూసంగ్ హే
ధిరనాగి ధిరనాగి!

గురకొయ్యలు పొడిచాక నాట్యం పూర్తయింది. చాలా బాగా రక్తి కట్టింది. ఇక ధావ్యపుకళ్యం మొదలుబెడతారు.

మంచంమీద పడుకొని డాక్టరు ఆలోచించడం ప్రారంభించాడు—గీతాలు ఎంత కోమలంగా వున్నాయి! అపభ్రంశ శబ్దాలుకూడా మధురాతిమధురంగా వున్నాయి....'పియా భయలే దుమరీ కే ఫూల్ రే పియవా భయిలే! చాంద బయిరి ఖేలబాదల్, మఛలీ బయిరి మహాజాల్, తిరియా బయిరి దుహూ లోచన—రిదయే కే భేద బతాయే!'—

డాక్టర్ ఆలోచిస్తున్నాడు—విద్యాపతి ప్రసక్తి రావడంతోనే తవివరేణ్యుడు దినకర్ వేసిన ఒకప్రశ్న ఎదుట తారట్లాడుతున్నది—'విద్యాపతికవి గీతా లెక్కడ?' బహుకాలంగా మనస్సులో చిక్కుకొనివున్న ప్రశ్నకు సమాధానం జీవితమంతా పెట్టిచాకిరిచేస్తూ, చదువూ సంధ్యాలేని అర్ధనగ్నంగావున్న ఈ వ్యక్తులే

చెప్పారు. కవీ! నీ విద్యావతి గీతాలు మా వడిపోయిన కుటీరాలలో మధురరసాన్ని వర్షింపచేస్తున్నాయి. ఓ కవీ! నీ కవిత్వం మారాముచేస్తూ ఒకరోజున ఇలా అన్నది—కవీ వరుపు! కాననపుష్పాలవై పుతు! కాననపుష్పకలికలు నీ రాకకోసం ఎదురుతెన్నులు చూస్తున్నాయి!

## పదహారు

మానమ్మాత్ సునరీ!
రూపాయి కట్‌పీస్ - ఒక గజం
అర్ధకం బట్ట - గజమున్నర
మలేషియా పాటిన్ - ఒక గజం
చీరె- ఒకటి.

బాలదేవ్ బట్టల చీటీలు పంచిపెడుతున్నాడు. రోతహట్ స్టేషన్‌దగ్గర హంవ రాజ బద్రరాజ మార్వాడీదగ్గర ఈ బట్టలు దొరుకుతాయి.

శేలావన్‌యాదవ ఇంటిముందర నిలబడడానికి చోటులేదు. ఉదయంనుంచే అక్కడ చీటీలు పంచిపెడుతున్నారు. మధ్యాహ్నమైంది. చీరెలు లేవా!... లేవు. బాలదేవ్‌గారూ! ఒక చీరె కావాలి....మా ఆడదానికి వంటిమీద కట్టుకునేందుకు ఏమీ లేదండీ. బాలదేవ్‌గారూ!

బాలదేవ్ - 'చూడండి. గ్రామం మొత్తానికిగాను ఏడుచీర్లే యిచ్చారు. అందులో నాలుగు మేలురకమైనది. అవి పెద్దవాళ్ళఇళ్ళల్లో కట్టుకొనే చీరెలు! జత పధ్నాలుగురూపాయలు. ఇక మిగిలిన మూడుచీరెలు ఏమిలేని వాళ్ళమచూసి కేటాయించాము....!' అని అన్నాడు.

'లేనివాళ్లు ఊరినిండా వున్నారు!'

'ఇన్నిరోజుల్నుంచి కమరుద్దీబాబు బట్టలు పంచిపెట్టేపని చేస్తూఉంటే అప్పుడెవరూ ఏమిలేవని ముందుకు రాలేదేం? ఇదుగో చూడండీ! ఉన్నదాంట్లో ఎలాగో సర్దుకోవాలి!' అని శేలావన్‌యాదవ్ అన్నాడు.

కాశీచరణ్ పట్టుపట్టి కూర్చున్నారు - మరో రెండుగజాల చీటీగుడ్డ కావా లి। హార్మోనియం కవరు కుట్టిస్తారట. బాలదేవ్ ఇవ్వనని కూర్చున్నారు మను షులు కట్టుకోవడానికి బట్టలు దొరకక జనం చస్తూఉంటే ఈయనగారికి హార్మోని యాన్ని అలంకరించడానికి చీటీగుడ్డ కావాలట। బావుంది। ఈయనగారి సంబరం।

బాలదేవ్ ఊళ్ళో నడవడం కష్టమైపోయింది. ఈ బట్టలవని ఏమని నెత్తి నేసుకొన్నాడోగాని కంటిమీద కునుకులేకుండా పోయింది. బహిర్భూమికెళుతున్నా జనం వదలడంలేదు. జై హింద్ బాలదేవ్‌గారూ। మీ దగ్గరకే బయలుదేరాను। మా అమ్మాయి దులారి పెళ్ళిచేసుకుంటున్నాం ... సరే, సరే। నేనలా బయటకెళ్ళి వస్తాను। ఇప్పుడు బట్ట లెక్కడివి? స్టాకులో కూడా ఏమీ లేవు. శవాలమీద కప్పేవీ, శ్రాద్ధకర్మల కుపయోగించేవీ వున్నాయి....అవే కావాలా? అవెలా ఇచ్చేది? శవాల మీద కప్పేబట్టలు, శ్రాద్ధాని కుపయోగించేగుడ్డలు పెళ్ళి కివ్వమంటావా?

అయితే దులారిపెళ్ళి జరిగి ఆయిదుసంవత్సరాలైందని. ఆమెకు ముగ్గురు పిల్లలున్నారని పాపం బాలదేవుకేం తెలుసు?

దాసి లక్ష్మి రామదాసుద్వారా కబురంపింది—'ఆచార్యులుంగారు వస్తూ న్నారు. రుద్రాక్షమాల స్వీకరించాలనుకున్నారుగదా. ఏమనుకున్నారు? మీ కిమధ్య తీరికే వుండడంలేదు. ఇటువైపు రావడమే మానేశారు। పోతే, మహంతు ఉత్స వానికి శాలువా ఒకటి, పూజవగ్గరకు ఒక జత ధోవతులు కావాలి. అంచులేని సన్నని ధోవతి మరొకటి; మార్కిన్ లేదా లాంగ్‌క్లాత్‌ది। ఇక పోతే వంటకక్కకుకూడా బట్టలు లేవు।

పెద్ద చిక్కే వచ్చిపడింది. స్టాకులో బట్టలే లేవు; ఉన్న శ్రాద్ధపుబట్టలు ఎలా ఇవ్వడం? ఓహో మరచేపోయాను। ఆచార్యులుగారు మహంతు శ్రాద్ధకర్మకేగదా వచ్చేది। అయితే సరే। శ్రీమతి....ఓహెూ, శ్రీమతికాదు। దాసి లక్ష్మి వంటలక్క లాంగ్‌క్లాత్ పదిగజాలు। పైన్ మార్కిన్ పదిగజాలు। ధోవతి ఒకటి.

రామదాసు వివరిస గుర్తుచేశాడు - లంగోటీ కౌపీనానికికూడా ఒక గజం గుడ్డ కావాలని। ప్రమాదమే వచ్చింది। బాలదేవ్ రోజాకు వని పన్నెండుపర్యా యాలు అబద్ధాలు చెప్పవలసివస్తూన్నది. ఏం చెయ్యడం? పెద్దచిక్కే వచ్చిపడింది.

జిల్లా కాంగ్రెసు మీటింగుకూడా వున్నది. మినిస్టరు రాబోతున్నారు. 'జనాన్ని పోగు చేసి జెండాలతో ఊరేగింపు తీసుకెళ్లాలి. జిల్లా కార్యదర్శి గంగూలీదగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది. కరపత్రాలుకూడా వచ్చాయి....।

బయలుదేరండి. బయలుదేరండి - పూర్ణియా। మినిస్టరుగా రొస్తున్నారు. ఆడా మగా, పిల్లా మేకా అంతా బయలుదేరండి - ఇంక్విలాబ్ జిందాబాద్ అను కుంటూ పూర్ణియా వెడదాం పదండి. రైలుటికెట్టా? వట్టి బైతుల్లాగా వున్నారే? మినిస్టరుగారొస్తూఉంటే రైలుకు టిక్కెట్టెందుకు? కోటాలో బట్టలు చాలా తక్కువ వస్తున్నాయని మినిస్టరుగారితో చెప్పాలని బాలదేవ్ అంటున్నారు। పదండి. పూర్ణియా వెడదాం. గురకొయ్యలు వీడవడంతోనే కాళికాదేవి గుడిదగ్గర పోగై ఊరేగింపుగా వెడదాం:

'ఏదీ ఒక్కసారి అనండి—కాళీమాతాకీ జై.'

'జై। జై।।'

'మరొకసారి ప్రేమతో అనండి—గాంధీమహాత్మాజీకి జై।'

'జై। జై।।'

పుర్....ర్....ర్ . ర్....చెట్టుమీద గూట్లో నిద్రపోయే పిట్టలు రెక్క లల్లార్చుకుంటూ ఎగిరిపోయాయి. పిట్టలుకొట్టే చిన్నపంగలి గనుక చేతిలో వున్న ట్టయితే రెండు మూడు పిట్టల్ని కొట్టి కింద పడేసేవాణ్ణి—అని కాళీచరణ్ అన్నాడు.

మాట్లాడకయ్యా। బాలదేవ్ వినలేదు. లేకపోతే ఉపవాసం ఉంటానంటాడు- అని వాసుదేవ్ అన్నాడు....।

లెక్కబెట్టు. ఎంతమంది ఆడవాళ్ళు. ఎంతమంది మగవాళ్ళు? పిల్లల్ని తీసుకరావచ్చు. అదొక తద్దినం। కాళీచరణ్, గూదర్ ఇద్దరూ ప్రతిఒక్కర్నీ వళ్లు తడిమి మరీ లెక్కబెడుతున్నారు. అయిను ఇరవయ్యింమీద నాలుగు రాడవాళ్లు అని కాళీచరణ్ అన్నాడు. పది ఇరవైలమీద పదిమంది మగాళ్లు అని గూదర్ లెక్క చెప్పాడు. మరి మోతుబరుల సంగతేమిటి? మోతుబర్లు ఎప్పుడూ నమ్మకద్రోహం చేస్తూఉంటారు. బాలదేవ్ ఇవ్వాళ్ళ మరొక కొత్తపదం ఉపయోగించాడు - నమ్మక ద్రోహం। నమ్మకద్రోహం। నమ్మకద్రోహం?

ఊరేగింపులో పాడడానికి బాలదేవుకు రెండుపాటలే గుర్తున్నాయి. ఒకటి ఉప్పు సత్యాగ్రహమప్పుడు నేర్చుకున్నది—'రా రండోయ్। వీరులు కండోయ్. జైళ్ళన్నీ నింపండోయ్।' ఇక రెండవది : 42 ఉద్యమంనాటిది. ఆ పాట జైలులో విన్నాడు— 'జిందగీ హై క్రాంతికీ క్రాంతిమే బటాయెజా।' అయితే ఈ పాట సోషలిస్టుపార్టీవాళ్లు పాడతారు; మొదటిపాటే బావుంటుంది—'రారండోయ్. వీరులు కండోయ్।'....ఈ రోజు బాలదేవే స్వయంగా పాడతాడు.

తాంత్రికులపేట మంగళూకు వణుకు పుట్టింది. జైలా? బాబోయ్....! అయితే వీళ్ళంతా జైలుకు వెడుతున్నారా? పదిహేను సంవత్సరాలక్రిందట దొంగ తనం చేసిననేరానికి జైలుశిక్ష అనుభవించాడు. జైల్లో జమేదారు పొట్టమీదకొట్టిన దెబ్బ ఇప్పటికీ గుర్తున్నది, నాలుగు తొట్లనిండా నీళ్లు నింపవలసివచ్చేది. మూత్రావి వెడుతున్నట్టుగా వెనకగా ఉంది. ఎవరూ చూడకుండా ఇంటివైపుకు పరుగెత్తాడు.

పూర్ణియా పట్టణం।....ఇదే పూర్ణియాపట్టణం అంటే। మంచిరోడ్లు, కార్లు, గుర్రపుబళ్లు. పెద్దపెద్ద ఇళ్ళు।....'ఇంత ఇంతింతై పూర్ణియాపట్నాన్ని కూడా పొట్టన పెట్టుకున్నది।' అంటే ఏమిటి? విప్ప।...గ్రామంలోనిపిల్లలు ఇప్పటికీ పొడుపుకథలు చెప్పుకుంటూ పూర్ణియాపేరును తలుచుకుంటూ ఉంటారు। ఈ ఊరేగింపులో ఇదివరలో పూర్ణియాను చూసినవాళ్ళు నలుగురున్నారు. చాలా మంది అయితే మొదటిసారి రైలెక్కారు. గుండె బతుకుబతుకుమన్నది. మహాత్మా గాంధీ జెండా చేతిలోవుంటే గార్డు, టిక్కెట్ కలెక్టరు టిక్కెట్టే అడగరు. రైలు విజంగా జై జై కాళీ, ఛ్ ఛ్ పైసా అని అనుకుంటూ ముందుకు పరుగెట్టింది. జై జై కాళీ।....ఇదే కాళీ వంతెన, ఇదే కాళీ వంతెన అని బాలదేవ్ చూపిం చారు. ఈ వంతెన కట్టేప్పుడు అయిదుగురు బలి అయిపోయారు. బాబోయ్, అయిదుగురే। జై కాళీ। ఉప్పు సత్యాగ్రహంరోజుల్లో పోలీసులు వాలంటీర్లను తీసుకొచ్చి ఈ వంతెనకింద చన్నీళ్ళలోముంచి మరీ లాఠీలతో బాదారు. ఇది అస్పత్రి। మన ఊళ్ళోవున్న అస్పత్రి ఈ అస్పత్రిముందు దిగదుడుపే।...జైలు? ఇదే జైలు। జైలుకాదు, అత్తగారిల్లు। పెళ్ళిముహూర్తానికి వెడుతున్నాం. 'వీరు లారా। రారండోయ్।....జైళ్ళన్నీ నింపండోయ్।....పులియా, పూర్ణియా స్టేషన్ లోనే ఏదో వెడుతున్నది? ఖాకీలు నల్లచొక్కాలు వేసుకుంటారు, ఇదే

న్యాయస్థానం....కక్షలు సాధించుకొవడానికి వచ్చేది ఇక్కడికే, కోర్టులా గిర్టులా, గవర్నమెంటు-గివర్నమెంటు, భూమీ-గీమీ, పంచాయతి-గించాయతి, పోలీసులు-గిలీసులు, కేసులు-గీసులూ - ఇట్లా ప్రతిదాన్ని వికృతంచేసి మరీ చెప్పారు.

పట్నంలోని మనుషులు ఈ ఊరేగింపును వింతగా చూస్తున్నారు. ఇంక్విలాబ్-జిందాబాద్ ! కోర్టుమూల, పళ్ళదుకాణందగ్గర కూర్చున్న మౌల్వీగారు నవ్వి- 'అంతా బట్టలకోసం వచ్చినట్టున్నది. వెళ్ళండి, వెళ్ళండి, బట్టలు దొరుకుతాయి. ఇంక్విలాబ్ అంటున్నారు. అసలు ఆ మాటకు అర్థం తెలుసునా లేక ...!' అని అన్నారు.

జెండా ! పెద్దజెండా ఆకాశంమీద రెపరెపలాడుతూవున్నది. అదే రామకృష్ణ ఆశ్రమం. ఆం, ఇక్కడంతా నిలబడండి. బట్టలు సరిగా కట్టుకోండి. ఆ పంపుదగ్గరికెళ్ళి మొహాలు కడుక్కోండి. భయమెందుకు? బాలదేవ్‌గా రున్నారు. ఇక్కడ మంచి లైన్‌లో వెళ్ళాలి. బాలదేవ్ ముందు నిలబడతారు. అందరికంటే ముందు కాళీచరణ్ నిలబడి నినాదం ఇస్తాడు—ఇంక్విలాబ్ ! అప్పుడంతా ఏకకంఠంతో జిందాబాద్ అని అనాలి. మీరంతా ! కాళీచరణ్ ఇంగ్లీషు ప్రభుత్వం అంటే మీరంతా నాశనం కావాలి అని అనాలి. కాళీచరణ్, ఏదీ అను ! కాళీచరణ్ బాగా ఊపిరి బిగబట్టి అరుస్తాడు— ఇంక్విలాబ్ !'

'నాశనం కావాలి, జిందా....నాశనం....'

'ఆగండి, ఆగండి ! సరిగా అనలేదు.'

శివనాథ్, చౌధరి, గంగూలీ, శశాంకనాథ్‌బాబు - అందరూ ఆశ్చర్యంగా చూస్తున్నారు చౌధరిగారు బాలదేవ్‌పట్ల చాలా సంతోషంగా వున్నారు. నాథ్‌బాబు అన్నారుకూడాను—'ఇలాగే సర్కార్ అంతా శ్రద్ధతో పనిచేస్తే ఇంకేముంది? రెండుమూసాల్లో ఇన్నిగ్రామాలను ఈయన ఒంటరిగానే ఆర్గనైజ్ చేశాడు. నాలుగణాల మెంబర్లను ఎంతమందిని చేర్చావు? అయిదువందలా? అయితే విన్న - మిమ్మల్ని జిల్లా కమిటీ మెంబరుగా తీసుకుంటున్నాం' గంగూలీ బాలదేవ్‌ను మొదటి నుంచీ 'మీరు' అనే సంబోధించేవారు; ఇప్పుడు నాద్‌బాబుకూడా 'మీరు' అని అంటున్నారు.

చౌధరిగారు—'ఏమయ్యా, బాలదేవ్, చర్ఖా సెంటర్‌కూడా తెరిపించు. నిర్మాణకార్యక్రమం ఏమైనా జరుగుతున్నదా?' అని అడిగారు.

ఖాదీభండార్ ఛత్రీస్‌బాబు—'ఖాదీభండార్‌లో అమ్మడానికి పల్లెటూరినుంచి ఆవునెయ్యి పంపించకూడదూ బాలదేవ్?' అని అడిగారు.

నిజానికి బాలదేవ్ చాలా తెలివిగలమనిషి; గొప్పవాడు కూడాను. మెట్లున్న పెద్ద బల్లమీద పెద్దపెద్ద నాయకులంతా కూర్చున్నచోటనే బాలదేవ్‌కూడా కూర్చున్నాడు. అరె, ఆయనెవరు? మరుగుజ్జు, మూరన్నర మనిషి. చూడ్డానికి నాలుగు సంవత్సరాల కుర్రవాడిలాగా కన్పిస్తున్నాడు. కాని మీసాలూ గడ్డాలూ ఉన్నాయి. మాట్లాడుతుంటే గొంతు చాలా పెద్దగొంతులా అనిపిస్తున్నది. లౌడ్‌స్పీకర్‌లో ఎవరిగొంతయినా కొంచెం భారీగానే వినిపిస్తుంది. ఏం భాష మాట్లాడుతున్నారో ఏమిటో. ఏమీ అర్థం కావడంలేదు—'భారతదేశం స్వాతంత్ర్యం. గాంధీజీ - ఈ మాటలు మినహా మరేదీ అర్థం కాలేదు....చప్పట్లు ఎందుకు కొట్టినట్టు? సభ ముగిసిందా? మినిష్టరుగారేరీ? ఎక్కడా? ఎవరూ? ఆ దక్కనలచటి మనిషేనా? పొడుగాటి మీసాలాయన? ఎంత ప్రేమగా ఎంత నెమ్మదిగా మాట్లాడాడు! తలమీద టోపీకూడా మామూలుగానే వున్నది. మినిష్టర్ అంటే ఈయనా? అబ్బో! పెద్ద అధికారి అంటారుగా?

'మినిష్టరు కాదు. ఈయన రాజేంద్రబాబు! జాతీయగీతాలలో రోజూ వినడంలేదూ....దేశంకోసం హక్కులను వదులుకొని ఫకీరాయెను. దీనులకోసం రాజేంద్రప్రసాద్? దేశంకోసం తన సర్వస్వాన్ని త్యజించి ఫకీరయ్యారు!.... ఆహా! ఈనాడు మినిష్టర్లకంటే ఎక్కువ అధికారంవున్న మనుషులున్నారా? ఉహుం. ఉండకపోవచ్చు! దేశంకోసం తన అధికారాలన్నిటిని వదులుకున్నాడు.

చౌధరిగారు బాలదేవ్‌చేతికి పదిరూపాయలు నోటిచ్చి—'అందరికీ ఫలహారం పెట్టించండి!' అని అన్నారు.

జై! జై!! పదండి. పదండి!'

కాళీచరణ్ కన్పించడేం? వాసుదేవ్‌కూడా లేడు. తిరిగి వెళ్ళేప్పుడు ఏనాదాలు వేయవలసినపని లేదు! అయినా వీళ్ళిద్దరూ ఎక్కడికి వెళ్ళినట్టు? గుంపులో

నుంచి ఎవరో అన్నారు–'వాళ్ళిద్దరూ పైజమా వేసుకున్న ఒక కాంగ్రెసు నాయకుడితో ఎక్కడికో వెళ్ళారు. రేపు వెడదామని అన్నారు!....పైజమా వేసుకున్న నాయకుడా? అయినా చెప్పాపెట్టకుండా వెళ్ళడమేమిటి? పట్నంలో మాటలా? బాలదేవ్‌కు కాళీచరణ్ అంటే అంత సంతృప్తిగా లేదు. కాళీచరణ్ కూడా బాలదేవ్‌కు దూరం దూరంగా తిరుగుతున్నాడు.

'కాళీచరణ్ కాదు. కామ్రేడ్ కాళీచరణ్, కామ్రేడ్ అంటే సహచరుడని, మనమంతా సహచరులం. మీరుకూడా సహచరులే! ఇక్కడెవరూ నాయకుడు కాదు; అందరూ నాయకులే! అందరూ సహచరులే. మంచిది కామ్రేడ్! మీ ఊళ్లో అందరికంటే ఎక్కువ ఏ కులంవాళ్లున్నారు? యాదవులా? సరే! భూమిహారులెవరూ లేరా? ఒక్క ఇల్లుకూడా లేదా! గుడ్! ఊరేగింపులో పాల్గొన్నవాళ్ళంతా బాలదేవ్‌వల్ల ప్రభావితులైన వాళ్ళేనా? ప్రభావితులంటే బ్లైండ్ ఫాలోవర్ - అంటే కళ్ళుమూసుకుని నమ్మేవాళ్ళు కాదుగదా! అంధభక్తులు కాదుగా?'

'అయ్యా. అంధభక్తుడుండేవాడండీ! మహంతు సేవాదాసు! ఆయ పీమధ్యనే కాలం చేశాడు. ఆయన వంటలక్క....!'

సరే. మంచిది. నేను చెప్పినసంగతులన్నీ అర్థమయ్యాయిగా! మెంబరుషిప్ రసీదుపుస్తకాలు తీసుకెళ్ళండి. రాజబల్లీగారూ! వీళ్ళకు కొంత లిటరేచర్ కూడా ఇవ్వండి. కొంచెం కామ్రేడ్ సైనిక్‌ను ఇక్కడకు పంపిస్తారా? ఆఁ.... ఈయన కామ్రేడ్ గంగాప్రసాద్ సింహయాదవ్ సైనిక్‌గారు. వీరు–కామ్రేడ్ కాళీచరణ్....మీ పేరేమన్నారు? ఆఁ. వాసుదేవ్‌గారు! మేరీగంజ్‌నుంచి రామకృష్ణ ఆశ్రమానికి వచ్చిన ఊరేగింపును వీరే నిర్వహించారు. పార్టీ ప్లేస్‌మీద సంతకం చేశాను. మేరీగంజ్‌లో ఎక్కువగా యాదవులున్నారు. అక్కడికి మీరొకసారి వెళ్ళిరావడం చాలా అవసరం. ఆర్గనైజ్ చేయడానికి పెద్ద ఇబ్బందేమీ ఉండదు. అతడే బాలదేవ్ వున్నాడు. ఒక్కడే!....సరే! కామ్రేడ్ కాళీచరణ్! మీ కింకేమైనా సందేహాలుంటే అడగండి!' అని సోషలిస్టుపార్టీ జిల్లా కార్యదర్శి అన్నాడు.

'మేము ఏదైనాపనిని ప్రారంభించామనుకోండి–ప్రజలకి మేలు కలిగేపని!

అప్పుడు హింసను ప్రేరేపిస్తున్నారని మా పదవిని అటకాయిస్తే మేమేంచెయ్యాలి?' కాళీచరణ్ అడగవలసిన ప్రశ్న ఇదొక్కటే!

జిల్లా కార్యదర్శి ఏదో ఆలోచించడం సాగించారు. అయితే కామ్రేడ్ రాజ బల్లీ ఆలోచించడానికి అంతసమయం తీసుకోరు; నత్తి ఉండడంవల్ల మాట్లాడే ప్పుడు కొంచెం ఆలస్యం అయితే కావచ్చు....'ఇ ఇదు....గో, కామ్-కామ్-రేడ్, అటు-అటువంటివాళ్ళకు ఖచ్చితంగా - చెప్పెయ్యండి - ఫా....ఫా....చే టూ మూమెంట్‌లో అహింసను వల్లించివుంటే - ఇ ఇ ఇప్పుడు పదవి ల ల లభించేది కాదు. ఖచ్చి ఖచ్చితంగా చెప్పండి - ను ను నువ్వొత్తి - రి రి రి రి రియాక్షనరీవని, డి డి డి డిమోర్‌లైజ్! ఇదుగోండి, దీన్ని తీసుకెళ్ళండి - డా డా డా డాయలెక్ట్.... ద ద ద ద్వందాత్మక భౌతికవాదం! 'సోషలిజం ఎందుకు?' ఈ రెండుపుస్తకాలు తీసుకెళ్ళండి. వీటిలో అన్నిసంగతులు ఉన్నాయి. 'ఎ ఎ ఎర్ర ప ప పతాకం' కాపీ కూడా ఒకటి తీసుకెళ్ళండి. దీ....దీనికి చందాదార్లను చేర్పించండి. 'లాల్ ఝండా' తీసుకొన్నారుగా?'

> శ్రామికులారా లేవండి!
> ఎర్రబావుటా పట్టండి
> అన్యాయాలను అరికట్టంగా
> హరోం హరా అని కదలండి!

కామ్రేడ్ కాళీచరణ్, కామ్రేడ్ వాసుదేవ్!....సోషలిస్టు పార్టీ! దారిలో కాళీచరణ్ వాసుదేవ్‌కు చెప్పాడు—'అసలు పార్టీ అంటె ఇదేనోయ్! గరమ్ పార్టీ! 'క్రాంతిదళం' అనేపేరు వినలేదా నువ్వు? 'ఫటక్ ఝటక్ మని బాంబు వేసేరా, భారతకేసరి భగత్‌సింగ్‌రా!' ఈ పాట నువ్వు వినలేదా? ఆయన పార్టీయే ఇది. ఇందులో లీడరెవరూ లేరు; అందరూ సహచరులం. అందరూ లీడర్లే. ఆయన చెప్పలేదూ? అహింసనుగురించి బూర్జువాలు చెబుతారు. బాలదేవ్ వట్టి బూర్జువా! పెట్టుబడిదారు! ఈ పుస్తకంలో అన్నీవున్నాయి. బూర్జువా. పెటీ బూర్జువా, పెట్టుబడిదారీతత్వం, పెట్టుబడిదారు, జమీందార్లు, కష్టపడ్డవాడికే తిండి! ఇప్పుడిక బాలదేవ్ నాయకత్వం నడవడానికి వీల్లేదు. మాట్లాడితే హింస అంటాడు.

లేకపోతే నిరాహారదీక్ష అంటారు.... ఈ బిడ్డల వ్యవహారం ఎలా నిర్వహిస్తారో నేను చూస్తాను.'

స్టేషన్‌లో వాసుదేవ్ మరొకపుస్తకం కొన్నాడు. దానిఖరీదు అణామాత్రమే. పేరు 'ఎర్రపుస్తకం' ఒకాయన జోలెలో వేసుకొని అమ్ముతూంటే అదీ కొన్నాడు- 'ఏసు సందేశం' ఇప్పుడు రెండు పుస్తకాలైనాయి; 'ఏసు సందేశం' 'ద్వందాత్మకా భౌతికవాదం'॥

## పదిహేడు

ఆచార్య గురువుగారు కాశీనుంచి వచ్చారు. అన్ని మఠాలకు జమీందారు— ఆచార్య గురువుగారు. ఆయనవెంట ముప్పైమంది అనుచరులొచ్చారు. భండారి, అధికారి, సేవకులు, చిలుం ఇచ్చేవాళ్ళు, అమీనా, కోశాధికారి, గాయకులు వగైరా. సాధువులసమూహంలో ఒక నాగా సాధువుకూడా వున్నాడు. ఆయన భిన్నసాంప్రదాయానికి చెందినవాడైనప్పటికీ ఆచార్యులు ఆయన్ను తనవెంట ఉంచుకుంటారు. ఆయనకు చాలాకోపం. చేతిలో ఒక చిన్నగొడ్డలికూడా ఉంటుంది. పొడుగాంటి గడ్డం, జడలు, శరీరంనిండా విభూతి, నడుంచుట్టూ ఒక వెండిగొలుసు; నగ్నంగా ఉంటాడు. మహంతుతోపాటు ఆయన ఏ మఠానికివెడితే, ఆ మఠం అధికారులు ఆయన రాకవల్ల అష్టకష్టాలూ అనుభవిస్తారు. ఆయన సేవలో ఎటువంటిలోటూ జరగడానికి వీల్లేదు. అందుకే ఆయనను ఆచార్యులువారు తనవెంటే ఉంచుకుంటారు.

నాగసాధువుకు కోపంవచ్చినప్పుడు ఎంతటి అశ్లీలమైన తిట్లు తిట్టడానికి కూడా వెనుకాడడు. రావడంతోనే దాసి లక్ష్మీమీద విరుచుకుపడ్డాడు—'నీ కులాన్ని పూడ్చిపెట్ట, దగుల్బాజీదానా, రంకుముండా, ఏం చూసుకొనే నీ కంత గర్వం? ప్రపంచం అంటే నీ కంత నిర్లక్ష్యమటే? మాట్లాడవేమే తోకముండా.... భడవా, చెమడాలు వలిచేస్తాను. ఆచార్యగురువును దూషిస్తావా? నీ నోట్లో నా గొడ్డలిపిడి దూరుస్తాను ఏమనుకున్నావో? గతిలేని కుక్కా, నీతిలేని నక్కా,

సాధువులర క్తాన్ని వంచుకొని పుట్టి వేరేవాళ్ళ ఒళ్ళు దూరుతావా? ఛడవా. కార్తీక మాసపు కుక్కా! రంకుటాలికి కొత్తదిసుద్దులు చెప్పట! అంత మితిమీరిపోయావా? పో! అవతలికి పో!'

లక్ష్మి చేతులుజోడించి కూర్చున్నది. నాగసాధువు తిట్లను సాధారణంగా ఎవరూ పట్టించుకోరు! పెద్దగానూ భావించరు. ఆశీర్వాదంగా తీసుకుంటారు. ఆమె నాగసాధువు పాదాలు స్పృశించి - 'ఈ దాసీదాని అపరాధాన్ని క్షమించండి మహా మునీ' అని వేడుకొన్నది.

రామదాసును పావుకోళ్ళతో విపరీతంగా కొట్టడంవల్ల వళ్ళంతా తూట్లు పడింది - 'గాడిదకొడుకా! కుక్కలకొడుకా! మహంతు వవుతావట్రా! రారా దగ్గరకు! నా పావుకోళ్ళతో నీ నొసట తిలకం పెడతాను! నీయమ్మ! నీయక్క! గడ్డి అమ్ముకునే నాయాలా! పో! కట్టెలుతెచ్చి అగ్నికుండంలో వెయ్యి! వెయ్యరా!'

నరసింహదాసు చాలా ప్రసన్నవదనంతో ఉన్నాడు. ఇందాకేగా ఆహ్వానించ డానికి స్టేషన్‌వరకూ వెళ్ళివచ్చాడు! ఈ విషయాలన్నీ వినేప్పటికి ఆచార్యులుగారికి కూడా మితిమీరిన కోపంవచ్చింది... దాసీదాన్ని మఠంనుంచి బహిష్కరించాలి. నాగాసాధువుకు నరసింహదాసు గంజాయి అందించాడు. అధికారికి వచ్చనోటు ఇచ్చుకున్నాడు.... మహంతుపదవి వచ్చేలాగానే వున్నది. అంతా ఆ సద్గురుకృప!

ఆచార్యగురువు లక్ష్మితో స్పష్టంగా చెప్పేశాడు - 'రామదాసు మహంతు కావడానికి అర్హుడు కాదు. మహంతు సేవాదాసు కితడు శిష్యుడనడానికి ప్రమాణా లేమున్నాయి? ఎక్కడైనా లిఖితపత్రాలేమైనా వున్నాయా? నియమప్రకారంచూస్తే ఈ మఠానికి సర్వాధికారాలు ఆచార్యులకు లభిస్తాయి. నువ్వు మఠంలో ఉండడానికి ఏమాత్రం వీల్లేదు. సేవాదాసు నిన్ను ఉంపుడుగత్తెగా పెట్టుకున్నాడు. ఇప్పుడు సేవాదాసు లేడు. నీకిక ఇక్కడ స్థానం లేదు. నీదారి నువ్వు చూసుకో!'

'ఆచార్యులంగారి ఆజ్ఞ శిరసావహిస్తాను!'

'ఆచార్యులంగారి ఆజ్ఞా?....నాగాసాధువు ఆజ్ఞ!'

నాగసాధువు రాత్రిపూట లేచి ఒకపర్యాయం నలువైపులా పరికించి లక్ష్మి గదివైపుకు నడిచాడు. కాళ్ళకు ఏమీ లేకుండానే! పావుకోళ్ళు ఉంటే టక్ టక్ మని ధ్వని చేస్తాయిగదా!

... ఛదవముండ। తలుపు బిగాయించివేసుకుని మరి పడుకున్నది. ఇక్క-డెవరో పడుకున్నారు? వాడే వనుకుంటాను - ఆ రామదాసు పీనుగ।....ఒరేయ్ రాండాసుగా। లేవరా తొత్తా। వెధవపీనుగా। ఆ దాసీదాన్ని లేపు. నా గంజాయి కొట్టేసి పట్టెమంచంమీద హాయిగా పవ్వళించి ప్రగాఢానంద లీలాతన్మయతలో విలీనమై పోయిందా ఏమిట్రా? నా గంజాయి ఎక్కడ్రా? నీకు తెలియదా? మూడు రోజులకు సరిపోయే పదార్థంరా అది? ఏదీ, ఎక్కడున్నది?'

'ప్రభో। అర్ధరాత్రివేళ గంజాయి....।'

'నోరు మూస్తావా లేదా? ముందు ఆ దాసీదాన్ని నిద్రనుంచి లేపు।'

'అలాగే ప్రభో। లక్ష్మి తలుపుతీసుకొని బయటకొచ్చింది.

'గంజాయి ఏదీ?'

'ఇదుగో ప్రభూ?' ఒక పెద్దపొట్లాం లక్ష్మి నాగాసాధువుచేతిలో పెట్టింది.

ఈ దుర్మార్గురాలిదగ్గర ఇంత గంజాయి ఎక్కడిది? మూడుపేర్లున్నదా ఏమిటి?.... ఈ రాండాసునాయాలు ఇక్కడ నిలబడి ఏం చేస్తున్నాడు?'

'ఒరేయ్। గాడిదకొడకా। నువ్విక్కడ నిలబడి ఏంచేస్తున్నావ్?' ... ఠపే ఠటాక్....। లక్ష్మి గభాలున తలుపులు మూసివేసుకున్నది.

'సరే। రేపుచూస్తాను నీపని। విన్నేగనుక మఠంలోపట్నుంచి జుట్టు పట్టుకుని బయటికి లాగించకపోతే చూడు। మహేంద్రనాథ్ గురువుమీద ఒట్టేసుకుని మరీ చెబుతున్నాను:'

నరసింహదాసు ఒంటరిగా లక్ష్మిని కలుసుకొని, 'లక్ష్మి గాభరా పడకు। ఎలాగూ నేను మహంతును కాబోతున్నాను. నువ్వు మఠంలోనే ఉండు. విన్నెవరూ ఇక్కడనుంచి వెళ్ళగొట్టలేరు. ఈ విషయంలో నువ్వు చింతాక్రాంతురాలివి కా నవసరంలేదు.' అని చెప్పాలనుకున్నాడు. కాని ఆ అవసరమే లభించలేదు. కొంపదీసి ఉదయానికి ఉదయమేలేచి ఆమె వెళ్ళిపోదుగదా।

ఆచార్యగురువుదగ్గరున్న యువ అధికారికి రాత్రి నిద్ర పట్టనేలేదు——

'పూర్ణియా జిల్లాలో ఈ దోమలు కంబళిలోకిదూరి మరీ కుడుతున్నాయి।'

ఉదయం లక్ష్మి బాలదేవ్‌దగ్గరి కెళ్ళింది. అప్పు డాయన చీటీలు పంచిపెడు

తున్నాడు. విషయమంతా విని — 'లక్ష్మిగారూ! ఆచార్యగురువు మఠా లన్నిటి మీద నాయకుడు. ఆయన అభిప్రాయానికి తిరుగులేదు. ఇందులో నేను కల్పించు కోవడానికి వీల్లేదు. పెద్ద ధర్మసంకటమే వచ్చిపడింది. మతపరమైనవిషయాల్లో జోక్యం కల్పించుకోవడంకూడా అంత మంచిది కాదు....మధ్యాహ్నం జరిగే మహంతు ఉత్సవానికి నేనూ వస్తాను' అని అన్నాడు.

లక్ష్మికి బాలదేవ్ మీద ఎంత భరోసా ఉన్నది. తాసిల్దారుగారు ఇంట్లో లేరు. డాక్టర్‌గారు ఇటువంటివ్యవహారాల్లో తల దూర్చరు. సింగ్‌గారు విని వూరుకున్నారు. ఖేలావన్ బాలదేవ్ మీద తోపేశాడు!....హే సద్గురు! ఏమిటి ఉపాయం?'

'నమస్కారం లక్ష్మిగారూ!'

'ఎవరూ? కాళీచరణ్ బాబు. మీరా? సద్గురుకృప!'

'తిలకోత్సవం ఎప్పుడు? భజన సంకీర్తనం పెట్టించడం లేదా?'

దాసి లక్ష్మి తన గోడంతా కన్నీరుమున్నీరుగా కారుస్తూ విన్నవించుకున్నది- 'కాళీబాబూ! ఎంత తప్పుడుకూతలు వినవలసివచ్చింది? హే సద్గురు!... ఇప్పుడు నే నెక్కడకు వెళ్ళను? నా కెవరున్నారు దిక్కు?'

'సరే! మీరు విచారించకండి....బాలదేవ్ ఏం చేస్తాడు? ఆయన వట్టి బూర్జువా! మీరు కన్నీరు కార్చకండి!'

లక్ష్మి కాళీచరణ్‌వైపు కొంచెం పరీక్షగా చూసింది....ప్రయాగ వస్తు ప్రదర్శనశాలలో తను చూసిన నల్లటివిగ్రహం గుర్తుకొచ్చింది.

మఠంలో సాధువులు, పెద్దలు, దాస దాసీజనాలు, మొత్తం పందిర్లో కూర్చు న్నారు. నరసింహదాసు తలజుట్టు తీయించేసుకున్నాడు. సగంవరకున్న మీసాలు కూడా పూర్తిగా తీయించివేశాడు. సాధువులభాషలో దీన్ని 'మోంఛభదరా' అంటారు! తెల్లటి మల్లలంగోటి, కౌపీనం వస్త్రవిహీనమైన దేహం....శాలువా ఆచార్యగురువుగారు కప్పుతారు. ఆచార్యగురువుగారి కోశాధికారి ఖరారునామా తయారుచేస్తున్నాడు. లక్ష్మి ఒకపక్కన మాటాపలుకూ లేకుండా కూర్చున్నది - నేలమీద. రామదాసు దేహంనిండా పసుపు సున్నం పూయబడివుంది. బాలదేవ్‌కు లక్ష్మిమీద చాలా జాలిగా వున్నది. కాని ఏమిటి చేయడం?

'సమస్త సాధువులు, సేవక సేవికాజనం వినవలసింది!' ఆచార్యులవారి కోశాధికారి రాసింది చదవడం ప్రారంభించాడు — 'లిఖితమ్ నరసింహదాసు, గోవర్ధనదాసు శిష్యుడు జాతి బైరాగి....' మీరంతా దీనిమీద సంతకం చెయ్యండి.' లక్ష్మి వెక్కి-వెక్కి ఏడుస్తున్నది. హే సద్గురు!

'ఒసేవ్! నోరు మూస్తావా లేదా, రండముండా! కర్రతీసుకుని నెత్తిన పెట్టమంటావా?' నాగాసాధువు అరిచాడు—'నోర్మూసుకో!'

సంతకం చేయడం చేతనయినవాళ్ళు చేస్తున్నారు. బాలదేవ్‌కూడా సంతకం చేశాడు. ఆయన చెయ్యి ఏమాత్రం కంపించలేదు. కాళీచరణ్ ఆ పత్రాన్ని చేతిలోకి తీసుకొని - 'అయ్యా! ఆచార్యులుంగారూ! మహంతు సేవాదాసు వారసుడైన శిష్యుడు లేకుండానే మరణించారని మీరంటున్నారు. ఈ ఊళ్ళోవున్నవాళ్ళంతా వట్టి వెర్రి దద్దమ్మలనేనా మీ ఉద్దేశ్యం?' అని ప్రశ్నించాడు.

'కాళీచరణ్!' బాలదేవ్ వారించాడు—'కూర్చో!'

'కాళీచరణ్!' ఖేలావన్‌యాదవ్ కోపంగా పిలిచాడు.

కాని కాళీచరణ్ మాట్లాడకుండా ఉండలేదు. దీన్ని హింసావాదంగా పరిగణించినా సరే, ఇందుకు ప్రాయశ్చిత్తంగా ఎవరైనా నిరాహారదీక్షకు పూనుకున్నా సరే! తనుకూడా ఉపన్యాసం ఇవ్వగలడు!

'నాకు తెలుసు, చాలా బాగాతెలుసును - రామదాసు ఈ మఠంలోని శిష్యుడే, మహంతు సేవాదాసు శిష్యుడు. ఆయనను మహంతుగాచేయడం మానేసి మరొక పరమనీచుణ్ణి మహంతును చేస్తున్నారు....మఠానికి మా తాతలు, తండ్రులు భూమిని దానం చేశారు. ఇ దెవరి తాతగారి ఆస్తికాదు.'

'నీ జాతేమిటి? నువ్వు కూసే కూతలేమిటి? నోర్మూస్తావా లేదా గాడిద కొడకా! లేకపోతే నా గొడ్డలితో నిన్ను రెండుముక్కలుగా నరికెయ్యనా? నీ యమ్మ....!'

'నోర్మూసుకోరా ఛండాలుడా!' కామ్రేడ్ వాసుదేవ్ ఒక్కసారిగా లేచి నిలబడి అన్నాడు.

'సైతాన్‌గాణ్ణి పట్టుకోండి ముందు!' కామ్రేడ్ సుందర్ బిగ్గరగా అరిచాడు.

'పారిపోతుండా పట్టుకోండి!'

'నాలుగు తన్నండి!'

....పట్టుకోండి, పట్టుకోండి. తన్నండి....ఆగండి! ఏ వాసుదేవ్! ఏ సుందర్! ఏ....!....

నాగసాధువు గడ్డం వదిలించుకున్నాడు; జటాజూటాలు వదిలించుకున్నాడు! దెబ్బలకు కళ్ళముందు చక్రాలు కవ్విస్తున్నాయి. గంజాయినిషా దిగిపోయింది... గడ్డం, జటలు బాగా రక్షించుకొని బలవంతంగా వదిలించుకుని, గొడ్డలి అక్కడే వదిలేసి పరుగు లంకించుకున్నాడు. పట్టుకోండి. పట్టుకోండి! వదిలెయ్యండి! వదిలెయ్యండి. కొట్టినంతవరకు చాలు! నాగసాధువు పారిపోతున్నాడు. విభూతి పూసుకున్న నగ్నశరీరంతో, విరబోసుకున్న జడలతో పరుగు లంకించుకున్నాడు. పరుగెత్తేప్పుడు అతని ఆకారం మరింత భయంకరంగా తయారైంది. ఊళ్ళో వున్న కుక్కలన్నీ వెంటబడ్డాయి. భౌ భౌ! ఊళ్ళోని దళన్లకొద్దీ కుక్కలు వెంటబడ్డాయి. మహంతు కాబోతున్న నరసింహదాసుకు నాలుగుదెబ్బలు పడేటప్పటికి కిందా మీదా అయిపోయి - 'అయ్యా, నన్ను వదిలెయ్యండి! నా కక్కర్లేదు ఈ మహంతు పదవి!' అని వేడుకోవడం ప్రారంభించాడు.

'వదిలెయ్యండి! వదిలెయ్యండి!!' కాశీచరణ్ ఆజ్ఞాపించాడు. నరసింహదాసుకూడా పిక్కబలం చూపించాడు.

అక్కడున్న గ్రామపెద్దలందరూ విస్మెరబోయారు. అక్కడున్న సాధువుల పరిస్థితి అటూ ఇటూ కాకుండా వున్నది. పెద్దల మొహాలన్నీ వేలాడబడివున్నాయి. అందరికీ మధ్యలో కాశీచరణ్ చేతిలో ఖరారునామాపత్రం పుచ్చుకుని సికందర్ పాదుషాలాగా నిలబడివున్నాడు. కళ్ళు మూసి తెరిచేలోగా ఎంత జరిగిపోయింది!

'అయ్యా, ఆచార్యులుంగారూ! నేను మీకు విన్నవించేదేమిటంటే ఈ పత్రంలో రామదాసుపేరు చేర్పించి మహంతు తిలకోత్సవం జరిపించండి.'

ఆచార్యులు వణుకుతూ - 'బాబూ! సేవాదాసుకు శిష్యులెవరూ లేరని చెబితే నిజమే ననుకున్నాను. రామదాసు ఆయన శిష్యుడైతే రామదాసే ఈ మఠానికి మహంతు!' అని అన్నాడు - 'కోశాధికారిగారూ! ఖరారునామా రాయండి! శాలువా, పెరుగు అవీ తీసుకరండి!'

రామదాసు స్నానంచేసి శరీరంమీదున్న పసుపు సున్నపు మరకల్ని శుభ్రం చేసుకుని మరీ వచ్చారు. పెరుగుతో నొసట తిలకం పెట్టేప్పటికి దేహమంతా శాంతించింది.... హే సద్గురు! హే సద్గురూ!

పీఠో్కాలపూజ జరిపించుకోకుండానే ఆచార్యులుంగారు ఆసనంమీదినుంచి దిగిపోయారు. గ్రామపెద్దలుకూడా మెదలకుండా వచ్చినదారినే ఇంటిమార్గం పట్టారు. లక్ష్మి పూజసామగ్రితోవున్న పళ్ళెంతో నిలబడి ఉన్నది - 'ప్రభూ! ఈ దాసీ అపరాధాన్ని మన్నించండి.'

'కాశీబాబూ!'

బాలదేవ్ వెనక్కి తిరిగిచూశారు. లక్ష్మి కాశీచరణ్‌ను లోపలికి తీసుకొని వెళుతున్నది. కాశీచరణ్ చాలా అన్యాయంగా వ్యవహరించారు. ఘోర అన్యాయానికి పాల్పడ్డారు. హింసావాదానికి తలపడ్డారు. ఈసారి రెండురోజులు నిరాహారదీక్ష పూనాలి.

ఖేలావన్ కులపెద్దలందర్నీ పిలిపించి పెద్దవాళ్ళను శిక్షించేచర్య తీసుకుంటారు. హే భగవాన్! సాధువులమీద చెయ్యి చేసుకోవడమా!....

కాశీబాబూ! మీరు దేవతాస్వరూపులండి నిజంగా!'

కాశీచరణ్ కుస్తీ నేర్చుకుంటున్నారు. 'కుస్తీ నేర్చుకునేవాళ్ళు ముఖ్యంగా పాటించవలసింది. ఆడవాళ్ళకు అయిదుబారలదూరంలో ఉండాలి అని కుస్తీ నేర్పే గురువు ఆదేశించారు.

తమ అయిదుబారలకంటే ఎక్కువదూరంలోనే నిలబడివున్నారు.

## పద్దెనిమిది

'పేరేమిటి?'

'పవిచ్చర్ మహతో!'

'ఎన్నిరోజుల్నుంచి దగ్గు వస్తున్నది? ఏమైనా మందు తీసుకుంటున్నావా లేదా? ఏమన్నావూ? ఉమ్మిలో రక్తం పడుతున్నదా? ఎప్పటినుంచి? అప్పు

దప్పురా? ఊం....! ఒక ఉగ్రమైన దబ్బాలో రాత్రి ఊపే ఉమ్మి అంతా తీసుకరా! ఇలారా! గట్టిగా ఊపిరిపీల్చు! ఒకటి-రెండు-మూడు అను. దగ్గరగా! వరే, వాలు!'

'పేరేమిటి?'

'దాసూ గోప్!'

'పొట్ట చూపించు. ఊం, ప్లీహం. ఇంజెక్షన్ ఇవ్వాలి. రాపిస్తాను. ఆరోజున రా. రేపుదయంవచ్చి రక్తం పరీక్షచేయించుకొని వెళ్ళు. ఉదయమే రా! తెలిసిందా?'

'పేరేమిటి?'

'నిర్మల.'

'డాక్టర్‌గారూ!'-ఒకవృద్ధుడు నమస్కరిస్తూ ముందుకొచ్చారు. వచ్చి ప్రాధేయపడ్డాడు-'నా కూతురండి. ఒక సంవత్సరంక్రిందట కంటిలో పువ్వేసింది. ఆ తరువాత రెండుకళ్ళకూ వచ్చింది. ఎన్నో వనమూలికల పసర్లు వాడిచూశాము; కాని ప్రయోజనంలేక పోయిందండి! ఇప్పు దేంచేయాలో తోచక మీ దగ్గరకు తీసుకొచ్చానండి.'

నిర్మల అపురూప సౌందర్యవతి! తీర్చిదిద్దిన పాలరాతి విగ్రహంలాగా వుంటుంది. పరిశుద్ధమైన మిథిలసౌందర్యం. భ్రమరం పొరపాటేమీ చేయలేదు. కళ్ళు చూపించు. ఇంకొంచెం ముందుకు జరగండి. అహా!....ఒక్క బిందువు ఐ డ్రాప్ (కంట్లో మందుచుక్కలు) వేయకపోవడంవల్ల రెండు అందమైన కళ్ళూ శాశ్వతంగా జ్యోతిని పోగొట్టుకున్నాయి. వెయ్య దాటిపోయింది. దీనికి చికిత్స లేదు.

డాక్టరు కనురెప్పలుతిప్పి మిణుకు మిణుకుమనే రవ్వంత జ్యోతి ఎక్కడైన కన్పిస్తుందేమోనని ప్రయత్నించిచూశాడు. ఊహుం. కనుగుడ్లు పూర్తిగా తెల్లబడి పోయాయి. ఈ కనుపాపల్లో కుంచెతో రంగువింపితే ఎలా వుంటుందోనని ఆయన ఆలోచించాడు. అవును! చిత్రకారుడిచేతుల్లోనే ఈ కళ్ళకు అందం చేకూరుతుంది! జ్యోతిని ప్రసాదించడం అతనికే చేతనవుతుంది!

'డాక్టరుగారూ!' ఆమె పిలిచింది. కంఠం ఎంత మధురాతిమధురంగా వున్నది! 'మీ పేరు ప్రతిష్ఠలువిని వచ్చానండి. ఎంతో ఆశతో వచ్చానండి. ఇరవై రెండు కోసుల్నుంచి! భగవంతుడు మీకు మరింత పేరు తెస్తాడు.'

వెలుతురు ప్రసాదించండి; వెలుతురు ప్రసాదించండి!! అంధకారంలో కొట్టుమిట్టులాడుతున్న ప్రాణి ప్రాధేయపడుతున్నది; విలవిలలాడుతున్నది. ఆత్మ సంక్షోభిస్తున్నది - వెలుతురుకోసం డాక్టరేం చేస్తాడు? డాక్టరు భావుకుడు కాకూడదు.

'గాభరా పడకండి. మందిస్తాను. నావల్ల నయంకాకపోతే పాట్నా వెళ్ళవలసి వుంటుంది.'

'ఆఁ. తరువాతెవరు?.... పేరేమిటి?'

'రామ చరిత్తర సాహ.'

'ఏమిటి బాధ?'

'ఏమితిన్నా వాంతి అయిపోతున్నదండి. పిత్ళకూడా!'

'ఎప్పటినుంచి?'

'వారంరోజుల్నుంచండి!'

'వారంనుంచా? ఏదీ ఇలా దగ్గరకురా!'

'జబ్బు నాకు కాదండి. రోగి ఇంటిదగ్గ రున్నదండి!'

'ఇల్లెక్కడ?'

'సరపేసి బిజలియాంది. ఇక్కడికి పదికోసు లుంటుందండి!'

అకస్మాత్తుగా రోగులంతా, క్రూరమృగాన్నిచూసి పశువులగుంపు ఒకపక్కకు పరుగులెత్తినట్టు, ఒకపక్కకు జరిగారు. అందరు ఒక్కసారిగా దిగాలుపడి పోయారు. ఆడవాళ్ళు తమ శిశువుల్ని పొత్తిళ్ళలో దాచుకొన్నారు. అందరి భయావహమైన చూపులు ఒకే ఒకవైపుకి కేంద్రీకరించబడివున్నాయి.

డాక్టరు తలపైకెత్తిచూశాడు - ఒక మధ్యవయస్కురాలయిన స్త్రీ!.... నాగరికమైన మహిళ!

'ఏమండి? చెప్పండి?'

'డాక్టరుగారూ! ఈ అబ్బాయి నా మనుమడండీ। వీడొక్కడే నాకు. వీడు నాకంటికి జ్యోతి! సంవత్సరంనుంచి విరేచనంతో రక్తం పడుతున్నదండి. ఎలాగైనాసరే ఈ పిల్లవాణ్ణి బతికించండి డాక్టరుగారూ!....బతకడా?'

'గాభరాపడకండి....ఏదీ బాబూ! ఇలారా! నీ పేరేమిటి?....గణేశ్! బావుంది! ఏదీ కొంచెం నీ పొట్ట చూపించు గణేశ్!'

గణేశ్ అమ్మమ్మ మందుతీసుకొని వెళ్ళిపోయింది. రోగులు మళ్లా డాక్టర్ బల్లచుట్టూ చేరారు.

చిచాయతల్లి—'ఈమె పార్వతి తల్లి! పట్టి రాక్షసి! మూడువంశాల్లో ఎవర్నీ వదిలిపెట్టలేదు. మొదట భర్తను. ఆ తరువాత మరిదిని. మరిది భార్యను. పిల్లల్నీ అందర్నీ పొట్టన బెట్టుకున్నది. ఇక ఈ మనమడొకడు మిగిలాడు. వాణ్ణికూడా నమిలేస్తుంది!' అని అన్నది.

చిచాయతల్లి తానుకూడా ఏదో నములుతున్నట్టుగానే మొహం బెట్టింది. డాక్టర్ చిచాయతల్లివైపు చూశాడు. నల్లగా, లావుగా, ముడికిగావున్న ఈ పోట్లాడే ముసిల్ది చిచాయ్ తల్లా? కారణంలేకుండానే ఏమేమో మాట్లాడేస్తుంది. అరుస్తూ ఉంటుంది. పరమరాక్షసి ఈమెకాదా? 'చిచాయగారి మాయలేదీ డాక్టరు! ఏడునెలల గర్భాన్నికూడా ఇట్టే సునాయాసంగా తీసేస్తుంది; ఎవరికీ ఏమీ అనిపించదు!' అని సుమరితదాసు ఒకసారెప్పుడో చెప్పాడు! ఈమె రాక్షసికాదు; గణేశ్ అమ్మమ్మ రాక్షసి! ఆశ్చర్యమే!

గణేశ్ అమ్మమ్మ! వృద్ధాప్యంలోకూడా ఆమె సౌందర్యం చెక్కు చెదరలేదు; పైపెచ్చు ఆమె మొహంమీది ముడతలు కొత్త అందాన్ని తెచ్చిపెట్టాయి. తలమీద తెల్లటి ఉంగరాలజుట్టు! పెదాలమీది లాలిత్యం చెక్కుచెదరలేదు. చిబుకం మీద చిన్నగుంట! నాసిక పక్కనున్న రేఖకింద చిబుకాన్ని అందుకుంటున్నది. అందమైన పలువరస! యౌవనంలోని సౌందర్యం అగ్నిని ప్రజ్వలింపజేస్తే, వృద్ధాప్యంలోని అందం అనురాగాన్ని ఒందింపజేస్తుంది. అయితే ప్రజలు ఈమెను రాక్షసిగా భావిస్తున్నారు. ఆశ్చర్యమే మరి!

'ఎక్కడుంటుం దీమె?'

'ఈ ఊరే। కాళీచరణ్ ఇల్లు చూశారుగా। ఆ ఇంటిదగ్గర్లోనే। వైద్యులు। పెద్దపెద్ద భూతవైద్యులు ప్రయత్నించిచూశారు. ఎవరూ ఏమీ చేయలేకపోయారు. శీతాష్టమిరోజు రాత్రిపూట ఈమె నెంతమందో బంగళాదగ్గరి తోపులో కుర్రవాణ్ణి చంకన పెట్టుకుని నగ్నంగా నాట్యంచెయ్యడం చూశారు. గొడ్లకాపరి గైను ఒక సారి పట్టుకొనడానికి ప్రయత్నించేప్పటికి అతనిమీద అగ్నిబాణాలు కురిపించింది. దాంతో అతనిశరీరం బొబ్బలెక్కింది. ఆ రెండోరోజున గైను చనిపోయాడు.'

రోజూ రాత్రిపూట డాక్టరు కేస్ హిస్టరీ రాసుకోవడానికి కూర్చుంటాడు. ప్రస్తుతం అతనికింద విషజ్వరానికి చెందిన ఏభైమంది రోగులున్నారు. ఈ రోగుల లక్షణాలు విషజ్వర నివారణవిషయంలో కొత్తవిషయాలను బహిర్గతం చేయవచ్చు.

ఒకటి : (అ) సెలీమండల్, వయస్సు 35, హిందువు (మగ). గ్రామం: మేరీగంజ్, దర్భానులవీధి. బాధ: దంతాలలోను చిగుళ్ళలోను బాధ। ముఖం కడుక్కునేప్పుడు చిగుళ్ళనుంచి రక్తం వస్తుంది; నోటిదుర్వాసన. శరీరంలో దురద. ఆకలి లేకపోవడం. జ్వరం : లేదు. రోగలక్షణం : పయోరియా। మందు: కార్బోలిక్ పుక్కిలింపు. విటమిన్ సి. ఇంజెక్షన్.

(ఆ) పదిహేనురోజులతరువాత సాయంత్రంపూట తలనొప్పి ఫిర్యాదు. జ్వరం 99·5. రాత్రిపూట చెమట. కాల్షియంపౌడి.

(ఇ) అయిదురోజులతరువాత పొట్ట చెడిపోయింది. జ్వరం: 100. కార్మినేటివ్ మిక్చరు. విషజ్వరం. పరీక్షకోసం రక్తం తీసుకోబడింది.

(ఈ) ఆల్డెహయిడ్ టెస్ట్ పరిణామం: (++) విషజ్వరం. చికిత్స: నియోస్టబోసన్ ఇంజెక్షను.

రెండు : (అ) శేతరి, వయస్సు 17, హిందువు (స్త్రీ). గ్రామం: పహరావాళ్ళ వీధి, మేరీగంజ్.

బాధ : కీళ్ళబాధ, అప్పుడప్పుడు ముక్కునుంచి రక్తం ప్రవహిస్తుంది. జ్వరం: లేదు; (థర్మామీటర్‌తో చూస్తే 99·5 ఉన్నది) ఆకలి: లేదు. వ్యాధి: కీళ్ళవాతం.

ఔషధం : విటమిన్ బి. ఇంజెక్షన్, మాలిష్‌తైలం. డబ్ల్యు. ఆర్. కోసం రక్తం తీసుకోబడింది.

(ఆ) డబ్ల్యు. ఆర్. (వేడి): (—) వేడిలేదు.

(ఇ) ఒకవారం తరువాత ముక్కుమంచి రక్తం పడింది. పొట్ట చెడింది. విషజ్వరంకోసం రక్తం తీసుకోవడం జరిగింది.

(ఈ) అల్డేహాయిడ్ పరిణామం. సందేహాస్పదం మళ్ళా రక్తం తీసుకోబడింది.

(ఉ) బ్రహ్మచారి టెస్ట్ పరిణామం: (+)

చికిత్స: యూరియా స్టిబామైన్ (బ్రహ్మచారి)

మూడు: (అ) రామపేర్ కొడుకు: వయస్సు 2 నెలలు. నాభిలో గాయం. రాత్రిపూట ఏడుస్తాడు. పాలు కక్కుతుంటాడు. తల్లికి కాల్షియంపోదరు.

(ఆ) ఒకవారం తరువాత దేహంనిండా పెద్దమచ్చలు. అనుమానం: ఎలర్జిక్.

(ఇ) నాలుగురోజులతరువాత: మచ్చల్లో పీశ్చు చేరాయి. డబ్ల్యు. ఆర్. నిమిత్తం తల్లిరక్తం తీసుకోవడం జరిగింది. పరిణామం: (—) లేదు.

(ఈ) విషజ్వరంకోసం తల్లి రక్తం తీసుకోవడం జరిగింది. పరిణామం: (—) లేదు. విషజ్వరంకోసం కుర్రవాడిరక్తం తీసుకోబడింది. పరిణామం: (+ + +) విషజ్వరం.

ఈ కుర్రవాడు చనిపోవడం జరిగితే దయ్యాలమీద తోసేస్తారు. వంటిమీద బొబ్బలు! గణేశ్ అమ్మమ్మను అనుమానిస్తారు. గణేశ్ అమ్మమ్మ! ఎందుకు గణేశ్ అమ్మమ్మతో ఏదో అనురాగబంధాన్ని ఏర్పాటు చేసుకోవాలనే తహతహ తనలో బయలుదేరింది! కమల చెప్పింది - 'పిచ్చి! పిచ్చిలో ఎన్నో సద్గుణాలున్నాయి. గడ్డిపోచలతో ఎన్నో వస్తువులు తయారుచేస్తుంది - ఫ్లవర్‌వాజ్, బుట్టలు, పంకాలు! అలాగే అల్లికపని ఎంతో బాగా చేస్తుంది. పండగలూ-పబ్బాలు, పెళ్ళిళ్ళు-పేరంటం వచ్చినప్పుడు గోడలమీద ఎన్నో అందమైన బొమ్మలు వేస్తుంది - తామరపూలు, ఆకులు, నెమిళ్లూ! ముగ్గులు ఎంతబాగా వేస్తుంది!' తనుకూడా ఆమెను పిచ్చి అనే పిలుస్తారు!

'పిచ్చీ!'

'ఎవరూ?'

'నేను, డాక్టర్ని! గణేశ్ ఏడీ?'

'డాక్టర్ బాబుగారూ! మీరా? రండి. రండి. కూర్చోండి. గణేశ్ నిద్రపో తున్నాడు.... నేను నివ్వెరపోయాను. బాబూ. ఎవరు నన్ను పిన్నీ అని పిలుస్తున్నారా అని!' వృద్ధురాలి కళ్ళు చెమర్చాయి.

'పిన్నీ! మీరేదో ప్రత్యేకమైన హల్వా చేస్తారని విన్నాను!' పిన్ని నవ్వింది. 'ఎవరు చెప్పారు బాబూ నీతో! బహుశా కమల చెప్పివుంటుంది.'....'కమల కెట్లా వుంది బాబూ? ఈమధ్య ఇటువైపుకు రానేలేదు. ఇదివరలో అయితే రోజూ వస్తూ ఉండేది.'

'బాగా నేవున్నది. బాగవుతుందికూడాను. పిన్నీ ఒకసంగతి అడగమంటారా? మీ చెల్లెలో, మీ తల్లిగారో, మీ కూతురో లేక ఇంకెవరైనా....నహర్వాప్రాంతంలో, హనుమాన్‌గంజ్ దగ్గర్లో ఎప్పుడైనా వున్నారా?'....డాక్టర్ తన తలా తోకా లేనిప్రశ్నకు తనకే నవ్వొచ్చింది.

'నహర్వాప్రాంతంలో, హనుమాన్‌గంజ్ దగ్గర్లోనా?....గుర్తు తెచ్చుకోనివ్వు....లేదే? ఏమిటి. విషయమేమిటి?'

'ఊరకే అడిగాను! సరీగ్గా నీలాంటి పిన్ని ఒకామె అక్కడే వుంటున్నది.' మాటమార్చి డాక్టర్ అన్నాడు—'నాకొక ఫ్లవర్‌వాజ్ ఇవ్వకూడదా పిన్నీ!'

ఓహో! నిజంగానే ఈ వృద్ధురాలు దయ్యమే. ఆమె నవ్వులో ఏదో గారడి వున్నది. ఆమె నవ్వులు వాత్సల్యాన్ని వర్షింపజేస్తాయి. అనురాగాన్ని చిలుకుతాయి. ఆ నవ్వులో అంత ఆకర్షణ ఉన్నది!

గణేశ్ చాలా అమాయకమైన కుర్రవాడు? చాలా అందంగా వుంటాడు? ఎర్రటిరంగు. ఎర్రనిపెదాలు. ఉంగరాలజుట్టు అయితే అమ్మమ్మనుంచే అందుకున్నాడు....చాలా ఒంటరిగాఉండే కుర్రవాడులా కన్పించాడు. 'ఎవరితో ఆడుకోవాలి? ఊళ్ళోనిపిల్లలు తమతో ఆడుకోనివ్వరు. నాతోనే ఆడుకుంటూ ఉంటాడు!' అని పిన్ని అన్నది.

'గణేశ్! ఏదీ నీ పొట్ట కాస్త చూపించు. పిన్నీ. రేపు ఈయనగార్ని ఉదయమే తీసుకరండి. రక్తంతీసి పరీక్షిస్తాను. పెదాలు ఎండిపోయినట్టుగా ఉన్నాయి!'

గణేశ్‌కు ఒక మామ దొరికాడు.

'నిజం చెబుతున్నాను పిన్నీ! ఇటువంటి హల్వా నేనిదివరలో ఎప్పుడూ తినలేదంటే నమ్మండి! గణేశ్‌కూడా పెట్టకపోయారా? ఏం ఫరవాలేదు. పెట్ట వచ్చు.'

'మామా! చూడు!' గణేశ్ మెడలో స్టెతస్కోప్ వేసుకొని నవ్వుతున్నాడు.

'అయితే మా పిల్లడు డాక్టరయ్యేట్టున్నాడు!'

డాక్టరు పిన్ని ఇంట్లోనుంచి బయటకొచ్చినప్పుడు కాశీచరణ్ ఇంట్లో బావి దగ్గర ఆడవాళ్లు గుమిగూడి ఉండడం చూశాడు. విప్పారిన కళ్ళతో, తెరుచుకోబడిన నోళ్ళతో ఆశ్చర్యంగా వాళ్ళంతా అదేపనిగా డాక్టర్‌పైపు చూస్తున్నారు.—'ఈ డాక్టర్‌కు కాలం సమీపించినట్టుంది!'

'లాల్‌సలామ్!' కాశీచరణ్ పిడికిలిబిగించి శాల్యూట్ చేశాడు. డాక్టర్ చేతికి ఒక ఎర్రటి కరపత్రం అందిస్తూ—'కామ్రేడ్ కార్యదర్శి మిమ్మల్ని బాగా ఎరుగును డాక్టర్‌గారూ!....కృష్ణకాంతమిశ్రగారు!' అని అన్నాడు.

రావాలి! రావాలి. మీరంతా రావాలి!
శ్రమపడినవారిదే రాజ్యం!
రైతురాజ్యం: ఏర్పడాలి
కూలిరాజ్యం: ఏర్పడాలి

సోదర, సోదరీమణులారా!........ తేదీన మేరీగంజ్ బంగళాతోటలో రైతు మహాసభ ఒకదాన్ని ఏర్పాటు చేస్తున్నాం. పూర్ణియా సోషలిస్టుపార్టీ సహాయమంత్రి సహచరుడుఅయిన గంగాప్రసాద్‌సింగ్ యాదవసైనిక్‌గారు.

'సభ ఎల్లుండి జరుగుతుంది. మీరంతా తప్పకుండా రావాలి. లాల్‌సలామ్!'

## పందొమ్మిది

పదండి, పదండి! సభకు వెడదాం పదండి!

సోషలిస్టుపార్టీ సభ జరుగుతుందనేవార్త ప్రత్యేకించి సంథాల్‌పేటవాళ్ళలో ఆసక్తిని రేకెత్తించవలేపింది. ఊళ్ళో అప్పుడే తెరిచిన సంతోషవార్త సంథాలీయుల

మీద అంతగా పనిచేయలేదు. ఊళ్ళోని తగువులాటలతోనూ స్నేహసంబంధాల తోనూ వాళ్ళకేమీ నిమిత్తంలేదు. తామరాకుమీది నీటిబొట్టులా ఉండిపోతారు. అయితే మరి ఈ నళ ? భూమిదున్నేవాళ్ళకు సంబంధించిందా ? కష్టించి పనిచేసే కర్తవ్యనిష్ఠాపరులైన సంథాల్ కర్షకహృదయాలను బహుకాలంగా పట్టి పీడిస్తున్న చిక్కు సమస్యలకు పరిష్కారం చూపిస్తుందా ? భూమిదున్నేవాళ్ళ నళ।

'భూమి ఎవరిది ? దున్నేవాడిదే। దున్నేవాడే నాట్లు వేస్తారు: నాట్లు వేసిన వాడే కొంత కోసుకుంటాడు. శ్రమపడినవాడే తింటాడు।' కాళీచరణ్ వివరిస్తున్నాడు.

నలువైపులా ఆరోగ్యవంతమైన, దృఢమైన స్వచ్ఛ సరళ మానవ సమూహం। నల్లటి ముఖాలమీద తెల్లటి చిరునవ్వులు, నల్లటి మేఘాలలో తదియ నాటి చంద్రుడి తునకల్లాగా కన్పిస్తున్నాయి. బిరసా నాయకుడు కొడుకు మంగళ్ కాళీచరణ్ చెప్పేమాటలను పాటలుగా మార్చటానికి ప్రయత్నిస్తున్నాడు.

దున్నేవాడే నాటువేస్తాడు....

సనియా కాళీచరణ్ చెప్పే ప్రతిమాటకు ఫకాలున నవ్వుతున్నది. హి హి హి హి హి హి హి హి । సరిగమలస్థాయిలో నవ్వుతుంది సనియా : తీతువు పిట్ట లాగా - హ హ హ హి । వెనక్కు వేలాడుతున్న ఆమె రంగురంగులకొంగు మాటిమాటికీ జారిపోతున్నది. నాట్యం చేసేందుకు నెమలిపింఛాన్ని విప్పుతున్నట్టూ। ఆమె పాదాలు నాట్యం చెయ్యడానికి కుతూహలపడుతున్నాయి. నాలుగుతరాల నాటిమాట। సంథాల్ పరగణాకుచెందిన మూడు పర్వతప్రాంతాల రాళ్ళభూమి యొక్క మోహపాశాన్ని తెంచుకుని, ఎత్తుపల్లాలతోనిండిన కొండదారుల్ని దాటు కుంటూ వీళ్ళపూర్వీకులు ఈ గ్రామంలోని మెత్తటిభూమిమీద కాలుబెట్టారు। గ్రామస్థులు జమీందారుదగ్గిరికెళ్ళి మొరపెట్టుకున్నారు - 'దొరా। అడవిమనుషులు వచ్చారు. బాణాలతో ప్రాణాలతో చెలగాటమాడతారట। ప్రభుత్వం వీళ్ళను పల్లెత్తు మాటకూడా అనదట। వీళ్ళనిక్కడ స్థిరనివాసం ఏర్పాటు చేసుకోనివ్వడం మంచిది కాదు దొరా।'

అయితే జమీందారు వాళ్ళను సమాధానపరచాడు - 'అటువంటిదేమీ లేదు. వాళ్ళెంతో శ్రమజీవులు. ధర్మపురం వెళ్ళిచూడండి. రాజా లక్ష్మీనాథ్‌సింగ్ వేలాది

శీఘాల బంజరుభూమిని వీళ్లు సస్యశ్యామలం చేశారు. బీడు, మిట్టభూమిని సాగు చేసి తేజాబాబుకు రెండువేల మణుగుల గోధుమను సంథాల్‌వాళ్లు ఇచ్చారు. తెలుసా?

జమీందారు గ్రామస్తులకు మాటిచ్చాడు - వీళ్ళను గ్రామంనుంచి వేరుగానే ఉంచుదాం. అవి జమీందార్లంతా వీళ్ళకు అడవుల్లోనే నివాసాలు ఏర్పాటుచేశారు.

ఆ తరువాతనే తమ్మ, సీమరేగు, అడవిరేగు చెట్లతో నిండివున్న అడవు లన్నీ ప్రతిసంవత్సరం కొట్టి నివాసయోగ్యమైన భూమిగా మార్చారు. ఈనాడు వందలాది బీఘాలభూమిలో ముత్యాలవంటి గోధుమకంకులు తూర్పుగాలికి ఉయ్యాల లూగుతున్నచోటుకు సర్వేకాగితాలలో, పటాలలో అడవిభూమిగా పేర్కొనబడి వున్నది. జిల్లాలోని రాజులు, జమీందారు ఒకప్పుడు ఇక్కడే పులుల్ని వేటాడ డానికి వస్తూఉండేవారు. ఊళ్ళోని కుర్రకారుకి ఈ సంగతులు చెప్పినా నమ్మకం కుదరదు.

నీలిమందుదొరల సిలితొట్లు ఈ మూకమానవుల నల్లటి శరీరాల స్వేదబిందు వులతోనే నిండివుండేవి।

దొరల కొరడాలదెబ్బలు తిని, జమీందార్ల కచ్చేరీంలో వగలంతా 'కాలు గొయ్య' వేయించుకొని సాయంత్రానికి మాంత్రికమైన మోహనవంశి వినిపించ డంతో కష్టాలన్నిటినీ ఇట్టే మరచిపోయేవారు.

టంగ్ రింగ్ తా ధిన్ తా
దా డిగ్గా దా డిగ్గా।

బంగారు ధాన్యరాశులతో నిండిన భూమి గుప్త భాండాగారాన్ని వెలుపలికి తీసుకొచ్చేవాళ్ళమీద పృథ్వీమాతకు ఆగ్రహం కలగడం సహజమే। అందుకే ఈ నాడు భూమి యజమానులు, భూమి వ్యవస్థాపకులు, భూమి న్యాయం, భూమిమీద ఎటువంటి అధికారాన్నీ సుస్థిరపరుచుకోనివ్వలేదు. వాళ్ళ గుడిసెలున్న భూమికూడా వాళ్ళదికాదు. పగలంతా పొలాలదున్నే వీళ్ళ ఎడ్లమీదకూడా భూమిహక్కుదార్ల హక్కు వుంటుందేమో।

ఎంత విచిత్రం।

1947 లో కాంగ్రెసు మంత్రివర్గం ఏర్పడినప్పుడు ఈ జిల్లాకు ఒక ఇంగ్లీషు కలెక్టరు వచ్చారు. ఆయన ఈ పద్ధతిని అన్యాయంగాభావించి మార్చాలని ప్రయత్నించారు. జిల్లాలో వున్న భూస్వాములు, జమీందార్లు, రాజాలు గాభరా పడిపోయారు. జిల్లాలోని ఎక్కువమంది నాయకులు భూస్వాములు, జమీందార్లే! ఇంగ్లీషు కలెక్టరుమీద - సంథాల్ తెగవారిని రెచ్చగొట్టి జిల్లాలో అశాంతిని వ్యాపింపజేసి కాంగ్రెసు మంత్రివర్గాన్ని అప్రతిష్టపాలు జేయడానికి కుట్ర చేస్తున్నట్టు ఆరోపించడం జరిగింది. 'కాంగ్రెసు సందేశం' సంపాదకీయంలో సంథాల్ తెగపట్ల సానుభూతిని ప్రకటించారు. పాపం విద్యాలంకార్ సంపాదకుడికి విద్య అలంకరణ ఎంత అర్థంలేనిదీ ఆరోజే అర్థమైంది. జిల్లాకార్యదర్శి గుడ్లెర్రజేసి మరీ చెప్పారు—'విద్యాపీఠ్ చదువు ఇక్కడ పనికిరాదు. విద్యాపీఠ్‌లో గాడిదకు కొమ్ములు మొలిపిస్తారా!'

జమీందార్లు డబ్బిచ్చి గుండాలతో నవనవలాడుతున్న పంటపొలాలను నేలమట్టంగావించి, సంథాల్ తెగల నివాసాలమీద దాడి జరిపించి, సంథాల్ తెగలవారి బాణాలచేత బాడుగుమనుషుల శరీరాలు చిల్లులుపడే పరిస్థితికల్పించి చివరకు సంథాల్ తెగల దుండగాలకు మూలకారకుడు ఇంగ్లీషు కలెక్టరేనని, వాళ్ళబలంచూసుకుని ఈయన ఇష్టం వచ్చినట్టల్లా ఆడుతున్నాడని ఆరోపించడం జరిగింది.

ఇంగ్లీషు కలెక్టరను వెంటనే బదిలీచేశారు. ఎంతోమంది సంథాల్ తెగవారు ప్రభుత్వ తుపాకుదెబ్బలకు గాయపడ్డారు; ఎంతోమంది బీహారుకుచెందిన వివిధ కారాగారాల్లో పాకీవాళ్ళుగా జీవితాంతంవరకు పనిచేస్తూ ఉండిపోయారు. ఆ తరువాత ఎవరు నోరెత్తుతారు? అయితే వాళ్ళ వాయిద్యాలధ్వనులు ఆగిపోలేదు; వాళ్ళ మురళీరవం మూగపోలేదు; వాళ్ళబాణాలు తుప్పుపట్టలేదు. ఈనాటికీ అప్పుడప్పుడు వన్యమృగాలవేట సమయంలోను, సూర్యకిరణాలకాంతిలోను మిరుమిట్లుగొల్పుతూ ఉంటాయి వాళ్ళ బాణాలు!

మలేరియాకు, విషజ్వరానికి ఆటపట్టయిన ఈ ప్రదేశంలోకూడా వీళ్ళు బలంగా, ఆరోగ్యంగా ఉంటారు. ఎముకలమీద కళాత్మకంగా పొదిగినట్టు కన్పించే కండలు ఎప్పుడూ కరిగిపోలేదు. అప్పుడే కోసిన పూరేకులను గుర్తుకుతెచ్చే పెదిమలకాంతి తుష్కించిపోలేదు. ఎప్పుడూ ఎవరికీ ప్లీహం పెరిగిపోవడమనేది సంథ

వించలేదు! అన్నట్టు తిరపతంవల్ల వాళ్ళకు ఒరిగిందేమిటి? కాని భూమి, దున్నే వాడిదే భూమి!

'పదండి! పదండి! నలుకు రండి!'

రైతురాజ్యం కావాలి!
కూలిరాజ్యం కావాలి!
పీడలపార్టీ - సోషలిస్టుపార్టీ.
సోషలిస్టు పార్టీ జిందాబాద్!

'....ఈ కప్పిస్తున్న ఎర్రజెండా వున్నది చూశారూ. ఇది మీ జెండా! ప్రజల జెండా. విప్లవజెండా! దీని ఎర్రదనం ఉదయించే సూర్యుని ఎరుపుతో సమానం. దీనిలోని ఎర్రదనం దీనిలోని ఎర్రరంగు ఏమిటి? రంగుకాదిది-ఆకలికి అలమటించే అసహాయుల, శ్రమజీవుల కష్టజీవులైన కార్మికుల రక్తంతో తడిసిన ఎర్రబావుటా!' కామ్రేడ్ సైనిక్‌జీ ఉపన్యసిస్తున్నారు!

'రక్తంతో తడిసిన బావుటా!' బాగరదాసు కాశీచరణ్ చెప్పినమీదట జెండా పుచ్చుకొన్నాడు. బాదరదాసు వైష్ణవుడు. చేపలు మాంసం అంటుకోనే అంటుకోడు. మరి ఈ జెండాయేమో మనిషిరక్తంతో తడిసిందట! ఈ కాశీ అతన్ని ధర్మభ్రష్టుణ్ణి గావించాడు. ఛీ. ఛీ! చేతిలో జెండాకర్ర పుచ్చుకొని నిలబడ్డవాడు కాస్తా అకస్మాత్తుగా దాన్ని వదిలేశాడు.

మనిషిరక్తంతో తడిసిన జెండా!
సిద్ధాంతి బాబాయి చెప్పనే చెప్పారు—

'జెండా పతనానికి, అమంగళానికి, అనిష్టానికి ఆనవాలని!'

సైనిక్‌జీ తన ఉపన్యాసాన్ని కొనసాగిస్తూనేవున్నారు. ఉపన్యాసం మధ్యలో ఆగిపోవడంవల్ల మళ్లా మొదటినుంచీ గుర్తు చేసుకొనవలసివస్తుంది—'సూర్యుడు అస్తమించడం ఎంత సత్యమో, పెట్టుబడిదారీవ్యవస్థకూడా కూలిపోవడం అంత నిజం! ఫ్యాక్టరీగొట్టాలు అగ్నిజ్వాలల్ని చిమ్ముతాయి. కార్మికసోదరులు ఫ్యాక్టరీలను స్వాధీనం చేసుకునేరోజు ఎంతోదూరం లేదు. భూములన్నీ రైతులు వశపరుచు కుంటారు. నలువైపులా ఎర్రవిప్లవ పరిభ్రమిస్తున్నది. ఓ రైతుసోదరులారా!

లేవండి! భూమికి నిజమైన వారసులు మీరే! లేవండి! ముందుకు నడవండి. విప్లవ శంఖం పూరించండి!'

'ఏకి, ఒక్కసారి ప్రేమతో అనండి—సోషలిస్టుపార్టీకి జై!' ఇదే అవ సరైన పార్టీ! రైతుల పార్టీ; కష్టజీవుల పార్టీ! సభాస్థలంలోనే మూడువందలమంది సభ్యులుగా చేరారు. సంథాల్ పేటలోని వాళ్ళంతా మిగిలిపోకుండా చేరారు. అందరూ ఎరుపే! సర్దార్ టుడు పదమూడేళ్ళ కొడుకుమాత్రం ఉండిపోయాడు. వాడు అదే పనిగా ఏడ్చాడు. సర్దార్ టుడు సైనిక్ జీదగ్గరకెళ్ళి - 'అయ్యా! వీణ్ణి కూడా సభ్యుడిగా చేర్చుకోవడానికి వీలవుతుందా? వయస్సు పెద్ద తక్కువేమీకాదు. చూడండి. మీసాలు వచ్చేలా వున్నాయి. ఏమంటారు?' అని ప్రశ్నించాడు.

బాలదేవ్ మాట్లాడడానికి లేవబోయాడు. వెంటనే వాసుదేవ్ - 'బాలదేవ్ గారూ! మీ ఉపన్యాసం మేము చాలాసార్లు విన్నాం. మీరు పెట్టుబడిదారు. ఈ సభలో మీరు మాట్లాడడానికి వీల్లేదు' అని అన్నాడు.

ప్రజలుకూడా వ్యతిరేకించారు - 'మీరు కూర్చోండి. కూర్చోండి! వెళ్ళి బట్టలచీటీలు పంచండి; పంచదార దొంగచాటుగా అమ్మండి.'

'బాబోయ్! ఎన్నిటిమ్మేలని చెప్పారు నాయకుడు? వెయ్యాటిన్నులు కాంగ్రెసుమంత్రి బ్లాక్‌మార్కెట్ చేశాడా? అందుకే పల్లెటూళ్ళల్లో హుక్కా తాగే వాళ్ళు తగ్గిపోయి బీడీలకోసం ఎగబడుతున్నారు జనం! కంచే చేనుమేస్తే కాపేమి చెయ్యాలి? కలికాలం వచ్చింది!

తాసిల్దారుగారిని లీడరు నిండుసభలో విలువునా పాతేశాడు. జంకూ గొంకూ లేకుండా తిట్టేశాడు. ఈ తాసిల్దారు జమీందారు తోక! పట్టి దగాకోరు!

అయితే తాసిల్దారు నవ్వుతూ కూర్చున్నాడు. ఆ రోజురాత్రి విద్యాపతినాట్యం రోజున హాస్యగాడిమాటలకు ఎలాంటి చిరునవ్వు ఆయన మొహంమీద కనిపించిందో అలాంటిదే ఈరోజుకూడాను.

కాళీచరణ్ ఇప్పుడు ఖేలావన్‌సింగ్ చెప్పుచేతల్లో లేదు. కాళీచరణ్ యాదవకులానికి కళంకం తెచ్చాడు. ముసలి తుకరూ ఖేలావన్‌దగ్గర పశువులకాపరిగా ఉన్నాడు మొన్నటిదాకా! అతని కొడుకిప్పుడు లీడరైపోయినాడు. సోషలిస్టు

లేదు. ఇతన్ని ఏరకంగానూ అదుపులో పెట్టేందుకు మార్గంలేదు. వేలిముద్రయినా తీసుకోలేదు - ఇదివరలో ఎప్పుడూ।

సిపాయిలపేటనుంచి ఒక్క పిట్టకూడా ఈ సభకు హాజరు కాలేదు. వాళ్ళ పేటకు కటిహార్‌నుంచి నల్లటోపిదళానికి చెందిన సంయోజక్ వచ్చాడు. కర్రసాము నేర్పుతాడు. అల్పజాతి ప్రజలసభలకు వీళ్ళెప్పుడూ వెళ్ళరు.

కాళీచరణ్ సైనిక్‌జీ ముకాం మఠంలో ఏర్పాటు చేశాడు. మహంతు రామదాసు పేరుకు మహంతేగాని వ్యవహారమంతా నడిపేది లక్ష్మి. వదిహేను సేర్ల పాలు మరగబెట్టి ఖోవా తయారుచేశారు. మాల్‌పురా సువాసన గుమాయించికొడుతున్నది.

'కాళీబాబూ, నాయకుడు ఉపన్యాసంనుంచివచ్చాక స్నానం చేస్తారా?' అని లక్ష్మి అడిగింది.

సైనిక్‌జీతోపాటు 'లాల్‌పతాకా' (ఎర్ర బావుటా) వారపత్రిక సంపాదకుడు శ్రీ చినగారీకూడా వచ్చారు. బక్కపలచగా వున్నాడు; పగలంతా దగ్గుతూనే వున్నారు. ఫ్రేమ్‌లేని కళ్ళజోడు పెట్టుకున్నారు. పగలంతా సిగరెట్లు తాగినవాడు, తాగినట్టే వున్నాడు. అందుకే చినగారీ (నిప్పురవ్వ) అనే పేరు వచ్చిఉంటుంది. డాక్టరు కోడిగుడ్డు తినమని సలహా ఇచ్చారు, కోడిగుడ్డు తినకుండా ఇంత పేడి పత్రికను నడపడం సాధ్యపడుతుందా? కాని మఠంలో కోడిగుడ్లు దొరకవే।

లక్ష్మి ఆతిథ్యాన్ని మరిచిపోవడం అసంభవం. చినగారీజీ రాత్రికి పడుకోబోతూ - సైనిక్‌జీతో - 'నేను లక్ష్మిమీద ఒక ప్రేవెర్స్ (పద్యం) రాయాలనుకుంటున్నాను।' అని అన్నాడు.

'....ఓ సద్గురు మహా సేవికా
పవిత్ర ధర్మగ్రంథ గాయికా
మార్క్స్ దర్శనశాస్త్ర దర్శికా
సుదర్శనే, ప్రియ దర్శినీ
మన్వ సాశ్చత్తు ద్వంద్వ యుక్తమైన
భౌతికవాద సింథసిస్ వమ్మా।'

## ఇరవై

కమల డాక్టర్‌కు ఉత్తరం రాసింది—

'ప్రాణనాథా! నువ్వు విన్న రాలేదు. ఎందుకని? నేను విన్నదేమిటంటే రాత్రి....!'

కమల డాక్టర్‌కు రోజూ ఉత్తరం రాస్తుంది. రాసి ఆరేడుపర్యాయాలు చదువుకుంటుంది. ఆ తరువాత చించిపారేస్తుంది. ఆమె బీరువాలో ఒకమూలన చించి పారవేసిన ఉత్తరాలముక్కలు పోగుబడ్డాయి. ఉత్తరం రాశాక, రాసి మళ్ళా చదువుకున్నాక, ఆమె కెక్కడలేని శాంతి లభిస్తుంది. మనస్సు తేలిక పడుతుంది. నిద్రకూడా బాగా పడుతుంది.

'....నేను విన్నదేమిటంటే రాత్రి నల్లత్రాచువల్ల ప్రమాదం మీకు వెంట్రుక వాసిలో తప్పిందట! భగవంతుడికి శతకోటి ధన్యవాదాలు!'

రాత్రి డాక్టర్ నల్లత్రాచునుంచి ప్రమాదం కొంచెంలో తప్పించుకున్నాడు. నల్లత్రాచుకాదు; కృష్ణసర్పం. నల్లత్రాచుకీ, కృష్ణసర్పానికి పుట్టిన పాము. గుర్రం కంటేకూడా వేగంగా పరుగెడుతుంది. నల్లత్రాచు కరిస్తే, మంత్రగాడినికూడా చూడ వలసినపనిలేదు. అర్ధరాత్రివేళ కుంటేలు, ఎలుక తమతమ పంజరాల్లో ఎగిరెగిరి పడడం ప్రారంభించాయి. డాక్టర్ ప్యారీని పిలిచాడు. కాని ప్యారీ లేవలేదు. పక్షులున్నగది తెరిచి టార్చి వెలిగించేప్పటికి డాక్టర్ ధడాలున వెనక్కు తగ్గాడు. పాము పడిగా తలుపుదగ్గరే తోకమీదనిలబడి బుసలు కొడుతున్నది. అప్పటికి ప్యారీకూడా లేచివచ్చాడు. వచ్చి రావడంతోనే ఎడంచేత్తో కర్రతో ఒక్క దెబ్బ వేశాడు. దెబ్బకు దయ్యం పారిపోయింది. అక్కడే చచ్చి పడిపోయింది. రెండున్నరమూరల పాము. దయ్యం చెప్పేమంత్రం రెండున్నర అక్షరాలకు మించివుండదట; అలాగే దయ్యం పంపించే పాముకూడా రెండున్నరమూర లుంటుంది.

ఉదయం ఈ వార్త విన్నవాళ్ళంతా ఒకే ఒక అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. ఇది ముందే తెలుసు. డాక్టర్‌గారితో - పార్వతి తల్లితో అంత దగ్గర

సంబంధం పెట్టుకోగూడదని హితవు చెప్పారు. ఇదివరలో చెబితే వినలేదు. ఇప్పు డైనా తెలుసుకోండి. ఆ రాక్షసి ఎవరినీ వదిలిపెట్టదు. ప్రేమించినవాళ్ళను భక్షించి వేస్తుంది. పాపం డాక్టర్‌గారుమాత్రం ఏం జేస్తారు? పార్వతితల్లే ఏదో మంత్ర తంత్రాలు ప్రయోగించింది ఆయనమీద. ఆయన తనవశంలో లేడు. అనవసరంగా ఏదో ఒకరోజున ఆయన తనప్రాణాలు పోగొట్టుకుంటాడు. చ్ । చ్ ।

కమలకు భూత ప్రేతాలంటే నమ్మకం లేదు. తాసిల్దారుకూడా ఇదొక మూర్ఖత్వం అంటాడు. కాళీచరణ్ మానవుడే భగవానుడంటాడు; అంతకు మించిన బలవంతుడు మరొకడు లేడంటాడు. ఇక ఈ భూతప్రేతాలు, ఈ భూత వైద్యులు బూటకాలంటాడు. వీళ్ళను మినహాయిస్తే ఊళ్లోవాళ్ళందరికి భూతప్రేతాల మీద ఒకేరకమైన అభిప్రాయం ఉన్నది. బాలదేవ్ బాలాపర్యాసూలు భూతాన్ని తన కళ్ళారా చూశాడు. బర్రె వెనుకబడి పొగాకు పెట్టమని అడుగుతుంది. దయ్యం తలకిందులుగా నడుస్తుంది. చెట్టుకొమ్మలకు వేలాడుతుంది. భూతప్రేతాలు బూట కాలా? అయితే కమలానది ఒడ్డున, బంగాతోటలో రాత్రిపూట వెలుతురు కని పిస్తుంది, ఆ వెలుతురు పరుగెడుతుంది; ఒకటి పదిగా మారుతుంది. ఏమిటిదంతా?

'డాక్టర్‌గారు ఈమధ్య రోజూ పిన్నిగారింటికి వెడుతున్నారు. ఒక్కరోజు కూడా అక్కడికి వెళ్ళకుండా ఉండలేరు।' అని ప్యారీ చెప్పాడు. కమల విని నవ్వుతుంది.

'డాక్టర్‌గారు గణేశ్‌ను చూడడానికి వెడుతూఉంటారు, ప్యారీ।'

'ఆ అబ్బాయి ఎప్పుడో బాగైపోయాడు. చిన్న పిప్పళ్ళబస్తాలాగా తయా రైనాడు. ఇంకా అతన్ని చూసేదేమిటి?'

'అయితే ప్యారీ । డాక్టర్‌గారు రోజూ మా ఇంటికికూడా వస్తూ ఉంటా రుగా ।'

'మీ ఇంటికిరావడం వేరు దీదీ ।'

'ఏం? ఎందుకని?'

డాక్టర్‌గారు నవ్వుతూ అక్కడికొచ్చారు—'ఓహో! ప్యారీ మహాశయుడు ఇక్కడ మీటింగు పెట్టాడా? ఆ జ్వరంవచ్చిన కుంటేలు ఎలా పారిపోయింది?'

'మధ్యాహ్నం దానావేద్దామని వెళ్ళి చూసేప్పటికి దానిబోను ఖాళీగా వున్నది!'

'ఉదయం ఇంజెక్షన్ ఇచ్చాక నేను బోను మూసివేశాను. నువ్వు నీళ్లు పోసినతరువాత మూసివేయడం మరచిపోయివుంటావు. చేసినశ్రమంతా వృథా అయింది.'

ప్యారూకి ఈ కుంచేళ్ళన్నా, ఈ ఎలుకలన్నా పరమ అసహ్యం.... మనుషులకు చికిత్స చేసేదిపోలక జంతువులకుకూడా చికిత్స మొదలుబెట్టారు. పగలంతా ఆ బోనులదగ్గరే పడివుంటారు. జ్వరం ఎంతవున్నదో చూస్తారు, ఇంజెక్షన్ ఇస్తారు. రక్తం తీసుకుని పరీక్షిస్తారు! ఈ జంతువులు వచ్చినప్పటినుంచీ డాక్టర్‌గారికి ప్యారూతో మాట్లాడేందుకు తీరికే ఉండడంలేదు. మళ్ళా ఎవరితోనో చెబుతున్నారు - 'రెండు మూడు నక్కపిల్లలు కావాలి!' అంతకుముందు కోతు లాడించేవాడితో కోతిపిల్లలు కావాలోయ్ అని అన్నారు. ఇదేమి వ్యసనమో ఏమో!

ప్యారూ మారు మాట్లాడకుండా వెళ్ళిపోయాడు. అమ్మ నవ్వుతూ వచ్చింది-'డాక్టర్‌గారూ! నేను మీకోసం ఒక జత పావురాళ్ళు, ఒక పాలపిట్టను తీసుకున్నాను!'

'నేనుకూడా ఈ 'విషహరణ' ఔషధంకోసం రాశాను!'

'విషహరణ ఔషధమా?'

'అవునండి; యాంటీవెనమ్ అనే ఔషధం. పాముకరిస్తే ఉపయోగించవచ్చు; బాగా పనిచేస్తుంది. నేను యాంటీవెనమ్‌కంటేకూడా మంచిమందును, చౌకమందును తయారుచేయాలనుకుంటున్నాను. రౌతహట్ స్టేషన్‌దగ్గర పాములవాళ్ళుంటారట! పాముల్ని తెప్పించాలి!'

'అప్పుడుగాని ఈ మట్టి మహాదేవ్‌గారు అసలైన మహాదేవ్‌గా మారరు!' కమల ఎగతాళి చేసింది.

డాక్టర్ నవ్వారు. తల్లి నవ్వాపుకుంటూ - 'నోటికి హద్దూ అపూ లేదు. ఏమాటబడితే ఆ మాట అనేస్తావు. అసలు వీళ్ళనాన్న దీన్ని తల కెక్కించుకున్నారు. నరేగాని మెదలకుండావచ్చి ఇక్కడ కూర్చో. నే వెళ్ళి టీ పట్టుకొస్తాను.' అని అన్నది.

'తాసిల్దారుగా రెక్కాడికి వెళ్లారు?' డాక్టరు ప్రశ్నించారు.

'కటిహార్! సర్కిల్ మేనేజరు క్యాంపుకెళ్లారు.' కమల సమాధానం చెప్పింది. ఈ రోజు మొదటిసారి డాక్టర్‌దగ్గర ఒంటరిగా కూర్చున్నది. ఆమె మొహం నెమ్మదిగా ఎర్రబడిపోతున్నట్టుగా కవిపించింది. కంటిరెప్పలు బరువుగా వున్నాయి. పెదవులదద్దులు వణికిపోతున్నాయి. శరీరమంతా చక్కిలిగింత పెట్టి నట్టుగా వుంది. వళ్ళంతా తేలిపోతున్నది.... స్పృహ తప్పుతుందా? ఆమెకు స్పృహ తప్పిపోవాలని లేదు.... డా.... క్ట.... ర్!

'కమలా!'

'ఏమిటండీ?'

'కమలా! ఇటుచూడు నావైపు!'

'డాక్టర్! నన్ను రక్షించండి!'

'కమలా! కళ్ళు తెరువు!'

కమల కళ్ళు తెరిచింది. ఆమె శిరస్సు డాక్టర్ ఒడిలో వున్నది. తల్లి చెమ్మాతో విలబడివున్నది. ఆమె మొహం వివర్ణమైంది. డాక్టర్‌గారు నవ్వు తున్నారు.

'డాక్టరుగారూ! దీని జబ్బువిషయం మీకేమైనా అంతుపట్టిందా?'

'జబ్బు నెమ్మదిగా నయమవుతున్నది. స్పృహతప్పి అయిదువిమిషాల్లో మళ్లా కుదటబడింది. ఇలాగే మరికొంతకాలానికి వ్యాధి పూర్తిగా నయమవుతుంది. కమలచేతనే టీ తయారుచేయించండి. వెళ్లు కమలా!'

కమల ఇంతకుముందేమీ జరగనట్టేలేచి పరుగెత్తుకెళ్ళింది. డాక్టరు కమల చదువుతున్న పుస్తకం చేతిలోకి తీసుకున్నాడు - నలదమయంతి. కుమారి కమలా దేవి పుస్తకం.... మరొకచోట కుమారి అనేమాట కొట్టివేయబడివున్నది. పేరుచివర బెనర్జీ జోడించడం జరిగింది - కమలాదేవి బెనర్జీ. డాక్టర్ పేజీలు తిప్పేరాడు. అర్ధపేపరుమీద నలదమయంతి చిత్రం ఉన్నది. నలుడికింద 'ప్రశాంత్' అని. దమయంతికింద కమల అని పెన్సిల్‌తో రాసివుంది. డాక్టర్ లలాటం చెమర్చు తుంది. అతని కొక్కసారిగా గుర్తుకొచ్చింది. ఒకపర్యాయం మమతతో బాంకీ

పూరు స్టేషన్‌నుంచి తిరిగొస్తున్నారు. రిక్షాలో కూర్చుంటూ వుండగా అడుక్కునేవా డొకడొచ్చి - 'మీ దాంపత్యం సుఖంగా ఉంటుంది' అని దీవించాడు. మమత బ్యాగ్‌లోనుంచి ఒక అణా తీసియిచ్చి డాక్టర్‌వైపుచూసి కిలకిలా నవ్వింది. డాక్టర్ లలాటం అప్పుడుకూడా ఇలాగే చెమర్చింది.

'డాక్టర్‌గారూ! కమలకొక మంచివరు డెవరైనా దొరుకుతాడేమో చూడండి మీ ప్రాంతంలో! ...మీ చుట్టపక్కాలలో....' అని అంటూ తల్లి పమిటచెంగు ముందుకు లాక్కున్నది. ఇంతలోనే తాసిల్దార్ వచ్చారు. రణజిత్‌చేతిలో పెద్ద సొరచేపొకటి వున్నది.

'ఈ కానుక ఎక్కడ దొరికిందండోయ్!'

'పకరియా ఘాట్‌దగ్గర పల్లెవాళ్ళు చేపలు పడుతూంటే చూసి పట్టుకొచ్చాము.' తాసిల్దారు మోడామీద కూర్చుంటూ అన్నాడు.

కమల టీ తెచ్చింది.

'డాక్టర్‌గారూ! ఇవ్వాళ్ళ నా పాపపుమూటను అవతలపడేసి మరీ వచ్చాను' టీ తాగుతూ తాసిల్దార్ అన్నాడు.

'అంటే!'

'ఈ తాసిల్దారు ఉద్యోగం ఉన్నది చూశారూ - నిజం చెబితే ఇదొక పాపపు మూటలాంటిదే! కొత్త సర్కిల్ మేనేజరు రావడంతోనే మండిపడ్డాడు. శాపాలు మిరియాలు నూరాడు. 'ఎర్ర బావుటా' పత్రిక రాసిందాంట్లో తప్పేమీ లేదు— 'పారబంగారాజ్యానికి చెందిన మీనాపూరు సర్కిల్ కొత్త మేనేజరు నాదిర్‌షాను తలదన్నినవాడు!' మీరే చెప్పండి డాక్టర్‌గారూ, ఒకసంవత్సరం బకాయివున్న రైతులమీద జప్తు వారంట్లు జారీ చేయమంటే ఎలా చెప్పండి! భూమి స్వాధీన పరుచుకోవడమంటే మాటలా ? ఇంతటి అన్యాయం నావల్లకాదు. కాలం మారి పోయింది. దాన్ని మనం అర్థం చేసుకోకపోతే ఎలాగు? నేను నిర్మొహమాటంగా చెప్పాను. ఆయనకు కోపం వచ్చింది. 'ఈపని చెయ్యలేకపోతే రాజీనామా ఇవ్వండి' అని అన్నాడు. గంగాస్నానంకంటేకూడా మించిన ఈపాటి పుణ్యకాలం మాటి మాటికీ లభ్యంకాదు. వెంటనే రాజీనామా ఇచ్చేశాను. జీవితమంతా ఊడిగంచేస్తూ

గదిపేశాను.... ఇదుగో ఇటుచూడూ.... ఇవ్వాళ్ళ మత్స్యభగవానుడు ప్రత్యక్షమైనాడు। డాక్టర్ గారిని భోజనానికి ఆహ్వానించమని కమలతో చెప్పు।'

తాసిల్దారుగారి రసజ్ఞత డాక్టర్‌కు అగస్మాత్తుగా వలదమయంతుల్ని స్ఫురింపజేసింది. కమల నవ్వుతున్నది. ఆమెతల్లి - 'మసాలాలు లేకుండా చేపలకూర కమల బాగా వండుతుంది' అని అన్నది.

కమల ఆహ్వానాన్ని తిరస్కరించే ధైర్యం తనకు లేదని డాక్టర్ అనుకుంటాడు.... కమలా బెనర్జీ। కమల నేత్రాలు....

చంద్రుణ్ణి వాయువ్యనూ మూసి మేఘాలు వర్షించాయి. చేప వలలో చిక్కుకున్నది - స్త్రీ గాలి తగిలి ఈ రెండు కళ్ళూ....

## ఇరవై ఒకటి

తాంత్రికులపేటలో రాత్రిపూట సహదేవమిశ్ర పట్టుబడ్డాడు.

ఇది అగాపివేసిన ఎత్తు। ఇలాంటి యుక్తులకుయుక్తులు ఊళ్ళోవాళ్ళెవరికీ తెలియవు. ఇది పరాయివాడి పనే। తరతరాలనుంచి యజమానులు తక్కువకులాలవాళ్ళపేటలకు వెళ్ళడం అనవాయితీగా వస్తున్నదే। పొలం పనులప్పుడు సాయంత్రంపూటవెళ్ళి మనుషుల్ని కుదుర్చుకోవడం జరుగుతూ ఉంటుంది. సూర్యోదయం కాకపూర్వమే ఒకగంటముందు కూలీలు పొలాలకు చేరుకోవాలి. ఇందుకోసం పెద్ద రైతులంతా సాయంత్రంపూటనో, రాత్రిపూటనో వెళ్ళి మాట్లాడుకుని వస్తూఉంటారు. తాంత్రికులపేటకు అగాసీ రాకపోకలు సాగించడంతో రకరకాల పుకార్లు లేచాయి. చూస్తూఉండగానే ఇతరపేటల్లోకూడా కట్టుబాట్లనుగురించి కట్టుదిట్టాలు చేసుకున్నారు. పాపం తాంత్రికులపేటవాళ్ళు సహదేవమిశ్రను రాత్రి అంతా కట్టిఉంచారు. పులియా ఇంట్లోమాటితే ఆమె కేక లెందుకు పెట్టలేదు? ఎవరికీ నిద్రాభంగం కలగలేదు. తలిదండ్రులకు ఎటువంటిచప్పుడూ వినిపించలేదు. పైగా వాళ్ళ కుక్కకూడా మొరగలేదు. గ్రామంలోనివాళ్ళకు విస్తంత్రిద్వారా వార్త అంది వుంటుంది. ఇది అగాపీ పన్నిన పన్నాగమే। ఈ పరిస్థితి ఇలాగే కొనసాగితే ఇక

ముందు తక్కువజాతులవాళ్ళ పేటలకు ఎవరు వెళ్లాలన్నా కష్టమే అవుతుంది. ఎవరిమీదనైనా అభాండాలు వేయవచ్చు। పంచాయతీ జరిపించడం అవసరం. రాజపుత్రులు ఈ పంచాయతీ సమావేశంలో బ్రాహ్మలపక్షం తీసుకోపోతే బ్రాహ్మలు గొల్లల్ని రాజపుత్రులుగా భావించేప్రమాదం ఉన్నది.

'నాకేమీ తెలియదు।' పులియా పంచాయతీ పెద్దలకు చేతులుజోడించి చెప్పింది—'బయట కేకలు వినిపించేప్పటికి నాకు మెలకువ వచ్చింది.'

సహదేవమిశ్రదగ్గర మహగూదాసుచేత తెల్ల కాగితంమీద సంతకం చేయించుకున్న పత్రం ఉన్నది. అంటే మహగు పీలక సహదేవచేతిలో ఉన్న దన్నమాట। సహదేవ్ ఎట్లాఅంటే అట్లా అతన్ని ఆడించవచ్చు. రెండు ఆవుల్ని, నాలుగు దూడల్ని రేపే మేకులనుంచి ఊడదీసుకపోవచ్చు. పైగా సంవత్సరంపాటు అతగాణ్ణి సహదేవ్ మేపాడు. ఒక్కమనిషి కూలిపనితో కాలం వెళ్ళబుచ్చడం మాటలా మరి? అయితే సహదేవమిశ్ర గౌరవం ఇప్పుడు పులియా చేతుల్లోనే వున్నది. తండ్రినికూడా ఆమే కాపాడాలి. ఆమె ఏమాత్రం మాటమిగిలినా ఆ ఇద్దరినపీ మునగానాం తేలానాం అవుతుంది.

పంచాయతీ సమావేశానికి ఊళ్ళోవున్న పెద్దా చిన్నా అంతా ఏకమైనారు. తాసిల్దారు పూర్ణియా వెళ్లాడు. పంచాయతీలో ఇక మిగిలిం దెవరయ్యా అంటే సింగుగారు। వల్లటోపీ సంయోజక్। బాలదేవ్। కాళీచరణ్ పిలుపులేకుండానే వచ్చారు. సింగుగా రొక్కరే మాట్లాడుతున్నారు. తాసిల్దారుగారుంటే వ్యవహారం కొంచెం తేలికగా ఉండేది।

'....మాట అడిగితే సమాధానం చెప్పడానికి గంట పడుతుందేం?.... వాటితో అలజడివిని నిద్రమంచి లేచివచ్చావు।.... పెద్దలారా। మీరంతా వినండి. ఆఁ-తరువాత నువ్వు ఏం చూశావో చెప్పు.'

'సహదేవ్‌గారిచుట్టూ వీబడి అందరూ గల్లంతు చేస్తున్నారు।'

'సరే, నువ్వు కూర్చో। సహదేవమిశ్ర ఏడీ? మహగూదాసు ఇంటికి అంత రాత్రిపూట ఎందుకెళ్ళారో చెబుతారా?'

'కడుపు నొప్పిగావుంటే చెంబుతీసుకుని బయటికెళ్లాను. బయటికెళ్ళి తిరి

గొప్పతంటే కమలావది ఒడ్డునున్న పొలంలో ఎవరిదో ఎద్దు గోధుమ మేస్తున్నది. మహగూకి చెబుదామని వెళ్లాను.'

'ఆయనకు చెప్పడ మెందుకు?'

'ఆ పొలం కావలాపని ఆయనకే అప్పగించాం.'

'ఆఁ! ఆ తరువాత?'

'నే నట్లా వెదుతూఉంటే మీ పొలంలో రబియా, సోన్‌మా చిలకడదుంపలు తవ్వుతూంటే పట్టుకున్నా. పట్టుకొని బాగా తిట్టాను. మహగూదాసును లేపి నేను బయటికి వస్తున్నానో లేదో రబియా, సోన్‌మా, శేత్‌రా, నకిఛేదియా అందరూ ఒక్కసారిగావచ్చి నన్ను పట్టుకొని అరవడం మొదలెట్టారు.'

'అయిదు బీఘాల పొలంలోని చిలకడ దుంపలన్నీ ఈ నాయాళ్ళే తవ్వు కెళ్ళారు! ఏంచేయాలి వీళ్ళను? వరే, మీరు కూర్చోండి. మహంగూ ఎక్కడ?'

'ఇక్క డున్నానండి!' మునలి మహగూ చేతులుజోడించి నిలబడ్డాడు.

'సహదేవ్‌మిశ్ర నిన్నొచ్చి లేపాడా?'

'లేపారండి!'

'ఇక పంచాయతీపెద్దలు ఏం చేయాలో నిర్ణయించండి!'

కాళీచరణ్ చూస్తూ ఎలా ఊరుకుంటాడు? పంచాయతీలో పక్షపాతం ఉండకూడదు. రబియా, సోన్‌మా పార్టీసభ్యులు. కాళీచరణ్ ఎలా ఊరుకుంటాడు- 'సింగ్‌గారూ! నన్నుకూడా రెండుమాటలు అడగనివ్వండి!'

పంచాయతీసభ్యు లందరిమొహాలు ఒక్కసారిగా కాళీచరణ్‌వైపు తిరిగాయి. సింగ్‌గారయితే ఉగ్రుడై పోయాడు. రాజపుత్రపేట యువకులు చెవులు కొరుక్కో వడం ప్రారంభించారు. సంయోజక్‌జీ జేబులడిమి చూసుకున్నాడు - బీడీలు తీసుక రావడం మరచిపోలేదుగదా అని! సిద్ధాంతి అభ్యంతరం చెప్పాడు - కాళీచరణ్‌ను పంచాయతీ పెద్దగా నేను భావించడంలేదు.'

'అయితే ముందు ఇక్కడున్నవాళ్ళల్లో ఎంతమంది నన్ను పెద్దగా భావిం చడంలేదు, ఎంతమంది పెద్దగా భావిస్తున్నారో తేల్చుకోవడం మంచిది... ఒకరు కాదంటే సరిపోతుందా? అయ్యా! మీరే చెప్పండి. ఈ సమావేశానికి హాజరు

కావడానికి, హాజరై మాట్లాడడానికి నాకు హక్కు వున్నదంటారా, లేదంటారా? వే పి వూళ్ళో షట్టిపెరిగినవాణ్ణి కాదంటారా? 'కాశీచరణ్ నిలబడి అన్నాడు - మీరు నన్నుకూడా పంచాయతీపెద్దగా భావిస్తుంటే చేతులెత్తండి!'

అందరూ జంతువుల్లాగా చేతులెత్తారు, ఎందరో!

'లెక్కపెట్టనివ్వండి. ఒకటి రెండు, మూడు నాలుగు అయిదు....నూట అయిదు!'

బాలదేవ్ చెయ్యి ఎత్తలేదు.

'ఇక నన్ను పంచాయతీ పెద్దగా భావించగూడదనేవాళ్ళు చేతులెత్తండి! ఒకటి రెండు, మూడు నాలుగు అయిదు - పదిహేను!'

'పదిహేనుమందిమాత్రం' సింగుగారికి నమ్మకం కుదరక స్వయంగా తానే లెక్కబెట్టాడు.' రాజపుత్ర, బ్రాహ్మణపేటలవాళ్ళు కనిపించరేం? వెళ్ళిపోయారా? సిద్ధాంతికొడుకు నామకరైన్‌కూడా కాశీచరణ్ పక్షమే చెయ్యి ఎత్తాడు.

'పులియా!' కాశీచరణ్ కేక వినేప్పటికి భయపడింది. పులియా లేచి నిలబడింది.

'ఇదుగో చూడు! ఇది పంచాయతీ. పంచాయతీలో పరమేశ్వరుడుంటాడు. ఇక్కడ అబద్ధంచెబితే దానికి ఫలితం అనుభవించవలసి రావచ్చు. నిజం చెప్పు. అసలు జరిగిన సంగతేమిటి?'

'...............'

'మాట్లాడు!'

'సహదేవమిశ్ర మా ఇంట్లో దూరాడు!'

'మరి నువ్వు కేక లెందుకు పెట్టలేదు?'

'...............'

'చెప్పు. భయపడవలసిన అవసరం లేదు.'

'నాన్న భయంతో!'

'నాన్న భయంతోనా?'

'అవును, నాన్న సహదేవమిశ్రకు బాకీ ఉన్నాడు.'

'కూర్చో నువ్వు! మహగూ!'

మహగూ చేతులు జోడించి నిలబడ్డాడు.

'ఏమిటి సంగతి?'

'.... .... .... .... ....'

'పులియా చెప్పింది నిజమేనా?'

'.... .... .... .... ....'

'భయపడకు. నిజం చెప్పు.'

'ప్రపంచంలో గాలితగలని చెట్టు ఉంటుందా. చెట్టు ఆకు రాలకుండా నిలిచి ఉంటుందా!'

'నీసంగతి చెప్పు నువ్వు!'

'నాసంగతేముంది? ఊళ్ళో వున్నవాళ్ళందరిసంగతులూ ఇలాగే వున్నాయి.'

'నేను నీ సంగతి అడుగుతున్నాను!'

'ముందు నువ్వెళ్ళి మీ అమ్మ నడుగు - నువ్వెవరికి పుట్టావో!' సిద్ధాంతి ధైర్యం తెచ్చుకొని అనేశాడు. కోపంతో ఆయనకళ్ళు చింతనిప్పుల్లాగా మెరుస్తు న్నాయి.

'సిద్ధాంతిగారూ! నాకు మా నాన్నసంగతి బాగానే తెలుసు!'

'సిద్ధాంతిగారు ఆయనభార్య మోస్తున్నది. ఎవరిబిడ్డో తెలుసుకుంటే బావుం టుంది!' వాసుదేవ్ బిగ్గరగా కేకేసి మరీ అన్నాడు.

'సిద్ధాంతిగారి నౌకరు....అది అందరికీ తెలుసు!'

'మాట్లాడకు సుందర్!' కాశీచరణ్ జనాన్ని శాంతపరచడానికి ప్రయత్నిం చాడు-'

'మాట్లాడకండి! శాంతి! శాంతి!!'

'టూ టూ టూ టూ!' సంయోజక్ జీ బిగులు ఊదుతాడు.

రాజపుత్రపేటనుంచి ఒక డజనుమందికిపైగా యువకులు లాఠీలతో పరు గెత్తుకుంటూవచ్చి పంచాయతీ సమావేశాన్ని చుట్టుముట్టి నిలబడ్డారు.

'సింగ్‌గారూ! ఈ లారీలతో వచ్చిన క్షత్రియుల్ని మీరు పిలిపించారా?.... అయితే మీరు పంచాయతీ జరిపించడానికి రాలేదు. కొట్లాట జరిపించడానికి వచ్చారన్నమాట!' కాశీచరణ్ ప్రశ్నించాడు.

'దీన్ని పంచాయతీ అని ఎవరంటారు? పార్టీ రాజకీయాలవల్ల న్యాయం జరగదు.'

సింగ్‌గారు రాజపుత్రపేట పంచాయతీ పెద్దలతో లేచినిలబడతారు. నల్ల టోపీ యువకులు సింగ్‌గారిని, సంయోజక్‌జీని, రాజపుత్రవీధి పంచాయతీపెద్దల్ని నాలుగువైపులనుంచి చుట్టుముట్టి డ్రిల్లు చేసుకుంటూ వెడతారు.

సిద్ధాంతి కారణంగా బ్రాహ్మణపేట పంచాయతీ పెద్దలుకూడా అనవసరంగా ఎలుకలబోనులో చిక్కుకున్నారు. ఖేలావన్ బాబున్నారు. బాలదేవ్ ఉన్నారు. ఎవరున్నా కాశీచరణ్ కోపం....

'పంచాయతీ నిర్ణయమేమిటంటే మహంగూదాసు తన కూతురు పులియాను ఖవాసీకిచ్చి పెళ్ళి చెయ్యాలి; ఈ రోజునుంచి అన్ని పేటలవాళ్ళూ ఈ పెద్దకులాల వారిని ఒకకంట కనిపెట్టి చూస్తూఉండాలి.'

పంచాయతీలో కూర్చున్న పెద్దలంతా ఏకాభిప్రాయంలో కాశీచరణ్ ఉద్దేశ్యాన్ని సమర్థించారు. సిద్ధాంతిగారుకూడా చెయ్యి ఎత్తారు. బాలదేవ్‌కూడాను!.... ఇది న్యాయమైనవిషయం. ఇందులో డిఫెట్ కావడం మంచిదికాదు.

'సహదేవ మిశ్రదగ్గర నేను సంతకంపెట్టిన తెల్లకాగితం ఒకటి ఉన్నది. దాన్ని నింపేసి నామీద కేసుపెడితే ఎలాగు?' మహంగూదాసు ప్రాధేయపడుతున్నట్టగా మాట్లాడాడు.

'సహదేవమిశ్ర గనుక నామీద కేసుబెడితే ఇక్కడున్న పంచాయతి పెద్దలమంతా నీకు అనుకూలంగా సాక్ష్యం చెబుతాం. నీనుంచి ఒక పైసాకూడా వసూలు చెయ్యలేడు!'

## ఇరవై రెండు

హే సద్గురు! హే సద్గురు!

మహంతు రామదాసుకూడా తుమ్మేప్పుడు, దగ్గేప్పుడు, ఆవలించేప్పుడు మహంతు సేవాదాసులాగా చిటికెవేసి 'హే సద్గురు! హే సద్గురు!' అని అంటాడు. ఆపైని కళ్ళు వాటంతటవే మూసుకుపోతాయి.

భజన, బీజక్ పారాయణం, సత్సంగసమావేశాలు - అన్నీ లక్ష్మి సంబా ళిస్తున్నది. మహంతు రామదాసుకు చదువురాదు; సద్గురువచనాల గాంభీర్యాన్ని అవగతం చేసుకునేంతటి విజ్ఞత అతనిలో లేదు. అయితే ఖంజరుమాత్రం బాగా వాయిస్తాడు. సంటతనుకూడా ఖంజరు వాయించగలడు; అయితే అతడు వాయి స్తూంటే లక్ష్మి కొంచెం తడబడుతుంది. తాళం సరిగా ఉండదు. అప్పుడు మహంతు రామదాసు తనే ఖంజరు తీసుకొని వాయిస్తాడు. లక్ష్మి చిరునవ్వు నవ్వి పాట కుపక్రమిస్తుంది.

సంత్‌హో కరూ బంషియాం ఖల్ అన్‌పీ
ఛాడుబిరాపీ అన్
సంత్‌హో, జిహి అంగనా నదియాబహై
సోక్ సదురేపియాన్! హోసంతో సోకన్‌మేరే పియాన్.

మహంతు రామదాసు ముంగిలిముందు నది ప్రవహిస్తున్నా అతగాడు దప్పి కతో వికవికలాడిపోతున్నాడు.... సద్గురువచనంలో - ఇల్లు చందనంతో విండివున్న ప్పటికి పరిమళం నాకు సోకడమే లేదు!' అని చెప్పబడివుంది. పరిమళం అనేది రామదాసుకు సోకకపోలేదు; ఆ పరిమళంతో ఆయన మనస్సు మరింత ఉన్మత్త మవుతూఉంటుంది. కాని ఏమిటి చేయడం? ఒకరోజున నోరుజారింది - 'లక్ష్మి కొంచెం ఇలారా!' దాంతో లక్ష్మి నాలుగుగంటలపాటు సద్గురు వచనామృతాన్ని పానం చేయించింది - 'అంతర్‌జ్యోతి సబద ఇకనారీ, హరిబ్రహ్మ తాకే త్రిపురారీ, తే తిరయే భంగలింగ అనంతా, తే హూనజానే ఆదిన అంతా!

ఆ త్రిపురారిని సేవించి -
తరించండి!

....మహంతుగారూ! మీ మనస్సును మీ కట్టుబాటులో ఉంచుకోండి. చిత్త వైకల్యం మంచిదికాదు. మీ పూర్వజన్మ సుకృతంవల్ల మీకి మహంతుస్థానం సంప్రాప్తించింది. లేకపోతే మీలాంటివాళ్ళకు పశువులు మేపే పనిమినహా మరొకటి మాకు దొరకదు. మీరు నా గురుపుత్రులు. నేను మీ గురుమాతను!'

నెలా పదిహేనురోజులకే మహంతు రామదాసు రూపురేఖలు మారి పోయాయి. లక్ష్మి ఎంతో శ్రద్ధగా సేవచేస్తుంది. పాలు, మీగడ, పళ్ళు - వీటి సేవనంవల్ల ముఖమండలమంతా విగనిగలాడుతున్నది పొట్ట కొంచెం ముందుకు పొడుచుకొచ్చింది. శరీరతాపంకూడా అప్పుడప్పుడు మనస్సును వికావికలు చేస్తూ ఉంటుంది. లక్ష్మి సద్గురు వచనామృతాన్ని వర్షింపజేసి శాంతింపజేయడానికి ప్రయత్నిస్తూఉంటుంది. సద్గురు వచనామృతంకంటేకూడా శరీరతాపాన్ని కాశీచరణ్ స్మృతి మరింత శీతలపరుస్తూ ఉంటుంది. కాశీచరణ్ రోజుకొకసారి మఠానికొచ్చి వెడుతూఉంటాడు. అప్పుడప్పుడు పార్టీ చందా అడగడానికి, ఆఫీసుకు కావలసిన వెదురువాసాలకూ వస్తూఉంటాడు. కాశీచరణ్ చాలా న్యాయమైనమనిషి! ఊళ్ళో వున్న పెద్దమనుషుల - పేరుకు పెద్దలే! అయితే కాశీబాబుస్వభావంలో కొంచెం తొందరపాటున్నది. తిన్నగా వుండేవాళ్ళకు ఈ ప్రపంచంలో పచ్చి మంచినీళ్ళు కూడా పుట్టవు. ప్రస్తుత పోకడనుబట్టి కఠినదనం అవసరమే!' అని లక్ష్మి అంటూఉంటుంది.

మహంతు రామదాసుకు మొదట్లో కాశీచరణ్ మీద చాలా అనుమానంగా ఉండేది. ఆయన మఠానికి వచ్చినప్పుడు లక్ష్మి, కాశీచరణ్ ఏం చెప్పుకుంటు న్నారో వాళ్ళమాటలు దొంగతనంగా వినేవాడు; తడికకు సందుచేసి వాళ్ళను గమ నించేవాడు. కాని కాశీచరణ్ ఎప్పుడూ లక్ష్మికి నాలుగుమూరలదూరంలో విలు చునేవాడు. అతనిమాటల్లో సందేహస్ఫురణకు తావుండేదికాదు. ఆమెతో మాట్లాడే ప్పుడు అతని కనురెప్పలు సిగ్గుతో వంగిపోవడం చూడలేదు. రామదాసు ఇటు వంటివాళ్ళను చాలా తక్కువమందిని చూశాడు. కాశీచరణ్‌కు ఎంతసేపటికి తన పోషలిస్టుపార్టీ గొడవతప్ప మరొకటి అక్కర్లేదు. ఎర్రబావుటాను, సోషలిస్టు పార్టీని అడదాన్ని ప్రేమించినట్టు ప్రేమిస్తాడు....అతన్ని సందేహించడం అవస

పరం. మరి బాలదేవ్? అతను రావడమే మానేశాడు. అతగాడి మనస్సంతా మలిన మైనదే!

లక్ష్మి బాలదేవ్‌ను మరచిపోలేదు. 'ఆయన చాలా సాధుస్వభావంగల మనిషి. ఇతరులకు కష్టం కలిగించడం ఆయన కిష్టం ఉండదు. బాలదేవ్ మఠం లోకి రావడం మానేశాడు. నేను హింసను ప్రేరేపించానని, ఈ కారణంగా తాను మఠంగడప తొక్కనని అన్నారట! బాలదేవ్ చాలా అమాయకమైన వ్యక్తి. నిజ మైన సాధువు. ఆయనను క్షమించమని కోరాలి!' అని లక్ష్మి అంటూ ఉంటుంది.

మహంతు రామదాసు కొంచెందూరం ఆలోచించి, కాళీచరణ్ భయంకొద్దీ తృష్ణను అణుచుకున్నాడు. ఏదైనా జరిగితే లక్ష్మి వెంటనే అతనికి చెప్పేస్తుంది. ఆ తరువాత? తిలకోత్సవంనాడు కాళీచరణ్, అతని అనుచరులు అనుసరించిన వైఖరిని విస్మరించడం అసంభవం! వాళ్ళవల్లనేగదా రామదాసు మహంతు కాగలి గింది.

కాళీచరణ్ కారణంగా మహంతుపదవి లభించినంతమాత్రాన మఠానికి సంబంధించిన ప్రతివిషయంలోనూ జోక్యం కల్పించుకోవలసిన అవసరమేముంది? తా నెలాగూ మహంతుకావడానికి వారసుడే! రేపు కాళీచరణ్ పీకా అధికారం లేదంటే నే నొప్పుకొనవలసిందేనా?....మహంతు రామదాసు నెమ్మదిగా లేచి చప్పుడుకాకుండా లక్ష్మి గదిదగ్గరకు వెళ్ళాడు. తలుపు తెరిచేవున్నదా? ఊహూఁ. మూసివున్నది. ఈయనగారికి బయటినుంచే లోపలిగడియ తీయడం తెలుసు! చిన్నకర్ర ఒకటిదూర్చి తెరుస్తారు....ఇప్పుడు లక్ష్మి తలుపువెనక రోలు అడ్డంగా పెట్టడంలేదు. లక్ష్మి నిద్రపోతున్నది. ఆమె వంటిమీద బట్టలు అటూ ఇటూ కదిలి పోయివున్నాయి. జుట్టు రేగివున్నది. లాంతరు మసక వెలుతురులోకూడా ఆమె ముఖారవిందం ప్రకాశవంతంగా వున్నది.

'ఎవరు?'

'.... .... .... .... ....'

'రామదాసూ?'

'.... .... .... .... ....'

'రామదాసూ! నా చెయ్యి వదులు! కూర్చో! చివరకు నీ చిత్తాన్ని నువ్వు స్వాదీనపరచుకోలేకపోయావు! ఈ మాయాజాలం నిన్నుకూడా గుడ్డివాణ్ణి చేసింది.'

'ఈ మాయనుంచి ఎవరూ తప్పించుకోలేరు. మాయను జయించడం మాటలుకాదు!' మహంతు ఈరోజున లక్ష్మి ప్రతిమాటకూ సమాధానం చెప్ప డానికి పూనుకున్నాడు.

'నువ్వు నరకంవైపు నడుస్తున్నావు! ఇప్పటికైనా కళ్ళు తెరువు!'

'ఇప్పుడు కళ్ళుతెరిచి లాభంలేదు. నాకు స్వర్గం కావాలి. ఈ నరకంలోకి నేను మొదటిసారి అడుగుపెట్టలేదు!'

లక్ష్మికి రామదాసు చిన్ననాటిసంగతులు గుర్తుకు తీసుకరావడానికి ప్రయ త్నిస్తున్నాడు. లక్ష్మి చెయ్యి విదిలించుకొని పక్కమీదినుంచి లేవబోయింది. కాని మహంతు అంతకు పదినిమిషాలముందే నాలుగోసారి గంజాయి సేవించాడు.

'నేను నీ గురుమాతను రామదాసూ!'

'గురుమాతవు ఎలా గవుతావు? మఠంలో దాసీదానవు. నువ్వు మహంతు చనిపోయినతరువాత కొత్త మహంతుకుకూడా దాసీదానిలాగా ఉండాలి నువ్వు. నువ్వు నా దాసీవి!'

'నోరు మూసుకో తుక్కలకొడుకా!' లక్ష్మి చెయ్యి వదిలించుకొని రామ దాసు చెంపమీద లగాయించి ఒక్కదెబ్బ కొడుతుంది. రెండుకాళ్ళనువంచి తన పూర్తిబలాన్ని ఉపయోగించి రామదాసు రొమ్ముమీద బాదుతుంది. రామదాసు బోర్లా పడిపోతాడు. హే సద్గురు!

వ్యక్తి ఒకడే! ఒకడే పురుషుడుగానూ స్త్రీగానూ మారిపోతున్నాడు. పుత్రుడు దాయిగా మారిపోతున్నాడు.

'భండారీ! ఏమయ్యోయ్ భండారీ!'

'ఏమిటండీ?'

'మంచినీళ్ళు తెచ్చిపెట్టు!'

లక్ష్మి అదేపనిగా గడగడ వణికిపోతున్నది. మహంతు సేవాదాసు ఆఖరు

క్షణాలలో వున్నప్పటిరూపు ఆమె కళ్ళముందు మెదిలింది. లేదు, చావలేదు. భండారి 'మహంతుగారికి మళ్ళా మూర్ఛలరోగం వచ్చింది. రామపూరు మఠంనుంచి విన్నవచ్చిన సాధువుకు మూర్ఛలరోగానికి ఔషధం తెలుసు। రేపు ఆ ఔషధం ఇప్పించండి।' అని చెప్పారు.

హే సద్గురూ।

మహంతుగారికి జ్వరం వచ్చింది; ఛాతీలో బాధగావున్నది. డాక్టరు మర్దనం చేయడానికి తైలం పంపించాడు. లక్ష్మి మహంతుగారి ఛాతీకి తైలమర్దనం చేస్తున్నది. మహంతు మూలుగుతున్నాడు—'హే సద్గురూ। నే నిక జీవించను. నన్ను కాశీ పంపించు వంటలక్కా। నేను నా పాపానికి ప్రాయశ్చిత్తం చేసుకుంటాను.... నా ప్రాణం తీసెయ్యలేకపోయావా? అయ్యో। హే సద్గురూ।'

'జై హింద్ లక్ష్మిగారూ।'

'జై హింద్। రండి, బాలదేవ్‌గారూ। ఈ మధ్య మీరు సల్లపూసయి పోయారు।'

'రామదా.... మహంతుగారి కేమైంది?'

'జ్వరం, ఛాతీలో నొప్పి।'

'ఛాతీలో నొప్పికి పాత ఆవునెయ్యి మర్దన చెయ్యండి।'

పాత ఆవునెయ్యి - అంటే మురిగిపోయిన ఆవునెయ్యి. ఆ మాట వినడం తోనే లక్ష్మికి వాంతి వచ్చినంత పనయింది. మహంతు సేవాదాసుకుకూడా ఉబ్బసం ప్రకోపించినప్పుడు ఆవునెయ్యి మర్దనం చేయించేవాడు.

'లక్ష్మిగారూ। శివనాథబాబు వస్తున్నారు. ఇక్కడ ఒక చర్ఖాసెంటరు ప్రారంభించబోతున్నాం. మీ సహాయంకూడా కావాలి।'

'చర్ఖా సెంటరా? ఏం చేస్తా రిక్కడ?'

'చర్ఖా సెంటర్‌లో - చర్ఖాలు వడకడం, మగ్గాలు నేయడం, దూది ఏకటం వగైరా వాటికి శిక్షణం ఇస్తాం.'

'ఊళ్ళో రోజూకొక కొత్తసెంటర్ తెరుస్తున్నారు. మలేరియా సెంటర్, వల్లటోపీ సెంటర్, ఎర్రబావుటా సెంటర్, ఇప్పు డీ చర్ఖా సెంటర్.'

'మారుతున్న సమాజంలో రోజూ కొత్త కొత్త సంగతులు జరుగుతూ ఉంటాయి. మీరు సోషలిస్టుపార్టీకి చాలా సహాయం చేశారని విన్నాను. ఇదుగో చూడండి! గాంధీమహాత్మామార్గమే చాలా పురాతనమైనది, సరైనదికూడాను! కొత్తగా చాలాపార్టీలు వెలుస్తున్నాయి. ఏ పార్టీమార్గమూ మంచిదికాదు. అన్నీ హింసావాదాన్ని ప్రేరేపిస్తున్నాయి.'

'హే సద్గురూ! హే సద్గురూ! ఈయనకేమైనా చందా కావలసివుంటే ఇచ్చి పంపించు! హే సద్గురూ!' మహంతు బాధతో తల్లడిల్లిపోతున్నాడు. బాలదేవ్ మనిషి ఏమాత్రం మంచివాడు కాదు. పదిరూపాయలనోటు ఆయన కందిస్తూ లక్ష్మి -'ప్రస్తుతం ఇంతకుమించి లేదు. ఈమధ్య మీ రిటుపైపు రావడమే మానేశారు. నావల్ల ఏమైనా అపరాధం జరిగివుంటే మన్నించండి' అని అన్నది.

'ఈమధ్య నాకు తీరిక దొరకడంలేదండి. బట్టలకోటా ఒకటి వచ్చిపడింది. ఊపిరి పీల్చుకోవడానికి వ్యవధి దొరకడంలేదు. కాంగ్రెసుపార్టీ పనికూడా ఏమీ చేయడంలేదు. దీంతో ఇతరపార్టీలవాళ్ళకు కొత్త అదును దొరికింది. కాళీచరణ్‌కు రాత్రిందగళ్ళు ఇదేపని. కొంతమంది మా కాంగ్రెసు సభ్యుల్నికూడా సోషలిస్టుపార్టీ సభ్యులుగా చేర్చుకున్నారు. అందుకే శివనాథబాబును ఆహ్వానిందాం. చర్ఖా సెంటర్ తెరుస్తున్నాం. పాత కార్యకర్త బావన్‌దాస్ అనే ఆయనకూడా వస్తున్నారు. పాత వాడంటే మరీ పాతవాడేమీ కాదు; నాతోపాటే పార్టీలో చేరాడు. బావన్‌దాసు మరుగుజ్జువాడు. అరుగున్నరపొడ వుంటాడు. వైష్ణవుడు. వచ్చినప్పుడు ఇక్కడకు తీసుకొస్తాను. జైహింద్!'

'జైహింద్!'

బాలదేవ్‌కు మళ్ళా లక్ష్మి శరీరంనుంచి సువాసన వెలువడినట్టు అనిపించింది. ఎంత మనోహర సుగంధం!

బాలదేవ్ చాలా బలహీనంగా ఉండడం లక్ష్మి గమనించింది. బాలదేవ్ మనస్సులో ఎటువంటిదోషమూ లేదు. ఎంత సరళస్వభావం! ఎందుకో ఇవ్వాళ్ళ లక్ష్మిహృదయం బాలదేవ్‌నుచూసి చలించిపోయింది. బాలదేవ్ నిజమైన సాధువు.

—'విరహం చురచుర కాలిపోయే కట్టెలాంటిది. అది ఇట్టే కాలిపోతుంది. సర్వం భస్మమైపోయాక విచారం దేనికి!'

## ఇరవై మూడు

గ్రామప్రజలకు అర్థశాస్త్ర సామాన్యసిద్ధాంతాలుకూడా తెలియవు. 'సప్లయి', 'డిమాండు' వీటిలో తమ బుర్రల్ని పాడుచేసుకోరు. ధాన్యంధర పెరుగుతుంటే సంతోషిస్తారు. జనుముధర పెరుగుతున్నది. పెరిగిపోతూనే వున్నది. అయితే మరింత సంతోషం! చీరెఖరీదు పదిహేనురూపాయలు; మరి ధాన్యం మణుగు పన్నెండురూపాయలు. నాగటికర్రు అయిదురూపాయలు. బాండీ ఖరీదు పదిరూపాయలు. అయితే ఏం? జనుములధర మణుగు ఇరవైరూపాయలున్నది. మంచిదే.

ధాన్యం ధరలు పెరగడంవల్ల ముగ్గురు వ్యక్తులకు లాభం చేకూరింది - తాసిల్దారుకు. సింగుగారికి. ఖేలావన్‌సింగ్ యాదవ్‌కూ! చిన్న రైతులపొలాలు చౌకగా అమ్ముడుబోతున్నాయి. కూలీలకు రోజుకూలి రూపాయిపావలా ఇస్తున్నారు. అయితే అది ఒక్కమనిషి పొట్టకుకూడా సరిపోదు. అయిదుసంవత్సరాల పూర్వం రోజుకు అయిదణాలకూలి ఇచ్చేవారు; దాంతో ఇంటోవున్న వాళ్ళందరి పొట్టలు నిండేవి.

తాసిల్దారు ధాన్యంమార్చి ఎక్కడ దాచిపెట్టాడో ఏమో! ఇంటిముందర ఇదివరలో డజన్లకొద్దీ గాదెలుండేవి. ఈ సంవత్సరం ఇంటిముందంతా ఖాళీ! బహూశా గవర్నమెంటు ధాన్యం జప్తు చేసుకొనేశాసనం ఏమైనా అమలుపరచడానికి ఆలోచిస్తున్నదేమో!

బట్టలులేక గ్రామప్రజలంతా అర్ధనగ్నంగా వున్నారు. మగవాళ్ళు పాంటు తొడుక్కోవడం ప్రారంభించారు. ఇక ఆడవాళ్ళు ఇంట్లో పని చేస్తున్నంతసేపూ ఒక గుడ్డ నడుముకు చుట్టుకొని పని జరుపుకుంటున్నారు. పన్నెండు సంవత్సరాల వరకు వయస్సుగల పిల్లలంతా నగ్నంగానే వుంటున్నారు.

శివనాధ్ చౌధరి సభలో ఖాదీ అర్థశాస్త్రాన్నిగురించి వివరించి చెబుతున్నారు. ఇంట్లోని ప్రతివ్యక్తి రాట్నం వడికితే గ్రామాలలోని బీదతనం మాయమవుతుందని. అన్నవస్త్రాలలోటు అనేది ఉండదని లెక్కలతో రుజువుచేసి మరీ చెబుతున్నాడు.

చర్ఖా సెంటర్‌కు ప్రారంభోత్సవం జరిగింది. ఇప్పుడిక గ్రామంలో బీద

తనం తప్పించదు. పాట్నానుంచి ఇద్దరు మాష్టర్లు వచ్చారు—చర్ఖా మాష్టరు: మగ్గం మాష్టరు। ఒక పంతులమ్మకూడా వచ్చింది - ఆడవాళ్ళకు రాట్నం నేర్ప డానికి। 'రాట్నం మన భర్త. పుత్రుడు; రాట్నం మన దౌహిత్రుడు. రాట్నముంటే మన ఇంటిముందు గజరాజమున్నట్టే।' అని ఆమె ఆడవాళ్ళకు చెప్పింది.

రాట్నముంటే గజరాజమున్నట్టే। జై గాంధీజీకి జై।

సైనిక్‌లాగా, చినగారిలాగా శివనాధ్ చౌదరి ధాటిగా ఉపన్యసించడం లేదు. అయితే చెప్పేవిషయం చాలా గట్టిగా చెబుతున్నారు. ఏం చెప్పినా లెక్కలువేసి మరీ చెబుతున్నారు. వాళ్ళమాటలు చాలా విజ్ఞానదాయకంగా వున్నాయి. క్రిందటి రోజున మర ఆడించినపిండితో తయారైనరొట్టె తినరు. పంచదార ముట్టరు; బెల్లం తింటారు. చాలా త్యాగశీలురు। చౌధరిగారితోపాటు దరభంగాజిల్లా తమోడియా స్టేషన్‌కుచెందిన రమ్‌లగినాబాబుకూడా వచ్చారు. ఈయన నీటితోనే చికిత్స చేస్తా రట। వండినవస్తువులు తినరు. ఆకుకూరలు పచ్చివే తినేస్తారు. ఇందులో చాలా బలమున్నదని ఆయనన్నారు. ఆయనే నిజమైనత్యాగి. శరీరంలో ఎముకలుమాత్రం మిగిలివున్నాయి; మాంసం కొంచెంకూడా లేదు. రోజుకు పదిహేనుపర్యాయాలు చెంబు పుచ్చుకొని బయటికెళ్ళి వస్తూఉంటారు.

సాదా కాగితంతో ఒక కరపత్రం పంచిపెట్టారు. కరపత్రంమీద గాంధీ ఫోటో వున్నది; ఆ ఫోటోక్రింద—

ధరించేది వడుకు
వడికేది ధరించు
అని బాపూ అన్నారు :

సోషలిస్టుపార్టీ వాళ్ళుకూడా ఒక కరపత్రం పంచిపెట్టారు. అయితే ఆ కర పత్రం ఎర్రరంగులో వున్నది. అందులో ఒకమాట ఎక్కువున్నది.

దున్నేవాడే నాటువేస్తాడు.
నాటువేసినవాడే కోస్తాడు.
కోసినవాడే పంచుతాడు।

బాలదేవ్ స్థానంలో బేనదాసు వచ్చారు. ఇతడే పూర్ణియాలో రాజేంద్రబాబు

ఎదుట ఉపన్యాసం ఇచ్చారు. బాలదేవ్‌కు ఈ చీటీలు పంచిపెట్టేపనినుంచి తీరిక లేక పోవడంవల్ల ప్రజాసేవకోసం బేనదానును ఇక్కడికి పంపించడం జరిగింది. బేనదాసు చాలా సాహసమైన వ్యక్తి. 1942 ఉద్యమసందర్భంలో ప్రజలు కోర్టు భవనం మీద జెండాలు ఎగురవేయడానికి వెళుతూంటే మిలిటరీవచ్చి చుట్టుముట్టింది. బేనదాసు మిలిటరీవాళ్ళ కాళ్ళ సందుల్లోనుంచివెళ్ళి కోర్టు భవనంమీద జెండా ఎగరవేశాడని అంటారు.

రామాయణంలో హనుమంతుడు దోమరూపంధరించి సురసాను ఆటలు పట్టించినట్టుగానే!

'ఈ ఆర్యావర్తంలో కేవలం ఆర్యులు అంటే శుద్ధ హిందువులుమాత్రం నివసించడానికి అర్హులు.' నల్లటోపీ సంయోజకుడు బౌద్ధికతరగతిలో రోజూ చెబుతున్నారు—'యవనులు మన ఆర్యావర్తసంస్కృతిని, కళా కౌశలాన్ని వినష్టపరచారు. ఇప్పుడు హిందూసంతానం మ్లేచ్ఛసంస్కృతి పూజారులుగా మారిపోయింది. శివాజీ, మహారాణా ప్రతాప్....'

బౌద్ధిక్లాసు! సోషలిస్టుపార్టీ వాసుదేవ్ దీన్ని బుద్ధిలేనివాళ్ళ క్లాసన్నాడు. వాసుదేవేకాదు, నల్లటోపీధారులైన యువకులుకూడా బుద్ధిలేనివాళ్ళ క్లాసేనని తూలనాడుతున్నారు.

లాఠీలు, బల్లేలు, కత్తులు చేతిలోకి తీసుకోవడంతోనే రాజపుత్ర యువకుల రక్తం వేడెక్కుతుంది. ఒకరోజెప్పుడో హరగౌరి అడిగాడు....'సంయోజక్‌జీ! యవనులమీద నాకు కోపం రావడంలేదు. యవనులపక్షాన్ని వహించిన హిందువుల మీద నాకు కోపంగా వున్నది. వాళ్ళతలలు తుంచేయాలన్నంత కోపంగా!' సంయోజక్ కొంచెం అవతలికి జరిగారట, లేకపోతే హరగౌరి కత్తితో సాము చేసినప్పుడు ఆ ఊపులో సంయోజక్‌తల ఎగిరిపోయేదేనట! ఆర్యావర్తం. మేరీగంజ్ పేరే ఇప్పుడు ఆర్యావర్తంగా మారిఉంటుందేమో! అయితే ఈ ఊళ్ళో ఒక్క ముస్లిం కూడా లేదు.

గ్రామంలోఉండే నాగలి దున్నేవాళ్ళకు, గొర్లను మేపేవాళ్ళకు, కూలినాలి చేసే కార్మికులకు కాళీచరణ్ నాయకుడు. ఛోటానాయకుడైన వాసుదేవ్ అందరి

తోనూ—'సోదరులారా! మనిషి అన్నతరువాత అతనికి ఒకే ఒక రంగు ఉండాలి. ఈ మూడురంగుల జెండా ఉన్నది చూశారూ. కొంచెం పాదాగా, కొంచెం ఎర్రగా మరికొంచెం పీలగావున్న ఈ జెండా కలగాపులగం పార్టీకి చెందిన జెండా। కాంగ్రెసు పులగం పార్టీ. ఈ పార్టీలో జమీందార్లున్నారు; షావుకార్లున్నారు; వాటు రాళ్ళుగా ఉపయోగపడేందుకు రైతు కూలీలనుకూడా సభ్యులుగా చేర్చుకున్నారు. పేదసాదలు ఒకేరంగు వున్నజెండా పార్టీలో ఉండాలి।' చెప్పారు.

తాసిల్దార్‌కూడా కాంగ్రెసులో చేరారు.

ఆయన చర్ఖా సెంటర్‌కోసం తన చావిడి ఇచ్చేశారు. ఇద్దరు నేసుకోవడం ప్రారంభించారు. ఏదో జీవితమంతా అవినీతికి, అన్యాయాలకూ పాల్పడ్డాను. ఇప్పుడు చివరి ఘడియల్లోనైనా పుణ్యం చేయాలనివున్నదని అన్నారు. తాసిల్దారు నాలుగణాల సభ్యుడు కాలేదు. నాలుగణాలసభ్యుడు ఎవరైనా అవుతారు. తాసిల్దారు నాలుగువందలరూపాయల సభ్యుడు అయ్యాడు. చూడలేదా? శివనాథబాబు రశీదు రాసిచ్చారు. తాసిల్దారు వెంటనే పొగాకుకాడల్లాగావున్న నాలుగు పచ్చనోట్లు తెచ్చి ఇచ్చేశాడు. ఇప్పుడు సోషలిస్టుపార్టీ నడవడం కష్టం గావచ్చు. ఆ పార్టీలో ఒక్కరూ డబ్బున్నవాళ్ళు లేరు. మఠంలోని వంటలక్క ఎంతకాలమని పార్టీని ఆదుకుం టుంది?

సెక్షన్ 40 నోటీసు వచ్చింది.

జిల్లాకాంగ్రెసు కార్యదర్శి నోటీసు పంపిందారు. సోషలిస్టుపార్టీ బలవం తంగా భూములు స్వాధీనపరుచుకోమని ఆదేశించింది. కాంగ్రెసు కార్యదర్శి సెక్షన్ 40 చట్టం ప్యానుచేయించి నోటీసులు పంపించారు. బాలదేవ్ నంతలో నోటీసులు పంచుతున్నారు. 40 వ సెక్షన్ చట్టం ప్యానయింది. కౌలుకి, పాలుకి చేసేరైతులు భూమిని స్వాయత్తం చేసుకోండి. కొత్తచట్టం ప్యానయింది. హింసావాదంతో నిమిత్తంలేదు. పూర్ణియా కోర్టులో 40 వ సెక్షన్ ఆఫీసర్‌ను వేశారు. దరఖాస్తు ఇచ్చుకోండి. భూమి మీ సొంతమైపోతుంది.

బాలదేవ్ కడుపునిండేమాట చెప్పారు. ఎటువంటి రాద్ధాంతం లేకుండానే పొలం స్వాయత్తమవుతూంటే సోషలిస్టుపార్టీలో చేరడమెందుకు? కాంగ్రెసు

రాజ్యంలో అవసరమైనదాన్నిగురించి కాంగ్రెసుమంత్రులకు విన్నవించుకుంటే సరి; పనులు సానుకూలమవుతాయి. చట్టాలు ప్యాసుచేస్తారు. అంతేగాని ఒక్కొక్కరే చెప్పుకుంటే మంత్రులుమాత్రం ఏం జేస్తారు? అంతా కలిసికట్టుగావెళ్ళి విషయం విన్నవించుకోవాలి. అంతా ఒక తాటిమీద నిలబడితే పనులు అయితే అవుతాయి. కాకపోతే విచారించవలసినపనీ లేదు. అసలు తప్పంతా ప్రజలదే। కొందరు కాంగ్రెసులో చేరితే, మరికొందరు సోషలిస్టుల్లో చేరారు. ఇలా రకరకాల పార్టీలలో చేరబడడంవల్ల ప్రజలకు మేలు అనేది జరగదు. బాలదేవ్ మాటల్లో సత్యం లేక పోలేదు.

'పాట్టీ బి.టి. యాక్ట్!' సోషలిస్టుపార్టీ జిల్లా కార్యదర్శి కామ్రేడ్ కాశీవరల్ కు వివరిస్తున్నాడు—'పాట్టీ బి.టి. యాక్ట్ అనేది కొత్తచట్ట మేమీ కాదు. ఇది పాతదే. కాంగ్రెసు కార్యదర్శి కరపత్రాలు పంచిపెట్టించాడా? సరే! మీరుకూడా రైతులతో భూస్వాముల పొలాలన్నిటినీ ఆక్రమించుకోమని ఉసికొల్పండి. ఎవరూ మరొకరికి సాక్ష్యం చెప్పకుండా ఉండేలా చూసుకోండి. కేసులు పెడితే పెట్టుకోనివ్వండి. పెట్టగానే సరా? రుజువు చేసుకోవాలి. సాక్షుల్ని కొంచెం కట్టుదిట్టంగా ఉంచండి. ఈ పనులన్నీ సక్రమంగా జరగాలంటే కార్మిక కర్షక బీదప్రజానీకాన్ని ఒక జెండాకిందికి, ఒక పార్టీలోకి తీసుకరావడం ఎంతయినా అవసరం. కాసిల్దారు కాంగ్రెసుతీర్థం పుచ్చుకున్నాడు. కనుక ఆయన భూముల్ని ఆక్రమించుకోమని రైతులకు చెప్పండి. అప్పు డాయన రంగేమిటో బయటపడుతుంది. కాంగ్రెసు కార్యదర్శి పంచిపెట్టించిన కరపత్రాల పసేమిటో బట్టబయలవుతుంది. 'ఎర్ర బావుటా' ఈ వారం పత్రికలో చిన్‌గారీ రాసిన ఈ విషయంమీద రాసినవ్యాసం ఒకటి వున్నది. ఈసారి ఎక్కువకాపీలు పట్టుకెళ్ళండి.'

'....40 వ సెక్షన్ కౌలుకి పొలం చేసుకునేవాళ్ళకు, పాటకి పొలం చేసుకునేవాళ్ళకు ఆ భూములమీద సర్వహక్కుల్ని భుక్తం చేస్తుంది. అయితే ఈ చట్టంలో ఏమాత్రం లొసుగు కన్పించినా ఈకెకు ఈకె, పీకెకు పీకె పీకడానికి వీలుంటుంది. ....40 వ సెక్షన్ ఆఫీసర్లుగా నియమించబడినవాళ్ళందరూ పెద్దపెద్ద జమీందార్ల పిల్లలూ, లేదా మోతుబరిరైతుల బంధువులు. వీళ్ళు పేదసాదలకు అండగా నిలబడతారనేది ఎండమావుల్లో దాహం తీర్చుకోబోయినట్టే అవుతుంది.

అయితే ఐకమత్యంలోవున్న శక్తి ఈ చట్టాల్నికూడా నేలమట్టం చేస్తుంది. సోషలిస్టుపార్టీ ఎర్రజెండాకింద నిలబడి - జమీందార్లకు, మోతుబరి రైతులతరపున ఎవరూ సాక్ష్యం చెప్పకూడదని మనమంతా ప్రతిజ్ఞ తీసుకోవాలి. 'ఎర్రబావుటా' పాలుకుచేసే రైతులపక్షాన నిలబడుతుంది.....'

చెప్పడం బాగానే వున్నది.

'అవును, గోరంతను కొండంతచేసి చెప్పడం జరిగింది.'

సిద్ధాంతి ప్రతివిషయంలోనూ మీనమేషాలు లెక్కబెడతాడు—'అవులా అవులా కుమ్ములాడితే లేగలకాళ్ళు విరుగుతాయట। సోషలిస్టులు కాంగ్రెసువాళ్ళు తన్నుకులాడుతున్నారు. ఎవరికివాళ్ళు ఎక్కువసభ్యులను చేర్చాలని పోటాపోటీలు పడుతున్నారు. ఈ రెంటికిమధ్యా ఇరుక్కువి పిసరయ్యేది ఎవరయ్యా అంటే - బీదా బిక్కా।'

'బీదా బిక్కా పిసరయ్యే సమస్యే లేదు. రెండువర్గాలమధ్య పోటాపోటీలు పడితే ప్రజలకే మేలు కలుగుతుంది. క్రిందటిసారి రౌతహట్ తిరనాళ్ళకి వేరే ప్రాంతంనుంచి ఒక నాట్యబృందం వచ్చింది. వాళ్ళనాట్యం ఏమాత్రం బాగాలేదు. చివరకు పాటలుకూడా అంతంతమాత్రంగానే పాడారు. మూడోరోజున బావుల్ బృందంవాళ్ళు వచ్చారు. రెండుబృందాలవాళ్ళకూ పోటీ పడింది. నాట్యాలు సాయంత్రం ప్రారంభమైనాయి. గజల్, కవ్వాళి, ఖేమ్టా, దాద్రా ఒకటేమిటి లెక్కలేనన్ని పాడారు. ఈ ఆటపాటలకార్యక్రమం రెండోరోజున సూర్యోదయం దాకా కొనసాగింది. అప్పటికీ వాళ్ళు ఆపలేదు. తిరనాళ్ళ కమిటీ మేనేజరు వెళ్ళి ఉభయపక్షాలవారిని ప్రాధేయపడి కార్యక్రమాన్ని ముగింపజేశాడు.

కమ్మరి చలిత్తర్ వచ్చారు.

చలిత్తర్ విప్లవకారుడు. జాతికి కమ్మరి. నివాసం: సేమాపురం. మూమెంటురోజుల్లో తెల్లమిలిటరీవాళ్ళకు ఇతనిపేరు చెబితేనే హడలు। బాంబులు వేయడంలోనూ పిస్తోళ్లు కాల్చడంలోనూ మహాఘటికుడు. ఉద్యమంరోజుల్లో ప్రభుత్వపక్షాన సాక్ష్యంచెప్పిన వాళ్ళందరిచేత నాలుగుచెరువులనీళ్లు తాగించాడు. అంత గంభ్రమనిషి। అయితే ఎప్పుడూ పట్టుబడలేదు. ఎంతోమంది సి. ఐ. డీలను

ప్రాణాలతో చంపేశారు. ధర్మపురంలోవున్న పెద్దపెద్దవాళ్లకూడా ఇతనిపేరు చెబి తేనే హడలిపోతారు. చలి త్తర్ గుర్రంమీద స్వారి చేసుకుంటూ ఇంటిముందు కొచ్చాడు అంటే ప్రమాదం ముంచుకొచ్చినట్లే। చందా ఇచ్చి పంపించండి. ఏభై। అయిదువందలకు తక్కువ ఒక్క పైసాకూడా తీసుకునేది లేదు. లేదా? అయితే పెట్టె తాళంచేతు లిలా ఇవ్వండి. ఇవ్వరా? ధం ధాం।.... అతనిమీద వది ఖూనీ కేసులున్నాయి. కాని ఇంతవరకు పట్టుబడలేదు. చివరకు విసిగిపోయి ప్రభుత్వం ఆ కేసులన్నిటినీ ఎత్తేసుకున్నది. ఈ క్రాంతికారుడు. ఈ కర్మకారుడు కాళీచరణ్ ఇంటికొచ్చాడా? అయితే సరే। కావలసిందేముంది? అసలే కోతి. అందులోను కల్లు తాగింది. పై పెచ్చు తేలుకుట్టింది. ఆ ఇంటికి తలుపులేదు; ఈ ఇంటికి ద్వార బంధం లేదు. చలిత్తర్‌కూడా సోషలిస్టుపార్టీలో చేరాడా? అయితే బాంబులు ఎలా వేయాలో, పిస్తోలు ఎలా కాల్చాలో శిక్షణ ఇవ్వడానికి వచ్చిఉంటాడేమో। బాంబులు, పిస్తోళ్ళముందు నల్లటోపీవాళ్ళ లాఠీలు ఏం పని జేస్తాయి? ఏనుగకూ దోమకూ ఏమిటి సామ్యం?

రాట్నాలూ—మగ్గాలు, లాఠీలు—బల్లేలు, బాంబులు—పిస్తోళ్ళు। మూడు త్రైవింగులు।

## ఇరవై నాలుగు

ఇక జీవించలేను ప్రియుడా।
నా కేశరాశి విడిపోయింది
ఇక తాళజాల।

ధరలు పెరిగినా, కరువు లొచ్చినా పండుగలూ పబ్బాలూ జరుపుకొనవల సిందే। ఇక హోలీ విషయమా? చెప్పనే అవసరంలేదు. ఫాల్గుణమాసంలో వీచే వాయువే మత్తును కలిగిస్తుంది. ఆశ్వయుజ-కార్తీకమాసాలలో మలేరియా. విష జ్వరాలతో సతమతమైన శరీరాలకు ఫాల్గుణమాసపుగాలి సంజీవనిలా పనిచేస్తుంది. ఏడుపులకు పెదబొబ్బలకు తక్కిన పదకొండుమాసాలు ఎలాగూ ఉన్నాయి. ఫాల్గుణంలోనైనా చిరునవ్వులు చిందించు; ఆనందాంబుధిలో ఓలలాడు। 'జీవించే

ప్రతివాడు ఫాల్గుణోత్సవం జరుపుకోవాలి' అని అందుకే అన్నారు. ఇతర పండు గల్ని మానెయ్యవచ్చునేమోగాని హోలీమాత్రం జరుపుకొనవలసిందే। వసంతర్తు హృదయాలలో సైతం జీవాన్నిపోసి ఉత్సాహవంతుల్ని చేస్తుంది. చిగుళ్ళతో నిండిన మామిడితోటలగాలి పిల్లలకూ, ముసలివాళ్ళకూ మత్తెక్కింపజేస్తుంది.... బియ్యపుపిండి, బెల్లం, నూనె। ఈ పూవా పిండివంటవంటి కొద్దిపాటి పరిపాటి సందర్భంగా యజమానుల ఇళ్ళముందర అయిదురోజులముందునుంచే జనం గుమి గూడివుంటారు. గాదెలమూతలు విప్పుతారు. యజమానులు ఖాతాపుస్తకాలు తెరిచి కూర్చుంటారు. పక్కన కాటుక్కాయ ఉంటుంది. ధాన్యం కొలిచేవాడు రాశిలో నుంచి ధాన్యం కొలుస్తూఉంటాడు. దాదరదాసుకు ఒకమణుగు....సోనాయెకు మూడు వీశెలు....తెల్లకాగితంమీద వేలిముద్ర వేసివెళ్ళు....భాద్రపదమాసంలో భాద్రపదం పంట ఇచ్చేస్తే ఒకటిన్నర, అంటే మణిక్కి ఒకటిన్నరమణుగు. మార్గశిరం పంటనాటికి ఇచ్చేస్తే ఒకటిన్నరమణుగుకు మూడుమణుగులు। మామూలు లెక్క। దొంకతిరుగుడేమీ లేదు.

గ్రామంలోని పెద్దపెద్ద రైతులందరికీ వాళ్ళవాళ్ళ కూలీలపేట లున్నాయి. సింగ్‌గారికి తాంత్రికులపేట; పహరావాళ్ళ పేట, తాసిల్దారుగారికి దర్వానుల పేట, బోయీలపేట, కమ్మరిపేట; ఖేలావన్‌యాదవ్‌కు గొల్లలపేట, కూరగాయలమ్మే వాళ్ళపేట। ఇక సంథాల్‌పేటవాళ్ళమీద ఏ ఒక్కరి ఆధిపత్యమూ లేదు.

ఈ పర్యాయం తాసిల్దారు మినహా మరెవ్వరూ కూలీలకు ధాన్యం కొలవ లేదు. వేలిముద్ర వేసేదిలేదు. ధాన్యంమాత్రం కావాలి. మా తాతతండ్రుల కాలం నుంచి వేలిముద్ర వేస్తూవస్తున్నాం. ఎప్పుడూ నమ్మకద్రోహానికి పాల్పడలేదు. ఈ సంవత్సరం ద్రోహానికి పాల్పడతామా? కాళీచరణ్ వేలిముద్ర వేయవద్దని చెబితే ధాన్యంకూడా ఆయననే ఇవ్వమని అడగండి.

తాసిల్దారు కొత్తగా వేలిముద్ర తీసుకోలేదు. పాత వేలిముద్రలే చాలా ఉన్నాయి. ఇతర రైతుల కూలీలకుకూడా తాసిల్దారు ఈసారి ధాన్యం ఇచ్చాడు. అయితే కాళీచరణ్ జమానత్ తీసుకొని। ధాన్యం వసూలుచేసి ఇచ్చేబాధ్యత కాళీ చరణ్‌మీ దుంటుంది. ఒకటిన్నరకాకపోతే ఒకటింబావు అయినా చాలు....

ఏదయితే ఏం? తాసిల్దారు ఎట్లాగయినా దయాదాక్షిణ్యం వున్నమనిషి. తక్కిన యజమానులంతా పిశాచాలాంటివాళ్ళు; వట్టి పిశాచాలు!

ఏక్ టక్ లౌటల్ బారీరే బహూంటవా।

హోలీపండుగ ప్రతిపాటా హృదయంలో సంచలనాన్ని కలిగిస్తుంది. పులియాపెళ్ళి భగాసీతో జరిగిపోయింది. భగాసీ భార్యను తీసుకెళదామని వచ్చాడు. కాని పులియాకు, హోలీపండుగకుముందు వెళ్ళడం ఇష్టంలేదు. భగాసీకి కోపం వచ్చింది. నాలుగురోజులు అలాగే కూర్చున్నాడు. చివరకు అలిగి వెళ్ళిపోవడానికి సంసిద్ధుడయినాడు. 'ఈ సంవత్సరం హోలీ ఇక్కడే జరుపుకోనివ్వు; వచ్చే సంవత్సరం....' అని పులియా రమజూభార్య ఇంటిముందు భర్తను ప్రాధేయపడింది.

ఒకసారి తిరిగిరావా ప్రియుడా?

మధ్యాహ్నంనుంచి సాయంత్రందాకా రమజూదాసు ఇంట్లోఉండి పులియా భగాసీని ఎంతగానో బ్రతిమలాడుకొన్నది. హోలీకి భగాసి ఒకరూపాయి ఇచ్చాడు.

పాపం సహదేవమిశ్ర ఈసారి ఎవరితో హోలీ ఆడతాడో? క్రిందటి సంవత్సరం గుర్తుకొచ్చేప్పటికి పులియా ఏవో ఆనందతన్మయత ఆమెను ఆవరించి ఉబ్బి తబ్బిబ్బుచేసి పారవేసింది. భంగుతాగి సహదేవమిశ్ర మంచి నిషాలో వున్నాడు. ఒకే పూరీని ఇద్దరూ కొంచెం కొంచెంగా కొరుక్కుతిన్నారు....'అరే జాతీగిరీ జాన్తానై! పులియా అరే నా రాణీ! అలివేణీ! ఇలాతే నీ వేణీ! నువ్వే నా జాతివి; నువ్వే నా జీవితానివి! నా సర్వస్వానివి, నువ్వేనే నా పూబోణీ' నాన్నకు సారాయితాగడానికి రూపాయిన్నర ఇచ్చాడు, అర్ధరూపాయి అమ్మకు చెల్లించుకున్నాడు....రాత్రంతా సహదేవమిశ్ర మేల్కొనే గడిపాడు ...పులియా శరీరంలోని అణువణువునుంచి ఏదో తియ్యటిబాధ వేస్తున్నది. కిలకిలనా బాధ! ఎవరైనా బాహువుల్లో బంధించుకొని నన్ను బలవంతంగా కౌగలించుకుంటే బావుండును - ఎముకలన్నీ సడలి బాధ ఉపశమిస్తుందేమో! ...సహదేవమిశ్రకు కబురంపనా?....మరి లోకులు? కాకులవంటివారే;....ఉహుం-హోలీనాడు ఇలాంటి పట్టింపు లేపీ ఉండవు. అతగాడు వస్తాడా మరి?....కోపంగా వున్నాడేమో!

కరములు పట్టుకు లాగెనే కృష్ణుడు
గాజులు రెండూ పగిలిపోయె

రవికె చిరిగె, చీరె తడిసె, కొంగు ఎగిరె

శ్యామసుందరుడు ఇలా ఆడెనే వసంతం।

కమలనేత్రాలు ఎర్రబడిపోతున్నాయి. క్రిందటిసంవత్సరం హోలీనాడే ఆమె స్పృహతప్పి పడిపోయింది. ఈసారి ఏమవుతుందో? ఈసారి స్పృహతప్పిపోదు. డాక్టర్ ఉన్నాడుగా। చూడడానికి।....కాని ఉదయంనుంచే డాక్టర్ బయటికెళ్లాడు. రోగుల్ని చూడడానికి, రామపూరు వెళ్లాడు. ఇవ్వాళ్ళ రాకపోతేనో? ఉహుం.... ఆయన తప్పకుండా వస్తాడు. అమ్మ వారంరోజులుముందే ఆహ్వానించింది. రంగు, బుక్కా, పొడి, పిచకారి।

'అమ్మా!'

'ఏమిటమ్మా?'

'మీ డాక్టర్ ఇవ్వాళ్ళ వచ్చేట్టు లేడు.'

'ఏం? ఎందుకని రాడు?'

'నాకేమీ బాగాలేదమ్మా।'

'అలా అనకమ్మా। ధైర్యంగా ఉండు. నీకేమీ కాదు.'

నేడు వ్రజభూమిన నలుదెసలా రంగురంగులు ఎగసెనే।

ఎటుచూసినా బుక్కాపొడి ఎగిరిపడుతున్నది. డాక్టర్‌మీద ఎవరూ రంగు వేయలేదు. రామాపురంలో ఎవరూ వేయలేదు. దారిలో ఒకచోట కొందరు పిల్లలు పిచకారీ తీసుకొని నిలబడ్డారు. అయితే డాక్టర్‌నుచూసి జంకారు....రంగుకాదు వాళ్ళదగ్గరున్నది, పేడ। రంగుకొనడానికి డబ్బులేవీ? డాక్టర్‌మీద ఎవరూ రంగు పోయలేదు. ఆయన సర్కారుమనిషి. సర్కారీదుస్తుల్లో వున్నారు. ఆ దుస్తులమీద రంగుపోస్తే శైలుశిక్ష వేస్తారు. ఆయన డాక్టరు, పైగా బయటివ్యక్తి. ఊరికి సంబంధించిన వ్యక్తికాదు....డాక్టరు ప్రారంభంనుంచీ ఊళ్ళోవాళ్ళతో కొంచెం దూరంగానే ఉంటూవచ్చారు. రోగాలు, రోగులుతప్ప మరోధ్యాస లేదు. గ్రామ జీవితంలోకి చొచ్చుకుపోయేందుకు ఎప్పుడూ ప్రయత్నించలేదు. అయితే ఇప్పు డిప్పుడే గ్రామం అంటే ఇష్టం ఏర్పడుతున్నది. తనమీద ఎవ్వరూ రంగు వెయ్యరేం? రంగుతో, పేడతో, బురదతో మునిగిపోవాలని వుంది।

'అరెరెరెరె! తప్పుగా భావించకండి. హోలీ!'

డాక్టర్ తెల్లటి చొక్కామీద ఎర్రటి, గులాబీరంగు నీళ్ళు పడ్డాయి.

'ఏయ్! కాళీచరణ్!'

'పెద్దగా భావించకండి డాక్టర్‌గారూ! హోలీపండుగ!'

డాక్టర్ మనీపర్సులోనుంచి పదిరూపాయల నోటుతీసి కాళీచరణ్‌కు ఇస్తాడు. హోలీ చందా! రంగుకీ, బుక్కా పొడికీ!

హోలీ! హోలీ! హోలీ!

గణేశ్ చేతిలో పిచికారీ తీసుకొని పిన్ని చీరె వెంగు పుచ్చుకొని నిలబడి వున్నాడు. పిన్ని నవ్వుతూ అన్నది—'ఉదయంనుంచి హోలి ఆడతానని పట్టుపట్టి కూర్చున్నాడు. నా చీరె ఒకదాన్ని రంగుతో నింపేశాడు. ఊళ్ళో పిల్లలతో వెళ్ళి ఆడుకుంటానని గొడవ చేస్తున్నాడు.'

'రా గణేశ్, రా!' కాళీచరణ్ గణేశ్ చెయ్యిపుచ్చుకొని తీసుకెళ్లాడు. గణేశ్ సంతోషంలో డాక్టర్‌మీద రంగుపిచికారీచేస్తూ కేరింతలుకొడుతూ కాళీచరణ్‌తో పారిపోయాడు. పిన్ని చాలా సంతోషించింది.

'కలకాలం సుఖంగావుండు కాళీబాబూ!'

'మంచి ఉషారైన యువకుడు!' డాక్టర్ అన్నాడు.

'డాక్టర్‌గారు తిరిగొచ్చారా లేదా అని తెలుసుకొనడానికి కమల అయిదు సార్లు మనిషిని పంపించింది. నన్ను భయపెట్టి మరీ వెళ్ళింది—'డాక్టర్‌గారిని మా ఇంటికి భోజనానికి పిలిచాను. మీ ఇంటిదగ్గర భోజనానికి బలవంతం చేశావంటే ఊరుకోను.'

ఢోల్, ఢాక్, ఝుంఝూ మృదంగ్ ఔర్ డంఫ్
హోలీఫగువా చదేవా ఔర్ జోగీడా!

కాళీచరణ్ బృందం చాలా పెద్దది. రెండు ఢోళ్లు! ఒక ఢక్కా. పెద్ద కంచు వాయిద్యం మొదలైనవాయిద్యాలు వున్నాయి. బాగా పాడేవాళ్లుకూడా అతనిబృందం లోనే వున్నారు. సుందర్‌లాల్, ముఖీలాల్, దేవీదయాల్, జోగీడా పాటపాడే

మహంతా! మహంతా మిడిల్ చదువుతున్నాడు. మంచి తెలివిగలవాడు. కవిత్వం రాస్తాడు. వెండిపతకంకూడా సంపాయించుకున్నాడు. గ్రామంలోని చిన్నచిన్న దళాలన్నీ కాశీచరణ్ బృందంలో కలిసిపోయాయి.

జోగిడా సర్....ర్ర్....
జోగిడా సర్ రర....
యోగీ తాళం తప్పకూడదు
త్రిపుట తాళంమీద ఢోలక్ మోగాలి
తాకధినా ధిన్‌ధినక్ తిన్నక్
యోగీ!
హోలీ! చెడుగా భావించకు ఇది హోలీ
వర్షంలో గుంటలు నిండినప్పుడు
వేలాది కప్పలు అందులో బర్రమంటాయి
అలాగే వున్నదోయి ఈనాడు కాంగ్రెసుకూడా
నిన్నటి గాడిదలంతా నేడు నాయకులైనారు
యోగీ సర్ ర్ ర్!

యోగీ తాళం తప్పకూడదు
త్రిపుటతాళంమీద ఢోలక్ మోగాలి
యోగీ! తక్ ధినా ధిన్!
రాట్నం వదుకు, ఖద్దరు తొడుగు
చేతికి జోలె
పగలే దోపిడిచెయ్ ఇదేనోయి కాంగ్రెసోళ్ళ కథనం
యోగీ, సర్ ర్ ర్!

జోగిడా పాడడమేగాక, మహంథు కొత్తగా హోలీ పాటలుకూడా కొన్ని రాశాడు. బట్ గమపీ ఫగువా - దారిన నడుస్తూ పాడుకునేందుకు—

వచ్చిందోయ్ హోలీ! మళ్ళీ వచ్చిందోయ్!
వచ్చిందోయ్!
మనోహరగాంధీ రాగం పాడుతూ

రాజేంద్రబాబు రాజ్యం వడకగా
భారత ఆశ్రమవనం ప్రతిధ్వనించెరా॥
వచ్చిందోయ్ హోలీ।
వీర జవహర్ మన గౌరవమోయ్
వల్లభబాయి మన కథిమానం
జయప్రకాశ్ మన సోదరుడేనోయ్
వచ్చిందోయ్ హోలీ మళ్ళీ।
హోలీ। హోలీ। హోలీ।

కూరగాయలమ్ముకొనేవాళ్ళపేట కలయా మహతో—'ఏమందోయ్ డాక్టర్ గారూ। హోలీ ఇప్పు డేముందండీ? ఆ రోజులు పోయాయి. ఒకప్పుడు గ్రామం లోని మునలివాళ్ళనందర్నీ నగ్నంగా నాట్యం చేయించేవాళ్లు। ఎప్పుడో ఒకసారి సంస్థాన మేనేజరు జాన్సన్‌తో మరో నలుగురైదుగురు అధికారులు వచ్చారు. వల్లటిపెట్టెలో కళ్ళుబెట్టి బొమ్మలు తీసుకున్నారు. ఆ తరువాత వాళ్ళ వంటవాడు చెప్పాడు - విదేశపత్రికలో ఆ ఫోటోలు వచ్చాయట। అందరూ నగ్నంగానే।' అని చెప్పుకపోయాడు.

కామ్రేడ్ వాసుదేవ్ 'భదౌవ్వా' గీతం పాడమంటున్నాడు—' సరికొత్త భదౌవ్వా పాడాలి. జర్మన్ భదౌవ్వా।'

ధాక్ ధిన్నా. తాక్ ధిన్నా।
ఏమయ్యోయ్ బ్రాహ్మడా।
మద్దుకు జాతి భేదం లేదయ్యా
మాలపిల్లను దాహమడిగితే
నూతినీళ్ళు ఇవ్వలేక కమలానదికి పరుగెత్తెనే
నీకోసం ఇల్లువదిలి
పాలిపిల్ల నీళ్ళుతాగవు. మానె అమ్ముకునే
పిల్ల నీళ్ళు నీకు పనికిరావు
గంగా యమునలలో స్నానమాడతావు

రాత్రింబగళ్ళు పూజలు సల్పుతావు
రాత్రికి తాంత్రికులపేట సందుగొందుల్లో
తిరుగుతావు।

ఎవరూ పెద్దగా భావించకూడదు। ఇది హోలీ పండుగ। హోలీ।

తాసిల్దారుగా రింటిగడపలో అడుగుపెట్టేప్పటికి డాక్టర్ మొహం ఎర్ర రంగుతో నిండిపోయింది. డాక్టర్ కళ్ళు మూసుకపోయాయి. అయితే స్పర్శనుబట్టి అతని కర్థమైంది—రంగు ఎవరు పూసిందీ। కమల।....వసంతోత్సవ కమల। డాక్టర్ ఎప్పుడో ఏదో పత్రికలో చూసిన 'మైథిలి' అనే చిత్రం గుర్తుకు తెచ్చుకోవడానికి ప్రయత్నించారు....ఎవరా చిత్రాన్ని గీచిన చిత్రకారుడు?

'డాక్టర్‌గారిదగ్గర బుక్కా లేదూ, రంగూ లేదు. అంత పక్షపాతం పనికి రాదు. తీసుకోండి డాక్టరుగారూ। ఇది బుక్కాపొడి. ఈ బొక్కెనలో రంగూ వున్నది।' అమ్మ ఇద్దాళ్ళ చాలా ఆనందంగా ఉన్నది. క్రిందటిసంవత్సరం ఈ వాకిట్లోనే ఏడుపులు పెడబొబ్బలు వినిపించాయి; ఈ సంవత్సరం తన కూతురు ఎంతో సంతోషంతో గెంతుతున్నది. అంతా ఆ భగవంతుడి లీల।

పాపం డాక్టర్‌కు రంగు పూయడంకూడా చేతకాదు. చేతిలో రంగుపొడి తీసుకొని నిలబడ్డారు. ఎక్కడ రంగు పూయాలా అని మొహంవైపుచూస్తూ ఆలో చిస్తున్నారు.

'మీ చేతులు కొంచెం చాపండి.'

'ఎందుకు?'

'చేతిమీద రంగు వేస్తాను.'

'మీరు హోలీ ఆడుతున్నట్టా, లేక ఇంజెక్షన్ చేయబోతున్నారా? పాపిటిలో సిందూరం నింపడానికి నిలబడ్డట్టు నిలబడ్డారు.' కమల చిరునవ్వు చిలకరించింది. రంగుల చిరునవ్వు.

డాక్టరు వెనుకటిలాగా కమల మాటల్ని ఐద్బులో మాట్లాడే మాటలుగా భావించడంలేదు. ఇంతటి హృదయానికి విందైన వసందైన చిరునవ్వు ఇంతవరకు ఆయన చూడలేదు. వికారశూన్యమైన, ఆరోగ్యవంతమైన చిరునవ్వు. కమల అవ

యువాలన్నీ ఎందుకో ఆనందంతో చిందులు తొక్కుతున్నాయి. డాక్టర్ తన గుండె దడను స్పష్టంగా వినగలుగుతున్నాడు. అతని లలాటంమీద ఇవ్వాళ్ళకూడా చెమట బిందువులు తళతళా మెరుస్తున్నాయి. ఎదురుగా గోడకు ఒక పెద్ద అద్దం ఉన్నది. అందులో తనరూపు చూసుకున్నాడు. డాక్టర్....లలాటంమీద చెమటబిందువులు వరుడి లలాటంమీద చందనపు చుక్కలతో అలంకరించినట్టుగా ఉన్నది....డాక్టర్‌కు భవభూతి మాధవ మాలతి గుర్తుకొస్తుంది. హోలీని మొదట్లో మదనమహోత్సవం అనేవారు. లేత మామిడికొమ్మలతో మదనపూజ జరిగేది। ఈ మదనోత్సవంరోజునే మాలతీమాధవులచూపులు కలిశాయి. అప్పుడే ప్రేమబంధంలో బంధించుకు పోయారు. రాధేశ్యామ్ హోలీ ఆడినచోటు।

డాక్టర్ ఉన్నరంగంతా కమలమీద గుమ్మరించాడు. శిరస్సు ఎర్రటిరంగుతో నిండిపోయింది - మొహంమీద, కపోలాలమీద, నాసికమీద, అంతటా నిండి పోయింది....అరచెక్కమీద సిందూరం వేసినప్పుడు, అది ఆమె ముక్కుమీదపడితే, తన భర్తకు అత్యంత ప్రీతిపాత్రురా లవుతుందని అంటారు.

... బసీ మచాయో హోలీరే

కనకభవన్ మేం శ్యామ్ మచాయో హోలీ।

## ఇరవై ఐదు

బావన్‌దాసు ఈమధ్య విచారగ్రస్తంగా ఉంటున్నాడు.

'దాసుగారూ। చున్నీ గోసాయిగారి సంగతులేమిటి?' రాత్రిపూట పడుకో బోయేప్పుడు బాలదేవ్ బావన్‌దాసును అడిగాడు.

'చున్నీగోసాయి సోషలిస్టుపార్టీలో చేరిపోయాడు।'

బాలదేవ్ ఆశ్చర్యంతో నోరు తెరుచుకొని అలాగే వుండిపోయాడు.

బాలదేవ్‌భాయీ। ఇందుకు ఆశ్చర్యపడవలసిందేమీ లేదు. భగవంతుడు ఏం చేసినా మంచికే చేస్తాడు.'

'మీకు గుర్తున్నదా, దాసుగారూ, చన్నన్ పట్టీలో సభ జరిగినప్పుడు తివారీగా రిచ్చిన ఉపన్యాసం, తనుక్ లాల్ పాటలూ? అవి గుర్తుకొస్తే నాకెంతో ఉద్రేకంగా ఉంటుంది....గంగాయమునల ధారగా....'

'బాలదేవ్! భారతమాత ఇంకా ఇప్పటికీ కన్నీరు కారుస్తూనే వున్నది.' బావన్‌దాసుకు నిద్ర వస్తున్నది.

బాలదేవ్ ఉలిక్కిపడతాడు. భారతమాత ఇంకా ఇప్పటికీ కన్నీరు కారుస్తున్నదా? ఆఁ? బావన్‌దాసు అనేదేమిటి?

'బావన్‌దాసు అటుపక్కకు ఒత్తిగిలి - 'విదేశీవస్త్ర బహిష్కరణోద్యమం రోజుల్లో దాన్‌మల్ - సాగర్‌మల్ దుకాణందగ్గర పికెటింగు చేసినరోజు మీకు గుర్తున్నదా బాలదేవ్? మార్వాడీ దాన్‌మల్ కొడుకు సాగర్‌మల్ స్వయంగా తన చేతులతో వాలంటీర్లను బావచితక గొట్టాడు. వాలంటీర్లను జైల్లో పడెయ్యమని గవర్నమెంటుకు ఎదురు డబ్బిచ్చాడు. ఆ సాగర్‌మల్ ఈనాడు నరపత్‌నగర్ ఠాణా కాంగ్రెసు అధ్యక్షుడు. ఇంకా వింటావా? దులార్‌చంద్ కాప్రాను ఎరుగుదువుగా? జూదం కంపెనీవాడు లేడూ, నేపాలీ ఆడపిల్లల్ని తీసుకొస్తున్నప్పుడు జోగ్‌బనీలో పట్టుబడ్డాడే వాడు, వాడు కటహాఠాణా కాంగ్రెసు సెక్రెటరీ!....భారతమాత ఇప్పటికీ ఇంకా కన్నీరు కారుస్తున్నదయ్యా!' అని అన్నాడు.

బాలదేవ్‌కు మరింత ఆశ్చర్యం వేసింది. బావన్‌దాస్‌తో మరికొన్ని విషయాలు చర్చించాలనుకున్నాడు. కాని బావన్ గురక ప్రారంభించాడు....బాలదేవ్‌కు తల తిరిగిపోయింది. అతనికేమీ బోధపడడం లేదు. భారతమాత కన్నీరు కారుస్తున్నది.

బావన్‌దాసు, చున్నీగోసాయి, బాలదేవ్! ముగ్గురూ ఒకేరోజున ఈ ప్రపంచ మాయామోహాన్ని త్యజించి స్వరాజ్యఉద్యమంలో తమపేర్లు నమోదు చేయించుకున్నారు.

గృహస్థుడయిన చున్నీగోసాయి నాలుగు బీఘాలపొలం, నాలుగైదు మామిడి చెట్లు, ఒక ఆవు, ఇద్దరు చిన్నపిల్లల ఏకైక సంరక్షకుడు. ధర్మభీరువు. చునవపట్టీ సభకు హాజరైనాడు. తివారీ ఉపన్యాసం ఇచ్చాడు. తనుక్ లాల్ పాటలు పాడాడు.

వణికులంతా కన్నీరు కార్చారు. చన్నీదాసు మనసులోని మలినంకూడా కన్నీటి ద్వారా ప్రక్షాళనమైంది. అరోజే స్వరాజ్యోద్యమంలో చేరాడు. రాట్నం-మగ్గం. త్రివర్ణపతాకం. ఖద్దరు ఈ వస్తువులు మినహా తక్కినవన్నీ మిథ్య. స్వదేశివస్త్రాలు. విదేశీవస్తువుల బాయకాట్।

దేశంలోని ధనధాన్యాలన్నీ విదేశాలకు వెడుతున్నాయి.

ధరలుమండి ప్రతిఏడూ కర్షకులు కష్టాలు పడుతున్నారు।

గాంధీబాబా నువ్వే రక్ష। గాంధీమాత్రం ఒంటరిగా ఏం చేయగలడు; దేశంలోని ప్రతివ్యక్తి కర్తవ్యం....।

ఏం చేయగలడు గాంధీమాత్రం ఒంటరిగా
తిలక్ పరలోకంలో వుండే
సరోజినీదేవి ఆశకూడా పోయె।

గాంధీజీ రక్షించాలి। చన్నీదాసుకు నువ్వే రక్ష ప్రభో। విదేశవస్త్రాల బహిష్కరణ।....ఉప్పు సత్యాగ్రహం....జైలు....। సోదరులారా గంజాయి సారా మానండి. జైలు. వ్యష్టి సత్యాగ్రహం....జైలు....1942....జైలు. చన్నీగోసాయి అన్నీ కలుపుకొని పది పర్యాయాలు జైలుయాత్ర చేశాడు.

చివరకు అతగాడు సోషలిస్టుపార్టీలో చేరాడు.

బావన్‌దాసు।

పూర్వజన్మ సుకృతమో లేక విధివిలాసమో। ప్రకృతి పొరపాటు లేదా థాయరాయిడ్. థాయిమీస్ ప్యుటిటరీ గ్లాండ్స్ మార్పు। మూరన్నర పొడవు. చామన చాయ. లావాంటి పెదవులు. ఆశ్చర్యాన్నికలిగించే గడ్డం. జుగుప్సను కలిగించే మొరటుగొంతు. ఎత్తుకో పోల్చిచూస్తే కంఠం పదిరెట్లు ముదురుగా అనిపిస్తుంది. విచిత్రమైన నడక. దొర్లిపోతున్నట్లుగా ఉంటుంది. కులం గోత్రం తెలియను. జన్మత: సాధువు. ప్రజలదృష్టి ఇట్టే ఆకర్షింపజేస్తాడు. ఆశ్చర్యకరమైన చిరునవ్వు. వెంట పిల్లలవందు. తమాషా। కుక్కలు మొరుగుతాయి. మనుష్యులు నవ్వుతారు. గర్భవతులైన స్త్రీలు తప్పుకుంటారు. అతన్ని జనం తమాషాగా చూస్తారు. నంతోషిస్తారు। ఆయితే ఇందుకు ప్రతిఫలం ఎందుకు అడగకూడదు?

....అమ్మా, తినడానికి పెట్టండి! భగవంతుడు మీకు మేలు చేకూర్చాలి! సీతారామ్! సీతారామ్!!

చందన్‌పట్టీలో ఆనాటి సభ, తివారీ ఉపన్యాసం, తనుక్‌లాల్ గీతాలు ఈ మూరవ్నర మరుగుజ్జునుకూడా కదిలించివేశాయి. పూర్వజన్మలో చేసుకున్న పాపానికి ఫలితం అనుభవిస్తున్నాను. ఈ శరీరం ఉండి లాభమేమిటి? గాంధీగారి చరణాలకు అర్పించు. భారతమాతకోసం!

దేశంకోసం ఫకీరాయెను.

రాజేంద్రప్రసాదు దీనుడాయెను దేశవాసులారా!

అతగాడు ఎలాగూ ఫకీరే! చన్నీగోసాయి తనపేరు రాయించుకున్నాడా? నా పేరుకూడా రాసుకోండి! ...రామక్రిష్ణబాబు భార్య అతన్ని చూడడంతోనే బిగ్గరగా అనేసింది—'భగవాన్! బాపన్‌భగవాన్!' ఆమె పూర్తియా ఆహ్వానించింది.

సీతారామ్! సీతారామ్!! వందేమాతరం! వందేమాతరం!!

జిల్లా రాజకీయాల జనకుడైన రాజకిషన్‌బాబు బంగళాలో హాజరైన రోజున పోలీసుల లారీ ఒకటి అక్కడ ఆగింది. ఇనస్పెక్టర్ ఎదురుచూస్తున్నాడు. రామకిషన్‌బాబు అభారాణికి ఏవేవో నిర్దేశాలిస్తున్నాడు.

వందేమాతరం! వందేమాతరం! 'తుమిజావో ఆమార్‌జన్యే భేబోనా, ఓయీధ్యాకో భగవాన్ ఆమార్‌కాఛేని జేయీ ః స్‌గొఫేన్!' అభారాణి నేత్రాలు ఆనందంతో మెరిశాయి.

అభారాణి బాపన్‌దాసును 'భగవాన్' అనేపేరు వదిలి మరోపేరుతో ఎప్పుడూ పిలవలేదు.

కొన్నిరోజులతరువాత అభారాణికూడా అరెస్టయింది. బాపన్‌కూడా పట్టుబడ్డాడు. పోలీసులు నాలుగుదెబ్బలుకొట్టి వంపించేదామనుకొన్నారు; కాని మొదటి దెబ్బ అతన్ని ఆదుకొనడానికి వెళ్ళేప్పటికి అభారాణికే తగిలింది. పోలీసులకు ఏం చేయాలో తోచక బెంబేలు పడిపోయారు....'ఆ మార్ భగవాన్‌కే మారోనా'....

రక్తంతో తడిపిన తెల్లటి అద్దరుపీరె. రాతినిసైతం కరిగించే కరుణాపూరిత కంఠం— 'అమార్ భగవాన్' బావన్ పూర్వజన్మ పాపకృత్యాలన్నీ ఒక్కసారిగా పుణ్య కార్యాలుగా మారిపోయాయి. ఎండినమోళ్లు చిగిర్చాయి. అతని ముదురుకంఠం నుంచి వెలువడింది—'అమ్మా!'

అమ్మ! మహాత్మాగాంధీజీకూడా ఆభారాణిని అమ్మా అనే అనేవారు! 1934 లో భూకంప పీడితప్రాంతాలను పర్యటించడానికి వచ్చినప్పుడు ఆయనవెంట రామకిషన్‌బాబు, ఆభారాణి, బావన్‌దాసు ఉన్నారు. బావన్‌దాసులేని ఆభారాణి ఒక్క అడుగుకూడా ఎక్కడికీ వేయదు. గాంధీజీ నవ్వుతూ అన్నారు— 'అమ్మా, నీ భగ వాన్ అంటే నాకు ఈర్ష్యగా వున్నది సుమా!' పళ్ళులేని ఆ బోసినోటి పవిత్రమైన నవ్వు, పసిబాలల నవ్వులాంటిది.

పుల్‌కాహాబజారు, లక్షలాది జనసమూహం, ఎత్తయిన వేదిక - 'మహాత్మా గాంధీకీ జై! ఉండి ఉండి ఆకాశం ప్రతిధ్వనించిపోతున్నది. జై! ఆకాశం కదిలి పోతున్నది. తొక్కిసలాట! పుష్పవృష్టి....చరణమూళి....బిగుల్... వాలంటీర్లు.... చుట్టూ విలబడండి, చుట్టూ నిలబడండి!

వేదికమీద రామకిషన్‌బాబుని, ఆభారాణి సహాయంతో గాంధీజీ....ఆ గాంధీ జీయే....జై! జై!....ఆభారాణి చేయూత ఇచ్చి మరొకరెవరినో వేదికమీదికి రప్పించింది. ఎవరు? బావన్‌దాసు, మరుగుజ్జు, గాంధీజీ వేలెత్తి అందర్నీ ప్రశాం తంగావుండమని చెప్పారు....ఆ లక్షలాది జనంముందు బావన్‌దాసు భంజరు వాయించి పాట పాడాడు— 'ఏక్ రామనామ ధన్ పాంచా జగమేం కఛున బాంచా హో!' ఆ కంఠం ఎక్కువదూరం వినిపించలేదు కాని బావన్‌దాసు, ఈ మూడన్నర మరుగుజ్జు ఎంత పెద్దవాడైపోయాడు! మహాత్మాజీ భిక్ష అడిగారు. హరిజనులకు దానం చెయ్యమన్నారు. రూపాయలసంచులు, బంగారపు ఆభరణాలు - ఉంగరాలు, గొలుసులు, గాజులు, చిల్లరడబ్బులు - అర్ధరూపాయలు, పావలాలు, బేడలు, అణాలు, రాగిముక్కలు! ఎంత ఇచ్చినా బావన్‌దాసును మించడం అసాధ్యం!

బావన్‌దాసుకు కుబేరుడి ఖజానా లభించినట్లయింది. మోడు చిగిర్చించింది బాపూ!

1937. పండిత జవహర్‌లాల్ నెహ్రూ ఎన్నికలపర్యటన గావించారు. బావన్‌దాసును ఆశ్చర్యంతో కొన్నిక్షణాలు అలాగేచూస్తూ ఉండిపోయారు. ఆ తరు వాత ముక్కుమీద వేలువేసుకొని. గంగూలిని ఇంగ్లీషులో అడిగారు - 'ఐ కాంట్ రిమెంబర్ ది నేమ్ ఆఫ్ దట్ బుక్' (నాకా పుస్తకం పేరేమిటో గుర్తుకు రావడం లేదు.)

'కింగ్ ఆఫ్ ది గోల్డన్ రివర్!' గంగూలీ వెంటనే సమాధానం చెప్పారు. ఆ తరువాత ఇద్దరూ ఒక్కసారిగా నవ్వారు.

ఇప్పుడు బావన్‌దాసు భజనలు పాడడమేగాక, ఉపన్యాసం ఇవ్వడంకూడా నేర్చుకున్నారు. మాట్లాడడానికి లేచారు. మైక్‌స్టేండ్ చాలా ఎత్తుగా వున్నది. ఆపరేటర్‌కు ఏం చేయాలో తోచలేదు. ఆ తొందర్లో ఏం చేస్తారు? కాస్సేపు కిందికీ, కాసేపు పైకీ అమర్చారు; అయినా మైక్ ఇంకా ఎత్తుగానే వున్నది. నెహ్రూజీ వెంటనేలేచి మైక్ పట్టుకొని బావన్‌దాసు నోటిదగ్గరకు తీసుకెళ్ళి 'మాట్లా డండి' అని అన్నారు. జనం గొల్లుమన్నారు. బావన్ కొంచెం జంకారు. నెహ్రూజీ నవ్వి ఆయనమెడలో పూలదండవేసి 'మాట్లాడండి' అని అన్నారు. పత్రికావిలే ఖర్లు విలువైన కెమేరాలు ఒకేసారి క్లిక్‌మన్నాయి. 'నేషనల్ హెరాల్డ్' మొదటి పేజీలో పెద్దఫోటో అచ్చయింది - బావన్‌దాసు మెడలో పుష్పహారం, నెహ్రూజీ చేతిలో మైక్ పుచ్చుకొని వంగి నవ్వుతున్నారు. ఆ చిత్రంపైన - 'మైక్ ఆపరేటర్ నెహ్రూ' అని రాశారు.

ఆగస్టు 1942. కోర్టుమీద దండయాత్ర. ధం ధాం! పోలీసులు గాలిలోకి కాల్చారు. జనం పరుగులు తీస్తున్నారు. బావన్‌దాసు ఛాలెంజి చేశారు. జనం వెనక్కు తిరిగిచూశారు. మూరన్నరమనిషి రొమ్ము విరుచుకొని నిలబడ్డారు. జనం తిరిగొచ్చారు. బావన్‌దాసు పోలీసుల కాళ్ళకిందుగా వెళ్ళిపోయారు. త్రివర్ణపతాకం గాలిలో రెపరెపలాడింది. మహాత్మాగాంధీకీ జై!

బావన్‌ను గాంధీజీ ఎరుగు; నెహ్రూజీ ఎరుగు. రాజేంద్రబాబుకుకూడా గుర్తే! ప్రాంతంలోని నాయకులు, రాజకీయ కార్యకర్తలు అందరూ ఎరుగు. క్యాంపుజైలు సూపరింటెండెంటు దుర్మార్గానికి వ్యతిరేకంగా ఖైదీలందరూ సామూ

హూక నిరాహారదీక్ష వహించారు. చివరివాకా ఆ దీక్షను నిర్వహించింది. బావన్ దాసు. చన్నీ గోసాయిమాత్రమే! పాతికరోజుల నిరాహారదీక్ష. రెడర్‌ఫోర్డ్, ఆర్చర్ పీర్స్‌ద్దర్శి చూడాలనే కోర్కెను వెలిబుచ్చారు. గాంధీజీ కఠోరపరీక్షలో, సత్యపరీక్షలో, సత్యాగ్రహపరీక్షలో సిగ్గుతేలిన ఇద్దరు కురూపులు! అసహ్యమైన మనుష్యులు!

స్వరాజ్యోద్యమంలో చేరినతరువాత రెండుపర్యాయాలు బావన్ మాయా మోహజాలంలో చిక్కుకోబోయి జాగ్రత్తపడ్డారు. మహాత్మాజీ దయ!

ఒకసారి రామక్రిష్ణబాబు సిమర్‌బనీనుంచి 'పిడికెడు దానంగా' లభించిన బియ్యం తీసుకరమ్మని పంపించాడు—'బియ్యం అమ్మేసి డబ్బు తీసుకరా!' అయిదు రూపాయల మూడణాలు. తిరిగొస్తూ సిమరాహా స్టేషన్‌లో జగమోహన్‌సాహ దుకాణంలో దహీచూడా తిందామని వెళ్లాడు. జగమోహన్‌సాహ జిలేబీలు వండుతున్నాడు. జిలేబీలు తిని చాలాకాలమైంది. చివరకు బావన్‌దాసు దహీచూడాతో పాటు రెండణాల జిలేబీలు కూడా తినేశాడు.

అవి పొట్టలోకిపోయాక అతనికి అకస్మాత్తుగా జ్ఞానోదయమైంది. అతని కళ్ళఎదుటనుంచి మాయామోహపుతెర తొలగిపోయింది. ఈ డబ్బులు ; 'పిడికెడు దానం' బియ్యం ; అతని కళ్ళముందు గ్రామాల్లోని స్త్రీబొమ్మలు కదలినాయి.

....ఎంతో శ్రద్ధాభక్తులతో ఒక పిడికెడు బియ్యం గాంధీజీపేర కుండలో వేస్తున్నారు....'కూలిచేసుకొని దానివల్ల వచ్చినదాంట్లోనుంచి ఒక పిడికెడు బియ్యం ఆకలిగొన్న పిల్లలపొట్టలుమాడ్చి ఒక పిడికెడుబియ్యం!....బావన్ ఆ డబ్బుతో తన జిహ్వ చాపల్యానికి దాసుడైనాడు. వ్రతభంగం! తపోభ్రష్టత్వం! గాంధీమే రక్ష! క్షమించు! బావన్ చిన్నపిల్లవాడిలాగా ఏడవసాగాడు. కళ్ళనుంచి ప్రవాహంలాగా కారింది. నోట్లో వేళ్ళుబెట్టుకొని తిన్నది వాంతి చేసుకొనడానికి ప్రయత్నించాడు. ....సీతారామ్! సీతారామ్!! రెండురోజులు ఉపవాసం. ఆత్మశుద్ధి. ప్రాయశ్చిత్తం! రామక్రిష్ణబాబు ఎంతగానో బతిమలాడాడు; ఆభారాణి వడ్డించిన పళ్ళెం ముందుంచి ఎదురుగా కూర్చున్నది. కాని బావన్ ఉపవాసాన్ని విరమించుకోలేదు. 'అమ్మా! ఈ అపవిత్రమైన మనస్సును శిక్షింపనివ్వు! అశుద్ధాత్మ నన్ను బాపూజీ చూపిన మార్గంనుంచి వేరు చేస్తుంది.'

రెండవ ఘటన—

ఉప్పుసత్యాగ్రహ సందర్భంలో శ్రీమతి తారావతీదేవి పాట్నానుంచి వచ్చింది. ఆమె మాటల్లో ఎంతో ఆకర్షణ వున్నది. ఆమె వెళ్ళినచోటల్లా ప్రజలు ఆమె ఉపన్యాసం వినడానికి గుమిగూడేవారు! యౌవ్వనంలో వున్న స్త్రీ. తలమీద ముసుగు ఉండేదికాదు; దుర్గాదేవిలాగా తేజోవంతంగా ఉండేది. ప్రభుత్వాన్ని హడలుగొట్టేది!....'కొద్దిపాటి ఇంగ్లీషువాళ్ళను మనం ఓడించేద్దాం. తుపాకిగుండ్లు, ఉరికంబాలు - వీటిని మనం లెక్కచేసేదిలేదు; పోలీసు ఇన్‌స్పెక్టర్లు భయంతో వణికిపోతూఉండేవారు. 'ఇంగ్లీషువాళ్ళ ఎంగిలాకులు నాకే ఈ భారతీయ కుక్కలు!' సాక్షాత్తు భగవతీస్వరూపం! సభ ముగిశాకకూడా ఆమె నివాసస్థానంవద్దకూడా జనం గుమిగూడేవారు. ఎంతోమంది పిల్లలులేని గొడ్రాలి ఆడవాళ్ళు ఆమె చరణ ధూళి తీసుకునేందుకు వచ్చేవారు. భగవతి! ఆమె భోంచేసేసమయంలోను, విశ్రాంతి తీసుకునే సమయంలోకూడాను జనం ఆమెకోసం నిలబడివుండేవారు! చివరకు వాలంటీర పహరా ఏర్పాటు చేయవలసి వచ్చింది.

ఒకరోజున చందన్‌పట్టీ ఆశ్రమంలో మధ్యాహ్నపువేళ తారావతి మంచంమీద విశ్రాంతి తీసుకుంటున్నది. ఎదురుగా వున్న తలుపుకు కర్టెన్ వున్నది. కర్టెను ఆవతల బావన్‌దాసు డ్యూటీలో వున్నాడు! ఫాల్గుణమాసం. మధ్యాహ్నపువేళ! మామిడిపూత సువాసనను వెదజల్లుతూ గాలి తెరలనుదాటి లోపల ప్రవేశిస్తున్నది. తారావతికి కునుకుపట్టింది. బావన్ కదులుతున్న తెరలపక్కనుంచి లోపలికి తొంగి చూశాడు. అతనిగుండె ఒక్కసారిగా ఆగిపోయినంత పనయింది; ఎవరో వెనుక నుంచి తోసినట్టనిపించింది. తెరలను ఊపుతున్న ఫాల్గుణమాసపుగాలి బావన్ హృదయాన్నిసైతం ఉయ్యాల లూపింది. బావన్ ఒకపర్యాయం నాలుగువైపులా చూశాడు. మంత్రముగ్ధుడై చూస్తూనే ఉండిపోయాడు. మంచంమీద యౌవ్వనంలో వున్న స్త్రీ నిద్రపోతున్నది! చెదిరిన ఉంగరాల ముంగురులు, ఎదురురొమ్ముమీది నుంచి కిందికి జారినపైట; ముడి ఊడిపోయిన ఖద్దరు రవికె ... ఖద్దరుగుండీలు!.... ఆశ్రమంతోటలోని ఇంగ్లీషు పూలు—'గమ్‌పోర్నా'ను రావుత్ మేకవచ్చి రోజూ తినేసి వెడుతూఉంటుంది. బావన్‌కాళ్లు వణికాయి. ముందుకు వెళ్లాలనుకున్నాడు! అతడు పశువు! ఈ స్త్రీ బట్టల్ని చింపి ముక్కలు ముక్కలు చేయాలనుకొన్నాడు.

తన వాడిగలగోళ్ళతో ఆమెదేహాన్ని చీల్చివేయాలని. ఒక పెద్ద గావుకేక వినాలని తన దవడలతో ఆమెను ఉక్కిరి బిక్కిరి చేయాలని ఆకాంక్షించాడు....ఆ యౌవ్వనంలోవున్న స్త్రీని చంపేయాలనుకున్నాడు....హత్య చేయాలనుకొన్నాడు! అరే! ఎదురుగావున్న కిటికీలోనుంచి ఎవరు చూసేది? గాంధీజీ చిత్రపటం! చేతులు జోడించి నవ్వుతున్నాడు గాంధీజీ! బాబా! కణకణమండే నిప్పుమీద ఒక కడవ నీళ్ళు! బాబా! క్షమించు! క్షమించు! రెండు కడవలనీళ్ళు! నువ్వేరక్ష బాపూ! నీళ్ళు నీళ్ళు నీళ్ళు! చన్నీళ్ళు! చలి!....

బావన్ కళ్ళు తెరిచాడు! రామకృష్ణబాబు తడిపట్టీ వేస్తున్నాడు అమ్మ విసురుతున్నది. గంగూలీ మెదలకుండా నిలబడివున్నారు; గాభరాగా తారావతి— 'కేకవిని నాకు మెళకువ వచ్చింది! చూస్తునుగదా. ఈయన కిందబడి కొట్టుకుంటున్నాడు!' అని చెప్పింది.

రెండవరోజు అభారాణి ఒక గ్లాసెడు టొమాటోరసం ఇస్తూ—'భగవాన్ ఆజ్ సేకే తొమాయ్‌కోజ్ ఏక్ గిలాస్ ఏయీ రస్. ఆర్ రాత్రే. దూధ్ ఖేత్ హబే!' అని అన్నది.

['భగవాన్। ఈరోజునుంచి రోజూ ఒక గ్లాసు ఈ రసం. రాత్రిపూట పాలు తీసుకో!']

కాని బావన్ వారంరోజుల ఉపవాసవ్రతం బూనాడు. ఆత్మశుద్ధి. ఇంద్రియ శుద్ధి. ప్రాయశ్చిత్తం! అభారాణి చివరకు ఓడిపోయింది. 'అయితే నేనూ తినను!' అని బెదిరించి వెళ్ళిపోయింది. బావన్ గంగులీదగ్గరికెళ్ళి తన కథంతా విప్పించాడు- 'గంగూలీగారూ! అమ్మకు మీరు వివరించి చెప్పండి. నేను ఉపవాసవ్రతాన్ని మానలేను. మోహజాలం....!'

గాంగూలీ నవ్వుతూ అభారాణితో చెప్పాడు—'భగవాన్ వ్రతభంగం చేయడం అసంభవం. కారణం: చాలా పెద్దది। మీరు అదృష్టవంతులు. అతనికి సూరదాసు కథ గుర్తుకు రాలేదు; లేకపోతే భగవాన్ రెండుకళ్ళూ ఉండేవి కాదు!'

అభారాణి చకితురాలై గంగూలీవైపు అలాగే చూస్తుండిపోయింది— 'కీ జాపీ బాపూ!'

దేవతలు, దేవాలయాలూవున్న బెనారెస్‌లో ఉంటూకూడా అధారాణికి అన్నిటికంటే ముందు భగవాన్ గుర్తుకొస్తూ ఉంటాడు! అప్పుడప్పుడు గంగూలీకి పేర మసీఅర్థరు వస్తుంది—'భగవానేర్ కాపడేర్ అన్య, భగవానేర్ దూధేర్ జన్య' అని. ఆ బావన్‌దాసే ఇప్పు డంటున్నాడు—'భారతమాత కన్నీరు మున్నీరుగా ఏడుస్తున్నదని!'

బాలదేవ్‌కు దాని లక్ష్మి గుర్తుకొస్తున్నది. ఆమెకూడా ఏడుస్తున్నది! కాని కాళీచరణ్? సోషలిస్టుపార్టీ!

బాలదేవ్ ఇంతమాత్రానికే విరాశపడడు. అతనికి నిద్ర రావడంలేదు. చాలా నల్లులున్నాయి. ఆc. రేపు అతను బావన్‌దాస్‌ను అడగాలనుకుంటున్నాడు—'ఏమయ్యా, ఇంటో నల్లులు ఎక్కువగాఉంటే ఇంటికి నిప్పు పెట్టవలసిందేనా?'

## ఇరవయ్యారు

బాబూ హరగౌరీసింగ్ పారబంగాప్రాంతానికి కొత్త తాసిల్దారుగా నియమింపబడ్డాడు. విస్తంత్రి సుమరితదాసు అందరికీ చాటింపు వేసేస్తున్నాడు—'చూశారా చూశారా! కాయస్థుడి ఎంగిలాకులో రాజపుత్రుడు తినేస్తున్నాడు. తాసిల్దారు విశ్వనాథబాబును పారబంగా రాజకుమార్ పిలిచి ఎంతగానో చెప్పారు. అప్పుడు తాసిల్దారు ఏమన్నాడో తెలుసా? ఒకసారి కింద ఉమ్మేసినతరువాత దాన్ని మళ్ళా నాకటం మనిషి అనేవాడు చేయవలసిన పనికాదు....తాసిల్దారు పదవిలో పెద్ద ఆకర్షణేమీ లేదిప్పుడు! ఎండిన ఎముకలాంటిదంటే నమ్మండి!'

నిజంగానే ఇప్పుడు తాసిల్దారుపదవిలో పెద్ద ఆనందమేమీ లేదు. కాలం మారిపోయింది. తాసిల్దారు తండ్రి దేవనాథ్‌మల్లిక్ ఆయిదురూపాయల నెలజీతం మీద ఈ పదవికి వచ్చాడు. మరి పైరాబడి? మూడుసంవత్సరాలు గడవకముందే ఎనభై తొంభై బీఘాల పారవంతమైన భూమికి యజమాని అయ్యాడు. నిజమైన ఆదాయమంటే పైపైనవచ్చే ఆదాయమే! మరి తాసిల్దారు హంగూ ఆర్భాటాన్ని గురించి ఇక చెప్పవలసిం దేముంది? తాసిల్దారు పొలాలో పనిచేసేవాళ్ళకు కూలి

అనేది ఇవ్వడం జరిగేది కాదు. పారబంగాలప్పేటు రాజా అయితే తిరహుత్‌లోనే వుండేవారు! ఎవరూ ఆయనను చూసినపాపానకూడా పోలేదు. దేవనాథ్‌మల్లిక్ అసలు రాజాగానే వ్యవహరిస్తూ ఉండేవారు. అప్పుడు కతిహార్‌పట్టణం సరిగా ఏర్పాటుకూడా కాలేదు. వృద్ధుడయిన తాసిల్దారు పంపుతరిగిన సలీమ్‌షాహీ చెప్పులు పదేఁకింద మేకులు, నాడాలు కొట్టించి మరీ తెప్పించుకునేవారు. మూడుమాసాలకే మేకులు పోయేవి! ఆయనకు కొంచెం చెవుడు ఉండేదట; అందుకని చాలా తక్కువగా మాట్లాడేవారని, ఒకవేళ మాట్లాడడం ప్రారంభిస్తే—'నాయాల్ని పది చెప్పు దెబ్బలు కొట్టు!' అనేవారట! కమలానది పక్కనున్నగుంటలో జలగల్ని పెంచే వారు; నజారానాలు ఇవ్వడం ఎవరైనా ఆలస్యంచేస్తే ఆ గుంటలో నాలుగుగంటల పాటు విలబెట్టేవారట! కిందినుంచి పైదాకా జలగలు గజ్జెల్లాగా వేలాడేవట!.... ఆ రోజులు ఆ ముసలి తాసిల్దారుతోనే అంతరించిపోయాయి.

సీలికొరకం అన్యాయాలుకూడా ఎక్కువయ్యేప్పటికి ప్రతిచోటా రైతులు తిరుగుబాటుచేయడం ప్రారంభించారు. అప్పుడు జమీందార్లు తాసిల్దార్లకు, కరణా లకు గుప్తపత్రమానాలు పంపించారు. రైతులపట్ల కటువుగా ప్రవర్తించవద్దని!

విశ్వనాథ్‌బాబుకూడా బాగానే వ్యవహరించాడు. రైతులపట్ల కఠినంగా ఉండవలసిన అవసరమెప్పుడూ ఆయనకు కలగలేదు. ఎందుకంటే ఆయన పూర్వీకులు తాసిల్దారువల్ల ఎలా వ్యవహరించుకోవాలో ఒక ఒరవడి విడిచిపెట్టి మరీ వెళ్ళారు. యమదూతయినా కొంచెం వ్యవధి ఇచ్చేవాడటగాని తాసిల్దారు అదికూడా ఇచ్చేవాడు కాదని ఒక లోకోక్తి ప్రచారంలో వున్నది. ప్రతిసారి గడువు పూర్తి కాకముందే జనరల్‌మేనేజరు దఫ్ క్యాంపు వేసేవాడు. ఆయనక్యాంపు రాకముందే పొలం దున్నుకునేవాళ్ళంతా నేపాలుజిల్లా మోరంగుకు పారిపోయేవారు.... బంగళాతోటలో ఎన్నో దేరాలు లేచేవి; షామియానాలు ఏర్పాటయ్యేవి! వందలాది సిపాయిలు, నాలుగు ఏనుగులు, కార్లు, వంటవాళ్ళు, వడ్డించేవాళ్ళు, మంగలి, చాకలి ఎందరో! అయిదుగ్రామాల ఎడ్లబళ్ళమీద ఈ గుడారాల సామాను వేసుకొని వచ్చే వాళ్ళు!

ఆ ప్రాంతంలో తనమాటంటే వినవివాళ్ళు, కొంచెం తలబిరుసుగా వ్యవహరించుకునేవాళ్ళ లిస్టు ఒకటి తాసిల్దారు ముందుగానే తయారుచేసి ఉంచేవాడు. ఇక

సుమరితదాసు పెద్దపెద్ద ఆసాములదగ్గరకువెళ్ళి అవతలకు తీసుకెళ్ళి ఆ జాబితాలో ఏ పేరు పైనే ఉన్నదని చెప్పేవాడు.

....ఆఁ. నా పేరు పైనే ఉన్నదా ? ఆ విన్నమనిషి నెత్తిన పిడుగు పడినంత పనవుతుంది.

ఎలాగైనాసరే ఆ పేరు కొట్టిపారేయించుకోవాలి !

ఈ పట్టిక తయారుచేసేప్పుడు తాసిల్దారు సుమరితదాసు సలహా కూడా తీసుకుంటూ ఉండేవాడు. సుమరితదాసు ఆ సంవత్సరంలో జరిగిన విషయాలన్నింటినీ గుర్తుకు తెచ్చుకుంటూ రాయించేవాడు—'అయ్యా! అనంతపర్వదినాన రణజీత్ పాలు తీసుకరావడానికి వెడితే గొల్లపేట సరకాడీ మా బర్రె ఎండిపోయిందని అబద్ధంచెప్పి వెనక్కి పంపించేశాడు.'

సాక్ష్యం చెప్పడానికి నిరాకరించిన వాళ్ళపేర్లు. రొమ్ము విరుచుకొని గర్వంగా నడుచుకుంటూ వెళ్ళేవాళ్ళపేర్లు. పంచాయతీసమావేశాల్లో సిపాయిలకు వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పినవాళ్ళపేర్లూ జమీందారు గుర్తుంచుకునేవాడు.

దఫ్‌గారికి కావలసింది పన్నులు వసూళ్ళుకావడం కాదు; సంస్థానం డాబూ దర్పాన్నిచూసి అంతా దాసోహమంటున్నారా లేదా అని చూసేవాడు ! 'మన స్టేట్‌లో దుర్మార్గులకు స్థానం లేదు. తాసిల్దారుతో అబద్ధాలు చెప్పకూడదు. మోసాలు, కుట్రలూ పనికిరావు. నువ్వు బద్మాష్‌వి !' అని అంటూ ఉండేవాడు.

'చతుర్ మండల్ !'

'అయ్యా!' చేతులుజోడించి ఒక అర్ధనగ్నంగావున్న మనిషి గడగడ వణుకుతూ నిలబడ్డాడు.

'నువ్వు సాక్ష్య మెందు కివ్వలేదు ?'

'అయ్యా. మీరే రక్షకులు !'

'రక్షకులు లేదు. భిక్షకులు లేదు ! నిన్ను మా సిపాయిలు కొరడాలతో కొడతారు !'

చటాక్ ! చటాక్ ! చటాక్ !....కొరడాదెబ్బలు పడుతున్నాయి.

'నువ్వు బేతరిపేనా, రాజపుత్రుడివా, మా తాసిల్దార్‌ను ఎందుకు అవమాన పరచావు?'

ఆ తరువాత సంవత్సరంపాటు అంతటా ప్రశాంతంగా వుంటుంది. తాసిల్దారు భయంతో జనం గడగడ వణికిపోతూ ఉండేవారు. మరి ఇప్పుడో, కాలం మారిపోవడమే కాదు, పూర్తిగా తల్లక్రిందు అయిపోయింది.

సింగ్ చాలా ప్రయత్నాలు చేసి హరగౌరీసింగ్‌కు తాసిల్దారుపదవి ఇప్పించారు. మేనేజరుకు నాలుగువందల రూపాయలు దక్షిణ అర్పించుకోవలసి వచ్చింది. ఛార్జి తీసుకునేప్పుడే ఎవరో తుమ్మారని చెప్పుకున్నారు. ఇక ఈ కొత్త తాసిల్దారు గారి హయాం ఎలా ఉంటుందో చూడాలి!

రాజపుత్రవీధి ప్రతిక్షత్రవాసీ ఎంతో సంతోషంగా వున్నారు. శివశంకర సింగ్ అందరితో—'హరగౌరి ఇంకో క్లాసు ఎక్కువ చదివివున్నట్లయితే మేనేజరు పదవి వచ్చివుండేదని చెబుతున్నారు.

నల్లటోపీవాళ్ళ సంయోజక్ క్లాసులో పాఠం చెబుతున్నారు—'తాసిల్దారుపదవి కాయస్థులచేతులు మారి, రాజపుత్రులచేతుల్లోకి వచ్చినట్టుగానే ఆర్యావర్తంలోని పూర్తికార్యభారం హిందువులచేతుల్లోకి వచ్చేస్తుంది. ఆరోజున ఆర్యావర్తం మూల మూలలా హిందూరాజ్యపతాకం ఎగురుతుంది.'

సిద్ధాంతి సలహా ఇచ్చారు—'లక్ష్మీపూజ చేసుకోకుండా ఖాతాపుస్తకాలు అంటుకోవడానికి వీల్లేదు. శుక్రవారం మంచిరోజు - కార్యారంభానికి, యాత్రలకు, గృహనిర్మాణానికి మొదలైనవాటికి!'

బాలదేవ్‌కు మాటిమాటికీ తను కలలో చూసినసంగతే గుర్తుకొస్తున్నది—విశాలమైన సభ. హరగౌరి లక్ష్మిమెడలో పూలమాల వేస్తున్నాడు.

కామ్రేడ్ కాశీచరణ్, వాసుదేవ్ పార్టీ కార్యకర్తలకు ప్రబోధించారు:—'పాత తాసిల్దారు గుడిమింగేవాడయితే, కొత్త తాసిల్దారు గుడిలో లింగాన్ని మింగే వాడు! దొందు దొందే। పళ్ళూడగొట్టించుకోవడానికి ఏ రాయి అయినా ఒకటే। ఇద్దరూ పరమదుర్మార్గులు. జమీందారుకు తొత్తులు। అందుకే సోషలిస్టుపార్టీ కార్యకర్తి సంఘర్షణకు సమాయత్తం కావాలన్నారు:'

బావన్‌దాసుకు ఈ గ్రామం కొత్త. అందుకే ఏమీ మాట్లాడడంలేదు. అసలు అతని మనస్సు సరిగాలేదు. ఎందుకో ఏమో।

చర్ఖా సెంటర్‌లో నాలుగైదు రాట్నాలూ, మగ్గాలూ ఉన్నాయి. పైగా రాత్రి పూట చదువుకూడా చెబుతున్నారు. ఆడవాళ్ళకు, పిల్లలకూ పంతులమ్మ చదువు చెబుతున్నది; ముసలివాళ్ళకు మాష్టరు చెబుతున్నారు. ముసలి విరించిదాసు పది రోజులనుంచి చదువుకోవడానికి వస్తున్నాడు. అయితే 'క' బదులు 'గ' తోనే కవర్గాన్ని ప్రారంభిస్తున్నాడు—'గ ఘ క ఙ'. మాష్టరుకు తికమకగా వున్నది. అతగాడి వ్యవహారం।

# ఇరవయ్యేడు

డాక్టర్ జీవితంలో ఒక నూతనాధ్యాయం ప్రారంభమైంది. ప్రేమ, చెలిమి, స్నేహం - వీటిని జీవశాస్త్రసిద్ధాంతాలతోనే కొలవడానికి నిత్యం ప్రయత్నించారు. హృదయం అనే వస్తువు మనిషిశరీరంలో ఉంటుందా? నాకు తెలియదులే, ప్రజలు 'లంగ్స్'ను హృదయమంటున్నారో లేక 'హార్ట్'ను అంటున్నారో నాకు బోధపడటంలేదు. ఏది ఏమైనా 'హార్ట్'కూ, 'లంగ్స్'కూ, లేదా 'లివర్'కు ప్రేమతో ఎటువంటిసంబంధమూ లేదు.' అని నవ్వుతూ అంటూ ఉండేవారు.

అయితే ఇప్పుడాయన మనిషికి హృదయం అనేది ఒకటి వున్నదని శరీరాన్ని చీల్చిచూస్తే అది కనిపించకపోవచ్చునని ఒప్పుకోవడానికి సిద్ధంగా వున్నారు. అగమ్య అగోచరమైన వస్తువేదో బాధను కలిగిస్తూఉంటుందని, ఆ బాధానివారణకు ఎడ్రినలిన్ పని చేయదని అంటాడు. ఆ బాధను సమూలంగా నాశనం చేయడం జరిగితే మానవుడు దానవుడుగా మారిపోవచ్చు....హృదయమనేది మనిషిలోని దైవత్వం చోటుచేసుకునే మందిరంలాంటిది.

బాల్యంనుంచే తన జన్మగాథను ఆయనెప్పుడూ విస్మరించలేదు. ఆ యా కాలంలో జీవిస్తూ ప్రత్యేకచరిత్ర అంటూ ఏదో వున్నదని రొమ్ము విరుచుకొనే ప్రతివ్యక్తికీ ప్రపంచాన్ని కదిలించేదీ, మునుముందుకు సాగించేదీ, జీవితగాథ

ఒకటి ఉండాలి. కాని డాక్టరు వంశచరిత్రమీద నల్లటిసిరా పులుముతున్నది. జైలు వాళ్ళు సెన్సారు చేయబడ్డ ఉత్తరాలలాగా। ఆ కాగితంమీద అసలు అక్షరాలనేవి అంతకుక్రితం అక్కడ రాయడం జరిగిందా. అనే అంతటి సహజంగా సిరాను పులిమివేయడం జరుగుతుంది.....కన్నతల్లికికూడా తన అవసరం లేకపోయింది। ....చీకటికోవలో, ఒక అభాగ్యురాలైన తల్లి హృదయంలోని బాధను నొక్కిపట్టు కుంటూ, చెంగుచాటున పొత్తిళ్ళలో అప్పుడే పుట్టిన పసికందును దాచుకుంటూ నిలబడింది. ఒక నల్లటి భయంకరమైన నీడవచ్చి చెయ్యి చాపుతుంది. తల్లి తన గుండెభాగాన్ని. రక్తపిండాన్ని కడసారిగా ఒకక్షణంపాటు చూసుకుంటుంది. ముద్దు పెట్టుకుంటుంది. భయంకరమైన నీడ ఆమె చేతినుంచి ఆ శిశువును బల వంతంగా లాక్కుంటుంది. తల్లి దంతాలతో పెదవుల్ని నొక్కిపట్టుకొని అలాగే నిలబడిపోతుంది.

డాక్టరు తన మాతృస్నేహాన్ని, చీకటిలో నిలబడ్డ 'సల్‌హాంటెడ్' బొమ్మ లాంటి తల్లిప్రేమ విలువను అర్థం చేసుకోవడానికి ప్రయత్నించారు. గొంతు నులిమి చంపవచ్చునే। నల్లిని నలిపినట్టు చేతివేళ్ళబలంతోనే. అయిదుగంటల వయసుగల ఆ శిశువును నలిపివేయవలసింది। కాని తల్లి అలా చెయ్యలేదు. చేయ లేకపోయింది....బహూశా ఆమె ప్రయత్నించి వుండవచ్చు. మెడమీదికి రెండు మూడుపర్యాయాలు వేళ్ళు వెళ్ళివుండవచ్చు। నిద్రపోతున్న శిశువు నిద్రలోనే ఫకా లున నవ్వివుండవచ్చు. దాంతో ఆ శిశువు శరీరం నిమిరి ఉంటుంది।....నిస్సహాయు రాలైన, అభాగ్యురాలైన తన తల్లి మనసులో ఆ సమయంలో రేగిన పెనుతుఫాను తీవ్రతను ఊహించుకోగలిగాడు....తాను తన తల్లి పవిత్రస్నేహానికి, అపరాజిత ప్రేమకు సజీవమైన ప్రమాణం।

అభాగ్యురాలైన ఏ తల్లిగాథవిన్నా అతనిహృదయం భక్తిప్రపత్తులతో నిండిపోతుంది. పవిత్ర నిర్వాసిత, సమాజదృష్టిలో అత్యంతనీచురాలు అయిన తన తల్లి ఒడిలో క్షణంపాటు తనశిరస్సు ఉంచాలని వ్యాకులపడిపోయారు. ....ఏ స్త్రీని ప్రేయసిగా చూడడానికి అత నెప్పుడూ ప్రయత్నించలేదు. లోలోపలే కుమిలి వ్యాధిగ్రస్తుడైనారు. యువకుడైనవ్యక్తికి శారీరికమైన ఆకలి

వేయకపోతే అతడు నిజంగానే వ్యాధిగ్రస్తుడే। లేదా 'ఎబ్‌నార్మల్'। (అస్వాభావిక మైన వ్యక్తి).

డాక్టర్ ఒక కొత్త మలుపుమీదికొచ్చి చూశాడు. ప్రపంచమెంత అందంగా వున్నది।

అతడు లోకకళ్యాణంకోసం నడుం కట్టాడు. మానవజీవితానికి వినాశన కల్పించే వ్యాధులమూలకారణాలను అన్వేషించి నూతన ఔషధాలను కనిపెడతాడు. రోగకీటకాలు నశించిపోతాయి. మానవుడు ఆరోగ్యవంతుడవుతాడు. ప్రపంచంలోని మెడికల్ కాలేజీలలో అతనిపేరు మోగిపోతుంది. 'ప్రశాంత్-మెథడ్', 'ప్రశాంత్ రియాక్షన్'. డబ్ల్యు. ఆర్. లాగా పి. ఆర్. అంటారు. ఆ తరువాత।—టెస్ట్ 'ట్యూబ్ బేబి' ఎవరిని అమ్మా అని పిలుస్తాడు? అప్పుడు బహుశా అమ్మ అనే మాట హాస్యాస్పదంగా మారిపోతుంది....తెలుసా? ఇదివరలో అమ్మ అనే ఆవిడ ఉంటూఉండేది. అర్ధనగ్నంకంటేకూడా ఇంకొక ఆకు ఎక్కువ చదివినమ్మాయి 'టెలికాఫే'ద్వారా అమెరికన్ పేస్ట్రీని ఇంట్లోకూర్చునే రుచిచూస్తూ—'ప్రీటెస్ట్ ట్యూబ్ ఏజ్। సీ-సీ।....అమ్మా। ట్యూబ్ అమ్మాగి।'

'తల్లి। తల్లి వసుంధర। ధర్త్రీమాత। తల్లి తన కొడుకును చంపలేక పోయింది. కాని కొడుకు తన తండ్రిని గొంతునులిమి చంపేస్తాడు. సశ్య శ్యామలా।....

భారతమాత గ్రామవాసిని।
పొలాలలో వ్యాపించెను శ్యామల
ధూళిభరిత మలినాంచలం।

మలినాంచలం। మాసినచెరగు। కాని భారతమాతది స్వర్ణాంచలం। గోధుమ బంగారుగింజలతో నిండిన పొలాలు తూరుపుగాలికి రెపరెపలాడుతున్నాయి. గ్రామాల లోని ప్రజలంతా పొలాలలో వున్నారు. బంగారునదిలో నడుందాకానిండిన బంగారు నీళ్ళల్లో గ్రామంలోని ప్రజలంతా కేళీవిలాసా లాడుతున్నట్టున్నారు. బంగారు అలలు। తాళవృక్షపంక్తులు. ఆడవిరేగుచెట్ల అడవి. బంగళాతోట. తామరాకులతోనిండిన కమలానది పీటిగుంటలు। డాక్టరుకు వస్తువులన్నీ నిత్యనూతనంగా కనిపిస్తున్నాయి.

కోయిలకూత డాక్టర్ హృదయంలో ఎప్పుడూ బాధను ఉత్పన్నం చేయలేదు. కాని పొలాలలో గోధుమకోసే కూలీలపాటల్లో అర్ధరాత్రిపూట కూసే కోయిల కంఠంలోని మాధుర్యం అతను అనుభవిస్తున్నాడు.

రోజూ కోయిల ఉదయం కూసేది
ఈరోజు అర్ధరాత్రివేళ పాడుతున్నది
నిద్రిస్తున్న నా ప్రియుడికి నిద్రాభంగం కలగకుండుగాక।

ప్రియుడికి నిద్రాభంగమూ కలగకూడదు. గాఢనిద్రలోవున్న ప్రియుడి తల దగ్గర వినసకర్రగా పనిచేస్తున్న పచ్చుపిపైరు ప్రియుడి నిద్రాభంగం కలగకూడదని, అతని కల కరిగిపోకూడదని జాగ్రత్త పడుతున్నది.

డాక్టర్‌కుకూడా ప్రేమగా జోకొడుతూఉంటే నిద్రపోవాలని వున్నది. జీవిత పథంలో విరామం లేకుండా ముందుకు పరుగెడుతున్నాడు; క్షణంపాటు విశ్రాంతి తీసుకునేందుకు తని కెక్కడా నీడ అనేది కన్పించలేదు. ఏ చెట్టుకొమ్మ చల్లని నీడనుగురించి ఊహించుకొన్నైనా లేదు. జీవితంలోని ఈ నూతన మార్గంమీద కాలు పెట్టేప్పటికి ఎంతో అలసట అనిపిస్తున్నది. అయితే మార్గసౌందర్యానికి ముగ్ధుడయి నీడన అలాగే వుండిపోలేదు. గమ్యాన్ని చేరుకునేందుకు ఈ మార్గం ఎంతో ప్రేరణ కనిపిస్తున్నది....క్షణంపాటు విశ్రాంతి తీసుకునేందుకు అతనికి నీడ కావాలి. ప్రేమ।....

ప్రియురాలు మేల్కొన్నది; పచ్చటిపైరు ప్రియురాలికి వీడ్కోలు చెప్పింది; ప్రియురాలు వెళ్ళిపోవాలి। హిమాలయశిఖరాన్ని ఉషోదయ ప్రథమకిరణాలు స్పృశించి స్వర్ణమయం గావించింది. మామిడితోపులలో కోయిలలు, బుల్‌బుల్ పిట్టలు ఏకకంఠంతో మంగళగీతాలు పాడుతున్నాయి. పొలాలమీదినుంచి గిత అందికలు తూర్పుగాలిమీద ప్రయాణంచేసివచ్చి డాక్టరు హృదయంలో సంచలనాన్ని కలిగిస్తున్నాయి....గోధుమకోతలు జరుగుతున్నాయి. గోధుమపంట సువాసన నలు వైపులా వ్యాపిస్తున్నది.

'డాక్టర్‌గారూ।'
'ఏమిటి?'

'మీరు కొంచెం రావాలి. మా అక్క వాంతులు చేసుకుంటున్నది.'

'విరేచనాలుకూడా అవుతున్నాయా?'

'అవుతున్నాయండి.'

డాక్టరు వెంటనే తయారై బయలుదేరారు. ఆ ఊరుదగ్గరే.....డయేరియా అయివుంటుంది. కాని సెలాయిన్ 'అప్పరేటస్'కూడా తీసుకెళ్ళడం మంచిది.

'ముప్ఫయిసార్లు విరేచనాలు అయ్యాయి.'

మంచంమీద పడుకున్నయువతి పాలిపోయివుంది. ఆమె కాళ్ళూ చేతులు బిగుసుకుపోతున్నాయి. మూత్రం రావడంలేదు. కలరా అయివుంటుంది. డాక్టరు సెలాయిన్ అపరేటస్ సరిజేస్తారు. స్పిరిట్ స్టౌ వెలిగిస్తారు. నార్మల్ సెలాయిన్ సీసా తీస్తారు. ముసలితండ్రి ఏదో చెప్పబోతాడు. చివరకు చెబుతాడు—'డాక్టరు గారూ! ఈ ఇవ్వబోయే ఇంజెక్షన్ ఎంతవుతుందండీ?'

చిన్న ఇంజెక్షను ఫీజు రెండురూపాయలు! ఇంత పెద్ద ఇంజెక్షన్‌కు ఫీజు ఏభై రూపాయలైనా అవుతుంది!

'ఎందుకు? ఏభై రూపాయలు!'

'అయితే వద్దులెండి. ఏదైనా మం దివ్వండి.'

'మందిస్తే లాభంలేదు.'

'నాదగ్గర ఇచ్చుకోవడానికి అంతడబ్బు ఎక్కడిదండి?'

'ఎడ్లు అమ్మేసెయ్!' డాక్టర్ నవ్వుతూ సెలాయిన్ ఇవ్వడానికి తయారు చేస్తున్నారు.

'డాక్టర్‌గారూ! ఎడ్లు అమ్మేస్తే పొలం ఎలా దున్నుకోవడమండీ? పిల్లలు ఆకలితో అలమటించి చచ్చిపోతారు. ఆడపిల్ల జబ్బు.....!'

'అంటే?'

'అయ్యో! ఆడపిల్లజబ్బు మందూ మాకూ ఇప్పించకపోయినా నయమవుతుంది.'

ఆడపిల్ల జబ్బు మందూ మాకూ ఇప్పించకపోయినా నయమవుతుంది! పాపం ముసలివాడి తప్పేమీలేదు. ఇందులో! నాగరికకుటుంబాలలోకూడా ఆడపిల్ల

పుడితే అల్లల్లాడిపోతారు—ఏదో ప్రమాదం వచ్చిపడ్డట్టు। అదేదో కలుపుమొక్క అయినట్టు।

డిగ్ - డిగ్, డిడిగ - డిడిగ

'....రేపుదయం ఆస్పత్రిలో కలరా ఇంజెక్షన్ ఇస్తారు. సర్వజనులకు తెలియజేసేదేమిటంటే - పిల్లలూ పెద్దలూ, ఆడా మగా అందరూవచ్చి ఇంజెక్షను తీసుకోవలసిందొహో।' డిగ్ డిగ్ డిడిగ్। గ్రామంలోని వెట్టివాడు చాటింపు వేశాడు.

కలరావచ్చిన మొదటిరోగిని బతికించడం జరిగింది. కాని గ్రామాన్ని బతికించడం చేతనయింది కాదు. డాక్టర్ డప్పువేయించి మరీ ఇంజెక్షన్ తీసుకోమన్నారు. కాని ఎవరూ ముందుకు రాలేదు. బావులో మందు కలిపిస్తూంటే గుంపులు గుంపులుగాచేరి ఆ పనిని విరోధించారు—'డాక్టర్ బావుల్లో మందుకలిపి కలరావ్యాపించేట్టు చేస్తున్నాడు. మాకూ తెలుసు।'

డాక్టర్ బాలదేవ్, కాళీచరణ్, చర్ఖా సెంటర్‌వాళ్ళకూ కబురంపి పిలిపించాడు. ఈ విషయంలో సహకరించవలసిందిగా అభ్యర్థించాడు - జనం ఇంజెక్షన్ తీసుకోక, బావులో మందుకూడా కలపనివ్వకపోతే ఊరికి ప్రమాదం వచ్చిపడుతుంది.'

మధ్యాహ్నం బాలదేవ్, కాళీచరణ్, చర్ఖా సెంటర్ మాష్టర్లు, డాక్టరుతో కలిపి ఒక బృందంగావెళ్ళి బావులో మందుకలిపి వచ్చారు. ఇంజెక్షన్ ఇచ్చేసమస్య కొంచెం జటిలమైనదే। కాళీచరణ్ —'ఒకపని చేద్దామండి। ఇవ్వాళ్ళ సంతరోజు. సంతలో జనాన్ని నాలుగువైపులమంచి ముట్టడించి బలవంతంగా ఇంజెక్షన్ ఇవ్వడం బావుంటుంది. ఇక మిగిలినవాళ్ళను ఇళ్ళదగ్గర పట్టుకుందాం।' అని అన్నాడు.

డాక్టర్‌కు ఈ సలహా నచ్చింది. కాని బాలదేవ్ అభ్యంతర పెట్టాడు. 'ఇష్టం లేకుండా బలవంతం చెయ్యడం....।'

'ఏమిటి మీ అర్థంలేని మాటలు?'

చర్ఖా సెంటరు పంతులమ్మ బాలదేవ్‌మాటను మధ్యలోనే ఖండిస్తూ అన్నది- 'కాళీచరణ్‌గారు చెప్పింది చాలా సరిఅుగా వున్నది।'

బాలదేవ్ కణతలు ఒక్కసారిగా వేడెక్కాయి.

....ఈమెకు మాట్లాడేపద్ధతికూడా తెలీదు. ఆడదానిస్వభావం సర్కస్‌పీట్స్ వేయకూడదు. వంటలక్క లక్ష్మి ఎంత మధురంగా మాట్లాడుతుంది! ఈమె మొగరాయుడులాగా మాటాడేస్తూంది. పైగా చర్ఖా సెంటర్‌లో పంతులమ్మ! కాంగ్రెసులో పనిచేసిన చాలామంది ఆడవాళ్ళను తనూ చూశాడు. మాయాతీ. తారావతీదేవి, సరస్వతి, ఉషాదేవి, శ్రద్ధాదేవి! ఎవరూ ఇలా సర్కస్‌లోలాగా మాట్లాడేవారు కాదు. ఊఁ, పెద్ద చెప్పవచ్చింది, కాశీచరణ్‌గారు చెప్పింది చాలా సబబుగా వున్నదంటూ! ....బలవంతంచేయడం హింసావాదంకాక ఇంకేమిటి?

కాశీచరణ్ బృందంవాళ్ళు సంతను చుట్టుముట్టారు. డాక్టర్ మామిడిచెట్టు కింద బల్లవేసుకొని తనసామానుతో సంసిద్ధంగా వున్నాడు. కాశీచరణ్ ఒక్కొక్క మనిషిని పట్టుకొస్తున్నాడు; మాష్టరమ్మ స్పిరిట్‌లో ముంచిన దూది చేతిమీద రాస్తున్నది, డాక్టర్ ఇంజెక్షన్ ఇస్తున్నాడు. తాసిల్దారు పేర్లు రాస్తున్నారు. సంతలో పారిపోవడానికి తొక్కిసలాట ప్రారంభమైంది. ఎక్కడికి పారిపోతారు? నాలుగు వైపులా సోషలిస్టుపార్టీ వాలంటీర్లు నిలబడివున్నారు;

'అమ్మయ్యో! అమ్మయ్యో!....ఒరే బాబూ కాశీ!'

'ఏమిటి? ఎందుకేడుస్తున్నావు?'

'ఒరేయ్ అబ్బాయ్!'

పచ్చబొట్టు పొడిపించుకునేప్పుడుకూడా సూది పొడిపించుకోలేదు. పద!

ఏడువందల పాతికమందికి ఇంజెక్షన్ ఇచ్చారు. ఇక ఇళ్ళల్లో మిగిలిన వాళ్ళను, రేపుదయం సూర్యోదయం కాకపూర్వమే పట్టుకొని ఇంజెక్షను ఇవ్వాలి.

'రోగులు సేవచేసేందుకు వాలంటీర్లు కావాలి!' అని డాక్టర్ అన్నాడు.

కాశీచరణ్ తన బృందంలోని అరవైమంది వాలంటీర్లను వెంటతీసుకొని రాత్రి హాస్పిటల్‌కు వెళతాడు.

చర్ఖా సెంటరు మాష్టరమ్మ చాలా ధైర్యంగల మనిషి. ఆమెకూడా ఇందుకు సిద్ధమైంది.

బావన్‌దాసు నవ్వి—'నన్నుచూసి రోగులు భయపడిపోతారు. డాక్టర్‌గారూ! నా కింకేదైనా పని అప్పగించండి!' అని అన్నాడు.

బాలదేవ్ నోరు కదపలేదు. కలరా అంటే అతగాడికి భలే హడల్!

## ఇరవయ్యేనిమిది

డాక్టరు మనిషికాదు, దేవత! దైవం! తాంత్రికులపేట, ద్వారపాలకులపేట, కుర్మీ క్షత్రియులపేట, దాసర్ల పేట—ఈ పేటల్లోని మొత్తం అయిదుగురు మనుషులు 'హరీ' అన్నారు. ప్రతిఇంటోనూ ఒకళ్ళో ఇద్దరో జబ్బుపడ్డారు; కాని డాక్టరు దేవుడులాంటివాడు. రాత్రింబగళ్లు ఒక క్షణంకూడా విశ్రాంతి తీసుకోకుండా రోగుల్ని చూశాడు. సంతులమ్మకూడా దేవతలాంటి మనిషి. కాళీచరణ్ మహా ధైర్యశాలి. వాంతులు, విరేచనాలతో నిండిన పక్కలమీద పడుకున్న రోగులకు సేవ చేయడం, బట్టలు ఉతకడం, మందులువేసి మురికిపదార్థాలను తగులబెట్టడం వగైరా మనుషులు చేయవలసిన పనులుకాదు; దేవతలు చేయవలసినపనులు! ఒక్క పైసా కూడా ఫీజు తీసుకోలేదు. రాత్రిఅంతా మేల్కొని ఉచితచికిత్స చేశాడు. రేశమ్‌లాల్ కోయరీ ఏకైకపుత్రుణ్ణి మృత్యువునోటినుంచి తప్పించాడు. రేషమ్‌లాల్ డాక్టర్‌కు సంతోషంగా ఒక ఆవును బహూకరించాడు. కాని డాక్టర్ 'నీ కొడుక్కి ఈ ఆవుపాలు తాగిస్తూఉండు. పాలు అమ్మవద్దు. ఇది నా బహుమానం. తెలిసిందా?' అని అన్నాడు.

బావన్‌దాసుకూడా అవతారపురుషుడు. రాత్రిఅంతా వేపచెట్టుకింద కూర్చొని ఖంజరు వాయిస్తూ పాటలు పాడుతూ ఉండేవాడు—'రామా! సీతారామా! ఆర్తపరాయణరామా! సీతారామ్, సీతారామ్! వందేమాతరమ్!.... సీతారామ్!'

మనిషి తన నీడను తను చూసుకొని భయపడే గాఢాంధకారంలో బావన్ పాట ధైర్యాన్ని పంచిపెట్టేది.

బ్రాహ్మణపేటలో ముగ్గురు మనుషులు చనిపోయారు. సిద్ధాంతిభార్య వేరే జబ్బువల్ల మరణించింది. కాయస్థులపేట, సంథాల్ పేట, యాదవులపేటలో ఒక్కరు

కూడా జబ్బు పడలేదు. అయితే డాక్టరు అందర్నీ కాపాడాడు. పదిహేనురోజుల తరువాతగాని కమల డాక్టర్ మొహం చూడలేదు.

కమల తన అంతర్యంలో ఎన్నెన్నిసంగతులు వూహించుకున్నది!.... ఈ పదిహేనురోజుల్లో కనీసం ఒకసారివచ్చి వెళ్ళకూడదూ? పోనిద్దురూ! నాకుకూడా జబ్బు అంటుకునేది; అంతేగా? నేను మరణించేదాన్ని! మీదేంపోయింది? మీకా వర్షా సెంటర్ పంతులమ్మ దొరికిందిగా! రాత్రిఅంతా మీకు టీ తయారుచేసి ఇచ్చేదిగా!

కాని ఆమె డాక్టర్ని చూడడంతోనే అన్నిసంగతులు మరచిపోయింది. డాక్టర్ మొహం బాగా నల్లబడిపోయింది. కళ్ళు పీక్కుపోయాయి. ప్యారీ చెప్పిన దాంట్లో సత్యం లేకపోలేదు—'డాక్టరుగారు ఊళ్లోవున్న వాళ్ళందరి ఆరోగ్యాలను గురించి బెంగ పెట్టుకొన్నారు; కాని ఆయన తన ఆరోగ్యాన్నిగురించి ఏ మాత్రం పట్టించుకోవడం లేదు. రోజురోజుకూ ఆయన ఆరోగ్యం క్షీణిస్తున్నది. తిండీ తిప్పలు తీసుకోవడమే లేదు సరిగా!'....అమ్మ డాక్టర్గార్ని కాసేపు ఒంటరిగా ఉండనిస్తే బావుండునని అనుకున్నది. కమల! ఈ రోజున ఆమె డాక్టర్ని కౌగలించుకుంటుంది!

'చెప్పండి. కలరా డాక్టర్గారూ!' కమల నవ్వుతూ డాక్టర్దగ్గరకు వెళ్ళింది. 'కలరా డాక్టరా? ఈ పిల్ల మాటలు మరీ పెద్దూరంగా వున్నాయి. రోజురోజుకీ నీకు అలుసు ఎక్కువయిందమ్మాయ్!' తల్లి కోప్పడింది.

'ఈ పేరు నేను పెట్టినపేరు కాదమ్మా! మొన్న రామపూర్నుంచి వచ్చిన కూలీలు నాన్నను అడుగుతున్నారు – కలరా డాక్టర్ ఎక్కడుంటారని! జనమంతా ఈయనగారిని కలరా డాక్టర్ అనే అంటున్నారు.' కమల కిలకిలా నవ్వుతూ అన్నది.

తల్లి నవ్వి వెళ్ళిపోయింది. డాక్టర్కూడా నవ్వుతూ - జనం నన్ను కలరా డాక్టర్ అంటే అన్నారులే; కాని నువ్వుమటుకు నన్ను 'మూర్ఖుల డాక్టరు' అని అనాలి!

'ఓహో! అలాగా! మూర్ఖుల డాక్టర్గారు పదిహేనురోజులతరువాత విదియనాటి చంద్రుడిలాగా మొహం చూపించడానికొచ్చారు! మహాకబుర్లు చెబుతున్నారు!' కమల గాంభీర్యాన్ని తెచ్చుకొని అన్నది.

'లేదు కమలా! నిన్నుగురించి అనుకుంటూనే వున్నాను. ఈ మధ్యలో నువ్వేమైనా గొడవచేస్తే ఎలాగని!'

'అంటే నేను కావాలని మూర్ఛపోతున్నాననా ఏమిటి?'

'అవును, కావాలనే!'

'ఎందుకు?'

'ఎందుకంటే స్పృహ తప్పితేగాని మూర్ఛల డాక్టరు రాడని!'

'ఊహుఁ! డాక్టర్ వస్తే ఎంత, రాకపోతే ఎంత?'

'అయితే సరే, నేను వెడుతున్నా!'

'ఊఁ!'

'డాక్టర్‌గారు ఇన్నిరోజులతరువాత వచ్చారుగదా, టీ ఇచ్చేదేమైనా వున్నదా లేక పోట్లాడుతూ కూర్చుంటావా?' తల్లి లోపలినుంచి అన్నది.

కమల నాలుక కొరుకుకుంటూ లోపలికి పరుగెడుతుంది. కొంపదీసి అమ్మ తన మాటలన్నీ వినలేదుగదా!

డాక్టరు ఈ పర్యాయం చుట్టుపక్కలున్న పదిహేనుగ్రామాలతో పరిచయం ఏర్పరుచుకొన్నాడు. కర్షకుల్ని చూశాడు; కార్మికుల్ని చూశాడు; దగాపడినవాళ్ళు; బాధలనుభవించేవాళ్ళు; నిరాశ్రయులు; వ్యాధిగ్రస్తులు! వాళ్ళందరి కనుపాపల చాటున దాగివున్నభాషను అవగతం చేసుకొనడానికి ప్రయత్నించాడు. మధ్యతరగతి రైతుల పెద్దపెద్ద భవంతులను, స్వంతంగానిచోటులో చోటుచేసుకున్న కూలిప్రజల కుటీరాలను చూసే అదృష్టం లేదా దురదృష్టం నాకు కలిగింది. రోగుల్ని పరీక్షించి వచ్చేప్పుడు ఉట్టిమీద వేలాడే ఖాళీకుండలు ఎన్నోచోట్ల నా తలకు తగిలాయి. ఏడు మాసాల పసిబిడ్డకు జనుము ఆకుకూర ఆహారంగా ఇవ్వడం తాను చూశాడు! పేదతనం, మురికి, నిస్సహాయత వీటిమధ్యనుంచి మంచికాలం పైకి లేస్తుంది. సౌందర్యం వెల్లివిరిస్తుంది. వయసులోవున్న వాళ్ళందరి మొహాలమీద ఏదో ఆకర్షణ కన్పించింది. కమలానది పక్కగుంటలలో వికసించిన తామరపూలలాగా జీవిత ప్రారంభదశలో ఆకర్షణీయంగా, మనోహరంగా, అందంగా కనిపించడంలో ఆశ్చర్యం లేదు. అయితే సూర్యునివేడి తీక్షణం కావడంతో అవి వడలిపోతాయి.

సాయంత్రానికిముందే ఎండినపూలు రాలిపోతాయి. కాశ్మీరు తామరపూలకు పూర్తియా పూలకూ ఉన్న భేదమే ఇది।....ఇక కమలంటే రాజకమలం।

'నేను నిన్ను రాజకమల అని పిలుస్తాను।'

'అయితే నేను నిన్ను ప్రశాంతమహాసాగర మంటాను।' కమల ఇవ్వాళ్ళ అనుకోకుండానే నువ్వనేసింది.

'ప్రశాంత మహాసాగరంలో రాజకమలాలు వికసించవు. నేను కమలానది నీటిగుంటగా ఉండడానికే నే విష్టపడతాను।' డాక్టర్ నవ్వాడు.

కమల పెద్దపెద్ద కనురెప్పలు ఒకపర్యాయం పైకిలేచి మరల కిందికి దించుక పోయాయి.

'ఇంతవరకు నీ హాస్పిటల్ నాకు ఎందుకు చూపించలేదు? నీ కుందేళ్ళు. ఎలుకలు, నక్కలు, ముంగిసలు....'

'నాన్నా, అమ్మా నిన్ను హాస్పిటల్‌కు రానిస్తారా?'

'ఎందుకు రానివ్వరు?'

'అయితే ఈరోజే తీసుకెళతాను.'

కమల డాక్టర్‌తోకలిసి హాస్పిటల్‌వైపు వెళుతున్నది. చైత్రమానపు పశ్చిమ దిక్కు ఎంత ప్రాణంలేనిదానిలా, పౌర్ణమినాటి చంద్రుడిలా వుంది. పగలంతా అదే పనిగా కొట్టే పడమటి శాంబరం శాంతించింది.

నీళ్ళాటిరేవుదగ్గర గుమిగూడివున్న ఊళ్ళోని ఆడవాళ్ళగుంపు ఈ ఇద్దర్నీ కళ్ళార్పకుండా చూస్తూంది. పోట్లాడుకోవడం ఆపేస్తారు; నీళ్ళు పట్టుకోవడం మానేస్తారు. వాళ్ళిద్దరూ కనుమరుగై పోయినతరువాత అందరినోళ్ళూ ఒక్కసారిగా మాట్లాడడం ప్రారంభించాయి. ఎవరికితోచిన అభిప్రాయం వాళ్ళు వ్యక్తం చేశారు। ....కమల ఇప్పుడు బాగా కోలుకున్నది. అంతా డాక్టరు చలవే।....ఇద్దరిజంట చూడ ముచ్చటగా వున్నది. సత్యనారాయణ సినిమా పుస్తకంలోకూడా సరీగా ఇలాంటిజంటే వున్నది....డాక్టరుకూడా కాయస్థుడేనా? కులమేమిటి మరి? ఏమో? వైద్యం చేస్తూచేస్తూ ఈయనగారు కాస్తా....। బయటికి చల్లగాలికి బయలుదేరారు.

తల వేడెక్కింది కాబోలు!....పిన్ని ఆ ఉభయుల జంటను చూడడంతోనే పరమా-నందభరితురాలై మనస్సులో కమలానదిని స్తోత్రం చేసుకున్నది.

గణేశ్ అక్కడే బిళ్ళంగోడు ఆడుతున్నాడు. వాడు బిగ్గరగా అరిచాడు—

తూర్పునుంచి దొరగారొచ్చారు
పడమరనుంచి దొరసాని
గిట్ పిట్ మని దొర అన్నారు
కిలకిలమన్నది దొరసాని!

కమల, డాక్టరు వెనక్కి తిరిగిచూశారు. గణేశ్ చప్పట్లుకొడుతూ నవ్వుతున్నాడు—'చూశావా అమ్మమ్మా - దొర - దొరసాని!'

ఇద్దరూ నవ్వి పిన్నికి నమస్కరించారు. గణేశ్ పరుగెత్తుకువెళ్ళి అమ్మమ్మ చీరెచాటున దాక్కున్నాడు. కమల - 'ఏమయ్యోయ్ ఓ బొజ్జగణపయ్యా! నీ పని తిరిగొచ్చాక పడతాను! చెవులుపట్టుకొని ఆకాశపునక్షత్రాలు చూపిస్తాను సరేనా!' అని అన్నది.

తాసిల్దారు మధ్య దారిలోనే కలిశారు. నవ్వుతూ అన్నారు—'ఇవ్వాళ సూర్యుడు తూర్పున పొడిచినట్టు లేదు!....మంచిదే ఉదయం సాయంత్రం ఇలా కాస్త ఆరుబయట తిరిగితే ఆరోగ్యానికి మంచిదే!'

ముగ్గురూ ఒక్కసారి నవ్వారు.

బంగళాతోటలో నిద్రగన్నేరుచెట్ల పెద్దపెద్దకొమ్మలు విరబూసిన ఎర్రటి పూలతో నిండివున్నాయి. చల్లటి గాలితెర లొచ్చినప్పుడల్లా తల లూపుతున్నాయి. అమలతాసు పసుపువచ్చని పూలు నవవధువు పచ్చని పమిటచెంగును గుర్తుకు తెస్తున్నాయి. మంజిష్ఠలతల సువాసన సాయంత్రపుగాలిలో మిళితమై మనస్సును మత్తెక్కిస్తున్నాయి. శిరీషపుష్పాల పూరేకులు అక్షంతలుగా తలమీద పడుతున్నాయి. ....మార్టిన్ ఎన్నో శ్రద్ధాసక్తులతో ఈ పూలచెట్లన్నీ వేయించాడు. బహుశా ఈ తోటను వేసేప్పుడు - అతని బాహుబంధాల్లో ఇమిడిపోయిన మేరీ ఎర్రటి పెదవుల కొత్తదనాన్ని మరింత తేజోవంతంగా వుంచేందుకు ఇటువంటి సంధ్యాసమయాల పరికల్పన చేసివుండవచ్చు! చెట్లకు నీళ్ళుపోసే కూలీలను కటువుగా ఆదేశించివుండ

వచ్చు—'ఇదుగో ఒక్కచెట్టుకూడా వాడిపోయిందంటే ఏభై కొరడాదెబ్బలు తిన వలసి వుంటుంది। జాగ్రత్త।'

చైత్రమానపు గోధూళివేళ తన సంపూర్ణతేజస్సును పోగొట్టుకొని సూర్యుడు సంధ్యాదేవి ఒడిలో తల దాచుకున్నాడు. చాలాదూరంవరకు వ్యాపించిన తాళవృక్ష పంక్తులు ధూళి, సింధూరపురంగు పృష్ఠభూమిలో తలలెత్తి సూర్యుడు అస్తమించి పోవడాన్ని పరికిస్తున్నాయి. ఆవులను, ఎడ్లను తోలుకొని ఇంటికి తిరిగొచ్చే పశువుల కాపర్లు సావిత్రీ నాట్యంలోని పాటలు పాడుకుంటున్నారు....

సఖిరో, ఓ నా సఖిరో।
చూచివత్తము రావె సఖీ
పూదోటను చూచివత్తము రావే
అందమైన పూలనూ
రకరకాల బహు సుందరవనమునూ
చూచివత్తము రావే సఖీ।
సఖిరో। ఓ నా సఖిరో।

నిద్ర గన్నేరుచెట్లు నిద్రపోయాయి; అమలదాసు పసుపు పచ్చని చెరగు ఎప్పుడో తొలగిపోయింది. యోజనగంధవృక్షం ఇంకా తన సుగంధాన్ని విర జిమ్ముతూ మత్తెక్కిస్తున్నది....డాక్టరు దేవతగా కాదు, మనిషిగా మామూలు మనిషిగా మారాలనుకుంటున్నాడు.

ఒక జత నిర్మలనేత్రాల కనుకొలకులు కొంచెం పైకిలేచి, తిరిగి వెంటనే కిందికి దించుకుపోయాయి.

## ఇరవైతొమ్మిది

రేపు 'సిరవా' పండుగ.

రేపు పడమాన్‌లో 'మధమరీ' ఉంటుంది. 'మధమరీ' అంటే అంటే చేపల వేట। ఇవ్వాళ్ళ చైత్రసంక్రాంతి। రేపు వైశాఖమాసపు మొదటిరోజు - క్రొత్త

సంవత్సరానికి ప్రథమదినం। రేపు ఊళ్ళోనివాళ్ళందరూ ఒక్కుమ్మడిగా వేపలను వేటాడతారు. చిన్నా-పెద్దా, ఉన్నవాళ్ళూ-లేనివాళ్ళూ అందరూ టోపీలూ - వలలూ తీసుకొని ఉదయమే బయలుదేరుతారు. ఈరోజు మధ్యాహ్నం వేలపండి తింటారు. ఇవ్వాళ్ళ వేలపండి పండుగ. ఈరోజురాత్రి తయారుచేసుకొన్నవస్తువులు రేపు తింటారు. రేపు పొయ్యి రాజెయ్యరు. పన్నెండుమాసాలూ పొయ్యి రాజుతూనే ఉండాలంటే వర్షారంభపురోజున భూమి దాహం చేయకూడదు. ఈ సంవత్సరం పండుకున్న వస్తువులు ఆ సంవత్సరంలో తినాలి.

మేరీగంజ్ మొత్తంమీద వేపలవేట ఆదేవాళ్ళకు కాళీచరణ్ నాయకుడు. గురకొయ్యలు పొడవడంతోటే బయలుదేరాలి. పన్నెండుకోసులదూరం వెళ్ళాలి. ఎర్రజెండాలతో ఊరేగింపుగా వెడదామని కాళీచరణ్ ప్రకటించాడు. వినాదాలు కూడా చేయాలి. జమీందారు పైట్‌బక్ష్ అలీ ఈసారి పదమాన్‌నదిలో వేపలు వేటాడడానికి వీల్లేదని చెప్పించాడు. ఇందుకు మిలిటరీని పిలిపిస్తామనికూడా అతని మనుషులు అన్నారు.

కొత్త తాసిల్దారు బాబూ హరగౌరీసింగ్ కొత్త ఖాతాకు ప్రారంభోత్సవం జరిపిస్తున్నాడు. సాయంత్రం సత్యనారాయణవ్రతం. దాక్టరుకుకూడా ఆహ్వానం వెళ్ళింది.

తాసిల్దారు విశ్వనాధ్‌ప్రసాద్ తాసిల్దారుపదవి వదిలితే ఏం? కొత్త ఖాతా తెరవకూడదని ఎక్కడున్నది? వాళ్ళింట్లోకూడా సత్యనారాయణకథ వున్నది. దాక్టర్‌నికూడా పిలిచారు.

పిన్ని హోలీ పండగనాడుకూడా భోజనానికి పిలవలేదు; ఈసారి దాక్టర్‌కు వాళ్ళింట్లోనే భోజనం.

మఠంలోకూడా కొత్త ఖాతాపుస్తకాలు ప్రారంభోత్సవం హడావిడి వున్నది. ఈసారి కొత్త మహంతు రామదాసు ఈ కార్యక్రమాన్ని ప్రారంభిస్తాడు. అందుకే కొన్ని ప్రత్యేకమైన ఏర్పాట్లు జరిగాయి. బీజక్ పారాయణం, భగవన్నామ సంకీర్తన, చివరలో వైష్ణవభోజనం. బాలదేవ్, బావన్‌దాస్ - ఈ ఇద్దర్నీ ప్రత్యేకంగా ఆహ్వానించారు. దాసి లక్ష్మి మనిషిని పంపించింది - 'బాలదేవ్‌గారూ। మీరు తప్పక రావాలి. ఈ గ్రామంలో మీకు మించిన వైష్ణవుడు మరెవ్వరూ లేరు।'

విస్తంత్రి సుమంతదాసు ఇప్పుడు కొత్త తాసిల్దారుకు వత్తాసిదారు. తన పాతధోరణిప్రకారం చాటింపు ప్రారంభించాడు.

'హరగౌరీలాంటి మనుషులు నూటికి కోటికి ఒకళ్ళే ఉంటారు. కాగితాలన్నీ నా కిచ్చేసి ఆయన వేరేపనులు చూసుకుంటూఉంటాడు. నేను నెత్తిన నోరు పెట్టుకొని చెబుతూఉంటాను - అయ్యా! లెక్కాడొక్కాలకు సంబంధించిన కాగితాలు మరొకరు ముట్టుకోవడం ఏమంత భావ్యంకాదు అని! ఆయన వింటేనా? వెన్నలాంటి మనసు! అలాంటివాళ్ళు నూటికి కోటికి ఒకళ్ళే ఉంటారు. ఇక విశ్వనాథప్రసాద్ వున్నాడంటే - మహా పిసినారి! పైగా అనుమానాలపుట్ట! కాయస్థులకూ రాజపుత్రులకూ ఎక్కడా పొంతనేలేదు! నంబి లింగయ్య, జంగం రంగయ్య ఒకచెలా అవుతారు?....ఊహుఁ. పెద్ద కాంగ్రెసులో చేరాడు!....సుమంతదాసుకు ఈ సంగతి తెలియదనుకొన్నాడు కాబోలు! ఊరు చెడిపోయింది. వయసొచ్చినపిల్లను ఎక్కడనుంచోవచ్చిన పరాయి యువకుడితో పరాచకాలాడుకోవడానికి, టింగురంగాయని బజార్లవెంట తిరగడానికి స్వేచ్ఛ ఇచ్చిపారేశాడు! ఇక ఊళ్లోవాళ్ళుమాత్రం ఊరుకుంటారా? వాళ్ళూ బరి తెగిస్తారు!'

కొత్త తాసిల్దారు బాబూ హరగౌరీసింగుదగ్గరకు ఒక్కరైతుకూడా రాలేదు. పండగలకు పబ్బాలకూ రైతులిచ్చే దక్షిణ జమీందారుకు చేరుతుంది; అయితే కొత్త ఖాతా ప్రారంభించేటప్పుడు రైతులిచ్చేదక్షిణ తాసిల్దారుకే చెందుతుంది. సుమంతదాసు వర్తమానం మోసుకొచ్చాడు—'రైతులందరూ విశ్వనాథప్రసాద్ ఇంటికెళ్ళారు. మూటనిబ్బై రూపాయలు దక్షిణ లభించింది. చేపలవేటనుంచి తిరిగొస్తూ దారిలో రైతులందరూ మీటింగుపెట్టుకొని - కొత్త తాసిల్దారుదగ్గరకు వెళ్ళవద్దని తీర్మానించుకున్నారు. ఆ కుతిరాగాడికొడుకు హాళీ లేడూ, వాడు వీళ్ళందరికి నాయకుడు! తండ్రికి తినటానికి తిండిలేదు; కొడుకుమాటలు చూస్తేనేమో కోటలు దాటతాయి, కాంగ్రెసులపేట బిరంచీ కలిశాడు. వాడేమన్నాడో తెలుసునాండి? ఆకలికి అలమటించే రైతులకు అన్నంబెట్టేవాడే నిజమైన జమీందారు, కొత్త తాసిల్దారు ఎప్పుడైనా గుడిసెల్లో బతికే ఓ కష్టజీవుల్లారా! ఈ ముంతెడు గంజినీళ్లుతాగి కాలం గడుపుకోండని అన్నపాపాన పోయాడా? అందుకే శాస్త్రిల్లో చెప్పారు - రాడం

ఎదం కనమోపడం, జూతామారం పవిత్రరం। అర్థమైందా తాపిల్దారుగారూ? ముండనూ, ముళ్ళనూ చెప్పుతో కొడితేగాని అంతుళావికి రావు।'

బాలదేవ్ ఉద్యోగం కాస్తా ఊడింది.

బట్టలు, పంచదార, కిరసనాయిలు - వీటిని పంచిపెట్టేపని ఇప్పు డిక తాసిల్దారు నిర్వహిస్తారు. బాలదేవ్‌ను ఎందుకు తొలగించినట్టు? బహుశా అతగాడు చేసిన బ్లాక్‌మార్కెట్టు బయటపడిందేమో। పాపం ఎంతకాలం దాగివుంటుంది? ఖేలావన్ పరమేశ్వరసింగ్ పొలం కౌనేశాడు? అదబ్బెక్కడిది? ఆ పొలం బాలదేవ్‌దే। ఖేలావన్ ఇంటికెళ్ళిచూస్తే ఈనాటికీ తాన్లకుతాన్లు బట్ట కనిపిస్తుంది. కిరసనాయిలు డబ్బాలకుడబ్బా లున్నాయి. ఖేలావన్ తన బంధుమిత్రులందరికీ బట్టలు బట్వాడా చేశాడు. ఈ సంగతులన్నీ ఎంతకాలమని దాగివుంటాయి? కాంగ్రెసువాళ్లు కూడా సి. ఐ. డీ లను పేశారట। ఇంగ్లీషువాళ్ళ సి. ఐ. డీ లయితే పైపైన చూస్తారు. కాంగ్రెసువాళ్ళ సి. ఐ. డీ లకు కూలివాడిగుడిసెలోని పుట్టికుండ అట్టడుగునవున్న గుప్పెడు బియ్యంతోసహా అజ వుంటుంది.

భార్య చనిపోయినతరువాత సిద్ధాంతి అంతగా అందరితో మాట్లాడడం లేదు....డాక్టరుతో ఆమెకు ఏదో ఒక మందిచ్చి బాగుచేయమని ఎంత చెప్పుకున్నా. విన్నాడు కాదు. అన్నిటికీ ఒకే సమాధానం వచ్చింది - కడుపుకోసి పిల్లవాణ్ణి బయటికి తీయాలని। శివ। శివ।। పరాయిస్త్రీని ఆయన ముట్టుకోవడమా? బట్ట తొలగించడమా? పార్వతితల్లి ప్రతీకారం తీసుకొన్నది. పార్వతి తల్లికి అయిదు సంవత్సరాలక్రిందట పంచాయతీలో - మలమూత్రాలు తాగించాలని పట్టుబట్టాడు సిద్ధాంతి। విశ్వనాథప్రసాద్ ఆమెపక్షం వహించి గట్టిగా వాదించాడు. దాంతో ఆమెగుట్టు బట్టబయలుచేయడం కుదిరిందికాదు।....ఈసారి పార్వతితల్లి బదులు తీర్చుకున్నది....సరే! బ్రాహ్మణశాపం వృథా ఎప్పటికీ పోదు। చూస్తూఉండు. ఈ కలియుగంలోకూడా నిజమైన, శ్రోత్రియమైన బ్రాహ్మణుడ నేవా దొకడుంటాడు।

రాజపుత్రులు, బ్రాహ్మలు చీటికి మాటికి పోట్లాడుకునే రోజులు గతించిపోయాయి। కత్తులూ, చెప్పులు తీసుకొని ఒకరిమీద మరొకరు తిరగబడేకాలం మరుగున బడిపోయింది. ఒకపర్యాయం పావ్‌వాన్ గురువుగారొకరు గుర్రం

మీదెక్కి వస్తూఉంటే ఊరిబయటనే ఆయన్ను గుర్రంమీదినుంచి కిందికి లాగేసి దబదబా చెప్పుతీసుకొని బాదేవాడు - సింగ్!....ఇప్పు డలాకాదు! కాలం మారి పోయింది. గాంధీయుగంలో గాలి పీల్చుకుంటున్నాం. కొత్త శాసిల్దారు వచ్చారు! వస్తే ఏమైంది? తలదీసి మొలేస్తాడా? ఈ ఊరుకాకపోతే మరోవూరు? ఈ వూళ్ళో ఏమున్నదిగనుక? ఇల్లా-వాకిలా?.... చెప్పుతీసుకొని తంతానన్నాడట! సరే చూద్దాం. ఎలా తంతాడో!

యుగయుగాలనుంచి అన్యాయాలకు ఆహుతి అవుతూ పీడించబడుతున్న. ఉపేక్షింపబడుతున్న కార్మిక. కర్షక బీద ప్రజానీకానికి కాశీచరణ్ చెప్పేమాటలు వేదవాక్కులుగా పని చేస్తున్నాయి. గాయాలకు కట్లు కడుతున్నట్టుగా భావిస్తున్నారు. కాశీచరణ్ ఉద్బోధిస్తున్నాడు వాళ్ళకు - 'మీ హృదయాలలో అగ్నిని రగల్చా లనుకుంటున్నాను. మీరంతా నిద్రనుంచి మేల్కొని కదలి కెరటంలా హోరు పెడుతూ, ఉవ్వెత్తున లేచినిలబడాలి! సోషలిస్టు పార్టీ మీ పార్టీ! బీదసాదల పార్టీ! కార్మిక కర్షకుల పార్టీ! మీ హక్కులేమిటో మీరు అవగతం కావాలి! మీరంతా మనుషులే! మనిషిగా జీవించడానికి కావలసిన సర్వాధికారాలూ మీకూ లభించి తీరాలి. నేను మీకు తియ్య తియ్యని మాటలు చెప్పి మభ్యపెట్టడానికి ప్రయత్నించను! ఆ పనిచేసేది కాంగ్రెసు వాళ్ళు! నేను మీ హృదయాలలో రవ్వలను చిందించాలని మాత్రమే కోరుకొంటున్నాను.'

కాశీచరణ్ నిప్పురవ్వలు చిందిస్తున్నాడు. వినేవాళ్ళ మండిపోతున్న గుండెలు శాంతిస్తున్నాయి. భూమి దున్నేవాళ్ళదే! ... పెట్టుబడిదారీవిధానం నశిం చాలి!

బాసన్‌దాసు మళ్ళా మరొకఫారం తీసుకొచ్చాడు. కార్యదర్శి పంపించాడు. ఈసారి పాట్నాలో అచ్చయిన ఫారం! పూర్ణియాలో అచ్చయిన ఫారంకాదు. పాట్నా ఫారానికి విలువున్నది.... ఈ ఫారంమీద పేరు, తండ్రిపేరు, పొలం సర్వే నెంబరు, ఫిర్కానెంబరు రాసి పూర్ణియా కోర్టు కార్యాలయంలో ఇవ్వాలి - 40 వ సెక్షన్ అధికారికి! పొలం స్వాధీనమైపోతుంది. నిజంగానా?.... అవును వేలి ముద్ర వేయాలి....చర్ఖా సెంటర్‌లో దస్కత్తుపెట్టడం నేర్చుకున్నవాళ్లుకూడా వేలి ముద్ర వేయాలా?

బాలదేవ్‌కు ఏం చేయాలో ఏమీ తోచడంలేదు. ఖేలావన్ రోజూ పోరుకాడు తున్నాడు—'బాలదేవ్! కమలానది ఒడ్డునున్న పొలం కలరూ పాస్‌వాన్ తాతపేర శాశ్వత కౌలుదారుగా రాసివున్నది; కలరూతో మాట్లాడి ఆ పొలం మనకు స్వాధీన మయ్యేలా పత్రం రాయించు! అవి!....కాని బాలదేవ్ ఏం చేస్తాడు? చౌదరిగారిని ఇప్పటిదాకా గురువులాగా భావించుకుంటూ వచ్చాడు. ఆయన మాటెప్పుడూ కాదన లేదు. నాలుగణాల మెంబర్లను ఎంతోమందిని చేర్పించాడు. గ్రామంలో చర్ఖా సెంటర్ ప్రారంభోత్సవానికికూడా తానెంతో పాటుపడ్డాడు. కాని చివరకు జిల్లా కమిటీ సభ్యుడిగా తాసిల్దారును చేర్చుకున్నారు. ఈ విషయం బాలదేవ్‌తో మాట మాత్రంగానైనా ప్రస్తావించలేదు. కోటావస్తువు లమ్మే ఉద్యోగంకూడా ఊడి పోయింది. ఉప్పు సత్యాగ్రహంలోపాల్గొని జైలు కెళ్ళినందుకుగాను ఈ బహుమానం లభించింది. కాళీచరణ్ పార్టీ వాళ్ల చెప్పేదాంట్లో తప్పేమీలేదు - 'కాంగ్రెసు ధని కులపార్టీ!'....కాని అతడు కాళీచరణ్ పార్టీలో చేరలేదు. కాళీచరణ్‌కు రాజకీయ పరిజ్ఞానం కలిగించింది తానే! రాత్రిఅంతా మేలుకొని కాళీచరణ్‌కు జైలులోని సంగతులు, గాంధీజీ, జవహర్‌లాల్ నెహ్రూ రాజకీయాలు ఎన్నో చెప్పాడు. కాళీ చరణ్ అతని శిష్యుడు! చివరకు గురువు శిష్యుడిపార్టీలో చేరడమా? ఎంత నామోషీ? అలా ఎప్పటికీ జరగదు!....ఖేలావన్ అన్నయ్యకు అసలు విషయం తెలియదు. దర్భానులపేటలో అతనిమాట వినేవాడే లేదు. కలరూ అతన్నిచూసి మొహం చాటేస్తున్నాడు. అతగాడి లీడరు కాళీచరణ్!....తాసిల్దార్‌గారిని భయంతో లీడరుగా భావిస్తున్నారు జనం!

కొత్త తాసిల్దారుకూడా పట్టిక తయారుచేయిస్తున్నాడు. సుమరితదాసు అందరి పేర్లూ రాయిస్తున్నాడు - 'ముందుగా బిరంచియాపేరు రాయండి! సోనమాఝిపాధ్. కిరాయ్‌కోయరీ - వీళ్ళందర్నీ అప్పులవాళ్ళకింద చూపించండి. ఇక గుడిసెలవాళ్ళ పేర్లు! వీళ్ళకు గుడిసెలుతప్ప మరే ఇతరఆస్తీ లేదు.

ఈ పట్టికను మేనేజరుగారికి పంపించి ఈ ప్రాంతానికి తొందరగా క్యాంపుకు రమ్మని తెలియజెయ్యండి. లేకపోతే ఈ ఇలాకా అంతా చెడిపోయేప్రమాదం ఉన్నది.'

దాసీ లక్ష్మిహృదయంలో బాలదేవ్ చోటుచేసుకొని తిష్ఠ వేసుకున్నాడు!

కొత్త బాటా ప్రారంభోత్సవంరోజున వచ్చారు. మనిషి బాగా పీక్కుపోయారు. పనీపాటలు మానేసి కొంతకాలం విశ్రాంతి తీసుకోమని లక్ష్మి ఎంత మొత్తు కున్నది! వింటేనా? ఊళ్ళోవాళ్ళకు శేషపాన్పులు వేసేముందు తనకు తినడానికి మడతకుడుము లున్నాయో లేదో చూసుకోవాలి! ఎంతసేపూ పరమార్థమే అను కుంటే శరీరం కాస్తా మూలబడుతుంది. శరీరమే తీర్థం అన్నారు పెద్దలు! ఎంతో నచ్చజెప్పాక. సద్గురుప్రభువుమీద ప్రమాణం చేయించాకగాని ఒప్పుకోలేదు— రోజూ ఒకపూట మఠానికి వస్తానని. సాయంత్రంపూట సత్సంగ సమావేశానికి హాజరవుతానని! వంటతనితో రోజూ నెయ్యి. పాలమీది మీగడతీసి వేరుగా ఒక గిన్నెలో పెట్టిఉంచమని చెప్పింది! బాలదేవ్ రావడం రామదాసు కిష్టం లేదు....ఏది ఎలాగైనా లక్ష్మి బాలదేవ్ సేవచేయడానికే నిర్ణయించుకున్నది. ఇప్పుడు బాలదేవ్ రావడంలో ఏమాత్రం ఆలస్యంజరిగినా లక్ష్మిహృదయం కొట్టుకులాడుతున్నది; మనస్సు చంచలమైపోతున్నది. సద్గురుప్రభువు చెప్పనే చెప్పారు—

జీవా! ఈ మన సెంతో
చంచల మైనదిరా
నిన్ను మోసగించేనురా!
మనస్సుకు లక్ష ద్వారాలురా!

లక్ష్మి మనస్సు చంచలమైపోతున్నమాట నిజం; కాని ఆమె మనస్సులో చొరుడనేవారు లేరు. బాలదేవ్ దొంగతనంగా ఆమెహృదయంలో ప్రవేశించలేదు. మనస్సుకు లక్షద్వారా లున్నాయి: కాని బాలదేవ్ ఒకేసారి లక్షద్వారాలగుండా తన మనస్సులో ప్రవేశించాడు. లక్ష బాలదేవ్‌లు!

## ముప్పై ఏ

అఖిలభారత మెడికల్ గజెట్‌లో డా॥ ప్రశాంత్, మలేరియాలజిస్ట్ రిసర్చి శాలాకు అరునెలల రిపోర్టు అచ్చయింది. గజెట్ సంపాదకవర్గంలో భారతదేశం లోని అయిదుగురు డాక్టర్లున్నారు. ఈ రిపోర్టుమీద వాళ్లు తమ తమ అభిప్రాయా లనుకూడా ఇచ్చారు. మద్రాసుకుచెందిన డా॥ టి. రామస్వామి, ఎమ్.ఎస్.సి; డి.టి.

ఎమ (కేలి.) పి.హెచ్‌డి. (ఎడిన్) ఎఫ్.ఆర్.సి.జె; (ఎడిన్) ఇలా రాశారు: మలేరియా, విషజ్వరం - వీటివిగురించి ఇంతవరకు మనకు తెలియవటువంటి వివిధ వాస్తవాలను బహిర్గతం చేయగలరనే నమ్మకం మాకు కలిగింది. ఆదిలో కనిపెట్ట బోయే కొత్త ఔషధంకోసం, నూతన ఉపచారవిధానాల అవకాశాలనుగురించిన సంగతులకోసం యావత్ వైద్యప్రపంచం ఎదురుతెన్నులు చూస్తున్నది.

ప్రశాంత్ వివరంగా ఇచ్చిన రిపోర్టులో మలేరియా విషజ్వరానికి సంబం ధించిన నేల, వాతావరణం. ఆ వాతావరణంలో పెరిగే ప్రాణులనుగురించి కొత్త సంగతులు రాయడం జరిగింది. తన రిపోర్టులో డాక్టర్ ఒకచోట ఇలా రాశారు:

'ఇక్కడి ప్రజలు ఉదయంలేచి చద్దిఅన్నం తిని జనుం శుభ్రంచేయడానికి మురికినీటిగుంటలో దిగుతారు; అలా ఆ నీళ్ళలో ఏడుగంటలవరకు ఉంటారు. ఆ మురికినీటిగుంటల అడుగుభాగానవున్న మట్టిని పరీక్షిస్తే ఒక లక్ష దోమలగుడ్లు లభించగలవేమో ననిపిస్తుంది. అయితే ఇక్కడి దోమలు మురికినీటిగుంటల్లో ఎక్కువగా గుడ్లు పెట్టవు. కొన్నికొన్ని గ్రూపులు నిర్మలంగానూ, స్వచ్ఛంగానూ వున్న చెరువులలోనే గుడ్లు పెట్టడం కద్దు! ఇవి స్వచ్ఛత ఇష్టపడతాయి. పాపం కుంబేళ్ళకు - వాటి నాలుకలమీద పొడసూపే పొక్కులు, చెవులదురద, లేత ఆకులు నయించకపోవడం, విషజ్వరలక్షణాలని ఏం తెలుసు?

మనిషికి శత్రువులైన క్రిమి-కీటకాలనుగురించి డాక్టర్ ఇలా రాశారు: దోమలనివారణకుగాను ఎప్పుడో చెప్పిన విధానాలనే కళ్ళుమూసుకొని మనం ఈనాడు కూడా పాటిస్తున్నాం. మనం నివారించే క్రిమికీటకాలనుగురించిన సంగతులు మన కేమీ తెలియవు. వాటి అలవాట్లు, స్వభావస్వరూపాలు, వాటిపద్ధతులు మనం అధ్య యనం చేయవలసిఉన్నది....ఎనోఫిలీజివ్‌లోకూడా చాలా గ్రూపులున్నాయి. ప్రతి గ్రూపుకు కొన్ని ప్రత్యేకమైన పద్ధతులున్నాయి; ప్రతిగ్రూపుకు రకరకాలైన చిన్న చిన్న సబ్‌గ్రూపు లున్నాయి. వీటి అలవాట్లు, గుడ్లుపెట్టేవిధానంలో వైరుధ్యం కన్పిస్తున్నది. అవి దాగివుండేపద్ధతులు, వాటి ఇష్టాయిష్టాలు భిన్నంగా ఉంటాయి. ఒకేగ్రూపుకుచెందిన దోమలు మూడురకాలైన గుడ్లుపెట్టడం నేను గమనించాను. ప్రతిగ్రూపులోనూ గాలిలో గుడ్లుపెట్టే ప్రత్యేకతరగతి ఒకటి ఉన్నది....వీటి తెలివితేటలకు, నేర్పరితనానికి ఉదాహరణ ఏమిటంటే, ఒకే ఒక ఋతువులో, ఒకే

ఒక గ్రూపుకుచెందిన దోమలు కాటువేయడానికి వదిహేనురకాలపద్ధతుల్ని ప్రయోగించి చూస్తాయి. కొన్నిఅయితే డైవ్ ఫ్లయింగ్‌చేస్తూ దాడిచేస్తాయి.'

ఇవిగాక డాక్టర్ మలేరియా, విషజ్వరంలో రక్తమార్పును గురించికూడా అనేక కొత్తవిషయాలను బహిరంగపరచడం జరిగింది.

మమత ఉత్తరం రాసింది:—'పాట్నా మెడికల్ కాలేజీ చాలా గర్వపడుతున్నది - బీహారుకుచెందిన ఏకైక మలేరియోలజిస్ట్ డా॥ ప్రశాంత్ ఇక్కడ చదివినవాడేనని!' మమత ఇంకా చాలాసంగతులు రాసింది. ప్రశాంత్ మరచిపోయిన సంగతులు, మరచిపోవాలనుకొంటున్న సంగతులు - ఎన్నో రాసింది.... పాట్నా క్లబ్ పేరు పాటలీపుత్రం క్లబ్‌గా మారిపోయింది. మిస్ రేవా సర్కార్ బ్యాడ్‌మింటన్‌లో రామేశ్‌పాల్‌ను ఓడించింది.....ఈ విషయాలలో ప్రశాంత్‌కు ఏమాత్రం అభిరుచి లేదు. అయితే మమత తన ఉత్తరంలో ప్రతి చిన్నవిషయాన్ని గురించి ఉల్లేఖిస్తుంది....పాట్నా మార్కెటు ఎదురుగావున్న టీ హోటలు ముసలియజమాని చనిపోయాడు. నీకు గుర్తుండే ఉంటుంది - నీకు నమస్కారంచేసి టీ తాగడానికి నిన్ను ఆహ్వానిస్తూ ఉండేవాడు రోజూ! కాశ్మీరీ టీ!.... ప్రశాంత్‌కు నవ్వొస్తున్నది. పాపం మమతకేం తెలుసు. చేపముక్కకోసం పెంపుడు ముంగిస ఆటలాడుతూంటే కలిగే ఆనందం అతనికి మరే ఇతర ఆటల్లోనూ లేదని! ప్రశాంత్ ఎప్పుడూ స్పోర్ట్స్‌మన్ కాదు; ఏ ఆటల్లోనూ ఆటగాడు కాదు! అయితే ఆటలంటే అభిరుచి వున్నది. అతనికి పేకముక్కల్ని ఎప్పుడూ ముట్టుకోనైనా ముట్టుకోలేదు. కాని పేపర్లలోపడే వీక్లీ బ్రిడ్జ్ నోట్సు చాలా ఆసక్తిగా చదువుతాడు. చర్చిల్ ఉపన్యాసం చదవడమైనా మానేస్తాడుగాని కలకత్తా ఐ. ఎఫ్. ఏ. మ్యాచెస్ రిపోర్టులు చదవకుండా ఉండలేడు....ఇప్పుడు ఆరితేరిన ఆటగాడుగా మారిపోయాడు! ముంగిస గుర్రుపెట్టడం, అరవడం, తోకరోమాలను నిజబెట్టి దాడిచేయడం, దాడి చేస్తున్నప్పుడు దానిగోళ్ళు గీరుకుపోకుండా చూడడం - ఇవన్నీ చేస్తున్నాడు. స్పోర్ట్స్‌మన్ స్పిరిట్ అంటే ఇదిగాక మరేమిటి?

డాక్టర్ మమతా శ్రీవాస్తవ! దర్భంగాలో ప్రఖ్యాతివహించిన డాక్టర్ కాశీప్రసాద్ శ్రీవాస్తవ కూతురు మమత. డాక్టరుపరీక్ష ప్యాసైనతరువాత హెల్త్ యూనిట్ నొకదాన్ని స్థాపించింది. పట్టణానికి లోని బీదలపేటల్లో ఈ యూనిట్

ప్రశంసనీయమైనసేవ చేసింది. పాట్నాలో సాంఘికసేవచేసే మహిళలలో మమత పేరు ప్రప్రథమంగా పేర్కొనడం జరుగుతుంది. బీదప్రజల గుడిసెలదగ్గర్నుంచి గవర్నమెంటు హౌస్‌దాకా ఈమె వెడుతూ వస్తూఉంటుంది. ఆమెతో సన్నిహిత సంబంధంవున్నవాళ్ళు చెప్పేదేమిటంటే - మమతాదీదీ రోజుకు నాలుగుగంటలు మాత్రమే విశ్రాంతి తీసుకుంటుందని। దూరంనుంచి చూసేవాళ్ళు కొందరు ఆమె శీలాన్ని శంకించడం కద్దు। ఆమె నవ్వు కొందరికి భ్రమ కలిగిస్తుంది. పనీపాటా లేకుండా విమర్శించడమే పనిగా పెట్టుకొని కాలిమీద కాలేసుకొని కూర్చొని, పిచ్చాపాటీ మాట్లాడుకునే కొందరు 'పెద్దమనుషుల' కథనమేమిటంటే - రకరకాలవలలు పన్ని గవర్నమెంటునుంచి డబ్బు గుంజడమే మమతాదేవి కార్యక్రమం।.... ఎవరో మినిస్టరుపేరుకూడా చెప్పుకొని వికటంగా నవ్వుతూఉంటారు - మిస్ మమతా శ్రీ వాస్తవ కాదు - మిసెస్....అనండి।

డాక్టర్ ప్రశాంత్ మమత కెంతో రుణపడివున్నాడు. మమతవల్లనే అతనికి ప్రేరణ కలిగింది.

'డాక్టర్। రోజూ డిస్పెన్సరీతెరిచి శివుడి విగ్రహంమీద నాలుగుపూలువేసి, ఆపైని భయంకరమైన అంటువ్యాధులు ప్రదలిపోవాలని అనుకుంటూ కుర్చీలో కూర్చోవడం, లేదా తన బంగళాదగ్గర వందలాదిరోగులను తనకోసం ఎదురుచూసేట్టుచేసి తాను వాళ్ళిచ్చిన నోట్లను లెక్కపెట్టుకోవడంలో నిమగ్నం కావడం, మెడికల్ కాలేజీ విద్యార్థులముందు తన పాండిత్యాన్నిగురించి ప్రగల్భాలు పలకడం, దీంతోనే తనపని ముగిసిందని భావించడం, ఆస్పత్రిలో పేదసాదలైన రోగుల ఆర్తనాదాలను జీవితంలో అదీ ఒక సంగీతమేననుకొని దులిపేసుకొని జీవించడం డాక్టరు చేయవలసిన పనులుకాదు। ఇలా చేయడం తమ కర్తవ్యాన్ని తాము విస్మరించడమే అవుతుంది।'

....మమతకు ప్రశాంత్‌మీద అనుమానంగా ఉన్నది. మారుమూల గ్రామాలలో ఉంటూ ప్రశాంత్ తమ చేసిన తప్పిదానికి విచారిస్తున్నాడని ఆమె భావన। అందుకని ఆమె తన ప్రతిఉత్తరంలోను పట్టణంలోని సామాజికజీవితాన్నిగురించి కొన్ని సంగతులు రాస్తూఉంటుంది. ఒక ఉత్తరంలో ఆమె ఇలా రాసింది : 'బుష్‌షర్ట్ ప్రచారం బాగా పెరిగింది. అయిదుసంవత్సరాలక్రిందట బాంకీపూరు వీథులలోనూ,

పార్కుల్లోనూ, మైదానంలోను దానాపూరు కంటోన్‌మెంట్ ఇంగ్లీషు సైనికులు వ్యవహరించిన తీరుతెన్నుల ప్రదర్శించిన అనైతికకృత్యాల ప్రభావం మన అచేతన మనస్సులమీద బాగా పడింది. యుద్ధవిషవాయువులు ఇంతకుముందే సమాజం లోని ప్రతివ్యక్తి మానసాన్ని విస్తృతం చేసిపార వేసింది. నల్లబజారుచీకట్లో ఒక కొత్త ప్రపంచసృష్టి జరిగిపోయింది. అక్కడికి సూర్యునివెలుతురు పోకదు; నక్షత్రాలు కప్పించవు!.... ఈ ప్రపంచంలో తల్లీ-కొడుకు, తండ్రీ-కొడుకు, అన్నా-చెల్లెలు, భార్యా-భర్తలు - ఈ సంబంధాలే నశించిపోయాయి. నిన్న ఒక కదు పేద వాదు విటమిన్ సి. ఇంజెక్షను ఎనిమిదిరూపాయలుబెట్టి కొన్నాడు. అయిదు అణాలు ఒక్కో యాంపుల్!

....మా వీధిలోని మహరాజ మెహతాను నువ్వెరుగుదువుగా? అతని చిన్న కూతురు పుల్‌మతియా, చట్టిచేతులతో చప్పట్లుకొడుతూ నాట్యంచేస్తూ ఉండేది - ఆ పిల్లను నువ్వు మరచిపోయివుండవు. మొన్నటినుంచి ఆస్పత్రిలో ఉన్నది. రామ నవమిరోజున కొత్తచీరె కట్టుకొని రామమందిరానికి వెళ్ళింది. రాత్రి రెండుగంట లకు పోలీసులు సిటీపార్కులో ఎక్కడో మూలుగుతూఉంటే ఆమెనుచూసి తీసు కొచ్చారు! ఆమె చెప్పినదాన్నిబట్టి - ఛేడీసీమ్ వీధిదగ్గర ఒక కారొచ్చి ఆగిందట! ఇద్దరువ్యక్తులు కార్లోనుంచిదిగి ఆమెను బలవంతంగా ఎక్కించుకెళ్ళారు.... పెద్దింటి కుర్రాళ్ళలాగా ఉన్నారట! దాబుగా వున్నారట!....

'మంజర అలీ రోడ్డునుంచి అశోక్‌పథ్‌దాకా పది విదేశీ మధుపానశాల లున్నాయి.

'....నిన్న విలింగ్‌డన్ హాల్‌లో టి. బి. శానిటోరియమ్‌కోసం స్థానిక మహిళా కళాశాల విద్యార్థినులు ఒక చారిటీ షో అరేంజ్ చేశారు. వాణి (బారిస్టరు ప్రాణమోహన్ సిన్హా కూతురు) స్టేజిమీదికి రావడంతోనే గ్యాలరీలోనుంచి అణాలు, బేడలు విసిరేయడం సాగించారు. చాలా అసహ్యంగా కేకలు పెట్టారు. పోలీసులు వచ్చారు, శాంతిభద్రతలు కాపాడేందుకు! కాని వాళ్ళమీద రాళ్ళవర్షం కురిపించడం జరిగింది. హాలు కిటికీలగ్లాసులన్నీ ముక్కలు చెక్కలు అయినాయి. చాలామందికి గాయాలు తగిలాయి. గాయపడినవాళ్ళల్లో ఆడవాళ్ళు, పసిపిల్లలూ ఎక్కువమంది ఉన్నారు.... అన్నిటికంటే ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే - ఈ అల్లరికి కార

కుడు, నాయకుడు, పీజు బాబాయికొడుకు అమరేశ్ సిన్హా। ప్రాణమోహన్‌బాబు ఈమధ్యనే అమరేశ్‌ను వాళ్ళింటికి రావద్దని అన్నాడట। మద్యం సేవించివచ్చి ఎన్నోపర్యాయాలు వాళ్ళింటో పనిచేసే పనిమనుషులతో చాలా నీచంగా వ్యవహరిస్తూ ఉండేవాడని తెలిసింది. ఈకారణంగా అతగాడు ఆమెపట్ల ఈరకంగా బదులు తీర్చుకున్నాడు।'

... బంగళా వక్కఅడవిలో సంథాల్ ఆడవాళ్ళు కర్రలుకొట్టుకుంటూ పాటలు పాడుకుంటున్నారు. కొంతకాలం క్రిందట ఈ ప్రదేశంలోనే కొందరు సంథాల్‌స్త్రీలు ఒక చిరుతపులిని గొడ్డలితో కొట్టిచంపారు. గోల విని గ్రామప్రజలు ఏకమైనారు. చచ్చిపడివున్న చిరుతపులిని చూసేప్పటికి కొంతమందికి దారు బుట్టింది. కొందరైతే పిక్కబలం చూపించారు. సంథాల్‌స్త్రీలు నవ్వుతూ మామూలుగానే వున్నారట। మొక్కజొన్న గింజల్లాంటి తెల్లటి పలువరస। అదే అమాయకమైన చిరునవ్వు। అకస్మాత్తుగా చిరుతపులి వాళ్ళమీదికి దూకేప్పటికి కొందరికి గాయాలు తగిలాయి. వాళ్లుకూడా అలాగే చిరునవ్వులు చిందిస్తున్నారు। వాళ్ళగాయాలు కడిగి పట్టీ కట్టేప్పుడు డాక్టర్ రోమాలుకూడా నిక్కబొడిచాయి। సంథాల్‌స్త్రీల పెదవుల మీద చిరునవ్వులు తాండవిస్తున్నాయి.

....హ హ హ। గాయాలమీద బాధకలిగించేమందు వేస్తున్నప్పటికీ వాళ్ళలా నవ్వడం డాక్టర్‌కు ఆశ్చర్యాన్ని కలిగించింది। అలా ఎప్పుడూ జరుగలేదు।

నిగనిగలాడే శరీరాలు, కొప్పుల్లో శిరీష కుసుమాలు। సంథాల్ ఆడవాళ్ళు పాడుకుంటున్నారు—

ఛోటీమోటీ పుఖరీ చరకులియా పిండరే
పోరోయిసి పూట్‌లాలేలాల్
పాన్‌చ్ తేరీ పూల్ దేఖీ పూలయ లాబేలట్
పాస్ బే తేరీ ఆధాదిన్ లగిత్।

నాలుగువైపులా గట్లు వేయబడిన చిన్న తటాకంలో ఎర్రటి తామరపూలు వికసించాయి. ఆ పూలనుచూసి నువ్వు ముగ్ధుడవైనావు. నన్ను చూసికూడా నువ్వు సమ్మోహితుడవవుతున్నావు। కాని ఆ మోహం అరరోజుకూడా ఉండడంలేదే....

కాదు, కాదు; అలా ఎప్పటికి కాదు; ప్రాణాలలో కలిసిపోయిన రంగుల మోహం అరరోజులో ఎప్పుడూ తొలగిపోదు।

## ముప్పైఒకటి

చర్ఖా సెంటరు పంతులమ్మ మంగళాదేవికి జబ్బు చేసింది.

డాక్టర్ రక్తపరీక్షచేసి విషజ్వరం కాదు, టైఫాయిడ్ అని చెప్పారు. చర్ఖా సెంటర్ మాష్టర్లు ఇద్దరూ తాపిల్దారుగారి దావిట్లో ఉంటున్నారు. పంతులమ్మ భగమాన్ భగత్ పూరింట్లో ఉంటున్నది. భగత్ ఎద్లు బండికోసమని ఒక పూరిల్లు వేశాడు. వచ్చేసంవత్సరం ఎలాగూ రేకులతో ఒక ఇల్లు వేసుకోవాలనే ఉద్దేశ్యం ఉండడంవల్ల ఎద్లూ, బండి కొనడం మానేశాడు. చర్ఖా సెంటర్ తెరిచాక ఊళ్ళో వాళ్ళంతా భగత్‌తో అన్నారు—'మీ ఇల్లు ఖాళీగానే వుందిగా। పంతులమ్మగారు అందులో ఉంటారు. చర్ఖా సెంటర్‌కోసం ఇల్లు తయారయ్యాక మీ ఇల్లు ఖాళీ చేస్తారు.' కోటా వర్మిట్ రోజుల్లో కాంగ్రెసువాళ్ళమాట కాదనడం మంచిదికాదు. కటిహార్‌లో అయితే ఇంతపెద్ద పూరింటికి పదిహేనురూపాయల అద్దె వస్తుంది।

మంగళాదేవి కలరా వ్యాపించినరోజుల్లో రాత్రిళ్ళు నిద్రకూడాపోకుండా రోగులకు సేవచేసింది. ఇప్పు డామె జబ్బు పడేప్పటికి దగ్గరకు వచ్చినవాళ్ళే కన్పించలేదు. చర్ఖా సెంటర్ మాష్టర్లు ఇద్దరూ వంతులవారీగా ఒక్కొక్కగంట డ్యూటీ చేసి వెడుతున్నారు. రాత్రిపూట చివాయే తల్లివచ్చి పడుకుంటున్నది. అయితే ఆ ముసలిది హుక్కా తాగింది, తాగినట్టే ఉండేది; ఇక రాత్రిఅంతా దగ్గుతూ మంగళాదేవి జ్వరం తగ్గడానికిబదులు హెచ్చేపరిస్థితి కల్పించింది. ఇక పడుకున్నదంటే - ఆ దగ్గర్లో వున్నవాళ్ళంతాలేచి కూర్చొనవలసినంత బిగ్గరగా గురక బెట్టేది। ఇలా ఉంటేమాత్రం ఆమె ఆరోగ్యం బాగుపడడం కష్టం - అని డాక్టర్ చెప్పాడు. ఇంటికి ఉత్తరంరాసి ఎవరినైనా పిలిపించుకోవడం మంచిది।

ఇంటికా? ఇంటినుంచి ఎవరైనా వచ్చేవాళ్లుంటే లేదా ఆమెనుగురించి జాగ్రత్త తీసుకునేవాళ్ళుంటే మంగళాదేవి చర్ఖా సెంటర్‌లో ఎందుకు చేరుతుంది?

ఆమె ఇల్లువదిలేసి అయిదుసంవత్సరాలైంది. మంగళాదేవికి ప్రపంచం అంటే ఏమిటో బాగా అర్థమైంది. మనిషిలో దాగివున్న పశుత్వాన్ని ఆమె అత్యంత సమీపంనుంచి వీక్షించింది. వితంతు ఆశ్రమం, అబలాశ్రమం, కలవాళ్ళఇంటి పని మనిషిగా జీవితంకూడ సాగించింది. అదీ అయాక అన్నిచోట్లా అదే! అందం, పడుచుదనం? కాదు, ఈ రెండూ కాదు! ఆడదైతే చాలు. అందంతోనూ, వయస్సుతోనూ నిమిత్తం లేదు. ఒక అసహాయురాలైన ఆడది దైవసాన్నిధ్యంలోవున్నా నిశ్చింతగా నిద్రపోవడం కష్టమే అవుతుంది. మంగళాదేవికి ఇల్లూ వీధీ రెండూ ఒకటే! ఇంటిలో పస్తు, వీధిలో దస్తు! అయినా ఆమెకు అయినవాళ్ళెవరూ లేరు!

'ఎవరూ? కాళీచరణ్ బాబూ? మీరా?'

'డాక్టర్‌గారు ఈ పూరిగుడిసెలో మీ ఆరోగ్యం బాగుపడదని చెప్పారు. మేము పాటలు పాడుకునే గది ఖాళీగానే ఉన్నది; శుభ్రంగా ఉంటుంది; గాలి వెలుతురుకూడా బాగా వస్తుంది!'

మంగళాదేవి యాదవులపేటలోని కీర్తనగదిలోకి మకాం మార్చింది. ఇంట్లోనే సోషలిసుపార్టీ ఆఫీసుకూడా వున్నది. కాళీచరణ్ దీన్ని ఆఫీసు అనే అంటాడు. అయితే మంగళాదేవి సోషలిస్టుపార్టీ ఆఫీసుకని ముందే చెప్పివుంటే వచ్చేదికాదు!

'మందు తాగండి!'

'తాగను!'

'తాగండి! మందు తాగండి, పంతులమ్మగారూ!'

'కాళీబాబూ! ఒకసంగతి చెప్పనా?'

'చెప్పండి!'

'మీరు నన్ను పంతులమ్మగా అనకండి!'

'అయితే ఏమనమంటారు?'

'ఏం? నాకు పేరులేదనుకున్నారా?'

'మంగళాదేవి!'

'కాదు!'

'ఏమిటి మరి?'

'మంగళా అంటే చాలు!'

'మందు తాగండి!'

'మంగళ అనండి!'

'మంగళా!'

పదిహేనురోజులుగా కాశీచరణ్ మంగళాదేవి బాగోగులు చూస్తున్నాడు. పగలు ఇతరులుకూడా ఉంటారు. కాని రాత్రిపూట కాశీచరణ్ ఒక్కడే అపసీ తుపసీ చూస్తాడు. ఫరవాలేదని డాక్టర్ అన్నాడు. అయితే బలహీనత అలాగే వున్నది. కొద్దిరోజుల్లో అదీ తగ్గిపోతుంది.

మంగళాదేవి శరీరంలో ఎముకలుమాత్రం మిగిలాయి. జుట్టుకూడా ఊడి పోతున్నది. తినేవిషయందగ్గరకు వచ్చేప్పటికి చిన్నపిల్లలలాగా మారాం చేస్తుంది. ఏడుస్తుంది. పాత్రలు గిరాటేస్తుంది....అబ్బా ఈ బార్లీ నేను తాగలేను. ఈ జావ్లు నీళ్ళుకూడా ఎవరైనా తాగుతారా? కాశీచరణ్ గిన్నెపుచ్చుకొని ఎదురుగా కూర్చొని ఆదేపనిగా బతిమలాడతాడు!— తీసుకోండి! ఇందులో విష్ణుకాయ పిండాను. రేపు కాదుగాని, ఎల్లుండి మీకు పథ్యం! ఎంతకావాలంటే అంత అన్నం తినెయ్యవచ్చు!

కాశీచరణ్ వ్రతం కాస్తా నీరుకారిపోయింది. కుస్తీనేర్పిన గురువు— 'ఒరేయ్! నువ్వు గొప్ప పహల్వాన్ కాదలిస్తే ఆడవాళ్ళకు అయిదుబారలదూరంలో ఉండాలి!' అని ఆదేశించాడు. ఆ ఆదేశం కాస్తా అమలు జరగలేదు. అయిదుబార్ల దూరంలోవుంటే మంగళాదేవి మంచిచెడ్డలు చూడ్డానికి వీలుండదు. పక్కమార్చే ప్పుడు, ఆమె బట్టలు మార్చేప్పుడు, వళ్ళు తుడిచేప్పుడు కాశీచరణ్‌కు గురువుగారి ఆదేశం గుర్తుకొస్తూ ఉండేది. కాని ఏమిటి చేయడం?

'కాశీ ఎక్కడి కెళ్ళావు? కాశీ?'

'ఏమిటి?'

'ఉత్తరం! ఎవరు రాశారు?'

'పార్టీ కార్యదర్శి రాశాడు. సోమవారంనాడు పార్టీ ర్యాలీ వున్నదట!.... కాని, నే నెలా వెళతాను?'

'ఏం? వెళ్ళు! నా ఆరోగ్యం బాగయిందిగా!'

ర్యాలీతరువాత కార్యదర్శి కాళీచరణ్‌ను అపారు—'కా॥ మేర్! మీరు మరో రెండురోజులు ఉండండి. సైనిక్‌గారి భార్య ఆస్పత్రిలో వున్నది. ఆయ నేమో పాట్నా వెళ్ళారు. ఎల్లుండిగాని రారు. ఆస్పత్రికి రెండుపూటలా భోజనం తీసుకెళ్ళాలి....ఎవరూ లేరు!'

కార్యదర్శిమాట కాదనడం చాలాకష్టం. కా॥ మేర్ భార్య!....కాళీచరణ్‌కు మాటిమాటికీ మంగళ గుర్తుకొస్తున్నది. ఆమె ఎదురుచూస్తూ ఉంటుంది. వాసుదేవ్ వెళ్ళి చెబుతాడు—రెండురోజులతరువాత వస్తాడని! వినడంతోనే మొహం వాడి పోతుంది. మనిషి నగమైపోయింది. ఆలోచనలు స్తంభించిపోతాయి. మొహం చిన్నపిల్లలాగా అయిపోతుంది....కాళీచరణ్ కమలాలు, కిస్‌మిస్‌పళ్ళు పంపిం చాడు. వాటిని చేతులతో అంటుకోదుకూడాను! వాసుదేవ్ ఎలా చెబుతాడు?.... ఛత్! ఈ పట్నం కుర్రాళ్ళుకూడా మహాపోకిరీవాళ్లు! సైకిలు మరీ పక్కగా తీసు కొచ్చి గంటకొడతారు....ఇంకొంచెంఉంటే అన్నం కింద పడిపోయేదే!

'ఒరే మూర్ఖుడా! గ్లాసు అట్లాగేనా కదిగేది!' మూర్ఖుడా! కాళీచరణ్ చెంప మీద ఎవరో ఛెళ్ళుమని కొట్టినట్లనిపించింది. మూర్ఖుడు! అతని శరీరమంతా ఒక్క- సారిగా వేడెక్కి కదిలిపోయింది. సైనిక్‌జీ భార్య అతన్ని ఏమనుకుంటున్నది?.... నౌకరా?

'బహన్‌జీ! గ్లాసు....'

'నోర్మూసుకో! బహన్‌జీ అన్నావంటే వూరుకోను!'

పక్కమంచంమీద పడుకున్న గబ్బిళంలాంటి ఆడది - 'ఎవడో? మనిషా, దయ్యమా? మాట్లాడడంకూడా చేతకాదు!' అని అన్నది.

'నాకు తెలుసు! గొల్లాడు....పెర్రిగొల్లాడు! గొల్లకు....వేపకాయంత....!' సైనిక్‌జీ భార్య ఏమేమో అంటున్నది.

కాళీచరణ్ వినలేకపోయాడు. అతని తల తిరిగిపోతున్నది. సైనిక్‌కూడా గొల్లవాడేగదా! కాళీచరణ్ కళ్ళముందు ఆవపూలవంటి వస్తువులేవో మెదులు తున్నాయి! ఇక మాటలుగనుక మగవాడనివుంటే - రక్తం కళ్ళజూసేవాడు! కాళీ

చరణ్ కణతలు వేడెక్కిపోయాయి....మంగళాదేవికూడా అదవేనే। మంగళాదేవి ఎక్కడ? ఈ భూతం ఎక్కడ?...మాటలు చూడబోతే గుంటనక్క మాట్లాడి నట్లు, కరిచేట్టు మాట్లాడుతున్నది. ఖేంక్। ఖేంక్। మని పళ్ళతో రక్కినట్టుగా వున్నది. బహుశా ఇదికూడా ఒక జబ్బే అయివుంటుంది।

రౌతహట్ స్టేషన్‌లో రైలుదిగి కాళీచరణ్ గబగబా ఇంటికి బయలు దేరారు....అతన్ని చూడడంతోనే మంగళ సంతోషంతో ఎగిరి గంతేస్తుంది. తాను పంపించిన పళ్ళు కమలాలు, కిస్‌మిస్ అలాగే ఎండిపోతూఉంటాయి। రైలుచార్జీల్లో కొంతడబ్బు మిగిల్చి కాళీచరణ్ బిస్కట్‌ప్యాకెట్టు ఒకటి కొన్నారు. డాక్టర్‌గారు మంగళకు బిస్కట్లు పెట్టమని చెప్పారు. కాళీచరణ్ ఇంతకుముం దెప్పుడు బిస్కట్ అనేది విని ఎరగడు। బహుశా ఇందులో కోడిగుడ్లు కలుపుతారేమో? మాటిమాటికీ బిస్కట్ ప్యాకెట్టును అంటుకొని మరీ చూశాడు. దీనిలోపల 'గుడు గుడు'మని ఏమిటో అంటున్నది? కోడిగుడ్డు పగిలి....?

'సీతారామ్। సీతారామ్। జై హింద్ కాళీబా।'

'ఎవరూ? బావన్‌దాసుగారా? నేను ఉలిక్కిపడ్డాను। మీ రిక్కడున్నా రేమిటి?'

'కళ్ళు మూసుకొని మీరు వరేసా గుర్రంలాగా ముందుకు పరుగెడు తున్నారు।...'

అడవి రేగుచెట్టుకింద పడుకొనివున్నారు బావన్‌దాసు। వీడకు వెళ్ళినతరు వాతగాని ఎంత ఎంత తీక్షణంగావున్నదీ కాళీచరణ్‌కు బోధపడలేదు,

'నేను రాత్రిబండిలోనే వచ్చేశాను. నిన్న 40 వ సెక్షన్ తీర్పు చెప్పారు।'

'తీర్పు చెప్పారా? ఏమైంది?'

'ఏమవుతుంది? అందరి దరఖాస్తులూ కొట్టివేశారు...నాకు మొదటే తెలుసు। నిన్న వూళ్ళోవి రైతులంతా వచ్చారు. తీర్పువిని అంతా ఉసూరుమన్నారు. కన్నీరు కార్చారు. ఇక జమీందారు పొలాలుకూడా వదిలించుకోవచ్చు।'

'ఎలా వదిలించుకుంటాడు?....మా ర్యాలీలో మేమంతా ఒక తీర్మానం

ప్యాను చేశాం. జమీందార్లు రైతుల్ని పొలాలనుంచి బేదఖలుచేయడానికి వీల్లేదు. ఇందుకు పార్టీ పోరాడితీరుతుంది.'

'కాశీబాబూ! మీ తీర్మానాలవల్ల ఏమీ ప్రయోజనంలేదండి!' పావన్‌దాసు పెదవులమీద నవ్వు కప్పిసుంది.

'దాసుగారూ! మీరు కాసేపు కూర్చోండి! నాకు కొంచెం పనివున్నది. వెళతాను!'

'సరే, మీరు పదండి! నేను మీతో ఎలాగూ నడవలేను!'

కాశీచరణ్ ఆలోచిస్తూ ముందుకు సాగారు. కాగానే జరిగింది. మంచిపనే అయింది. రైతుల దరఖాస్తులు మంజూరు అయివుంటే అందరూ కాంగ్రెసులో చేరుతామని ఎగబడేవారే! ఇక అందరూ సోషలిస్టుపార్టీలోనే ఉండిపోతారు.

'ఏమిటిది? బిస్కట్లా?' మంగళాదేవి ప్రేమగా గద్దిస్తుంది.... 'అనవ సరంగా ఇవన్నీ కొనమని మీతో ఎవరు చెప్పారు? అవిగో మీరుపంపిన పళ్లు-కమ లాలు, కిస్మిస్ పళ్ళు! నేను తినేదిలేదు!'

'డాక్టర్‌గారు తినమనిచెప్పారు....'

'డాక్టర్‌గారు చెప్పారా!' మంగళ కృత్రిమకోపాన్ని ప్రదర్శిస్తూ అన్నది– 'డాక్టర్‌గారు తాను తిండితిప్పలు తినకుండా కమలాలు, కిస్మిస్ పళ్ళు, బిస్కట్లూ తీసుకురమ్మన్నారా?'

కాశీచరణ్‌కు పైవిక్ జీ భార్య గుర్తుకొచ్చింది. మూర్ఖుడా! గొల్లవాడు!....

'తిను మంగళా!'

'ముందు నువ్వొక బిస్కట్టు తినాలి!'

బిస్కట్టు తియ్యగా, కరకరమంటూ ఇంత బావుంటుందా? ఇందులో పాలు పంచదార వెన్న ఉంటుంది; కోడిగుడ్డు ఉండదా?

# ముప్పైరెండు

వైశాఖ, జ్యేష్ఠమాసాలలో సాయంత్రంపూట 'తాళ్ళతోపు' దగ్గర జీవితా నందం కేవలం ముంత మూడణాలకు ముదుతుంది.

తాలింపుళనగలు, బూంది, ఉల్లిపాయలు - తెల్లటి మరుగుతో విండిన కల్లు ముంత। పుల్లగా తియ్యగావుండే 'శకర్‌చినియా' 'బైరచినియా' కల్లు రుచులు వేర్వేరుగా ఉంటాయి. 'బసంతీ' తాగాక బాగా తాగేవాళ్ళకే తిప్పుతుంది. వేడిచేసిన వాళ్ళు 'పహర్‌రతియా' తాగితే మంచిది. గుండె చల్లబడుతుంది; మూత్రం వెళ్ళే వ్వుడు తీపుండదు. కఫం ఉన్నవాళ్ళు సంయూకల్లు సేవిస్తే రాత్రిఅంతా శరీరం వేడిగా ఉంటుంది.

సంవత్సరంపొడుగూ రావణాసురుడి కాష్ఠంలాగే కాలే పోట్లాటలకు తీర్పులు తాళ్ళవనం సమావేశంలోనే జరిగిపోతాయి. మట్టిపెద్దల్లాగా హృదయాలుకూడా ఇక్కడే విరలిపోతాయి. పెళ్ళిళ్ళకు వధూవరులు ఇక్కడే కుదిరిపోతారు. పెళ్ళి చేసుకోదలచిన వాళ్ళుకూడా ఇక్కడే కలుసుకుంటారు. మరొకరిపెళ్ళాన్ని లేపుకెళ్ళే ప్రోగ్రాములు కూడా ఇక్కడే నిర్ణయించుకోవడం జరుగుతుంది.

జగదేవా పాన్‌మాన్, దులారే, సవిచ్చర్ మునరా కల్లు తాగుతున్నారు. సోమాజట్ ఇవ్వాళ్ళ రావలసివుంది. రౌతహట్ సంతలో కప్పించి చెప్పారు— ఆదివారంనాడు తాళ్ళతోపులో కలుసుకుంటానని। సోమాజట్ ఈమధ్యనే జైలు నుంచి విడుదలయ్యాడు. మంచి పేరుగాంచిన దోపిడీదొంగ। అయితే ఇప్పుడు సోషలిస్టుపార్టీ సభ్యుడు కావాలనుకుంటున్నాడు. మునరా కాశీచరణ్‌ను అడిగాడు; కాశీచరణ్ జిల్లా కార్యదర్శిని అడిగాడు; కార్యదర్శి - ఒకసంవత్సరంపాటు అత గాడి ప్రవర్తనంమచూసి పార్టీలో చేర్చుకోవడం మంచిదని, అప్పటివరకు అతన్ని ఒకకంట కనిపెట్టి ఉండవలసిందని చెప్పాడు.

కనిపెట్టి వుండేదేమిటి ? మధ్యమధ్యలో కార్యదర్శిదగ్గరకు వెళ్ళి చెప్పవలసి వుంటుంది- సోమా నడవడి పూర్తిగా బాగయిందని. కాశీచరణ్‌కు వాసుదేవ్ వచ్చ జెప్తతాడు. సోమాగనక పార్టీలోకొస్తే ఆ ప్రాంతంలోవున్న పెద్దమనుషుల్ని ఒక దారికి తీసుకరావచ్చు. పార్టీలో చేరాక పోలీసు లేం జేస్తారు ? కార్యదర్శి అంటే

ఇనస్పెక్టర్‌కంటే ఏం తక్కువ? ఆయన ఉపన్యాసం ఇవ్వడం ప్రారంభిస్తే జవాహర్‌లాల్ నెహ్రూకుకూడా పింజపడేట్టు మాట్లాడేస్తారు. పార్టీకి వ్యతిరేకంగా మాట్లాడటానికి ఇనస్పెక్టరుకు ఎన్నిగుండెలు ఉండాలి? 'ఎర్ర బావుటా' పత్రికలో వెంటనే గజెట్ నోటిఫికేషన్ వచ్చేస్తుంది - 'ఇనస్పెక్టరు దురంతాలు'.

....చరిత్తర్ కర్మకార్‌ను పార్టీలోనుంచి తీసిపారేశారు. పిమెంటులో చాలాడబ్బు తినేశాడు. లెక్కా డొక్కా చెప్పకపోతే తీసెయ్యరా మరి! పార్టీ పిస్తోలు, తుపాకికూడా తిరిగి ఇవ్వలేదు....అయితే కార్యదర్శి కాళీచరణ్‌ను ఒంటరిగా పిలిచిచెప్పారు - ఎలాగో నాటి మచ్చికచేసుకొని ఆ రెండు ఆయుధాలూ తీసేసుకోమని. గవర్నమెంటుకు లెక్కచెప్పాలి. అందుకే కాళీచరణ్ అతగాడితో స్నేహంగా ఉంటున్నాడు....అయితే ఈవిషయం చాలా రహస్యమైంది. నవివరా! జాగ్రత్త! ఎవరితోనూ చెప్పవద్దు. లేకపోతే తెలుసుగా, పార్టీరహస్యాలు బయట పెడితే విధించే శిక్ష?....డాంయ్! ఎవరైనా అడిగితే చెప్పవలసిందేమిటంటే....

'అయితే పార్టీకి ఇప్పుడు తుపాకి, పిస్తోళ్ళతో పనిలేదా?'

'ఉహుఁ, లేదు!' సుందర్ నవ్వాడు. అంటే - ఇంత తొందరగా నువ్వు పార్టీ సంగతులన్నీ తెలుసుకోవాలనుకుంటున్నావా? మరికొన్నిరోజులు గడవనివ్వు! నీ సభ్యత్వం ఖాయం అయ్యాక విషయాలన్నీ తెలుసుకోవచ్చు. కొత్తసభ్యులనోట్లో నువ్వుగింజ నానదు! ఇటు వింటారు, అటు ఊదేస్తారు. ఖాయం కానివ్వు!....

'కామ్రేడ్ బోమా! రా, రా! నిన్నుగురించే అనుకుంటున్నాం. ఇప్పటికి రెండుముంతలు ఖాళీ అయ్యాయి!' సుందర్ నవ్వాడు.

సుందర్ ఈమధ్య ఎప్పుడూ పంజాబీ ఖద్దరులాల్చీ వేసుకుంటున్నాడు. పంజాబీ లాల్చీకి రెండంగుళాలఎత్తున పట్టీ వుంటుంది. దీన్ని 'సోషలిస్ట్ కట్ కుర్తా' అని అంటారు. సోషలిస్టులు కానివాళ్ళు దీన్ని వేసుకోకూడదు. ఊళ్ళోని సభ్యులలో ముగ్గురు మెంబర్లుమాత్రమే ఇలాంటి లాల్చీలు వేసుకుంటారు! కాళీ, వాసుదేవ్, సుందర్! తక్కినసభ్యులు జీవితంలో కనీసం బనీనుకూడా వేసుకోలేదు. సోషలిస్టు కట్ లాల్చీ వేసుకోకపోతే ఇతరుల కెలా తెలుస్తుంది. ఈయన క్రాంతి కారుడని సోషలిస్టు అని ఒక్కొక్క లాల్చీ ఖరీదు ఏడురూపాయలు....వాసుదేవ్

ఈమధ్య బీడీ తాగడంలేదు: మోటారుమార్కు సిగరెట్లు తాగుతున్నాడు. కార్యదర్శి సైనిక్‌జీ, చినగారీజీ, మాస్టరుగారు, తదితర పెద్దపెద్ద నాయకులంతా సిగరెట్లు తాగుతారు. సోషలిస్టుపార్టీ మెంబరు బీడీ తాగకూడదు, సిగరెట్లు తాగాలి.

ఈనాటి సమావేశపుఖర్చు సోమాయే భరిస్తాడు. అందుకని ఎవ్వరూ వెను కాడవలసినపనిలేదు. తాగండి! ఒకముంత, రెండుముంతలు, మూడుముంతలు! వర్ధా సెంటరువాళ్ళు వచ్చేసంవత్సరంనుంచి తాటిబెల్లం తయారుచేస్తామని చెబు తున్నారు. అందుకని తాగటానికి ఏమీ మిగలదు. అందుకని తాగవలసినదంతా ఈ సంవత్సరమే తాగెయ్యండి.

సోమా కాశీచరణ్‌కంటేకూడా భారీగా వుంటాడు. పోలీసులదెబ్బలకు ఎముకలన్నీ గుల్లయిపోయి వంటినిండా బొప్పులు కట్టాయి. బొప్పులుకట్టిన శరీరం చాలా గట్టిగా ఉంటుంది. కాశీచరణ్ శరీరంలో ఏనుగుదంతంలోని కాఠిన్యం ఉంటే, సోమా మొహంమీద లోహకాఠిన్యం కరుడుకట్టుకున్నట్టూ కన్పిస్తుంది. కాశీచరణ్ కళ్ళల్లో నీళ్ళుకనిపిస్తే సోమాకళ్ళు పిల్లికళ్ళలాగా మెరుస్తూఉంటాయి.

'ఎవరూ? హరగౌరి? శివశంకరసింగ్ కొడుకేనా? తాసిల్దారు అయ్యాడా? కాశీచరణ్ ఊఁ, అనాలేగాని రాత్రికిరాత్రి వెళ్ళి ఎముకల్లో సున్నంలేకుండా చేసి రానూ?' సోమా మీసాలకు అంటుకున్న కల్లునురుగు తుడుచుకుంటూ అన్నాడు.

'కామ్రేడ్! నువ్వు మీసాలు తీసేయాంచాలి. పార్టీ మెంబరు మీసా లుంచుకో గూడదు'—సుందర్ అన్నాడు.

'తీసేయిస్తాను. దానిదేముందిలే! కాశీచరణ్ ఆజ్ఞాపించాలేగాని.....!'

'సరే సరే! కామ్రేడ్! కొంచెం తమాయించు! ఘర్షణ రాబోతున్నది. తీర్మానం ప్యాసైంది. నీ ధైర్యం చూపించవలసినతరుణం రాబోతున్నది!'

'బలదేవాగాణ్ణి ఊళ్ళోనుంచి వెళ్ళగొట్టలేరా మీరు? మఠంలోని వంట లక్కతో స్నేహం పెంచుకున్నాడని విన్నాను. కాశీచరణ్ ఆజ్ఞాపిస్తే ఒక్క రోజులో అతగాడికి చిన్నన్‌పట్టీ దారిపట్టిస్తాము!'

'అఁ! ఆ బాలదేవ్ దేముందిలే! పిసుగైపోయాడు! పిసుగ! ఇప్పు డతన్ని గురించి పట్టించుకునే నాథుడే లేడు! పిల్లలుకూడా మాట్లాడరు. కాంగ్రెసుపార్టీలో

కూడా అతనికి చెడ్డపేరు వచ్చింది. మమ్మల్ని చూసుకునే ఎగిరాడు. అంతవరకూ! ఆ వంటలక్క సామాన్యురాలు కాదు; పాములుమింగే స్వాములకు పచ్చగడ్డి ఫలహారమని - అతగాడినే మింగేస్తుంది! ఆమెవలలో పడనియ్! ఇలా జరగాలనే మేము అనుకుంటున్నాం....ఆఁ! ఇక చర్చా సెంటర్ కూడా మన స్వాధీనంలోనే వున్నదనుకో! ఆ పంతులమ్మ కాళీచరణ్‌ను అడగకుండా వచ్చి మంచినీళ్ళుకూడా తాగదు! కొద్దిరోజుల్లో ఆమెకూడా కామ్రేడ్ అయిపోతుంది....ఇక పోతే ఆ మరుగుజ్జు దాసున్నాడు! మూరన్నరమనిషి ఏం చేయగలుగుతాడు?'

నాలుగుముంతలు సాయంత్రపు 'సంయూ' కల్లు తాగటం ముగిసింది. సూర్యాస్తమయపువేళ తాటిచెట్లమీదినుంచి దించేకల్లుతాగితే దానిలో ఎర్రదనం వెంటనే కళ్ళల్లోకి ఎగదన్నుతుంది. విషాకు అర్థం ఇంకొంచెం తాగాలనేకోరిక ఉద్భవించడం!....మరొక ముంత!

'అవునుగాని. ఆ డాక్టరుకు డబ్బెక్కడిది? ఉచితంగా చికిత్స చేస్తారు. ఒక్క పైసాకూడా ముట్టుకోడు!'

డాక్టర్‌దగ్గిర డబ్బు లేదా? ఏమిటి నువ్వనేది?....లోచన్‌పూరులో డాక్టరు బ్రహ్మాండమైన ఇల్లు కట్టుకున్నాడు. శివఛగంజ్‌లోని డాక్టర్ మూడువందల బీఘాల పొలం కొన్నాడు. పిరువా గర్హైయా డాక్టరు పట్టి బందిపోటు దొంగ! బందిపోటు దొంగలకు సర్దారంటే నమ్ము! మీ వూళ్ళో డాక్టరెటువంటివాడు?'

'హసల్‌గాంవ్ హరఖూ నూనెవర్తకుడు బాగా డబ్బు గడించాడు. డబ్బు మూలుగుతున్నది, అతడిగాడిదగ్గర!'

మహమ్మదియా తాలూక్ చంద్‌కు తుపాకి లైసెన్సు ఇచ్చారు. ఇనప భోషాణం ఈమధ్యనే కలకత్తానుంచి తీసుకొచ్చారు!'

'ఏడ్చారులే! నేను పెద్దపెద్ద తుపాకీ ఉన్నవాళ్ళనూ. ఇనప్పెట్టెలున్న వాళ్ళనూ చూశాను!....అవన్నీ నా బల్లెంకింద బలాదూరు! బల్లెంలోనే నేను ఈ ప్రాంతంమొత్తాన్ని చేపల్ని నంజుకున్నట్టు నంజుకున్నాను. నాచేతికి ఒక్క తుపాకి చిక్కివుంటే - భూపతిసింగ్ కచేరీలోవున్న నేపాలు పహరావాణ్ణి సఫాచేసి వుండేవాణ్ణి!'

పాట రానివాడుకూడా నిషాలో వున్నప్పుడు కూనిరాగాలు తీస్తాడు. సుందర్ మంచి పాటగాడు. స్వరాజ్యగీతాలూ పాడతాడు; విప్లవగీతాలూ పాడతాడు। నిషాలో వున్నప్పుడు విప్లవగీతాలే బాగా రక్తికడతాయి—

ఈ జీవితమే ఒక విప్లవం।
ఇందులోనే కలిసిపో।
పెట్టుబడిదారీ వ్యవస్థ నశించాలి।

సనిచరా కల్లుముంతను తిరగేసి తబలావాయిద్యం వాయిస్తూ, నోటితో అంటున్నాడు - చకేకే చకధుమ్ మక్కై కేలావా....

ప్రపంచ పేదల
పిల్చినవా దెవడూ
అవునోయ్ పిల్చినవా దెవడూ
చెప్పవోయ్ పిల్చినవా దెవడూ
ఆ పిల్చినవాడిని పిలుస్తా
పిల్చేస్తాన్ పిల్చేస్తాన్।
వస్తూనే పేల్చేస్తాను
వస్తూనే। వెళ్ళిపో।

'ఆహాహా। ఎంతబావుంది। విప్లవం వర్ధిల్లాలి। ఏదీ కొంచెం నిలుచుని నాట్యభంగిమంలో నడుం ఒకపక్కకు వయ్యారంగావంచి మరీ పాడాలి।'

సుందర్ నిలబడి నాట్యంచేయడం ప్రారంభిస్తాడు - ఈ జీవితమే ఒక విప్లవం।

అహా జీవితమే...।
చకేకె చకధుమ్ మక్కై కెలావా....

కాళీచరణ్ సాయంత్రం సమావేశం ఏర్పాటు చేశాడు. పుర్రైనియా అనే పెద్దలీడరు వస్తున్నాడు. పర్సుకోసం చందాలు వసూలుచేయాలి. అందరికంటే పెద్ద లీడరు పుర్రైనియా రావడానికి ఇష్టపడలేదు. ఎంతో బతిమలాడి, పదివేలరూపాయల పర్సు ఇస్తామంటే ఒప్పుకొని వచ్చారు। కాళీచరణ్ మూడువందలరూపాయలు వసూలుచేసి ఇవ్వాలి.

ఈసారివచ్చిన రశీదు పుస్తకాలమీద అందరికంటే పెద్దలీడరు వంతకం అచ్చయివున్నది అని కార్యదర్శి అన్నాడు.

'అవునుగావి. మీ రెక్కడికి వెళ్ళారు?.... ఓహో! ఆకాశవనాధికా? చాలా ఆలస్యం చేశారు. ఇలాచేస్తే పార్టీపనులు ఎలా నడుస్తాయి? చెప్పండి. ఎవ రెంత డబ్బు వసూలుచేస్తారు? మూడువందలరూపాయలు పదిరోజుల్లో వసూలుచేసి ఇవ్వాలి!'

'మూడువందలేనా? ఏం ఫరవాలేదు. వసూలవుతుంది!'

'పదిరోజు లెందుకు? ఐదురోజుల్లో వసూలవుతుంది!'

'మూడువందల రూపాయలు ఒక లెక్కా?'

'విప్లవం వర్ధిల్లాలి!'

## ముప్పైమూడు

అమంగళం!

'ఊరు పండితే ఊకైనా దొరుకుతుంది అంటారు. ఊరు పండడంకాదు; మండేలా ఉన్నది. ఊరికి మంచిరోజులు రాలేదు.'

హరగౌరీ తాసిల్దారు దుర్గాదేవి వాహనంలా గాండ్రిస్తున్నాడు—'నాయాళ్ళంతా 40 వ సెక్షన్ దరఖాస్తు ఇచ్చారుగదా. పొలం స్వాయత్తమవుతుందని చంక లెగరేశారు. ఇప్పుడు తెలిసిందిగా! మరుగుజ్జువాడి దగ్గర్నుంచి, బాలదేవ్‌దగ్గర్నుంచి పొలం లాగెయ్యండి. నాయాళ్ళందర్నీ పొలాల్లోనుంచి ఖాళీ చేయించమని మేనేజరుగారు ఆదేశించారు! అప్పనంగా దొరికిందిగదా అని అందరూ ఎగబడ్డారు.... కాంగ్రెసోళ్ళ రాజ్యమైతేమటుకు జమీందార్ల మ కరిగించి తాగేస్తారా ఏమిటి?'

సుమరితదాసు పైర్లెన్‌నాలుకకు అలసట లేదూ, అలుపూలేదు! ఉదయం నుంచి టెకటెకమంటూనే వున్నాడు. తాంత్రికులపేటనుంచి, దర్బానులపేటకు, అక్కడినుంచి కూరగాయలు పండించేవాళ్ళపేటకూ కాలుగాలిన పిల్లిలాగా తిరుగుతూ కన్పించిన వాళ్ళందరితోనూ సోది చెబుతున్నాడు—'మేనేజరుగారు పర్మా

వాలో ఏం రాశారో తెలుసా? అదిచూసి కొత్త తాసిల్దారు కుపానవాలయ్యాయి. నేను నర్ది చెప్పాను–'అయ్యా తాసిల్దారుగారూ! మీరు నోరు కదపకుండాఉండండి! దరఖాస్తులు ఇచ్చేవాళ్ళను ఇవ్వనివ్వండి. కేసు విచారణ జరిగేనాటికి ఒక్కరోజు ముందు నాకు చెప్పారంటే నేను మీకొక కిటుకు చెబుతాను' అని! అలాగే చెప్పాను. నేను చెప్పినట్టే అయింది. జమీందారుగారి వకీలు కోర్టులోనే ఎగిరి గంతేశాడట. ఆ సంతోషం పట్టలేక!....ఆ తరువాత మేనేజరు ఏం చేశాడో తెలుసా? సుమరితదాసుగారిని ఒక్కపర్యాయం సర్కిల్ కోర్టుకు పంపించండి! ఈ సోషలిస్టులూ, కాంగ్రెసోళ్ళూ ఏం చేస్తారు?'

'సుమరితదాసూ! ఈ వృద్ధాప్యంలో నీ గౌరవం దక్కించుకోవాలని నీకుంటే అవాకులు చెవాకులు పేలడం మానేసి, కాస్త వళ్లు దగ్గరబెట్టుకొని మసులుకో! తెలిసిందా? కాళీచరణ్ కళ్లు చింతనిప్పుల్లాగా ఉన్నాయి. ఉదయంనుంచీ అతను సుమరితదాసుకోసం వెదుకుతున్నారు. సోషలిస్టుపార్టీనిగురించి నిన్నటి నుంచి నోటికొచ్చినట్టల్లా మాట్లాడేస్తున్నారు. తలా తోకాలేని ప్రచారం చేస్తు న్నారు.'

'తెలిసిందా? తరువాత మళ్ళా మీరే అనబోతారు - ఈ సోషలిస్టుపార్టీ కుర్రాళ్ళకు పెద్దా చిన్నా అనే తారతమ్యం లేదని!'

'నేనేమన్నానని? అడుగు వీళ్ళనడుగు!... గుల్‌చరన్! సుష్లింగ్‌పాటీ!'

'సుష్లింగ్ అనకండి. సోషలిస్టు అనండి....నోటోనుంచి మాటే సరిగా రాదు; భూభారమంతా నేనే మోస్తున్నానని మాత్రం ఇంటింటికి తిరిగి మరీ చెబుతున్నారు.... చెబితే చెబుతున్నారులే. ఇదికూడా మోసుకెళ్ళి చెప్పండి... జమీందారుతోను, తాసిల్దారుతోను, మేనేజరుతోకూడా చెప్పండి. రైతులనుంచి భూమి లాక్కోవడం అంత తేలికైనపనికాదు ... పార్టీ ఎగ్జిక్యూటివ్‌లో తీర్మానం ప్యాసైంది. ఎదిరిస్తాం; ఎదిరించి తీర్తాం! తిరుగుబాటు చేస్తాం! తెలిసిందా?

కాళీచరణ్ మెడ పొగదీసుకుంటూ వెళ్ళిపోయాడు! త్రాచుపాము కోపంతో మెడ పొగదీయడం మీరు చూసేవుంటారు! సరీఘా అలాగే! సుమరితదాసుకు వణుకుపుట్టింది. ఆ చుట్టుపక్కల కూర్చున్నవాళ్ళనోటినుంచి ఒక్కమాటకూడా

వెలువడలేదు. బెల్లంకొట్టిన రాళ్ళలాగా కూర్చున్నారు. అసలు ఏదో ప్రమాదం జరిగిపోతుందనే అనుకొన్నారు అంతా। ఎంత దిటవుగలమనిషి ఈ కలియా.... కాళీచరణ్। చూస్తేనే భయమేస్తుంది. సుప్లి....సుప్లి....సోషలిస్టుపార్టీలో చేరాక మనిషి మరింత మగ్గంలో కండెలాగా తయారైనాడు. ఎదిరిస్తాడట। తిరుగుబాటు చేస్తాడట।

దా డిగ్గా దా డిగ్గా।

సంథాల్ పేటలో రెండురోజుల్నుంచి రాత్రింబవళ్లు మాదల్ వాయిద్యం మోగుతున్నది — దా డిగ్గా దా డిగ్గా। ఆడవాళ్ళు పాడుతున్నారు। నాట్యం చేస్తున్నారు - ఝుమర్-ఝుమర్।....దరఖాస్తులు మంజూరు కాలేదు. జమీందారు భూములు లాక్కుంటారు. బంగళా అడవిలో నేరేడుచెట్లకు, మేడిపళ్ళచెట్లకూ బాగా పళ్ళున్నాయి - ఈసారి। అడవిపందుల పిల్లలుకూడా పళ్ళకోసం తారట్లాడుతున్నాయి. నాగరికత్రుతీసి బాణాలుగా వుపయోగించాలి. ఇనుం చాలా ప్రియంగా వున్నది. ఆహా। ఆహా। దా డిగ్గా, దా డిగ్గా....।

కాళీచరణ్ - ఎదిరిస్తాం అన్నారు। ఎదిరించడం అంటే? తీర్మానం అంటే ఏమిటి?

రింగ్ రింగ్-తా-ధిన్-తా।

దా డిగ్గా, దా డిగ్గా।

....పొలంలో జనపమొక్కల్నిచూస్తే మనస్సు కెంతో ఆహ్లాదకరంగా ఉన్నది। ధాన్యపుమొక్కలు సూదుల్లాగా పొడుచుకొచ్చాయి. ఈ భూమి అనుబంధం ఎప్పటికీ విడిపోదు। 'బధనా' పండగరోజురాత్రి నువ్వు సిగలో పెట్టుకున్న రంగురంగుపూలను నే నిప్పటికీ మరచిపోలేను। ఈ మట్టిమీద మోహంకూడా తీరేట్టు లేదు. ముద్దులగుమ్మా। మా తాతలు, ముత్తాతలు పూర్ణియా జైల్లో ఆలో లక్ష్మణా। అవి అలమటిస్తూ అనువులు బాసారు. మొక్కటొన్న కండెపీచులాగా వాళ్ళ తలలు బూడిదరంగుగా మారివుంటాయి। మన పిల్లలపళ్లు పాలకండెల గింజల్లాగా మెరుస్తాయి. వాళ్ళతో చెప్పవలసింది - ధర్తీమాత ప్రేమబంధం మమ్మల్ని బంధించివేసింది। ఆహా। ఆహా। రింగ్-రింగ్-తా-ధిన్-తా। దా డిగ్గా దా డిగ్గా।....

'ఎవరైనా ఈ భూమిమీద కాలుబెడితే తల తీసెయ్।'

తాసిల్దారు హరగోపీసింగ్ రైతులు తమపొలాలకొలతలు కొలిపించుకొని తమదిగా నిర్ధారణ చేయించుకోవలసిందని చాటింపు వేయించాడు. ఏమీలేదు: మీఘాకు ఒక వందరూపాయలు నజరానా (బహుమతి) చెల్లించుకుంటే ఏరైతయినా వచ్చి తన పొలాన్ని నిర్ధారణచేసుకోవడానికి దరఖాస్తు ఇచ్చివెళ్ళవచ్చు।.... ఇదుగో। మీరంతా వట్టి దద్దమ్మలోయ్। ఈ పొలాలన్నీ సంవత్సరంక్రిందటే వేలంవేసి స్వాధీనం చేసుకోవడం జరిగింది. 40 వ సెక్షన్ దరఖాస్తు ఇచ్చినంత మాత్రాన మీకు భూమి స్వాయత్త మెలా అవుతుంది?....అయితే కొత్తగా భూమి నిర్ధారణ చేయించుకునేవాళ్ళ పేర్లుమాత్రం మేము నమోదు చేస్తాం. ఇది మా చేతుల్లో పని। ఇందుకు కోర్టుచుట్టూ ప్రదక్షిణలు జరపవలసినపనే లేదు। ఏమోయ్ మాఖాన్‌దాసూ। నీ కేసువిషయంలో ఎంత ఖర్చయింది? కాస్త వీళ్ళకు వివరించి చెప్పు? కాంగ్రెసు, సోషలిస్టు పార్టీవాళ్ళు కాజేసినడబ్బుతో కలిపిచెప్పు?....విన్నారా? ప్రతిసారీ చందాలు వసూలుచేసి కోర్టుపనులుచేసే ఈ నాయకులకు ఇచ్చితీరాలి— పదిరూపాయలు నగదు: కాఫీ సిగరెట్లఖర్చు మళ్ళా వేరే। ఇదే వాళ్ళఉద్యోగం। ఆం. వేలాం వేయబడ్డ పొలందగ్గరకు ఎవరొచ్చినా తల తుంచెయ్యటమే। గవర్నమెంటు మీకు అన్నివిధాలా సహాయంగా వుంటుంది।

ఏదో వూరికే వచ్చిపడుతున్నదని ఆక్రమించుకు కూర్చున్నారు.

ఆవులు. ఎడ్లూ. బర్రెలు. దూడలూ అన్నిటినీ అమ్మేసుకుంటున్నారు. రెట్టింపువడ్డీకి డబ్బు అప్పుగాతీసుకొని పొలం స్వంతం చేయించుకోవాలని తాపత్రయపడుతున్నారు. జనుములధర పదిహేనురూపాయలు। ఏభైదాకా పోవచ్చు। వంద అమ్మినా అమ్మవచ్చు। ఇక ధాన్యం బంగారంలాగా అమ్ముడు పోతున్నది. భూమి। భూమిలేనివాడు ఎందుకూ కొరగానివాడే! పశువుతో సమానం. ఈ కాంగ్రెసోళ్ళు. సోషలిస్టోళ్ళు ఏవో కబుర్లు చెబుతారు। లాభంలేదు.....దరఖాస్తులు మంజూరు కాలేదు....పొలం నిర్ధారణ....

ఊరికి తిప్పలొచ్చాయి. బాగుపడేలక్షణా లేవీ కన్పించడంలేదు.

ప్రతి పేటలోనివాళ్ళూ పరస్పరంగా పోట్లాడుకోవడమా? కూరగాయల వాళ్ళపేట తలోమహతో భూమిని అతని పోరుడే సరూప్‌మహతో తనకింద బందో

బస్తు చేయించవలసిందని దరఖాస్తు ఇచ్చుకున్నారు. పోఖరన్ పొలం బంగారం పండుతుంది. ఆ పొలాన్ని అతనిబాబాయి రామేశర్ కొట్టేయాలని చూస్తున్నాడు. యాదవులపేట రైతుల వేలంవేయబడ్డ భూములన్నిటినీ ఖేలావన్‌సింగ్ యాదవ్ తీసేసుకుంటున్నాడు. సంథాల్‌పేటవాళ్ళ పొలాలన్నీ రాజపుత్రులు తీసుకుంటున్నారు. సుమరితిదాను - ఇది రహస్యమంటున్నాడు. సంథాల్‌పేటవాళ్ళ పొలాలు తాసిల్దారే తీసుకుంటున్నాడట! అయితే ఆయన పేరుమీదగాదు; మరొకరిపేరుమీద!

ఊరిగ్రహాలు సరిగా లేవు. తాసిల్దారు విశ్వనాథ్‌ప్రసాద్ బాలదేవ్, బావన్ దాస్ - ఇద్దరితోనూ పంచాయతీ సమావేశం పిలిపించమని చెబుతున్నాడు - 'మీరే పిలిపించండి. నేను పిలిపిస్తే ఏడుస్తారు.'

కాళీచరణ్ పార్టీకి చెందిన పెద్దలీడరు పుర్రైనియా వస్తున్నారు. కార్మేడ్లు అయిదురోజుల్లోనే మూడువందలరూపాయలు వసూలు చేశారు. సోమా ఒక్కడే రెండువందలపైగా ఇచ్చాడు ...పెద్దలీడర్‌తో చెప్పాలి - ఊళ్ళో ఇలాంటి మనస్పర్థలుంచే తిరుగుబాటుఉద్యమం దెబ్బతింటుంది. మరొకసారి సైనిక్‌జీని, చినగారీ గారినీ పిలిపించడం మంచిది. సభలు జరిగి చాలారోజులైంది. పొలంలో గుంటక ఆడించకపోతే చెట్టూ చేమా ఇట్టే పెరిగిపోతూ ఉంటుంది. అలాగే మీటింగులు జరిపించకపోతే ఈ ప్రదేశం అంతా పాడైపోతుంది. కార్యదర్శినికూడా ఈసారి పిలిపించాలి. లౌడ్‌స్పీకర్ల ఏర్పాటుకూడా ఈ పర్యాయం చేయించాలి.

చర్ఖా సెంటర్ పంతులమ్మకూ, తక్కిన మాష్టర్లకు మధ్యన పోట్లాట వచ్చింది.

మగ్గంమాష్టరు టున్‌టున్‌గారికి మంగళాదేవి సోషలిస్టుపార్టీ ఆఫీసులో ఉండడం ఏమాత్రం నచ్చలేదు. జబ్బుగా వున్నంతవరకు అక్కడున్నదంటే కొంత అర్థమున్నది. పూర్తిగా కోలుకొన్నాకకూడా ఇంకా అక్కడెందుకు? టున్‌టున్ గారు మంగళాదేవిని పాట్నాలోనే ఎరుగు! గ్రామాభ్యుదయ సెంటర్‌లో ట్రైనింగ్ తీసుకునేప్పుడే ఈమె కదురులాగా తిరిగేది! వ్యవస్థాపకురాలు ఈమెను కలుసుకొనడానికి వచ్చేవాళ్ళతో విసిగిపోయింది. రోజూ కొత్తకొత్తవాళ్ళు తయారయ్యేవాళ్ళు. చాలాపర్యాయాలు మంగళాదేవిని హెచ్చరించడంకూడా జరిగింది. అయితే ఈమెను

కలుసుకొనడానికి వచ్చేవ్యక్తులలో కాలేజీ విద్యార్థులు, ఎమ్.ఎల్.ఏ.లు; సాహిత్య గోష్ఠి కార్యదర్శి, చర్ఖాసంఘం కార్యకర్తలు, హిందీ దినపత్రిక సహాయసంపాద కులూ ఉండేవాళ్ళు. వ్యవస్థాపకురాలికి విసుగుబుట్టి నోరుమూసుకొని పూరుకున్నది. మంగళాదేవిప్వేవ్వను అరికట్టి పది పన్నెండుమంది వ్యక్తుల కోపతాపాలకు గురి కావడం ఆమె కిష్టంలేకపోయింది. అందుకే ఆమెగారు ఈ మంగళాదేవిని ఈ మారుమూలగ్రామానికి పంపించింది. అయితే ఇక్కడకూడా....?

మంగళాదేవి మాట్లాడడంలో మగవాళ్ళనుకూడా మించిపోతుంది। పై జామా, కుర్తావేసుకుంటుంది. బయటికి వెళ్ళేప్పుడు పైన ఖద్దరు చునరీ (మేలి ముసుగు) వేసుకునేది. మనిషి కొంచెం పొట్టి, ఎరుపురంగు, బిగుతైన శరీరం। ఆమె విశాలనయనాలు తీర్చిదిద్దినట్టు ఎంతో ఆకర్షణీయంగా ఉంటాయి. మగ్గం మాష్టర్ని ఆమె ఎప్పుడూ వగ్గం మాష్టరంటుంది. చర్ఖామాష్టర్ని బుర్ఖామాష్టరంటుంది. పీళ్లా మంగళాదేవితో మాట్లాడగలిగేది? .. ఈమె బజ్బుపడితే ఈ టున్‌టున్‌జీ తొంగిచూపిన పాపానకూడా పోలేదు। ఈరోజుల నైతిక ప్రవర్తననుగురించి ప్రవచనాలు వల్లిస్తున్నారు। మంగళాదేవికి వీళ్ళవ్యవహారం బాగానే తెలుసు। నొసలు బత్తుడు, నోరు తోడేలు। వ్యవస్థాపకురాలికి రాసుకుంటే రాసుకోనివ్వండి। ఇలాంటి బెదిరింపులకు ఈ మంగళాదేవి భయపడేరకం కాదు। టున్‌టున్‌జీ కుయు క్తులు తనకు తెలియనివేమీ కావు। పాట్నానుంచివచ్చేప్పుడు సమస్తీపురంలో రైల్లోనుంచి దింపించి, ఏమిటండీ అంటే ఇక్కడ రైలు మారాలి అన్నారు। ఆ తరువాత తెలిపిందేమిటంటే - ఆ రైలు తిన్నగా కటిహార్‌దాకా పోతుందట। అప్పుడు మరో బండిలేదు - రెండోరోజు ఎనిమిదింటిదాకా। రాత్రి పన్నెండుగంట లకు సత్రంలోకి తీసుకెళ్లాడు....టున్‌టున్‌జీనిగురించి ఎంత తక్కువచెబితే అంత మంచిది.

బాలదేవ్‌ను ఖేలావన్‌సింగ్ యాదవ్ తన ఇంట్లోనుంచి వెళ్ళిపొమ్మన్నాడు. సకలదీప్ పెళ్ళి నిర్ణయమైంది, కోడలువస్తే మరొక కొత్తమనిషి ఇంట్లోవుండడం బావుండదు. కోడలు చంపాపూరు ఆపిన్‌బాబు కూతురు। ఇక్కడేమాత్రం సరిగా లేకపోయినా తండ్రికి ఉత్తరం రాయవచ్చు। పెద్దింటిపిల్ల।

బాలదేవ్ తన సంచీ-సరంజామా అక్కడనుంచి తీసేసుకున్నాడు. బాలదేవ్

పినతల్లి ప్రతిఇంటికీ తిరిగి ఫిర్యాదు చేసింది. అయితె బాలదేవ్ గోవులాంటి మనిషి. మానావమానాలకు అతీతుడు. నోరు కదపలేదు.

లక్ష్మి బాలదేవ్‌ను దీక్ష తీసుకోమని బలవంతం చేస్తున్నది. పుపరీ మఠానికిచెందిన మహంతు రామస్వరూపగోసాయి వచ్చారు. బాలదేవ్ దీక్ష తీసుకుంటే మఠంలో ఉండడానికి ఎటువంటి అభ్యంతరమూ ఉండదు.

బావన్‌దాసు మనస్సంతా ఎగిరిపోయింది. ఎవరిని నమ్మాలో, ఎవరిని నమ్మకూడదో తెలియని అయోమయస్థితి ఏర్పడింది. గాంధీజీని మినహా ఎవ్వరిమీద నమ్మకం కలగడంలేదు. గాంధీజీకి ఉత్తరమొకటి రాయాలని అనుకొన్నాడు. గంగూలీ తప్పకుండా రాస్తారు. అతని మనస్సులో చాలా సందేహాలున్నాయి.

## ముప్ఫైనాలుగు

పూర్ణియా స్టేషన్‌నుంచి పులియా వచ్చింది.

పూర్తిగా మారిపోయింది పులియా! చీరె కట్టుకునేపద్ధతి. మాట్లాడే తీరూ - అన్నీ మారిపోయాయి. తాపిద్దారు కూతురు రవికెలోపల మరో చిన్నరవికె తొడుక్కుంటుందే. అలాంటిదే ఆమెకూడా వేసుకున్నది! చెవులకు ఇత్తడి పూలున్నాయి. పూలు కాదు, కమ్మలని పులియా అన్నది. బొడ్లో తాళపుచేతులగుత్తి దోపుకున్నది. కాళ్ళకు రంగు పూసుకొన్నది. ఆహా! ఖలాసీ రెండుచేతులతో సంపాయిస్తాడు కాబోలు!....ఆఁ. వాడిమొహం! ఆ కళ్ళాపి మొహం వాడేం సంపాయిస్తాడు? ఇవన్నీ కొనిపెడుతూకూర్చుంటే తిండికి జరిగేదెట్టా? కట్టుకోవడానికి బట్ట ఎక్కడనుంచి వస్తుంది? అసలు పులియా ఖలాసీని ఎప్పుడో వదిలేసింది. ఖలాసీకి ఫోర్బ్స్ బాగ్‌లో తా వలచినరంభ ఒక వేశ్య వున్నది. రోజూ తాగి అక్కడే పడివుండేవాడట! జీతం వచ్చినరోజున ఆ వేశ్య ఖలాసీని అంటిపెట్టుకొని వుండేది. జీతంలో ఒక పైసా తక్కువైనా వూరుకునేది కాదట! ఎంతకాలమని పులియా ఈ గుండెమీది కుంపటిని భరిస్తుంది? స్టేషన్ పాయింట్‌మ్యాన్ లేకపోతే పులియా గౌరవం కూడా దక్కుఉండేది కాదు! పులియా ఇప్పుడు పాయింట్‌మ్యాన్ ఇంట్లోనే వుంటు

న్నది. ఖాసీ ఒకరోజున పాయింట్‌మ్యాన్‌తో పోట్లాటకు వచ్చారు. స్టేషన్ మాష్టరు - ఖాసీ స్టేషన్ ఆవరణలో అడుగుబెడితే పచ్చడి పచ్చడి చెయ్యమని చెప్పారు. ఆ రోజునుంచి మళ్లా కనిపిస్తే ఒట్టు! పాయింట్‌మ్యాన్ జాతికి క్షత్రియుడు! తాంత్రిక క్షత్రియుడు కాదు. అసలైన బుందేల్‌ఖండ్ క్షత్రియుడు! జర్దా తమలపాకులు తినేప్పటికి పళ్ళు రాస్తా ఊడిపోయాయి. నకిలీదంతాలు పెట్టించుకొన్నాడు. కావడానికి నకిలీ దంతాలే అయినా మామూలుదంతాలకంటేకూడా గట్టిగా ఉంటాయి. శనగలూ, కండెలూ, జామపళ్ళూ అన్నీ మెలేసి నమిలేస్తాడు - పాయింట్‌మ్యాన్! పాతికసంవత్సరాలపూర్వం అస్సాంలో టీ తాగి, జర్దా-తమలపాకులు ఆదేపనిగా నమిలేప్పటికి పళ్ళూడిపోయాయి. పెద్ద వయస్సేమీకాదు! పది సంవత్సరాలయింది భార్యపోయి! అప్పటినుంచి అతనికి అనువైన ఆడదే కనిపించలేదు. పాయింట్‌మ్యాన్ మహగూదాసుకు ఒక పాత షీలంచొక్కా పంపించాడు. చొక్కా తొడుక్కునేప్పటికి మహగూను గుర్తించడం కష్టమైపోయింది. సరీఘా రైల్వేమనిషిలాగా వున్నాడు!....ముసలిదానికి ఒక కొత్తచీరె పంపించాడు. జానెడు నల్లంచుచీరె!....ఈసారి కోటాలో అసలయిన 'సంతిపురీ చీరె' దొరికితే తీసుకొని పులియాకు పంపిస్తాడు. ఈసారి తల్లినికూడా వెంట తీసుకెడతానని పులియా అన్నదట!

పులియా అదృష్టం! రామప్రియ తల్లి అన్నది—'మా రమియాకుకూడా పెళ్ళి వయస్సు వచ్చేసింది. తండ్రిలేనిపిల్ల! నువ్వు అత్తగారింటికి వెళ్ళినప్పటినుంచీ రోజూ ఒకసారయినా నిన్నుగురించి అనుకుంటూ ఉంటుంది—'పులియా అక్క ఎప్పుడొస్తుందే? ఈసారి పులియా అక్కతో నేనుకూడా వెడతాను!' అక్కడ ఎవరైనా వరుడు నీకంటబడితే రమియానుకూడా నీవెంట తీసుకెళ్ళు తల్లీ! ఇక్కడ తూరగాయలపేట కుర్రాళ్ళు మరీ అల్లరి చిల్లరగా తయారయ్యారు!....'

సహదేవమిశ్ర కన్పిస్తే తాంత్రికులపేట కుక్కపిల్లకూడా ఊరుకోవడం లేదు! గంయ్ గంయ్‌మని మొరుగుతున్నది. చాలారోజులతరువాత పులియా కబురుచేస్తే తాంత్రికులపేటలో అడుగుబెట్టాడు!....పదిరోజులుండి వెళ్ళిపోతుంది. పులియా కిప్పుడు ఊళ్ళోవాళ్ళంటే లెక్కలేకుండాపోయింది. ఆమెది తాంత్రిక క్షత్రియకులం కాదు. అసలయిన బలదేవ్ క్షత్రియకులస్త్రీ. వేరే వంటచేసుకొని తింటున్నది....తల్లి అంటుకున్న అన్నం తినదు!

ఆమె అతిథిగా వచ్చింది। ఆమె కెలా వచ్చితే అలా తింటుంది. మనం చెప్పడం అనవసరం।....ఆమె సహదేవ్‌మిశ్ర కూర్చోనడానికి చాప తెచ్చివేసింది. వక్కపొడి. సోపుగింజలు. దాల్చినచెక్క వజుకులున్న చిన్న గాజుపళ్ళెమొకటి అతని ముందుంచింది....అయితే పులియా తనను మరచిపోలేదన్నమాట। దావుంది। పట్నంపీళ్ళు తాగేప్పటికి మనిషి బాగా మారిపోయింది; అయితే మనసుమాత్రం మారలేదు. కాటుకకళ్ళు మరింత పెద్దవిగా కనిపిస్తున్నాయి. జాకెట్టు. అంచున్న చీరె। సహదేవ్‌మిశ్ర కొంచెం జంకుతూనే అన్నారు—

'పులియా।'

'ఏమిటి?' పులియా నవ్వింది.

సహదేవ్‌మిశ్ర శరీరమంతా ఒక్కసారిగా ఎరుపెక్కిపోయింది. చెవులు ఎర్రబడ్డాయి. ముక్కుచివరలు ఎగిరెగిరిపడుతున్నాయి—'పులియా నువ్వెళ్ళిపోయాక నేపిపేటలో ఎప్పుడూ అడుగే పెట్టలేదు.'

'ఓహో। అయితే గహలోత క్షత్రియపీఠికి వెళ్ళడంలేదా?....పనబతియా దగ్గరకు వెడుతున్నదెవరో? అబద్ధాలు చెప్పకు।' పులియా నవ్వుతూ అన్నది।

'ఎక్కడికీ వెళ్ళడంలేదు పూలో?'

ప్రమిద వెలుతురులో సహదేవమిశ్ర పులియా కళ్ళల్లో కన్పించే కొత్త బాషను అవగతం చేసుకోవడానికి ప్రయత్నించారు....గాలికి దివ్వె కాస్త కొంచెక్కింది. పులియా తన శిరోజాలకు వాసననూనె రాసుకుంటుంది. జాకెట్ కింది చిన్నరవికెకు రబ్బరు వుంటుంది కాబోలు।....పులియాదేహంనుంచి చెమటవాసన వేయడంలేదు. సోపుగింజలు. దాల్చినచెక్క తినడంవల్ల నోరు సువాసగా వున్నది. పట్నంసంగతులు చాలా విచిత్రంగా ఉంటాయి. అక్కడిగాలి సోకడంతో మనుషులు ఇట్టే మారిపోతారు. తాసిల్దారుకూతురు ఎప్పుడు పట్నం వెళ్ళలేదు....జాతివాళ్ళకట్టడిని. పంచాయతీ తీర్మానాన్ని పంచాయతీపెద్దలే నేం రాదారు ...శాంత్రికులపేట కాపలాదార్లు - నోఖే. ఉచితదాసులు! ఎవరిమీదనైనా అనుమానం ఉంటే బెత్తంతో వళ్ళు చీరెయ్యవచ్చు. నోఖే భార్య రామలగనసింగ్‌కొడుకు వలలో చిక్కుకున్నది; ఉచితదాసుకూతురు కూరగాయలపేట సరన్‌మహతోతో అలవాటున్నది.

పంచాయతీ తీర్మానానికి పదిరోజులగడువు ఉండవచ్చు. కాని గ్రామాల్లో తరతరాల
నుంచి వస్తున్న రివాజుల్ని ఒక్కసారిగా మార్చెయ్యడం అంటే మాటలా? ఆస్తి
పాస్తులున్నవాళ్ళు, డబ్బూ దస్కం ఉన్నవాళ్ళుకూడా తమఇళ్ళల్లో జరిగే తంతుల్ని
సరిదిద్దుకోలేకపోతున్నారు....ఈ పెద్దవాళ్ళపేటల బండారాలు ఎవరికి తెలియవు?....
పెద్దమనుషులు పంచాయతీచేసి తీర్మానాలు చేయవచ్చు? వాళ్ళదేం పోయింది? తనది
కాకపోతే కాశీదాకా దేకమన్నారట? ఒకమణుగు ధాన్యానికి బియ్యం ఎన్ని వస్తాయో
ఈ పెద్దమనుషులకు తెలుసునా? బలిమివుంటేనే భార్యా, భూమీ మనదవుతుంది,
లేకపోతే పరాయివాళ్ళ పాలవుతుంది. అయితే బలమున్నంతమాత్రానకూడా పనులు
సానుకూలపడడంలేదు. దేనికైనా డబ్బుంటే చాలు? బడాపహల్వాన్ సైతం వచ్చి
మీ ఇంటిముందు వాల్తాడు? డబ్బుఉంటే కొండమీదికోతి దిగివస్తుంది.

....తాసిల్దారు కూతురు సాయంత్రంవెళ్ళి, అర్ధరాత్రిదాకా డాక్టరు ఇంట్లో
కూర్చొని కాలక్షేపం చేస్తున్నది. వెన్నెలరాత్రిలో బంగళాతోటలో చెట్టపట్టాలు
వేసుకొని తిరుగుతూ ఉంటారు. మీ అమ్మాయినడత బాగాలేదని తాసిల్దారును తప్పు
పట్టేదమ్ము ఎవరికైనా ఉన్నదా?... తాసిల్దారు హరగౌరీసింగ్ తన స్వంత మేన
కోడల్ని తగులుకున్నాడు, బాలదేవ్ లక్ష్మిని పట్టాడు. కాశీచరణ్ చర్ఖా సెంటర్
పంతులమ్మను తెచ్చుకొని ఇంట్లోనే పెట్టుకున్నాడు. వాళ్ళను ఎవరూ ఏమీ అన
రేం?....చట్టాలూ, పట్టింపులు - అన్నీ ఈ బీదవాళ్ళకోసమేనా? ఆఁ?

పొలాలవిషయమై ఊళ్ళో కొత్తగా పార్టీలు ఏర్పడ్డాయి. వేలాం వేయబడ్డ
భూములవాళ్ళూ, దరఖాస్తులు కొట్టివేయబడినవాళ్ళూ ఒకపక్షమైతే, కొత్తగా కొం
తలు వేయించుకొని పొలం తమపేరు రాయించుకొన్నవాళ్ళు, జమీందారును
క్షమించమని కాళ్ళమీద పడ్డవాళ్ళూ, పొలం స్వాయత్తం రాయించుకొన్నవాళ్ళూ
రెండోపక్షం? పేదసాదలమీద, కూలినాలి చేసుకునేవాళ్ళమీదకూడా దీనిప్రభావం
పడింది. ఖేలావన్ నాగలిదున్నేవాళ్ళను కాశీచరణ్ వెళ్ళి అడ్డగించాడు, మంగలి,
చాకలి, మాదిగ - ఎవ్వరూకూడా తాసిల్దారు హరగౌరీఇంటికి వెళ్ళకూడదని ఇంటిం
టికి తిరిగి కాశీచరణ్ చెబుతున్నాడు. గ్రామంలోని పాతకట్టలన్నీ తెగిపోయి
కొత్త వరదనీరు రాబోతున్నట్టుగా వున్నది?....

పేదసాదలను, బాధిత, పీడిత కార్మికులను కాశీచరణ్ మేల్కొల్పాడు.

వందలాది బీఘాలున్న రైతులదగ్గిర మూలుగుతున్నదబ్బుతో బీదవాళ్ళను కొనేసి. బీదవాళ్ళగొంతులు బీదవాళ్ళతో కోయిస్తున్నారు. జాగ్రత్త! కొత్తగా పొలాలు తమపేర రాయించుకొన్నవాళ్ళందరూ బీదవాళ్ళ నోటిదగ్గరకూడు తీసేసినవాళ్ళే అవుతారు!....

కాళీచరణ్ మాదిగగూడెంలో అన్నం తిన్నాడా?

జాతేమిటి?

జాతులు రెండే రెండున్నాయి. ఒకటి: పేదలు, రెండు: ధనికులు!.... శేలావన్ను చూడండి, యాదవులభూమినే కాజెయ్యడానికి పూనుకొన్నాడు.... చూడండి! కళ్ళుతెరచి మరీ చూడండి! గ్రామంలో రెండే రెండు జాతులున్నాయి.

ధనికులు—పేదలు!

తాసిల్దారు హరగోబిసింగ్ నల్లటోపీదళం యువకులతో—'ఈ పర్యాయం రణరంగానికి వెళ్ళవలసి ఉంటుంది. హిందూరాజ్య సంస్థాపనార్థం ముందు ఇంట గెలవాలి....!' అని చెప్పారు!

సంయోజక్‌జీ ఈమధ్య నెలకు రెండుపర్యాయాలు ఇంటికి మనీఆర్డరు పంపిస్తున్నాడు. సంయోజక్‌జీ నల్లటోపీ దళానికిచెందిన యువకులకు ఎంత తెలికే అంత! దేన్నీ కాదనరు. నిప్పులో దూకమంటే దూకుతారు, నీళ్ళల్లోకి ఉరకమంటే ఉరుకుతారు! దీన్నే అనుశాసనం అంటారు!

ఊళ్ళో ఊరేగింపు జరగబోతున్నదనే వర్తమానం జిల్లా కాంగ్రెసు నాయకులకు అందజేసేనిమిత్తం బావన్‌దాసు బయలుదేరి వెళ్లాడు.

## ముప్పైఅయిదు

తాసిల్దారు విశ్వనాథ్‌ప్రసాద్‌కు వికటసమస్య ఒకటి వచ్చింది. కొత్తగా పొలాలు రాయించుకొన్నరైతులు రోజూ ఆయనదగ్గర కొస్తున్నారు. ఈ వ్యవహారం కోర్టుదాకా వెళ్ళడంజరిగితే విశ్వనాథ్‌ప్రసాద్ సాక్ష్యం కావలసివుంటుంది.

పొలంలేనివాళ్ళందరూ ఒక పార్టీగా ఏర్పడ్డారు. పొలాల ఖామందులుకూడా అభి ప్రాయభేదాలు, తగువులూ ఏమైనావుంటే అన్నిటినీ మరచిపోయి ఒకటి కావాలి!

....తాసిల్దారు హరగోవింద్‌సింగ్ రాత్రిందగళ్ళు విశ్వనాధ్‌బాబుగారింట్లోనే వుంటున్నాడు.

'బాబాయ్! ఈసారి మీరే గౌరవం కాపాడాలి! మంగలి, చాకలి, మాదిగా దగ్గరకువెళ్ళి చేతులు జోడించి ప్రాధేయపడమంటారా? నిన్నటినుంచి రామకృపాల్ బాబాయి చావిట్లో ఆవు చచ్చి అలాగే పడివున్నది! మాదిగలు మేము రామన్నారు. శివసరాను మీరేగా మాదిగలకు నాయకుడుగా చేశారు?

....రాజపుత్రవీధి వాళ్ళను చూడండి - గెడ్డాలు మీసాలు పెరిగిపోయాయి. మంగళ్ల క్షౌరం చెయ్యమన్నారు. మీ చేతిలో అందరిపిలకలూ వున్నాయి. మీరొక సారి చెప్పావంటే అందరికి హడలు పుడుతుంది....'

కాళీచరణ్‌వచ్చి—'విశ్వనాధ్‌మామా! మీరు కాంగ్రెసునాయకుడు. ఈసారి మీరు రుజావు చెయ్యాలి - కాంగ్రెసు బీదవాళ్ల పార్టీదా లేక ధనవంతుల పార్టీదా అని!....ఈ రోజువరకు నేను మిమ్మల్ని దేవతగా భావించాను. అయితే బీద వాళ్లకు వ్యతిరేకంగా గనుక మీరు వ్యవహరిస్తే గత్యంతరంలేక....!' అని చెప్పి వెళ్లాడు.

తాసిల్దారు విశ్వనాధ్ ప్రసాద్‌కు, ఏం చేయాలో ఏం చేయకూడదో బోధపడ కుండా వున్నది.

బావన్‌దాసు పూర్ణియానుంచి తిరిగొచ్చారు.

ఊరేగింపు జరుగుతుందని చెప్పడానికి వెళ్లాడు; కాని పూర్ణియాలో అత గాడు ఊరేగింపుచూసి మరీ వచ్చారు.

కోర్టు ఆవరణలో జిల్లాలోవున్న రైతులంతా పొట్టపట్టుకొని పడివున్నారు. లోవర్‌కోర్టులో 40 వ సెక్షన్ దరఖాస్తులు నామంజూరు అయ్యాయి. అపీలు చేయాలి....అపీలు?....డబ్బు కావాలి! డబ్బు లేదా? చేసినట్టే అపీలు! చేతిలో డబ్బుంటేనే పొలం స్వాయత్తం అయ్యే కిటుకులు తెలిసేది!....

కోర్టు ఆవరణలో బతికే క్రిమికీటకాలుకూడా డబ్బు కావాలంటాయి.

జిల్లా కాంగ్రెసు ఆఫీసులో సభ జరుగుతున్నది. కాంగ్రెసు అధ్యక్షపదవికి ఎన్నికలు జరగబోతున్నాయి. నలుగురు అభ్యర్థులున్నారు; ఇద్దరు అసలైనవాళ్ళు. మరోఇద్దరు డెమ్మీ అభ్యర్థులు! రాజపుత్రులకు, భూమిహార్ హిందువులకు పోటీ పడింది. జిల్లాలోవున్న సేఠ్‌లూ షావుకార్ల కార్లు, జమీందార్ల కార్లూ అటూ ఇటూ పరుగెడుతున్నాయి. ఒకరినొకరు దుయ్యబట్టుకుంటున్నారు. కటిహార్ కాటన్‌మిల్లుకు చెందిన సేఠ్ భూమిహార్‌పార్టీలో వున్నాడు. ఫార్‌బిస్‌గంజ్ జూట్‌మిల్ సేఠ్ రాజపుత్రులపక్షాన వున్నాడు. డబ్బుమహాత్మ్యం ఎలా ఉంటుందో ఇక్కడే చూడాలి.

బావన్‌దాసు - ఎవరిటోపీమీద వాళ్లు భూమిహార్, రాజపుత్రులు, కాయస్థులు, యాదవులు, హరిజనులు అని రాసుకోవడం మంచిదేమోనని అనుకుంటున్నాడు. ఏ కార్యకర్త ఏ పార్టీకి చెందినవాడో తెలియకుండా వున్నది!

'ఊరేగింపు జరుగుతున్నది.'

'అవును. ఊరేగింపు జరుగుతున్నది!'

'చూడండి, బావన్‌దాసుగారూ! అసలువిషయ మేమిటంటే నూటికి తొంభై అయిదుమంది అబద్ధాలు సృష్టించి భూమికోసం దరఖాస్తులు ఇచ్చివుండవచ్చు— నేను కాదనను! సరియైన, న్యాయమైన హక్కువున్న రైతులుకూడా ఇలా అబద్ధాలు సృష్టించి, భూమి తమదేనని అనడంవల్ల - అన్యాయాలకు గురికావలసి వచ్చింది. ఇందుకు చట్టాల్ని తిట్టి లాభంలేదు. ప్రజలు నైతికపతనం చెందారు. చూస్తూఉండండి. ఈ పర్యాయం జిలాకమిటీలో ఈ విషయంలో ఒక తీర్మానం ప్యాసు కాబోతున్నది!'

'పొలాలనుంచి తొలగించబడిన రైతులకు ఏం చెబుతారు?'

'చెప్పేదేముంది? జమీందారీవిధానం రద్దు కాబోతున్నదని చెప్పండి. ఇవ్వాళ్ల బీహారు మంత్రివర్గం ఈ విషయం ప్రకటించింది..... జమీందారీవిధానం తొలగించడానికి బీహారుప్రభుత్వం సన్నద్ధంగా వున్నది!'

బావన్‌దాసు రైతులతో ఏం చెబుతాడు?

జమీందారీవిధానం రద్దవుతుందా? అప్పుడు ఈ కాంగ్రెసు జమీందార్లు ఏమవుతారు? అందరూ మిల్లులు తెరుస్తారేమో! ఇందుకే కాబోలు ప్రతిలీడరు వెంటా

ఒక్కొక్క మార్వాడీ తిరుగుతున్నారు!....బావన్‌దాసుకు అయిదునెలలక్రిందటి సంగతి గుర్తుకొచ్చింది! పూర్ణియాస్టేషన్‌లో తిల్‌యూడీకిచెందిన శంకరబాబు తనతోవున్న పదిమంది కార్యకర్తలకు పూరీలు, మిఠాయి టిఫిన్ పెట్టించారు. బిల్లు చెల్లించింది, తిల్‌యూడీ సంతకుచెందిన మార్వీడీ చోఖమల్ జాహర్‌చంద్ కొడుకు!

—'అరే! తినండి! మీరేగదా దేశానికి అసలయిన సేవకులు! జైల్లో పులగం తింటూ జీవితం గడిపేశారు!'—ఆ ప్రాంతపు కార్యకర్తలందరికి టిఫిన్ తిని పించారు. ఒక్కొక్కరికి ఒక్కొక్క సేరు మిఠాయి కొనికూడా ఇచ్చారు. చోఖ మల్ జాహర్‌చంద్ కొడుకు ప్రస్తుతం అరరియా సబ్‌డివిజన్ కాంగ్రెస్‌కు కోశాధి కారి! జత అరవై రూపాయలు విలువజేసే ఇద్దరు ధోవతులు కడతారు; పర్టీ సంఘా నికి చెందిన పెద్దపెద్దవాళ్ళంతా అతన్ని ఎంతగానో గౌరవిస్తారు.

'అన్యాయం జరిగింది!'

'ఏం జరిగింది?'

'జమీందారీవిధానం రద్దయింది!'

'అన్యాయం జరిగిందా?'

ఇక్కడిప్రజలు సంతోషమైనవార్త వినికూడా ఇలాగే అంటారు—అన్యా యపుసంగతి. అన్యాయపు నవ్వు! అన్యాయపు సంతోషం! బెంగాలీభాషలోని 'భీషణ సుందర్!' అనే శబ్దంలాగా!

'అన్యాయపు సంగతి!'

'ఏమిటది?'

'బావన్‌దాసు జమీందారీపద్ధతిని రద్దు గావించారు.' కామ్రేడ్ వాసుదేవ్ పరుగెత్తుకుంటూవెళ్ళి కాళీచరణ్‌తో చెప్పారు.

'బావన్‌దాసా?'

'కాదు! బావన్‌దాసు వార్త తెచ్చారు. కాంగ్రెసుమంత్రులు జమిందారీవిధా నాన్ని రద్దు చేస్తున్నారు!'

'ఎర్రబావుటా' పత్రికలో ఈ వార్త రానంతవరకూ దీన్ని నమ్మడానికి వీల్లేదు. కామ్రేడ్! ఇదంతా కాంగ్రెసోళ్ల ఎత్తు! నేను రేపెవెళ్ళి కార్యదర్శిని

అడిగి వస్తాను. మీరు సభ్యత్వపుడబ్బు ఇవ్వలేదేం? కామ్రేడ్లందరికీ చెప్పండి. ఇదే చివరిగడువు। లేకపోతే 'ఎర్రజెండా'లో వేసేస్తారు।'

'నవివరా సభ్యత్వపుడబ్బుతో సోషలిస్టు కల్‌లాల్పి పుట్టించేసుకొన్నారు. అవసనార అమ్మకం అయ్యాక ఇస్తానన్నాడు।'

'అన్యాయం। దురన్యాయం!! సభ్యత్వపుడబ్బుతో లాల్పి పుట్టించుకోవ డమా? ఎలాగైనా సరే, డబ్బు చెల్లించమని చెప్పు అతనితో!'

తాసిల్దారు హరగౌరి, తాసిల్దారు విశ్వనాథ ప్రసాద్ ఒకే తమలపాకుబీడాను రెండు చేసుకొని తింటున్నారు ఈ మధ్య। నిజమా? నిజంకాక అబద్ధమా! విస్త్రంత్రి మమరితదాసు అందరితోనూ చెబుతున్నాడు. ....'కాగితాలూ, చట్టాలూ చేతిలో వున్నవాళ్ళదగ్గర కర్రలూ, బల్లేలూ వున్నవాళ్ళు ఏం చేస్తారు? తాసిల్దారు విశ్వనాథ ప్రసాద్ పాత తాసిల్దారుగదా। పారదంగా స్టేటుతిప్పు తిన్నవాడేగదా। కాయస్థు డెప్పుడూ చేసినమేలు మరచిపోడు!....కాంగ్రెసులో చేరితేమాత్రం తన అస్థిని మరచిపోతాడా?'

సంథాల్ పేటనుంచి వాయిద్యం వినిపిస్తున్నది—

సోనో రో రూప్, రూపే రో రూప్
సోనోరో రూప్ లేకా గాతేజ్ఞ మేలాయ్
గాతేజ్ఞ దిసోయ్‌తేసోనా ముందోమ్
గాతేజ్ఞ ఉయిూహయి జీపిదో లోతతియు.
దా డిగ్గా దా డిగ్గా! రిం రితా ధిన్‌తా.

బంగారానికి వెండికీ మధ్య నా ప్రియునిరూపం బంగారువన్నెలో వున్నది. బంగారపు ఉంగరం చూసుకునేప్పటికి నాకు నా ప్రియుడు స్మృతిపథంలో మెదిలాడు.

సంథాల్ పరగణా గిరిజనులైన సంథాల్ ప్రజలకు కనీసం సువర్ణకాంతి అయినా సోకిందో లేదో? ఎవరికి తెలుసు? అయితే ఇక్కడి సంథాల్ తెగవారికి వెండి. బంగారాలమధ్యనున్న భేదమేమిటో బాగా తెలుసు।

....జమీందారీవిధానం రద్దయింది. ఇప్పుడిక జమీందార్లు పొలాలు స్వాధీన

వదులుకోగూడదు, వాళ్ళనే మనం వెళ్ళగొట్టాలి. దున్నేవాడికే భూమి. దున్నదానికి ఎంతభూమి దొరికితే అంతభూమి దున్ని సాగు చెయ్. నాట్లు వెయ్. కోతలు కొయ్! ఇప్పుడు పండుకునే ప్రశ్నే లేదు.

... భూమిని నమ్ముకొన్నవా రెప్పుడూ చెడిపోరు! మళ్లా పొలాలు పంట పైర్లతో కళకళలాడుతాయి. ఆషాఢమేఘాలు ధ్వనులు పెడుతున్నాయి! మెరుపులు మిరుమిట్లు గొల్పుతూ నాట్యం చేస్తున్నాయి! నువ్వుకూడా నాట్యం చెయ్. నాట్యం చెయ్! నగారా మోగించు. పచాయ్ మద్యం మత్తు ఈ రోజు వదిలిపోదు! పౌర్ణమ చంద్రుడు కనిపించకుండా పోయేంతవరకు మననాట్యం కొనసాగుతూ ఉండవలసిందే. వెన్నెలవలె ప్రియురాలి చిరునవ్వు. పిల్లనగ్రోవి మధురాలాపనవలె - బాణంలాగా హృదయాన్ని బాధపెడుతుంది....ప్రియా. నా హృదయంమీద కుసుమాలతో నిండిన నీసుకోమల శిరస్సును ఉంచు.

దా డిగ్గా డిగ్డి-తా ధిన్.

## ముప్పై ఆరు

డాక్టర్‌కు ఇక్కడి భూమిపట్ల వ్యామోహం పెరిగిపోయింది. యుగయుగాల నుంచీ ఈ భూమిని తా నెరుగుదునని భావిస్తున్నాడు. ఇది తన మట్టి. నదులు, తటాకాలు, చెట్లూ-చేమలూ, అడవులు-మైదానాలూ, జీవజంతువులు, క్రిమి కీటకాలు-అన్నిటిలోనూ ఏదో ప్రత్యేకత ఉన్నట్టు ఆయనకు తోస్తున్నది. బెనారెస్, పాట్నాలో కూడా గుల్‌ముహర్ చెట్లకొమ్మలు ఎర్రటిపూలతో నిండిపోయేవి! నేపాల్ లోయలలో, పర్వతాలమీద దివిపెనపూలు, మోదుగపూలు రెండూ ఒకదానికొకటి పెనవేసుకొని పుష్పాలు వెదజల్లడం తాను చూశాడు. కాని ఈ పూల రంగులు తనలో మొదటిసారిగా మంత్రముగ్ధుణ్ణి గావించాయి.

గోల్డ్ మొహర్—గుల్‌ముహర్—కృష్ణచూడా....గుల్‌ముహర్ చెట్టుకు 'కృష్ణచూడా' అనేపేరు ఇక్కడెంత బాగా అతికినట్టుగా వున్నది. నల్లనికృష్ణుడి మకుటంలో ఎర్రనిపూలు ఎంత అందంగా అగుపిస్తాయి.

మామిడికాయలతో వేలాడుతున్న చెట్లను చూడడానికిముందు అతనికళ్ళ ఎదుట మామిడిటెంకల గుజ్జును రొట్టెలుగా చేసుకొని జీవించే మానవమాత్రుల రూపాలెన్నో కదిలాయి.

....అటువంటి మానవులా? అభాగ్యులు. అనాధులు అలో లక్ష్మణా అను కుంటూ ఊరుకోరు! వాళ్ళ ఆత్మ ఎప్పటికీ నాశనంకాదు! ఎప్పటికైనా అభాగ్యు లందరూ కెరటంలా కదిలి తిరుగుబాటు ప్రకటించవచ్చు! ఇలాంటిది జరగదని అనుకోవడం అవివేకం!....డాక్టరు ఇక్కడి పేదరికాన్ని, ఇక్కడి దైన్యాన్ని చూసి ఆశ్చర్యపోయాడు! ఈ వరంలోవున్న సంతృప్తి ఎంత మహోన్నతమైంది? ఆ సంతృప్తితోనే వీళ్ళు జీవనయానం కొనసాగిస్తున్నారు! ఈ అభాగ్యులందర్నీ. ఈ వేలాది క్షుధితులందర్నీ ఒక్క త్రాటిమీద నిలబెట్టే ఆ కఠోర విధాన మేమిటో? అశాంతిలో వుంటూకూడా ప్రశాంతిని వరిందారు!

....కఫం ఆవరించిన రెండు ఊపిరితిత్తులు! కప్పుకోవడానికి దుప్పటిలేదు; పడుకోవడానికి చాపలేదు. ఎండుగడ్డికూడా కరువే! తడిసిననేలమీద పడుకున్న నిమోనియారోగి చనిపోలేదు; జీవించాడు!....ఎలాగు?

....ఇక్కడ విటమిన్లనుగురించిన వివరాలతో నిండిన కాగితాలను పంచి పెట్టేవాళ్ళ తెలివితేటలకు జాలిపడి లాభంలేదు....దోమలబొమ్మలను చూపించి వాటి కాటునుంచి తప్పించుకునేమార్గాలను పోస్టర్లద్వారా చిత్రించిగాని లేదా మేజిక్ లాంతర్లద్వారా మలేరియావ్యాధి ఎంత భయంకరమైనదో చూపించి నివారణో పాయాలనుగురించి ప్రచారం చేసినవాళ్ళు ఎవరు? ఇక్కడివాళ్ళు ఆ దోమలచిత్రా లనుచూసి—'పూర్ణియాజిల్లాలో దోమలున్నాయని అనవసరంగా దుష్ప్రచారం చేస్తున్నారు; చూశారో లేదో పశ్చిమప్రాంతపు దోమలు ఒకమూరపొడవున ఉంటాయి; తొండం నాలుగుబార్లుంటుంది. బాబోయ్' అని అంటారు!

డి. డి. టి; దోమతెరలవిషయం అలా వుంచండి; శరీరానికి ఆపమానె రానుకోవడంకూడా విలాసజీవితంకింద జమకట్టడం జరుగుతుంది....ఇలాంటివనులు అమీందార్లు చేస్తారని. స్వర్గంలోని అప్సరసలు నూనెలతో పుణ్యం చేసుకున్న వాళ్ళకుమాత్రమే మర్దన చేస్తారని భావిస్తారు....!

పొలాల వల్లరేగడిమట్టిలోవున్న సంజీవనీశక్తి. వీళ్ళకు ప్రాణదానం చేస్తు న్నది. సశ్యశ్యామలం, సుజల-సుఫల - వీళ్ళకు తల్లికాదా? ఇకముందు భూమిమీద కాలుబెట్టే అధికారంకూడా పోగొట్టుకోవచ్చు! చట్టాలు ఏర్పాటు చేయకపూర్వమే చట్టాలు విష్ఫలీయోజనం కాతగిన మార్గాలుకూడా ఏర్పదేవుంటాయి. సూది బెజ్జంలోనుంచి ఏనుగుకూడా దూరిపోవడానికిగల అవకాశాలను కల్పించడమే ఈనాటి మన తెలివితేటలకు నిదర్శనం! బుద్ధి వక్రించినవాళ్ళు ఇలాగే మాట్లాడుతూ ఉంటారు....వేలాది ఎకరాలభూమివున్న వ్యక్తి మరో ఐదు ఎకరాల భూమికోసం నానాగడ్డి తినడానికి తయారవుతున్నాడు. భూమిలేని పేదవాడు మనిషి కాదు; జంతువు!

డాక్టర్ మమతకు రావాడు.—

'నువ్వు మాట్లాడేభాష ఇక్కడివాళ్ళకు అర్థం కాదు. నీకు వీళ్ళభాష అవ గతం కాదు. నువ్వు తినేది. వీళ్ళు తినలేరు; నువ్వు ధరించేది. వీళ్ళు ధరించలేరు. నువ్వు విశ్రాంతి తీసుకుంటావు; కబుర్లు చెబుతావు; నవ్వుతావు! అటువంటిదేమీ వీళ్ళు చెయ్యరు. మరి వీళ్ళను నువ్వు మనుషులుగా ఎలా భావిస్తున్నావు?....'

....అతను మనుషుల డాక్టరు; జంతువుల డాక్టరు కాదు! టెస్ట్ ట్యూబులో మనిషిరక్తం, జంతువులరక్తం వేర్వేరుగా పెట్టిఉన్నాయి. రెంటి 'సిరమ్'కు వేర్వేరు వేర్వేరు అవసరాలున్నాయి. డాక్టరు మనిషిరక్తంఉన్న ట్యూబ్ చేతిలో తీసుకొని, కొంచెం పైకెత్తి జాగ్రత్తగా పరిశీలిస్తాడు. మనుషుల రక్తకణాల్లోను, జంతువుల రక్తకణాల్లోనూ ఎంత భేదమున్నదో, ఎంత సామ్యం ఉన్నదో తెలుసుకోవాలనుకొంటున్నాడు.

రక్తంతో నిండివున్న టెస్ట్ ట్యూబుల్లో ఇప్పు డెటువంటి ఆకర్షణా లేదు!

సంజీవిని మూలికను అన్వేషించి ఏం చేయాలి? అతనికి అక్కర్లేదు సంజీ విని! ఆకలికి అలమటించి, నిస్సహాయతకు నిస్పృహచెంది మరణించడంకంటే పేగ్లనెంట్ మలేరియావచ్చి స్పృహకోల్పోయి మరణించడం మేలు! ముక్కలు ముక్కలుగా తరగబడి, ఉసూరుమంటూ కొద్దికొద్దిగా తీసుకొని తీసుకొని మరణించ డానికి ప్రాణం పోయడం చాలా అన్యాయం చేయడమే అవుతుంది....మహాత్మా

గాంధీ బాధతో కొట్టుకుంటున్న ఆవుదూడను కాల్చి చంపమని సలహా ఇచ్చారట! కొత్త ప్రపంచంలో మానవుణ్ణి ఆరోగ్యంగానూ, సౌందర్యంగానూ తయారుచేయాలని ఆకాంక్షిస్తున్నాడు. ఇక్కడ మనుషులేరీ?....ఇప్పుడు చేయవలసిన మొదటి పని జంతువును మనిషి చెయ్యడం!

ఆయన మనసుకు రాగాదు—

'ఇక్కడిమట్టిలో చెల్లాచెదరుగావున్న లక్షలాది మానవులజీవిత బంగారు కలలను ఏకంచేసి, అసంపూర్ణంగావున్న అభిలాషలను ఏరి, ఇక్కడి ప్రాణికోటి జీవకోశంలో నింపాలని నేను వూహించుకున్నాను. వేలాది స్వస్థమానవులు హిమాలయలోయల్లో, త్రివేణీ సంగమందగ్గర, అరుణ, తిమురసుణకోశీ సంగమస్థలి దగ్గర ఒక విశాలమైన ఆనకట్ట కట్టేందుకు పర్వతాలను పగలగొట్టి శ్రమిస్తున్నట్టు నేను కల్పించుకొన్నాను....లక్షలాది ఎకరాల చవిటినేల, కోశీ కబళించినది, సస్యశ్యామలమవుతుంది. ఇసుకరేణువులతోనిండిన మైదానాలు పచ్చబడతాయి. మొక్కజొన్నపొలాల్లో గడ్డి కోసుకునే ఆడవాళ్ళు అకారణంగానే ఫక్కుమని నవ్వుతారు. ముత్తులవంటి దంతాల కాంతి!'

డాక్టర్ రిసర్చి పూర్తయింది. అంతా పూర్తి అయింది. ఆయన పెద్దడాక్టరై పోయాడు. డాక్టర్ వ్యాధిమూలాన్ని పట్టుకున్నాడు....!

పేదరికం, నిస్పృహాయత—ఈ వ్యాధికి రెండు కీటాణువు లున్నాయి.

ఎనోఫిలీస్ కంటేకూడా ఎక్కువ ప్రమాదకరమైనవి, పేండ్ప్లై కంటే కూడా విషభూయిష్టమైనవి, ఇక్కడి....

ఊహుఁ! కాళీచరణ్‌లాగా తనుకూడా తరతమభేదాలను చెబుతూ ఉదాహరణలు ఇచ్చేలా వున్నాడు!....కాళీచరణ్ రైతులమధ్య ఉపన్యాసం ఇస్తున్నాడు—ఈ పెట్టుబడివారులు, ఈ జమీందార్లు-ప్రజల్ని నల్లుల్లాగా, దోమల్లాగా పీల్చేస్తున్నారు....నల్లులు! అందుకే చాలామంది మార్వాడీలపేర్లు 'ల'తో అంతమవుతాయి; జమీందార్ల పిల్లల్ని మిస్టర్ అంటారు, మిస్టర్-మశకం!'

నెర్రెలిచ్చిన గోడ! అది కూలిపోతుంది. కూలిపోనివ్వు! కుళ్ళి కంపు కొడుతున్న ఈ సమాజం ఎంతవరకు నిలిచిఉంటుంది?

....కవి హంసకుమార్ తివారి కవితలోని కొన్నివంక్తులు గుర్తొస్తున్నాయి—

ప్రపంచం ఎందుగడ్డిని గుట్టగా పెట్టుకున్నది.
నింగికి అందేలా అందులో రెండు నిప్పురవ్వ లుంచుతాను!

గుల్‌ముహర్ - అగ్నిపుష్పం! అందహీనంగా వున్నదంతా మండిపోతున్నది, ఎరుపు! ఎరుపు!!....

తామరపూలు! కమలానదిగుంటల్లో అరవిచ్చిన తామరకృకలు తనలో కొత్త జీవనవరాగాన్ని నింపుకొని నిండుగా వికసించడానికి తయారవుతున్నాయి.

'ఎవరూ? నువ్వా కమలా? ఇంతరాత్రివేళ?....ఒంటరిగానే వచ్చావా?'

'డాక్టర్!....చెప్పు! నిజం చెప్పు! నేను గంటన్నరనుంచి నిలబడిచూస్తున్నాను! నీ కేమైంది డాక్టర్? నీకూ భయంగా వున్నదా? తల తిరుగుతున్నదా? చూడు; చెవులదగ్గర వేడివేడిగా ఉంటున్నదా? ప్రపంచం తిరిగిపోతున్నట్టుగా అని పిస్తున్నదా?....డాక్టర్....డాక్టర్....ప్యారూ!'

కమల సువాసనను వెదజల్లుతున్నది. సుకోమలరేకుల కమనీయస్పర్శ! కమలా!....ఆఁ! నేను కమలఒడిలో వున్నానా? నాకు నిద్ర రాదుకదా! నేను లేచి కూర్చోవాలి! నా గమ్యం....!

'కమలా! లే లే! నిన్ను పంపించివస్తా!'

'పడుకో నాయనా!'

'ఎవరూ, పిన్ని! నువ్వొచ్చావా?'

ప్యారూ చెప్పనే చెప్పాడు—'నిన్న ఉదయంనుంచి అన్నపానాదులు లేకుండా పట్టి టీ తాగుతూ కూర్చుంటే తల తిరిగిపట్టుఉండదూ మరి?'

## ముప్పైఏడు

తాసిల్దారు విశ్వనాథ్ ప్రసాద్ ఇంటిముందు పంచాయతీ సమావేశం ఏర్పాటైంది. ఇద్దరు తాసిల్దార్లకు రెండువైపులా బాంబేప్, కాశీదరప్ కూర్చొని

ఉన్నారు. రాజపుత్ర బ్రాహ్మణుడిపక్కన యాదవులు కూర్చున్నారు. ఒకే ఒక ఎత్తైన తివాసీమీద! ఓహో! మాదిగ శివేశ్వర్‌కూడా ఆ తివాసీమీదనే కూర్చున్నారు!....సరే, ఇక దారికివచ్చినట్టే! చూడు, తాసిల్దారు హరగౌరి ఇవ్వాళ్ళ కాళీచరణ్‌తో ఎలా నవ్వుతూ మాట్లాడుకుంటున్నారో. ఒకే 'పాత్ర' పాతమిత్రుల్లాగా! ఆఁ! అనుకున్నట్టే, యాదవుల్ని జవాహర్‌లాల్‌కూడా ఇప్పుడు క్షత్రియులుగా ఒప్పుకున్నారు! ఇప్పటికి ఎవరూ ఏం మాట్లాడటానికి వీల్లేదు!....బావన్‌దాసు కులమేమిటి? బావన్‌దాసు కన్పించడేం? పూర్ణియా వెళ్ళాడా? ఇవ్వాళ్ల ఈ పంచాయితీ సమావేశానికి అతడుకూడా ఉండవలసింది! ఆఁ! ఎలాగైనా బయటివాడు బయటివాడే! ఈ ఊరితో అతనికి అవసరమేమిటి? ఇక్కడ కాకపోతే మరొకచోట! కాని, కాళీచరణ్....బాల....! మంగలి టోమన్ ఏదో అంటున్నాడు, వినండి:

'నాయీ బ్రాహ్మణపేటనుంచి, రజకపేటనుంచి ఒక్కొక్క మనిషిని ఎత్తు తివాసీమీద కూర్చోనడానికి ఎన్నుకోవలసిందిగా కోరుతున్నాను!'

'ఓహో! అలాగా టోమన్‌భాయీ! సరే, నువ్వే చెప్పు, మీ పేటలోనుంచి కులపెద్దగా ఎవ్వరిని ఎన్నుకోమంటావు? చెప్పు! అయితే నువ్వే వచ్చికూర్చో! ఇక, రజకపేటనుంచి? ప్యారేలాల్ ఉన్నాడుగా! రావోయ్! రా ప్యారే!' కాళీచరణ్ ప్యారేను తనదగ్గర కూర్చోబెట్టుకున్నాడు.

'అయితే ఇప్పుడు విషయమేమిటంటే— తాసిల్దారు విశ్వనాథ్ ప్రసాద్ వక్కపలుకులు నములుతూ చెప్పడం సాగించాడు—'ముందు ముందు గడ్డురోజులు రాబోతున్నాయి. రోజూ పత్రికలు చూసేవాళ్ళకు ఎంత గడ్డుకాలం రాబోతున్నదీ బాగాతెలుసు! బెంగాల్‌లోలాగా కరువు రావచ్చు. బెంగాలు కరువునుగురించి మీకు తెలుసుగా? గొడ్లుకాసే పిల్లలుకూడా ఇప్పటికీ పాడుకుంటూ ఉంటారుగా, వినలేదా?

వచ్చెరా, కరువొచ్చెరా
బంగాళాదేశంలో కరువొచ్చెరా
నాలుగులక్షలజనం చచ్చిపోయెరా....!

'....కాళీచరణ్‌ను అడగండి, బాలదేవ్‌ను అడగండి. చెబుతారు, బెంగాలులో వచ్చినటువంటి కరువు మరెక్కడైనా వచ్చిందేమో! వయస్సు పెరిగితే

మాత్రం ఏమిటి? పత్రికలు చదివేవాళ్ళకు ప్రపంచంలోని సంగతులన్నీ ఇట్టే తెలిసిపోతాయి. నేను మొదటినుంచి కటిహార్, పూర్ణియా వెళ్ళివుండకపోతే కూపస్థమండూకంలా ఉండిపోయేవాణ్ణి. బావిలోని కప్పలాగా....చూశారా, ప్రభుత్వం ధనికులందరిదగ్గర్నుంచీ ధాన్యం వసూలు చేస్తున్నది! ఎందుకు? ప్రభుత్వానికి కరువు అంతటా వ్యాపిస్తుందని భయం. అందువల్ల అవసరానికి ఆదుకోవడానికి ఎక్కువగా స్టాక్ పెట్టుకోవడం అవసరం. మీరంటే - మీకు ముగ్గుర్ని గుర్తుంచుకుంటారు! ఒక సంవత్సరంపొడుగునా బాబోయ్, బాబోయ్. అని కేకలు పెడతారు - వర్షంకోసం ఇంద్రుణ్ణి ప్రార్థిస్తారు. సూర్యభగవానుడిలో ఎండ కావాలంటారు; నౌకర్లుగా పని చేసుకుంటూ, దొరికినన్ని అప్పులు తీసుకుంటూ ఉంటారు. సమస్త భారతదేశాన్నిగురించి ఆలోచించవలసిన వాళ్ళపరిస్థితి ఎలావుంటుందో మీరు గుర్తించారా? ఇప్పుడు లీడర్లంతా జైళ్ళనుంచి బయటికొచ్చారు. మంత్రి పదవులు అలంకరించారు. వెంటనే కరువొస్తే మనకు రావలసిన స్వరాజ్యం రాకుండానే పోతుంది. ఒకవేళ వచ్చినా అందరికి తిండి దొరికేట్టు చూడ్డానికే శక్తి అంతా ధారబోయవలసి వస్తుంది. ఇందువల్ల మనమంతా ఎక్కువ పంటలు పండించాలి. ఇప్పుడు మీరందరూ కోర్టుకెళ్ళి 144 వ సెక్షన్ తెచ్చారనుకోండి; ఆ తరువాత సెక్షన్ 145 తీసుకరావడం జరుగుతుంది. దీనివల్ల పొలాల్లో నాట్లు వేయడానికి వీలుండదు. పొలాలు అలాగే పొగుబడిలేకుండా వదిలివేయవలసివస్తుంది. ధాన్యం ఉండదు. యజమానులదగ్గరకెళ్ళి ధాన్యం కావాలంటారు; కాని వాళ్ళెక్కడనుంచి ధాన్యం తెస్తారు? గవర్నమెంటు బలవంతంగానో, చట్టం భయం చూపించి ధాన్యం వసూలు చేసుకెళుతుంది. పెద్దయజమానుల ధాన్యపుకొట్టుల్లో గబ్బిలాలు ఎగురుతూ ఉంటాయి. ఇంతకూ నేను చెప్పవచ్చిందేమిటంటే — మనమంతాకలిసి ఆలోచించి ఏంచేస్తే బావుంటుందో చెబితే, ఆవిధంగా చేద్దాం.'

....ఓహో, అయితే ఈ సమావేశం పొలం పుట్రా లేనివాళ్ళకు ఉపదేశాలివ్వడానికి ఏర్పాటు చేశారా?....మాట్లాడకు. తాసిల్దారు చెప్పేది నీకర్థం కావడం లేదేమో. ఆయన చెప్పింది సరిగ్గానే వున్నది. ఆయన చాలా మంచిమనిషి!.... సరేగాని, ఈ కాశీచరణ్, ఈ బాలదేవ్ ఇవ్వాళ్ల వచ్చారు. మొదట్లో అన్నిటికీ ఈయనేకదా మనకు? ఈయన ఇంటిదగ్గర కూర్చునేగా పేపర్లో నేతాజీ సింగపూరుకు పుష్పకవిమానంలో వచ్చారని విన్నాం ...తాసిల్దారుగారు బాగానే చెప్పారు.'

'తాసిల్దారుగారూ! పెద్దలు మీరు! మీరు చెప్పినదాంట్లో వేనఃబేమీ లేదు. అంతా బాగానే వున్నది. మీరే ఏదో ఒకమార్గం చెప్పండి.'

'ఆఁ. తాసిల్దారుబాబోయ్, మీరే ఏదో ఒకటి చెప్పండి!'

'సరే! ఏమంటావు కాశీచరణ్ జీ!' తాసిల్దారు హరగౌరి నవ్వుతూ అడిగారు!

విన్నారా, విన్నారా! హరగౌరిబాబుకూడా 'కాశీచరణ్ జీ' అంటున్నారు.

'బావున్నది! అలాగే! తాసిల్దారుగారు చెప్పిన సంగతులన్నీ బాగానే వున్నాయి!'

'అదీ సంగతి! నాకు భారతదేశాన్నిగురించి బెంగలేదు. నాకు కావలసింది నా ఊరు! ఊళ్ళోవున్నవాళ్ళ బాగోగులు! మన మంచిమీదనే ప్రపంచం మంచి కూడా ఆధారపడిఉంటుంది. ఇందులోనే మన గ్రామకల్యాణం ఉన్నది. అందరూ, ధనికులు, పేదలు అనే భేదభావంలేకుండా అన్నదమ్ముల్లాగా ఐకమత్యంగా ఉండాలి. భూములవిషయంలో ఇదివరలో ఎలా వుండేదో అలాగే ఉండడం మంచిది! ఎవరూ భూములు వదలవలసినపనిలేదు; మరొకరి భూములు ఆక్రమించుకోవలసిన అవసరమూ లేదు. ఇదివరకు ఉన్నపరిస్థితే ఇప్పుడూ ఉంటుంది. ఎవరూ ఎటువంటి దరఖాస్తులూ ఇచ్చుకోనవసరంలేదు. ఇలాచేయడం ఉభయులకూ బావుంటుంది. ఏమంటావు హరగౌరిబాబూ! మీ మేనేజరుతో వెళ్ళిచెప్పు. కొంచెం జాగ్రత్తగా మసులుకోమని! ఇలా రైతులతో శత్రుత్వం పెట్టుకుంటే - ముఖ్యంగా మా రైతులతో పెట్టుకుంటే మర్యాదగా ఉండదనిచెప్పు! అలాచేస్తే పరిస్థితి విషమిస్తుంది.... ఈ వ్యవహారానికి సంబంధించిన సంగతులు నాకూ చాలా తెలుసు! నే నిప్పుడు గనుక సాక్ష్యం ఇస్తే అంతా తారుమారవుతుంది! ఎన్నో పత్రాలు, ఎన్నో ఉత్తరాలు నాదగ్గరున్నాయి. నేనుగనుక ఇవన్నీ బయటపెడితే అవుతుంది - ఓం నమో నారాయణా....!'

హ్హ హ్హ హ్హ! అక్కడ కూర్చున్నవాళ్ళందరూ ఫకాలున నవ్వారు.

'అవునవును! ఈ తాసిల్దారంటే ఏమనుకున్నారో, అసలు ఈయన ఏ వంశంవారో తెలియదేమో!' సింగ్ నవ్వుతూ అన్నారు.

'మహారాణీ చంపావతి!....'

అహ్హ హ్హ హ్హ హ్హ. రెండోసారి అట్టహాసంగా నవ్వులు వినిపించాయి. నరకహృదయాల స్వచ్ఛమైన నవ్వులు।

'సరే సరే. ఇప్పు డిక అసలు విషయానికి వద్దాం।....చూడు కాళీచరణ్! లీడరు వయ్యావు! బాగా నేవుంది. మన గ్రామం పేరు ప్రఖ్యాతులుకూడా పెరిగాయి. కొందరు సోషలిస్టుపార్టీ లీడర్లయితే, కొందరు కాంగ్రెసులీడర్లు। నల్లటోపీబృందం వాళ్ళుకూడా కొందరున్నారు. చూడండి బాబూ! నేమన్నానే - మీ అందరికుర్రాళ్లకు ఏకైక లీడరులాంటివాణ్ణి. ఊళ్లో ఏమైనా అపనవ్యవ్యవనములు జరిగితేమటుకు తోలు వలిచేస్తాను. అబ్బాయిలూ! ఖేలావన్? సిద్ధాంతిగారు? మీరే చెప్పండి - నన్ను బాబాయ్ అని. మామయ్యా అని. అన్నయ్యా అని. పెదనాన్నా అని పిలిచేకుర్రాళ్లు గనుక ఏదైనా తప్పుచేస్తే చెవ్వు మెలిపేసి కొంచెం గట్టిగా మందలిస్తే అందులో నా తప్పేమైనా ఉంటుందా చెప్పండి।'

'లేదు. లేదు! మీరు మంచిమాటే చెప్పారు!'

'మేమూ బయటివాళ్ళం కాదు! అయినా ఒకవిషయం ముందుగానే చెబు తున్నాం! ఇప్పుడు మేము మీరు చెప్పినట్టుగానే నడుచుకుంటాం. ఆ తరువాత మా తప్పు జరిగితే ఏం కావాలి? కాళీచరణ్ ప్రశ్నించాడు.

'దీనికి నేను బాధ్యత వహిస్తాను. నేను చెప్పానుగదా. అన్నీ నా చేతుల్లో వున్నాయని?'

'అయితే సరే! అందరితోపాటే మేముకూడా!'

'మంచిమాటే! బావుంది!'

'సోదరులారా! మరోసంగతి। ఎవరైనా బయటివూరివాళ్ళొచ్చి ఈ వూరి కౌలంచేసుకునే రైతులమీద దాడిచేస్తే దాన్ని మనమందరంకలిసి తిప్పికొట్టాలి। మనవూరిభూమి మనవూళ్ళో ఉంటుంది. బయటివాళ్ళెందుకు రావాలి? తెలిసిందా?'

'నిజమే! అలాగే చేద్దాం।....చాలా పొద్దుపోయింది। మేఘాలు కమ్ము కొచ్చాయి. వర్షం పడుతుందో యేమో। ఇంద్రదేవా! వానలు కురిపించు। మైత్రవి వావా. వెల్లగ దిగవే। కారుమేఘమా దిగవే దిగవే।।'

ప్రతిసంవత్సరం వర్షాకాలంలో ఇలాగే జరుగుతుంది. అంతా ఆ భగవంతుని మాయ! మనిషిచేతిలో ఏమున్నది? ఇంద్రభగవానుణ్ణి ప్రార్థిస్తారు - వానలు కురిపించమని. ఆకాశంమీద ఏమూల కొంచెం నల్లగా కనిపించినా మెరుపు మెరిసినా-జనం ఇళ్ళల్లోనుంచి బయటికొచ్చి 'వర్షం కురిపించు వానదేముడా!' అని కేకలు పెడతారు. ఉన్నవాళ్ళకు, లేనివాళ్ళకు అందరికీ అన్నం ముఖ్యంగదా! వర్షం ఐదు రోజులు వరసగా కురిస్తే అప్పుడు జనం కొంచెం నెమ్మదించు మహానుభావా! అని అంటారు!

అంతా ఇంద్రుడి దయ! ఆయనగారి అంతర్యం సరిగావుంటే ప్రజల ప్రార్థనను మన్నించి ఒక వారంరోజులపాటు వర్షాన్ని ఆపి వుంచుతాడు. సమయానికి వర్షాలుపడి, ఎండకూడాకాస్తే ధాన్యం పెట్టుకొనే చోటుండదు. 'మూషికం ఆడమూషికాన్ని ధాన్యం ఎక్కడుండాలని అడిగినట్టు!' అనేసామెత ఉండనే ఉంది!

....తాసిల్దారు విశ్వనాథ్ ప్రసాద్‌గారింటిదగ్గర పంచాంగశ్రవణం ఉంటుంది! పంచాంగంలో వర్షాలనుగురించి, పాడిపంటల్నిగురించి ఉంటుంది.

....తాంత్రికులపేట, దర్బానులపేట, బోయీలపేట, కమ్మర్లపేట ఆడవాళ్ళు ప్రతిసంవత్సరం ఈకాలంలో ఇంద్రదేవుణ్ణి సంతోషపరచి వర్షాలు కురిపించేందుకుగాను 'జాట్ జట్టిన్' ఆడతారు!

ఇవ్వాళ్ళ ఆ కార్యక్రమం వున్నది. నిన్న వేరేపేటలో జరిగింది. మేఘాలు వచ్చివస్తేవచ్చి ఆకాశంలో కలిసిపోయాయి. ఈరోజు పౌర్ణమి. రేపటినుంచి వర్షాలు పడకపోతే ఈ పక్షంరోజులూ ఇలాగే వుంటుంది. తాంత్రికులపేట ఆడవాళ్ళు, యజమానులపేట ఆడవాళ్ళను ఆహ్వానించారు—'మనమంతాకలిసి 'జట్ట జట్టిన్' ఆడితే వర్షం తప్పక కురుస్తుంది!'

గొల్లలపేట, కాయస్థులపేటకు మధ్యనున్న పదిహేనుగొలనుల ఖాళీ మైదానంలో ఆడవాళ్లు ఏకమైనారు.

....జాట్‌కు వేలాది బర్రెలున్నాయి. వాటిని మేపుకొనడానికి కోశనదిఒడ్డుకు వెడతాడు. జాట్ భార్య ఇంట్లో ఉంటుంది. పాలూ, పెరుగు, నెయ్యి అమ్ముతుంది.

తప్పు జాగ్రత్త చేస్తుంది. అత్త, భర్తతో పోట్లాడి ఒకసారి జాట్ భార్య పుట్టింటికి వెళ్ళిపోయింది. జాట్ భార్యను వెదుక్కుంటూ బయలుదేరుతాడు; అతనిభార్య చాలా అందంగా ఉంటుంది. ఆమె అందాన్నిగురించి అందరూ ఎంతగానో చెప్పుకుంటూ ఉండేవాళ్ళు।

సున్‌రీ హమరీ జటనియాహో బాబూజీ
పాతరీ బాంస్‌కే లేంకనియాహో బాబూజీ
గోరీ హమర్ జటనియాఁహో బాబూజీ
చానపీరాత్‌కే ఇంజోరియాహో బాబూజీ
నహ్ని నహ్ని దంతవాపాతర్ ఠోరవా
ఫటకై కైసన్ బిజిలియా ...!

జాట్‌కు గ్రామంలోని ప్రతిఇంటి యజమాని, మండలనాయకుడిమీద అనుమానంగా ఉంటుంది....జట్టిన్ పుట్టింటికి పోయిఉండదు! ఎవరో తనఇంట్లో పెట్టుకొనిఉండవచ్చు! దారిలో ఎన్నో ఊళ్ళున్నాయి; ఎన్నో నదులున్నాయి; ఎన్నో రేవులున్నాయి; రేవుందగ్గర దక్షిణ తీసుకునే బ్రాహ్మణులున్నారు। అతడు దాంతో తనబద్ధ ప్రతి గ్రామంలోని యజమానిఇంటికి, మండలాధిపతిఇంటికి, నాయకుడింటికి వెడతాడు—

నాయకా! నాయకా!
తలుపు తెరవు నాయకా!
నా జట్టిన్ వుంటే పంపించు నాయకా।

జటిన్ రామప్రియ వేసింది; జాట్ పాత్రధారిణి — కూరగాయలపేట పిల్ల మణిసీ! చూట్టానికి మణిసీ మగవాడిలాగానే ఉంటుంది.

'జాట్ - జట్టిన్' నాట్యంతోపాటు మధ్యమధ్యన మరికొన్ని సామాజిక వర్తనాలు, వ్యంగ్యనాట్యాలుకూడా ఉంటాయి....పుణియా డాక్టర్‌గా వేసింది. తామరపూవు తూడును అటూ ఇటూ కట్టేసి స్టెతస్కోపుగా తయారుచేసింది. పనిచరాని కొత్త పైజమా తెచ్చింది. బిహూలా నాట్యం చేసేవాళ్ళదగ్గరమంచి టోపీ కోటుకూడా తెచ్చింది.

'ఏ మ్యాన్, ఇదర్ ఆతాహై! లోటో! ఎట్లా వుంటుంది నీకు?'

'అయ్యా! తల నొప్పిగా ఉంటుంది. కన్నుకూడా కొంచెం నొప్పిగానే ఉంటుంది. కొంచెం చెవికూడా నొప్పిగానే వుంటుంది. గుండె గుడగుడమంటూ ఉంటుంది. జలుబు చేసింది. వేడి చేసింది. ఆకలి లేదు. ఆకలివేస్తేనేమో అన్నం లేదు! రోగిగా బోయీలపేట సురతివేసింది. మాటలు బాగా చెబుతుంది.... అహ్హ హ్హ హ్హ హ్హ!

'బాబోయ్! ఇటువంటిజబ్బు ఎప్పుడూ చూడలేదే! నీ గుండె చూడనివ్వు! (చూసి) లాభం లేదు! నువ్వు బతకవు! నీ జబ్బుకు పురుగుపట్టింది. ....ఇక్షన్ ఇవ్వాలి!'

రెండో రోగిణి వస్తుంది. కమ్మరిపీథి తారావతి!

'ఏయ్ అమ్మాయ్! నీ కేమైంది?'

'నా గుండె కొట్టుకుంటున్నది.'

'బాబోయ్! ఇక్కడందరిగుండెలు కొట్టుకుంటున్నాయి. నా గుండెకూడా కొట్టుకుంటున్నది.'

డాక్టరు, రోగి - ఇద్దరూ ఒకరినొకర్ని చేతులతో పట్టుకుంటారు. భయపడుతూ - గుండె ధక్ ధక్; గుండె ధక్ ధక్!

ఆడవాళ్ళందరూ నవ్వలేక చచ్చారు. ముసలమ్మలైతే దగ్గుతూ దగ్గుతూ తిరిగిపోయారు. అహ్హ హ్హ హ్హ హ్హ, ఆక్టోం!....బాగా చేశారు!

'జాట్-జట్టిన్' వాట్యం మగవాళ్ళెవరూచూసే అధికారం లేదు. ఎవరైనా దొంగతనంగాచూస్తే ఆ రెండోరోజున పంచాయతీలో పెడతారు.

....ఇప్పుడిప్పుడే మీసాలు వస్తున్నవాళ్ళు, మామూలుమీసాలవాళ్లు చూడవచ్చు!

చివరలో ఆడవాళ్లందరూకలిసి నాగలి దున్నుతారు. నాగలి, ఎడ్లూ ఎవరివో తెస్తారు. నాగలి దున్నుతూ గ్రామంలోని పెద్దపెద్దరైతుల్ని పేరుపేరునా తిడతారు. 'ఒరేయ్ విశ్వనాధ్ తాపిద్దారూ! తొందరగా మంచినీళ్ళు తీసుకురారా! ఒరేయ్, విన్నేరా! దద దప్పికతో చచ్చిపోతున్నామరా! ఒరేయ్! విన్నేరా!'

'ఒరేయ్! పింగ్! సిపాయిగా! పీక్కు తీసుకరారా!'

'ఏంరా రామఖేలావన్‌గా! పీక్కురా! మంచిపీక్కు తీసుకరా!'

....ఇలా అరేయ్, ఒరేయ్ అంటే ఎవరూ తప్పుగా భావించరు! పైగా పెద్దపెద్ద రైతులపేర్లు ఎవరినైనా మరచిపోతే వాళ్ళకు కష్టంగాకూడా ఉంటుంది.

ఈ పర్యాయం డాక్టర్‌నుకూడా వదిలిపెట్టలేదు—'ఒరేయ్ డాక్టర్‌గా!.... విన్నేరా ప్రశాంతిగా! తొందరగా పీసాలో పీక్లు తీసుకరా!....'

హ్హో హ్హో హ్హై హా!

ఆకాశంలో నల్లటి మేఘాలు అటూ ఇటూ పరుగులిడుతున్నాయి.... మెరుస్తున్నది కూడాను!

## ముప్పైఎనిమిది

రెండురోజుల్నుంచి ఆకాశం మేఘావృతంగా వున్నది. ఎండపొడ లేదు. రెండు మూడు గంటలపాటు వర్షం ఆగిపోయింది. అయితే సన్నగామాత్రం పడుతూనే వున్నది. ఆ తరువాత తుంపర సాగింది. ఒక చిన్న మేఘపుతునక కిందికి రావడం ఆలస్యం. దబదబా వర్షంపడడం జరుగుతున్నది. ఆషాఢమేఘాలు....!

రాత్రిపూట కప్పల బెకబెకలతోపాటు అసంఖ్యాకమైన క్రిమికీటకాలధ్వని ఒకతెగని రాగాలాపనగా అనిపిస్తున్నది. టర్ర్! మెంక్ టర్‌ర్‌ర్‌ర్.... మెంకూ!.... ఝి ఝి చి.... కిర్ర్ కిర్ర్.... పిం.... కిటిర్ కిటిర్! ఝి...టర్ర్....!

వంటలక్క లక్ష్మికి నిద్ర పట్టడంలేదు. మనస్సు చాలా చంచలంగా వున్నది. ఆమె శరీరంమీదికి ఏదో పురుగువచ్చి చేరినట్లు ఆమె కనిపించింది. ఆమె మాటిమాటికీ లేచి, పక్క దులుపుతున్నది. బట్టలు విదిలించి చూసింది. కాని ఎక్కడో ఏదో పురుగు కదులుతున్నచప్పుడు వస్తూనేవున్నది. అదే చప్పుడు....! లాంతరువత్తి పెద్దదిచేసి 'బీడీ' తీసుకొని కూర్చున్నది—

జానా నహీఁ బూఝా నహీఁ

సమఝా కియా నహీఁ గావ్

అందేకో అంధామిలా

రాహ్ బతావ్ కౌన్ ?

—తెలుసుకోలేదు, తెలుసుకోలేదు

మార్గమేదో బోధపడనేలేదు

అంధుడికి అంధుడే దొరికాడు

మార్గాన్ని ప్రబోధించేదెవరు ?

మార్గాన్ని ఎవరు చెబుతారు ? ఎవరూ లేరా ? ఆమె బాలదేవ్‌ను అర్థం చేసుకొన్నది, తెలుసుకొన్నది. బాగా గుర్తించింది ! మహంతు సేవాదాసు—'లక్ష్మీ ! బాలదేవ్ సాధుపురుషుడు' అని చెప్పాడు !....కాని బాలదేవ్ చాలా నాజూకుమనిషి; ఏకాంతంలో ఎవ్వరైనా మాటాడడానికి ప్రయత్నించడంతోనే గడగడ వణికిపోతాడు, మొహం ఎర్రబడిపోతుంది ! సిగ్గుతోనా లేక భయంవల్లనా ? కాని విరహబాణంతో గాయపడ్డ లక్ష్మీహృదయం రోదిస్తూనే ఉండిపోతున్నది !

విరహబాణ జిహిలాగియా

ఓషధ లగైన తాహి

సునకి సునకి మరిమరి జివై

ఉఠే కరాహి కరాహి !

—విరహబాణం తగిలినవాళ్లకు ఔషధం పనిచేయదు. జీవచ్ఛవాల్లాగా కుమిలిపోతూ బాధతో మూలుగుతూ ఉంటారు !

కాని బాలదేవ్‌కు ఈసంగతి ఏం తెలుసు ? లక్ష్మీమాత్రం ఏం చేస్తుంది ?

టర్రర్ మెంక్, మెంక్, ఝీ....ఈ....టింక్....టింక్....ఝీరి !....

ఉహుం. లక్ష్మీ ఇక తాళలేదు.

ఆమె బాలదేవ్‌దగ్గరకు వెడుతుంది. బాలదేవ్‌కు దోమతెర లేదు. దోమలు కుడుతూఉంటాయి.

....ఉహుం. ఆమె వెళ్లదు ! ఆమె ఎందుకు వెళ్ళాలి ?

పాపీ ప్యావత్ క్యాపిరో

ఘర్ ఘర్ పాయర్‌బారి

తృషావంత్ తో హోయగా
పీవెగా ఝుమమారి!

—ఇంటింటికితిరిగి పీకు దప్పికగా వున్నదా అవి అడగటం ఏం బావుం టుంది? దప్పికగావున్నవారు దేముడా అంటూవచ్చి తానే తాగుతాడు!

రామదాసు - మహంతు రామదాసు. ఇప్పుడు లక్ష్మితో చాలా తక్కువగా మాట్లాడుతున్నాడు. ఆయన పేరుకుమాత్రమే మహంతు! ఆయన కేమీ తెలియదు; అర్థం కాదు; అర్థం చేసుకోడు! ఎంత ఆదాయం వస్తున్నదో, ఖర్చు ఎంతవు తున్నదో ఆయనకేం తెలుసు? ఇరవైకిమించి లెక్కబెట్టడం తెలియదు. రెండువదు లెంతో తెలుసు! లక్ష్మి మతంతో ఒక్కరోజు లేకపోతే తాను ఉండలేడని రామ దాసుకు బాగా తెలుసు! లక్ష్మికి మాయమంత్రాలు తెలుసు! పత్రాలేమిటో, వ్యవ సాయమేమిటో, లెక్కా డొక్కా ఎలా వుండాలో - అన్నీ తెలుసు! ఏదో గౌర వంగాకూర్చొని, సుష్టుగా భోంచేయాలి అంటే లక్ష్మికి కోపంవచ్చేలా వ్యవహ రించగూడదని మహంతు రామదాసు బాగా గ్రహించాడు. అప్పుడప్పుడు మనస్సు చలిస్తుంది. కాని ఏమిటి చెయ్యడం? ఒక దాసీదాన్ని పెట్టుకునేందుకు లక్ష్మి అను మతిస్తే!....

గడ గడామ్. గడ్ గడ్....! మేఘాలు గర్జించాయి. మెరుపులు మెరిశాయి. ధారగా వర్షం కురవడం ప్రారంభమైంది.

అవును, ఇక రేపటినుంచి పొలాలు నారుమళ్ళువేయడం ప్రారంభమవు తుంది. జై ఇంద్రభగవాన్! వర్షాలు కురిపించు! మబ్బులన్నీ దిమ్మరించు! మరి నారుపోయడానికి ధాన్యం కావాలిగా? ఇవ్వాళ్ళ పంచాయతీలో అందరూ పెద్దపెద్ద ప్రసంగాలు చేశారు. రేపటికి వీళ్ళంతా ఎలా మాట్లాడతారో చూడాలి.—మా నారు మళ్ళకే విత్తనాలు లేవు! 'ముందు మమ్మల్ని వేసుకోనివ్వండి!'

గడ్ గడామ్. గుడుమ్!

'నారుమళ్ళకు విత్తనాలు యజమానులు ఇవ్వవలసిందే! ఎప్పుడూ ఇస్తూనే వున్నారు. ఈసారిమాత్రం ఎందుకివ్వరు?' కాళీచరణ్ ఆఫీసులో కూర్చున్నవాళ్ల తోనూ, సగం పడుకున్నవాళ్లతోనూ అన్నాడు - ఇదివరలో రెట్టింపు తీసుకొనే

వాళ్ళు. నారుమళ్ళువేసే వి త్తనాలకు! ఈసారి ఆ పప్పులేమీ ఉడకవు! తాపిలారు మామ ఈ ఏర్పాటు చేయకపోతే మళ్ళా తిరుగుబాటు!'

మెరుపు మెరిసింది. మేఘాలు గర్జించి వర్షిస్తున్నాయి.

మంగళ ఇప్పుడు కాళీచరణ్ ఇంట్లో ఉంటున్నది. కాళీచరణ్ తల్లి గుడ్డిది. కాళీచరణ్‌కు మధ్యవయస్కురాలైన మేనత్తకూడా వున్నది. వితంతువు! మంగళ మధురమైనమాటలకు కాళీచరణ్ తల్లి నయనాలు సజలమైతే, మేనత్త కళ్ళు ఎర్ర బడుతాయి. మెరుపు మెరిసినప్పుడలా వెనకవైపు వసారాలో పడుకున్న మేనత్త లేచి ముందుగదివైపు చూస్తుంది. మనిషా? కాదు, గుంట! ముందుగదిలో వున్న మంగళకూడా లేచింది. మేఘాలు గర్జించడం, మెరుపులు మెరవడం ఆమెకు చాలా భయాన్ని కలిగిస్తాయి. చిన్నప్పటినుంచే ఆమెకు ఇవంటే మహాభయం! ఇక ఇక్కడి వర్షం....! మళ్ళా మెరుపు! 'ఎవరు....?' మంగళ అంటుగానే అడుగు తుంది....'ఎవరు?'

తడిసిన కాళ్ళగుర్తులు మెరిసినకాంతిలో కనిపిస్తాయి.

సోనాయియాదవ్ తన గుడిసెలోనుంచి 'ద్వాదశమాసపు' పాట ఎత్తు కున్నాడు.

> ప్రేమతో సేతువు బంధించే
> సీతకోసం శ్రీరామచంద్రుడూ!
> సఖీ శ్రావణ మొచ్చెను
> రిమ్‌ఝిమ్ మేఘాలు వర్షించె!

రిమ్ ఝిమ్ బరసత మేఘ!....కమలకు డాక్టర్ గుర్తుకొస్తున్నాడు. కిటికీలు తెరిచిలేవుగదా? కిటికీదగ్గర పడుకుంటాడు, డాక్టరు! పక్క తడిసిపోయివుంటుంది. విన్నటినుంచి జ్వరం. జలుబుచేసింది. డాక్టర్‌కు ఏమైందో ఏమో?

....పిచ్చి నిజంగా దయ్యం కాదు గదా? డాక్టర్‌కు మేఘాలంటే చాలా ఇష్టం. 'వర్షంలో తడుస్తూ స్నానంచేయడం నాకు చాలా యిష్టం!' అని నిన్న అన్నాడు.

ఛర్ ర్ ర్! ఛర్ ర్ ర్?....మేఘాలు భూమిమీదికిదిగి పరుగెడు తున్నట్టుగా స్ఫురిస్తున్నాయి! ఛహర్....ఛహర్....ఛీహర్!

నరంగు విరపాకు నిద్రే ఉండదు. మొన్న గ్రామంలోనివాళ్ళంతా మీటింగు చేసి - బయటివాళ్ళెవరైనా దాడిచేస్తే అందరూకలిసి ఎదుర్కోవాలని అన్నారు. ఆ మీటింగులో కాళీచరణ్ ఉన్నాడు. బాలదేవ్‌కూడా ఉన్నాడు।....సంథాల్‌వాళ్ళు బయటివాళ్ళే గదా।

తాసిల్దారు హరగౌరి సిపాయిలు పొలాలన్నీ తిరిగి చూస్తున్నారు; భాద్రపద మాసపుపంట సిద్ధంగా వున్నది. కోతలు కోయిస్తారా? ఏ పొలంలో ఏ విత్తనాలో వేస్తారు? అయితే నిజంగా తాసిల్దారు సంథాల్‌వాళ్ళదగ్గర్నుంచి భూమి స్వాధీనం చేసుకుంటాడా? జమీందారీవిధానం రద్దయింది; అయినా తాసిల్దారు పొలం స్వాధీన పరుచుకొంటున్నాడు। అర్థం కావడంలేదు.

....ఏమవుతుందో ఏమో? రేపుచూడాలి. తాసిల్దారు నాగలితో వస్తాడేమో. పండినపొలాలు కోయిస్తాడేమో చూడాలి। ఇప్పుడే ఎందుకు ఆ ఆలోచనలన్నీ?.... కాని అతడు నిద్రపోలేడు: అలాగే పడుకునే కిన్నెరి తంత్రీవాద్యంమీద వేళ్ళు కదుపుతాడు - రిం రిం తా ధింతా.

గుడ్ గుడుమ్....గుడుమ్....గుడుమ్।

మెరుపులు।

రేపు నారు పోసుకోవడానికి విత్తనాలు దొరుకుతాయో లేదో?....బాలదేవ్‌కు దోమలు ఎందుకు కుట్టవో? కాళీచరణ్ మేనత్త నిద్రపో దెందుకో? డాక్టర్ కిటికీ మూసివేసివున్నదో, తెరిచివున్నదో రేపుగాని తెలియదు. ఈవేళప్పుడు 'ద్వాదశ మాసపు' పాటలు ఆలాపించే ఈ సోనాయ్ యాదవ్‌ను ఏమనాలి? ఊళ్ళోవాళ్ళందరికీ వినిపించాలి గాబోలు. సోనాయ్‌కూడా చాలా విచిత్రమైన జీవి। పొలంలో నాట్లు వేసేప్పుడు, పాదాలచప్పుళ్ళతో పాట - ఈ పాటలు పాడతారు। ఈ పాటలు వింటూ ఉంటే అన్నీ మరచిపోతాం। సంథాల్‌పేటలో ఈ 'మర్దల' ధ్వనేమిటి? అర్థం లేకుండా। ఈ సోనాయ్ నాట్లు వేసేప్పటిపాట పాడుతున్నాడు। కాస్త విన నివ్వరేమిటి? వేళగానివేళ ఈ మేళం ఏమిటి? ఒకవైపున మేఘాలగర్జన। వర్షపు మోత। పీటిమధ్యన ఆ సంథాల్ మేళం అంతగా వినిపించడంలేదు। మంచిదే, ఊళ్ళో। సోనాయ్ 'ఝూమర్' గీతం మొదలెట్టాడు:

ఆరే ఫాగునమాస్‌రే గవనా మోరీ హోయిరీ
కివహిరూ బసంత్ రంగ్ హో
బాచే చలైత్ ఆ కేశియా నంభారి బాన్హ
అంచరా హే పవన్ ఝురేహే ఏ ఏ ఏ।

డాక్టరు ఇప్పుడు గ్రామభాష అర్థం చేసుకోవడమే కాకుండా మాట్లాడేస్తున్నాడు కూడాను। గ్రామీణ గీతాలువింటూ ఆయన కేస్ హిస్టరీ రాసుకోవడంకూడా మరచిపోతాడు. గీతాలలోని భావం ఆయనకు బాగా బోధపడుతుంది। సోనాయ్ కంఠంకూడా ఎక్కువగా। అంచరాహే పవన్ ఝుర్‌హే।... ఆంచల్ ఉడి ఉడి జాయ్।—ఏమిటి చెంగుఎగిరె గాలిలో తేలుతూ।

....ఊళ్ళోనివాళ్ళు కొందరు రాత్రి వర్షం అప్పుడప్పుడు కురిసింది. ఒక గంటసేపు ఆగి మళ్ళా కురిసింది. అని అనవచ్చు. కాని డాక్టర్‌మాత్రం - రాత్రి అంతా వర్షం కురుస్తూనే వున్నది. మధ్యలో ఆగనేలేదు. అంతటా వర్షం పడుతూనే వున్నది. బంగళా తోటలోకూడా।

తెల్లవారింది. సోనాయ్ ఇప్పుడు పొలంలో పాడుకుంటున్నాడు. అతనొక్కడే కాదు. వందలాది కంఠాలలో విరహంలో తపించే ఒక్కొక్క మైథిలి కూర్పొని పాడుతున్నది—

ఆమ్‌కే కటహల్ తూతే తే బడహల్
నేబుఆ అధిక సురేబ్
మాస్ ఆసాఢ్ హో రామా, పంథజాని చథిహ
దూర్ హీసే గరజత్ మేఘర్ మేరో।

తోటలో మామిడి. పనస మొదలయిన పళ్ళచెట్లతోపాటు దబ్బచెట్టుకొమ్మ కూడా కిందికి వంగిపోయింది. ఇంకా దూరంనుంచి మేఘాలగర్జన వినిపిస్తూనే వున్నది - ఓ పథికుడా। ఇప్పుడే బయలుదేరిరాకుమా।....దూరపు స్నేహితుల్ని దగ్గరకు రావలసిందిగా ఆహ్వానిస్తున్నారు। విరహబాధతో మండిపోతున్నారు. మేఘాలద్వారా సందేశాలు పంపిస్తున్నారు। ఇంటికొచ్చిన పరదేశీయుడు తిరిగి వెళ్ళిపోబోతున్నాడు। వద్దు. వద్దు। మెరుపు మెరిస్తే నాకు ఉలికిపాటుగా ఉన్నది. మేఘాలు గర్జిస్తే నా హృదయస్పందనం మరింత పెరిగిపోతున్నది.

అరే అసాఢ హై, గరజ్ ఘన
బిజూరీ-ఈ చమకే సఖిహై ఏ ఏ,
మోహై తజి కంతాజాయే పరదేసా అ అ
కి ఉమడూ కమలా మాయీహై!

కమలానదిలో వరదలొస్తే కాంతుడు ఆగిపోతాడు! అందుకే కమలానది వరదనీటితో ఉప్పొంగిపోవాలని ఉవిదలు కోరుకోవడం జరుగుతుంది.

....పరదేశంనుంచి కాంతుడు తిరిగొచ్చాడు. ఆమె సంతోషం ఏమని చెప్పాలి?

ఉప్పొంగిపోతున్న హృదయాలతో బాలాలలో ఊయల లూగుతున్నారు—

మాన అసాఢ్ చఢల్ బరసాతీ
ఘర్ ఘర్ సఖీ సబ్ ఝూలనీలగాతీ
ఝూలీ గావేఁ,
ఝూలీ గావతి మంగలబానీ
సావన్‌సఖి ఆలిహై మస్తజవానీ....
దేఖో దేఖో!
దేఖో దేఖో సఖిరీ బ్రిజబాలా
కహాఁగయే జసోధకుమార, నందలాలా
దేఖో దేఖో!!

ఆషాఢమాసం; సఖులంతా ఉయ్యాలలువేసుకొని ఊగుతున్నారు! యశోద తనయుడు కానరాడేం? ఎక్కడికి వెళ్ళాడో చూడండి!

తన కాంతుడు ఊళ్ళో ఇంటిదారి మరచిపోలేదు గదా! చూడండి, ఎక్కడికి వెళ్లాడో! ఎక్కడైనా ఊయెలలో ఊగటం లేదుగదా!

'టీ!'

'ఎవరు? కమలా?' డాక్టరు కొంచెం బెంగు తిన్నాడు.

'ఏమిటా బెంగారు? ఇంజెక్షన్ భయం నీకుకూడా వున్నదా ఏమిటి? ఇది తియ్యటి మందుకాదు; మధురమైన తేనీటి పానీయం! టీతోనే జీవించాలని నిర్ణ

యించుకుంటేమటుకు — కళ్ళు తెరిచేప్పటికి ఎదురుగా టీ కప్పు కన్పించడం అవసరమే మరి!' కమల దగ్గరగావున్న కుర్చీలో కూర్చొని టీ కలుపుతున్నది. ప్యారూ నిలబడి నవ్వుతూన్నాడు.

....ప్యారూ ఇంత సంతోషంగావుండడం ఇదివరకెప్పుడూ చూడలేదు.... ఇప్పు డర్థమైందా? ప్రతిదానికీ వద్దని అనడానికి నేను ప్యారూని కాదుసుమా! టీ తాగుతారా అంటే, వద్దు! కోడిగుడ్డు తింటారా అంటే, వద్దు! అన్నం తింటారా అంటే, వద్దు!

....ఇప్పుడు తెలిసిందా?

## ముప్పైతొమ్మిది

సంథాల్ తెగలవాళ్ళు ఈ వూరివాళ్లుకాదా? బయటివాళ్ళా?

'....కొంచెం ఆలోచించిచూడండి. తాంత్రికులపేటకు ఈయనే సర్దారు! సరే, జగరూ! నువ్వే చెప్పు - మీరు ఏ 'తతమా' క్షత్రియులు? మగధవాళ్ళైనా? సరే, మీ తాత పశ్చిమంనుంచి వచ్చారు; మీ అమ్మాయిని తిరహుతియా 'తతమా' క్షత్రియులకు చేశారు! మగధనుంచి వచ్చినవాళ్లు అక్కడి అలవాట్లు మరచిపోయి తిరహుతియా వాళ్ళయిపోయారు! అంటే ఉభయులూ ఒకటైపోయారు. కాని సంథాల్‌వాళ్ళల్లోకూడా కుమ్మర్లున్నారు; పల్లెవాళ్ళున్నారు; మరి వాళ్ళు మన కుమ్మర్లతో కలిసిపోయారా? మన పల్లెవాళ్ళతో ఒకటైపోయారా? కాలేదు. ఎప్పుడూ వాళ్లు మనల్ని తక్కువవాళ్ళుగానే చూడడం జరిగింది. ఊరిబయట ఉంటున్నారు.... వాళ్ళు మనపాట లెప్పుడైనా పాడుకుంటారా? ఇక్కడి కల్లు తాగుతారా? తాగరు. వాళ్లు 'పచాయ్' తాగుతారు. మీరే ఆలోచించండి! 'తాసిల్దారు అక్కడ విత్తనాల గింజలకోసం కూర్చున్నవాళ్ళతో అన్నాడు....మాటఏభై మందిదాకా ఉన్నారు. కాళీచరణ్, వాసుదేవ్‌కూడా ఉన్నారు; బాలదేవ్‌కూడా ఉన్నాడు!

తాసిల్దారుగారు చెప్పేదాంట్లో నిజం లేకపోలేదు....ఏమైనా చెప్పండి; తాసిల్దారొక్కరే మన ఊరి మంచిచెడ్డల్నిగురించి ఆలోచించేవ్యక్తి!....బాగానేవున్నది.

తాసిల్దారుగారు చెప్పింది. 'కర్రి కొ్రె' అన్నట్టు చెప్పేశారు—'ఏం ఫరవాలేదు, అసలు మీకీ పర్యాయం అనుమానం ఎందుకు కలిగింది? సగంపాలుకి చేసేవాళ్లుకూడా వి_త్తనాలకు హక్కు_దార్లే! పాలుకిచేయని రై_తులకుకూడా నేను ధాన్యం ఇచ్చాను. ఎవరికై_నా ఇవ్వలేదేమో అడగండి. క్రిందటిసారి పంటలు ఎలా వండాయో మీకు తెలును! లెవీ వసూలుచేసి ఇవ్వాలి! నేను చాలా ప్రయత్నంచేసి చివరకు వంద మణుగులకు తగ్గించేట్టు చేయగలిగాను. హరగౌరీబాబుగారి దయవల్ల అయిదొందల మణుగులు వేయడం జరిగింది. బహుశా ఇనస్పెక్టరు అడిగివుంటాడు; ఈయన అయిదువేలమణుగుల ధాన్యం దిగుబడి అవుతుందని చెప్పవుండవచ్చు, తాలూకా కాంగ్రెసు కార్యదర్శి ప్రయత్నంమీద వందమణుగులకు తగ్గించడం జరిగింది.... నిన్న హరగౌరీబాబు నడిగాను - ఏమయ్యా! అయిదువందలమణుగుల ధాన్యం ఇచ్చేస్తే గ్రామస్థులకు వి_త్తనా లెలా ఇవ్వడం కుదురుతుంది. ఖర్చులకు ధాన్యం ఎక్కడనుంచి వస్తుంది? తాసిల్దారు కావడంతోనే సరిపోదు. ఇవన్నీ ఆలోచించాలి!'

బావుంది. బావుంది. నిజం చెప్పారు తాసిల్దారుగారు.

....కాశీచరణ్ మనస్సులో చాలాప్రశ్నలు లేస్తున్నాయి. కాని అడగదలుచుకోలేదు. ఆమధ్య కార్యదర్శిగారు స్పష్టంగా చెప్పారు - కామ్రేడ్ తిరుగుబాటుకిది అదును కాదు. ముందుగా ఏదై_నా ఒకప్రాంతాన్ని ఎంచుకొని అక్కడ ఎక్స్పెరిమెంట్ (పరిశోధన) చేసిచూసి, ఒక నిర్ణయానికి వచ్చినతరువాత తక్కిన ప్రాంతాలలో దీన్ని అమలు జరపడానికి ప్రయత్నాలుచేద్దాం. సహకారంతో వీలును బట్టి కార్యక్రమాలను కొనసాగించండి. కొన్నిరోజులతరువాత పార్టీ ఒక్కసారిగా రంగంలోకి దిగుతుంది. 'అవును. తాసిల్దారుగారు చెప్పింది బాగానేవున్నది.' కాశీచరణ్ తన అభిప్రాయం చెప్పాడు. బాలదేవ్‌కూడా సరేనన్నాడు. బావన్‌దాసు ఏడీ? ఇంకా పూర్ణియానుంచి తిరిగిరాలేదా:

వల్లటోపీ యువజనుల లాఠీలకంటేకూడా ఎక్కువ ప్రమాదకరమైన ఆయుధం: చట్టంలోని లోపాలు హరగౌరీబాబుకు బోధపడ్డాయి. ఇందులో ఆరితేరిన ఘటం తాసిల్దారు విశ్వనాధ్ ప్రసాద్! ఆయనతో వైరం కొనితెచ్చిపెట్టుకోవడం అంత మంచిదికాదు.

సింగ్‌గారికి హరిగారి తాసిల్దారుపదవిపట్ల పూర్తినమ్మకం ఏర్పడింది. నల్ల తోపి సంయోజక్ అంటేకూడా మంచిగురి ఆయనకు। అయితే తాసిల్దారు విశ్వనాథ్ ప్రసాద్ చట్టం అనే దుడ్డుగర్ర ఉపయోగించి భూమిహారులందర్నీ పిల్లి గంతులు పెట్టించేవాడు। రాజపుత్రుల బర్లేలూ - బరిసెలూ ఎందుకూ కొరగానివై పోయాయి - పైకి ఎంతబాగా నవ్వుతాడు; ఎంత తియ్యగా కబుర్లు చెబుతాడు! కొత్త సర్కిల్ మేనేజరుకూడా అంత వ్యవహారదక్షుణ్ణి నే నెప్పుడూ చూడలేదని ఆశ్చర్యపోతూ ఉంటాడు. రాజీనామా ఇచ్చెయ్యండి అన్నాను. వెంటనే ఇచ్చే శాడు. కాంగ్రెసు లీడర్ అయిపోయాడు. ఆయన తెలివితేటలకు మించినవాడు లేడు.

హరగౌరి సింగ్ పేర సంథాల్ తెగవాళ్ళ పాతికెకరాలభూమిని బినామీ రాయించేశాడు. అందులో రెండెకరాలు సింగ్‌కు లభిస్తాయి.

ఖేలావన్‌కూడా అయిదుబీఘాల సంథాల్ పేటవాళ్ళ భూమిని తనపేర పెట్టించుకున్నాడు.

సుమరితదాను కూరగాయలవాళ్ళ పేటవాళ్ళతో — హరగౌరి తాసిల్దారు విశ్వనాథ్ ప్రసాద్ పేర రెండొందల బీఘాలు. నాపేర ఏభై బీఘాలభూమి పెట్టకపోతే చూడు। కాయస్థుడి తడాఖా।' అని చెప్పారు.

ఇప్పుడు సుమరితదాసు తాసిల్దారు విశ్వనాథ్ ప్రసాద్‌పక్షాన వున్నాడు. హరగౌరి తాసిల్దారు ఎంతో. విశ్వనాథ్ తాసిల్దారుకూడా అంతే। అయితే షరతు ఏమిటంటే ....।

సంథాల్ పేటవాళ్ళకు విషయాలన్నీ తెలుసు।

ఇప్పుడు బాలదేవ్, బావన్‌దాసు, కాళీచరణ్ ముగ్గురూ ఒకవైపోయారు. సంథాల్ తెగవాళ్ళకు తెలుసు - వాళ్ళపక్షాన ఎవరూ లేరని। ధర్మపూర్‌లో ఏం జరిగింది? ఇలాగే అయింది. అంమకే తలలునెరిసిన పెద్దలు ఊరకే అనలేదు—ఇక్కడి వాళ్ళను నమ్మకు; కుక్కతోకపట్టుకొని గోదావరి ఈదినట్టే। ఎవరితో, ఎప్పటికి ఏం లాభం కలుగుతుందో. ఊ తీసుకో. అంతేగాని ఎవరినీ నమ్మి ఎవరిపక్షమూ వహించకు। సంథాల్ సంథాలే; 'దిక్కూ' (సంథాల్ కానివాళ్ళు) లే। మన 'పచాయ'

దేహాన్ని దృఢంగా ఉంచుతుంది. ఇక ఇక్కడి కల్లు పొట్టను కోసేస్తుంది. 'దిక్కూ' మనిషివి. ఇక్కడి కల్లును కలలో కూడా నమ్మకూడదు. బాణం ఉన్నదిగా? ఇదే మనకు తోడు; ఇదే మనకు పీడ! ఇదే మనకు అంత! సహచరులు వదిలేస్తారేమో గాని, బాణంమాత్రం ఎప్పుడూ మనల్ని వదలలేదు।

పల్లెవాడు చున్కా ఏమంటున్నాడు? డాక్టర్‌ను ఏమిటి అడిగేది? కాశీచరణ్‌నో, బాలదేవ్‌నో, తాసిల్దారునో అడగవలసింది।

బాలదేవ్, కాశీచరణ్ గ్రామస్థులకు ధాన్యం ఇప్పిస్తున్నాడు—తాసిల్దార్‌తో....?

'భూమికి నిజమైన యజమానులు మీరే। చట్టంప్రకారం మూడుసంవత్సరాలపాటు భూమి దున్నుకుంటే, ఆ భూమి దున్నేవాడికే చెందుతుంది।' అని డాక్టర్ చెప్పాడు.

'డాక్టర్ చెప్పాడా?'

డాక్టర్? నవియా ముర్‌ముర్ నవ్వింది. హ హ హ హ హ। 'డాక్టరు మా నాట్యం చూస్తారట! రోజూ అడుగుతాడు। హ హ హ।'

యువకుడైన జోగియా బాణం తోకకు అడవి హంస రెక్కలు కడుతూ—'డాక్టరు ఒక కుందేలుకు పదిరూపాయ లిచ్చాడు, డజను ఎలుకలకు పన్నెండురూపాయలు; రెండు నక్కపిల్లలు తీసుకుని ఏభై రూపాయ లిచ్చాడు. ఎవరైనా ఇంత ఇవ్విస్తారా? కావడానికి గవర్నమెంటు మనిషే. కాని లంచాలు తీసుకోడు।' అని అన్నాడు.

మంగళాదేవి కాశీచరణ్‌తో ఒంటరిగా ఉన్నప్పుడు చెప్పింది—'కాశీ! నువ్వెళ్ళవద్దు. సంథాల్‌వాళ్ళు ఊరుకోరు; బాణాలు ఉపయోగిస్తారు. నాకు తెలుసు. నీకు తెలియదు వాళ్ళసంగతి! పైకి చూడ్డానికి చాలా అమాయకంగా ఉంటారు; కాని....నువ్వు వెళ్ళవద్దు. నువ్వు వెడితే నామీద ఒట్టే!' నిజమే మరి. లీడర్లు అయినవాళ్ళు ఎందుకు వెళ్ళడం?

....వాసుదేవ్, సునరా, సనిచర్ కూడా వెళ్ళరు।

....అవును, ప్యారేకూడా వెళ్ళడు।

....జాట్ బోమా వెడతారు। వెళ్ళనివ్వు. అతగాడు మెంబరుకాదు।

బాలదేవ్ అటువంటిచోటికి అసలు వెళ్ళనే వెళ్ళడు. హింస వున్నచోటికి వెళ్ళడు.

....తాసిల్దారు లీడర్ అయ్యాడు. స్వయంగా వెడితే వెళ్ళవచ్చు. లేదా లాఠీ లిచ్చి వేరేవాళ్ళను పంపిస్తాడు. హింసకు పూనుకోవచ్చు; లేదా అహింసను అనుసరించవచ్చు. బాలదేవ్ నాలుగణాల మెంబరే। బావన్‌దాసుఉంటే ఒక్కడే అందర్నీ-రాజకీయవ్యవహారాలనుగురించి ఎన్నో సంగతులను చెప్పి ఒప్పించి వుండేవాడు. కాని అతడికికూడా మతి భ్రమించినట్టుగా వున్నది. వారంరోజులైంది; ఉత్తరం కూడా రాయలేదు. తిరిగి రానూరాలేదు. గాంధీజీకి ఉత్తరం రాస్తానంటాడు!.... గాంధీజీకి అంత తీరి కెక్కడున్నది? కాదు. బావన్ చాలాసార్లు రాశాడు; ప్రతిసారీ సమాధానం వచ్చేది—'భాయీ బావన్‌దాస్‌జీ. మీ ఉత్తరం అందింది. క్రిందటిసారి శశాంకగారు అందరికీ చదివి వినిపించారు - మహాత్మాజీ బావన్‌దాసుకు ప్రణామాలని రాశాడు. 'భగవాన్' అని సంబోధించాడు. బావన్ అవతారపురుషుడు. అతను చెప్పేదాంట్లో సత్యం లేకపోలేదు. భారతమాత ఇంకా కన్నీరు మున్నీరుగా ఏడుస్తున్నది।

'బాబోయ్। నాయనోయ్।।'

'ఎవరా ఏడ్చేది? ఎవరు? రామప్రియా ఏడుస్తున్నదా? ఆమె తమ్ముడికి బాణం తగిలిందా? ఎక్కడ తగిలింది? ఎవరు కొట్టారు? సంథాల్? ఎక్కడ? జనం పరుగెత్తుకుంటూ వస్తున్నా రెందుకు?

ఊళ్ళో కుక్కలన్నీ అరుస్తున్నాయి. కాకులు కాఁవ్ కాఁవ్ మంటున్నాయి. ....సిద్ధాంతి బాబాయి చెప్పినదాంట్లో అసత్యమేమీ లేదు—ఊరిమీద కాకులు గద్దలూ ఎగురుతాయి।

....కొడవలి। బల్లెం। దుడ్డుకర్రా తీసుకురండర్రా।

....'కొడవలి ఎక్కడ?'

....'బల్లెం తీసుకరా।'

....'కొడవలి ఎందుకు? బల్లెం ఎందుకు? ఏమిటి సంగతి?'

సంథాల్ తెగవాళ్లు తాపిల్దారు విశ్వనాధ్ ప్రసాద్ నలభై బీఘాల కాంట్రక్టులో వున్న నారుమడి కోసుకెడుతున్నారు।'

'కొత్తగా స్వాధీనంలోకి తీసుకొన్న పొలంలోనా ।'

'కాదు, ఆయన స్వంత పొలంలోనే। బంగళాపక్క పొలంలో ।....కర్ర తీసుకో ।'

'గనోరి కేక పెట్టాడు—బాణంవచ్చి తొడలో తగిలిందని. రక్తం ఏకధారగా ప్రవహిస్తున్నది....స్పృహ లేదు. హాస్పిటల్‌కు తీసుకెళ్లారు. సంథాల్‌జనం నిర్భయంగా నారుమడి పీక్కుంటున్నారు. పద వెళదాం।

భౌ భౌ—భూం వూం వూం - కుక్కలు అదేపనిగా అరుస్తున్నాయి.

రింగ్ రింగ్ రింగ్ రింగ్।

డా డా డా డా డా

సంథాల్ తెగల తంత్రీవాయిద్యం, కిన్నెరి తాళవాయిద్యం ఏకస్వరంలో మోగాయి—రింగ్ రింగ్ రింగ్ రింగ్ రింగ్...., డా డా డా డా....। ఈ వాయిద్యాలు పొలంలో మోగుతున్నాయి; సంథాల్ ఆడవాళ్ళను హెచ్చరిస్తున్నారు—మీరుకూడా సిద్ధంగా ఉండమని। కొప్పుల్లో పూలు తురుముకోవడమే తరువాయి।' సిద్ధంగా వున్నారు.

'జై కాళీమాతకు జై !' రెండువందల కంఠాలు ఒక్కసారిగా మారుమోగేసరికి కాళికాదేవి గుడిదగ్గర విశాలవృక్షంమీదున్న కాకులన్నీ కాంవ్ కాంవ్ మంటూ ఎగిరిపోయాయి.

కుక్కలు మరింత జోరుగా మొరగటం ప్రారంభించాయి.

'జై కాళీమాతాకీ జై !'

'మహాత్మా గాంధీజీకి జై !'

'విప్లవం వర్థిల్లాలి !'

'భారత్ మాతాకీ జై !'

'సోషలిస్టుపార్టీ జిందాబాద్ !'

'హిందూరాజ్య పతాకం....'

'హిందూరాజ్యానికి జై !'

'తాసీల్దారు విశ్వనాథప్రసాద్‌కి జై !'

'బాలదేవ్‌జీకి జై !'

నాలుగువైపులనుంచి ముట్టడించండి! పారిపోకుండా చూడండి!.... హో హో హో హో హో హో!....

వివాదాలు చేయవద్దు—హో హో హో హో! అవి అనండి.

'బాణాలు వదులుతున్నారు! కింద పడుకోండి!....బాణం వదులు!'

'గులేటాలో రాయిపెట్టి గురిచూసికొట్టు!'

'పడవనడిపే బిరసా పారిపోతున్నాడు! బల్లెం విసిరివెయ్యి!'

బిరసా నీళ్ళల్లో పడిపోయాడు—ఛప్! బల్లెం తగిలింది.

మఖామకేమైంది? బాణం తగిలిందా. గుండెలో!

సంథాల్ ఆడవాళ్లుకూడా బాణాలు వేస్తున్నారు.

చిన్నపిల్లలుకూడా!

'బిరసా పడిపోయాడు' ఢా ఢా ఢా ఢా ఢా!

ఠిం ఠిం ఠిం ఠిం! '....పడిపోతే పడిపోయాడులే! నువ్వుకూడా పడిపో!'

'కూర్చొనే బాణం వెయ్ సోవియా!'

'సుఖీమురమూ పడిపోయాడు!' ఢా ఢా ఢా ఢా!

'పడిపోవియ్!....నువ్వుకూడా పడిపో! ఠిం ఠిం!

'అబ్బాయి జగారీ! గురిచూపి కొట్టు! హరగౌరీ తాపిల్దారు గుండెలో తగలాలి! ఆఁ. బలేవాడివిరా!'

....ఢా ఢా ఢా ఢా! 'తాపిల్దార్ హరగౌరి పడిపోయాడురా!'

'పడిపోనియ్!' ఠిం ఠిం ఠిం ఠిం!

తాపిల్దారు? హరగౌరి తాపిల్దారు పడిపోయాడా? పారిపోకండి! ఏయ్.

ఏయ్, వినండి! మీ ఆడవాళ్ళమీద ఒట్టు! కులదైవంమీద ఒట్టే! ఇదుగో, పారి పోయినవాడు దొంగలంటాకొడుకే!

....సంథాల్‌వాళ్ళదగ్గర బాణాలు అయిపోయాయి. ఇప్పుడు చుట్టుముట్టి కొట్టండి!....మంగళదాసును పట్టుకోండి! పదండి, పదండి! జై కాళీమాతాకీ జై!

'బల్లెంతో పొడవండి కుఱ్ఱవాడా! వాడేగదా తాపిల్దారును గురిచూసి కొట్టింది!'

'వాహ్వా! భలే పీరుడవోయ్! సరే! అదుగో గులేటాలో రాయిబెట్టి ఆ డిగ్గా వాయిద్యం వాయించే ముసలాడికి గురిబెట్టి కొట్టు.'

'పారిపోతున్నారు నాయాళ్ళు! పట్టుకోండి! పారిపోకుండా చూడండి! సంథాల్ ఆడవాళ్ళంతా జనపచేలల్లో దాక్కున్నారు! చుట్టు ముట్టండి!'

అంతా ఫ్రీ! స్వేచ్ఛ! ఇష్టం వచ్చినట్టు చెయ్యండి! ముసలి, ముతక, ఆడా మగా! అందరికీ స్వేచ్ఛ! జనపచేను! ఫరవాలేదు. ఉరిశిక్ష పడుతుంది! లేదా ద్వీపాంతరవాస శిక్ష! వదలకండి!

సంథాల్ ఆడవాళ్లుకూడా ఏడుస్తున్నారు; బాధతో తన్నుకులాడుతున్నారు. ....పెడబొబ్బలు పెడుతూ ఏడుస్తున్నారు. జనపచేలలో గొడవగా ఉన్నది. బంగళా తోటలోకూడా! రెండువందలమంది ఎక్కడా. రెండుడజన్ల సంథాల్‌వాళ్ళు. డజను న్నర ఆడవాళ్ళెక్కడ! అంతా చల్లబడింది! అందరూ చతికిలబడ్డారు!

సంథాల్‌పేటకు చెందినవాళ్లు నలుగురు చచ్చిపోయారు! ఏడుగురు గాయ పడ్డారు. ఒక కుఱ్ఱవాడిపరిస్థితి ప్రమాదకరంగా వున్నది. సంథాల్ ఆడవాళ్లు బాధతో మూలుగుతున్నారు.

తాపిల్దారు కొడవలికి పదిమంది బలి అయ్యారు. పన్నెండుమంది బాగా గాయపడ్డారు. ముప్పైమందికి కొద్దిపాటి గాయాలు తగిలాయి.

సంథాల్‌పేటను దోచుకున్నారు. తాపిల్దారు హరగౌరీ పరిస్థితి ప్రమాద కరంగా వున్నది. బహుశా బతక్కపోవచ్చు!

# నలభై

సిద్ధాంతిగారు చెప్పినదాంట్లో అసత్యం లేదు—ఊరిమీద కాకులూ గద్దలూ ఎగురుతాయి ! పోలీసుఇనస్పెక్టరు ప్రతివీధికీ వస్తాడు !

పోలీసు ఇనస్పెక్టరు, హెడ్‌కానిస్టేబుల్, మిలిటరీవాళ్లు—మొత్తం నాలుగు లారీలనిండా వచ్చారు ! హే కాళీమాతా ! నువ్వే రక్షించాలి !

డి.ఎస్.పి; కలెక్టరు, పై అధికారి ఇంకా రావలసివున్నారు !

శవం ! శవం ! !....బాబోయ్—ఇంగ్లీషుప్రభుత్వం ఇక ఉండదని ఎవరన్నారు ?

'తాపిల్దారు హరగౌరీకూడా చనిపోయాడా ?....ఆఁ ! ఎవరూ ఇంటిబయటికి రాకూడదు. మలమూత్రాలుకూడా లోపలే ! బయటికొచ్చారంటే అరెస్టు చేస్తాం. హే కాళీమాతా !'

బాలదేవ్‌ను ఇనస్పెక్టరు పిలిచాడా? కాళీని....కాళీచరణ్‌నుకూడానా? చూద్దాం! వీళ్ళిద్దరూ ఎవరికీ భయపడేవాళ్ళు కాదు. ఏమవుతుందో చూడాలి. ఇద్దరూ లీడర్లేగా!'

'ఓహో ! మీరేనా ఇక్కడి లీడరు ?'

ఇనస్పెక్టరు బాలదేవ్‌ను అడిగాడు. ఆస్పత్రిలో ఖాళీగావున్న గదిలో ఇనస్పెక్టరు మకాం పెట్టాడు. మిలిటరీవాళ్ళు సంథాల్ తెగలవాళ్ళను అరెస్టు చేశారు. గాయపడ్డవాళ్ళను. ముసలీ-ముతకా అందర్నీ !....అందర్నీ అరెస్టు చేశారా ? లేదు. గాయపడ్డవాళ్ళకు ఏన్నానే డాక్టరు కట్లుకట్టి పంపించివేశారు. ఇద్దరు సంథాల్‌వాళ్ళను, వధ్నాలుగుమంది ఇతరుల్నీ పూర్ణియా పెద్ద ఆస్పత్రికి పంపించారు. శవాలుకూడా పంపించారు. సింగ్‌గారు, శివశంకరసింగ్, ప్రతిపేటనుంచి ఇద్దరు ముగ్గురు మనుషులచొప్పున శవాలతోపాటు వెళ్ళారు. శవాలు తిరిగి ఎప్పుడిస్తారో?....ఉహుఁ! కోసి చూసినతరువాత ఇచ్చేస్తారు ! హే భగవాన్ !

బాలదేవ్ ఏమని సమాధానం చెబుతాడు ?....లీడరు ! ఎవరికి లీడరు ? సంథాల్ తెగలవాళ్ళకా, సంథాల్ కానివాళ్ళకా ?....వగ్గి గొంతు సరిచేసుకున్నాడు.

బాలదేవ్! ఆ పాతసమాధానమే చెప్పారు. కాళీచరణ్‌కు కోపంవచ్చినరోజున హరగౌరికి చెప్పాడే. అదే సమాధానం!

'లేదు. ఇనస్పెక్టరుగారూ! మేము తెలివితక్కువ వాళ్ళం. పిరికివాళ్ళం! మే మెప్పుడైనా పిడర్లమయ్యామా?'

ఇనస్పెక్టరు బాలదేవ్‌ను దగ్గరగావున్న కుర్చీలో కూర్చోమన్నారు. 'బాలదేవ్‌గారూ! నేను మిమ్మల్ని బాగా ఎరుగుదునండీ! కూర్చోండి!'

వాసుదేవ్, సుందర్ ఒకరిమొహాలు ఒకరు చూసుకుంటారు. కాళీచరణ్‌ను ఏమీ అడగనేలేదు. అదుగో, తాసిల్దారుగారు సంబాళించుకున్నారు!

'ఇనస్పెక్టరుగారూ! ఈయనపేరే కాళీచరణ్‌బాబు! ఇక్కడ సోషలిస్టు పార్టీ లీడరు దేహశుద్ధి, బొక్కశుద్ధి వున్నమనిషి కూడాను!'

'ఓహో! కాళీచరణ్‌గారా? రండి. రండి! మీకంపరూ ఇక్కడ - ఏమంటారు- చాలా చేశారట!' ఇనస్పెక్టరు నోట్లో అర్ధాతమలపాకులు వేసుకుంటూ అన్నారు—'మిమ్మల్నిగురించి విన్నాను. మీరు చాలా చాకచక్యంగా వ్యవహరించారట! ఉదయం రావడంతోనే నా కన్నిసంగతులూ తెలిశాయి. మిమ్మల్ని చాలా మెచ్చుకుంటున్నానండి! రండి. కూర్చోండి.'

కాళీచరణ్ కూర్చుంటూ అన్నాడు—'చూడండి. ఇనస్పెక్టరుగారూ! పంచాయతీలో అన్నిసంగతులూ నిర్ణయమైపోయినట్టయితే ఈవిధమైన....!'

'పంచాయతీలోనా! ఈ ఖూనీకేసునుగురించేనా....?' ఇనస్పెక్టరు తమలపాకులతోనిండిన నోరు మరింత లావుగా తయారవుతుంది.

'కేసుకాదు! ధాన్యం చెరిపగం అనుకున్నవిషయంలో వచ్చిన అభిప్రాయభేదాన్నిగురించి అంటున్నాను!'

'ఓహో! అదా!' ఇనస్పెక్టరు ఉమ్మేస్తూ అన్నారు—'అది నిజమే ననుకోండి. పంచాయతీలోనూ, నలుగురు పెద్దమనుషులు చెప్పినట్టుగానో పనులు జరుగకపోతే—మాటకుమాట పెంచుకోవడంవల్ల సమస్యలు పరిష్కారమవుతాయా?'

'హింసామార్గం అసలు అనుసరించనేకూడదు!' బాలదేవ్ మొహం గంభీరంగాపెట్టి అన్నాడు.

'ఆహా! మంచిమాటన్నారు!' ఇనస్పెక్టరు బాలదేవ్‌ను సమర్థించారు—
'మంచిమాటన్నారు!' ఇనస్పెక్టరు మాట్లాడుతూ చేతులు బాగా ఊపుతారు; కన్ను కూడా గీటుతారు!

వాసుదేవ్, సునరా ఒకరినొకరు చూసుకుంటారు. మాట్లాడడానికి బాలదేవ్‌కి ఏమైనా తెలిస్తేనా? చూశావా, క్యాశీచరణ్ ఎంత గటగటా సమాధానం చెప్పాడో! 'హింస, అహింస విషయంకాదు మనం చూడవలసింది, బాలదేవ్ గారూ! ముఖ్యంగా కావలసింది తెలివితేటలు! ఇక్కడ మా పార్టీ మరొక కామ్రేడ్ వుంటే బావుండేది. కావలసింది తెలివితేటలు!' కాశీచరణ్ బాలదేవ్‌కు సమాధానం చెప్పాడు.

కాశీచరణ్, బాలదేవ్ ఉభయులూ తమకు తెలివితేటలున్నాయని చూపించారు. వయస్సునుబట్టి నిర్ణయించకండి, ఇనస్పెక్టరుగారూ! ఆ రోజులు గతించాయి.

'చూడండి బాలదేవ్‌గారూ, ఈ సంఘటన జరిగినప్పుడు, మీ రెక్కడున్నారండీ?' ఇనస్పెక్టరు ప్రశ్నించారు.

బాలదేవ్ మళ్లా గొంతు సవరించుకొన్నాడు—'హ....ఛ్....ఏమన్నారు?.... నేను మఠంలో వున్నాను. విషయమేమిటంటే నేను వైష్ణవుణ్ణి! ఆరోజున గురువుగారు నాకు దీక్ష ఇవ్వవలసివున్నది. ఉదయం ధాన్యం కొలిపించడంతోనే సరిపోయింది. సాయంత్రం నేను దీక్ష గ్రహించి లేదానో లేదో తాంత్రికులపేట రామప్రియను ఏడుస్తూ వెళ్ళడం చూశాము!'

'ఓహో! అయితే మీకు ముందుగా ఏమీ తెలియదన్నమాట!' ఇనస్పెక్టరు గంభీరంగా అన్నాడు.

'ఈయనకే కాదు ఇనస్పెక్టరుగారూ! ఎవరికీ తెలియదండి!' ఖేలావన్ సింగ్ యాదవ్ ధైర్యంతెచ్చుకొని అన్నారు. ఎంతకాదన్నా, ఇనస్పెక్టరు తిండీ తిప్పలవిషయం చూసేది అతగాడేగదా! ఎందుకు మాట్లాడడు? తాసిల్దారు ఏమీ మాట్లాడకం లేదేమిటి?

'ఎవరూ? ఖేలావన్‌గారా! రండి, కూర్చోండి!'

'ఫరవాలేదులెండి; ఇక్కడ ఉంటానులెండి!....కొంచెం తొందరగా ముగిస్తే బావుంటుంది. అవతల అన్నీ చల్లబడిపోతాయి!' ఖేలావన్ అన్నారు.

ఇక్కడున్న ఇద్దరు లీడర్లకేగాదు, ఇతరులకుకూడా తెలివితేటలున్నాయి!

'ఇనస్పెక్టరుగారూ! మా అబ్బాయివుంటే ఇప్పుడు మీతో ఇంగ్లీషులో మాట్లాడేసివుండేవాడు! రామాయణంలాంటి పుస్తకమేదో ఉంది, లావుపాటిది, అందులోచూసి మీతో మాట్లాడేవాడు!' ఖేలావన్‌సింగ్ యాదవ్ అన్నారు.

'ఓహో! అలాగా! మీ అబ్బాయి ఇంగ్లీషులో మాట్లాడతాడా?'

'అవునండి! డాక్టర్‌బాబుగారితో ఎప్పుడూ ఇంగ్లీషులోనే మాట్లాడుతూ ఉంటాడు!'

'కోర్టు ప్రకటనలుకూడా చదువుతాడు!' బాలదేవ్ అన్నాడు.

'పర్ క్లాసులో చదువుతున్నాడు!' కాళీచరణ్ చెప్పాడు!

'మీ రెంతదాకా చదివారు కాళీచరణ్‌గారూ? ఏ స్కూల్లోనూ చదవలేదా? ఆహా! అలాగా! మీరు మాట్లాడేధోరణి చూస్తేమటుకు అలా ఏమాత్రం అని పించదు సుమా;....పత్రికలుకూడా చదువుతారా? బావుంది! రామాయణంకూడా చదువుతారా! మహాభారతంకూడా! బావుంది!'

'బాలదేవ్‌కూడా పత్రిక చదువుతాడు.' ఖేలావన్‌సింగ్ యాదవ్ అన్నారు—'పత్రిక మేమూ చదువుతాం... కాని పత్రికల్లో చాలా అబద్ధాలుంటాయి!—అమధ్య ఎప్పుడో చదివాను. ఒక ఆడది, మగవాడుగా మారిపోయిందట! ఇలా ఎక్కడన్నా జరుగుతుందా, చెప్పండి?'

'సరే, కాళీచరణ్ ఆ గొడవ జరిగినప్పుడు మీ రెక్కడున్నారు?' ఇన స్పెక్టరు బెల్టు వూడదీస్తూ అడిగాడు.

చౌకీదారు ఆగమాకు భయమేసింది - ఇనస్పెక్టరు బెల్టుతీసుకొని బాల దేవ్‌నూ, కాళీచరణ్‌నూ పట్టుకొని కొట్టడుగదా అని!....ఉహుం ఆలా చెయ్యరు ఇనస్పెక్టరుగారు!

'ఆ రోజున ఉదయం ధాన్యం ఇప్పించి పగలు సరీగా పన్నెండుగంటలకు

పూర్ణియా వెళ్ళిపోయాము. తాసిల్దారు—హరగౌరి....తాసిల్దారు విశ్వనాథ్ ప్రసాద్ గారికి తెలుసు!'

'ఓహో! మీరు పూర్ణియా వెళ్లారా!' ఇనస్పెక్టరు దీర్ఘంగా విట్టూరుస్తారు.

'ఏమండీ ఇనస్పెక్టరుగారూ! తక్కినవని మధ్యాహ్నం చూసుకోవచ్చుగా!' తాసిల్దారు అన్నారు.

'కాదు తాసిల్దారుగారూ! ఎస్. పి. వస్తారు. ఈలోపు అన్నీ పూర్తి చేసుకోవాలి. సాక్షుల జాబితా!'

'అలాగే! ముఖ్యమైనసాక్ష్యాలు కొందరివి - ఇద్దరు ముగ్గురు దగ్గర్నుంచి తీసుకోండి. తక్కినవి తరువాత తీసుకోవచ్చు!....ఆఁ చూడండి. కాళీబాబూ! బాలదేవ్‌బాబూ! మీకు తెలిసినవిషయాలు చెప్పెయ్యండి. ఇందులో అబద్ధపుసాక్ష్యం ఏమున్నది? రాసుకోండి వీళ్ళిద్దరి వాఙ్మూలాలు! ఉభయులూ సంతకం చేసేవాళ్ళే'

'మీ రేమంటారు?' ఇనస్పెక్టరు నెమ్మదిగా ప్రశ్నించారు.

'అలాగే కానివ్వండి. ఇందులో అభ్యంతర మేముంది, సంతకం పెడతాం!' కాళీచరణ్ అన్నారు.

....కాళీచరణ్ ఒక్కవూపులో సంతకం పెట్టేస్తారు. బాలదేవ్ నెమ్మది నెమ్మదిగా చేస్తారు!....బాలదేవ్ విజంగా సాధువైనమనిషి!

'బలదవ' ఇనస్పెక్టరు అన్నాడు—'చూడండి బాలదేవ్‌గారూ! 'బ'కు దీర్ఘం ఇవ్వండి – ఒక లాఠీ ఇచ్చెయ్యండి. పోతే 'ద'కు పైన తేలుకొండి ఒకటి పెట్టండి.... ఆ తరువాత స్వదస్తూరి అనండి.'

ఇనస్పెక్టరుగారూ! 'బాలదేవ్ పేరుకుకూడా లాఠీలూ, తేలుకొండీలు తగిలించరు! ఆయన అహింసావాది!' కాళీచరణ్ నవ్వి, లేచి నిలబడుతూ అన్నారు.

ఇనస్పెక్టరు పెద్దపెట్టున నవ్వారు. ఆ తరువాత తక్కినవాళ్ళుకూడా ఆయనను అనుసరించారు.

చూశావా, తెలివితేటలు లేవా మరి?

## నలభై ఒకటి

తొమ్మిదిమందిమీద కేసు పెట్టారు.

తొమ్మిదిమంది సంథాల్ వ్యక్తులతోపాటు గాయపడి ఆస్పత్రిలో వున్న వాళ్లమకూడా అరెస్టుచేశారు. పూర్ణియా ఆస్పత్రిలో తుపాకులతో మిలటరీవాళ్ళు పహరా వున్నారు.

సంథాల్ కానివాళ్ళెవరూ అరెస్టు కాలేదు....। అయితే దీనికి కారణం లేక పోలేదు. ఇనస్పెక్టరు - ఖేలావన్‌గారూ మీమీద ఎస్. పి. కి అనుమానంగా వున్నది. మీరు యాదవులందర్నీ పోట్లాటకు ఉసికొల్పారని।' అని అన్నాడు. ఖేలావన్‌కు కాళ్ళూ చేతులూ చల్లబడ్డాయి. అయిదువేలకు తాసిల్దారు వ్యవహారం పరిష్కారం చేశారు. లేకపోతే, లేకపోతేనా ఖేలావన్ శ్రీకృష్ణజన్మస్థానంలో ఉండివుండేవాడు, సింగ్‌గారు ఇంట్లో లేరు. శివశంకర్ సింగ్‌కూడా లేడు. సింగ్‌గారినిగురించి ప్రజలమనస్సుల్లో ఏమున్నదో తెలియదు. ఇనస్పెక్టరుకూడా రాజపుత్రుడే! ఏమో ఎవరిని నమ్మడానికీ వీలులేదు। విముక్తిదవటానికి అయిదువేలు ఖర్చు।

తాసిల్దారు విశ్వనాథ్ చేతిదేమైనా పడిందా?

....సుమరితదాసుకు మూడురోజులనుంచి కడుపునొప్పిగా వుండడంచేత విషయాలే తెలియరాలేదు। సుమరితదాసు చాలారోజులు బతుకుతాడు। వయస్సు చాలా ఉన్నది।

'నా వయస్సు ఎంతనుకుంటున్నారు?'

'నలభై ఉండొచ్చు:'

'నలభై కాదు. ముప్పైఅయిదు। నేరేడుపండ్లు కలుపుకోకుండా తాగాను. పళ్ళూడిపోయాయి.'

'సుమరితదాసుగారూ। మీకు తెలుసా?'

'కడుపు నొప్పితో ఇంట్లో పడివున్నానని అనుకోకు। నా కన్నీ తెలుసు। అడుగు. నీకేం కావాలో?'

'తాసిల్దారుగారికికూడా డబ్బేమైనా ఖర్చయిందా?'

'తాసిల్దారు విశ్వనాధప్రసాద్‌ను తెలివితక్కువ (దద్దమ్మక్రింద కట్టవద్దు!
అతడు ఇనస్పెక్టరయితే, ఈయన తాసిల్దారు. ఇసుక తక్కెడ. పేడ తక్కెడ
ఒకరు గుడిని మింగేవాళ్ళయితే మరొకరు గుడిలోని లింగాన్ని మింగేవారు! తెలి
సిందా?'

'తాసిల్దారు హరగౌరీ పాపం....'

అతి సంఘర్ష కరెజోకొవు
అనల్ ప్రగట్ చందన్‌తే
హౌహిం సియాబర్ రామచంద్రకీ జై !

సంఘర్షణ అధికమైతే

'కాని రాజపుత్రవీధిని ఎస్. పి. అంత తేలికగా వదిలేస్తారా? ఎస్. పి.
ఏమన్నారో తెలుసా? '....తాసిల్దారు విశ్వనాధప్రసాద్ పొలంనుంచి నారు కోసు
కెళుతుంటే తాసిల్దారు హరగౌరీసింగ్ ఎందుకు వెళ్ళినట్టు? ఇందులో ఏదోవుంది!'
అని అన్నారు. సింగ్‌కుకూడా పడుతుంది.'

'సాక్షుల్లో ఎవరెవరి పేర్లున్నాయి?'

'సాక్షులా? నువ్వు నీ గుండెమీద చెయ్యేసుకుచెప్పు - సంథాల్ జాతీయులు
ఐదర్దస్తీ చేశారా లేదా?'

'ఇందులో సందేహం లేదు!'

'సాక్షులదేముందిలే! గ్రామంలో ఇంతపెద్ద కేసెప్పుడూ జరగలేదు.
ఒక్కొక్క-సాక్షికి ముగ్గురేసిమనుషులు పక్కనుంటారు! ముగ్గురూ ఒకే కేసులో
ఉంటారు. తెలిసిందా! సరే!....నా వ్యవహారం ఇంకా పైసలా కాలేదు.'

'సంథాల్ వాళ్ళల్లో ఎవరెవరిసాక్ష్యం తీసుకొన్నారు?'

'సంథాల్ పేటలో సాక్ష్యం ఇవ్వడానికి ఎవరొస్తారు? అందరూ ఆసాములే
వాయె! పెద్దపల్లెవారి పన్నెండుసంవత్సరాల కొడుకుకూడా!....ఇనస్పెక్టరు వారు
మరి ఎందుకు లూటీ చేశారని అడిగితే—అది మేమువేసిన మదే నన్నాడు! ఒక్క-
చెంపదెబ్బ వేసేప్పటికి ఆ తరువాత అందరూ ఒప్పుకున్నారు — ఆ నారుమడి విశ్వ
నాధప్రసాద్ దని! ఆడవాళ్ళు, పిల్లలుకూడా చెప్పారు. మరి అన్యాక్రాంతంగా

ఎందుకు ప్రవేశించారని అడిగితే - 'జమీందారీవిధానం రద్దయింది! మా పొలా లన్నీ జమీందార్లు విడిపించుకొన్నారు. అందుకని అన్యాక్రాంతం చేశాం!' అని సమాధానం చెప్పారు!'

'అహ్హ హ్హ హ్హ హ్హ! మంచి సమాధానమే! పొలం లాక్కున్నారని. వారు మళ్ళ పీక్కుపోవడానికి పూనుకున్నారు! హ హ హ! నిజంగానా? అలాగే సమాధానం చెప్పారా?'

'లేకపోతే పుమరితదాను అబద్ధం చెబుతాడా? సంథాల్ జాతివాళ్ళుగనుక అలా చెప్పకుండక పోయినట్లయితే మీరందరూ మీ మీ ఇళ్ళల్లో కూర్చొని ఇలా హా హా హా హా హా అనగలిగేవాళ్ళేనా? జైల్లో వుండేవాళ్ళు. తెలిసిందా? ఇన స్పెక్టరుకూడా — దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవడం మంచిదనుకున్నారు. ....అందుకే అంటినిగా — తాసిల్దారు అంత తెలివితక్కువవాడు కాదని! ...సింగ్ గారికి అయిదువేలు శివశంకర సింగుకుకూడా అంతే వదులుతుంది....డాక్టరును కూడా ఏదో అడిగినట్టున్నారు. ఇనస్పెక్టరు! ఇంగ్లీషులో మాట్లాడుకున్నారు. ఎస్. ఏ. తోకూడా ఆయన ఇంగ్లీషులోనే మాట్లాడాడు! ఈ డాక్టరు ఎట్లాగయినా కొంచెం యోగ్యుడే సుమా!....ప్రతిశవాన్ని చూసి ఏం రాశాడో తెలుసా? సంథాల్ వాళ్ళ దెబ్బలనుబట్టి. గాయాలనుబట్టి ప్రాణరక్షణకోసం దాడి జరిగిందని! ఇటు వాళ్ళశవాలనుగురించి ...!'

'శవాలా?'

శవాలు! పోలీసు ఇనస్పెక్టరు. మిలిటరీ! దెబ్బలు! జైళ్ళు! ....ద్వీపాంతర వాసశిక్ష! కాదు. ఉరిశిక్ష!....నిజంగానా? తాసిల్దారు విశ్వనాథ్ ప్రసాద్ గనుక లేక పోతే ఉరిశిక్ష పడేదే!....కాళీచరణ్ ఆఫీసుకు వెడితే మరికొన్ని సంగతులు తెలు స్తాయి!

సోషలిస్టుపార్టీ ఆఫీసులో జనం గుంపులు గుంపులుగా ఉన్నారు. ఇవ్వాళ్ళ — స్వరాజ్యగీతాలు. సోషలిస్టుగీతాలు. భక్తిగీతాలు — మూడూ ఉంటాయని కాళీచరణ్ అన్నాడు. అన్నిటికంటే ముందు పాతకాలంనాటి కీర్తన 'నారదీ భటియాలీ కీర్తన' ఉంటుంది. వృద్ధులయిపోయినా వాళ్ళగొంతుల్లో ఏదో మహత్తు వున్నది—

ఆజో పే విరాజా శ్యామ్ కదలీకె ఛైయాం
ఆవత్ మోహన్‌లాల్ బంశీ బజైయాం
పీతబసన మకరాకృత కుండల....।

కదళీవనఛాయలో మురళి వాయించుకుంటూ పీతవసన, మకరాకృత కుండల మోహనకృష్ణుడు వేంచేస్తున్నాడు।

ఇది 'నారదీ-భటియాలీ' కీర్తన। మృదంగం ఎలా వాయించాడు? ధిధనక్-తిధనక్। ధిధనక్-తిధనక్।....

ఇప్పుడు విప్లవగీతం। '....గంగార్ జమునవాః' అనేగీతం చాలా పాతదై పోయింది. ఈ ఏడుపుగొట్టుపాట పాడించకండి కాళీచరణ్‌గారూ।'

బాంబు పేల్చెరా ధాం అవి వీరుడు భగత్‌సింగ్।

ఆహా। ఏం బావున్నది। భారతవీరుడు। సర్దార్ భగత్‌సింగ్। సింగ్....! భగత్‌సింగ్‌ది ఏకులం? వీరుడు భగత్‌సింగ్। ఎవరో తెలుసా?....కాళీచరణ్ చెప్పాడు - ఆయాదుపార్లు ఉరితీశ వేశారట। పదేసిమంది ఒక్కొక్కపక్కన నిలబడి తాడు లాగారట। వరుసగా లాగుతూనేవున్నారట। కాని భగత్‌సింగ్ నోటినుంచి 'ఇంక్విలాబ్ జిందాబాద్ - విప్లవం వర్ధిల్లాలి - అనే నినాదంతప్ప మరొకటి రాలేదట।'

'విప్లవం వర్ధిల్లాలి।'

జై జై।....

ఇవ్వాళ్ళ ఎవరు ఇంత ఉత్సాహంగా నినాదాలు వేస్తున్నారు? ఎవరూ? సోమూజలే?....ఓహో। మూడురోజుల్నుంచి కనిపించకుండా పోయాడు। ఎక్కువ దెబ్బలు కొట్టిందెవరో తెలుసా? సోమా వలుగుర్ని పడేశాడు। జాగ్రత్త తాసిల్దారు గారు సోమాపేరు చెప్పవద్దని వారించాడు. వీడు కాస్త బాగుపడితే బావుండును! కాళీచరణ్ కాస్త శ్రద్ధతీసుకుంటే వాడే బాగుపడతాడు।

మరొక స్వరాజ్యగీతం పాడితే బావుండును. అందరికీ జై అనండి. ఊళ్ళోని దేవతలప్రతాపంవల్ల. కాళికాదేవికృపవల్ల మహాత్ముజీ దయవల్ల, విప్లవం

....విప్లవం వర్ధిల్లడంవల్ల ఊళ్ళోని పిల్లామేకా అంతా క్షేమంగా ఉన్నారు. అన్ని రకాలగీతాలు పాడాలి।

భారత ఢంకా లంకలో

మోగించెను వీరజవాహర్ ।

రాజబల్లీ మహతోకూడా హార్మోనియం వాయిస్తున్నాడు. ఎక్కడ నేర్చుకున్నాడు? ముందుపళ్ళు ఎత్తు. పాడేప్పుడు మొహం పొరలాగా అయిపోతుంది! 'భారతఢంకా లంకలో'....

బాలదేవ్ ఎక్కడ? సాధువుగా మారాడని విన్నాను. దీక్షకూడా తీసుకున్నాడట। ఎవరిపేరు జపిస్తాడో? మహాత్మాజీ పేరా? సద్గురుపేరా?'

చర్ఖా సెంటర్ పంతులమ్మ చాలా లావెక్కింది. బాబోయ్।....ఒక్క కాళీచరణ్‌తోనే నవ్వుతూ మాట్లాడుతుంది. కాళీచరణ్ ఇవ్వాళ్ళ లాల్చీకి గుండ్రంగా ఏమిటో పెట్టుకున్నాడే? సోషలిస్టుపార్టీ చిహ్నమా? అయితే కాళీచరణ్ చిహ్నం పెట్టుకొన్న లీడర్ అయిపోయాడన్నమాట। బాలదేవ్‌కు, బావన్‌దాస్‌కు, తాసిల్దారుకు ఇలాంటి చిహ్నమున్నదా? పంతులమ్మ అందులో ఏదో అమరుస్తున్నదే? పువ్వు? ఆహా! ఇంకా బావున్నది. పూవుమార్కు పిగరెట్టు। డాక్టర్‌గారి నౌకర్ ఇటువైపు వచ్చాడేమిటి? మాట్లాడకండి....శాంతి। శాంతి।।

'కాళీచరణ్‌గారిని డాక్టరుగారు పిలుస్తున్నారు।' ప్యారూ మంగళాదేవితో చెప్పాడు.

'అయితే కాళీ....డాక్టర్‌గారిని పిలవలేదా? తాసిల్దారు, ఖేలావన్ మొదలైన వాళ్ళంతా కోర్టుకెళ్ళారు. డాక్టర్‌గారు ఇక్కడే వున్నారుగా।....వెళ్ళు పిలుస్తున్నారు।'

ఏమిటో సంగతి?....సుమరితదాసు ఏడీ?

ఏదీ ఒక్కసారి అనండి—

కాళికాదేవికీ జై ।

మహాత్మాగాంధీకీ జై ।

బోషలిస్టుపార్టీకి జై।
విప్లవం।
'కాళీచరణ్‌గారూ।'

'ఏమిటి?'

ఒకమాట చెబుతాను. మీరేమీ అనుకోవద్దు....హరగౌరిబాబు తల్లి ఏడుస్తున్నది. ఇతర పేటల్లోకూడా ఆడవాళ్ళు కంటికి మింటిగా ఏడుస్తున్నారు। మీరిక్కడ ఆటపాటల్లో నిమగ్నమై వున్నారా? ఇదేమీ బాగాలేదు। భగవంతుడుకూడా మీరు చేసేపనిని మెచ్చడు।'

'మేము భగవంతుణ్ణి పాటించం।' కామ్రేడ్ వాసుదేవ్ మధ్యలోనే అనేశాడు.

'నువ్వు మాట్లాడకు।' కాళీచరణ్ గట్టిగా అన్నాడు—'ప్రతిచోటా నువ్వు మధ్యలో మాట్లాడకు।'

అందరూ ఊరుకున్నారు. హరగౌరితల్లి ఇంకా ఏడుస్తూనే ఉన్నది—'బాబూ। నాయనా। గౌరీబాబూ।'

కాళీచరణ్ కళ్ళుకూడా చెమర్చినాయి. చిన్నప్పటినుంచి హరగౌరీతో ఆడాడు. పాడాడు। పెట్టుబడిదారి కావచ్చు; లేదా బూర్జువా కావచ్చు। ఏమైనా చిన్నప్పటి స్నేహితుడేగదా। అతడిప్పుడు లేడు. అతనితల్లి ఏడుస్తున్నది. ఈమె హరగౌరి తల్లికాదు ఏడ్చేది - 'తల్లి' ఏడుస్తున్నది.'

'వాసుదేవ్!'

'...............'

'అందరితో వెళ్ళిచెప్పు - పాటలు ఆపివెయ్యమని। రేపు బంగళాతోటలో సంతాపసభ ఉంటుంది. అందరికీ చెప్పు। తెలిసిందా।'

'వాసుదేవ్‌కు అన్నిసంగతులూ బోధపడ్డాయిగాని సంతాపసభ అంటే ఏమిటో అర్థం తెలియలేదు. ఆ సభలో పాటలుపాడే పనిలేదు. ఉపన్యాసా లెవరో ఇవ్వరా?....అయిదునిమిషాలు మెదలకుండా నిల్చోవాలి। ...భలే సభ।

# నలభై రెండు

హరగౌరితల్లి ఏడుస్తున్నది—'ఒరే నాయనా!.... గౌరీబాబూ!'

హరగౌరి పదహారేళ్ళభార్య మనుగుడుపు కాకముందే వచ్చింది. నెమ్మదిగా ఏడుస్తున్నది! చీరె ముసుగుచాటున ఆమె కళ్ళనుంచి కన్నీరు ధారగా ప్రవహిస్తున్నది.

శివశంకర్‌సింగు పూర్ణియానుంచి తిరిగొచ్చారు. కొడుకు దహనసంస్కారం గావించి తిరిగివచ్చిన తండ్రినిచూస్తే కడుపు తరుక్కుపోయింది. వంగిపోయిన నడుంమీద చేతులుంచుకొని. ఎడ్లవైపు అచేతనిగా చూస్తున్నాడు. ఆ రెండు ఎడ్లూ రెండురోజులనుంచి నీళ్ళూ మేతా ముట్టుకోలేదు. కళ్ళల్లో నీళ్ళు నింపుకొని అటూ ఇటూ చూస్తున్నాయి. ఒకదానివైపు మరొకటి చూసుకొని దీర్ఘంగా నిట్టూరుస్తున్నాయి. రెండూ నాలుకతో నాక్కుంటున్నాయి; ఒకదానికొకటి ఓదార్పు చెప్పుకుంటున్నట్టుగా!....హరగౌరి వీటిని ఎంతో ప్రేమగా చూసుకునేవాడు। ఇది రెండుసంవత్సరాల దూడలుగా వున్నప్పటినుంచే ,హరగౌరి వీటితో ఆడుకుంటూ ఉండేవాడు। అతనిమాట వినిపించడంతో రెండూ సంతోషంతో చెంగనాలు తీసేవి। ప్రాణంకంటే మిన్నగా చూసుకొన్నాడు....!

శివశంకరసింగు కళ్ళురెండూ కన్నీటితో నిండిపోయాయి!...హరగౌరి శవం తిరిగి వచ్చేంతవరకు. అరెస్టు చేస్తారేమోననే భయం ఆయనను వెన్నంటుతూనే వున్నది. దహనసంస్కారాలు పూర్తిచేసుకొని తిరిగి వస్తూఉండగా కప్తాన్‌వంతెన దగ్గర ఇనస్పెక్టర్ రామక్రిపాల్‌సింగును ఆపేప్పటికి శివశంకరసింగుకు వంతెన కిందికి దిగిపోతుందేమో నన్నంత భయంవేసింది. భూమి గుండ్రంగా తిరిగింది.

ఇనస్పెక్టరు రామక్రిపాల్‌సింగును అరెస్టుచేసి అటువైపు తీసుకెళ్ళడంతో - శివశంకరసింగ్ తన సహచరులతో అక్కడినుంచే తిరిగివచ్చారు. స్టేషన్‌వరకు వణుకెత్తుకుంటూనే వచ్చారు. ఏమో. మళ్ళా ఇనస్పెక్టర్‌కు మరో అభిప్రాయం కలిగితే ఏం గావాలి?....అదృష్టమేమిటంటే-బిరజూసింగ్ కాలుజారి పడిపోవడంతో రైలాగింది. లేకపోతే శివశంకరసింగ్ ప్లాట్‌ఫారంమీదనే ఉండిపోవలసివచ్చేది।

తక్కినవాళ్ళంతా ఎలాగో పరుగెత్తి హేండిల్ పుచ్చుకున్నారు. పింగ్‌గారికికూడా ఒకచేతికి హేండిల్ దొరికింది. ఇంతలోనే ఒక నల్లకోటాయన పట్టుకొని లోపలికి లాగాడు. సిగ్నల్‌దగ్గరకు వెళ్ళేప్పటికి విరజూసింగ్ కింద పడిపోయాడు. బండి ఆగింది. పాపం విరజూసింగ్‌కు ఒకచెయ్యి తెగిపోయింది. గార్డు అతన్ని కటిహార్ ఆస్పత్రిలో చేర్చారు. శివశంకరసింగ్‌కు ఇంటికొచ్చేదాకా నమ్మకం కలగలేదు. ఏమో ఎటునుంచి ఎర్రటోపీవాడు వస్తాడోనని అంగారులో వుండిపోయాడు. హసల్‌గాంవ్ సంతలో ఒక ఎర్రటోపీవాణ్ణి చూసేప్పటికి ముచ్చెమటలు పోశాయి! ....ఒకమనిషి ఎర్రపంచ తలగుడ్డ చుట్టుకొన్నాడు! అతగాడికి ఎర్రపంచే దొరికింది కాబోలు!

ఇంటికొచ్చేప్పటికి హరగౌరీతల్లి రొమ్ములు బాదుకుంటూ నేలమీదదొర్లుతూ ఏడవటం చూశాడు. ఆయనకూడా చిన్నపిల్లవాడికిమల్లే వెక్కివెక్కి ఏడవడం సాగించాడు. తూర్పింట్లో, వసారాలో హరగౌరిభార్య మునుగుబెట్టుకొని ఏడుస్తున్నది! ఎదురుగా గోడమీద హరగౌరిఫోటో వేలాడదీసివున్నది. రౌతహట్ తిరునాళ్ళలో తీయించుకున్నాడు - తలపాగా, చేతిలో కత్తి!

'ఓరి నా బాబూ!....గౌరీబాబూ!'

శివశంకరసింగ్ ఎద్దుమెద పుచ్చుకొని ఏడుస్తున్నాడు - గౌరీ! అబ్బాయి గౌరీ!'

సుమరితదాసుకు వినిపించింది. ఓహో! శివశంకరసింగ్ వచ్చినట్టున్నాడు.

'శివశంకరబాబూ! ఊరుకోండి! గుండె నిబ్బరం చేసుకోండి!....మీరే ఇలా బాధపడితే ఆడవాళ్ళపరిస్థితి ఏంగావాలి?....హరగౌరి తల్లిబాధ చూడలేకుండా వున్నాం. మీరు కాస్త ఆమెను ముందు సమాధానపరచండి! ఏడవకండి!' సుమరితదాసు శివశంకరసింగ్‌ను చేతులతో పట్టుకొని తీసుకెళ్ళాడు! అక్కడ నిలబడివున్న వాళ్ళతో - ఎలా ఓదార్చాలో నోరురాకుండా వున్నది. అన్నిశోకాలకంటే పుత్రశోకం మహాచెడ్డది....నేననుభవించాను. నలుగురికొడుకుల్ని కమలానది ఒడ్డున దహనంచేసి వచ్చాను. గుండె రాయిచేసుకున్నాను. పుత్రశోకం?.... హే భగవాన్! ఎవరికీ కలగకూడదు!' అని అన్నాడు.

శివశంకర్‌సింగ్ మరింత బిగ్గరగా ఏడుస్తాడు. నెమ్మదిగా జనం ఎక్కువవుతారు. వచ్చినవాళ్ళంతా ఆ తరువాత ఏం జరిగిందో తెలుసుకోవాలనుకుంటారు....
హరగౌరి మృత్యువుకంటెకూడా హృదయాన్ని బాధించింది — రామక్రిపాల్‌సింగ్ అరెస్టుకావడం! ఎందుకు అరెస్టు అయినట్టు? ఎలా అరెస్టు అయ్యాడు? ఎవరిమీద వారంట్లున్నాయి? తాసిల్దారు విశ్వనాద్ ప్రసాద్ మీదకూడా వున్నదా? 'తాసిల్దారుగా రొస్తున్నారు! మోధా ఇవ్వండి.'

తాసిల్దారును చూడడంతోనే శివశంకరసింగ్ నేలమీద పడిపోయారు! బిగ్గరగా ఏడవటం సాగించాడు - 'విశ్వనాధ్ భయ్యా! హృదయం దహించుకుపోతున్నది - భయ్యా!.... హృదయం!'

'శివశంకరసింగ్! ఏడవకు! ఈ ఏడుపు జీవితాంతంవరకు ఉండనే ఉంది! ఒక్కరోజు ఏడ్చినంతమాత్రాన హృదయం చల్లబడదు ఇప్పుడు బెంబేలు పడవలసినతరుణం కాదు! కేసు చెడుమార్గం పట్టింది. సింగ్‌జీ అరెస్టు కావడమ్! ఈ కేసు తప్పుమార్గం పట్టిందనడానికి నిదర్శనం! ఇప్పు డిక ఎవరిమీద ఆవ దరాబోతున్నదో తెలియడంలేదు! ఖూనీకేసు! లేచి ఇలారండి! మీతో ఒకవిషయం మాట్లాడాలి!'

శివశంకరసింగ్ లేచినిలబడ్డాడు. వెంటనే తాసిల్దారుతోకలిసి బయటికి కొంచెందూరంగా వెళ్లారు. సుమరితదాసుకు ఆ రహస్యమేమిటో వింటాడా? మంచిదే! అసలువిషయ మేమిటో తెలుస్తుంది!

తలుపుదగ్గిర నిలబడినవాళ్ళందరూ దీర్ఘంగా నిట్టూరుస్తారు - ఇప్పుడు ఎవరిమీదికి ఏ ఆపద వస్తుందో, ఏమో! హే భగవాన్!

'నమస్కారం సిద్ధాంతిబాబాయ్!'

సిద్ధాంతిగారితో ఖేలావన్‌కూడా వచ్చాడు సిద్ధాంతి ఖాళీగావున్న మోధామీద కూర్చుంటాడు! ఖేలావన్ తాసిల్దారుదగ్గరకువెళ్ళి నిలబడతాడు! సిద్ధాంతి నెమ్మదిగా అక్కడున్నవాళ్ళతో అంటాడు - 'మీరంతా ఇక్కడేం జేస్తున్నారు?' అంటే ఆయన అర్థం - ఏం ప్రమాదం వస్తుందో ఏమో వెళ్ళిపొండి. అవి! అదును చూసుకొని అందరూ వెళ్ళిపోతారు. 'తాసిల్దారుగారూ! ఇక్కడికే వచ్చెయ్యండి. అందరూ వెళ్ళిపోయారు!' అని సిద్ధాంతి పిలుస్తాడు.

'విషయమేమిటంటే - ఎస్. ఐ. ఒకపాయింటు లేవదీశాడు - తాసిల్దారు విశ్వనాధ్ప్రసాద్ పొలంలోని వారుమళ్ళు రక్షించడానికి తాసిల్దారు హరగౌరి ఎందుకు వెళ్ళినట్టు ?' తాసిల్దారు అన్నాడు.

'రామక్రిపాల్ సింగ్ భయ్యా ఎలాగూ లేడు। నేను మీకు చెప్పవలసినవాణ్ణి కాదు। కేసు మీదేగదా। ఉచితమనుకున్న తీర్పు మీరు ఇచ్చుకుంటే బావుంటుంది।' శివశంకరసింగ్ బతిమలాడుకుంటూ అన్నాడు.

సిద్ధాంతిగారు ఏదో చెప్పాలనుకొని గొంతు సవరించుకుంటాడు. కాని సుమారితదాను మధ్యలోనే అందుకుంటాడు—'శివశంకరసింగు! ఈ కేసు తాసిల్దారు విశ్వనాధ్ప్రసాద్ది కాదు. హరగౌరిది। ఎలాగంటారా ? రాతకోతలు. ఆక్రమించు కోవడాలు - స్వాధీనం చేసుకోవడాలు - అన్నిటినీ హరగౌరీబాబు ప్రారంభించాడు। ఇవన్నీ రాకపోతే ఈ లంకాకాండ జరిగివుండేది కాదు। తాసిల్దారు హరగౌరియే ముందు ప్రారంభించాడు. తాసిల్దారు విశ్వనాధ్ప్రసాద్ ఆయనకు సహాయపడ్డాడు. చివరకు ఈయనగారి పొలంమీదనే సంథాల్వాళ్ళు తిరగబడ్డారు. ఇప్పుడు మీరే చెప్పండి. కేసు ఎవరిదో। నాకు తెలుసు అసలువిషయం।....ఇనస్పెక్టరుకు పదివేలు ఇవ్వవలసిందే।'

'తాసిల్దారుగారూ। ఎలాగో. అందరూ సంప్రదింపులుజరిపి ఈ గ్రామాన్ని రక్షించండి।' అని ఖేలావన్ అన్నాడు.

'రామక్రిపాల్ భయ్యా లేడు। నేనేం చెప్పను ?' శివశంకరసింగు మాటి మాటికి ఇదేమాట వల్లె వేస్తున్నాడు.

చాలాసేపు గడిచాక సిద్ధాంతిగారు—'అయ్యా తాసిల్దారుగారూ। నాకు న్యాయంగా తోస్తున్నదేమిటంటే—ఎలాగైనాసరే - మీరీ వ్యవహారాన్ని భుజాన వేసుకొని నడిపించాలి. తప్పదు।' అని అన్నాడు.

చివరకు అందరూకలిసి నిర్ణయించారు—ముందుగా రామక్రిపాల్సింగ్ను జామీనుమీద విడుదల చేయించాలని। ఆ తరువాత అందరూకలిసి, ఏమిచేస్తే బావుంటుందో, ఆవిధంగా చేయడం మంచిది। అయినఖర్చులు సింగ్గారు ఇచ్చు కోవడమే సబబుగా ఉంటుంది.

సిద్ధాంతిగారు నవ్వుతూ—'ఇవ్వాళ్ళ శోషలిస్టులు సంతానసభ ఏర్పాటు చేశారు. ఎవరూ వెళ్ళలేదు. ఇప్పుడు జనానికి సభలంటే ఏమిటో బాగా బోధపడింది. ....మాట్లాడితే సభలు, సమావేశాలు! నే విదివరలోనే చెప్పలేదూ—ఊరిమీద కాకులూ గద్దలూ తిరుగుతాయి!' అని అన్నాడు.

'సిద్ధాంతిగారూ! మీరు సభలు, సమావేశాల్ని దోషం పట్టకండి.' కాశీ చరణ్ పక్కన, కొంచెం చీకట్లో ఉన్నాడు.

'రా కాశీ! రా!' తాపిల్దారు నవ్వుతూ ఆహ్వానించాడు—'మీరు సాక్ష్యం ఇవ్వాలయ్యా! బాలదేవ్‌కూడా ఇవ్వాలి! మీ ఇద్దరులిదర్ల సాక్ష్యంమీద వ్యవహార మంతా ఆధారపడివున్నది!'

కాశీచరణ్ మోడామీద కూర్చుంటూ—'సాక్ష్యం ఇవ్వవలసివుంటే ఇస్తాం. తెలిసినవిషయం చెప్పడానికి అభ్యంతర మేముంటుంది? ఇనస్పెక్టరైనా, ఎస్. పి. అయినా, లేదా కలెక్టరుదగ్గరా చెప్పవలసివచ్చినా నిజం చెప్పడానికి భయమెందుకు?' అని అన్నాడు.

'మంచిమాటన్నాడు!'—ఒక్క సిద్ధాంతితప్ప తక్కినవాళ్ళంతా అన్నారు—'మంచిమాటన్నాడు!'

తాపిల్దారు గారినౌకరు రణజిత్ పరుగెత్తుకుంటూవచ్చి—'కమలీ దీదీకి మళ్లా ...' అని అన్నాడు.

'అయితే ఇక్కడి కెందుకొచ్చావు? డాక్టర్‌గారిదగ్గరి కెళ్ళు!' అని తాపి ల్దారు కొంచెం విసుక్కుంటూ అన్నాడు—'ఈ డాక్టర్లు ఏం మందు లిస్తారో ఏమో, ఇన్నిరోజుల్నుంచి వైద్యం చేస్తుంటే రూపాయలో పన్నెండణాలవంతుకూడా తగ్గలేదు!'

అసలువిషయం బయలుపడింది. ఈ వ్యవహారమంతా కాశీచరణ్, బాలదేవ్ సాక్ష్యాలమీద ఆధారపడి ఉన్నదట!

'శివ! శివ!' సిద్ధాంతి లేచివిలబడి—'కాశీబాబూ! రేపు కొంచెం నీ చెయ్యి చూపించు. నీ రేఖలు ఏమంటున్నాయో చెబుతాను. పుట్టిన నక్షత్రం, నెలా గుర్తున్నదిగా?'

సిద్ధాంతికి భయం పట్టుకున్నది....కాశీచరణ్. బాలదేవ్ ఎవరిపేర్లు చెబితే వాళ్ళను పోలీసులు అరెస్టు చేస్తారేమో ! ఆ ఇద్దరికీ అతనిమీద కోపంగా వున్నది !
....బాలదేవ్ విషయంలో అంత భయంలేదు. కాని కాశీ....శివ ! శివ !

## నలభై మూడు

దాసి లక్ష్మి ఈరోజున మనసులోని ద్వారాలన్నీ తెరచివేస్తుంది. లక్ష ద్వారాలు !

'బాలదేవ్‌గారూ !'

'ఏమిటి ?'

'రామదాసుకు మళ్ళా మతి చలించింది. నిన్న భండారీతో చెప్పారు—ఒక దాసీదాన్ని పెట్టుకోవడానికి అనుమతించమని లక్ష్మితో చెప్పు అని !....ఏం చెయ్య మంటారు ?'

బాలదేవ్ ఏం సమాధానం చెబుతాడు ? దాసీని పెట్టుకోవడం ధర్మవిరుద్ధ మని ఆయనకు తెలియదు. ఆయన దీక్ష తీసుకొని రెండు మూడు మాసాలే అయింది ! మఠానికి సంబంధించిన నియమాలూ విధులూ ఏమిటో ఇంకా తెలుసు కోనేలేదు ! ఆమాటకొస్తే మహంతు సేవాదాసుమాత్రం....!

'బాలదేవ్‌గారూ ! మీరు కొంచెం ఆయనకు నచ్చచెప్పండి. ఆయనకు మతి చలించింది. ఈమధ్య తాంత్రికులపేటకు అదేపనిగా వెళ్ళివస్తున్నాడు. రామప్యారీ తల్లికి నాలుగుసేర్ల బియ్యం ఇప్పించాడని భగత్ చెప్పాడు. నే నడిగితే—'మఠంలో పనిచేసిన పాత పనిమనిషేగదా' అని ఇచ్చాను. ఇక్కడ పురాణపఠనం చేసేవాళ్ళు పాలు మీగడలు మెక్కుతున్నారు. పనీ పాటాలేకుండా ! బీదవాళ్ళకు నాలుగుసేర్ల బియ్యమిస్తే ప్రపంచం మునిగిపోయిందా ?' అని రెట్టించాడు.

బాలదేవ్‌కు ఈమధ్య మతి శూన్యమైనట్టు కన్పిస్తున్నాడు. చిన్నవిషయం కూడా అర్థం కావడంలేదు. ఎంత అమాయకుడు !

'మీరు మఠంలో ఉండడం ఆయన కిష్టంలేదు !' లక్ష్మి బాలదేవ్‌వైపు చూస్తుంది.

'అయితే నేను వెళ్ళిపోతాను. నేమందరంవల్ల మతవిషయాలకు వ్యతిరేక మైతే వెళ్ళిపోతాను।'

'ఎక్కడికి వెడతారు?'

'చన్నన్‌పట్టి।'

లక్ష్మిహృదయం ఒక్కసారిగా కొట్టుకొన్నదని ధడాలుమని ఈమధ్య చాలా కాలంగా బాలదేవ్ చాలా చింతాక్రాంతంగా ఉంటున్నారు. అన్నపానాదులుకూడా తగ్గిపోయాయి. ఎక్కడకీ బయటికికూడా వెళ్ళడంలేదు. ఆసనంమీదకూర్చొని బీజక్ పారాయణం చేసుకుంటున్నారు. బాలదేవ్ సాక్ష్యంమీదనే కేసు ఆధార పడివున్నదని తాసిల్దారుగారు చెప్పి వెళ్ళారు. అప్పుడు బాలదేవ్ 'సాక్ష్యం చెప్ప డానికి నేను కోర్టులోనులో ఎక్కను।' అని సమాధానం చెప్పారు. మహాత్మాజీ - కోర్టులకు, సాక్ష్యాలకూ దూరంగా వుండమన్నాడు....ఇవ్వాళ్ళ మఠమంతా శూన్యంగా వున్నది. ఈరోజే లక్ష్మి సమస్తవిషయాలు చెప్పుకుంటుంది.

'మీరు చన్నన్‌పట్టి వెడతారా?....మరి నేనో?'

'మీరా?'

లక్ష్మి బాలదేవ్‌కళ్ళల్లో కళ్ళుబెట్టి చూస్తుంది. లక్ష్మి ఇలా చూసినప్పుడల్లా బాలదేవ్ మరోప్రపంచంలోకి వెళ్ళిపోతాడు. ఒక మనోహరమైన సుగంధం గాలిలో తేలియాడుతుంది. పవిత్ర సుగంధం। బీజక్ గ్రంథంనుంచి వచ్చే సుగంధం లాంటిది।

'చెప్పండి, నే నెక్కడికి వెళ్ళను? నాగతి ఏం కావాలి? మహంతు దాసిగా నే నిక్కడ ఉండిపోవలసిందేనా?' లక్ష్మి కళ్ళలో నీళ్ళు నిండుతాయి.

'వద్దు లక్ష్మీ, వద్దు. నువ్వు రామదాసుకు దాసీగా ఉండనవసరం లేదు. నేను....నువ్వు....మీరు....'

'బాలదేవ్‌గారూ।' లక్ష్మి పిచ్చిదానిలా బాలదేవ్‌ను కౌగలించుకుంటుంది–'రక్షించు బాలదేవ్। ఒక్కసారి చెప్పు - నువ్వు రామదాసుకు దాసీగా ఉండనవ సరంలేదని। చన్నన్‌పట్టీ వెళ్ళనని చెప్పు। నన్ను వదిలిపెట్టి వెళ్ళకు బాలదేవ్। నువ్వే నాకు రక్ష।'

'లక్ష్మీ!' బాలదేవ్ లక్ష్మిని ఓదార్చుతూ అంటాడు—'ఎవరైనా చూస్తారు!'

లక్ష్మి బాలదేవ్ శరీరంనుంచి విడిపోయి వేరుగా కూర్చుంటుంది. తల దించుకొని ఏడుస్తున్నది.

బాలదేవ్ శరీరమంతా ఏదో ఝంకారం చేస్తున్నట్టుగావున్నది. కణతల దగ్గర వేడిచేసిన ఉప్పుమూట పెట్టినట్టున్నది.... ఒకసర్యాయం ఆశ్రమంలో అతనికి చెవిపోటు వచ్చింది. గంగూలీజీ ఉప్పుమూట వేడిచేసి కాపు కాయమన్నాడు ... గుండె కొట్టుకుంటున్నది. లక్ష్మిచెయ్యి బాలదేవ్ ముక్కుకుదగ్గరగా వచ్చింది. లక్ష్మి రోమరోమంనుంచి పవిత్రమైన సువాసన వేస్తున్నది. చందనంలాగా మనో హరశీతలసుగంధం వెలువడుతున్నది. బాలదేవ్ మనస్సు ఈ సుగంధంలో మునిగి తేలుతున్నది. లక్ష్మి లేకుండా అతను చన్నన్‌పట్టిలో ఎలా ఉండగలుగుతాడు?.... రూపమతి. మాయాజీ. లక్ష్మి!

'మహాత్ముని మార్గాన్ని పరిత్యజించకండి. బాలదేవ్‌గారూ! మహాత్ముడు అవతారపురుషుడు. ఈమధ్య మీ రెందుకు వికలమనస్కులుగా ఉంటున్నారు? మహాత్ముడిమీద భారం వెయ్యండి. మహాత్ముని సందర్శించిన కళ్ళల్లో పాపానికి స్థానం కల్పించకండి! మహాత్మాజీ ఉపదేశ శ్రవణంచేసిన చెవులకు మాయా మోహ మధురవచనాలు వినే అవకాశం కల్పించకండి. మహాత్మాజీ సద్గురుభక్తులు!' లక్ష్మి కళ్ళుమూసుకుని ధ్యానంచేసుకునే ఆసనంమీద ఆసీనురాలై ఉన్నది. తెల్లటి చీరెమీద విరబోసుకున్న నల్లటి దీర్ఘమైన కేశాలు! పసిమిరంగు ముఖమండలం! ధ్యానముద్రలో ఈవిధంగా కూర్చొని ఉపదేశించే ఈ లక్ష్మి మరొక లక్ష్మి అవ తారం!.... బాలదేవ్ చేతులు రెండు అప్రయత్నంగా పైకి లేచాయి.

లక్ష్మి పవిత్రాత్మవాణి. మరల వినిపిస్తుంది. 'ప్రపంచదోషాలను పరికించే ముందు నీ కాయాన్ని నువ్వు వీక్షించుకో! తన మైలా తన మూధరో జగ్ కీశీత్!.... ముందు మనస్సును శుభ్రంగా ఉంచుకో! మనస్సు పవిత్రంగా లేనప్పుడు నిరాశ కలుగుతుంది. దుఃఖాలువచ్చి చోటు చేసుకుంటాయి. మార్గమధ్యాన విచారవదనంతో ఎందుకున్నావు?.... భయపడతా వెందుకు?....'

చ ర్తే చ ర్తే పగుథకా
నగర్ రహా నాకోన్
బీచ్‌హిం మేం దేరాపరా
కహహం కౌన్ కాదోష్।

—నడుస్తూవుంటే అలసిపోవడం జరిగింది. గమ్యం చేరుకోవాలంటే ఇంకా తొమ్మిదికోసులు నడవాలి. మధ్యలోనే ఆగిపోవలసివచ్చింది। ఎవరిదోష మిది ?

స్వయంగా భారతమాతే మాట్లాడుతున్నదని బాలదేవ్‌కు అనిపించింది. ఆమెది ఇదే రూపం। రక్తసిక్తమైన పాదాలు। వికటోసుకున్న జుట్టు।....భారత మాత కన్నీరుమున్నీరుగా ఏడుస్తున్నదని బావన్‌దాస్ అన్నారు. ఆమె కన్నీరు కార్చటం లేదు। మార్గాన్ని ప్రబోధిస్తున్నది. మంచిమార్గాన నడుస్తూ అనుచిత కార్యాలు ఆచరించేవాళ్ళను హెచ్చరిస్తున్నది. బావన్‌దాసు భ్రమలో పడిపోయాడు. ....బాలదేవ్ మహాత్మాజీమార్గంలో నిరాశగా, విచారవదనంతో నడుస్తున్నారు।

'భారతమాతకి జై। మహాత్మాజీకి జై।
భారతమాతా। భారతమాతా।'

మహంతు రామదాసు చాలాసేపటినుంచి గన్నేరుచెట్టు చాటుననిలబడి వాళ్ళ మాటలన్నీ వింటున్నాడు. ధ్యానముద్రలో కూర్చొని లక్ష్మి ఉపదేశం ఇస్తున్నది; బాలదేవ్ చేతులుజోడించి తదేకంగా లక్ష్మివైపు చూస్తున్నారు. అకస్మాత్తుగా బాలదేవ్ లక్ష్మి 'చరణా'లను స్పృశించి కేకలువేయడం ప్రారంభించాడు — 'భారతమాతాకి జై।'

'భండారీ। ఓ భండారీ।' మహంతు రామదాసు వెనక్కు పరుగెడుతూ అరిచాడు—'భండారీ। బాలదేవ్ పిచ్చివాడైపోయాడు। పరుగెత్తు, పరుగెత్తు।।'

మఠంలో జనం పోగయ్యారు. డాక్టరుగారు, తాసిల్దారుగారు, కాళీచరణ్, ఖేలావన్‌సింగ్ యాదవ్ అందరూ వచ్చారు. బాలదేవ్ ముసలి పినతల్లి మధ్యలో ఏడుస్తూ రాగంతీయడానికి ప్రయత్నిస్తున్నది. అందరూ ఒక్కసారిగా విసుక్కోవడంతో మానేసి, అందరి మొహాలవైపూ చూస్తూ నిలబడింది. కొంచెంసేపయ్యాక మళ్ళీ మొదలుపెట్టింది—'ఓ నాయనో। ఓరి బాలదేవో।'

'ఏయ్, నోరు మూసుకో!'

డాక్టరు బాలదేవ్‌చేతికి రబ్బరుపట్టీకట్టి చేతితో ఒక చిన్నిబంతిపి నొక్కు-తున్నారు....ఓహో! ఈ యంత్రంతోనే తాసిల్దారుగారమ్మాయినికూడా పరీక్షిస్తారు! ఓహో అదా!

బాలదేవ్ ఉండి ఉండి చేతులువిగించి లేచి విలబడుతున్నారు—'నేను పిచ్చివాణ్ణి అయిపోయానవి మీ రనుకుంటున్నారా? ఎప్పటికీ కాదు! మీరు నన్ను పిచ్చివాడికింద జమకడతారా? ఈ ఊరు ఒకప్పుడు ఎలా ఉండేది? దీనిపేరు తెలుసా ఎవరికైనా? ఆలిండియాలో దీని పేరుప్రఖ్యాతులు వ్యాపింపజేసిందెవరు? నన్ను వదలండి. నేను గాంధీజీమార్గంనుంచి తప్పుకునేవాణ్ణి కాదు!'

గుంపులోనుంచి ఎవరో అన్నారు—'మతంలో ఉంటే ఎవరికైనా గంజాయి ఇట్టే అలవాటవుతుంది!'

'ఎవరయ్యా నేను గంజాయి తాగుతానవి అంటున్నారు? కల్లు గంజాయి దుకాణాలదగ్గర పికెటింగు చేసినవాణ్ణి నేను గంజాయి తాగడమా? ఛీ ఛీ! మహాత్మాజీ మార్గాన్ని నే నెప్పుడూ వదలను! మహాత్మాజీయే నాకు సాక్ష్యం!'

బాలదేవ్ పినతల్లి ఎవరు చెప్పినా వినలేదు. పాట పాడుకుంటూ ఏడుస్తున్నది—'అయ్యో! బాలదేవా! ఈ డాక్టరు ఆ తాసిల్దారుగారిపిల్ల జబ్బు తెచ్చి నీకు పెట్టాడురోయ్! ఇలాచేయటం మంచిదేనటయ్యా డాక్టరూ! తాసిల్దారుగారమ్మాయి కింకా పెళ్ళికాలేదు! మా బాలదేవ్‌కూ్కూడా పెళ్ళికాదు కాబోలు! అయ్యో దేవుడా!'

'బాలదేవ్‌గారూ!' లక్ష్మి అన్నది—'మనస్సును ప్రశాంతంగా ఉంచుకోండి!'

'ఎవరూ? లక్ష్మి! నమస్కారం అందుకోవమ్మా!....ఏమీ ఫరవాలేదు! నా కప్పుడప్పుడు గాంధీజీ 'గాలి' తగులుతూ ఉంటుందిలే! చున్నీ గోసాయికి రోజూ తెల్లవారుఝామున 'గాలి' సోకేది!' బాలదేవ్ మెదలకుండా కూర్చున్నారు.

'డాక్టరుగారూ! ఈమధ్య బాలదేవ్‌గారు చాలా విచారంగా వుంటున్నారండి. అసలు రాత్రిపూట విద్రపోయేవారు కాదనుకుంటాను. ఒక వారంక్రితం జ్వర

మొచ్చింది. ఆ జ్వరంలో పచ్చటిమందుబిళ్ళలు ఏవో ఏడెనిమిది ఒక్కసారే మింగే శారు.'

'పచ్చబిళ్ళలా ! ఒక్కసారే మింగేశారా ?' డాక్టరు ఆశ్చర్యంగా అడిగాడు.

'అవునండి, పచ్చటి జ్వరమాత్రలు ఊళ్ళో పంచిపెట్టడానికి ఇచ్చారే. వాటిలోనుంచి తీసుకొన్నారు. నాతో అన్నారూ—'రోజూ ఎవడు వేసుకుంటాడు. వారానికి సరిపడేబిళ్ళలు ఒకేసారివేసుకుంటే పోలా !' అని.

డాక్టరు గొల్లున నవ్వాడు—'బాలదేవగారూ ! మంచిలెక్కే మీది, పది రోజులు షర్బతు తాగండి. నయమవుతుంది. ఏం ఫరవాలేదు. ఆ మందువేడి వంటికి పట్టింది.'

'కిస్‌మిస్, దానిమ్మపళ్ళు, కమలాఫలాల రసం చలవచేస్తుంది. వేడిని తగ్గిస్తుంది. జైల్లో నేను ఈ పళ్ళతోనే గడిపేశాను.' అని రామక్రిపాల్‌సింగ్ అన్నాడు.

బాలదేవ్, కాళీచరణ్—ఈ ఇద్దరి సాక్ష్యంమీదనే ఈ కేసు ఆధారపడి వున్నది. ఉరిశిక్ష వేయాలన్నా, రక్షించాలన్నా వీళ్ళచేతుల్లోనే ఉన్నది. బాలదేవ్ సాక్ష్యం చాలా విలువైనదని ఇనస్పెక్టర్ అన్నాడు.

ఖేలావన్‌సింగ్ యాదవ్ ఈమధ్య కాళీచరణ్‌తో బాగా పూసుకొని తిరుగు తున్నాడు. పార్టీ ఆఫీసుపక్కన వాలుగుస్తంభాల పాకఒకటి వేయించి ఇస్తానని కూడా అన్నాడట, జిల్లా పార్టీఆఫీసు 'అతిథిగృహం' లాంటిది ! మీటింగుల రోజుల్లో సహచరులొస్తే అందులో ఉంటారు.... కాళీచరణ్ ఈవిషయం ప్రస్తా వించడమేమిటి. ఖేలావన్‌సింగ్ వెంటనే ఒప్పేసుకోవడమేమిటి. వెంటనే జరిగి పోయాయి.

సిద్ధాంతి కాళీచరణ్ చెయ్యిచూసి—'అబ్బాయ్ కాళీచరణ్ ! నీ నక్షత్రం చాలా బాగున్నది. యశస్సు గడిస్తావు. సంతానప్రాప్తి ఉన్నది. డబ్బుకూడా గడి స్తావు. అయితే పెద్ద 'గండం' ఒకటి వున్నది :'

సింగ్‌గారు బాలదేవ్‌తో—'ఈ కిస్‌మిస్, ఈ కమలాపళ్ళు తినండి ! మందు వేడిని తగ్గిస్తాయి !' అని బతిమలాడుతున్నాడు.

ఈ సాక్ష్యం బాలదేవ్ గతించిన గౌరవాన్ని తిరిగి తెచ్చిపెట్టింది. ఆయన విలువను ఇనుమడింపజేసింది.

'గాంధీగారి సిద్ధాంతాన్ని నే నెప్పుడూ విడిచిపెట్టను। ఆయన చెప్పినట్లు— ఈ కోర్టులకూ, కొట్లాటలకూ నేను దూరంగానే వుంటాను।' అని అంటున్నాడు.

బాలదేవ్ ప్రత్యేకించి ఏమీ చెప్ప నవసరంలేదు. 'ఈ సంతకం మీదేనా?' అని అడిగితే 'నాదే' నని చెబితే చాలు। ఇంకేమీ చెప్పనవసరంలేదు. సంతకం బాలదేవ్‌దే। ఇందులో అబద్ధ మేముంది? కాళీచరణ్ కూడా చేశాడు.

....ఎలాగైనాసరే, బాలదేవ్‌ను సాక్ష్యం ఇచ్చేందు ఒప్పించాలి. లేక పోతే గ్రామంమీదికే పెద్దముప్పు వచ్చిపడుతుంది। లక్ష్మికి తాసిల్దారు ఒకమాట చెబితే ఈ సమస్య ఇట్టే పరిష్కారమవుతుంది.

## నలభై నాలుగు

ఈమధ్య డాక్టరు పిన్నిదగ్గర ఎక్కువసేపు కూర్చోవడం ప్రారంభించాడు. అక్కడున్నంతవరకు చల్లటినీడన వున్నట్టుగా ఆయనకు స్ఫురిస్తుంది. ఇంకే పనీ చేయ బుద్ధికాదు. ఉత్సాహమంతా 'స్పిరిట్'లా కరిగి సురిగిపోతుంది. ఈ మానవ కల్యాణంలో ఏమున్నది? విషజ్వరానికి రామబాణంలాంటి ఔషధం ఒకటి తాను సృష్టిస్తాడు. బాగానే ఉంది। ఆ తరువాత? ఆ తరువాత అన్నిసందర్భాలలో జరిగేదే జరుగుతుంది. అయిదణాల యాంప్యూల్ (ఇంజక్షన్) ఏభై రూపాయ లవుతుంది। ....ఇక ఇక్కడ మనిషి జీవించి ఏమి సాధిస్తాడు? ఇది జీవితమా? ఈ మనుషులు పశువులకంటేకూడా అమాయకులు। పశువులకంటేకూడా క్రూరమైనవాళ్ళు।.... పొట్టకోసం। ఇదే వీళ్ళలోని బలహీనత। ఈనాటి సామాజికవ్యవస్థ వీళ్ళను తన ఉక్కు కబంధహస్తాలలో బంధించి వీళ్ళను ఉక్కిరి బిక్కిరి చేస్తున్నది. నోరుమూసి జోల పాడుతున్నది. వీళ్ళగుండెల కొండల్లో మారుమోగే ఆర్తనాదాలను అణచి వేస్తున్నది. అయినా వీళ్ళింకా జీవించాలనే కోరుకొంటున్నారు. తాను వాళ్ళకు జీవం పోస్తున్నాడు. దీనివల్ల ఏమవుతుంది?

'బాబూ! నువ్వు భగవద్గీత చదువుతావా?' అని అడిగింది పిన్ని.

డాక్టరు కొంచెం విశ్రాంతిచెంది ఆమెవైపు చూశారు! జైలులో 'గీతా రహస్యం' చదవడానికి ప్రయత్నించారు. తాను! మమతకూడా ఎప్పుడూ 'గీత' 'రామకృష్ణ వచనామృతం' పంచిలో వేసుకొని తిరుగుతూ ఉంటుంది. బహుశా ఆమెకు అవి అర్థంకూడా కావచ్చు! మమత తరచు అంటూ ఉండేది—'తీరికగా వున్నప్పుడు తప్పకుండా 'గీత' చదువు!....అర్థం కాదూ? ఏదో ఒకటి అర్థం చేసుకోవడానికి ప్రయత్నించు. ఏదో ఒక అన్వయం దొరుకుతుంది'....తను గీత చదువుతాడు!

'డాక్టరుగారూ! జై హింద్!'

'రా. కాళీచరణ్! ఏమిటి సంగతులు?'

'నువ్వుకూడా పూర్ణియా వెళ్ళివచ్చావు గదూ?'

'వెళ్ళానండి. అక్కడనుంచే వస్తున్నాను! ఊళ్ళోవాళ్ళంతా విడుదలవుతారనే అనుకుంటున్నాను. మమ్మల్ని సత్తోబాబు వకీలు చాలాప్రశ్నలు వేసి పెడమార్గం పట్టించడానికి ప్రయత్నం చేశాడు. కాని సాధ్యపడలేదు! ఆయనకూ చివరకు బోధపడింది! బాలదేవ్‌కూడా ఇలాగే గట్టిగా సమాధానం చెప్పాడవిన్నాను! ....వకీలు నన్ను—మీరు చదువుకోలేదు; సంతకం చేయడం ఎలా వస్తుంది. రాదు అని అన్నాడు. నాకు రెండూ వచ్చునని రెట్టించి చెప్పాను. ఇనస్పెక్టరుగారిముందు నేను సంతకం చేశాను. కావాలంటే మీ ముందుకూడా సంతకంచేసి చూపెడతాను! ....అధికారి నన్ను సంతకం చెయ్యమంటే వెంటనే సంతకం చేశాను!'

'ఏ కాగితంమీద సంతకం చేశావు? ఆ కాగితంమీద ఏం రాసివున్నది?' డాక్టరు ప్రశ్నించారు.

'ఏం రాసివున్నదో, చదవలేదు. ఇనస్పెక్టరు ఇంగ్లీషులో ఏదో రాశాడు. గవర్నమెంటుకాగితాలమీద మనకు వ్యతిరేకంగా ఎందుకు రాస్తారండి?

'అహ్హ హ్హ హ్హ హ్హ!' డాక్టరు పెద్ద పెట్టున నవ్వారు—'బాలదేవ్‌కూడా ఇలాగే చెప్పాడేమో!'

'ఇందులో నవ్వవలసిన దేమున్నదండి!' కాళీచరణ్ కొంచెం పౌరుషం తెచ్చుకుని అడిగారు.

'అవును, నవ్వవలసినవిషయం కాదు, విచారించవలసిన విషయమిది! కాళీ చరణ్! ఈ విషయంలో నేను ఎక్కువగా చెప్పకూడదనుకో!....అయినా — సంథాల్‌వాళ్ళనుంచి పొలాలు లాక్కొని జమీందార్లు సంతృప్తిపడతారనేనా నీ ఉద్దేశ్యం? ఆ తరువాత రైతులపని పడతారు. విన్నూ. బాలదేవ్‌ను ప్రథమాస్త్రంగా ఉపయోగించుకున్నారు. ఇది విచారించవలసిన విషయం కాదంటావా?' డాక్టరు ఏకబిగువున చెప్పేశారు, గాలి పీల్చుకోకుండా!

'అయితే, అయితే మీరు అలా ఎందుకు రిపోర్టు ఇచ్చారు—సంథాల్ ప్రజల దెబ్బల్నిబట్టి ప్రాణరక్షణకోసమే వీళ్ళమీద దాడి జరిగినట్టు తెలుస్తున్నదని!' కాళీచరణ్ మొహం చేవురించుకొని అడిగారు.

'నీతో ఈ సంగతి ఎవరు చెప్పారు?' డాక్టరు ఆశ్చర్యంతో నోరుతెరిచారు!

'అలా ఎక్కడైనా రిపోర్టులో రాయడం జరుగుతుందా? నేను గాయాన్ని చూసి రాశాను. సంథాల్ ఎవరో, సంథాల్ కానివాళ్ళెవరో వీటితో నాకు నిమిత్తం లేదు. నేను వ్యాధుల్నిగురించి, గాయాల్నిగురించిమాత్రమే చెప్పగలను.' డాక్టరు ఆవేశంతో అన్నారు—'కాళీ! మీరు చేసింది మంచిపని కాదయ్యా! అయినా మిమ్మల్ని తప్పుపట్టడంకూడా మంచిదికాదు!'

'తాసిల్దారుగారికి మీరంటే ఎంతో గౌరవం!' కాళీచరణ్ అసలువిషయం బయటపెట్టారు—

'కమలా దీదీ! కమలా దీదీ....!'

'అంటే?' డాక్టర్ మధ్యలోనే ప్రశ్నించారు.

'నిన్న చెప్పింది....!'

'ఇంతకూ నవ్వనేదేమిటి? కమలాదీదీ నన్ను గౌరవిస్తుంది. ఆమె తల్లి కూడా నేనంటే ఎంతో మర్యాదగా ఉంటుంది. ఇదేనా నవ్వనేది!'

'అవును!' ఏదో అసలువిషయం తెలిసినట్టు అన్నారు కాళీ క్లీన్!

'అయితే ఏం, తాసిల్దారు ఊళ్ళోవున్న ధనవంతులలో ఒకరు. వయస్సులో నాకంటె పెద్దవారు. కమల ఉద్యోగకారణంగా ఎక్కువగా వెళ్ళవలసివుంటుంది. వాళ్ళు నావట్ల చాలా ప్రేమగా వుంటారు. నేనుకూడా వాళ్ళను గౌరవిస్తాను. అయితే అంతమాత్రానికే నేను తాసిల్దారుగారి అన్యాయాలను సహించగలననిగాని. ఆయనపక్షం వహించగలననిగాని నువ్వెందు కనుకోవాలి?

కమల చాలాసేపటినుంచి పిన్ని వాకిట్లో నిలబడి వాళ్ళిద్దరిమాటలు వింటున్నది. డాక్టరు చివరగా అన్నమాటలు విని ఆమె ఒక్కసారిగా నీరై పోయింది. ముచ్చెమటలు పోశాయి. గుండె దడదడా కొట్టుకున్నది. ఆమె తనను నంబాళించుకో లేకపోయింది. ఆమె మనస్సుమీద సంఘటనలప్రభావం అత్యంతతీవ్రంగా పని చేస్తుంది. నాటకంలోలాగా ఆమె అక్కడికి ప్రవేశించింది.

'ఓహో, అందుకేనా ఈ మధ్య మీరు మా ఇంటికి రావడం మానేశారు? పైగా కబురుకూడా చేశారు—'తాసిల్దారుగారూ; కమలను పాట్నా తీసుకెళ్ళండి; ఇక్కడ నావల్ల కాదు.' అని. అవునా?'

అందరూ అనుకోకుండా అక్కడ ప్రవేశిస్తారు. పిన్ని నవ్వుతూ—'ఇవ్వాళ్ళ నువ్వు పోట్లాడడానికి సిద్ధమై వచ్చినట్టుంది. పిచ్చిదానా, కూర్చో.' అని అన్నది.

డాక్టరు కమల మొహంవైపు దీక్షగా చూస్తున్నాడు. వీక్షణప్రభలతో తళతళమెరిసే కమల కనుగొలుకులలో రక్తిమకో పొదసూపిన కన్నీటిఛాయలు కప్పించాయి. గాలికి కదలాడేతీరులో స్ఫురించే సుకుమార దేహవల్లిక పెను తుఫాను వచ్చినప్పటి కదిలికను సూచిస్తున్నది. గొంతుదగ్గరున్న నరాలు ఎగిరెగిరి పడుతున్నాయి.....డాక్టరు చాలా అన్యాయం చేశాడు. రక్తపుపోటు పెరిగివుంటుంది. కమల పెదిమలు కంపిస్తున్నాయి. చివరకామె విలపిస్తుంది—'పిన్నీ!'

'కమలా, డాక్టర్ బిగ్గరగా కేకవేశాడు—' ఏ కనలు నంగతీ నందర్భం తేలీదు. వచ్చి ఏదో నోటికివచ్చినట్టు అనేశావు. నేను కాళీచరణ్ తో—'నేనేగనుక ఏదైనా రాజకీయపార్టీలో ఉంటే ఈలాగా వ్యవహరించివుండేవాణ్ణి కా'దని చెబుతున్నాను!....'

డాక్టరు వాతావరణాన్ని తేలికపరచడానికి పూర్తిప్రయత్నం చేశాడు.

అయితే కమలకు ఆయనమీద కోపంవచ్చి దూరంగాఉంచే బాగానే ఉండేది ! ఇలా జరగాలనికూడా అనుకుంటున్నాడు కూడాను ! కమలకు పూర్తి ఆరోగ్యాన్ని కలిగించవచ్చు; కాని ఆ అవకాశం చేజారిపోయింది. ఇక ఇప్పుడు తరువాత సంభవించబోయే పరిణామానికి సంసిద్ధంకావడం ఒకటే మిగిలింది.

డాక్టరు మాట్లాడుతున్నంతసేపు కమల నోరు కదపలేదు. అకస్మాత్తుగా ఆమె ముఖమండలాన్ని ఆవరించిన కారుమేఘాలు విడిపోయాయి. ఆమె అరుణ ధరంమీద అకస్మాత్తుగా చిరు మందహాసమొకటి వెలిసింది. ముక్కుపక్కనున్న సీలిరేఖ నెమ్మది నెమ్మదిగా వికసించింది. తామరపువ్వు తన పూరేకుల్ని నెమ్మది నెమ్మదిగా విప్పుతూన్నట్టుగా !

పిన్ని కమలవైపూ, డాక్టరువైపూ చూస్తున్నది. ఆమె పెదిమలమీదకూడా చిరునవ్వు తాండవిస్తున్నది.

'ప్యారూ మా ఇంటికి రెండుసార్లు వచ్చాడు - బహుశా ఇవ్వాళ్ళకూడా కుండేలేమైనా పారిపోయిందో, ఏమో !' కమల మౌనాన్ని భంగంచేసింది. ఆమె మళ్ళా మామూలు అయిపోయింది.

కాశీచరణ్ కమల మొహంవైపుచూసి, అతని కక్కుదేవో కనిపించి ముగ్ధుడైపోయాడు. తనతో మాట్లాడుతున్నప్పుడు, అప్పుడప్పుడు మంగళ మొహంలో కూడా అటువంటిభావాలే ప్రస్ఫుటమవుతూ ఉంటాయి. ఇలాగే చీటికిమాటికి చిర్రుబుర్రులాడుతుంది. అతడు డాక్టరువైపు చూశాడు. లేచినిలబడి—'సరే డాక్టరుగారూ! మీరు కూర్చోండి. నేను వెళతాను. రేపు మళ్ళా మీదర్శనం చేసుకుంటాను.' అని అన్నాడు.

పిన్నికూడా లేచివెడుతూ—'మీరు టీ తాగుతారనుకుంటాను !' అని అన్నది. కాని ఇద్దరిలో ఎవరూ మాట్లాడరు....కమల పక్కనే పెట్టివున్న గట్టితో అల్లిన ఫ్లవర్‌వాజ్‌ను చేతిలోకితీసుకొని దాని అల్లికను పరీక్షిస్తున్నది. డాక్టర్ నవ్వుతూ- 'ఒకమాట అడగనా కమలా ? కోపం తెచ్చుకోవుగదా ? తన తండ్రిని ఎవరైనా నిందిస్తే ఎవరూ సహించలేరుగదూ ? ఎందుకని ?'

'ఎవరైనా ఎలా సహించగలరు ?'

'నాకేంతెలుసు ? నాకు....నాకు నా నాన్న గుర్తుంటేగా !'

కమల చిరునవ్వులు వెదజల్లుతుంది. పెళ్ళిపాటల్లో ఒకచోట శివుడు పార్వతి తండ్రిమీద ఎన్నో తప్పులు ఆపాదిస్తాడు :

ఏక్ బేర్ గేలాం గోరాతోహరో నై హరవాపే

బయితే లే దేంక్ పువార్

కోదోకే ఖిచడీ రంధావోల్ మైనాసాసూ.

అహ్హ హ్హ హ్హ హ్హ !

అహ్హ హ్హ హ్హ హ్హ !-ఇద్దరూ ఒకేసారి నవ్వారు - పక్షులంట ఒక్కసారిగా హృదయమిచ్చి కలకల మన్నట్టు ! నరనారీ పవిత్రాకర్షణానుబంధం వళ్లను పులక రింపజేస్తుంది. వరుడు ముందుకు ఒంగుతాడు....! నారిని తనదగ్గరకు లాక్కుం టాడు....!

విశాలమైన, మత్తుతోవిండిన జోదుకన్నుల సుందరి వోరచూపులు ఒలి కిస్తూ—'మీరు నా విందను భరించగలరా ?' అని అడిగింది, నవ్వుతూ !

'రోజూ భరిస్తూనే వున్నానుగా !' కొంటెకళ్ళ కుర్రవాడు చిటికెవేసి మరీ చెప్పాడు—'కమల రోజూ మందుతాగదు ! కమల రాత్రిపూట పొద్దుపోయేదాకా చదువుతుంది ! కమల పిచ్చిది !....పిచ్చిది కమల !....నువ్వు పిచ్చిదానవు ! నువ్వు నా పిచ్చిదానవు ! పిచ్చిదానవు ! పిచ్చిదానవు....!'

అధరక్ మధుబట్ చాఖల్ కాన్హ

తోహర్ శవధ హమ్ఖిభు యదిజావి !

# ద్వితీయ ఖండం

## ఒకటి

స్వరాజ్యం వచ్చేసిందా?

'ఇంకా రాలేదు. పదిహేనో తేదీకి వస్తుంది. ఎంతో ఆలస్యం లేదు; వచ్చే వారమే వచ్చేస్తుంది. ఢిల్లీలో సంభాషణలు ముగిశాయి. హిందువులు హిందుస్థానంలో ఉంటారు; ముసల్మానులు పాకిస్తాన్ వెళ్ళిపోతారు.' భావన్‌దాసు మళ్ళా మరొక వార్తను మోసుకొచ్చారు. సరికొత్త తాజావార్త!

....40 వ సెక్షను నోటీసులాంటిది మరింకేదైనా అర్థం పర్థంలేని పారాలేమీ తీసుకరాలేదుగా భావనదాసు? అబ్బే, ఇది విజమే! ఈ వార్త డాక్టరుబాబు తీగెల్లేని పెట్టిలో కూడా చెప్పారు!

'తాసిల్దారుగారు ఆ రోజున పెద్ద విందొకటి ఏర్పాటుచేస్తారు'—సుమరిత దాసు ఇంటింటికీతిరిగి ఈ వార్తను ప్రచారం చేస్తున్నారు-'ఎస్టిమేట్లు అన్నీ పక్కాచేసి నే నక్కడనుంచే వస్తున్నాను. పూరీ, జిలేబి, హల్వా, పెరుగు-పంచదార ఉంటాయి!'

'జై! జై!'

'మహాత్మాగాంధీకి జై!'

మహంతుగారిచ్చిన విందకంటేకూడా గొప్పగా ఉంటుంది! మూడుదళాల వాళ్ళు నాట్యం చేస్తారు. బలవాహి, బదేసియా, కమలా - మహమఃయా నాటక కంపెనీ! కాశీచరణ్ వాళ్ళ 'సుశీలకీర్తన'కూడా ఉంటుంది. పూర్ణియానుంచి ఇంగ్లీషువాయిద్యంకూడా తెప్పిస్తున్నారు!....ఇంగ్లీషువాయిద్యం అంటే తెలియదా? రౌతహట్ తిరునాళ్ళలో సర్కస్‌లో మోగించలేదూ? బెకర్ ఫెకర్ భేం భేం! శంకరపూరు ఘరుదాహా 'విద్యాపతి'. బంపగడావాళ్ళ 'బలవాహి' హింగనా బొరాపీవాళ్ళ 'భటియాలీ భక్తై'. బొరాహీవాళ్ళు శుద్ధమైన 'నారదీ' పాడుతారు! కోయలా కోల్‌వాహా, సీతనాథ్‌బాబు - మ్యూజిక్ డైరెక్టర్లు. సీతనాథ్‌బాబు ముసలివారైనా, కంఠం ఇప్పటికీ కంచులుగా ఉంటుంది.

'ముసల్మానులభాగం పాకిస్తాన్‌లోకి వెళ్ళిపోయిందా?....అంటే కోసేసి తీసుకెళతారా?'

'అవును! హిందువులు-ముస్లింలు అన్నదమ్ములయితే పంచుకున్నప్పుడు అర్ధరూపాయివంతు వాటా ఇవ్వవలసిందేగా!'

'బావన్‌దాసు దేశాన్ని రెండుముక్కలు చేయడం కూడదేమో అడుగుదాం పద!'

బావన్‌దాసు—'అదేమైనా సొరకాయా ఏమిటి రెండుముక్కలు చేయ డానికి!' అని అన్నారు.

'మరి జాతీయగీతంలో అలా అన్నారేమిటి? స్వరాజ్యఫలం మనకు లభించ నంతకాలం గాంధీజీ రాట్నం నడుపుతాడు: గాంధీజీ రాట్నం వాడుకుతాడు!'

'పాటలు విషయం వదిలెయ్యండి. స్వరాజ్యం అంటే'—బావనదాసు అర్థం చెప్పారు—'స్వరాజ్యం అంటే స్వంతరాజ్యం! భారతీయులరాజ్యం! ఇకముందు ఇంగ్లీషువాళ్ళుకూడ ఉండరు. 'ఆంగ్లేయులారా! భారతదేశం వదిలిపోండి!' అని బాపూజీ ఎందుకన్నారు? ఇందుకే!'

'మనగ్రామంమీద అధికారం తాపిల్దారుగారికే ఇచ్చేస్తారు. పాకటంగాస్తేటు తాపిల్దారు హరగౌరీ ఎలాగూ లేదు.'

'బాలదేవ్ బుర్ర కాస్త శాంతించింది. సాధువుగా మారినరోజున తీసు కున్నప్రసాదంతో మెదడు చల్లబడింది. లక్ష్మి మూడురోజులపాటు సత్సంగ సమా వేశం జరిపించింది. చివరకు బాలదేవ్ ఓడిపోయాడు. ఇప్పు డాయన గృహస్థు కాదు; సాధువుగా మారిపోయాడు.....క్షురకర్మ అయ్యాకచూస్తే బాలదేవ్ కోదితల పాట్నా బంగాళాదుంపలాగా తళతళలాడుతూ మంచిరంగులో ఉన్నది.

'నమస్కారం బాలదేవ్‌గారూ!'

'గురోన్నమః' జైహింద్! బాలదేవ్ ఈమధ్య 'గురోన్నమః' 'జై హింద్' రెండూ కలిపి అంటున్నారు.

'జైహింద్ కామ్రేడ్ బాలదేవ్!' కాళీచరణ్ పిడికిలిబిగించి మరీ అన్నారు—'కామ్రేడ్!'

'కాదు! నేను కామ్రేడ్ కాదు!' బాలదేవ్ ముక్కుపుటాలు ఎగరవేస్తూ అన్నాడు—'నన్ను కామ్రేడ్ అని ఎందుకంటావు?'

'కామ్రేడ్ అంటే తిట్టేమీ కాదు. కామ్రేడ్ అంటే సహచరుడు అని అర్థం! దేశంకోసం. ప్రజలకోసం పాటుపడే ప్రతివ్యక్తినీ కామ్రేడ్ అనవచ్చు' కాశీచరణ్ నవ్వుతూ అన్నాడు.

'నీకు తెలియదు!' బాలదేవ్ కొంచెం కోపం తెచ్చుకొని అన్నాడు—'నువ్వు రంగంలోకి ఇవ్వాళ్ళ వచ్చావు. నేను ముప్పైనుంచి వున్నాను. మీసాలు కత్తిరించి కోడిగుడ్డు తినిపిస్తే కామ్రేడ్ అవుతారు. క్యాంప్‌జైల్లో చాలామంది కామ్రేడ్లు కావడం చూశాను ...ముజప్ఫర్‌పూరు సోషలిస్టునాయకు డొకాయనకు మీసాలు కత్తిరించడమే పనిగా ఉండేది! జేబులో కత్తెర ఉండేది. కావడానికి ఆయన బ్రాహ్మడే! నాకా నువ్వు కామ్రేడ్‌నుగురించి చెప్పేది?'

బాలదేవ్‌కు మళ్ళా మతి భ్రమించినలక్షణాలు కనిపిస్తున్నాయి.

అందరూ ఏకాభిప్రాయాని కొచ్చారు—'అవునయ్యా కాశీచరణ్! నీదే తప్పు! నీవు లీడర్‌వైనావు. మంచిదే. అయితే నువ్వొకప్పుడు బాలదేవ్‌జీ శిష్యుడివే! నువ్వు ఇందుకు ఒప్పుకున్నా, ఒప్పుకొనకపోయినా!'

కాశీచరణ్ సిగ్గుపడిపోతాడు.....అమధ్య కార్యదర్శి చెప్పింది గుర్తు కొచ్చింది. తండ్రీ కొడుకులు కామ్రేడ్‌లు కావచ్చు ...వినడంలో పొరపాటయిందేమో! తన తప్పు ఒప్పుకున్నాడు. 'అభిమన్యు వధ నాటకంలో అర్జునుడు ద్రోణాచార్యుడి పాదాలమీద కుసుమబాణం వేశాడు!'

శెభాష్ కాశీచరణ్, విషయాలు కొన్ని తెలుస్తున్నాయి నీకు! ఇదివరలో విషయం తెలుసుకోకుండానే పోట్లాడడం ప్రారంభించేవాడు!

బాలదేవ్‌కూడా నవ్వాడు—'స్వాతంత్ర్యోత్సవాన్నిగురించి మీ పార్టీవాళ్ళేమంటున్నారు?'

'బావుంది. స్వరాజ్యం కాంగ్రెసువాళ్ళకే వచ్చిందా?'

'ఆ ఉత్సవంరోజున ఉంటావా?' బాలదేవ్ అడిగాడు.

'ఉంటాను. ఆ రోజున ఏనుగుమీద భారతమాత విగ్రహంబెట్టి పెద్ద ఊరేగింపు జరిపించాలి.' కాశీచరణ్ రొమ్మువిరుచుకొని చెప్పాడు—'మన ఊళ్ళోని

ఊరేగింపు కటహా తాణాలోనేగాక ఆల్ ఇండియాలోనే ఘనంగా ఉండాలి. విగ్ర హానికి అర్డరిచ్చాం.'

బాలదేవ్ కళ్ళముందు భారతమాత విభిన్నరూపాలు ప్రత్యక్షమవుతాయి— తల్లి, రూపవతి, మాయాబి, లక్ష్మి।

....లక్ష్మివి ఏనుగుమీద ఊరేగించడం బావుండదు. భారతమాత రూపం? ప్రస్తుతం లక్ష్మికూడా ఖద్దరు ధరిస్తున్నది. రాట్నం వడుకుతున్నది. సన్నవి నూలు తీయడం ఆమె కిదివరకే వచ్చును.

జై భారతమాతాకీ జై ।

## రెండు

కేసుకుకూడా 'స్వరాజ్యం' ప్రాప్తించింది.

సంథాల్ తెగల వాళ్ళందరికీ యావజ్జీవ కారాగారవాసశిక్ష విధించారు. ఎంతో అర్భాటంగా సెషన్ కేసు నడిచింది. సంథాల్ వాళ్ళ తరపునకూడా వాదించడానికి పాట్నానుంచి బారిస్టరు వచ్చారు. బారిస్టరుకు ఖర్చులకుగాను సంథాల్ తెగవాళ్ళు నగా నట్రా అమ్ముకొన్నారు. అసలు ఈ కేసులో కోర్టువ్యవహారాలు క్షుణ్ణంగా తెలిసిన తాసిల్దారుగనుక దిగకపోతే ఈ ఖూనీకేసునుంచి శివశంకర్ సింగ్, రామ క్రిపాల్ సింగ్, ఖేలావన్ సింగ్ బయటపడి వుండేవాళ్ళుకాదు..... ఖర్చు....? బతికి ఉంటే బలుపాకుతివి బతకొచ్చు. ఉరిశిక్ష పడివుంటే ఈ పొలాలూ, స్థలాలూ, దబ్బూ-దర్పం ఏమయ్యేవి?

రామక్రిపాల్ సింగ్ సంథాల్ పేటవాళ్ళనుంచి స్వాధీనం చేసుకొన్న పొలంలో నుంచి పదెకరాలు తాసిల్దారు విశ్వనాధ్ ప్రసాద్ కు రాయించాడు....సుమరితదానుకు నాలుగుకుంట్ల భూమి దొరికింది. ఖేలావన్ సింగుకు కొంచెం అప్పయింది. పోలీసుల తిండీ తిప్పలకవి, ఖర్చులకనీ వాడేప్పటికి పదిహేనువందల చేతిచమురు వదిలింది. తాసిల్దారు— 'కాగితం ఎందుకు లేవయ్యా. జనవనార అమ్ముడయ్యాక ఇచ్చేద్దూ' అని అన్నాడు।

కేసు గెలిచిన 'ఉత్సవం'కూడా స్వాతంత్ర్యోత్సవంరోజునే ఉంటుంది. ....పగలు స్వరాజ్య ఉత్సవం, రాత్రికి కేసు గెలిచిన ఉత్సవం।

'మహామదియా నాటక కంపెనీతో - ఎంతలోనా సరే - పంద, రెండొం దలు ఎంతో కంత - ఇచ్చేట్టు మాట్లాడి తీసుకరండి। అరారునామా రాయించు కోవడం మరచిపోవద్దు।' అని తాసిల్దారు అన్నారు. సుమరితదాసు - 'ఇందులో కనెక్షన్ ఉంది మరొకదానికి। దాన్నిగురించి తరువాత చెబుతాను.' అని అన్నారు.

మహామదియా నాటక కంపెనీవాళ్ళుకూడా బాగా తయారవుతున్నారు. లక్నో మంచి ఒకామెను పిలిపిస్తున్నారు. నాటకకంపెనీ యజమాని సత్యనారాయణబాబు। లక్ష్మి మహారాణి ఆయన్ను బాగా చూపింది. చాలా బాగాచూసింది.

ఈ ప్రాంతంలోని మధ్యతరగతి రైతులదగ్గర నాలుగుపిచ్చికలు కిచకిచ మంటున్నాయి. అంటే దీనికి కారణం - పొగాకు, ధాన్యం, జనుములు, మిర్చి ధరలు పెరగటం; ఇళ్ళలో పెళ్ళిళ్ళూ పేరంటాలపేరుమీద పెద్దఖర్చులు లేక పోవడం। ఇంటియజమాని కొంచెం యువకుడైతే హార్మోనియం, తివాసీలు, గ్యాస్‌లైటూ, బల్లలు, కుర్చీలూకొని ఇంటినిండా నింపేస్తాడు. అప్పటికీ అబ్బాయి గారికుతి తీరకపోతే తుపాకి లైసెన్సుకోసం ఆఫీసర్లు చుట్టూ తిరగడం మొదలు పెడతాడు...లాల్‌బాగ్ తిరునాళ్ళప్పుడు రాత్రిఅంతా వేశ్యలుపాడే 'ముజరా' వింటాడు. పగలంతా ఆఫీసులచుట్టూ తిరుగుతాడు. తుపాకి లైసెన్సు వచ్చాక నాటకకంపెనీ ప్రారంభిస్తాడు...అప్పటికీ అయ్యగారికి జలబుసీళ్ళు వదలకపోతే ఏదో ఒక ఖూనీ కేసులో ఇరుక్కోవడం, దాంతో ఉన్నదంతా స్వాహా చేసుకోవడం జరుగుతుంది. ...మహామదియా నాటకకంపెనీతో అరారునామా రాయించుకోమన్నాడు తాసిల్దారు।

'ఇందులో పెద్ద కనెక్షన్ వున్నది. 'సుమరితదాసు రహస్యం పొట్టలో ఎంతసేపని ఉంచుకోగలడు?' చాలారహస్యం। పరమరహస్యం. మహామదియా వాళ్ళను ఎందుకు పిలిపిస్తున్నారో తెలియదా? నాటకానికి లక్నోమంచి ఒకతెను పిలిపిస్తున్నారు. ఆమె బ్లాకుకు ఒక నాట్యం కుడతారు, తెలిసిందా?'

సంథాల్‌వాళ్ళుకూడా ఈ స్వరాజ్యఉత్సవంలో నాట్యం చేస్తారట।...నాట్యం చేసేప్పుడు బాణాలు వేయరుగా? వేయరులే। డాక్టర్‌గారు చెప్పారు—నాట్యం

చేస్తామని స్వయంగా సంథాల్ ఆడవాళ్ళువచ్చి మరీ చెప్పివెళ్ళారని। ఇందుకు తాపిల్దారుగారికి అభ్యంతర మెందుకుంటుంది? ....ఏది ఏమైనా, సంథాల్ తెగల నాట్యం చూసితీరవలసిందే। మనల్ని మనం మరచిపోతాం। కొప్పులో పూల గుత్తులు, మెరిసే దేహకాంతి, స్వచ్ఛమైన పలువరస। తెల్లటి చీరెలు। వాళ్ళ అందెలు ఘల్లు ఘల్లు మంటూంటే మనగుండెలు ఝల్లుఝల్లుమంటూ ఉంటాయి, వెంటనే మనకుకూడా నాట్యం చేయాలనే తలపు తలలో మెరపులా మెరుస్తుంది.

డా డిగ్గా డా డిగ్గా।
రిం రిం తా ధిన్ తా।

ఈరోజుమంచే వాళ్ళు ప్రాక్టీసు చేసుకుంటున్నారు....కాని వాళ్ళముందరే. డిగ్గా - తాళ తంత్రీ వాయిద్యాలధ్వనులు ఎలాగైనా భయంకరంగానే వుంటాయి. ఆ కొటాటరోజునయితే యమధర్మరాజు నగారా మోగిస్తూన్నట్టు. యమదూతలు లయ తప్పకుండా నాట్యంచేస్తూ బాణాలు వదులుతూన్నట్టూ అనిపించింది.

## మూడు

'జాగ్రత్త। వేడివేడి జిలేబీ తినకండి।' ఈమధ్య విస్తంత్రి సుమరితదాసు విలువ పెరిగిపోతున్నది. ఎప్పుడూ ఏదో ఒక వార్త మోసుకొచ్చి 'ఇది పరమ రహస్యం' అని అందరికీ చెప్పి తనకడుపు ఉబ్బరం తగ్గించుకుంటాడు। ఈమధ్య ఏ పేటలో నదరగావున్న నవయువకుడు కనిపించినా దగ్గరికెళ్ళి నవ్వుతూ 'జాగ్రత్త నాయనా। వేడివేడి జిలేబీ తినబోకు।' అని అంటూ ముందుకు పాగిపోతున్నాడు.

'అంటే?'

'అంటే వింటావా? వేడివేడి జిలేబి ప్రభావం చాలావేడిగా ఉంటుంది. జలుబుచేసి ముక్కు కారుతున్నా, తల తిరుగుతున్నా. వేడిజిలేబి తిను। వెంటనే ముక్కు తెరిపిడి పడుతుంది. అంతబాగా పనిచేస్తుంది. ఇవ్వాళ్ళ డాక్టరుదగ్గరి కెళ్ళాను. కొంచెం దురదకు మందివ్వమని అడగడానికి। డాక్టరుగారు, పులియా అంటే తెలియదూ, ఆ మహగూదాసు కూతురు - ఆ మెతో ఏమన్నారో తెలుసా?

పులియాకు వేడి చేసిందట! మొహంమీద మొటిమలులాగా లేచాయి. డాక్టరుగారు పూర్ణియా వెళ్ళి చూపించుకోమన్నారు. అందుకే అబ్బాయిలూ, మీతో చెబుతున్నాను. ఆ తరువాత చెప్పలేదనేరు. జాగ్రత్త! వేడివేడి జిలేబీ తినకండి!'

'ఏమండోయ్ దాసుగారూ! కుర్రాళ్ళతో ఎందుకండి? ముసలివాళ్ళకే చెప్పండి!'

'ఛీ ఛీ! ఊరుకోండి! అప్పుడు అందరిజాతకాలూ బయట పడతాయి!'

సుమరితదాసు ఫక్కున నవ్వినప్పుడు అతని ఎర్రచిగుళ్ళు స్పష్టంగా కనిపిస్తాయి. ఎర్రగా నవ్వుతాడు! నవ్వి మళ్ళా అడుగుతాడు—'తెలుసునా? మహంతు రామదాసు రామప్రియను దాసీగా పెట్టుకుంటాడట! లక్ష్మి ఒప్పేసుకున్నది. బాలదేవ్ ఆమె వెంటబడి చివరకు బైరాగిఅయి కూర్చున్నాడు!'

కాళీచరణ్ ఒక్కసారిగా వీరనపడిపోయాడు.... ఇప్పుడు మంగళానుగురించి ఈ సుమరితదాసు ఏమీ అనడుగదా? అతనికీ తెలుసు, ఎక్కడ ఏమాట అనవలసిందీ! అతన్ని మాటల్లో జయించడం కొంచెం కష్టమే!

చర్ఖా సెంటర్ మాష్టర్లకు, పంతులమ్మకూ మధ్యన గొడవలొచ్చి పోట్లాడుకున్నారు. టున్‌టున్‌జీ రాజీనామాచేసి వెళ్ళిపోయాడు. రెండోమాష్టరుకు మేకు గుచ్చుకున్నది. ఇంటికెళ్ళిపోయాడు. ఇప్పుడిక మంగళాదేవి ఒక్కతే చర్ఖాసెంటర్ పేరుమీద ఊళ్ళో తిరుగుతున్నది - తిరిగి గాంధీజీనిగురించి, నెహ్రూనిగురించి, దేశస్వరాజ్యాన్నిగురించి చెబుతూఉంటుంది.

... 'ఏనుగుమీద భారతమాత విగ్రహందగ్గర చామరంతో విసరడానికి మంగళాదేవిని కూర్చోబెట్టాలి!' అని కాళీచరణ్ అన్నాడు.

బాలదేవ్ తాసిల్దారుతో అన్నాడు —మన ఊళ్ళో ఆడవాళ్ళు లేకనా, పరాయి ఊరి ఆడవాళ్ళను కూర్చోబెట్టడానికి? కమలాదీదీని కూర్చోబెడితే బావుంటుందేమో!'

'కమల అసలే జబ్బుమనిషి! ఎప్పుడు ఏం జరుగుతుందో చెప్పడం కష్టం!'

'అయితే లక్ష్మితో చెబుదాం! ఇద్దరుకూడా ధరిస్తున్నది ఈమధ్య! నియమ

నిష్ఠగా ఉందేమనిషి. రోజూ స్నానంచేసివచ్చి మహాత్మాజీ ఫోటోకు పూలు అర్పి స్తుంది.'

'...మంచిదే। మంగళాదేవికి ఏనుగంటే మహాభయం. అరటాకులాగా కంపించిపోతుంది. కాళీచరణ్ ఎంతచెప్పినా విన్నది కాదు। చివరకు 'కాళీచరణ్ నా పక్కనవుంటే ఏనుగుమీద కూర్చుంటాను.' అని అన్నది. అతనికి సిగ్గేసిందో ఏమో। 'ధత్' అన్నారు.

దులరియాకూడా కబుర్లు చెప్పతంలో మేటి। అటూ ఇటూ చేసి, కన్ను గొట్టి వళ్ళు, చేతులూ తిప్పుకుంటూ—'మంగళాదేవి పీలంరంగు పెషావరు పైజమా వేసుకొని దారివెంట నడుస్తూంటే-అబ్బా-ఎట్లాగుంటదో చెప్పనా మామా। మంచి యౌవ్వనంలోవున్న ఏనుగుపిల్లలాగా వుంటుందంటే నమ్ము।' అని అన్నారు.

అహ్హ హ్హ హ్హ హ్హ। అహ్హ హ్హ। హీ హీ।।
టోం టోం। వో వో।

డాక్టరుగారి గదియారంలో వరీఘా రాత్రి రెండురూములట్టించూపి, రబ్బా రేకుగొట్టంలో నోరుబెట్టి కాళీచరణ్ బిగ్గరగా అరిచాడు—'టోం టోం। వో వో।'

ఆ తరువాత యువకులందరూ ఏకకంఠంతో అన్నారు—'భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చింది।' అని.

మఠంలో ఘంటను మోగించి - డిమ్ డిమ్ డిమ్ డిమిక్। బాలదేవ్ భావా వేశంలో చౌకీదారులాగా కేకపెట్టాడు—'హ హ హ హ హ। భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చింది। హ హ హ హ హా। మహాత్మాగాంధీకీ జై।'

రిం రిం తా ధిన్ తా।

డా డిగ్గా।

నంథాల్ పేటలో మాందర్, డిగ్గా - మోగినాయి.

'తూ వూ వూ వూ।' పిన్ని కంఠం ఊదింది-'తూ వూ వూ వూ।'

ఏడుమైళ్ళ దక్షిణానవున్న కటిహార్‌లోని అయిదు పెద్దపెద్ద మిల్లులు ఒకే

పారి సైరన్ మోగిందాయి—'భొం బొం బొంధు వూ వూ!' ఆ ధ్వని చాలా స్పష్టంగా వినిపించింది.

....ఢిల్లీలో విభజన అయ్యాక స్వరాజ్యం వచ్చేసింది. జై జై! ఇస్లాం పూరు పాకిస్తాన్‌లో ఉంటుందా, హిందుస్తాన్‌లో ఉంటుందా? పాకిస్తాన్‌లోనా? ఇప్పుడు పాకిస్తాన్‌లో సంతోషంకొద్దీ తెల్లవాళ్ళను చంపేస్తున్నారేమో!....ఛీ, పాపం! తెల్లవాళ్ళేం చేశారు? అదృష్టంకొద్దీ మేరిగంజ్‌కు ఆ ప్రమాదం రాలేదు. రక్షించబడ్డాం! పదిమంది ముసల్మానులున్నా పాకిస్తాన్ తీసుకుంటామని పేచీ పెడ్తే వాళ్ళు!

## నాలుగు

భొ బొధ! బొ బొ!

కాళీచరణ్ గొంతు పూడిపోయింది. వినాదాలు లేపేప్పుడు తిత్తి పూడి పట్టగా - లోపలినుంచి ధ్వని వస్తుంది—పోయెం, పోయెం సోయెం సోయెం!.... ఉదయంనుంచి కామ్రేడ్ వాసుదేవ్, కామ్రేడ్ సోమాజిట్ వంతులువారీగా వినాదాలు ఇస్తున్నారు.

వినాదాలు ఆగిపోకూడదు; అలాగే ఇస్తూనే వుండాలి. 'అష్టజామ కీర్తన' లాగా! స్వరాజ్యఉత్సవం పూర్తయ్యేదాకా వినాదాలు ఆగకూడదు!

టన్ టనాక్, టన్ టనాక్! అలంకరించిన ఏనుగు నడుస్తున్నది.

ధన్ ధన్ ధనాంగ్! ధనాంగ్! పాటలుపాడేవాళ్ళ డప్పులు మోగుతున్నాయి.

దూ వూ వూ, తూ తూ తూ! శంఖనాదం! భోం ఓం పోం! భోం పోం. పోం! ఇంగ్లీషు వాయిద్యం!

తక్ తక్ తక్ తక్ ధినాగ్ ధినాగ్ - చాన్‌ఖోల్ వాయిద్యం మోగింది.

పీం పీం పీం ఈ ఈ ఈ పీం పీం పీం....! చాన్‌ఖోల్‌వాళ్ళ సన్నాయి మోగుతున్నది!

చాందోం బనియాం సాతిలో బరాత్
ఏక్ లాఖ్ హాథీ సాతిలో దుయిలాఖ్ ఘోడా
చార్ లాఖ్ పైదల్ దుల్ హోబాలా లఖిందర్ ।

సన్నాయిమీద 'సతీబేహులా' నాట్యంలోని పెళ్ళిపాట వాయిస్తున్నారు.—

ధూ ధూ ధూ ధూ ధూ తు దు తు ధు తు । కొమ్ముబాయిద్యం మోగుతుంది.

హి హి హి హి హి హి హి । కొండగుర్రం సకిలించింది. ఎవరిదీ గుర్రం? ధర్మనాద్ బాబుదా? హరిబాబుదా?

భారతదేశం స్వతంత్రమాయెను
పద సోఖి చూద్దాం, పద ।

ఈ కొత్త స్వరాజ్యగీతాన్ని ఎవరు రాశారు? శబాష్ । సరికొత్త గీతం । వినండి, వినండి ।

కథిజే చఢియే ఆయల్
భారత్ మాతా
కతిజే చఢల్ సురాజ్
చలుసఖి దేఖన్ కో
కథిజె చఢియె ఆయల్
వీరజమాహర్
కథిపర్ గాంధిమహరాజ్, చలుసఖి దేఖన్ కో
హాధీచఢల్ ఆవ్ భారతమాతా
ఛోలీమే బైఠల్ సురాజ్, చలుసఖి దేఖన్ కో
ఘోడాచడియే ఆయేవీర జమాహర్
పైదల్ గాంధీమహరాజ్ । చలుసఖి ।

ఈ కీర్తన బావుంది । ఆహా । ఎవరు రాశారు? ఉజాదూదాను, ఉజదూదాను తెలియదూ? మానిక్ పూర్ లో ఉంటాడు. ఈయనకూడా పందొమ్మిదివందల ముప్పైనుంచి స్వరాజ్యఉద్యమంలో ఉన్నాడు.

కూ కూ । లయప్రకారం ఏనుగు ఘీంకరిస్తున్నది । బావుంది ।

ఏనుగును రంగురంగు కాగితాలపూలతో చాలా బాగా అలంకరించారు. దాని కపాళంమీద తామరపూవును చిత్రించారు. ఎన్నిరంగులు పూశారు। భారత మాతవిగ్రహాన్ని దుర్గాదేవి విగ్రహంలా అలంకరించారు. లక్ష్మి. సరస్వతి. పార్వతి. గౌరి. భారతమాత - వీళ్ళందరూ అక్కచెల్లెళ్ళు।

బాలదేవ్ చూశావ్ధు—సాధారణమైన ఖద్దరుచీరె। మెడలో పూలమాల। వీపుమీద వేలాడుతున్న పొడుగాంటి కేశాలు। భారతమాత పెదిమలమీద చిరునవ్వు లాంటి చిరునవ్వు। లక్ష్మి అలాగే నవ్వుతుంది. నెమ్మదిగా చామరం కదులు తున్నది।

ధిన్. తక్ తక్ తక్. తాక్ ధినా ధిన్। భటియాలీ కీర్తన—తాక్ ధినా ధిన్ తిన్నక్ తిన్నక్।

హాంరే మోరీరే ఏ ఏ ఏ। హాఁ అం అం
అఁ అఁ అఁ అరోహో।
బహంకష్టే సురాజ్ పైలోరే
భార ఽఽ త ఽఽ సంతాన్ ఓరే
కోటికోటి ఛయిలా పోయెలా
దిలోబోలి దాన్ ఓరే।
హాఁరే యోరీరే ఏ ఏ ఏ। హాఁ అఁ అఁ

రారండోయ్. రండి
స్వరాజ్యం ఎంతో కష్టపడితేనేగాని లభించలేదు
యువలెందరో చేశారు ప్రాణత్యాగం.

బౌరాపీ హింగనానుంచి వచ్చారు - ఈయనగారు। ఎలావున్నదో చూశావా పాట। సీతానాథ్‌బాబు బెంగాలీభాషలో భటియాలీ కీర్తన రాసేశాడు। చూశావా? సీతానాథ్‌బాబు రాశాడా లేక ఆయన చిన్నకొడుకు మహేంద్ర రచించాడా? మహేంద్రబాబుకూడా ఏదో కవిత్వం రాస్తాడని విన్నాను।

ఝురక్ ఝురక్ ఝుర్ర్ ర్ ర్ ర్। తాషామర్ఫా అన్నిటినీ తినేసింది. దీని ముందు అన్నివాయిద్యాలు దిగదుడుపే।

డిమాక్ డిమాక్। చిన్న ఢోలకి మోగింది.

ఢొ ఔథ। ఔ ఔ
మహాత్మాగాంధీకి జై।
జవాహర్‌లాల్ నెహ్రూకీ జై।
రాజేంద్రబాబూకి జై।
జయప్రకాశ్ జిందాబాద్।
ఈ స్వాతంత్ర్యం మోసం।

'దేశంలోని ప్రజలంతా ఆకలితో అలమటిస్తున్నారు।' ఈ కొత్త వినాదం ఎవరు లేవదీశారు?

'ఆఁ ఆఁ. స్వతంత్రం రాలేదు।'

'ముందు వినండి।'

'ఈ స్వతంత్రం మోసమా? తన్నండి నాయాల్ని, ఎవరామాట అనేది?

'మనవూరివాడు కాదు. ఎవరో బయటివాడు!'

'ఆఁ! ఆఁ! వాయిద్యాలు ఆపివేయండి!'

'తొలగండి! తొలగండి!!'

'ఏయ్ కాశీచరణ్! ఏయ్ వాసుదేవ్.....।'

'బాల్‌దేవ్: శాంతింపజేయి జనాన్ని।'

'అరే। ఏం జరిగిందేమిటి?'

'ఈ ప్రజలు ప్రతిదానికి ఏదో ఒక అడ్డుపుల్లతెచ్చి వేస్తూనే ఉంటారు।'

'చూడండి తాసిల్దారుగారూ! జరిగిందేమిటంటే-'బాలదేవ్ మళ్ళా ఇవ్వాళ్ళ పేత్రేగిపోయాడు'—జరిగిందేమిటంటే కాశీచరణ్ బాబు లోపల ఒకటిపెట్టుకొని బయటికి మరొక మాటాడతాడు. స్వాతంత్ర్యోత్సవాన్నిగురించి మీ పార్టీవాళ్ళు ఏమంటున్నారఁ ఎ స్వరాజ్యం కాంగ్రెసువాళ్ళకే రాలేదన్నాడు! ఇప్పుడేమో బయటి వూరినుంచి ఎవర్నో పిలిపించి మా ఉత్సవాన్ని భగ్నం చేయిస్తున్నాడు. ఈయన హింగనా ఔరాహీ సోషలిస్టు అయితే హింగనా ఔరాహీలోనే జేజేలు చెప్పుకో మనండి। అంతేగాని ఇక్కడికొచ్చి గల్లంతుచేస్తానంటే ఎలాగు? మహా వచ్చాడు- ఈ స్వాతంత్ర్యం వట్టి మోసమట।'

'అవును, నిజమే! నిజమే ఈ మాట!' జనమంతా ఒక్కసారిగా అంటారు.

'ఓంయేం సోంయేం సోంయేం....' కాళీచరణ్ ఏమిటో అంటున్నాడు. అర్థం కావడంలేదు.

'ఇదుగో చూడండి! పొరపాటయింది!' కామ్రేడ్ వాసుదేవ్ సమాధాన పరుస్తున్నాడు. అంటే కాళీచరణ్ మాటను తను బిగ్గరగా చెబుతున్నాడు:—

'పొరపాటయింది. ఏముంది నోరేగా? ఎటుబడితే అటు తిరుగుతుంది. ఇందులో కాళీచరణ్ ది తప్పేమీ లేదు!'

ఇక్కడ సోషలిస్టుపార్టీ వాళ్ళకుకూడా ఈ విషయం నచ్చలేదు. వేరే వూరు నుంచి ఇక్కడ వివాదాలు ఇవ్వడం ఏం బావుంటుంది? కాళీచరణ్ గొంతు పూడి పోయింది. వాసుదేవ్, సోమా వివాదాలు ఇస్తూనేవున్నారు. మధ్యలో ఈ గొడవ ఒకటి వచ్చిపడింది.

'సరే సరే, మన్నించండి!'

'వదిలెయ్యండి! ఇవ్వాళ్ళ స్వరాజ్యం వచ్చినరోజు!'

టన్ టనాక్ టన్ టనాక్! ఏనుగు మళ్ళా బయలుదేరింది. ఊరేగింపు ముందుకు సాగింది. వాయిద్యాలన్నీ ఒకేమారు మోగుతున్నాయి. డిమ్ డిమ్ ఝుర్రక్ ఝుర్ పిట్ ధూవూ తక్ తక్ ధిన్!

తోం ఓం ఊం ధూ తూ తాన్ ధినా ధిన్!

తూయీతూ! తూయీతూ! ఏనుగు లయప్రకారం ఘీంకరిస్తున్నది!

బాలదేవ్ కు మళ్ళా మతి చెడిందా? చేతిలో జండాపుచ్చుకొని ఏనుగుముందు నాట్యం చేస్తున్నాడు. గార్డు రైలుకి జెండా చూపిస్తున్నట్టు జండాను ఎత్తి పట్టు కున్నాడు. అవునుమరి. స్వరాజ్యాన్ని సాధించింది, ఈ త్రివర్ణపతాక ఆయుధం తోనేగదా! పాతకాలంలో కత్తులు కటార్లతో యుద్ధాలు జరిగేవి; అందుకే కత్తులు చేతుల్లో తీసుకొని నాట్యం చేసేవాళ్ళు; ఇప్పుడేమో జండాలుతీసుకొని నాట్యం చేస్తు న్నారు. అందుకే బాలదేవ్ అంత హుషారుగా ఉన్నారు. అంతేగాని మళ్ళా మతి భ్రమణంలాంటిదేమీ జరగలేదు.

కిర్ర్ కిర్ర్ ర్ర్ ర్ర్ ఘన్ ఘన్ ధడామ్ ధడామ్ ధా। వీధినాటకంవాళ్ళ నగారా మోగింది.

....విందుభోజనం తినేప్పటికి పొట్ట కొంచెం భారంగా వున్నది. ఇక్కడ ఆలస్యం చేశామంటే ముందు చోటుదొరకదు. పద. పోదాం।

కిర్ర్ ర్ ర్ ఘన్ ఘన్ ధడామ్ ధా. ధడామ్ ధా।

అయ్యలారా। అమ్మలారా। వంచ భగవానులకథ చెప్పబోతున్నాం.

గాంధీ జవాహర్ మీకు కల్యాణం చేకూర్చుగాక।

కిర్ర్ ర్ర్ ఘన్ ఘన్ ధడామ్ ధా. ధడామ్ ధా।

ఏ కథ చెబుతారట? ఏమిటి? విప్లవవీరుడు భగత్‌సింగ్ కథా? మరి నాతో 'సుల్తానా డాకూ' అన్నారే।

ఎవరికి దొరికిన ఆయుధం వాళ్ళదే।....భగత్‌సింగ్ పార్టు సత్యనారాయణ బాబు తీసుకొన్నారు. కుడిచేతిలో పిస్తోలు. ఎడంచేతిలో గుండ్రంగా వున్నదేమిటి? బాంబు. బాబోయ్। ఎవరికందిన ఆయుధం వాళ్ళు చేపట్టాలి। భగత్‌సింగ్ ఆయుధం బాంబు, పిస్తోలే।

కిర్ర్ ర్ ఘన్ ఘన్ ధడామ్ ధా. ధడామ్ ధా।

ఒరేయ్ నాయనా। నేను భారతీయుణ్ణి।
నాకు ఉరికంబాలంటే భయమా।

కిర్ర్ ర్ కిర్ ధడామ్ ధడామ్।

భగత్‌సింగ్ నాట్యం చేస్తున్నాడు. ఒకచేతిలో బాంబు. మరొకచేతిలో పిస్తోలు। నాట్యం చేస్తూ స్టేజీమీద ఒకపక్కనుంచి మరొకపక్కకు వెడుతున్నాడు. నగారా అదేపనిగా మోగుతున్నది. నగారా మోగించేవాడు పన్నాలాల్ కంపెనీవాడి లాగానే మోగిస్తున్నాడు. బావుంది. అయితే తాళం మార్చేప్పుడే కొంచెం భయంగా ఉంటుంది. తాళాలు మార్చేప్పుడు 'ధడామ్ ధా. ధడామ్ ధా।' తాళంమీద భగత్‌సింగ్ బాంబువున్నచెయ్యి రెండుపార్లు ప్రజలవైపు చూపిస్తాడు - బాంబు విసిరి వేస్తున్నట్లు। దానికిముందు కూర్చున్నవాళ్లు కొంచెం ఉక్కిరిబిక్కిరై తలలు కిందికి

వంచుకుంటారు। ఏమో ! నిజంగానే విసిరివేస్తే । పకిలీ బాంబయినా చేతినుంచి జారితే దెబ్బ అంటూ తగులుతుంది గదా !....లక్ష్మీ ఆవిడ కనిపించదేం ? మీనాలో తీసుకొచ్చారయ్యా। చప్పట్లు కొట్టండి. బయటికి వస్తుందేమో !

'ఆఁ వచ్చేసింది. చూడండర్రా లక్ష్మీ అందాలరాశిని. ఆ.'

'నచ్చి అలాగే మెదలకుండా నిలబడిందేమిటి ?'

'చూడ్డానికి యువతిలాగానే వున్నది. కాని....'

'గొంతు విప్పితే తెలుస్తుందిగా. కొంచెం పాడనివ్వు.'

'పౌడరూ గివడరూ వేసుకొని అందంగానే తయారైంది. ఈమెగారి అనలురంగు పగలు చూడాలి. కుండ పెంకులాగా....'

'అహ్హ హ్హ హ్హ ! నాయాలు దులరియాగాడుకూడా ఈమధ్య పెద్దపెద్దమాటలు మాట్లాడేస్తున్నాడు.'

ఆటగత్తె పాడుతున్నది.

ఏమయ్యోయ్ రంగులాయనా। నా ఖాదీచీరె అద్దకం వేయవయ్యోయ్.

చాలారోజులుగా మనస్సులో ఉన్నదయ్యా ఈ కోర్కె.

ధర్ ధడామ్ ధర్ ధడామ్ ।

'నాట్యంచేస్తూ అలా పకపకలిస్తూ నవ్వుతుందేమిటి ?'

'బాబోయ్ ! ఆ పళ్ళూ. ఆ ముక్కూ. ఏమిటా ఆకారం ?'

'అవి పళ్లు కాదయ్యా। కాబూలీ దానిమ్మ గింజలయ్యా. దానిమ్మగింజలు.'

అహ్హ హ హ ! అవును దులరియాగాడు సరిగానే చెప్పాడు.

మళ్ళా పాడుతున్నది—

ఒకచోట గాంధీబొమ్మ కావాలి

రాట్నం వడుకుతున్న గాంధీజీ।

మరొకచోట వీర జవాహర్ బొమ్మ

జైలుకు వెళ్ళే వీరజవాహర్।

అంచులలో ఉండాలి త్రివర్ణపతాకం

ఎగురుతూ గాలిలో ఎగురుతూ।

కిర్ ర్ ఠి ఠి ఠి ధడక్ ధడమ్ ధా ధడమ్ ధా.

అయ్యో మరి రవికెమీద అక్కర్లేదా....?

ఆహా. ఆహా. వాహ్వా. వాహ్వా.

'ఆమె రవికెమీద ఒక 'టకా' కుట్టి స్తే సరి.' ఎవరో అంటారు.

'తప్పక కుట్టించండి.'

'టకా ఏమిటోయ్? 'మిడిల్' అనండి 'మిడిల్.' పల్లెటూరి వైతుల్లాగా 'టకా' అంటారేమిటి? వెండిరూపాయిని 'మిడిల్' అంటారు.'

'చూడండి,....భగత్‌సింగ్ మళ్ళా స్టేజిమీదికొచ్చా డెందుకు?'

'సోదరులారా! గల్లంతు చెయ్యకండి!.... ఇప్పుడొక పాట వింటారు— 'మోరా బాలకా పిసై హియా టుట్టూపే గిరాణాయే!'

'మధ్యలో ఏ లెక్చ రేమిటయ్యా?....నగారా మోగించు. రాత్రి అంతా జరగ వలసిందే. అరాకునామా అలా వున్నది!....రాపీ, ఏ సిపాయిని! మొదలుపెట్టించు!'

'ఏదో మాటలుచెప్పి కాలం గడిపేట్టున్నారు. వీళ్ళెప్పుడూ ఇంతే!....ఏదీ నాట్యం?'

'ఏయ్, ఆ లైటు బుక్ బుక్ మంటున్నది, గాలికొట్టు.'

'గాలేం కొడతాడు? వర్షం పడేలావున్నది. గాలి దుమారం వస్తుందేమో!'

కిర్ ఫున్ ఫున్ ధడామ్ ధా. ధడామ్ ధా! నగారా మోగింది.

గుడ్ గుడమ్ - ఆకాశంలో మేఘాలు గర్జించాయి.

ఫటాక్! టపాకాయ మోగింది.

> భగత్‌సింగ్ సిక్కుకు నాయకుడు
> ఇప్పుడే అతన్ని అరెస్టు చెయ్యాలి.
> కిర్ కిర్ ఫున్ ఫున్ ధడామ్ ధా!

'తన్నండి నాయాల్ని. ఈ నాయాలే అసలైన దేశద్రోహి. గుర్తుంచు కోండి!'

'తన్నండి, కొట్టండి. నాయాల్ని కొట్టండి!'

'అహ్హా హ్హా హ్హా హ్హా' గాలిదుమారం వచ్చేట్టున్నది....! పశువుల్ని బయటికి వదిలెయ్యాలి. పొయ్యిలో నిప్పు అలాగేవుంచి ఈ అడంగులు అట్లాగే నిద్రపోతూ ఉంటారు. చాలా పెద్ద అలవాటు. అసలు నిప్పు హుక్కా తాగటానికని ఉంచు తారు....పూరిళ్ళల్లో ఏమున్నది? గాలిదుమారం వచ్చింది అంటే- అంటుకుపోతాయి. వర్షం వస్తేనేమో. వీళ్ళప్పి ఇంటోనే. నిప్పురవ్వబడితే ఇంటికి ఇల్లే స్వాహా అయిపోతుంది....పదండి....! ఈమె నాట్యం చూసేదేముంది? ఇదీ ఒక నాట్య మేనా? కటిహార్ పావలాసరుకుమ పట్టుకొని తీసుకొచ్చారు. లక్నోసిల్లన్నారు. పిల్ల కాదు. తల్లిని తెచ్చారు మరచిపోయి! పదండి.

గుడ్ గుడుమ్! గుడ్ గుడుమ్!

కమలని డాక్టర్ తన బాహువుల్లో బంధించివేశాడు. పగలు మూడుగంటలకే సంథాల్‌వాళ్ళ నాట్యం చూడ్డానికి అస్పత్రికి వచ్చింది కమల! నాట్యం ముగిసింది. సాయంత్రం అయింది. అక్కడ వీధినాటకం ఎప్పుడు ప్రారంభమైందో, ఎప్పుడు ముగిసిందో ఇద్దరిలో ఎవ్వరికీ తెలియదు. మేఘాలు గర్జించినప్పుడు, మెరుపులు మెరిసినప్పుడు, కొద్దిపాటి జల్లుగా వర్షం ప్రారంభమైనప్పుడు కమలని డాక్టరు తన బాహువుల్లో బంధించివేశాడు.

కమల చేతులు విడిపించుకోవడానికి కొద్దిపాటి ప్రయత్నం చేసింది.....

మెరుపు మెరిసింది.
గుడ్ గుడుమ్! గుడ్ గుడుమ్!
రిం రిం తా ధిన్ తా!
ధిగ్గా దా ధిగ్గా!

సంథాల్ నాట్యానికిచెందిన తాళ, తీగె వాయిద్యాల తాళానికి ఉభయుల గుండెలు దడదడమని కొట్టుకున్నాయి. ... ఛమ్మ ఛమ్... ఈరోజున కమల ఈ ప్రాంతంలో ధరించే అన్నిరకాల నగలు ధరించింది.

టున్ టున్!
ఛమ్ ఛమ్!
గుడ్ గుడుమ్!

ఛమ్మ, ఛమ్ ఛమ్మ ఛమ్!
టున్ టున్!

డాక్టర్! డాక్టర్! ఓ ప్ర-శాం-త-మ-హా-సా-గ-ర్!
రాజకమల్!....

## ఐదు

బావనదాసు కిప్పుడు తనమీద తనకే నమ్మకంలేకుండా పోయింది. బాలదేవ్, బావన్‌దాసు మనస్సు చంచలమైపోయిందని, మనిషికి భ్రమ ఎక్కువైపోయిందని అంటున్నాడు. బావన్‌కు గాంధీజీమీదమాత్రం నమ్మకం ఉన్నది. అప్పటికీ ఆయనే వున్నాడు. పెద్దపెద్ద కఠినపరీక్షల్లోకూడా బాపూ అందరికి అండగా నిలబడతాడు. జై బాబా! జై బాపూ!

అతని మనస్సు అలా ఎందుకయిందో ఏమో, ప్రతివిషయానికి చెడువైపే ఆలోచిస్తాడు. అందర్నీ అనుమానిస్తాడు. బాపూ దగ్గరనుంచి సమాధానం వచ్చింది.

భగవాన్, బావన్‌దాస్‌జీ, 'మీరే ధైర్యాన్నికోల్పోతే మీ భక్తజనులవిషయమేం గావాలి? బాపూ ప్రణామాలు!'

బావన్ నవ్వుతూ అన్నాడు—'గంగూలీజీ! బాపూవైఖరి చూశారా? మనస్సుకు సందేహాలు ఎక్కువైనాయి. బాధగా ఉంటుంది. మనిషికి తన కర్మమీద నమ్మకం ఎలా ఉంటుంది? బాపుని అడిగితే నవ్వుతాలికింద కొట్టేస్తున్నారు. మీరే ధైర్యాన్నికోల్పోతే ఎలాగని అంటున్నారు. అంతా మోనంగావున్నది. ఒకప్పుడు రామావతారం, మరొకప్పుడు కృష్ణావతారం....!'

'మరోప్పుడు వామన అవతారం!' గంగూలీ వెంటనే అందుకున్నాడు.

'మీరుకూడా భలేవారే!' అహ్హ హ్హ! చాలారోజులతరువాత బావన్ హృదయం విప్పి నవ్వాడు.

బావన్‌దాసు నిండుమనస్సుతో నవ్వినప్పుడు ఆయనకళ్లు వాటంతటవే

మూసుకుపోతాయి. అప్పుడు ఒక పెద్ద పెల్యూలాయిడ్ ఆటబొమ్మ కదులుతున్నట్టుగా కనిపిస్తుంది బావన్ అవతారం!

రావణ అవతారం, ఈ చరిత్తర్ రావణావతారం ఎత్తి వచ్చారు. మీకు తెలుసా, హసల్‌గంజ్ నూనె వర్తకుడు హరఖూ ఇంట్లో దొంగతనం జరిగిందట!

'ఆఁ! ఎప్పుడు? స్వరాజ్యఉత్సవం రాత్రేనా? తుపాకులతో వచ్చారా దొంగలు, ఎవరూ గాయపడలేదుగా?....రెండు హత్యలా? ఆఁ!

సుచరితదాసు ఇప్పుడే కటిహార్‌నుంచి వచ్చారు.

'విషయమేమిటంటే - హసల్‌గంజ్ - హరఖూ వట్టి పీనాసి అని అందరకూ తెలిసినవిషయమేగా? వడ్రంగి చరిత్తర్ - భగవంతుడికే తెలియాలి - ఇంకెవరో ఒకరోజు మధ్యాహ్నపుపూట వాళ్ళింటికి వచ్చారు. వచ్చి మంచినీళ్ళడిగితే - డబ్బు లివ్వమన్నారట! అతనిభార్య అనడం ఏదో టిఫిన్ పెట్టాక, మంచి నీళ్ళుతాగి వెళ్ళిపోతూ ఉంటే డబ్బు అడిగిందట! గ్లాసు మంచినీళ్ళిచ్చి డబ్బు అడుగుతావా? అన్నాడట!... నేను విన్నమాట చెబుతున్నాను. అసలు విషయం ఒకటి రెండు రోజుల్లో బైటపడక మానుతుందా? - స్వరాజ్యఉత్సవం రోజు రాత్రి ఒక డజనుమందిని వెంటబెట్టుకొని గుర్రంమీద వచ్చారట. అతగాడు! రావడంతోటే అతనిభార్యను పూరీలు తయారుచేయమన్నాడట! ఆమెకు అటూ ఇటూ ఇద్దరు తుపాకులుపట్టుకొని నిలబడ్డారు. హరఖూని వంటింట్లో కూర్చోబెట్టారట! రామాయణం చదువుకోమని చెప్పి! చుట్టూ నలుగురు నిలబడ్డారు. ఊళ్ళోకి ఇద్దరువెళ్ళి - జనంతో హరఖూసాహు కూతుర్ని చూడ్డానికి వచ్చామని చెప్పారట! ఉదయానికి వ్యవహారమంతా పూర్తి చేసుకున్నారు. భూమిలో పాతేసిన కుండలు కూడా బయటికి తీయించి దానిలోనిడబ్బు పట్టుకెళ్ళిపోయారు. అతనిభార్య రాత్రి అంతా విరాయి పూరీలు వండుతూనే ఉన్నదట! ఆమె మధ్యలో - బాబూ తీర్థయాత్రలకు కొంచెం మిగిల్చివెళ్ళండి నాయనా. అంటే - ఒక వెయ్యిరూపాయలు ఇచ్చేశారు. హరఖూతో - 'నువ్వు ఎనిమిదినంవత్సరాలనుంచి ఒకేధోవతి కట్టుకున్నావు; నీకు డబ్బు ఎందుకులే' అన్నారట! ఆడవాళ్ళను ఏమీ అనలేదు. చివరకు వెళ్ళబోతూ ఉండగా రెండు ఖూనీ లయ్యాయి!'

సుమతితదాసు ఈ సంగతులు చెబుతూ అటూ ఇటూ చూస్తున్నారు. మధ్య మధ్యలో ఆగిపోతున్నారు. పక్కుమని నవ్వడంలేదు. కొంచెం బెదురుగాఉన్నారు. ఏమిటి సంగతి?

'ఏమండీ దాసుగారూ? ఏమైనా ప్రైవేట్‌సంగతి వున్నదా?'

'ప్రైవేట్ ఏమీలేదు....కొట్లాటలు జరుగుతున్నాయట! ఢిల్లీ. కలకత్తా. నవ ఖాళీ. పాట్నా - అన్నిచోట్లా హిందూ ముస్లింలమధ్య పోట్లాటలు జరుగుతున్నాయి. గ్రామాలకు గ్రామాలే నఫా అయిపోతున్నాయి!....దహనకాండ జరిగిపోతున్నది.' సుమతితదాసు చేతిలో చెంబుతీసుకొని బయటికి వెళ్ళిపోతాడు.

....బాలదేవ్ నిరశనవ్రతం చేస్తాడు. ఎందుకు? ఏం జరిగింది? బాలదేవ్ చెప్పాడు—'సోదరులారా! ఇప్పుడే డాక్టరుగారి రేడియోలో వార్తలు విని వస్తున్నాను. అన్యాయం జరిగింది. అందరూ పిచ్చివాళ్ళయిపోయారు. గాంధీజీ ఖిలాఫత్ ఉద్యమంరోజుల్నుంచీ చెబుతూనేవున్నారు - హిందు ముస్లింలు సోదరులని! తివారీగారు ఇప్పటికి పదిహేను సంవత్సరాలక్రిందట తన గీతంలో చెప్పనే చెప్పారు :

> దేవాలయాలలో చంద్రుడు కవిపించెను
> మసీదులలో మురళీగానం వినిపించెను
> కలిసి మెలిసి ఉండాలి హిందువులూ ముస్లింలూ
> మానావమానాలను విడవాడాలి!

....'అంటే గాంధీగారిమాట కాదని ఈ అత్యాచారాలకు పాల్పడే వాళ్ల ఏదో ఒకరోజున తమ పొరపాటు ఒప్పుకుంటారు....గాంధీజీ నిరాహారదీక్ష ప్రారంభించవచ్చు!'

సిద్ధాంతి ఈమధ్య అంతగా మాట్లాడడంలేదు. ఇన్ని అఘాయిత్యాలు జరిగిపోతూవుంటే ఆయన చూస్తూ ఎలా ఉండగలడు? ఇదంతా స్వరాజ్యపరిణామం అని ఆయన అభిప్రాయం! కొడుకు పుట్టగానే తల్లికి పక్షవాతంవచ్చి, ఆ మరో రోజు ఇంటికి నిప్పంటుకుంటే - ఇక ఆ తరువాత ఏమేమి జరగనున్నదో చూడవలసివున్నది. కలియుగం సమాప్తం కాబోతున్నది. ఒకరినొకరు పొడుచుకొని అందరూ నశించిపోతారు.

ఇప్పుడు సోషలిస్టుపార్టీ ఆఫీసుకు ఫిర్యాదులు చేయడానికికూడా వస్తున్నారు. జామరాతిమియాఁ ఏడుస్తూ వచ్చారు. సుమరితదాసు అతనిదగ్గర్నుంచి అయిదు రూపాయలు లాక్కొన్నారు. 'కాళీబాబూ! అన్యాయం! ఇక బీదవాళ్ళు బతికేదెలాగు?'

'కామ్రేడ్ వాసుదేవ్? సుమరితదాసును పిలుచుకొనిరా!' కాళీచరణ్ మొహం కొంచెం గంభీరంగా వున్నది.

మచ్ మచ్ మచ్! వాసుదేవ్ నిన్ననే పూర్ణియానుంచి తిరిగొచ్చారు. ఇరవై నాలుగు రూపాయలుపెట్టి బాటాకంపెనీ బూటు కొన్నారు. నడుస్తుంటే మచ్ మచ్ మంటున్నది. రాత్రిపూటకూడా కళ్లకు నల్లకళ్లజోడు పెట్టుకొని, పై జామా, లాల్చీ వేసుకుని నడుస్తూవుంటే కొంచెం మత్తులోవున్నట్టుగా అనిపిస్తారు. పరేడ్ చేస్తున్నప్పుడు నడిచినట్టు నడుస్తారు.

....వాసుదేవ్ స్టేషన్‌లో 'పాన్ బీడీ సిగరెట్' అని కేకలు పెడతారే అలా మాటను సాగదీసి గొంతును కొంచెం పెంచి అన్నారు-'సో మరేట్ దేస్!'

....సుమరితదాసు కుక్కపిల్ల అదిరిపోయి ఉంటుంది! వాసుదేవ్ లోలోపల నవ్వుతున్నారు....'స్యోమరేట్ దేస్!'

చిన్న పెంకుటింట్లో ఎక్కడని దూరతాడు. దాసు? వాసుదేవ్ అతన్ని ముందే చూశారు. అతని చెయ్యిపుచ్చుకొని లాక్కొచ్చారు బయటికి! దాసు గడ గడ వణికిపోతున్నాడు.

'బాబూ! రక్షించాలి.'

'ఏయ్ విస్తంత్రి! పిలుస్తున్నారు?' వాసుదేవ్ నవ్వుతూ అన్నారు.

'ఎవరూ? నా....వాసుదేవ్! హాత్! నేను ఇనస్పెక్టరు పిలుస్తున్నాడేమో ననుకొని భయపడ్డాను అనవసరంగా, భలేగా భయపెట్టేశావోయ్! మొత్తానికి మాట భలేగా మార్చేశావే? లేకపోతే ఎలాగు? పదిచోట్ల తిరిగేవాడు పలురకాలవేషాలు వెయ్యకపోతే ఎలాగు? ఇంతకూ నన్ను పిలిచిందెవరూ? కాళీచరణ్ బాబేనా? ఇదుగో చూడు. నిన్ను చాలారోజులుగా ఒకమాట అడుగుదామనుకుంటూనే మరచిపోతున్నాను. మీ పార్టీలోకూడా రెండుపార్టీలున్నాయా ఏమిటి?'

'ఎందుకూ ?'

'ముందు చెప్పు!' సుమరితదాసు కిసుక్కున నవ్వాడు.

'ముందు మీరు చెప్పండి!' వాసుదేవ్ తక్కువవాడా?

'ఏమీలేదు!....కాశీచరణ్ ఒకరోజున నాతో కార్యదర్శికి వాసుదేవ్ అంటే పెద్ద నమ్మకం లేదన్నాడు. వాసుదేవ్‌లో నాకేమీ లోపం కన్పించలేదే అన్నాను. అప్పు డన్నాడుగదా—దాసుగారూ! మీకు అంతరంగికవిషయాలు తెలియవు లెండి అని అన్నాడు.... అందుకని అడిగాను....!'

'నిజమే దాసుగారూ! అసలువిషయ మేమిటంటే - కాశీచరణ్ ధర్మపురీశీ పార్టీవాడు. ఆయనకూడా పోషలిస్టే అయినా మా కార్యదర్శిముందు ఆయన పాటి రాడు. కొంచెం మెతక! అందరితోనూ నవ్వుతూ మాట్లాడతాడు. కాంగ్రెస్ వాళ్ళతో కూర్చొని దహీ తింటాడు. మీరే చెప్పండి - ఇటువంటి చప్పటిమనిషి విప్లవపార్టీలో ఎలా మనగలుగుతాడు? చెప్పండి దాసుగారూ! మీరే చెప్పండి!'

'ఓహో! అదా సంగతి నాయనా!' సుమరితదాసు మొహం గంభీరంగా పెట్టి అంటాడు - 'అవును నిజమే నువ్వనేది అక్షరాలా నిజం!'

'ఈ కాశీచరణ్ ఆయన పార్టీలో ఉన్నాడు.' కొంచెం గుసగుస లాడు తున్నట్టు అన్నాడు—'మంగళాదేవితో ఈయనగారు జరిపే రాసక్రీడలనుగురించి ఏం చెప్పమంటారు? నేను కార్యదర్శితో చెప్పాను. అన్నిసంగతులూ! కాశీ చరణ్‌ను ఆయన కోప్పడ్డాడు. అందుకే బహుశా మీతో అలా అనివుంటాడు. ఈసారి మా సమ్మేళనానికి వెళ్ళేప్పుడున్నది అసలు భాగోతం!'

'ఓహో! అలాగా! ఏమోనబ్బాయ్! ప్రతివిషయంలోనూ ఈ పార్టీ రాజ కీయాలు నాకు నచ్చవు! వీటికికూడా ఒక హద్దు అనేది ఉండాలి. నువ్వన్నట్టు ధర్మపురీశీలాంటివాళ్ళు మీ విప్లవపార్టీలో ఎలా వుంటారు? నిజమే! మీ కార్యదర్శి వ్యవహారమంతా తీవ్రంగా చర్చించేప్పుడు, ఆ చేతులుతిప్పడం అదీచూస్తే....! ఇంతకూ నన్నెందుకు పిలిపించినట్టు?'

'ఆ జామరాతీ మియాఁ వెళ్ళి ఏదో చెప్పాడు. డబ్బు లాక్కున్నారటగా!' వాసుదేవ్ నల్ల కళ్ళజోడు పెట్టుకుంటూ అన్నాడు—ఈ ముస్లింలను నమ్మ కూడదు!'

'అంతే మరి!' సుచరితదాసు కిసుక్కున నవ్వుతాడు—'అదే మనం అర్థం చేసుకోవాలి!'

'నే వెళ్ళి చెబుతాలెండి - ఇంట్లో లేరని! ఈయనేమన్నా గవర్నరా, చేతులు కట్టుకొని ఎదురుగావచ్చి నిలబడటానికి? నే నెవర్నీ లెక్కచెయ్యను!' వాసుదేవ్ సిగరెట్టుతీసి అగ్గిపెట్టెమీద దాన్ని కొడతాడు—'రోజల్లా ఉపన్యాసాలిస్తాము—సిగరెట్టు తాగకూడదని, కోడిగుడ్డు ముట్టుకోగూడదని! కాని లోలోపల....!' వాసుదేవ్ అగ్గిపుల్ల గీచి సిగరెట్టు వెలిగించుకొన్నాడు.

అగ్గిపుల్లవెలుతురు కళ్ళజోడు రెండు అద్దాలలోనూ కనిపిస్తుంది. నల్ల కళ్ళజోడులో వెలుగుతున్న అగ్గిపుల్ల, సుచరితదాసు శరీరానికి వణుకు పుట్టినట్టయింది. రోమాలు నిక్కబొడుచుకున్నాయి. కాని నవ్వుతూ అన్నాడు—'అబ్బాయ్! చుక్కేసుకోరాదూ? ఫాలాక్షుడికికూడా తెలియనివ్వనులే!'

'ఆఁ!' అన్నాడు వాసుదేవ్ సిగరెట్టుపొగను గుండ్రంగా వదులుతూ!

....చుక్క....? వాననకొట్టినట్టు సుచరితదాసు కళ్ళు ఒక్కసారిగా మెరిసిపోయినాయి—'వాసుదేవ్‌బాబూ! నేపాల్ సరుకేమైనా వచ్చిందా? ఉంటే నాకూ కాస్త రుచి చూపించు!'

'ఆల్‌రైట్! రేపు రుచి చూపిస్తాను. లాల్‌సలామ్!'

మచ్ మచ్, మచ్ మచ్!

## ఆరు

తాంత్రికులపేటలో ఈరోజున మంచిత్రంగా జరుగుతున్నది పంచాయతి!

చాలారోజులనుంచి పంచాయతీలో గృహవిషయాలనుగురించి చర్చించగూడదనే కట్టడి అనవాయితీగా వస్తున్నది. కావాలంటే పంచాయతీలో మీ ఇష్టం వచ్చిన కలగాపులగంభాష మాట్లాడండి, అభ్యంతరమేమీలేదు! అయ్యావార్లంగారి పిల్లి మ్రావ్ మ్రావ్ అన్నదన్నట్టు - మీరు అన్నిటికి క్రావళ్ళు పెట్టండి. అభ్యం

తరం లేదు; వత్తులు లాగెయ్యండి. మునిగిపోయిందేమీ లేదు. పంచాయతీలో మీ మాట కెవరూ అడ్డురారు. అయితే యువకులంతా కలిసి రామప్రియ దాసీ కావడం అనేవిషయానికి అత్యంతరం తెలియజేశారు.

'ఇదేమైనా ఆటా? పీరీ జాతీ అనేదాన్ని గురించికూడా కాస్త ఆలోచించాలి. ఎప్పుడు ఎవరికితోస్తే అప్పుడు మరొకరికి ఉంపుడుగత్తెగా వెళ్లిపోవడమేనా? ఆటా ఇదేమన్నా?' ఇవ్వాళ్ళ గరభూకూడా గరమ్ గరమ్‌గా మాట్లాడేశాడు.

పంచాయతీ సమావేశంలో ఎవరైనా మాట్లాడవచ్చు. అందుకే పంచాయతీ మంచి ఊపుమీదున్నది.

'ఏదీ, ఎక్కడున్నది రామప్రియ తల్లి?'

అందరికళ్ళూ తడికదాటునున్న ఆడవాళ్ళ గుంపుమీదికి తిరిగాయి. రమజూదాసుభార్య గొంతు సరిచేసుకొని - 'రామప్రియతల్లి విషయమేమిటంటారు?' అని అన్నది.

'నువ్వు మాట్లాడకు.'

'పనీ లేదూ, పాటా లేదు పట్టత్తా, ఏ కాళ్ళకైనా మొక్కుతా నన్నదట వెనకటి కెవరో.'

'నే నెందుకు మాట్లాడకూడదు. మాట్లాడితీరుతాను.' రమజూదాసుభార్య లేచి నిలబడి అన్నది. పోట్లాటకు సిద్ధపడి వచ్చినట్టుంది. పెద్దపోట్లాట అయేట్టే వున్నది.

'అనోజ్, ఉచితదాసూ ఏరీ? పెద్ద కావలాదార్లు బయలుదేరారు. తప్పుచేసిన వాళ్లను కొట్టేవాళ్ళు.'

'అయితే కొడతారా? కొట్టండి. కొట్టనివాడు లంజకొడుకు.... ఏదో రామప్యారి తల్లి మాట్లాడబోయేప్పటికి అందరికీ కాళ్లు వచ్చాయి. రామప్రియ యౌవ్వనంలో ఉన్నది. దాని ఇష్టంవచ్చినట్టు అది చేస్తుంది. మధ్యలో మీరెవరు? ఏమయ్యోయ్ గరభయ్యా. పెద్ద ఆవేశంలో మాట్లాడావు. రామప్రియ నీకు అక్కా. చెల్లెలా?....మాట్లాడవేం? ఏ సంగతి బయటపెట్టాలా?....ఛీ త్తన్ ఏడుగురు

కొడుకుల తండ్రి। రాత్రింబగళ్ళు ఆకలిదప్పులు మరచిపోయి రామప్రియదగ్గర ఎందుకు పడిఉంటున్నాడు? కుర్రవాళ్ళవిషయమంటే—ఏదో కాలుజారా రనుకో వచ్చు। ఈ ముసలాడికేం పొయ్యేకాల మొచ్చింది?'

'మాట్లాడకు! నోరు మూసుకో। ఫిత్తన్ ఎక్కడున్నాడు? ఏడీ।'

'తలమీద ఒక వల్ల వెంట్రుకకూడా - చూద్దామన్నా లేదు। అయ్యగారిబుద్ధి చూడలేకనేమో - ఇలా వుంది। ఏమంటావు రామప్రియా?'

ఫిత్తన్ చిన్నకుర్రవాడు కోపంతో - 'ఏయ్। జాగ్రత్తగా మాట్లాడు!' అని అన్నాడు.

'పట్టుకోండి। తన్నండి।'

'ఏయ్, ఏయ్!'

'మెడలో గుద్దేసికొట్టండి! నెత్తిమీద చీపురుతో బాదండి।....పెద్ద తీవి చూపిస్తున్నాడు.'

నోఖే, ఉచితదాసు లిద్దరూ బెత్తాల పెత్తందార్లు। అంటే పంచాయతీ సమావేశంలో ఆవేశకావేశాలు పెచ్చుపెరిగి, అంతటా అశాంతి ఏర్పడినప్పుడు, వీళ్ళిద్దరూ చేతిలో బెత్తాలు పుచ్చుకొని గాలిలో తిప్పుతూఉంటారు. నోఖే, ఉచిత దాసులిద్దరు ఫిత్తన్‌ను పట్టుకుని మెడకు గుద్ద తగిలించారు. మహగూవాస్, చేథరూ, మునహరు, అనహూ మోకన్ మధ్యవర్తిత్వం నెరపుతారు—'కొట్టకండి, కొట్టకండి।' అని

'మొత్తానికి ముసలివాళ్ళంతా ఒకవర్గంగా చేరార్రోయ్।' ఎవరో అన్నారు.

రామప్రియతల్లి విషయాన్నిగురించి చర్చించడం మానేసి ఫిత్తన్‌దాసుని విచారిస్తారు. ఛీ। ఛీ। ఎంత సిగ్గులేని తొత్తుకొడుకు। ఈసారి అయిదురూపాయలు జరిమానా వేశారు. అతని చిన్నకొడుక్కి చెవులుపట్టుకుని అయిదుగుంజిళ్ళు వేసే శిక్ష విధించారు. నోఖే లెక్కపెట్టాడు—'ఒకటి, రెండు, మూడు, నాలుగు, అయిదు। చాలు।'

రామప్రియతల్లికి వేసినశిక్ష ఏమిటయ్యా అంటే ఒక సాయంత్రపు విందొకటి

ఏర్పాటు చేయించాలి. మహంతుగారిజాతిలో కలుస్తున్నప్పుడు అంతమాత్రం విందు ఇవ్వకపోతే ఎలాగు? ఏమంటున్నది రామప్రియతల్లి? ఇస్తుందా? సరే అయితే! ఇప్పుడు చెప్పండి.... పంచాయతిపెద్దల అభిప్రాయం?.... పదిమంది ఎలా అంటే అలాగే!... పదిమందీ అనేవారు. రామప్రియ దాసీ కావచ్చునవి! కట్టడి అనేది ఉండవలసిందే! లేకపోతే ఈ విందు చేజారిపోయి ఉండేది!

రమణాభార్య రామప్రియతో ఆమె ఇంట్లో కూర్చొని అన్నది - '....ఏమ మ్మాయ్! పాలూ మీగడలుతిని. చిక్కని, చక్కని శరీరకాంతుల్ని పెంచుకొని, ఆనంద లీలాతన్మయతలో విలీనమై నీ పిన్నిని విస్మరించవుగదా? మహంతుగారితో చెప్పు - జరచీరెలుపెట్టి సరిపెట్టుకోవాలనుకుంటారేమో! అదేమీ కుదరదు!.... కంచె కావాలని చెప్పు! తెలిసిందా!'

రామప్రియ నవ్వింది - 'ఆయనగారికి నే నెంతచెబితే అంత ! మరి ఆమెగా రున్నదిగదా....!'

'నువ్వెంత పిచ్చిదానవు? ఆమెగారెవరు? లక్ష్మినా? అసలైన అధికారం నీది? దర్జాగా వుండవలసింది నువ్వు! పోతే, ఆ లక్ష్మి విషకోరలు తీసెయ్యాలి. లేకపోతే నీ మహంతు జీవితమంతా అంజరు వాయిద్యంతోనే కాలం గడుపుతాడు. పిచ్చిదానా! అందుకని....?'

'రామప్రియా! ఎక్కడున్నావు?.... మహంతుగా రొచ్చినట్టుంది.' ఆమె తల్లి పిలిచింది.

'నమస్కారం మహంతుగారూ! ఇంకా పెరట్లో దాక్కుంటారేమిటి?

ఇప్పుడు మీరు మాకు ఆప్తులయ్యారు. రండి.' రమణాభార్య అదోలా చూపి ముసిముసినవ్వులు కురిపిస్తూ అన్నది.

మహంతు రామప్రియతో పెరట్లోనుంచి లోపలికి వచ్చారు.

'పీట వెయ్యండి....కూర్చోండి!'

'జాతివాళ్ళంతా భోజనాలు పెట్టించమన్నారు. నేను ఒప్పుకున్నాను.' రామ ప్రియతల్లి చిలుం తాగుతూ చెప్పింది.

'లక్ష్మని అడగాలి!' మహంతుకళ్ళు కిందికిదించి అన్నాడు. రామప్రియ తల్లి ఇప్పు డతనికి అత్త! అత్తముందు కొంచెం జాగ్రత్తగానే మాట్లాడాలి.

'ఏమన్నారూ?' రమణాభార్య పగిలిన డబ్బారేకులా గంగలమన్నది - 'లక్ష్మని అడగాలా? రామప్రియతల్లి! వింటున్నావా? నేను చెప్పలేదూ, ఆవిడ తాయవగారిని గొర్రెలాగా తయారుచేసిందని? ఇదుగో మహంతుగారూ! ఆమె నడగడానికి, లక్ష్మ ఎవరంటాను?'

'ఆమె అన్న దేమిటంటే....!'

'మహంతుగారూ! మరోవిధంగా అనుకోకండి! మీరు పట్టి కొజ్జా అండి!' రమణాభార్య వెళ్ళిపోవడానికి లేస్తూ అన్నది - 'రామప్రియను ఆ లక్ష్మదగ్గర దాపీగా ఉంచుతారన్నమాట, మహంతుగారూ! అర్థమైంది.'

'అబ్బే! అలాకాదు; రామప్రియ ఎలా చెబితే అలాగే చేస్తాను!' రామదాసు రెండుచేతులు జోడించి అన్నాడు.

'రామప్రియ చెప్పినట్టే!' మహంతు ప్రతిదానికీ 'రామప్రియకే తెలియాలి!' అని అంటున్నాడు.

'రామప్రియ కేమితెలుసు?' లక్ష్మకి కోపంవస్తుంది - 'మఠానికి సంబంధించిన నియమ విష్ఠలను నేర్చుకోవడానికే ఒక సంవత్సరం పడుతుంది. చేతికున్న వేళ్ళను సరిగా లెక్కబెట్టలేదు. ఆమెకు కూలీలలెక్క అప్పగించారు. హే సద్గురు ప్రభో!'

రామప్రియ దాపీగా మఠానికి వచ్చినరోజున లక్ష్మ మొహం తోటకూర కాడలాగా వాడిపోయింది. మహంతు రామదాసుకు కారణం తెలియకపోలేదు. రామప్రియకు కూలీలకు కూలికింద ధాన్యం కొలిచేపని అప్పగించాడు. 'లెక్కలు తెలియకపోతే నేర్చు! నేర్పాపెట్టకుండా వాదగ్గర ఉపన్యాస మిస్తావేమిటి?'

'నేను ఉపన్యాసం ఇస్తున్నానా? హే సద్గురుప్రభో, నన్ను వీదగ్గరకు పిలిపించుకో ప్రభో! ఆమె వంటికి ఒకమణుగు నబ్బు పట్టిస్తేగాని ఉల్లిపాయంకంపు తగ్గిపోదు. ఉదయం లేవడం నేర్చు! మొహం కడుక్కోదు. టీతిలు తాగుతుంది. దొడ్డికి వెళ్ళివచ్చాక స్నానం చెయ్యదు. ఎంగిలిచేత్తో 'టీజక్' ముట్టుకుంటుంది.

నే నెందుకు నేర్పాలి? నువ్వేం చేస్తున్నావు? తాళపుచేతులు పనిలిచెంగున ముదేసు కోవడం ఒక్కటే. ఆమె నేర్చుకోదలిస్తే నా కెటువంటి అభ్యంతరమూ లేదు. కొత్త తాళపుచేతులు ఇప్పుడే ఇచ్చేస్తాను. నా కలాంటి వరదా ఏమీ లేదు, హే పద్గురు!' లక్ష్మి తదాలివ తాళపుచేతుల గుత్తితీసి కింద గిరాటేసింది.

మహంత రామదాసు తాళపుచేతులగుత్తి చూశాడు. అవి గోదాం తాళపు చేతులు. పెద్ది తాళంచెవి ఎక్కడున్నదో? 'తాళంచేతులు పారేస్తావెందుకు, మాటి మాటికీ ఇంతకోపం తెచ్చుకుంటే పను లెలా జరుగుతాయి?' మహంతు గంభీరంగా అన్నారు - 'నువ్వు నా గురుమాతవు!....రామప్యారిని సరైనమార్గంలో పెట్టేబాధ్యత ఏమీదున్నది!'

'వంటికున్న మట్టినికూడా నేనే వదిలించనా? బట్టలుకూడా నేనే ఉతికి పెడతాను!... పదిరోజులుకూడా గడవలేదు; టీకక్ గ్రంథంపున్న మహంతుగది గోడలనిండా ఉమ్ములూ దగ్గులూ ఉన్నాయి. గదినిండా బీడీపీకలున్నాయి. వాటిని కూడా నేనే ఎత్తిపోయనా?....ఇది మఠంలాగా లేదు. పందుల గుడిసెలాగా ఉన్నది, పందుల గుడిసె!'

'రామప్యారి దేహమాలిన్యాన్నికూడా విన్నే శుభ్రం చేయమని నేనేమీ అనడంలేదు! నేనంత పిచ్చివాణ్ణి కాదు! నాకు తెలుసు - నువ్వు బాలదేవ్ మెద కున్న మాలిన్యాన్ని శుభ్రం చేయగలవు!....' మహంతు రామదాసు ఎందుకు వదులుతాడు

'బాలదేవ్‌జీ పేరు ఎత్తావంటే ఊరుకోను!'

'ఎత్తితే ఏంచేస్తావు?....మఠాన్ని పందులగుడిసెగా మార్చిందెవరు?'

'నేను మార్చానా?'

'అవును. నువ్వే మార్చావు! నా వళ్ళు మండుతున్నది. ఎక్కువగా వాగించకు నన్ను!'

'వళ్ళు మండుతూంటే, నన్ను చంపు. చల్లబడుతుంది!'

చంపుకోవడం అనేమాట బాలదేవ్ ఎలా వినగలడు? హింస పెరిగే

ట్టున్నది. 'మహంతుగారూ!....వ్యవస్థాపకురాలా! శాంతి! శాంతి! శాంతంగా మాట్లాడుకోండి!

'అహహా! వ్యవస్థాకురాలట! వ్యవస్థాపకురాలు!' రామప్రియకు చిన్నప్పటి నుంచే పోట్లాడటంలో మంచిశిక్షణ లభించింది. తలుపుచాటునుంచి దడాలుమని బయటికొచ్చి చేతులు గాలిలో ఊపుతూ గర్జిస్తుంది—'రోజూ అర్ధరాత్రిపూట అమ్మగారు తనగది తెరుస్తుంది! పెట్టె తాళంచేతు లెక్కడున్నాయి? గోదాములో ఏమున్నాయి, వస్తువులన్నీ అమ్మేసి సొమ్ము చేసుకున్నది.'

లక్ష్మి ముక్కుపుటాలు అదురుతాయి. ఎవరో వెనకనుంచి పేముబెత్తంతో వీపుమీద ఒక్కసారిగా చరిచినట్టయింది. అర్ధరాత్రి గది తెరుస్తానా?....వస్తువులన్నీ అమ్మేసి సొమ్ము చేసుకున్నానా?.... హే సద్గురు! ఏ పాపానికి నాకీ శిక్ష విధించావు?

'రామదాసూ! ఈ గుంటనక్కనోరు మూయిస్తావా లేదా? లేకపోతే వ్యవహారం ముదురుతుంది, మీకు కావలసిందేమిటి? పెట్టె తాళంచేతులా, వాటికోసం మీ గుండెలు అంతగా పీకుతుంటే తీసుకోండి!' లక్ష్మి పెట్టె తాళపుచేతులు విసిరి కొడుతుంది.

రామప్రియ మహంతు గదిలోనుంచి గఁయ్ గఁయ్ మంటున్నది.... రామప్రియ గంట కొట్టినట్టు మాట్లాడేస్తుంది. ఆమెమాటలు కారంలాగా చుర్రుమంటాయి. ఆమె మాటలువింటే దేహానికి వణుకు పుడుతుంది. మాటల్లో అంత.... 'తీక్షణత!'

'వసీ లేదూ పాటూ లేదు - కూర్చొని మెక్కుతూ మాట్లాడితే 'మహాత్మాగాంధీ' అంటూ ఉపదేశాలు వల్లెవేస్తూ ఉంటాడు ఈ బాలదేవ్! పళ్ళువంచి ఒక చెంబెడు నీళ్లుకూడా పోయడు. చెట్టూ చేమకు! ఇక ఆ రాణీగారున్నారంటే—వయస్సు తప్పినా వయ్యారం తప్పలేదు! అద్దంముందు కూర్చొని సింగారించుకుంటూ ఉంటుంది! అమ్మకు వాసనసబ్బులు కావాలి. ఘుమాయించే సంపెంగ నూనెలు కావాలి!—నేను మట్టికొట్టుకొని వున్నానట! నాకు మనస్సులో మలినం లేదు! పైపై మెరుగులు పెట్టుకుంటే సరిపోయిందా? లోపలో? రామరామ! రాత్రి అంతా మోహంలో మోహంబెట్టి శరీరానికి శరీరం అవించుకొని పడుకొని

ఉదయమే లేచి శుద్ధి చేసుకుంటే అది శుద్ధేనా ? పన్నెచీరె కట్టుకుంటేనే సంబరం. కాదు ! పన్నెలాడి ! కులుకులాడి ! బొంకులాడి !' రామప్రియ గంటమోగినట్లు మోగుతున్నది.

'రామప్రియా ! అవసవ్యపుమాటలు మాట్లాడకు ! తల నొప్పేస్తుంది.' రామదాసు విసుక్కున్నారు-'ఈపంగతి తెలిస్తే....!'

లక్ష్మి ఏమీ మాట్లాడదు. మెదలకుండా కన్నార్పకుండా విమ్మచెట్టువైపు చూస్తున్నది.

రామప్రియ ఒక్కొక్కమాట శూలంలాగా ఆమె మర్మస్థలంలో గుచ్చుకున్నది....వాసననబ్బులు కావాలి. సంపెంగనూనెలు కావాలి....మహంతు సేవాదానువల్లనే ఈ చెడ్డ అలవాటు కలిగింది. తాను సబ్బులేకుండా స్నానం చెయ్యదు. సబ్బులేనిది మనస్సు శుభ్రపడదు. కేశరంజన తైలం తలనొప్పిగా వున్నరోజునే ఉపయోగిస్తుంది... మహంతు పూర్ణియా కోర్టునుంచి తిరిగివస్తూ సంచిలో నూనె, సబ్బు, కిస్‌మిస్, అక్రోటుపళ్లు తదితరపళ్లు తెచ్చేవారు. కొత్తవస్తువు ఏది కన్పించినా కొని పట్టుకొచ్చేవారు.

....మహంతు సేవాదానువెంట వెళ్ళి తీర్థస్థలాలన్నీ సేవించి వచ్చింది. ఈ నరకాన్ని అనుభవించేందుకేనా ? ఛీ ఛీ ! పదిరోజులనుంచి ప్రసాదమే రుచించడం లేదు. మొదటిరోజే పీళ్ళు చేపలకంపు కొట్టాయి. ఇప్పుడు పీళ్ళుతాగితే వాంతి వచ్చేస్తున్నది.....మఠానికి వచ్చేరోజున రామప్రియకల్లి చేపలకూర కూతురికి దట్టించి తినిపించింది. హే సద్గురు !....ఏ కార్యమైనా ఆచరించు; మార్గాన్ని భ్రష్టం చేసుకోవద్దు....తాను రేపే మఠంనుంచి వేరయిపోతుంది. మహంతుగారు తనపేర ముప్పైఏకరాలభూమి, ఒక అంటుమామిడితోటా రాసి వెళ్ళారు. వీటిమీద మఠానికి ఎటువంటి అధికారమూ లేదు. ఒక వారంరోజుల్లో ఈ వ్యవహారం తేలిపోవాలి. సద్గురు కృపవల్ల !

లక్ష్మి కళ్ళఎదుట స్వప్నలోకంలాంటి దొకటి కన్పిస్తున్నది. మామిడితోట! తోటలో రెండు కుటీరాలు ! తను రాట్నం వడుకుతూ, బాలదేవ్‌జీ 'బీజక్' పారాయణం చేస్తూ !....

'బాలదేవ్‌జీ! ఈ ఆసనాన్ని త్యజించండి.'

బాలదేవ్ లక్ష్మి మొహంలోకి అర్థహీనమైనదృష్టితో చూస్తారు. ఆమె కళ్ళల్లో ఆయన కరిగిపోయినప్పుడల్లా ఆయన మొహం ఇలాగే అర్థభావహీనంగా మారిపోయింది. ఆసనం త్యజించవలసిందేనా?

'ఆఁ త్యజించవలసిందే! ఇక్కడుంటే ధర్మానికి ముప్పువస్తుంది.' లక్ష్మి కళ్లల్లో గిర్రున నీరు తిరిగాయి.

అరే! జోగియా కే నగ్నరిపేమతి కోయీ
ఆహో పంతో....జోరేదపేసో....జోగియా కోయీ!
డిమ్ డిమిక్ డిమిక్, డిమి డిమిక్ డిమిక్!

## ఏడు

రోజురోజుకీ కమల అందం ద్విగుణీకృత మవుతున్నది.

మెడపక్కన ఏర్పడ్డ రెండురేఖలు ఆమె ముఖమండలానికి మరింత ఆకర్షణను తెచ్చిపెట్టాయి.

కన్నులలో కనిపించేది చాంచల్యత కాదు, ఒకరకమైన మత్తు! అకస్మాత్తుగాచూస్తే కళ్ళల్లో కాటుక వున్నదేమో ననిపిస్తుంది.

'అమ్మా! ఏ డాక్టరు . ఏ డాక్టర్ స్పృహకప్పిపోతున్నారు. అర్ధగంట నుంచి గోడవైపుకు అదేపనిగా చూస్తున్నారు.' కమల తనగదిలో తన కేశాలని సరిజేసుకుంటున్నది. తల్లి కొంచెం గద్దింపుగా—'కమలా! డాక్టరుగారు కూర్చున్నది ముందుగదిలో!' అని అన్నది.

'అయితే ఏం?'

చాలారోజులనుంచి ఆమె కమలతో....మరీ అంత అన్యోన్యత మంచిది కాదని చెప్పాలనుకున్నది. ఆమె మొహంలో చూసేప్పటికి ఏమనిపించిందో ఏమో తల్లి నోటివెంట మాటేరాలేదు. మైనంలా కరిగిపోయింది. అరచేతులు, పాదాలు

మనోజ్ఞమైన అరుణిమను ఒలకబోస్తున్నవి! శరీరం సజీవ సువర్ణచ్ఛాయలు విరజిమ్ముతున్నది. కన్నులలో ఒక అపూర్వమైన కాంతి గోచరిస్తున్నది. ఏమిటిదంతా? వణికిపోతుంది తల్లి! ఇదేమిటే అభాగ్యురాలా! కొంపతీసి తప్పటడుగు ఏమీ వేయలేదుగదా! అమ్మా. అలాంటిపని చెయ్యకు!

....తనకేమైనా పిచ్చి పట్టిందా ఏమిటి? తనకూతురు పవిత్ర కమలమ్మ తల్లిలాంటిది!....ఆమె ఎలా వర్తించినా ఫరవాలేదు! తల్లి పెదిమలమీద మళ్ళా స్వాభావికమైన చిరునవ్వు తొలకరిస్తుంది.

'ఏ వ్యాధి తను తీసేసుకున్నాదేమో?'

'అహ్హ హ్హ!' డాక్టరు తన నవ్వును ఆపుకోలేకపోయాడు—'అహ్హ హ్హ!' కమల తెర తొలగించి మొహం బయటికిపెట్టి—'ఏయ్! నవ్వకండి! మీ కవలే ఇబ్బు చేసింది. తెలిసిందా?' అని అన్నది.

తాసిల్దారు పావుకోళ్ళచప్పుడు వినిపిస్తుంది. ఆ నవ్వువింటూ ఆయన తన పనేం జేసుకుంటాడు?

డాక్టర్‌కు తాసిల్దారు రెండురూపాలూ అవగతమయ్యాయి. ఇంటిసంగతులు, కోర్టువ్యవహారాలు, ఇచ్చి పుచ్చుకునే లెక్కలు చూసుకునేప్పుడు ఆయన అదో మాదిరిగా ఉంటాడు. ఇంట్లో తీరికగా కూర్చొని రామాయణ భాగవతాది గ్రంథాలను గురించి మాట్లాడేప్పుడు, దేశరాజకీయాలు, ఇంట్లో రాజకీయాలు మాట్లాడేప్పుడు ఆయనరూపం వేరుగా ఉంటుంది. హాస్యప్రియుడుగా, రసికుడిగా, గృహస్థుగా అమాయకమైన వ్యక్తిగా గోచరిస్తాడు.

డాక్టర్‌కు ఆయన మొదటిరూపం నచ్చదు. రెండోరూపం ఆయనను ఎంతగానో ఆకర్షిస్తుంది.

'ఏమిటండీ సంగతి?' తనూ దాపిస్వారస్యాన్ని అనుభవించాలనే ఉద్దేశ్యంతో భార్యను అడుగుతాడు—'పిల్లిద్దరూ ఎలాగూ చెప్పరుగాని ఏమిటి సంగతి?'

'మీ కూతురినోటికి ఏమాటవస్తే ఆమాట అనేస్తుంది!....డాక్టరుగారికి స్పృహ తప్పిపోతున్నదని అన్నది!'

'ఓహో, అలాగా!' తాసిల్దారు నవ్వాపుకుంటూ టీ తాగుతూ-'అ తరువాత!' అని అన్నారు.

తల్లి నవ్వాపుకొని అన్నది—'అప్పుడు నేనన్నాను—పీ జబ్బు తను తీసేసు కున్నారేమో, అని!' డాక్టర్‌గారుకూడా విన్నారు!'....

'అహ్హ హ్హ హ్హ హ్హ!' తాసిల్దారు అలా నవ్వినప్పుడల్లా 'నాన్నది అల వ్యంగావచ్చే పద్ధతియానవ్వ'ని గేలిచేస్తూ ఉంటుంది కమల!

తాసిల్దారుకూడా కమల స్వభావంలో చాలా మార్పువచ్చినట్టు గమనించారు. అటువంటిపిల్ల తండ్రి మెదలకుండా కూర్చున్నారు. ఏమీ ఎట్టనట్టు! ఏమీ చెయ్య లేకపోతున్నారు. భగవాన్ శంకర్! కమలను కరుణించు ప్రభో!

డాక్టరు తాసిల్దారు నవ్వు ఒక్కసారిగా కరిగిపోవడం గమనించారు. పరీ క్షగా!....ఇది బహుశా ఆయన మూడో రూపం! రాళ్ళుకూడా కరిగిపోయే కారుణ్య రూపం!

'డాక్టరుగారూ!' తల్లి రెండు ప్లేటుల్లో ఫలహారం తెస్తుంది-'కమల రేడి యోలో అమధ్య 'మటర్ పులావ్' విని వచ్చింది!'

'ఓహో! అయితే ఇది ఆల్ ఇండియా రేడియోవాళ్ళ వ్యవహారమా! అయితే కానివ్వండి డాక్టరుగారూ, మొదలుబెట్టండి. చూశారా, బటాణీ గుగ్గిళ్ళను ఎంత తెలివిగా మటర్ పులావు చేశారో!'

'ఏదో ఒకటి! పులావు అని పేరు బెట్టారు. అందుకు సంతోషించండి!' డాక్టరు కమలవైపు నవ్వుతూ చూశాడు.

'అహ్హ హ్హ హ్హ!'

ఈ హాస పరిహాసాల్లోబడి డాక్టర్‌గారు తన కర్తవ్యంనుంచి విముఖుడు కావడం లేదుగదా! అని అప్పుడప్పుడు ఆయన ఆలోచిస్తూఉంటాడు - అతను చేసేపనికి అతని హృదయతంత్రి అపశ్రుతిని వినిపించడం లేదుగదా!....అతడు ఏం చేస్తున్నా - తప్పో, ఒప్పో, అది అతనికి ఎంతో బావున్నది.

ప్యారూ శాలాసార్లు చెప్పాడు, ముందువైపుకు తెరుచుకునే కిటికీకి పరదా

ఉంటే బావుంటుందని। ఖాళీగా ఉన్నట్టుంటుంది. అందుకే డాక్టరుకు ప్యారీ అంటే అంత ఇష్టం.

....కమల రోజూ డాక్టర్‌దగ్గరకు వస్తున్నది.

'పిచ్చి ఏమన్నదో తెలుసా ? .. నువ్వు పొరపాటు చేస్తున్నావమ్మాయ్ అని అన్నది - మీ రిద్దరూ పొరపాటే చేస్తున్నారు. తరువాత ఏమవుతుందో ఆలోచించారా, కొంచెమైనా ?....ఏమవుతుందంటారు డాక్టర్ ? చెప్పరూ ?' కమల మామిడి ముక్కల్లాంటి కళ్ళల్లో మధువును నింపుతూ అడిగింది।

'చెప్పండి డాక్టర్। తరువాత ఏమవుతుంది ?'

'ఏమవుతుంది ? ఏమైనా చెడుగామాత్రం ఏమీ కాదు.'

'ఎప్పుడూ నువ్వు నాదగ్గరే ఉండకూడదా ?'

'మళ్ళా మతిభ్రమణం....'

'డాక్టర్। నువ్వు 'జిన్'వు కాదుగదా ?'

'జిన్నా ? 'జిన్' ఏమిటి ?'

'జిన్ అంటే ఒక ముస్లిం మాంత్రికుడు। మాంత్రికశక్తులవల్ల రకరకాల రూపాలు ధరిస్తాడు। పెళ్ళిగానిపిల్లల్ని, వితంతువులైన యువతుల్నిపట్టి భ్రమింప జేస్తాడు. బీదవాళ్ళకు ధనరాశు లిచ్చేస్తాడు. చిటికెలో ఏం కావాలంటే అది చేసే స్తాడు. బతికిస్తాడు; చంపేస్తాడు।' కమల గొంతుకింద ఏర్పడ్డరేఖలు రెండూ రూపులు మార్చుకుంటున్నాయి. ఆమెకు భయంగా వున్నదా ?.... ఒక్కసారిగా ఆమె డాక్టర్‌ను పట్టుకుంటుంది.

'అనవసరంగా ఎందుకలా భయపడతావు ? తలా తోకాలేని విషయాలను గురించి ఆలోచిస్తూ ఉంటావు।'

'అబ్బే। నాకేమీ భయంలేదు. నువ్వు మహామాంత్రికుడవైనా నాకు భయం లేదు. ....నేను విన్ను జయించాను.'

'అంతనమ్మకం ఏర్పడిందా ?' డాక్టరు కమలనేత్రాంలో మెరుస్తున్న ఆత్మ విశ్వాస స్పష్టమైనరూపును చూశాడు. ....కమలకు ఆరోగ్యం వచ్చేసింది। పూర్ణ స్వస్థత చేకూరింది।

'అరోజువ చేతులకు తొడుక్కొవివచ్చినా అ వగపేమిటి? మళ్ళా అ వగ పెట్టుకోలేదేం?'

'బాజావులా? దండకడియాలా?....ఏం? గొల్లపిల్లలాగా అవిపించావు గదూ? గోకులంలోవి గొల్లపిల్ల!' కమల ఉవ్వెత్తున నవ్వింది.

దీన్నే 'రాసలీల' అంటారు. మూళారా? రాత్రి పన్నెండుగంటలవేళ డాక్టరు కుంటివొకరు లాంతరు భుగభుగ మవిపించుకుంటూ కాపిల్దారుకూతుర్ని ఇంటిదగ్గిర దిగబెట్టిరావడావికి వెళుతున్నారు.

....పెళ్ళిచేసిపారేస్తే పోలా?....చూడ్డావికి దొర, దొరసావిలాగా ఉన్నారు. డాక్టరు ఎటువంటి మవిషేమిటి?

'డాక్టరు ఎటువంటిమవిషి?'....చౌకీదారు అగమూను అడిగారు. కటహా పోలీసుస్టేషను కొత్త ఇనస్పెక్టరు!

'అయ్యా! మంచిమవిషే. కావి....!'

'కావి ఏమిట్రా?' నాయాల, నగంమాట బయటికి, నగంమాట లోపల మింగేస్తావేంట్రా! నాయాల నా నంగతి పీకు తెలియదేమో? బట్చ్! నేను వేరే జిల్లావాణ్ణి అనుకుంటున్నావా? ఈ జిల్లావాణ్ణే నేను! తెలిపిందా? నాదగ్గర దాచి పెడుతున్నావా? కావి అన్నావు. ఏమిటా కావి?' కొత్త ఇనస్పెక్టరు గంగం మన్నారు. గాలివికూడా తిడతారు! 'నాయాల! రాత్రి బట్చ్....గాలికి....హవల్దార్! నాయాల విద్రే పట్టలేదు! హవల్దార్, ఏదీ అ పైల్ ఇలా ఇవ్వండి! ఏపేమి అడి గారో చూద్దాం! నా యాళ్ళు రోజుకొక కొత్తపార్టీ పెడుతున్నారు! మనప్రాణాలు తోడెయ్యటావికి!'

ఇనస్పెక్టరు కొంచెం ఉడుకురక్తంమీ దున్నారు. జిల్లాలోవి అయిదుగురు ఇనస్పెక్టర్లలో ఈయన ఒకరవి అన్నారు. మాట్లాడేప్పుడు 'నేను బయటివాణ్ణి కాదు, ఈ జిల్లావాణ్ణే!' నవి చెప్పడంమాత్రం మరచిపోరు. ఏ నందర్భం వచ్చినా ఇలాగే అంటాడు - 'నేనొక రూపాయితిన్నా, ఈ జిల్లాలోనే ఉంటుంది!' బయట నుంచి ఇక్కడికి వచ్చినవాళ్ళంతా ఏదో ఆయన వాటిలోనుంచి తినేస్తున్నారనే భావిస్తాడు.

....పారబిస్‌గంజ్ కొత్తనాయకుడు - ఛోటన్‌బాబు జిల్లాకాంగ్రెసు కార్య దర్శి అయ్యారు. ఈ డాక్టరు కమ్యూనిస్టు పార్టీవాడని ఆయన రాకాదట.

ఇనస్పెక్టరు ఆస్పత్రికి నాలుగువేపులా ఒక దళమమంది పోలీసుల్ని పెట్టించారు.

'మీ అసలు ఇల్లు ఎక్కడున్నదండీ?' ఇనస్పెక్టరు కొంచెం చికాకుపడి ప్రశ్నించాడు.

'విరాట్‌నగర్.'

'విరాట్‌నగర్ నేపాల్‌లో వున్నదిగా। మీరు నేపాలీయులా?'

'కాదు.'

'అయితే మరి.'

'మీ రెందుకంతా చిరాకుపడతారు? ఇనస్పెక్టరుగారూ? నేను చెప్పేది మీరు రాసుకోండి।'

'రాసుకోమన్నారు, బావుంది. ఏం రాసుకోమంటారు?'

'నేను మీకు చెప్పే సమాధానాలు?'

తాసిల్దారుగారికి ముచ్చెమటలు పోస్తున్నాయి. ప్యారూకి నోరెండిపోయింది. ఏమిటిది? ఏమీ అర్థం కావడంలేదు.....పిన్నిగుండె కొట్టుకుంటున్నది. అయితే, ఆశ్చర్యమైనవిషయ మేమిటంటే కమలమాత్రం చెక్కుచెదరలేదు. '....డాక్టరు గారికే ప్రమాదమూ ఉండదు. ఏం ఫరవాలేదు।' ఇది కమల దృఢ అభిప్రాయం.

ఇనస్పెక్టరు రెండుమాటల్లోనే డాక్టర్ని అర్థం చేసుకున్నాడు. 'ఈయన చాలా విచిత్రమైన మనిషిలాగా ఉన్నారు!'

సుమరితదాసును ఇవ్వాళ్ళ కుర్రవాడుసైతం ప్రశ్నించడం ప్రారంభించాడు- 'ఇనస్పెక్టరు డాక్టరుగారిని పట్టుకోవడానికి ఎందుకొచ్చారు?....ఎవరైనా లంచాలు తీసుకుంటున్నారని ఫిర్యాదు చేశారా?'

'ప్రపంచంలో ఎవరినీ నమ్మడానికి వీల్లేదయ్యా! రామాయణంలో చెప్పి నట్టు ఈ ప్రపంచం విషంతోనిండిన బంగారు కుండలాంటిది! ఈ డాక్టరు బర్మన్

వారని అంటున్నారు. సిద్ధాంతిగారు సరిగానే కలవిచ్చారు.....జర్మనీవాళ్ళ సి.ఐ.డి. ఈ డాక్టరు! ఇక్కడివాళ్ళకు ఇంజెక్షన్లు ఇచ్చి బలహీనపరుస్తున్నారు. నూతిలో మందుకలిపి కలరావ్యాధిని వ్యాపింపజేశారు. జర్మన్‌వారి పార్టీ ఒకటి వున్న దిక్కడ! 'కమనీన్'-'కామనిన్ పాటీ' అని అంటారు! ఈయన ఆ పార్టీమనిషే!'

ఈ ఇనస్పెక్టరు మాట్లాడే ధోరణికి డాక్టరు కొంచెం తికమక పడ్డారు. మాటకుముందు నేను ఈ జిల్లావాణ్ణే నంటాడు. మూర్ఖుడులాగా ప్రశ్నలు వేస్తాడు—'మీకు చాలామంది ఆడపిల్లలతో సంబంధం ఉన్నదనుకుంటాను!'

'అవును ఉన్నది; దాదాపు....నాలుగువందలమంది ఆడపిల్లలతో వున్నది.' డాక్టరు నవ్వుతూ అన్నాడు.

'నాలుగువందలే!' ఇనస్పెక్టరుకు ఆశ్చర్యంవేసినప్పుడు గుడ్లగూబ కళ్ళు లాగా ఆయన కళ్ళుకూడా గుండ్రంగా తిరుగుతాయి—'నాలుగు....! నాలుగు వందలు! 'ఛట్చ!' ఇంతమంది ఎక్కడ దొరికారు!'

'మెడికల్ కాలేజి హాస్పిటల్‌లో!'

'ఓహో! అదా! నే నడిగేది అదికాదు - గౌరవనీయమైన కుటుంబాలలోని పిల్లలు....!'

'ఆస్పత్రిలో గౌరవనీయమైన కుటుంబాలపిల్లలు ఉండరా!'

'నా ఉద్దేశ్యం....సరే, పోనివ్వండి! కమ్యూనిస్టులతో మీ కెలాంటిసంబంధం ఉన్నది!'

'నాకు చాలామంది మిత్రులు కమ్యూనిస్టులు!'

'మీరు సంథాల్‌వాళ్ళను రెచ్చగొట్టారు. పొలాలను బలవంతంగా ఆక్ర మించుకోమని చెప్పారు. సంథాల్‌వాళ్ళు ఇలాగని వాఙ్మూలాలిచ్చారు.'

'సంథాల్ తెగలవాళ్ళు అప్పుడప్పుడు వాళ్ళ పాతకాగితాలు, జడ్జిమెంటు వగైరా చదివించుకొనడానికి నాదగ్గరకు వస్తూఉండేవాళ్ళు....!'

'మీదగ్గరున్న పుస్తకాలు చూపిస్తారా!' ఇనస్పెక్టరు లేచి పుస్తకాలున్న అలమరదగ్గరి కెళ్లాడు!

....నాయాల, అన్నీ డాక్టరు పుస్తకాలే।....చిల్డ్రెన్ ఆఫ్ యూ. ఎస్. ఎస్. ఆర్; 'లాల్ రూస్-రచయిత: బేనీపురి! 'లాల్ చీన్' రచయిత: బేనీపురి!

'అవన్నీ రష్యా పుస్తకాలు।'

'రష్యా పుస్తకాలుకాదు, రష్యానుగురించి రాయబడ్డ పుస్తకాలు.'

'రెండూ ఒకటేగా!' ఇనస్పెక్టరు ఆ పుస్తకాల్ని తీసుకొని తిరగేస్తున్నాడు- పుస్తకాలపేజీలలో ఎక్కడైనా బాంబులు ఏమైనా వున్నాయేమోనని! చాలా జాగ్రత్తగా పేజీలు తిరగేశాడు.

....డాక్టరుగారు అరెస్టయ్యారు. అన్యాయం....సంథాల్ తెగలవాళ్ళను డాక్టరుగారే రెచ్చగొట్టారు. ఊళ్ళో కలరాకూడా ఆయనవల్లనే వచ్చింది....ఊళ్ళో వాళ్లను బలహీనపరచాడు....కలరా ఇంజెక్షన్ తీసుకోవడంవల్ల ఇప్పటికీ తల తిరుగుతూఉంటుంది. పైకి చూడడానికి అమాయకుడులాగా కన్పిస్తాడు; దేవత లాంటి మనిషి అనుకున్నాం. ఇంత చెడ్డవాడని మనకేం తెలుసు। సిద్ధాంతిగారు చెప్పనే చెప్పారు.

పారబిస్‌గంజ్‌నుంచి వచ్చినముట్టం చెప్పారు - వాళ్ళవూళ్ళోకూడా ఒక డాక్టరున్నాడట; దోపిడీలు చేయిస్తాడట! ఇంట్లోవాళ్ళకు నిద్రమాత్రలిచ్చి తన దళానికిచెందిన మనుషుల్ని దోచుకురమ్మని పంపిస్తాడట! ఊళ్ళోవాళ్ళకు ఇంజెక్షన్ ఇచ్చి మనుషుల్ని పిరికవంగా తయారుచేస్తాడు. ఏమైనా అంటే ఆవుర్న్ని. ఎర్లని మాయం చేయిస్తాడు. ఇళ్ళకు నిప్పు పెట్టిస్తాడు. కేసుబెట్టారు. కాని తప్పిచ్చి విడిపించుకొన్నాడు. పేరుకూడా చెప్పాడు - డాక్టర్ వటఖట్ ప్రసాద్ అట।

'అవును. ఎవరిని నమ్మడానికీ వీల్లేదు।'

'సోమాజట్ తాయ్‌గంజ్ తిరువాళ్ళలో అరెస్టయ్యాడు. మాదిగ సోమన్న అన్నాడు — 'తిరువాళ్ళనుంచి తిరిగొచ్చినవాళ్లు చెప్పారు....ఇక నేను గరిడీలో ఢోలు వాయించేదిలేదు।'

# ఎనిమిది

సిద్ధాంతి ఈమధ్య చాలా సంతోషంగా ఉంటున్నారు.

గ్రామస్థులు రోజూ అయిదుపర్యాయాలు నమస్కారాలు చేస్తున్నారు.... సిద్ధాంతి మహాజ్ఞాని. కలియుగం నిలిచివున్నదీ అంటే ఇలాంటి బ్రాహ్మణోత్తము లందరంవల్లనే! జ్యోతిషశాస్త్రం అంటే అంత తేలికైన విద్యకాదు. బ్రహ్మ తేజస్సు ఇప్పటికీ ఉన్నది. బంగారం మట్టిలోవున్నా తుప్పు పట్టదు.

'నమస్కారం సిద్ధాంతిగారూ!'

'రావయ్యా రా। ఏమిటి సంగతులు?'

'అయ్యా! నిన్న నా చిలుక కాస్తా ఎగిరిపోయిందండి. నవ్వుతూ నవ్వుతూ వెళ్ళిపోయింది.' దర్వానులవీధి హీరూ సిద్ధాంతికాళ్ళు పట్టుకుని ఏడుస్తాడు.

'ఏం జరిగిందో చెప్పు హీరూ!' సిద్ధాంతి ప్రశ్నించాడు.

'నా ముద్దులకొడుకు జీవానన్—నిన్ననే ఒక్కరోజు జ్వరంతో వెళ్ళి పోయాడు.' హీరూ తలమీద చేతులుబెట్టుకొని ఏడుస్తున్నాడు.

'నిన్న ఏమివారం? సోమవారం। సాయంత్రంపూట చనిపోయాడు గదూ?'

'అవునండి. సరిగ్గా సూర్యుడు అస్తమించేప్పుడు।'

'భూతంమాయ। తెలిసిందా? శుక్రవారం అమావాస్య. నీకు ఎవరిమీద సందేహం వుంటుందో. వాళ్ళింటి పెరట్లో కూర్చో. రాత్రి పన్నెండుగంటలకు దయ్యం బయటికొస్తుంది. నువ్వు వెంట వెళ్ళు. నీ కొడుకును బతికించి, చంకన బెట్టుకొని నాట్యంచేస్తుంది. అప్పుడు....! అప్పుడుగనుక నువ్వు నీ పిల్లవాణ్ణి లాక్కొగలిగితే - ఇంకెవరూ అతన్ని చంపలేరు....ఇంద్రుడి వజ్రాయుధంకూడా పూలమాలగా మారిపోతుంది.'

'నిజమేనండి! విషయం నాకర్థమైంది. అయిదుమాసాలక్రిందట - 40 వ సెక్షన్ వచ్చినప్పుడు మా బావమరిదిసహాయంలో వేమ చేస్తున్నపొలం నాపేర రాయించుకున్నాను. అప్పుడు పార్వతీతల్లి ఒకరోజున గోధుమలు కావాలనిపస్తే -

నే ఏవ్వనన్నాను. పొలం నా సొంతమని చెప్పాను. దాంతో వాకు కావ మిచ్చింది. ఆమె పదిబీఘాల పొలం నేనే పండిస్తున్నాను. ఆ కోపం మనస్సులో పెట్టుకొని రాక్షసి ఈ అన్యాయానికి ఆ పూనుకున్నది.'

'ఇదుగో హీరూ! ఏడవకు! మెదలకుండా వెళ్ళి అమావాస్యరాత్రి పన్నెండు గంటలకు నేను చెప్పినట్టు చెయ్యి!'

అమావాస్య రాత్రి।

పార్వతితల్లి పెరట్లో గంజాయి చెట్టున్నది. హీరూ ఆ చెట్టుదాటుకెళ్ళి కూర్చున్నాడు. గంజాయిఆకులు తుంచుకొని తిన్నాడేమో. మైకం కమ్ముతున్నది. కార్తీకమాసంలో రాత్రిపూట చలిగా ఉంటుంది. హీరూశరీరం చప్పగా చల్లబడింది. —'బయటికి రాదేం। లోపలే గుడుగుడుమని మాట్లాడుతున్నది. రా బయటికి....। ఇంట్లోనే నాట్యం చేస్తుందేమో? బయటికి రాకపోతే ఏం చెయ్యాలి? అప్పుడు? సిద్ధాంతి ఏమీ చెప్పలేదే।'

గణేశ్ సాయంత్రంనుంచే గొడవచేయడం ప్రారంభించాడు. నిద్రపోవడం లేదు. ఉండి ఉండి ఏమేమో అడుగుతున్నాడు. పిన్ని ఆలోచించి సమాధానాలు చెబుతున్నది.

'మామను జైల్లో కొడతారేమో!'
'కొట్టరు। దొంగల్ని కొడతారు!'
'అయితే ఎందుకు పట్టుకొన్నారు? జైల్లో ఎందుకు పెట్టారు?'
'గవర్నమెంటు ఇష్టం।'
'గవర్నమెంటు ఇష్టమా? నువ్వెందుకు అడగవు।'
'నిద్రపో బాబూ।'
'అమ్మమ్మా।'
'ఏమిటి బాబూ!'
'నన్ను బయటికి తీసుకుపో అమ్మమ్మా!....పంచెలు పోసుకోవాలి!'
'పద బాబూ!'

....ఖట్। తలుపు తెరుస్తుంది పిన్ని! గంజాయిచెట్టు కదులుతుంది. హీరూ ఒక

సీసా తల్లి తెచ్చుకున్నారు. గబగబా సీసా నోట్లో పెట్టుకొని తాగేస్తాడు !....ఆ(....
వచ్చింది బయటికి ! రాక్షసి ! సరీగ్గా పన్నెండుగంటలయింది !....బిడ్డలు సర్దుకుం-
టున్నది....నగ్నంగా తయారవుతుందా ఏమిటి ?....

—సటాక్ !....!

'అయ్యో !....బా... బూ!....గ-ణే-శ్ !'

'అమ్మమ్మా !'

—సటాక్ ! సటాక్ ! ఫట్ ! సటాక్ !

'గి గి గి గి....గి....గి....'

'అమ్మమ్మా !....కమలాదీదీ !.... అమ్మమ్మా !'

అంతటా శాంతి ! కాని జీవానంద్....హీరూ కొడుకెక్కడ ? హీరు మత్తు
ఒక్కసారిగా వదిలింది. జరజరమని ప్రవహిస్తున్న రక్తప్రవాహం చూసేప్పటికి
గడగడ వణకటం ప్రారంభించాడు. కర్ర చేతిలోనుంచి జారి కింద పడుతుంది....
హత్య....పోలీసులు....ఇనస్పెక్టరు....జైలు... ఉరిశిక్ష... హీరూ పారిపోయాడు.

అందరికంటే ముందు తాపిల్దారుగారొచ్చి గొడవచేస్తూ తుపాకి రెండు
మూడుసార్లు ఫైర్ చేస్తాడు ! ఠాంయ్, ఠాంయ్ !!

ఊరంతా మేల్కొన్నది. కుక్కల అరుపువల్ల ఏమీ వినిపించడంలేదు -
గల్లంతు ఎక్కడ జరుగుతున్నదో, ఏం జరుగుతున్నదో - అయోమయంగా
వున్నది. ఎవరివాకిళ్లోనుంచి వాళ్ళు అడుగుతున్నారు - రామదయాల్ ! అరేయ్
నాగేశ్వర్ ! ఏమిటది ?....తెలియదా ?

తాపిల్దారు బిగ్గరగా కేకేశాడు—'కాళీచరణ్ ! పార్వతి తల్లి కంఠంలా విని
పించింది. ఎవరూ బయటికి రారేమిటి ? ఏమయ్యారు మీరంతా ?'

పార్వతి తల్లా ?....అయ్యో పాపం ! రక్తపుమడుగులో తడిసిపోయింది !
ఊపిరి ఆడుతున్నదేమో చూడండి ! చచిపోయిందా లేక....! ప్రాణం ఉన్నది. ఈ
గణేశ్....? దంతంతో కొరుక్కున్నాడులా వుంది. గాయమైంది ! వీళ్ల తీసుకరండి.
హే భగవాన్ !....ఇదుగో కర్ర ! తాపిల్దారుగారి కివ్వండి ఆ కర్ర ! దీంతోనే
తెలిసిపోతుంది.

'ఆగమూ!' తాసిల్దారు పిలిచాడు—'వెంటనే నువ్వు పోలీసుస్టేషనుకు పరు గెత్తుకొని వెళ్ళరా। రేపటికి సమయానికి పూర్తిగా ఆస్పత్రికి వెళ్ళగలిగితే....!'

'అమ్మమ్మా! అమ్మమ్మా। మామా। డాక్టరుమామా!... దీదీ దీదీ।' గణేశ్ అదేపనిగా ఏడుస్తున్నాడు. కమల కన్నీటిని తుడుస్తూ గణేశ్‌ను వాళ్ళింటికి తీసు కెళ్ళింది .. కమలకు కబుర్లు చెప్పాడు. కమల చెప్పింది—'భగవంతుడు మనందరికీ తండ్రి ...ఆయన అమ్మమ్మను తనదగ్గరకు తీసుకెళ్లాడు।'

'ఆఁ!' వెక్కిళ్ళని ఆపుకోలేదు!—'అమ్మమ్మా। కమలాదీదీ! అమ్మమ్మా।'

...అయ్యో। అభాగ్యుడా। నీ కమలాదీదీ ఏడుస్తూ ఎక్కడికని వెడుతుంది? 'బాబూ గణేశ్।....మీ మామ వస్తాడు. ఏడవకు।'

హీరూ పట్టుబడ్డాడు....పట్టుబడకుండా ఎలా ఉంటాడు? ఉళ్ళో ఎవరెవరు ఎటువంటికర్రలు ఉపయోగిస్తారో తెలియకుండా ఉంటుందా। అందులోనూ హీరూ కర్ర అందరికీ గుర్తే। రాత్రే తెలిసింది - ఆ కర్ర చూసేప్పటికి। కాని భయంతో ఎవరూ మాట్లాడలేదు....పైగా అతని రెండుకాళ్ళూ రక్తంతో తడిసిపోయాయి. కడుక్కోలేదు కూడాను:....కొట్టినతరువాత శవాన్ని కొంతదూరం హీరూ లాగ టానికి ప్రయత్నించాడు. తెల్లవారేప్పటికి మనిషి పిచ్చివాడిలాగా భయంకరంగా తయారయ్యాడు।... చూస్తే భయమేసింది।

ఇంకా అతగాడు మరికొన్ని హత్యలు చేయగలడని అతనికళ్ళే చెబు తున్నాయి....నోటినుంచి చొంగకూడా కారింది। ఇనస్పెక్టరు అరెస్టు చేశాడు. ఇనస్పెక్టరు ఒక తన్నుతన్నాడు. హవల్దార్ మూడు హంటరుదెబ్బలు వడ్డించాడు। ఇక పోలీసులు బాగా చెంపదెబ్బలు వాయించారు—'నాయాలు మాట్లాడవేం? పేరు చెప్పరా? తండ్రిపేరు—నాయాల। ఖూనీకోరు యదవా? నరకంలోకూడా నీకు చోటు దొరకదురా - నాయాల।'

'నే నొక్కణ్ణే చంపాను।' అంటున్నా డతను।

'నాయాల। అంతపాటి ఆడదాన్ని నువ్వు ఒంటరిగానే చంపావా? తుపాకి గిపాకి నీదగ్గరేమైనా ఉన్నాయా?....'

'ఇదుగో పోలీసులూ। వదిలెయ్యండి!' సబ్ ఇనస్పెక్టరు చాలా మంచి

వాడులా ఉన్నాడు—'ఏం|రా నాయాల! ఉరికంబంకూడా ఎక్కువు। రెండు రోజుల్లో పిపవి అయిపోతుంది।'

ఇనస్పెక్టరు శవాన్ని పూర్తిగా కప్పేసి పల్లకిలో తీసుకెళ్ళేఏర్పాటు చేశాడు. ఒక చేతివేలుకూడా కప్పించకూడదు....అత్తరు, గులాబీనీళ్ళుకూడా చల్లారు..... శవంతో గణేశ్ కూడా వెడతాడా? ...ప్యారూకూడా వెడుతున్నాడు. పూర్ణియా ఛకాంచీ వస్త్రందగ్గర గణేశ్ పినతల్లి ఒకామె ఉంటున్నది. ఆమె ఇష్టపడకపోతే అనాథాశ్రమంలో....।

పిన్ని వెళ్ళిపోయింది; శాశ్వతంగా వెళ్ళిపోయింది।....

కమల కన్నీరు మున్నీరుగా ఏడ్చింది.

సిద్ధాంతికి పక్షవాతం వచ్చింది - సగంశరీరానికి। మొహం వంకరపోయింది. ఒక కన్ను మొత్తంగా మూడిపోయింది. మలమూత్రాలన్నీ మంచంలోనే। రామ నారాయణ్ ఆయనదగ్గర ఒంటరిగా కూర్చోవాలంటే భయపడుతున్నాడు. సంగతు లన్నీ రామనారాయణకు తెలుసు।....పార్వతి తల్లి హత్యజరిగిన రోజునుంచే ఆయన పరిస్థితి దిగజారిపోయింది, బాగా విరేచనాలయ్యాయి. మలంతో రక్తంకూడా పడింది. ఆ తరువాత శవం ఊళ్ళోనుంచి అటువెళ్ళింది, ఇటు పక్షవాతం వచ్చేసింది. పాపానికి ఫలితం ఇంత త్వరగా అనుభవించడం ఎక్కడా చూడలేదు। మలం నాలుగువీధుల చుట్టుపక్కల వాళ్ళకుకూడా ఎంత దుర్గంధపూరితంగా ఉంటున్నదంటే ప్రతివాళ్ళూ వాంతి చేసుకుంటున్నారు। నరకం అంటే ఇదే కాబోలు?

... కాని సిద్ధాంతి చెప్పింది నిజమే।....పార్వతి తల్లి కేసువిషయమై ఇనస్పెక్టరు వచ్చినప్పుడు, 'ఇప్పుడే ఏమైంది? ఇంకా ముందు జరగవలసినవి చాలా ఉన్నాయి।' అని అన్నాడని తెలిసింది।

ఆ భగవంతుడికే తెలియాలి, ముందుముందు ఏమి జరగబోతున్నాయో ఏమో?

జై బాబా। జిన్ మాంత్రికుడా। గ్రామాన్ని రక్షించు। మహాత్మా।

# తొమ్మిది

దాసి లక్ష్మి బాలదేవ్‌తో మఠంనుంచి వేరయింది.

అంటుమామిడితోటలో రెల్లుగడ్డితో మూడు బంగళాలు లేచాయి. ఈ ప్రాంతంలో ఇదొక అద్భుతమైన కళ। రెల్లుగడ్డితో నాలుగువిట్టాళ్ళ ఇల్లు। అయితే భయం మల్లా - అగ్నిదే। అగ్నిప్రమాదాలు ఎక్కువగానే జరుగుతూఉంటాయి. ఆర్చి, వెదురుబద్దలతడికలు ఏర్పాటు చేశారు. పూలు ఇదివరకే ఉన్నాయి. తోట ఎంతో అందంగా తయారైంది. నాలుగువందల రూపాయలుబెట్టి రెండు ఆవు దూడల్ని మోతీచూర్ సంతనుంచి తెప్పించింది. చాలా చురుకుగావున్నాయి. చిన్న దూడలబండి తయారుచేయించింది. వాటిమెడలో ఇత్తడిమువ్వలు కట్టింది. ఝున్ ఝున్, టున్ టున్। ఝున్ ఝున్ టున్-టున్। బాలదేవ్ గోసాయిబండి బయలు దేరింది। ఝున్ ఝున్ టున్ టున్।

....బాలదేవ్ ఇప్పుడెంత శుభ్రంగా ఉంటున్నారు। తెల్లటి లాంగీ. నడుం దాకాఉండే కట్టుకునే చొక్కా। శరీరంకూడా శుభ్రపడింది. లక్ష్మి తన స్వహస్తాలతో సేవ చేస్తున్నది। మఠంలో కాకులు, మైనాపిట్టలు రెట్టలతోపాటు పిల్లల పెంటకుప్పలు పెరిగిపోయాయి. దుర్వాసన! రామప్రియ తల్లికూడా తన నలుగురు పిల్లలతో పగలంతా మఠంలోనే పడిఉంటుంది. భండారీవచ్చి మొత్తుకున్నాడు - 'అమ్మా। ప్రసాదంమీద కోరికే పోయింది, తాగేనీళ్ళల్లో చేపలు కదులుతున్నట్టు రోజూ కల వస్తుంది.... హే సద్గురూ।'

ఒక నెలరోజుల్లోనే రామప్యారి తన మాయాజాలంలో చిక్కించుకున్నది. మహంతు రామదాసును।

మహంతు ఈ జాలంనుంచి ఎలా తప్పుకోవాలో తెలియక కొట్టుమిట్టులాడుతున్నాడు. కాని రోజురోజుకు మరింత ఉచ్చులో బిగిసిపోతున్నాడు!....నిన్న తిట్టుకోవడం, కొట్టుకోవడంకూడా జరిగిపోయింది. మహంతు రౌతహట్ సంతనుంచి ఉదయం రూపాయిఎత్తు గంజాయి తెప్పించాడు. రాత్రి పడుకోముందు రామప్రియ మహంతుతో—'గంజాయి అయిపోయింది' అని అన్నది....అది వినేప్పటికి మహంతుకి శివం ఎక్కింది. 'ఆఁయ్। ఉదయమేగా తులం తెప్పించాను।'

రామప్రియ మహంతు మగతనం ఏపాటిదో అప్పటికే అవగతం చేసుకొన్నది. మెదలకుండా ఎలా ఉంటుంది? 'దమ్ము వేసుకునేప్పుడేమో నీకు స్పృహ ఉండదు. పగలంతా గుర్రపుతోక చిలుం నోట్లోనుంచి వేలాడుతునే ఉంటుంది!....'

'నోర్మూనుకో మాదిగముండా! మతాన్ని భ్రష్టంచేసి పారేశావు! హే సద్గురు!....లక్ష్మి చెప్పనే చెప్పింది....'

ఆ తరువాత రామప్రియ తల్లి, ఆమెపిల్లలు కలిపి చేసిన హంగామా ఇంతా అంతా కాదు!....మహంతు రామదాసు కప్పు అదిరిపోయేలా అరుస్తూ, పెద్ద గరిటె ఒకటి తీసుకొని నేలమీద అదేపనిగా మోగిస్తున్నాడు. రామప్రియ రాగాలుతీస్తూ ఏడుస్తున్నది—'ఓరి, నీ SS చే SS హం SS తులు మందిపోను!....నీకు కుష్టు రోగం తగలా! ఆ దగుల్బాజీ లక్ష్మి....'

'హే సద్గురూ! హే సద్గురుప్రభో!! నోరు మూస్తావా లేదా! నోర్మూయ్!'....

బాలదేవ్‌కు పార్వతితల్లి హత్యానంతరం రాత్రిపూట కొంచెం భయం భయంగా ఉంటున్నది. రాత్రి అంతా గుండె....దడదడ కొట్టుకుంటూనే ఉంటుంది. ఏదైనా చప్పుడయితే చాలు లేచికూర్చుంటాడు. 'నిర్మల చిత్తంమీద చెడు ప్రభావం పడ్డప్పుడు ఇలాగే అవుతుంది' అని లక్ష్మి అన్నది. బాలదేవ్ కళ్లు ఆ విషయాన్ని వ్యక్తంచేస్తూనే ఉన్నాయి.

డిమి డిమిక్ డిమిక్, ఝున్ ఝునుక్ ఝునుక్!

లక్ష్మి ఇవ్వాళ్ళ తానే ఖంజరు వాయిస్తున్నది. బాలదేవ్ ఆసనంమీద కూర్చున్నాడు. కిటికీలోనుంచి వెన్నెలవెలుగు ఒకటివచ్చి చిందులాడింది. గోడకు తగిలించిన దీపం సన్నని వెలుగులో లక్ష్మి కళ్లు సరిగా కన్పించడంలేదు.....

జ్వాలా విరహవియోగ్‌కీ కలేజ్ ఖాయ్
ప్రేమీ మన్ మానై నహీఁ దరసన్‌కో అకులాయ్!

బాలదేవు కన్నార్పకుండా లక్ష్మివైపే చూస్తున్నాడు. ఖంజరు వాయిం చేప్పుడు లక్ష్మి ప్రతి అవయవమూ నాట్యం చేస్తూన్నట్లుగా అనిపించింది. మోకాళ్ళ మీద కూర్చున్నది....! 'ఇందర్‌సభ' నాటకంలోని పాటలాగా ఉన్నది....మాటి మాటికీ పార్వతితల్లి శవం మనస్సులో మెదులుతున్నది.....బాలదేవ్ కళ్ళు మూసు

కుంటాడు....లక్ష్మి శరీరంనుంచి వెలువడే సువాసన ఈరోజు మరింత ఎక్కువగా ఉన్నది. లక్ష్మి కంఠం కంపిస్తున్నది....ఏడుస్తున్నది? అరే! కళ్ళల్లో కన్నీరు? లక్ష్మీ!

'లక్ష్మీ! లక్ష్మీ! విలపించకు లక్ష్మీ! 'బాలదేవ్ బాహువుల్లో ఇంత బల మున్నదా?....లక్ష్మిని తన బాహువుల్లో బంధించుకున్నాడు! లక్ష్మి ఇంకా పాడు తూనేవున్నది—

ఈ ఇల్లూ వాకిలి పరులదై పోయె
హే సాధువూ!
బహు దుఃఖాన్ని పొందితివి ప్రియుడు లేక!
ధిమిక్ ధిమిక్ ధిమిక్!
ఝన్ ఝునుక్ ఝునుక్!
ఒకేగృహంలో ఒకేచోట విరహిణితో ఉండెను కాంతుడు
ప్రేమతో నన్ను నన్ను ఎప్పుడు చేరదీస్తాడా
అని ఎదురు చూస్తున్నాను నేను!

ఝన్ ఝన్ ఝనుక్, ఝునుక్! ఘల్లుమని ఖంజరు చేతిలోనుంచి జారి పోయింది. బాలదేవ్ పెదిమలమీద మొదటిసారిగా అటువంటి చిరునవ్వును చూసింది లక్ష్మి! గోధుమరంగు ముఖమండలం, కొద్దిగా పెరిగిన గడ్డం మీసాలు!....

....బాలదేవ్ పాదాలవేళ్ళకు కళ్ళతోతాకుతూ లక్ష్మి అతని కళ్ళల్లోకి చూస్తుంది—'సద్గురోన్నమః!'

## పది

కామ్రేడ్ వాసుదేవ్, సుందర్‌లాల్‌కూడా అరెస్టు అయ్యారు. ఎందుకు అరెస్టు కారు? సంవత్సరం క్రిందటివరకు ఈ సుందర్ బనీనుకూడా వేసుకునే స్థితిలో లేనివాడు. ఈ వేసవిలో కోటు, ప్యాంటు, బూటు, మేజోళ్ళు, నల్ల కళ్ళ జోడూ పెట్టుకొని కటిహార్ జంక్షన్ ప్రయాణీకులగదిలో కూర్చుంటే ఎవరికైనా

అనుమానం వేస్తుంది. ఒక ప్యాకెట్టు సిగరెట్లుకొని పదిరూపాయలనోటు మార్చారు....అర్ధగంటలో ఇద్దరూ దాదాపు అక్కడ అమ్ముకునేవాళ్ళందర్నీపిలిచి వస్తువుల బేరం చేశారట! 'ఏయ్ చాయ్‌వాలా! విన్పిస్తున్నదా? పల్లెటూరివాళ్ళ మనుకుంటున్నావా?... చాయ్ తీసుకరా, బిస్కట్లు తింటావా సుందర్? ఏయ్! ఈ థర్డుక్లాస్‌బిస్కట్లు తింటావా? 'కటిహార్ స్టేషన్‌లో అమ్ముకునేవాళ్ళు చాలా తెలివి గల ఘటాలు! ఈ సంగతి అందరికీ తెలుసు. వాళ్ళు చాలామందిని చూశారు. కాని ఇలాంటివాళ్ళను చూడలేదు. అడుక్కునేవాళ్ళకు నాలుగణాలిచ్చి-వెళ్ళండి. కొను క్కొని తినండి.'....యుద్ధంరోజుల్లో అమెరికన్లు ఇలాగే సిగిరెట్లు, బిస్కట్లు ఇస్తూ ఉండేవారు. సి.ఐ.డి.లు ప్రతిచోటా ఉంటారు. వెంటనే ఇద్దర్నీ అరెస్టు చేశారు. ఆ భగవంతుడికే తెలియాలి, ఎప్పుడు ఏం జరుగుతుందో.

సిద్ధాంతి చెప్పినదాంట్లో సత్యం లేకపోలేదు—'ఇప్పుడే ఏమైంది. జరగ వలసినదంతా ముందున్నది.'

వాసుదేవ్ కాశీచరణ్ పేరుకూడా చెప్పారట.

'ఆఁ, కాశీచరణ్ ఎక్కడున్నాడు?'

'మంగళాదేవిని కటిహార్ తీసుకెళ్ళాడు.'

మంగళాదేవి కటిహార్ వెళ్ళిపోయింది. చర్ఖా సెంటర్ ఎత్తేశారు. కటి హార్‌లో దూరపుబావ ఒకాయన వున్నాడు. కాశీచరణ్ అక్కడికే తీసుకెళ్ళాడు. పార్టీ ఆఫీసులో సుమరేన్ అన్నాడు—'నీమీదకూడా వారంటు ఉన్నదని తెలిసింది.'

'వారంటా?'

'అవును! వాసుదేవ్, సుందర్ నీపేరుకూడా చెప్పారట. కొంచెం జాగ్ర త్తగా ఇంటికి వెళ్ళు.'

'వాసుదేవ్? సుందర్? దగుల్బాజీలు, దొంగలు.'

కాశీచరణ్ చీకట్లో బంగళాతోటలో దాక్కున్నాడు - కొంచెం రాత్రి అయ్యాక ఇంటికి వెళ్ళవచ్చునని. వాసుదేవ్, సుందర్ - ఇద్దర్నీ సోమా ఎంతో ముందుకు తీసుకొచ్చాడు. అయితే - దోపిడిజరిగిన మూడురోజులకు కాశీచరణ్‌కు విషయమంతా తెలిసిపోయింది. కార్యదర్శితో చెబుదామని పూర్ణియా వెడితే ఆయన

పాట్నా వెళ్లాడు. చరిత్రతో స్నేహంగా ఉండడంవల్ల తుపాకుల పిస్తోళ్ళు వాసు దేవ్‌కు లభించాయి....కాళీకి జైలంటే భయంలేదు. పార్టీకి ఎంత చెడ్డపేరు?

....పాట్నాలోని పెద్దపెద్దనాయకులకు మొహం చూపించేదెలాగు? అన్నీ పటాపంచలయిపోయాయి। ఎవరో వస్తున్నారు....।

బంగళాతోట దగ్గర్లోనే చీకట్లో చేథరూ కప్పించాడు. ఏవో మూలికలకోసం వచ్చాడు. ఊళ్ళో పోలీసులున్నారని చెప్పాడు.

కాళీచరణ్ చేథరూచేతిలో రెండురూపాయలుబెట్టి—'మా అమ్మ కివ్వు। ఇదుగో ఈ రూపాయి నీకు!' అన్నాడు.

మూలికలవని వదిలేసి చేథరూ ఊళ్ళోకి పరుగెత్తాడు....విప్లవకారుల్ని పట్టిస్తే పెద్ద బహుమానం దొరుకుతుంది। వెంటనేవెళ్ళి ఇనస్పెక్టరుకు వర్తమానం అందజేశాడు—'కాళీచరణ్‌ను నేను బంగళాతోటలో చూశాను।'....ఇనస్పెక్టరు మిలిటరీని వెంటబెట్టుకుని అక్కడికి వెళ్లాడు. వాళ్ళు రాకముందే కాళీచరణ్ పారిపోయాడు.

'ఇక్కడనుంచి పడమరదిక్కుగా వెళ్లారండి। ఫోడ్‌పాడావైపు।' అని చేథరూ చెప్పాడు.

ఖేలావన్‌సింగ్ యాదవకు పొద్దు ఎదురైంది। ఈమధ్య కాళీచరణ్‌తో కొంచెం పూసుకొని తిరిగాడు. 'దోపిడిచేసిన ధనం తప్పకుండా మీ ఇంట్లో ఉండి తీరాలి. ఎందుకంటే మీరు వాళ్ళకు ఇల్లు కట్టించి ఇచ్చారు। ఏమంటారు?' ఇనస్పెక్టరు రెట్టించాడు.

ఖేలావన్‌సింగ్ యాదవ్ పరిస్థితి ప్రస్తుతానికి దిగజారిపోయింది. బాగా వున్నరోజుల్లో మనిషి మట్టిపట్టుకున్నా మాణిక్యమవుతుంది. పూలమ్మినచోట కట్టె లమ్మవలసినపరిస్థితి వచ్చినప్పుడు తాడే పామవుతుంది. మిత్రులు మొహం చాటే స్తారు. ఎటుచూసినా చెడే ఎదురవుతుంది. తాసిల్దారుదగ్గిర పదిహేనువందలు చేబదులు తీసుకొన్నాడు....కమలానది ఒడ్డునున్న పదిబీఘాల పొలం తాకట్టుపెట్టి మరో వెయ్యికూడా తీసుకొన్నాడు. విన్నానే అరరియా బైరగాఛీనుంచి కబురొచ్చింది - సకల్‌దీప్‌గాడు అమ్మమ్మ పెట్టెలోనుంచి పదితులాల బంగారం దొంగి

లించి ఎక్కడికో పారిపోయాడట!....మదనపూరు తిరునాళ్ళకు కలకత్తానుంచి వచ్చిన ఒక థియేటరు కంపెనీలో ఒక కులుకులాడికూడా వున్నదని. ఆమె నకల్ దీవ్‌ను తనవలలో చిక్కించుకున్నదని తెలిసింది. నకల్‌దీవ్ మామ అశ్విన్‌బాబు పేరు ప్రతిష్ఠలున్న మనిషి కావడంవల్ల ఎట్లాగో వాణ్ణి పట్టి తీసుకురాగలడు.... శేలావన్‌భార్య గొడవచేసింది—'దర్గాదగ్గర ఒక గుడిసె ఒకటి వేయించమని మూడుసంవత్సరాలనుంచి పోరుకాడుతుంటే వేయనేలేదు. కాశీచరణ్ ఒకమా టన్నాడో లేదో నాలుగునిట్లాళ్ళు దావిడి వేయించిఇచ్చాడు!

'జిన్ పీర్లబాబా! తప్పుకాలో! మా అబ్బాయికి బుద్ధి రావాలి. 'శిరసీ' నై వేద్యం పెట్టించి, ఒక తులం గంజాయి కానుకగా ఇస్తాను.'

మహగూదాసు ఇంటికి ఖలాసి వచ్చాడు....పులియా వళ్ళంతా పుళ్ళు అయి పోయింది. పాయింట్‌మన్‌దగ్గిరకు కబురంపిస్తే బదిలీఅయి వెళ్ళిపోయాడని తెలి సింది—నేపాలీలు సరిహద్దుఆయన బథ్‌నాహా అనేచోటికి! మంచాలూ కంచాలూ అన్నీ అమ్మేశాడట! గవర్నమెంటు ఉద్యోగంలోవున్నవాళ్ళకు బదిలీ అయితే ఉన్న వస్తువులన్నీ ఇలాగే అమ్ముకుంటారు. కొత్తచోటుకెళ్ళి కొత్తవస్తువులు కొనుక్కుంటారు!....అయితే ఆడంగుల్నికూడా వదిలేస్తారా ఏమిటి? ఖలాసీకి వర్త మానం తెలిపి వెంటనే వరుగెత్తుకొచ్చాడు. ఎవరేమన్నా. ఖలాసీ తప్పేమీలేదు. తప్పంతా పులియాదే, పెళ్ళికి ఎందుకు ఖర్చుపెట్టాడు పాపం! పగలంతా రైల్వేలైను దగ్గర పనిచేసేవాడు; ఇక పాయింట్‌మన్ వున్నాడంటే 'లైన్‌క్లియర్' ఇచ్చేసి రైలెళ్ళిపోయాక వచ్చి పులియాదగ్గర కూర్చునేవాడు! చివరకు ఖలాసీతో పోట్లాడి పారిపోయింది. ఇందులో ఖలాసీ తప్పేమీలేదు! ...చేసినపాపం దాగుతుందా? ....వళ్ళంతా పచ్చి పుండయిపోయింది...ఇప్పటికీ ఇంకా స్పృహలేదు. పులియాకు! రామప్రియ రోజూ ఆమెదగ్గిరి కొచ్చేది. పులియా రామప్రియకు - మహంతుతో ఏ ఏ సమయాల్లో ఎలా వ్యవహరించుకోవాలో, ఎలా మాట్లాడాలో ఏమిటో వాటికి సంబంధించిన కిటుకులు చెబుతూవుండేది.

'నేను ఎంతోమందికి ఉష్ణానికి మందిచ్చి బాగుచేశాను! ఇప్పుడు నా భార్యకు మందిచ్చి బాగుచేసుకోలేనా?....మూడురోజుల్లో తగ్గిపోతుంది. అయితే - ఉష్ణమైతే

తగ్గిపోతుంది గాని. దాంతో ఏదో ఒక శరీర అంగంకూడా చచ్చుబడిపోతుంది - కన్నో, ముక్కో, చెవులో, దంతాలో, చేతివేళ్లో ఏదో ఒకటి.' అని ఖాసీ అన్నారు.

'ఈ ఊరికి కోతిదయ్యం పట్టింది. ఈ దయ్యంపడితే ఊళ్ళో వాళ్ళెవరూ బతకరు. ఈ వూళ్ళో కోతి ఏమైనా చచ్చిపోయిందా?' అని గ్రామాన్నిగురించి ఖాసీ చెబుతూ ప్రశ్నించారు.

'అవునవును! డాక్టరు రెండు మూడు కోతుల్ని పెంచారు. రెండుకోతులు చచ్చాయి, ఇంజెక్షన్ ఇచ్చారో ఏమో!'

'ఆ డాక్టరు అంత పాపాత్ముడు కూడాను! గ్రామాన్ని నాశనంచేసి వది లాడు!'

'ఏం ఫరవాలేదు' ఖాసీ అన్నారు—'నేను రాత్రికి చక్రంవేసి పూజచేసి ఈ గవ్వకు కడతాను. దోషమంతా మటుమాయ మవుతుంది!'

రమజాదాను చావిట్లో చక్రపూజ చేశారు.

....బియ్యం, గడ్డి, జవాపుష్పాలతో చక్రంవేసి మధ్యలో ఒక మట్టిప్రమిద పెట్టి అందులో పెద్ద వత్తిఒకటి వెలిగించారు. ఒక సీసా సారాయితాగి ఖాసీ కూర్చొని, మధ్యమధ్యలో దీపాన్ని నోట్లో పెట్టుకుంటున్నారు....బాబోయ్! ఈ ఖాసీ నిఖార్సయిన భూతవైద్యుడులాగా ఉన్నారు. అరెరె! నాలుకకు సూది గుచ్చు కొన్నారు, అటువైపునుంచి ఇటువైపుకు!

హే ఢాకినీ

హే శాకినీ!

హూం...హూం...హూం...హూం

గౌరీ పార్వతీ మహాదేవ!

నిజం పలుకు!

—ఫూత్...ఫూత్...!!

హ్రీం హ్రీం - హ్రీం హ్రీం....

'ఇక మీరంతా గానం చెయ్యండి।'

గ్రామంలోని భక్తులందరూ దేవీ ఆరాధనకు సంబంధించిన కీర్తన పాడ తారు।

ధి ధినక్ తి ధినక్।

ఆరాపి దీపపు వత్తిని నోట్లో పెట్టుకుంటున్నాడు...మళ్ళి వెలిగిస్తున్నాడు; ....పావురాన్ని పచ్చిదే తినేస్తున్నాడు.... పెద్ద భూతవైద్యుడే ఈయన।

## పదకొండు

'ఏమండోయ్, మిమ్మల్నే!'

తాసిల్దారు నిద్రపోయేప్పుడు బాగా గురకపెడతాడు - గుర్ర్ గుర్ర్ర్....। కమలతల్లి మంచం దగ్గిరికొచ్చి నిలబడుతుంది. ఆమె భయంభయంగా వున్నది— 'ఏమండోయ్। మిమ్మల్నే।'

'ఆఁ! ఊఁ! ఏమిటి?'

తల్లి నెమ్మదిగా మంచంమీద కూర్చుంటుంది....

....తాసిల్దారు మరింతా గాభరాపడిపోతాడు—'ఏమిటి సంగతి?'

'ఏమీలేదు!' గొణుక్కుంటూ చెబుతుంది—'కమల....కమల....చిచ్చు..!'

'ఆఁ।' తాసిల్దారుకు కమలబట్టలకు నిప్పు అంటుకున్నట్టు, ఆ నిప్పులో ఆమె మండిపోతున్నట్టు భావించాడు.

'కమల మనింటికి చిచ్చుబెట్టింది. ఇప్పుడు దానికి నాలుగో మాసం।'

తాసిల్దారూ, ఆయనభార్య ఇద్దరూ దీర్ఘంగా నిట్టూర్చారు.

'హే భగవంతుడా।'

'ఇప్పు డేమిటి చేయడం?'

'మీరే ఆలోచించండి।'

'మీ కెలా తెలిసింది?'

'నాకు క్రిందటినెలలోనే కొంచెం అనుమానం వేసింది. ఇవ్వాళ్ళ అడిగే వ్పటికి మొహం వేలవేసింది....డాక్టరు మంచివైద్యమే చేశాడు_ తలెత్తుకోకుండా! ఏమిచెయ్యాలి ?

తాపిల్దారు మొహం వాడిపోయింది. కళ్ళముందు ఏవేవో భయంకరమైన దృశ్యాలు ఒక్కొక్కటే కన్పించి కనుమరుగవుతున్నాయి - ఆయన మొహంమీద వల్లటి రంగు! జనం చప్పటుకొట్టి గేలిచేస్తూ వెంట పరుగెడుతున్నారు ?

'నేను మొదటినుంచి మొత్తుకొంటూనేవున్నాను - ఇంతటిస్నేహం పనికి రాదని! నిప్పూ గడ్డి ఒకచోటవుంటే ఏమవుతుంది?....ఆ డాక్టరేమో నీ ముద్దుల కూతురిమీద ఏదో మాయమంత్రం చేశాడు! ఇప్పుడుకూడా ఏదో అంటున్నది– 'డాక్టరు అన్నాడూ....అని !'

'డాక్టరు ఏమన్నాడట?' తాసిల్దారుకు కొట్టుకపోతూన్న ప్రవాహంలో ఏదో ఆసరా దొరికిన ట్టనిపించింది.

'స్పష్టంగా ఏమీ చెప్పదు. ఏం జరిగినా మంచే జరుగుతుందని డాక్టర్ అన్నా డని అంటున్నది.'

'మంచి జరుగుతుందా? ఊఁ....మంచి....! దుర్మార్గుడు! పాపాత్ముడు ! కృతఘ్నుడు! లుచ్చా!....మెడకు తాడేసుకొని చచ్చిపో! అంతకంటే చేసే దేముంది ?'

'నేనుమాత్రం నిశ్చయంగా చెప్పగలను–నా కూతురి తప్పేమీలేదు !' తల్లి ఏడుస్తుంది - 'కమల తప్పేమీలేదు! డాక్టరే మాయమాటలుచెప్పి దాన్ని నాశనం చేశాడు !'

కమల తన మంచంమీద పడుకొనివున్నది. మాటిమాటికీ డాక్టరు గుర్తు కొస్తున్నాడు. డాక్టరు నవ్వడం, మాట్లాడడం, పోట్లాడడం, తియ్యటిమాటలు చెప్పడం, చేతుల్లో బంధించుకొని....! ఆమెకళ్ళల్లో కన్నీరు ఉబుకుతుంది. కాని, డాక్టర్ చెప్పాడు - ఏం జరిగినా మంచే జరుగుతుంది! మంగళప్రదమవుతుంది ! ....ఒకవేళ డాక్టర్‌కి శిక్షపడితేనో ! అమ్మ ఏడుస్తుందెందుకు ? మహాభారతంలోని

కుంతిని, దేవయానిని, అహల్యను, ద్రౌపదిని ఎవరు వేరు....? డాక్టరు మనిద్దర్నీ ఎవరూ వేరు చేయలేరని అన్నారు।

'డాక్టరు ఏమన్నారు?' తాసిల్దారు ఉదయం టీ తాగుతూ అడిగారు—'డాక్టరు ఏమన్నాడో కమల నడుగు।'

'మనిద్దర్నీ ఎవరూ వేరు చేయలేరని డాక్టరు అన్నారని అన్నది.'

'అది సరేలే।' తాసిల్దారు మండుతున్న హృదయాంతరాళాన్ని నిగ్రహించుకొని అన్నారు—'ప్రశ్న అదికాదు, ఆయన జైలులో వున్నాడుగదా, ఎంతశిక్ష పడుతుందో ఏమిటో ఏమీ తెలియవుగదా। పైగా మగవాడిని నమ్మడం ఎట్లా?.... కమలదగ్గర ఆయన రాసిన ఉత్తరాలేమైనా ఉన్నాయా?'

తాసిల్దారు చట్టసంబంధమైనవిషయాల్లో ఆరితేరిన ఘటం। తెల్లకాగితంమీద మీరు 'క' రాసి వదిలిపెట్టినా, దానికి ఏదో ఒక రూపంకల్పించి పాట్నా హేండ్ ప్రింట్ ఎక్స్‌పర్ట్‌కుకూడా పట్టుబడనివిధంగా దస్తావేజువిషయాలు సృష్టిస్తారు.

'ఉత్తరాలున్నా ఇవ్వదు. నన్ను స్టోరు రూంలో మూసివేసి ఉంచండి, నాకు జబ్బుగావున్నదని ఎలాగూ జనానికి తెలుసుగదా! ఈలోపు డాక్టరు రానేవస్తారు!' అని అంటున్నది. 'ఈ పిల్లమాటలు వింటుంటే మనస్సుకు బాధగా ఉంటుంది, అమ్మా। నా పొరపాటుకు ఏదో ఒకశిక్ష లభించవలసిందే। ఇంట్లోనే నాకు 'జైలు' శిక్ష విధించు। అని అంటుంది.'

'ఇష్!' తాసిల్దారుహృదయం ఒక్కసారిగా వేదనతో నిండిపోతుంది—'కమలని ఒకసారి నా ఎదుటికి పిలుస్తావా? ఏమంటావు?....ఒకసారి మాట్లాడాలని వున్నది।'

రోజురోజుకీ కమల మొహం అరుణిమను నింపుకుంటున్నది. మొహం మెరుస్తున్నది. అయితే ఈరోజు ఆమె తల కిందికి దించుకున్నది. మెదలకుండా వచ్చి పరదావాటున నిలబడింది.

'అమ్మా।'

'...........'

'ఇటురా దీదీ। నీ తప్పేమీ లేదమ్మా!'

'వద్దు నాన్నా। నా మొహం మీకు చూపించలేను। నన్ను స్టోరు రూమ్‌లో బంధించండి.'

కమల ఏడుస్తుంది. వెక్కి-వెక్కి ఏడుస్తుంది!

మరో మార్గాంతరంకూడా లేదు.

'ఈ డాక్టరు డాక్టరు కాదు. 'జిన్' దేవతా మాంత్రికుడు।.... ఒకసారి పిన్ని 'జిన్ పీరు' కథ చెప్పింది.' అని కమల అన్నది.

'భయం వేయడం లేదా?'

'లేదమ్మా। డాక్టరు ఎప్పుడూ నాదగ్గరే ఉంటాడు. నాకు భయం వెయ్యదు. ఎప్పుడూ ఏకాంతంగా, చీకట్లో ఉండాలనిపిస్తూ ఉంటుంది. అమ్మా। డాక్టర్ తప్పేమీ లేదు. ఇందులో! ఆయన నిజంగా దేవతలాంటివాడు।'

జిన్ మాంత్రికదేవత ప్రసన్నమై సమస్తం ప్రసాదిస్తాడని చెబుతారు. ధనం, పొలం, ఏది కావాలంటే అది! ఇక తీసుకున్నా అలాగే తీసుకుంటాడు. ధాన్యపుగాదెలో ఎలుకలు చేరుతాయి, పొగాకుతోటల్లో ఆకు రాలిపోతుంది.... పెషన్ కేసులో ఇరుక్కోవలసినపరిస్థితికూడా ఏర్పడవచ్చు। తాసిల్దారు కొంచెం లెక్కవేసి చూస్తారు–డాక్టరు వాళ్ళింటికి వస్తూ పోతూఉండడం ప్రారంభించినప్పటినుంచీ ఆయనకేదో రూపంలో ఆదాయం వస్తూఉండేది। అందరికీ నష్టం వచ్చినప్పుడు కూడా తనకు లాభించింది. ఊళ్లో అంత పెద్ద కేసుజరిగితే తనకొక పైసా ఖర్చు కాలేదు. పైగా అయిదువేలు వచ్చిపడ్డాయి. చేతిలో! ఖేలావన్, రామక్రిపాల్‌సింగ్ వగైరాల పొలాలు పట్టీ పుత్మ్యాపికి దొరికినట్టే। కమల చెప్పినదాంటో సత్యం లేక పోలేదు - డాక్టర్ 'జిన్' దేవత।

కమలకు ఒక వారంవరకు బాగానే వున్నది. సంతోషంగా కాలం గడిపింది. కొన్నిపుస్తకాలు తెప్పించుకున్నది. 'విషవృక్షం' 'ఇందిర' 'రాజసింహ' 'ఆనందమఠం' 'దేవదాసు' 'శ్రీకాంత' 'రంగభూమి' 'గోదాన్'....హరి మోహన బాబు 'కన్యాదానం' డాక్టరుగారి అలమారలోవున్న పుస్తకాలివే।....ఇంకా వుంటాయి। తీయించండి. ప్యారూతో చెప్పండి!'

స్టోరు రూంపై కిటికీలగుండా చంద్రుడు తొంగిచూస్తున్నాడు. శరత్కాలపు

వెన్నెల! చంద్రుడు మేఘాలచాటుకి వెళ్ళిపోయాడు!....దుర్గామాత వచ్చే సూచన లభించింది. దేవి ఈ పర్యాయం దేనిమీద ఆరూఢమై వస్తుందో?... ఏనుగుమీద వస్తుందేమో!

## పన్నెండు

జై! దుర్గామాతాకీ జై!

చంపాపూరు కుమారరాజా ఈసారి పెద్దపెద్ద కుస్తీ ఆటగాళ్ళను పిలిపించాడు. చంపాపూరు రాజప్రాసాదం కుస్తీలకు, వేటలకు, సంగీత సాహిత్యాలకు పెట్టింది పేరు.

ముసలి మహారాజావిషయం వదిలెయ్యండి. ఇప్పుడూ తక్కువేమీ కాదనుకోండి! విశ్వకవి రవీంద్రుడు ఇక్కడ జరిగిన సాహిత్యగోష్ఠి కార్యక్రమంలో 'రాజారాణి' అనే తన ప్రసిద్ధరచనను వినిపించాడు. పైయ్యాజ్‌ఖాన్ ఇక్కడ తన గానమాధుర్యంతో శ్రోతులను ఉక్కిరిబిక్కిరి గావించాడు! వృద్ధమహారాజా వేట విషయంమీద పుస్తకాలు లిఖించాడు....!

ఈసారి పంజాబ్ పహల్వాను ముష్తాక్ శిష్యుడు చాంద్ వచ్చాడు. బావుంటుంది. కాళీచరణ్ జనమంతీదగ్గర ఏదో ఊళ్ళో తలదాచుకుంటున్నాడు. దూరపు బంధువులింట్లో ఉంటున్నాడు. ఆ ఇంటియజమాని మంచి తెలివిగల బుర్ర. పేరు మార్చి రుస్తమ్‌ఖాన్ అని పెట్టాడు. రుస్తుమ్‌ఖాను పొగాకు దళారి అని, తూర్పువాడని చెప్పారు, అందరితోనూ! తీరా చాంద్‌వచ్చి కుస్తీకి సిద్ధమయ్యేప్పటికి తగిన జోడుకాడు దొరకలేదట!....కాళీచరణ్‌కు కోరిక పుట్టింది....చంపాపూరు తిరునాళ్ళలో ఈ కుస్తీ జరుగుతుంటే జనం అదేపనిగా తోసుకోవడం, ఒకరిద్దరు చనిపోవడం, ప్రతిసారి జరుగుతూ ఉంటుంది.

ఈరోజుకూడా మళ్లా చాంద్ లంగోటీ కట్టుకొని రంగంలోకి దూకాడు. చుట్టూ తిరిగిచూశాడు. కాళీచరణ్ జనంలోనుంచి అతన్ని చూశాడు—'ఆహా! ఏం శరీరం! నీముందు ఎవరైనా దిగదుడుపే! వాహ్వా! ఏమికండలు!'

....ఆఁ? ఇవ్వాళ్ళకూడా ఆయనతో కుస్తీకి ఎవరూ లేరా? జై జై దుర్గా మాతకి జై! ఇతగాడితో కుస్తీ పట్టేవాడు లేనేలేడు. జై!

ఛెంపోం ఛెంపోం ఛెం ఛెం! పోం పోం పోం!

చటాక్ చటధా చటధా గిరధా!

'ఆహా! రారా! రావోయ్, రావోయ్!' హాఫ్‌షర్ట్, పైజామా చింపి ముక్కలు ముక్కలుచేస్తూ కాశీచరణ్ మైదానంలోకి ఉరుకుతాడు.

'అరెరె! పిచ్చివాడు! పిచ్చివాడు! తన్నండి! తన్నండి!'

'అబ్బెబ్బే! లోపల చెడ్డీ వున్నది!'

....వాహ్వా! శభాష్: మంచిజోడు కుదిరింది.

....ఎవరు? రంగంలోకి ప్రవేశించే పద్ధతిచూసే అందరూ ఆశ్చర్య పోయారు.... అందరూ ఒకరినొకరు చూసుకుంటారు....'సరైన జోడా!'

'మండల్‌గారూ! ఊరూ పేరూ అడిగి త్వరగా కుస్తీపోటీ ప్రారంభించండి!'

మేళతాళాలన్నీ ఆగిపోయాయి, ఒక్కసారిగా!....ఏమైంది?....కుస్తీ జరుగుతుందా, లేదా? పహల్వాన్ ముస్తక్ అలీ పెద్ద రాజకుమార్‌తో ఏమో చెబు తున్నాడు!....రుస్తుమ్ అలీ జోగ్‌బనీవాడా? కాదు కాదు, ఇక్కడివాడే, మంచి జోడా కుదిరింది!

చటాక్ చటధా! చటధా గిరధా!

'ఆహా! గురూ!....బతికిపోయాడు!! చూస్తే ఇతగాడు భలే చిచింద్రీలాగా ఉన్నాడే! చాంద్ నాట్యం చేస్తున్నాడు, రుస్తుం నవ్వుతున్నాడు....కాశీ....రుస్తుమ్ నవ్వి చిన్నగా ఎగురుతాడు! చాంద్ అగస్మాత్తుగా దాడిచేశాడు.

'రా ర్రా ర్రా! ఈ రుస్తుమ్‌ఖాన్‌కూడా తక్కువవాడేమీకాదు! మంచి మంత్ర తంత్రాలు తెలిసినవాడిలాగా ఉన్నాడు. చాంద్‌కు తెలిసినవాడేనా?'

'తెలియదు! అతడు పంజాబీ, ఇతడు ఇక్కడివాడు!'

ఇనస్పెక్టరు చూడడంలేదుగదా!....ఏమో! ఏదో ఒకటి త్వరగా తేలి పోవాలి!....

'రా ర్రా ర్రా!....రా హా హో హో జై జై!'

వెనుక ఉన్నవాళ్ళు ఎగిరెగిరి చూస్తున్నారు. దగ్గర్లోవున్న చెట్టుకొమ్మ ఒకటి విరిగింది. ఏమైంది?....అయిపోయిందా?....ఎవరు? గజమున్నర చిన్నవలయంలో రుస్తుమ్ తిరిగి చాంద్‌ను పీటే చేశాడు.

'ఎక్కడికి వెళ్లాడు? రుసుమ్ ఎక్కడికి వెళ్లాడు?' పెద్ద రాజకుమార్ పిలుస్తున్నాడు. 'రుస్తుమ్!... జనాన్ని అవతలికి తొయ్యండి. రుస్తుమ్ ఎక్కడికి వెళ్లాడు?'

....వగలవ ర్తకుడికి విలువైనరాయి ఏదో దొరికినట్టుంది!....కాదు. చేతికి అందబోతూవుండగా జారిపోయింది. ఎక్కడికి వెళ్ళాడు?...

రుస్తుమ్ జాడలేకుండా వెళ్ళిపోయాడు.

చాలామందికి అనుమానం వేసింది—వజ్రంగి చలిత్తర్ పేరు మార్చుకొని కుస్తీకి దిగాడేమోనని! 'ఎర్రజెండా' మహాత్మ్యం! అతనికి ఓటమి అనేదిలేదు.

తిరునాళ్ళలో కరపత్రాలు పంచిపెట్టారు - 'కమ్యూనిస్టుపార్టీ 'ఎర్రజెండా'ను పిలబెట్టిన చలిత్తర్‌మీద వారంటును రద్దు గావించాలి!'

కాశీచరణ్ తన బంధువులవూరినుంచి ఫార్‌బస్‌గంజ్ వెళ్ళిపోయాడు. సెక్రెటరీ అతనను కలుసుకోవటం ఇష్టం లేదట! అయినా కలుస్తాడు. సెక్రెటరీ-కాశీచరణ్ పార్టీసభ్యుడుకాదు. కిసాన్‌సభ రెండజాలమెందరని అన్నారట! అవన్నీ తెలుసుకోవాలి. ఆ రాత్రి పార్టీ ఆఫీసులో వున్నారు. ధర్మపురీకూడా కనిపించలేదు. బొంబాయి వెళ్లాడట! కాశీచరణ్ విషయాలన్నీ వివరించాలనుకొన్నాడు.

'ఎవరూ? నువ్వా? కాశీ!' మంగళ భయపడుతూ భయపడుతూ తిరిగి సంబాళించుకొన్నది—'ఏమిటీ వేషం. నువ్వేను? దబ్బారేకుల నుబ్బారావులాగా? లోపలికి రా! భయంలేదు.... నేనొక్కదాన్నే ఉన్నాను'

కాశీచరణ్ అనుకోకుండా వచ్చేశాడు మంగళను కలుసుకుందామని!

కాశీచరణ్‌ను ఒక పురాతన రైల్వేక్వార్టర్ లోపలిగదిలో కూర్చోబెట్టి మంగళా చెంబూ గ్లాసూ తీసుకొని నీళ్ళపంపుదగ్గరకు వెడుతుంది....కాశీచరణ్‌కు అక్కడ చర్ఖా. ఏకే విల్లు కట్పించాయి. మంచంమీద కంబళి. కంబళిమీద తెల్లటి

ఖాదీదుస్తులు వున్నాయి....అతనికి విశ్రమత్తుగా వున్నది. రాత్రిఅంతా రెండెడ్ల బండిలో పేల్కొని ప్రయాణం చేశారు. రైల్లోకూడా పై బల్లమీద పడుకొని వచ్చారు....చెంబూ గ్లాసు మెరుస్తున్నాయి. చల్లటినీళ్ళు?....నిమ్మకాయ షర్బత్!

మంగళ గ్లాసు అందిస్తూ నవ్వుతుంది—'నేను దబ్బారేకుల సుబ్బారావనే అంటాను! రుస్తుమ్ అలీ జోగబనిమిల్లులో ముసలి సర్దారు పేరు!

కాశీచరణ్ గ్లాసు చేతిలోకి తీసుకొని మంగళవైపు పరీక్షగా చూస్తాడు. మంగళ ఎంత బలహీనంగా వున్నది? రంగుకూడా కొంచెం మారింది!

'జాగ్రత్త! హేండ్స్ అప్!'

ఠట్ ఠట్ ఠట్ ఠట్!

....ఇనస్పెక్టరు పిస్తోలు పుచ్చుకొని ఎదురుగా నిలబడ్డాడు. పదిమంది పోలీసులు తుపాకులు బారుచేసి ఫైర్ చేయడానికి సిద్ధంగావున్నట్టుగా నిలబడ్డారు!

'ఇనస్పెక్టరుగారూ! మంచినీళ్ళు తాగనివ్వండి!' మంగళాకు పోలీసులంటే భయం లేదు!

'మీరు....నువ్వు ఎవరు? ఏం చేస్తుంటావు? నిన్నుకూడా అరెస్టు చేస్తున్నాను.'

'ఇనస్పెక్టరుగారూ! ఈయనగారిని ముందు మంచినీళ్ళు తాగనివ్వండి!'

మంగళ తన సర్టిఫికేట్ ఆయనచేతి కందిస్తుంది.

'ఓహో! మీరు చర్ఖా సెంటర్‌లో పని చేస్తున్నారా?' ఇనస్పెక్టరు మంగళా సర్టిఫికేటుచూసి తిరిగి ఇచ్చివేస్తాడు.

'అవునండి! షేరీగంజ్‌లో పని చేసేప్పుడు ఈయనతో పరిచయమైంది. అందుకని!....!'

'నాయాలి గడ్డాన్ని పీకెయ్యండి! పీయమ్మ....'

'అమ్మయ్యో!' మంగళ వెంటనే తలుపు వేసుకున్నది.

తుపాకుల విచ్చుకత్తులమధ్య ఉన్నాడు కాశీ! షర్బత్తు తేవు వచ్చింది....వెళ్ళి పోలీసులారీలో కూర్చున్నాడు. కార్తీకమాసంలో నిమ్మలకు ఎంత సువాసనగా

ఉంటుంది! తలమీదినుంచి జరజరమని రక్తం కారుతున్నది. కాని అతని కేదో సంతృప్తిగా వున్నది. శూన్యంగా ఉన్నది!

నోట్లోకి హంటర్ పోనిస్తూ—'నాయాల! చావడానికి సిద్ధమేగాని విజం ఒప్పుకోడు! సోమాగాడుకూడా ఇంతే! ఏంరా!....చరిత్రగాడు సీయమ్మకు మొగుడటరా?'

కాశీచరణ్ చేతికున్న ఇనపసంకెళ్లు ఒకసారి ఘల్లుమని మోగాయి. గాయపడిన పిక్కలు నొప్పిగా వున్నాయి. కళ్ళల్లోకి నెత్తురు ఉబికింది....కాని....సరే! అతనిపార్టీకి చెడ్డపేరు వచ్చింది. అన్నిటికి సహించక తప్పదు.

'పంపించు నాయాల్ని! వాసుదేవ్, సుందర్‌కు రెండు చెంపదెబ్బలు తగిలించేప్పటికి ఉన్నదంతా వెళ్ళగక్కారు! వాళ్ళదేముందిలే! గవర్నమెంటు సాక్షులయ్యారు. ఇద్దరూ విడుదలవుతారు. చచ్చేది వీళ్ళిద్దరే!....దోపిడి 'విత్ మర్డర్!'

విమ్మషర్పత్!....తేపు లింకా వస్తూనేవున్నాయి. కాశీచరణ్‌కు!

మంగళా! నన్ను మన్నించు!'

## పదమూడు

బాలదేవ్ చాలాకాలం తరువాత రామక్రిష్ణ ఆశ్రమానికి వచ్చాడు. చాలా మారిపోయింది, ఆశ్రమం. మనుషులుకూడా మారిపోయారు. ఆశ్రమం వరత కూడా చెడిపోయింది. ఇప్పుడు వంటశాలలోనే కూర్చొని చేపలూ, గుడ్లు తినేస్తున్నారు. లెక్కలరాసే క్లర్కు సెక్రెటరీ అయ్యాడు.—'చేపలు, మాంసం ఆశ్రమంలో వండటానికి వీల్లేదు. అయితే పట్నంనుంచి వండిన మాంసం, చేపలు తెచ్చుకొని ఇక్కడ తింటారు! ఇందుకు అభ్యంతరం ఎందుకుండాలి?'

'అవును, అభ్యంతరం ఉండకూడదు!' బాలదేవ్ అయోమయంలో పడి ఆ సెక్రెటరీ మొహం చూశాడు—'కాని ఇదివరలో ఆశ్రమం ఆవరణలోకి అవి వచ్చేవి కాదు!'

'ఈ కొత్తగా కట్టిన వంటగారం ఆశ్రమంచోటులో లేదు. కుబేర్‌సాహు చోటులో ఉన్నది. ఇప్పుడు మీకూ స్థలాలూ పొలాలూ ఏర్పడ్డాయిగా. మ్యునిసిపల్ కాగితాలూ, పటాలూ చూడాలనేకోరిక ఉండిఉంటుంది?....మ్యునిసిపల్ ఆఫీసు క్లర్కు దగ్గరికెడితే అన్నీ చూపిస్తారు తెలిసిందా?' పారబిన్‌గంజ్ కొత్త నాయకుడు ఛోటన్‌బాబు అన్నారు.

బాలదేవ్ తికమకపడి అతనివైపు చూస్తారు....ఛోటన్। పారబిన్‌గంజ్‌కి చెందిన ఈ బచ్చాగాడు ప్రతిదానికీ కుండ బద్దలుకొట్టినట్టు నోటికొచ్చినట్లల్లా పేలుతున్నాడు! వీడికింత తలపొగరా?....అబద్ధాలపుట్ట వీడు। ఇంకా నాలుగురోజులుంటే - ఈకెలూ తోకలూ దులిపి నూకల్లో కలుపుతాడు। ఇందుకు సందేహం లేదు।

'ఛోటన్‌బాబూ! పత్రాలూ కాగితాలు నాకక్కర్లేదయ్యా। నేనంటున్నది - రామక్రిష్ణబాబు కాలంలో....!'

'రామక్రిష్ణబాబుకాలం ఆయన కాలంచేయడంతోనే తీరిపోయింది।' ఛోటన్‌బాబు నౌకరు ఘుటరా గుంటతీసి గంట కొట్టినట్టు మాటాడాడు—'ఇది కాంగ్రెసు ఆఫీసు, బైరాగుల మఠం కాదు!'

బాలదేవ్‌కు తల తిరిగిపోయింది.

పాచిపట్టి, పుచ్చిపోయిన పళ్ళు ఇకిలిస్తూ, లేచి వయ్యారంగా అటూ ఇటూ తిరుగుతూ - 'ఆశ్రమంలో వున్నదంతా భగవదార్పితమే! అవుతుందండి।... ఇంతకూ ఎప్పుడైనా ఖంజరు వాయించారా?' అని అడిగాడు.

'అహ్హ హ్హ హ్హ హ్హ।' అందరూ ఒక్కసారిగా పెద్దపెట్టున నవ్వారు.

చన్నన్‌పట్టీ గూదర్—'బాలదేవ్! ఇక నువ్వు మనవూరు వచ్చావంటే కులంలోనుంచి వెలివేస్తారు।' అని అన్నాడు.

'బాలదేవ్ మేరీగంజ్‌లో ఏకాంతసేవ వదిలి గ్రామాని కెందుకొస్తారు?.... అక్కడాయన ఆముదపువృక్షం!'

'అహ్హ హ్హ హ్హ హ్హ హ్హ!'

బాలదేవ్ కళ్ళల్లోకి కన్నీళ్ళు వచ్చాయి. ఆ సమయానికి దోరిక్‌శర్మ వచ్చి వుండకపోతే బిగ్గరగా ఏడ్చివుండేవాడే। శర్మ రావడంతోనే - 'ఏమిటి ! బాలదేవ్‌జీని మీరంతా ఎగతాళి చేస్తున్నారా?' అని అడిగాడు.

'ఎగతాళి చేయడంలేదండి, సత్యాంగత్యం జరుపుతున్నాం।' ఘోటన్‌బాబు నవ్వుతూ అన్నాడు.

శర్మ దగ్గర్లోనేవున్న ఖాళీకుర్చీలో బాలదేవ్‌ను కూర్చోబెడుతూ అన్నాడు—'బాలదేవ్‌జీ నేను సమాధానం చెబుతా కూర్చోండి।... ఘోటన్‌జీ। మీరు సత్సంగ సమావేశం అంటున్నారే? ఈ బాలదేవ్, దోరిక్‌శర్మ, సేవాలాల్, ఫగువా, సహదేవ్, బౌన్‌దాస్, ఉజాయా, చున్నీదాస్, ఫిరథీ, జగర్‌నథియా, ఛేదీ, గంగారామ్ మొదలైనవాళ్ళ సత్యాంగత్యఫలితమే మీలాంటివాళ్లు అవతరించడానికి అవకాశం ఏర్పడింది. మీరు ప్రస్తుతం చెవార్‌లెట్ కారుమీద నాయకత్వాన్నిగురించి నేర్చుకుంటున్నారు. ఏడేసిరోజులు తిండీతిప్పలు లేకుండా వందేసిమైళ్ళు కాలినడకన ప్రతిగ్రామానికీవెళ్ళి కాంగ్రెసుజెండాను ప్రతిష్ఠించింది ఎవరో మీకేమైనా తెలుసా? మూమెంట్‌రోజుల్లో మీరు చేసిందేమిటయ్యా అంటే - స్కూల్లో పంచమజార్జి ఫోటోను పగులకొట్టారు; హెడ్‌మాష్టరు ఆఫీసుకు తాళంబెట్టారు। దీంతో మీరు లీడర్లు అయిపోయారు। ఈ రహస్యం మాకూ తెలిపివుంటే మేమూ ఫోటోలు పగులగొట్టేవాళ్ళం ! జమీందార్లు, పోలీసులు మమ్మల్ని నానాహింసలు పెట్టారు. కొన్నిసందర్భాల్లో గ్రామప్రజలుకూడా మమ్మల్ని తన్ని తగిలేసేవాళ్ళు ! మీకీ విషయాలన్నీ తెలియవు ఘోటన్‌బాబూ। అప్పటికి మీ రసలు పుట్టారో లేదో? అప్పుడు మీ నాన్నగారు కల్లుదుకాణాల కంట్రాక్టు చేస్తూఉండేవారు।....ఎన్నోసార్లు ఆయన మమ్మల్ని దండబూతులు తిడితే సహించాం.

....ఏం బాలదేవ్। గుర్తున్నదా?....

గూదర్ రంగుల మార్చులంలో మహామేటి ! ఉప్పు సత్యాగ్రహంరోజుల్లో నంచి తగిలించుకొని తిరుగుతూఉండేవాడు—'శర్మగారూ గిద్వాస్ సంతలో....'

'నోర్మూసుకోవోయ్।' శర్మ కోప్పడ్డాడు—'ఏ రోటిదగ్గర ఆ పాట పాడతావు! మీరందరూకలిసి బాలదేవ్‌ను ఎగతాళి చేసేంతటివాళ్ళయ్యారా? ఏమోయ్?

....బాలదేవ్ కొంచెం శుభ్రమైనబట్టలు వేసుకుంటు... ; మనిషి కొంచెం ఆరోగ్యంగా వున్నారు; చేతిలో నాలుగుడబ్బులున్నాయి - ఇదిచూసి మీరు సర్వ లేకుండా ఉన్నారు. పదండి వెళదాం; గంగూలీగారిదగ్గరకు వెళదాం; నేనూ ఆయనగారినిచూసి చాలా రోజులైంది!'

'ఇప్పుడు మీటింగు ఉన్నదిగా?' బాలదేవ్ అన్నారు!

'మీరూ భలేవారే బాలదేవ్‌జీ! మీలో ఏమార్పూ రాలేదు.... వెనకటిరోజులు కావివి! మీటింగులోఉండి మీరేం చేస్తారు? ఆ గొడవలన్నీ చూసుకోవడానికి ఒక వైపున ఖుశాయబాబు, మరొకపక్కన పగుపీసింగ్ ఉన్నారు. పోట్లాటలు, కొట్టుకోటాలు, కోర్టుకాగితాలమీద తర్జనభర్జనలు - ఇవేగా? రాత్రి అంతా ఈ మేళం జరుగుతూనే ఉంటుంది. పదండి వెళదాం!'

బాలదేవ్, దోరిక్‌శర్మ వెళ్ళిపోయాక గూదర్ కన్ను ఎగరేస్తూ - వీళ్ళు వెళ్ళేది గాంగులీగారి దగ్గరకా? 'తిరవతి భండార్'కు వెళ్ళి రసగుల్లాలు తినడానికి తీసుకెళుతున్నారు - బాలదేవ్‌ను!' అని అన్నారు.

'సెక్రెటరీతో మేరీగంజ్‌లో బాలదేవ్‌తో ఇక పని జరగదని చెప్పారు. అక్కడ సోషలిస్టుపార్టీ పాతుకుపోయింది. చర్ఖా సెంటర్ బాలదేవ్ కారణంగానే మూలబడింది. అందరూ దోపిడీకేసులో అరెస్టయ్యారు. ఆ వూళ్ళోవున్న డాక్టరు కమ్యూనిస్టు! నేనే అతన్ని అరెస్టు చేయించాను. కటహా ఇనస్పెక్టరు నా క్లాసు ఫ్రెండ్!' అని ఛోటన్‌బాబు అన్నారు.

'అయ్యో! ఒక్క ధర్మజ్ఞాని వెళ్ళారో లేదో, మరో 'మహా వేదాంతి' వేం చేస్తున్నారు!... ఈమధ్య ఈయన మరీ మంచిమనిషిగా మారిపోయారు!'

బావన్‌దాస్ వస్తూంటే ఆశ్రమంకుక్క-'బ్లాక్ ప్రిన్స్' దూరంనుంచే గుర్తిస్తుంది. అశోకవృక్షంకింద పడుకొని వచ్చేపొయ్యేవాళ్ళను చూస్తూఉంటుంది. బావన్‌దాస్‌నుచూసి చెవులు పైకెత్తి తోకాడిస్తూఉంటుంది.

... శశాంకగారు ఈ కుక్కపేరు 'బ్లాక్ ప్రిన్స్' అని పెట్టారు. సోషలిస్టు పార్టీ 'చినగారి' ఒక్కసారి 'ఎర్ర బావుటా'లో జిల్లాలోని ఒక మార్వాడీని 'బ్లాక్ ప్రిన్స్' అని రాశారు - అంటే 'బ్లాక్' చేయడంలో రాజాధిరాజని అర్థం!

మార్వాడి కేసు బెల్లాను 'ఎర్రబావుటా' ఎడిటర్‌మీద తనను కుక్క అన్నాడని ! బావన్‌దాసుకూడా [illegible] వీధలోకివచ్చి 'బ్లాక్ ప్రిన్స్'దగ్గిర కూర్చున్నాడు. అది ఆయనతో ఆడుకొన్నది.

'అహ్హ హ్హ ! బ్లాక్‌ప్రిన్స్ ! ఇదివరలో ప్రతి ఆదివారం విరళవ్రతం చేసే దానివి ! వీళ్ళుకూడా ముట్టుకునేదానివి కాదు ! ఇప్పుడు మాంసంముక్కలు లోం చేస్తున్నావని విన్నాను ! ఇందులో నీ తప్పేముందిలే ! ...నన్ను కొరికావు కూడాను !....నా సంచిలో ఏమీలేదు !' కేవూం కేవూఁ క్యూం.... నేలమీద వెల్లికిలా బడి కుయ్ కుయ్ మంటూ బావన్‌దాసు సంచి పళ్ళతో పట్టుకున్నది !

బావన్‌దాసు సంచిలోనుంచి ఒక కాగితపుపొట్లాం పైకి తీశాడు. బ్లాక్ ప్రిన్స్ మరింత ఎక్కువ చేసింది - కూతలుపెట్టడం ! గత పది సంవత్సరాలనుంచి బావన్‌దాసు ఒక అణా మిఠాయి తీసుకవచ్చి దానికి పెడుతున్నాడు. ఇప్పు డిది బాగా ముసలిదై పోయింది. బావన్‌దాసు మిఠాయి దానికందించాడు. గుటుక్కున తినేసి బావన్‌దాసు మొహంవైపుచూస్తూ కూర్చున్నది.

'ఇప్పు దేంతింటావు ! కోడిగుడ్డా ! మాంసమా !'

## పద్నాలుగు

తాసిల్దారు తన కొత్త రెండంతస్థులమేడ పైభాగంలో కూర్చొని ధాన్యపు రంగుకొచ్చిన పంటపొలాలను పరికిస్తున్నాడు. కంకులు వంగివున్నాయి. కార్తీక మాసంలో పాతికరోజులు గడిచిపోయాయి. ఇక కోతలు ప్రారంభించాలి.

....నాలుగువైపులా తాసిల్దారు పొలం ! తూర్పున తాటిచెట్టు కన్పిస్తున్నదే, ఆ కమలానది అవతల అంతవరకు, ఉత్తరాన పెద్ద మర్రిచెట్టుదాకా ! దక్షిణాన సంథాల్ తెగలవాళ్ళ పొలాలన్నీ రాయించేసుకున్నాక పిపరాగ్రామంవరకు తాసిల్దారు పొలమే అయిపోయింది. ఇంటికి పడమరదిక్కున తాంత్రికులపేటదగ్గర ఏభై ఎకరాల మడి ఏకఖండంగా ఉన్నది. దీనికి పదిరూపాయలు శిస్తు ! దీన్ని తాసిల్దారు తండ్రికూడా తీసుకోవాలని చూశాడు; కాని కుదరలేదు. తాసిల్దారుకూడా పూర్తిగా

ప్రయత్నించారు. ఎంత కిందామీదూ చేసినా ఈ ఇది కొరుకుడుపడలేదు. కంటి లోని నలుసుగా- తాసిల్దారును బాధపెడుతూ ఉంటుంది. మేడమీదకూర్చుంటే భూమి దాహం మరింతగా అధికమవుతుంది. ఇక్కడ కూర్చొని ఆయన ఎన్నో విషయా లనుగురించి ఆలోచిస్తూ ఉంటాడు....కిందికి దిగిరావడంతోనే ఆయన మొహంమీద భావాలు మారిపోతాయి. చెరువులో స్నానం చేయడానికి వెళ్ళినప్పటినుంచి భోజ నానికి కూర్చునేంతవరకు ఏమేమో మంత్రాలు పఠించుకుంటూ ఉంటాడు - ఓం గ మిరింగ....శివా....అ....య। ఓం గమిరింగ....।

అన్నం తినేప్పుడు తాసిల్దారు రోజూ నెమ్మదిగా అడుగుతూ ఉంటాడు— 'దీదీ ఎలా వున్నది?'

'నీ కూతు రివ్వాళ్ళ చాలా సంతోషంగా ఉన్నది.'

'నిజంగానా? ఇదుగో. రాత్రి నాకు నిద్రే పట్టలేదు.' తాసిల్దారు సంతో షంగా వున్నరోజున కూరలవి ఎలావున్నా తినేస్తారు.

'ఇప్పుడే చెప్పింది - ఇందిరకు ఆమెభర్త దొరికాడని....చాలా సంతో షంగా ఉన్నది।'

'పిచ్చిమొద్దు।' తాసిల్దారు నవ్వాడు।

రాత్రి అకస్మాత్తుగా కమల గదిలోనుంచి ఏడ్పు విన్పించింది. కమల వెక్కి-వెక్కి- ఏడుస్తున్నది. తల్లి అది విని ఆదిరిపోయింది. వణుకుబుట్టింది. తాసి ల్దారు కళ్ళవెంట కన్నీరు కార్చాడు. తల్లి తనను తాను ఎంతగానో సంబాళించుకుని అడిగింది - 'ఏం జరిగింది తల్లీ? చెప్పమ్మా। కమలా। అమ్మా। చెప్పవూ?'

'అమ్మా। అమ్మా। నేను నాకోసం కాదే ఏడ్చేది।....చూశావా....ఇందిర ! ఇందిరకోసం....।' కమల చెప్పింది, ఏడుపు ఆపివేసి।

'ఇందిర ఎవరు? ఎవరామె?'

'ఇందిరెవరో తెలియదా? అమ్మా। ఈ పుస్తకంలోని 'ఇందిర' కోసం ఏడుస్తున్నాను....మొదటిసారిగా ఎన్నో కోర్కెలు మనస్సులో పెంచుకొని అత్తగా రింటికి వెడుతూఉంటే - మార్గమధ్యంలో ఆమెను మీనాతో సహా దొంగలు ఎత్తుకు

పోయారు। కాని ఆమె మానాన్ని రక్షించుకోగలిగింది. ఇప్పు డామె భీకరారణ్యంలో ఉన్నది. పాపం ఇందిర।'

కమల బంకింబాబు ఇందిర చదివి ఏడ్చింది. ఈరోజు చాలా సంతోషంగా వున్నది. ఆమెభర్త ఆమెకు లభించాడు.

తాసిల్దారు భార్యతో—'ఇది పిచ్చికాదు. నా కూతురు చాలా తెలివిగలది। మైనంలాంటి హృదయం। భగవాన్ విశ్వనాథ్ మేలు చేకూర్చాలి।'

'ఆఁ। రాత్రి చెప్పనేలేదు! చాలా పేచీకోరు వ్యవహారం అది। దరఖాస్తు ఇస్తే డాక్టర్ మీ కేమవుతాడని అడిగారు। నేనేం సమాధానం చెప్పాలి? ఏమీ కారని చెప్పేప్పటికి నామంజూరు చేశారు। ఖైదీలుగా వున్నప్పుడు తల్లిదండ్రులు, అక్కచెల్లెళ్ళు లేదా భార్యతోమాత్రమే ఉత్తరప్రత్యుత్తరాలు జరుపుకోవచ్చునని లేదా కలుసుకోవచ్చునని క్లర్కు చెప్పాడు. ఏమి చట్టమిది? అక్క చెల్లెళ్ళకు ఉత్తరం రాసుకోవచ్చు. కాని బావ, బావమరదులకు రాయకూడదు. భార్యను కలుసుకోవచ్చు, భార్యతోవచ్చిన మామ అల్లుణ్ణి చూడరాదు।' తాసిల్దారు మొహం కడుక్కొని పక్కగదిలోకి వెడుతూ వెడుతూ—'ప్యారా అక్కడే పూర్ణియాలోనే ఉంటున్నాడు, ఒక హోటల్లో తింటున్నాడు. జైలోనుంచే డాక్టర్ గణేశ్‌ను ఒక బ్రహ్మసమాజ్ మందిరంలో చేర్పించే ఏర్పాటు చేయించాడు. డాక్టరు ప్రతినెల చెక్కు పంపిస్తాడు. ప్యారా, గణేశ్ - ఇద్దరికీ వేర్వేరుగా చెక్కులిస్తాడు. చాలా ఉత్తముడు! పాల కంట్రాక్టర్‌తో ఒకరోజు లోపలికివెళ్ళి గేటుదగ్గరనుంచే డాక్టర్‌ను చూశారట; ఆయనప్పుడు జైలు ఆఫీసుకు వెడుతున్నాడట। చూసి ఆశ్చర్యపోయి మేరీగంజ్‌నుంచి ఎప్పుడొచ్చావని, కమల ఎలా వున్నదని ప్యారాని అడిగాడని చెప్పాడు.'

'ఆఁ। డాక్టరు అడిగాడా? ప్యారా ఏమన్నాడట?' కమలతల్లి ఆదుర్దాగా అడిగింది—'ఏం చెప్పాడో ఏమో?'

'ప్యారా అంత తెలివితక్కువవాడేమీ కాదు. బాగానే ఉన్నదని చెప్పాడట। మీ ఫోటో తీసుకెళ్ళిందని, రోజూ ఉదయంలేచి చూసుకుంటున్నదనికూడా చెప్పాడట।'

'అలాగా? అలా చెప్పాడా? ప్యారూ ఎంత తెలివిగలవాడు! భగవంతుడు కూడా విచిత్రమైనవాడు! వాడి కెవరూ లేదు!....అప్పుడు డాక్టరేమన్నాడట?'

'నవ్వుతుంటూ వెళ్ళిపోయాడని చెప్పాడు!' తాపిల్దారు నోట్లో తమల పాకులు వేసుకున్నాడు....అంతే విషయం పూర్తయింది.

సంతోషాతిశయంవల్ల కమలతల్లి భోజనం సయించలేదు. రోజూ తల్లీ కూతుళ్ళు ఒకేసారి తింటారు. ఈరోజు కమల మాటిమాటికి తల్లిని—'తినమ్మా! పూర్తియాకథ తరువాత చెప్పవచ్చు!' అని గుర్తుచేసింది.'

ఈరోజునుంచి తల్లి నవల వింటుంది. కమల మొదటినుంచి 'ఇందిర' చదివి విన్పిస్తున్నది. కమల—'అమ్మా! శకుంతల, సావిత్రి మొదలైన కథలు చదవడానికి మనస్కరిస్తుంది, కాని నవలలు చదువుతుంటే - మనింట్లో విషయాలు రాసినట్టుగా ఉంటుంది.' అని అన్నది.

గత రెండురోజులనుంచి భోజనం ముగిశాక కమల కడుపులో పెరుగు తున్న శిశువు కాళ్ళుచేతులు ఆడిస్తున్నాడు! తల్లికి సిగ్గుపడి ఈవిషయం చెప్పలేక పోయింది. కాని కమల కళ్ళఎదుట ఒకేసారి అనేకమంది పిల్లలమొహాలు, కేరిం తలుకొడుతూ కన్పిస్తూఉంటాయి. దాగుడుమూత లాడతారు! ఎవరు వాళ్ళంతా? ఎంతో ముద్దుగా అప్పుడే విచ్చిన తామరపుష్పాల్లాంటి పిల్లలు! ఎవరిచెయ్యి పుచ్చు కోవాలి? ఒక కుర్రవాడిచేతులు పుచ్చుకొని ఎత్తుకుంటుంది....కాళ్ళూ చేతులూ ఎంత సుకోమలంగా ఉన్నాయి? ఎంత మధురమైన చిరునవ్వు? ఎంత చంచలంగా వున్నాడు?....నా బుజ్జిరాజా! కమల రొమ్మునుంచి పాలు పొంగుతాయి.

'ఇదుగో, ఇలారా!' తాపిల్దారు భార్యను పిలుస్తారు. మేడమీదినుంచి— 'ఇలా కొంచెం వస్తావా?'

మేడమీదికి వెళ్ళేప్పటికి తాపిల్దారు అభిప్రాయాలు, మాటలు, ఆయన బుద్ధి అన్నీ మారిపోతాయి. నోరు కదులుతూ ఉంటుంది, ఏదో తింటున్నట్టుగా!

'నే నిప్పుడు ఉరితోసుకుని చనిపోతాను. నాకు నిద్ర పట్టడంలేదు. ఏమవు తుందో ఏమో? నువ్వేమైనా ఆలోచించావా?....ఏదైనా ఉపాయం తట్టిందా నీకు?

నీ కూతురుచేసిన దుర్మార్గానికి నా గుండె మండిపోతున్నది. నీ కూతురువేసిన కాటు ....' తాసిల్దారుకు ఆవేశం ముంచుకొచ్చింది. లేచి నిలబడ్డాడు.

'ఏమిటి మీ మాటలూ మీరూను?'

'మాట్లాడకు! మీ ఇద్దరూకలిపి.... వెళ్ళిపో!'

'కూర్చోండి మీరు! కేకలు పెట్టకండి. పిల్ల వింటుంది.'

'వింటే వింటుంది. గవర్నర్ కూతురా ఏమిటి?'

'ఇదుగో చూడండి!'

'మాట్లాడకు!'

మునలి పనిమనిషివచ్చి—'టీ పైకి తెమ్మంటారా. కిందికి వస్తారా?' అని అడిగింది.

'కిందికి వస్తాం పద!'

కమల ఇప్పుడు రెండుపూటలా తన చేతులతో తన తండ్రికి టీ తయారు చేసి పంపిస్తుంది.

'వందకప్పుల మధ్యలోకూడా నాన్న నేను తయారుచేసిన టీని గుర్తించ గలరు!' అని అంటుంది కమల!

కిందగదిలో కూర్చొని టీ ఒక్కగుక్క తాగేప్పటికి తాసిల్దారు బిగుసుకు పోయిన నరాలు ఒక్కసారిగా వదులయిపోతాయి. మొహం మళ్ళా యథాప్రకా రంగా మారిపోతుంది.

'ఈ పేరియాకు రజాయి కుట్టించి ఇవ్వు! లేకపోతే వాతరోగంతో పడక వేస్తుంది.' తాసిల్దారు అన్నాడు.

'మీ కూతురు మీకోసం ఉన్నితో స్వెట్టర్ అల్లుతున్నది. పుస్తకంచూసి! ఆ చేతులు మిషన్‌లాగా నడుస్తాయి!'

'నిజంగానా?.... ఈ ఇంట్లో పుట్టి సుఖానికి నోచుకోలేదు. కష్టాలతోనే గడిచిపోయింది! సంవత్సరం వయస్సు పిల్లగావున్నప్పుడు నేనేమన్నానో గుర్తు న్నదా? నా కూతురు 'సంతోషానికి మారురూపు' అని అన్నాను!

పేరియా నవ్వుతూ నగం అల్లిన స్వెట్టర్ తెచ్చింది.

'ఇదే చూడండి!' తల్లి తీసుకొని చూపిస్తుంది—'నీ కూతురి పనితనం చూడు!'

తాసిల్దార్ చిరునవ్వు నవ్వుతూ దానివైపు చూస్తూఉండిపోతాడు—'ఇదీ నాకు పెద్దదవుతుందేమో? నాకింత చిన్నదయితే (చిన్నపిల్లవాడితో సమానమైన) చాలు!....ఇంత చిన్నది!'

'ఊఁ!' పేబియా నవ్వుతుంది.

'ఇచ్చిరా! చాలా బావున్నదని చెప్పు!'

ఈ పేబియా ఎంతకాలంనుంచి పనిమనిషిగా ఉంటున్నది! కమల తల్లికి చిన్నప్పటి స్నేహితురాలు! ఇద్దరూకలిసి ఆడుకున్నారు! చిన్నప్పుడే భర్త చని పోయాడు! గుర్తువస్తే ఏడుస్తుంది. కమల తల్లితోనే వచ్చింది. ఇప్పటివరకు ఇక్కడే వున్నది. వాతరోగంవల్ల బలహీనత వచ్చేసింది. ఒక చెవు సరిగా వినిపిం చదు.

కమల 'పేబియా అమ్మా!' అంటుంది.

'ఏ పేబియా అమ్మా!

మునర్ది రోజూ ఎవరికీ తెలియకుండా పొయ్యిలోనుంచి కచ్చికలు తీసుకెళ్ళి కమలకు ఇచ్చివస్తుంది. కచ్చికలు ఎంత మంచివాసన వేస్తాయి.

'అమ్మా! పేబియాఅమ్మ అల్లా డెప్పుడొస్తాడని అడుగుతున్నది!'

తాసిల్దారు మేడమీదనిలబడి చూస్తున్నారు. పశ్చిమాన అస్తమిస్తున్న సూర్యుడి ఎర్రనికాంతి 'ధర్మపుర్ మిలిక్' బొలాలమీద ప్రసరిస్తున్నది. క్రమ క్రమేణ రంగు మారిపోతున్నది. ఎరుపు....నల్లగా మారింది!....చీకటి పెరుగు తున్నది. తాసిల్దారు మేడా, ప్రహరీగోడ....అన్నీ చీకటి కడుపులో తల దాచు కొన్నాయి.

## పదిహేను

బాలదేవ్ గుర్రపుబండివాడితో - 'చూడునాయనా। నాకు రైలు అందింబా వంటే అర్ధరూపాయ అదనంగా ఇచ్చేస్తాను. బహుమతిగా।' అని అన్నారు.

'అలాగే ప్రయత్నిస్తానండి!... చల్ బేటా।' అంటూ గుర్రపుబండి కుర్రాడు కొరడాతో గుర్రాన్ని అదిలించి పాట ప్రారంభించాడు—'కొట్లాటలు, కుమ్ములాటలు పెరిగిపోయెరా। దేశంలో - హిందువులకు, ముస్లింలకు।'

బాలదేవ్‌కు ఈరోజే తెలిసింది - మహాత్మాజీ గత రెండుమాసాలనుంచి పాట్నాలో వున్నారని, ప్రార్థనసభలలో ఉపన్యాసాలిస్తున్నారని। ఇప్పుడు ఢిల్లీలో వున్నారు.

'అబ్బాయ్, ఏదో రైలుకూత।'

'ఇంకా సిగ్నల్ ఇవ్వలేదండి।'

'సరే, ఇదుగో। అర్ధరూపాయి ఎక్కువ ఇచ్చాను।'

ఎటెన్షన్‌లో నిలబడి కుర్రాడు 'సలామ్ సాబ్' అన్నాడు.

యౌవ్వనంలోవున్న ఏ స్త్రీ కన్పించినా బాలదేవుకు లక్ష్మి గుర్తుకొస్తూ ఉంటుంది. ఇవ్వాళ్ళ గంగూలీదగ్గర మరికొంతసేపు గడిపేసినట్టయితే, శర్మగారు రావిచ్చి ఉండేవాడుకాదు। వస్తున్నప్పుడు శర్మ—'బాలదేవ్, నేను విన్న ఇక్కడ అపేంత మూర్ఖుణ్ణి కాదు. మవ్విక్కడుంటే అక్కడ మీ లక్ష్మి మరొక రితో 'సత్సాంగత్యం' చేస్తే ఏంగాను? అహ్హ హ్హ। వస్తా. జైహింద్।' అని అన్నాడు, నవ్వుతూ।

'జై హింద్ బాలదేవ్‌గారూ।'

'ఎవరూ? ఖలాసీగారా? ఏమిటి సంగతులు?'

'మేరీగంజ్ నుంచి ఇప్పుడే వస్తున్నానండి. రౌతహట్ స్టేషన్‌లో మీకోసం ఎడ్లబండి సిద్ధంగా వున్నదండి। నేను భూతవైద్యంచేసి వస్తున్నానండి। మా ఆవిడకు దయ్యం పట్టిందిగా। వదిలించేసి వెంట తీసుకొచ్చేశాను.... ఇవ్వాళ్ళ ఉదయం పదిగంటలకు మీ ఆశ్రమంవైపుకు వెళ్లాను. ఏదో ఒక మూలికకోసం।

మీ ఆశ్రమం చూసేప్పటికి కడుపు నిండిపోయిందండి. అక్కడినుంచి రా బుద్ధి వేయలేదు. మీరు లేరు. లక్ష్మిగారున్నారు. ఎవరో యువకసాధువు టీజక్ పారాయణం చేస్తున్నారు. రాగయుక్తంగా! నాకు బయటికి రావాలనిపించలేదు! అంత బాగా పాడుతున్నారు!....వస్తానండి. జై హింద్!'

యువకసాధువా?....కాశీకిచెందిన 'విద్యార్థిజీ' అయివుండవచ్చు! మహంతు పేవాదాసు చైంనుంచి సంవత్సరానికి ఒకటి రెండు పర్యాయాలు మఠానికి వస్తూ ఉండేవారు. తిరిగి వెళ్ళేప్పుడు మహంతు దారిఖర్చులు, భోవతులఖర్చులు, పుస్తకాలఖర్చు అని ఏదో కొంతడబ్బు ముట్టజెబుతూ ఉండేవారు.

... ముత్యాల్లాంటి అక్షరాలు రాస్తారు....ఈ విద్యార్థిజీ రాసిన 'టీజక్' లక్ష్మి తన కిచ్చింది. క్రిందటిసారి వచ్చినప్పుడు మఠంలో ఏమీ బాగాలేదన్నారు. మరి ఇప్పు దెందుకొచ్చినట్టు? లక్ష్మి ఇప్పుడు మఠంలో యజమానురాలు కాదు; ఇప్పు డొక ఇంటి యజమానురాలు!

....నేను ఇంట్లో లేనప్పుడు ఎందుకొచ్చారు? చూసేవాళ్ళేమనుకుంటారు? ఇదేమీ బాగాలేదు. లక్ష్మికి నచ్చజెప్పాలి.

బాలదేవ్ పినతల్లి రోజూవచ్చి ఆశ్రమంముందు బైఠాయించు నమ్మిచేసి నోటికొచ్చినట్లల్లా తిట్టి వెడుతూఉంటుంది—'ఒరీ పీ మొహం మండ! ఇందు కోసమేనంటరా, నేను నిన్ను చిన్నప్పటినుంచి పెంచి, పెద్దవాణ్ణి చేసింది? ఈ లచ్ఛిమ్మతల్లి పీ కేదో మందుపెట్టింది. మేకపిల్ల అయిపోయి, ఆ మెచుట్టూ తిరుగు తున్నావు! పీకు సిగ్గెట్టా లేదమ్మా!' లక్ష్మి అలా వచ్చినప్పుడల్లా బియ్యం, పప్పు, గోధుమలు, కూరగాయలు వగైరా ఇచ్చి పంపించేస్తుంది.

సాయంత్రమైంది. చలికాలం! బాలదేవ్ దుప్పటి చెవులదాకా కప్పు కొన్నారు. చలి! చెవులుమాత్రం వేడిగానే వున్నాయి. 'విద్యార్థిజీ!....

'ఎవరూ?...మనిషినిచూసి ఎద్దులు బెదిరిపోతున్నాయి....' బండివాడు ఎద్లను పట్టుకొని పగ్గాలతో. కేకవేశాడు—'గోసాయిగారూ! లేవండి! బండి ఇంటి కొచ్చేసింది!'

బాలదేవ్ మేల్కొనేవున్నాడు. లేచిచూస్తే చెట్టుపీడన ఎవరో వెడుతున్నట్టు తవ్పించింది. ఓహో! విద్యార్థిగారు ఇప్పుడే వస్తున్నారు!

'గురోన్నమః!' లక్ష్మి కాళ్ళుతాకి నమస్కరిస్తుంది.

బాలదేవ్ ఏదో గొణుక్కుంటూ తిన్నగా తన ఆసనందగ్గరకు వెళ్ళిపోతాడు.

'నా కంబళి ఎవరు కప్పుకున్నారు?' బాలదేవ్ పక్కమీదున్న కంబళివైపు చూస్తూ కోపంగా అడిగాడు—'అతను నా కంబళి ఎందుకు కప్పుకున్నాడు?'

'ఎవరు?'

'ఇంకెవరు? స్వప్నలోకంలో వున్నావా?' బాలదేవ్ మెదడు కొంచెం వేడిగా వున్నది.

'రామఫల్!....మీరు తినండి. నాకు ఆకలిగా లేదు. నేను తినను!' బాలదేవ్ ఆవేశంగా కంబళి దులుపుకుంటూ అన్నాడు—'ఊళ్ళోవాళ్ళు తావచ్చి నా మంచం మీద పడుకుంటారు.'

బాలదేవ్ ప్రతి చిన్నవిషయానికి మండిపడటం ఈమధ్య లక్ష్మి గమనిస్తూనే వున్నది. ఆమెవచ్చి తలుపుదగ్గర నిలబడి—'పక్క దులిపాను. విద్యార్థిజీ వరాండాలో కూర్చున్నారు!' అని అన్నది.

'వసారాలో ఎందుకు? లోపల కూర్చోబెట్టలేకపోయావా? ఎవరూ లేనప్పుడు వసారా అయినా ఒకటే. ఇల్లయినా ఒకటే!' బాలదేవ్ పెదిమలు వణికిపోయాయి.

'విద్యార్థిజీ సత్సంగపారాయణంకోసం వస్తూఉంటారు!....'

'అవునవును! నాకు బాగాతెలుసు! సత్సంగపారాయణం!....సత్సంగం....!' బాలదేవ్ ఈసడింపుగా మొహం తిప్పుకున్నాడు.

ఎందుకో ఈరోజు అతనికి 'సత్సంగం' అనేమాట వినేప్పటికి శరీరమంతా జెర్రులూ పాకుతున్నట్టుగా ఉన్నది. దోరిక్‌శర్మ ఏమన్నాడు?....

'లక్ష్మి మరొకరితో సత్సాంగత్యం చేస్తూఉండవచ్చు!....'

'సత్సాంగత్యం చేయాలనిఉంటే ఆయన ఆసనం ఇక్కడే వేయించు, రాత్రింబగళ్ళు బాగా చేయవచ్చు!' బాలదేవ్ పెదవి వంకరగాపెట్టి విచిత్రమైన మొహంతో, చేతులు ఊపుకుంటూ అన్నాడు—'సత్సాంగత్యం!'

'ఏమండోయ్!' లక్ష్మి ముక్కుపుటాలు ఎగిరెగిరిపడ్డాయి—'ఏమిటి మీ మాటలు?'

'నువ్వు చేసే మాయమంత్రాలు నాకు తెలుసు!'

'ఏమి తెలుసో చెప్పండి!'

చేతులు వణుకుతున్నది....కొట్టాడుతుందా ఏమిటి? కోపంతో వణికిపోతుంది. 'ఏమి తెలుసో చెప్పండి?....వేశ్య ననుకున్నారా? పాముకు పాలుపోసి పెంచాను! అయినా కుక్కనోటికి కొబ్బరికాయ అబ్బుతుందా?....'

'నేను నీ పెంపుడుకుక్కను కాదు, నే నిప్పుడే చన్నన్‌పట్టీ వెళ్ళిపోతాను! ఇప్పుడే!' బాలదేవ్ లేచినిలబడ్డాడు!

'కోపం తెచ్చుకోకండి గోసాయిగారూ, కోపం అనేది పాపానికి మూలం హేతువు! వెడుతూ వెడుతూ నా శరీరానికి కళంకం ఆపాదించి వెళ్ళకండి!'

బాలదేవ్ ఏదో ఆలోచించి కూర్చున్నాడు!....లక్ష్మిశరీరం సువాసన వెద జల్లుతున్నది. మెదలకుండా ఆమెవైపు చూశాడు! లక్ష్మి తలుపుకు ఆనుకొని కన్నీళ్ళు తుడుచుకుంటూ ఏడుస్తుంది—'నేనే దురదృష్టవంతురాల్ని!'....లక్ష్మి ఏడుస్తున్నది. బాలదేవ్ కోపం నెమ్మదిగా తగ్గిపోతుంది. లేచి లక్ష్మి తలనిమురుతూ— 'ఏడవకు! నేను నిన్ను సందేహిస్తానా? ఏడవకు! అయినా నువ్వొక విషయం ఆలోచించాలి. ఇప్పుడు నువ్వు మఠంలో లేవు! నా భార్యగా ఉంటున్నావు! లోకులు ఏమనుకుంటారు?'

లక్ష్మి బాలదేవ్ పాదాలమీదపడి—'క్షమించండి ప్రభో - ఈ దాసీ అపరాధాన్ని!' అని వేడుకున్నది.

'ఛీ ఛీ! లక్ష్మి లే! ఇదేమిటి? పద, ఆకలిగా వున్నది!'

## పదహారు

డాక్టరును డిటెన్యూగా బంధించారు.

జైలు ఆస్పత్రిలో ఒక సెల్‌లో వుంచారు. ప్రతివారం ఎవరో ఒక ఆఫీసరువచ్చి గంటలకొలది ఏవేవో ప్రశ్నలడిగి ఆయనను విసిగిస్తున్నారు....

చలి త్తర్‌దళంతో డాక్టర్‌కు ఏమైనా సంబంధం వున్నదేమోనని ప్రమాణాలు సేక రించడానికి పోలీసులు కిందా మీదా పడుతున్నారు.

'చలి త్తర్ ఏ పార్టీ మెంబరో మీకు తెలుసా?'

'తెలియదండి! నే నసలు చలి త్తర్ పేరే వినలేదు!'

'వినలేదా? జిల్లాలోవున్న ప్రతి పిల్లవాడికీ తెలుసునే!'

చలి త్తర్ ఎవరికి తెలియదు? బీహారు ప్రభుత్వం అతనికోసం పదిహేను వేలరూపాయల బహుమతి ప్రకటించింది. ప్రతిస్టేషన్ విశ్రాంతిగదులో అతని పెద్ద ఫోటో ఒకటి వేలాడదీశారు! పోలీసులు, సి.ఐ.డీ.లు మిలిటరీదళంవాళ్ళు అతన్ని అరెస్టుచేయడానికి సంవత్సరంనుంచి ప్రయత్నం చేస్తున్నారు. జిల్లా అన్నిమూలలా గాలిస్తున్నారు. కొత్త ఎస్. పి. 'చలి త్తర్‌ను అరెస్టయినా చేస్తాను, లేక ఉద్యోగ మైన వదిలేస్తాను!' అని ప్రతినబూనాడు. ప్రతిఇంట్లో చలి త్తర్‌నుగురించి రక రకాల కథలు చెప్పుకుంటారు. నేతాజీ సింగపూరు వచ్చినప్పుడు చెప్పుకున్నారే, అలాంటి కథలు!....కటహా పోలీసు సూపరింటెండెంటూ దగ్గరకెళ్ళి కబుర్లుచెప్పి, టీ తాగి వస్తానండి అనిచెప్పి చివరలో నవ్వుతూ నేనే చలి త్తర్‌నని చెప్పాడు! ఆయనకు మతిపోయింది....కలెక్టరు డార్జిలింగ్ రోడ్డుమీద ఎక్కడికో వెడుతూంటే- దంగరాఘాటుదగ్గర నది దాటడానికి పడవలేదు! ఎవరోవచ్చి సలాంచేసి కలెక్టరును వేరే పడవలో అవతలిగట్టుకు చేర్చారు! కలెక్టరు సంతోషించి పేరడిగి ఈనాము ఇవ్వబోతే, నా పేరు చలి త్తర్ అన్నాడు! కలెక్టరు నోరుతెరిచి చూస్తూఉండి పోయాడు....ఏడ్చేపిల్లలకుకూడా చలి త్తర్‌పేరుచెప్పి సముదాయిస్తారు!

మరి డాక్టరేమో, పేరే వినలేదంటున్నాడు. ఎలా నమ్మడం? ...విరాట్ నగర్‌నుంచి పెద్ద ఆఫీసరు ఉత్తరం రాశాడు—డాక్టర్ నేపాలువాడు కాదని!.... బెంగాలుప్రభుత్వం మా కతనితో ఎటువంటి సంబంధమూలేదని తెలియజేసింది. అయితే చివరకు ఇత డెక్కడివాడు? పాతపైళ్ళు తిరగేసినకొద్దీ వ్యవహారం మరింత క్లిష్టమైపోయింది. విచిత్రమైన సమస్యే! అసెంబ్లీలో ప్రశ్నలపరంపర కురిపిస్తున్నారు—డాక్టర్‌ని ఎందుకు అరెస్టు చేశారని? చాలా గడ్డుసమస్యే! ఎస్. పి. చాలా విక్కచ్చి మనిషి. కటహా సబ్ ఇనస్పెక్టర్ని చెడామడా చీవాట్లు వేశాడు.

జైల్లో చేరినతరువాత డాక్టర్‌కు జైలుఆస్పత్రిలో సెల్‌లో ఉండడం తన కెంతో ఉపకరిస్తుందని భావించారు. ఆఫీసర్లు రావడం, ప్రశ్నించడం, పదిహేను రోజులవరకు జరిగింది. ఆ తరువాత అన్నీ ఆగిపోయాయి....గాంధీజీ పాట్నాలో ప్రార్థన సమావేశాల్లో ప్రవచనాలు చెబుతున్నారు. ఆ ఉపన్యాసాలలోని విషయాలు ఎప్పటికీ పాతబడిపోవు। వీటినిగురించి చర్చలు జరుపుకోవడానికి వీల్లేదు; వీటిని అధ్యయనం చేసుకోవలసిన అవసరం ఎంతయినా ఉన్నది...ఈమధ్యనే కులతత్వ వాదులు కొందరు ఒక సమావేశాన్ని ఏర్పాటుచేశారు. గాంధీజీ నల్లటోపిపార్టీ ఉద్దేశ్యాలను విమర్శించడం జరిగింది...మేరీగంజ్ మాటిమాటికీ గుర్తొస్తున్నది.... కమల గుర్తుకు రావడంతో జైలు జీవితంలోని చెడు అంతా మూర్తరూపంలో ఎదుటికొచ్చి నిలబడుతుంది....కాళీచరణ్, వాసుదేవ్ వగైరాలు దోపిడికేసులో అరెస్టుఅయి వచ్చారు. వాసుదేవ్, సుందర్, సోమా విషయా లెలావున్నా, కాళీ చరణ్ ? నమ్మకం కలగడంలేదు। ఏమో, చెప్పడానికి వీల్లేదు....తాసిల్దారుగారు సంతోషంగా ఉంటారు, అయినా ఈ అన్యాయం ఎంతకాలం సాగుతుంది?

....ఆయన ఒకరోజున నవ్వుతూ అన్నారు—'ధనవంతులు, జమీందార్లు, సేఠ్‌లూ, మిల్లు యజమానులు దారిన నడుస్తూంటే ప్రజలు వీళ్ళను కుష్ఠువాళ్ళ క్రింద, పిచ్చివాళ్ళక్రింద జమకట్టి ఛీదరించుకోవడం ప్రారంభించినరోజున దేశానికి నిజమైన స్వరాజ్యం వచ్చినట్టుగా భావించాలి। ఆరోజులు వస్తాయని మీ రంటు న్నారు. అయితే అప్పుడు మా ఆస్తులన్నీ ఎలాగూ లాక్కుంటారు. ఇప్పుడు సంపాయించుకోవడానికి హద్దులేమీ లేవుగదా। అందుకని ఎందు కూరుకోవాలి?' తాసిల్దారు చాలా విచిత్రమైన మనిషి। అయితే, తాను జైలునుంచి విడుదలయితే మేరీగంజ్ వెడతాడు...। నేపాల్ ? నేపాల్‌లో 'నేపాల్ జాతీయ కాంగ్రెసు'ను స్థాపించుకున్నారు. ఆ రాజకీయాలలోకి తాను వెళ్ళదలచలేదు. రాజకీయాలకు తాను పనికిరాడు. ఒకసారి మమత రాజకీయాలను దయ్యాలతో పోల్చింది. దయ్యాలు.... పిన్నిని జనం చంపేశారు....పిన్ని....గణేశ్। కమల।... ఎంత ప్రయత్నించినా వీళ్ళమొహాలే మాటిమాటికీ గుర్తుకొస్తున్నాయి।

'డాక్టర్‌గారూ!' అసిస్టెంటు జైలరు వచ్చాడు—'బ్రహ్మసమాజమందిరం కార్యదర్శి వచ్చారండి. మీ మేనల్లుడు జబ్బుగా వున్నాడట। అతని చికిత్సవిష

యంలో ఏదో మాట్లాడతారట! సలహాకోసం వచ్చారు. జైలరు మిమ్మల్ని రమ్మంటున్నారు!'

'అలాగే! పదండి!'

## పదిహేడు

నెలా పదిహేనురోజులనుంచి కాళీచరణ్ జైల్లో ఉన్నాడు. వాసుదేవ్, సుందర్, సోమా సోనమా - అందరూ ఒకే కేసులో ఉన్నారు. ఈమధ్యలో ఒకటో తేదీన కోర్టులో మేజిస్ట్రేటుముందు వీళ్ళను హాజరుపరచడం జరిగింది. ఒక మిలిటరీలారీ ముందు, మరొకటి వెనుకా వచ్చాయి. అందరికీ సంకెళ్ళువేసి కోర్టుకు తీసుకొచ్చారు. ఆరోజు కాళీచరణ్ దృష్టిసారించి అటూ ఇటూ చూశాడు! సెక్రెటరీ కన్పించాడు. ఆయనకూడా చూశాడు. కాళీచరణ్ మొహం వికసించింది. మూడుమాసాలుగా ఆయనకోసమే చూస్తున్నాడు.

'సెక్రెటరీగారూ!....కృష్ణకాంతమిశ్రగారూ! కాళీచరణ్ కేకవేశాడు— 'జైహింద్ కామ్రేడ్! సెక్రెటరీ మొహం తిప్పుకొన్నాడు. ముందుకు సాగిపోయాడు, వెనక్కి చూడకుండానే! కాళీచరణ్ను పోలీసు గదిమాడు—'ఏంరా నాయాలః వీపు దెబ్బల కేడుస్తున్నదా?' అటు సెక్రెటరీ ముళ్ళతీగెలో పడబోతూ, పడబోతూ తప్పించుకొన్నాడు!... పైకిచూస్తూ నడుస్తుంటే ముళ్ళలోకి పోక తప్పదు? సుందర్‌వాళ్ళు నవ్వారు - కాళీచరణ్ను పోలీసు తిట్టినందుకు!.... ఇందులో సెక్రెటరీ తప్పేమీ లేదు, దోపిడీదొంగలతో పెద్దమనుష్య లెప్పుడూ దూరంగానే ఉండాలి. వాసుదేవ్, సూన్‌రా, సోమా, నవిచరా మొదలైనవాళ్ళంతా దోపిడిదొంగలు! సెక్రెటరీ తననుకూడా దొంగ అనుకుంటున్నాడు. సరే కానివ్వు! మార్గాంతరం లేదు! రాత్రిపూట వాసుదేవ్‌తో జూదం ఆడతాడు. వాసుదేవ్ కాళీచరణ్‌తో మాట్లాడడు! అతడు రెండోసెల్‌లో వుంటాడు. ఒకరోజున కలిసినప్పుడు—'ఇదేనా నువ్వు చెయ్యవలసినపని?' అని అడిగాడు! 'ఈ ప్రశ్న ఏడు వందలరూపాయలు సెక్రెటరీగారికి నాలుగురోజులలోపల వసూలుచేసి ఇచ్చినప్పుడు అడగాల్సింది?' అని వాసుదేవ్ అన్నాడు!....డాక్టర్ నటఖట్ ఆదేరోజున వీళ్ళ

టాంకీదగ్గర కల్పించి—'పార్టీ గీర్టీ మానెయ్। కావాలనుకుంటే జైల్లోనుంచి నిమిషాలమీద విడుదలయ్యేమార్గం చూపెడతాను।' అని అన్నాడు. సోమాకూడా ఒకసారి చెప్పడానికిప్రయత్నిస్తే కాశీచరణ్ వాడినోరు మూయించాడు.

జైలుబయట చలిత్తర్‌ను కలుసుకునే అవకాశం కలిగింది ఒక పర్యాయం। ....'ఖాళీచేతుల పార్టీ'లోవుంటే ఎప్పుడూ ఖాళీచేతులతోనే ఉండిపోగలవు।'.... అవదలో ఎప్పుడైనా అవసరమొస్తే నన్ను గుర్తుచేసుకో।' అన్నాడు. 'అంత అవసరం నాకు రాదు।' అని తాను అన్నాడు. ఆరోజు।....ఈనాటికీ చలిత్తర్ అన్నమాట గుర్తుకొస్తున్నది।—నీలో ఎంత పసఉన్నదో చూస్తాను।'

ఈరోజు వాసుదేవ్, సోమా - వీళ్ళిద్దరిసహాయం తీసుకోవలసి వున్నది. ఒకసారి కలిస్తే బావుండును। ఒప్పించాలి.

....మార్గాంతరమేమీ లేదు. ఈరోజు మాంసం పెట్టేరోజు। చలికాలంలో వారానికొకసారి సాయంత్రంపూట ఖైదీలకు మాంసం పెడతారు. ఆరోజు అందరూ మాంసంమోజులో ఉంటారు. వార్డర్ దృష్టికూడా కుండమీదనే ఉంటుంది. ఆ పూట। ఇవ్వాళ్ళ ప్రయత్నం చేసిచూడాలి।....

కాశీచరణ్ నిర్ణయించుకున్నాడు. ఏమాత్రం అవకాశమున్నా ప్రయత్నం చేసిచూడాలి. తను పారిపోతాడు. అంతకంటే మార్గాంతరం లేదు. అన్నీ తెలుసు కున్నాడు. జైలునుంచి పారిపోతే ఆరునెలల శిక్ష పడుతుంది। బేడీలు, ఎర్రటోపీ వేసుకోవాలి.

...అందరూ ఎర్రటోపీవా డంటారు। అంతేగా। ఎర్రరంగు చెడ్డరంగేమీ కాదు। సెక్రెటరీ, ధర్మపురీటీవాళ్ళను కలుసుకొని విషయాలన్నీ మాట్లాడాలి. ఆ తరువాత తనకు ఉరిశిక్షపడ్డా పరవాలేదు. పార్టీ కింత అప్రతిష్ఠరావడం అతడు సహించలేడు....జీవించలేడు కూడాను।

....వాసుదేవ్, సుందర్, పవిచరా - దొంగలతో బాగా కలిసిపోయారు. చూసి తానెంతో సిగ్గుపడ్డాడు. వాసుదేవ్ డాక్టర్ నటవట్ ప్రసాద్‌తో స్నేహం చేసుకున్నాడు. డాక్టర్ నటవట్। ఫారబిస్‌గంజ్‌నుంచి దోపిడికేసులో వచ్చాడు. చూడ్డానికి కసాయివాడిలాగా వున్నాడు. యుక్తి పారింది....సోమా, వాసుదేవ్ ఇద్దర్నీ కాశీచరణ్ ఒప్పించాడు. అన్నప్రతి వెనుకభాగం....।

వరే. ఆస్పత్రి వెనుకభాగంలో గోడదగ్గర పీడన వాసుదేవ్. సోమా ఉన్నారు. ఇద్దరూ భుజం చూపించారు. సైగచేసి।

....బావుంది। హ త్తేరి। కాళీచరణ్ పడిపోయారు. అప్పుడు వాసుదేవ్. సోమా భుజాలుఅదించి విలబడ్డారు.

....ఇంతే। కొంచెం....ఇంకొంచెం। ఇంకో నాలుగు అంగుళాలు। వాసుదేవ్. సోమా వీపులమీదినుంచి కాస్త ఎగిరాడు కాళీచరణ్। ఇద్దరిభుజాలు తేలిక బడ్డాయి। అరే।... పారిపో।

'పారిపోయాడు। పారిపోయాడు।।'

టు టూ వూ వూ... టు టూ ఉ ఊ। జైలు ఆస్పత్రి వెనుకనుంచి పోలీసు ఈల వేశాడు.

టు టూ టూ టూ। చాలా ఈలలు కలిశాయి।

ఠన్ ఠన్. ఠనాంగ్ ఠనాంగ్। జైలుగేటుకున్న పెద్దగంట మోగింది.

....కాళీచరణ్ అయిదునిమిషాలవరకు జైలుబయట గోడపక్కన నేలమీద స్పృహతప్పి పడిపోయాడు....ఈలలు. గంటలు వినేటప్పటికి అతనికి తెలివి వచ్చింది.

....పెద్ద దెబ్బేమీ తగలలేదు. నడుం కొంచెం బెణికింది....ఠనాంగ్ ఠనాంగ్ ...జైలుగంట గణగణ మంటున్నది. అతడు పారిపోయాడు.

ఫర్ర్ ర్ర్ ర్ర్ ర్। ఒకేసారి ఎన్నో తుపాకులు ప్రతిధ్వనించాయి.

....రాత్రిపూట చేతికి చెయ్యి కనిపించనంత చీకటి।....ఒక యామ పొద్దు కూడా పోలేదు. మంచుకు నేలంతా పచ్చడి పచ్చడిగా వున్నది। కాలు ఇక్కడ పెడితే అల్లంతదూరానికి జారిపోతున్నది।....

భర్ర్ భర్ర్ ర్ ర్ ర్। దార్జిలింగు రోడ్డుమీదుగా అయిదారు మిలిటరీలారీలు దౌడు తీశాయి.

కాళీచరణ్ వకీలు పాంచూబాబు ఇంటిపెరట్లోదూరి ఒక చెట్టుచాటున దాక్కొని రొప్పుతున్నాడు....రోడ్డు ఎలా దాటడం? ఎటుపెడితే బావుంటుంది?

కుర్చీపైన కూడా జనం కోలాహలం చేస్తున్నారు. దగ్గరున్న వీథిలోనుంచి గుర్రపు స్వారీవాళ్ళు వెడుతున్నారు.

కాళీచరణ్ ఎదురుగా బాంస్‌వాడీవిదాటి మోబరలీగారి పాతబంగళా పక్కనుంచి వెళ్ళిపోవడం మంచిదని నిర్ణయించుకుంటాడు. ఇక ఆలస్యం చెయ్యడం ఏమాత్రం మంచిదికాదు.

ఆఁ....! మోబరలీగారి బంగళాదగ్గర ఎవరో వెనకనుంచి టార్చి వేస్తున్నట్టు అనిపించింది. అడవిలో దూరాడు. కొంచెంసేపు ఇక్కడ ఉంది టార్చిచూపి మరొక గెంతు!

....టార్చ్ మరింత దగ్గరికొచ్చింది! కాళీచరణ్ పరుగెత్తాడు. టార్చ్ వెలుతురుకూడా తనను అనుసరిస్తున్నది. ఇంతలో పిస్తోల్ ధ్వని!... అడవిలో రకరకాలచెట్లను తోసేసుకుంటూ ముందుకు సాగుతాడు! ఎన్నోచోట్ల శరీరం చీల్చుకుపోయింది. కాళ్ళు గాయాలై పోతాయి!

....పార్టీ ఆఫీసు వెనకఉన్న దట్టమైన అడవిలోకివెళ్ళాక - ఇక పరవా లేదనిపిస్తుంది!....అరే! ఇది గీచుకోవడం కాదు; ఇంత రక్తమా?....జానెడు లోతుకు చీల్చుకుపోయింది. తోలు వేలాడుతున్నది!....ఓహో! గుండుదెబ్బ తగిలి నట్టుంది!....రక్తం ఆగటం లేదు....

'ఎ s వ s రూ ?....కాళీచరణ్ ?....' ఆఫీసు సెక్రెటరీ రాజబల్లీజీ తలుపు తెరిచి విభ్రాంతులైపోయారు. నోట్లోనుంచి మాటే పెకిలి రాలేదు.

'ఆఁ ఎవరూ ? కాళీచరణ్ !' సెక్రెటరీకూడా గదిలోనుంచి బయటి కొచ్చారు—'నువ్వా కాళీచరణ్ ? ఊళ్ళో అంతా గొడవగా ఉన్నది.....జైల్లో నుంచి పారిపోయివచ్చావా ?'

'అవునండీ!....తొడకు గుండుదెబ్బ తగిలినట్టున్నదండీ!'

'నీ గుండెలో పేల్చవలసింది - బందిపోటుదొంగా! దుర్మార్గుడా!'

'సెక్రెటరీగారూ! ఇందుకే....ఇందుకే....మీ దగ్గరికొచ్చాను!....వినండి! ....నా తల్లితోడు....గురువుతోడు!....ఆ రోజురాత్రి నేను జిల్లా!పార్టీ ఆఫీసులో ఉన్నాను?'

'రాజబల్లీజీ! మీరు షాక్ తిన్నట్టున్నారు. తలుపు మూసెయ్యండి। ఇతన్ని పంపించివెయ్యండి....బాబూ। వెళ్ళిపో। లేకపోతే।'

'మీరు గల్లంతు చేస్తారెందుకు? లోపలికిరండి మీరు।' రాజబల్లీజీ అన్నాడు.

కాళీచరణ్ రాతివిగ్రహంలాగా నిలబడ్డాడు.

మోబరలీగారి బంగళావైపునుంచి ఫైరింగ్‌ధ్వనులు వస్తున్నాయి—ఫర్ర్ ర్ర్ ర్ర్।

'రాజబల్లీగారూ। సెక్రెటరీగారితో చెప్పండి - ఇందులో నా అపరాధమేమీ లేదు।'

కాళీచరణ్ కదులుతాడు। కొంచెంసేపు నిలబడి బయలుదేరబోతాడు. కాని కాళ్ళు రావడంలేదు। బలవంతంగా ఒక్కొక్క కాలు ముందుకు జరిపాడు। ఒక్కసారి విదిలించుకున్నాడు.

... ఎదురుగా చేమగడ్డ ఆకులమీద ఏదో జారిపడింది।....మెల్లగా వడుచుకుంటూ పక్కనున్న అడవిలోకి వెళ్ళిపోయాడు। ఇప్పుడు? పాతధోవతిచించి గాయాన్ని గట్టిగా కట్టిపేశాడు। ఇప్పుడేమిటి చేయడం?

....చలిత్తర్—'ఆపదలో నన్ను గుర్తుంచుకో।' అన్నాడు।

చలిత్తర్।

## పద్దెనిమిది

పారిపోండి, పారిపోండి!! మిలిటరీ। మిలిటరీ!!

ఎర్రటోపీ పోలీసులు కాదు। గోర్ఖా మిలిటరీ। గోర్ఖా మిలిటరీ తెల్లవాళ్ళకంటేకూడా కఠినంగా ఉంటారటగా। కొట్టడంఅంటే చంపెయ్యడమే। హవల్‌గంజ్ సంతలో, కటిహార్ ఇనస్పెక్టర్ ఆఫీసుదగ్గరా ఉన్నారు - రెండు లారీల్లో! రాత్రిపూట 'రౌండు' వేస్తారట।

'విషయమేమిటో ? అసలు నిజమేనా ఈ వార్త ?'

'నిజమే । తాంత్రికులపేటవాళ్ళు చెప్పారు ।'

'అదుగో । లారీమోత వినిపిస్తున్నది ।'

'అవును ।'

'పారిపోదాం పదండి ।'

మిలిటరీ లారీ తాసీల్దారుగా రింటివైపు వెళ్ళింది.

'ఎవరు సుమతితదాసుగారా ?'

'ఇష్ ।' సుమరితదాసు చెప్పాడు—కలియా జైలునుంచి పారిపోయాడట । అందుకే మిలిటరీ వచ్చింది. ఎవరూ సోషలిస్టు పార్టీనిగురించి మాట్లాడకండి । అడిగితే మేమంతా కాంగ్రెసులో ఉన్నామని చెప్పండి. కాళీచరణ్‌తో ఉన్న బంధుత్వం చెప్పకోవద్దు । ఎర్రజెండా పుచ్చుకున్నారంటే అరెస్టు చేస్తారు ।'

'ఆఁ....ఎవరూ ?' కాళీచరణ్ గుడ్డితల్లి హుక్కా తాగడం ఆపేసి అడిగింది- 'పారిపోయింది ఎవరు ? చెప్పండర్రా ? సరస్వతి, పరమేశ్వరి, తారావతి ? ఎవరమ్మా పారిపోయింది ?'

'ఇంకెవరు ? నీకొడుకు కాళీచరణ్ । ముప్పు గ్రామాని కొచ్చిపడింది ।'

'పారిపోండి । పారిపోండి....మిలిటరీ ।'

గూర్ఖా సైనికులువచ్చి కాళీచరణ్ ఇంటిని నాలుగువైపులనుంచి ముట్టడించారు. ఎస్. ఐ. కాళీచరణ్ ముసలితల్లితో—'నిజంగా గుడ్డిదానవేనా ? లేక వేషమా ? ఇదుగో ముసలీ । నీ కొడుకు కాళీ జైలునుంచి పారిపోయివచ్చాడు. నీ ఏడుపు మానేసి తిన్నగా చెప్పు - అత నిక్కడికొచ్చాడా లేదా ?' అని ప్రశ్నించాడు.

'నా కొడుకా ? వాడు దొంగకాదు బాబూ । గిట్టనివా కెవరో వాడిమీద ఈ అభాండం వేశారు । సూర్యభగవానుడు సాక్షి ।'

'సరిగా చెప్పు । అతగాడి స్నేహితు లెవరో చెప్పు ।'

'బాబూ ' నా కెవరూ తెలియదు నాయనా ।'

'అంతా తెలుస్తుంది ।....ముసలిదాన్ని తీసుకరండి ।'

కాళీచరణ్ తల్లికి చలిజ్వరం వస్తున్నది. నేపాలి సిపాయి ఆమె చెయ్యి పుచ్చుకోవడంతోనే బిగ్గరగా అరవటం సాగించింది - ఇవనవూద కాల్చి పశువులకు అంటిస్తే అరుస్తాయే, అట్లా।

'బాం బాం బాం బాం ఆం।'

మాఘమాసపు సంధ్యాసమయం గ్రామాన్ని తన ఒడిలో దాచిపెట్టుకుంటు న్నది।....అందరూ ఇళ్ళల్లోనుంచి బయటికి రావడంలేదు। అంతటా నిశ్శబ్దం తాండవిస్తున్నది....కాళీచరణ్ తల్లి జాలిగొలిపేఅరుపు ఊళ్ళోని ప్రతిమూలకూ విన్పించింది. కాళీచరణ్ తల్లి ఏడుపు ఎస్. పి. హృదయాన్నికూడా కరిగించడం వల్ల—'వదిలెయ్యండి। ముసలిదాన్ని వదిలెయ్యండి।' అని అన్నాడు.

ముసలిది పూరుకున్నది.

ఊళ్ళోవాళ్ళంతా - ముసలివాని తల తీసేశారని అనుకున్నారు।

ఆతరువాత చౌకీదారు అగమూ, సుమరితదాసు భగత్ ఇంటికొస్తారు।

'భగమాన్‌భగత్ తలుపు తెరువు। సుమరితదాసు దగ్గుతాడు - ఆహ ఖ్ఖ ఖ్ఖ।....'భయపడవలసిన పనిలేదు। సిగరెట్లు। మిలిటరీవాళ్ళకు।....డబ్బులిస్తారు।'

సుమరితదాసు రేకుతలుపు తోసుకుని లోపలికివచ్చి—'ఎక్కడయ్యా నువ్వు? ధైర్యం లేదేమిటయ్యా నీకు? ఎస్. పీ. అందర్నీ పిలిపించారు. తాసిల్దారుగా రింటిదగ్గర మీటింగు పెడుతున్నారు. మీటింగుకు ఎవరు రాకపోతే వాళ్ళను కాళీచరణ్ పార్టీ మనుషులుగా భావించడం జరుగుతుంది।...బదుపెట్టె లివ్వు. సిగరెట్లు పెట్టెలు। కత్తెరమార్కు।....కాళీచరణ్ జైలోనుంచి పారిపోయాడట।'

భగత్ వణుకుతూ 'ఇంకేమి ఇవ్వమంటారు? పంచదార అయిదుసేర్లు, మసాలా అర్ధరూపాయది, నాలుగు సిగరెట్టప్యాకెట్లూ తీసుకొని తాసిల్దారుగారింటికి వచ్చెయ్। ఎస్. పి. మీటింగు ఏర్పాటుచేశారు. అందర్నీ రమ్మన్నారు।....ఈ సిగరెట్ల ప్యాకెట్లకుకూడా డబ్బు తీసుకుంటావా?'

'మీ మాట కాదంటానా?' భగత్ నీళ్ళు నములుతున్నట్టు అంటాడు।

'ఊహుఁ। ఉచితంగా మాకొద్దు। ఇచ్చేస్తాము. ఎంతయింది? మేము బయట

మిలిటరీవాళ్ళం కాదు; ఈ దేశస్థులమే। ఊరికే ఎందుకు తీసుకోవాలి?' అని గోర్ఖా సిపాయి అన్నాడు.

తాసిల్దారు ఇంటిముందు జనం పోగయ్యారు. వెట్టివాడు అందర్నీ పిలుచు కొచ్చాడు—ధాన్యం నూర్చడానికి ఎడ్లను మళ్లేసుకొచ్చినట్టు ప్రతిమూలకూ వెళ్ళి ఎవర్నీ వదలకుండా మళ్లేసుకొచ్చాడు।....బాలదేవ్, రామక్రిపాల్‌సింగుకూడా వున్నారు. చాలారోజుల్నుంచి రామక్రిపాల్‌సింగ్ బయటికి అంతగా రావడంలేదు। ఎవరితోనూ మాట్లాడడంలేదు। ఏభై బీఘాలభూమి ఏకఖండం. అమ్ముకోవలసి వచ్చింది. దెబ్బ చాలా అప్పయింది. ఇటువంటి పరిస్థితులలో మనిషికి బాధ ఉండదూ మరి?....ఖేలావన్‌సింగ్ విషయం చెప్పనవసరమేలేదు. భూమి పుట్రా అంతా అమ్ముకున్నాడు. అంతా స్వాహా అయిపోయింది - కేసులో। ఒక గేదె మాత్రం మిగిలింది. దానిమీదకూడా తాసిల్దారుగారి చూపుపడింది.

ఎస్. పి. టీ తాగి లేచినిలబడ్డాడు—'జై భగవాన్। జై కాళీమాతకీ।'

'సోదరులారా! మిమ్మల్నందర్నీ ఒక పెద్దపనికోసం పిలిపించాను. మీరు భయపడవలసిన పనిలేదు. నేను చెడ్డవాళ్ళకు చెడ్డవాణ్ణి! మంచివాళ్ళకు మంచి వాళ్ళకు సేవకుణ్ణి!....మీ నౌకర్ని నేను!

'జై హో। జై హో!' ప్రజలకు కొంచెం ధైర్యం వచ్చింది.

'ఈమధ్యనే ఈ జిల్లాలో ఒక పెద్ద దోపిడి జరిగింది. అతనిపేరు మీకు తెలిసేఉంటుంది.... !'

'తెలియదండి। మేము కూపస్థమండూకాలం।'

'చూడండి। అబద్ధం చెప్పకండి। చలిత్తర్ ఈ వూరికి ఎప్పుడైనా వచ్చాడా?'

'చలిత్తర్।'

'లేదండి! రాలేదండి!'

'చూడండి! లైటు మరింతదగ్గిరకు తీసుకురండి!....చూడండి....ఇది అతని ఫోటో।'

'అవునవును. ఇతడే।'

'అయితే మరి, మీరు అబద్ధమెందుకు చెప్పారు? దోపిడీ దొంగతనానికి మించింది, దాన్ని దాచివుంచడం। అలా ఎందుకు చేస్తారు?'

'లేదండి। మాకు తెలియదండి।'

'సరే। వినండి। బలి త్తర్‌వృత్తి దోపిడీలు చేయడం। లూటీలు జరిపించడం। ఇలా చేయడంవల్ల సమాజానికి, దేశానికికూడా అతడు శత్రువు। ఈమధ్య కమ్యూనిస్టు పార్టీవాళ్ళు అతనిమీద వారంటు తొలగించాలని కరపత్రాలు వేయించారు। ఇటువంటివాడు మనకు నాయకుడు కావడమా?....మీరే చెప్పండి। నాపేరు బజరంగీసింగ్। నేను ఇలాంటి దోపిడిదొంగలు చాలామందికి బుద్ధిచెప్పాను। ఉరిశిక్షలు వేయించాను। ఇటువంటి మనుషులు ఎవరినైనా చంపగలరు। ...'

'నాన్నా।....గాంధీజీని చంపేశారు।' కమల లోపలినుంచే బిగ్గరగా అరుస్తుంది—

'గాంధీజీ।'

'ఏమైంది?'

'ఏమైంది?'

తాసిల్దారు ఇంట్లోకి పరుగెత్తాడు....సుమరితదాసు—'అయ్యా। తాసిల్దారుగారి కూతురి ఆరోగ్యం అంత మంచిదికాదు।' అని అన్నాడు.

'అనర్థం జరిగిపోయింది।' తాసిల్దారు పరుగెత్తుకుంటూవచ్చి చెప్పారు—'గాంధీజీని చంపేశారు।'

'ఆ। ఎక్కడ? ఎవరు?'

'రేడియోలో వార్త వచ్చింది।'

'రేడియో ఎక్కడున్నది? లోపల ఉన్నదా? దయచేసి ఇక్కడకు తెప్పిస్తారా?' ఎస్. పి. బతిమలాడుకుంటాడు।

'అరె రె రె। బాలదేవ్‌జీని పట్టుకోండి। స్పృహ తప్పినట్టున్నది।'

తాసిల్దారు పోర్టబుల్ రేడియోసెట్ తెచ్చారు. 'చూడండి। దీనివిషయం నాకు తెలియదు।....ఇది డాక్టరుగారిది।'

'ఇలా ఇవ్వండి।' ఎస్. పి; మీటర్ సరిచేస్తాడు.

ఖర్ర్ర్ర్....'మన పిత, మనందరి జాతిపిత హత్య గావించబడ్డారు।.... అంతటా అంధకారం అలుముకున్నది. మన కళ్ళఎదుట కటికచీకటి. హృదయా లలో భయంకర అంధకారం వ్యాపించివున్నది।....ఈ తరుణంలో మీకు ధైర్యం చెప్పడానికి మాటలు దొరకడంలేదు। బాధతోకూడిన కారుమేఘాలు దేశంమొత్తాన్ని ఆవరించాయి....ఒక ఉన్మాది బాపూని హత్యచేశాడు। ఉన్మాదికాకపోతే ఈపని ఎలా చేస్తాడు? ఇప్పుడు మనం మన బాధను, ఆవేశాన్ని అణుచుకొని ఆలోచించు కోవాలి....।'

'నెహ్రూజీ అనుకుంటాను మాట్లాడింది।'

'నెహ్రూజీ।...జవాహర్‌లాల్ నెహ్రూజీ మాట్లాడారు। మధ్యలో ఒకసారి గొంతు పూడిపోయింది—పూర్తిగా। ఏడ్చారు।'

'వినండి। ఇప్పుడు పటేల్‌గారు మాట్లాడుతున్నారు।' ఎస్. పి. గారి మొహం బాగా వెల్లబడిపోయింది.

రేడియోలో చెప్పారా? గాంధీజీని హత్య చేసినవాడిని పట్టుకొన్నారా?.... ఎందుకు పట్టుబడడు? ఎంత పాపిష్ఠిపని చేశాడు? ఎవరో అడవిమనిషి అయి వుంటాడు। ఖూనీకోరు। మహారాష్ట్రుడా? ఇదేం జాతి?....మారాఠా! బ్రాహ్మ ణెవరూ ఇలాంటిపని చేయరు?....వాడెవడో చండాలుడై ఉంటాడు।

ఎస్. పి. చేతులుజోడించి—'సోదరులారా। నేను చెప్పినదాంట్లో తప్పేమైనా ఉంటే మన్నించాలి.....మీరు ఏది మంచిదనుకుంటే ఆవిధంగా చెయ్యండి.... చూశారుగా?... ఒక బీదకోమటిని పిల్లలతోసహా చంపినవాడే, ఆ హంతకుడే ఆ గాంధీని, నెహ్రూని, పటేల్‌నూ అందర్నీ హత్య చేయగలడు।....హంతకుడు! నేను వెళ్ళిపోతున్నాను. రేపుసాయంత్రం నదిఒడ్డున 'జలతర్పణం' జరిపించండి। తక్కినవిషయా లెలాగూ రేడియోద్వారా తెలుస్తూనే ఉంటాయి। తాసిల్దారుగారు మీకు చెబుతూఉంటారు! సరే, ఇక నేను వెళతాను। జై హింద్।'

ఢ్ర్ ర్ ర్ ర్ ర్!

'రఘుపతి రాఘవ రాజారామ్, పతితపావన సీతారామ్।' బాలదేవ్ కళ్ళు మూసుకొని పాడటం ప్రారంభించారు।

'ఇవ్వాళ్ళ చివరిఅక్షరాలు అందుకొని 'ఆఖర్' పాటలుపాడే వాళ్ళుకూడా ఎవరూ లేరు। కాళీ, వాసుదేవ్, సుందర్, నవిచరా - ఎవరూ లేరు।' చలికి బాలదేవ్ వణికిపోతున్నారు....ఇక్కడ చలిమంట ఒకటివేస్తే బాగుండును।'

'ఏమమ్మోయ్ లక్ష్మి।'

లక్ష్మి వచ్చింది. రామఫల్ పహల్వాను లాంతరు తీసుకొచ్చాడు।....బాల దేవ్ కళ్ళుమూసుకొని పాడుతున్నాడు—'ఈశ్వర్ అల్లా తేరోనామ్, సబ్‌కో సమ్మతి దో భగవాన్।'

'జై రఘునందన్! జై ఘనశ్యామ్, జానకీవల్లభ సీతారామ్।' లక్ష్మి అందుకున్నది.

ఈసారి జనసమూహంలోని నగంమంది అందుకొన్నారు।....

'జై రఘుపతి రాఘవ రాజారాం....।'

బావన్ చెప్పినదాంట్లో సత్యం లేకపోలేదు - భారతమాత ఇంకా విల పిస్తూనే వున్నది!

....బాలదేవ్ శరీరమంతా శూన్యమైంది. ఆడుతూ పాడుతూ మధ్యలో కింద పడిపోతున్నాడు।....

'సీతారాం....సీతారాం....జై రఘునందన్।'

....'48 జనవరి 31 వ తేదీరాత్రి। కమల ఆలోచిస్తున్నది—ప్రపంచమంతా ఇప్పుడొక మహామానవుడికోసం విలపిస్తున్నది.

.... రేడియోలో గీతాపఠనం జరుగుతున్నది. గీతలోని ఒక్కొక్క శ్లోకం మహాత్ముజీవి పైకి తీసుకెడుతున్నది - పైకి....మరింత పైకి - పై పైకి।...

అంతవంత ఇమేదేహా నిత్యస్యోక్తాః శరీరిణః।
అనాశినో ऽ ప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత॥

అంధకారంలో ఒక మహాప్రకాశం!....కమల కళ్లు మిరుమిట్లు గొలుపుతాయి! మహాత్మాజీ పకపకా నవ్వుతాడు - ఏడుస్తున్నావెందుకు తల్లీ?....అమ్మా! ఎందుకేడుస్తున్నావు!'

'ఏడవకమ్మా!' తల్లి నచ్చచెబుతుంది—'ఏడవకమ్మా!' అకస్మాత్తుగా డాక్టరు గుర్తుకొస్తాడు...డాక్టర్‌వి ఎవరు ఓదారుస్తున్నారో? ఏడవకు డాక్టర్! ఏడవకు!

కమల రేడియోస్వరాన్ని మరింత హెచ్చిస్తుంది—

వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోపరాణి।
తథాశరీరాణి విహాయ జీర్ణాన్యన్యాని సంయాతి నవానిదేహీ।
నైనమ్ ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః।

## పందొమ్మిది

సిద్ధాంతిగారింటిముందు జనం గుంపుగా చేరారు!

....సిద్ధాంతిగారు చెప్పనే చెప్పారు! ఇప్పుడేమైంది? జరగవలసినదంతా ఇంకా ముందున్నది! అక్షరం అక్షరం నిజమైంది. ఆయనమాట వినకపోవడం వల్లనే ఈరోజున గ్రామపరిస్థితి ఇలా ఏడ్చింది!

మూలికలతోనే సిద్ధాంతికి కొంచెం ఆరోగ్యం కలిగింది; లేవలేడు. మాట కూడా స్పష్టంగా ఉండదు; గొణికినట్టు మాట్లాడతాడు. మొహం వంకరగా బెట్టు!

'ఛయ అ అంఛ్! ఛయ అ అంఛ్!....అ( అ(!' అంటే సర్వనాశనం! సర్వనాశనం అవుతుంది అని అర్థం!

'సిద్ధాంతి బాబాయ్! ఇవ్వాళ్ళ పగలంతా ఉపవాసంఉండి సాయంత్రం కమలావది ఒడ్డున 'జలప్రవాహం' చేయించాలట!' ఖేలావన్ యాదవ్ సిద్ధాంతి ఏ మాటా కాదనడం లేదు!....సకల్‌దీప్ రెండుమాసాలపాటు కలకత్తాలో తిరిగాడు! వాళ్ళమామ పట్టుకొచ్చాడు! ప్రాయశ్చిత్తం చేయించాలి, హరికి!

పైగచేసి సిద్ధాంతి - అలాంటిది వద్దన్నారు।

మధ్యాహ్నం ఊరేగింపు బయలుదేరదీశారు. వాసాంతో ఒకరథం తయారు చేశారు। రంగురంగు కాగితాలతో దాన్ని అలంకరించారు. ఒకవైపున బాలదేవ్ భుజం పట్టాడు. రెండోవైపున సుమరితదాసు, జీబేసర్, సకల్‌దీప్?...ఖేలావన్ యాదవ్ రాలేదు. సకల్‌దీప్‌నుకూడా వద్దన్నారు కాని వినలేదు.

టన్ టనాంగ్! గంట మోగింది.

తిన్నా తిరకిట్ తిన్నా ధిన్నా ధా ధా ధిన్నా।

అరే కాంచహి బాంస్‌కే ఖాట్ రేఖటోల్నా।

గ్రామంలోని భక్తులందరూ శ్రద్ధాంజలి ఘటించే ఊరేగింపు—'సమదావూన్'లో పాల్గొన్నారు. అందరికీ ఈ 'సమదావూన్' ఎంతో వ్యథను కల్పించింది।

'అరే కాంచహి బాంసకే ఖాట్‌రే ఖటోల్‌నా

అజై ర్ మూంజ్‌కే రహోడోర్.'

అందరూ వెక్కి-వెక్కి ఏడ్చారు. ఊరేగింపు ముందుకు సాగినకొద్దీ జనం వచ్చి చేరుతున్నారు. పెద్దలూ పిన్నలూ, ఆడా మగా అందరూ కన్నీరు కారుస్తున్నారు। సకల్‌దీన్ భార్యకూడా పరుగెత్తుకుంటూవెళ్ళి ఊరేగింపులో చేరింది।

మాత ఏడుస్తున్నది. భారతమాత కన్నీరు మున్నీరుగా ఏడుస్తున్నది.

రామదాసు ఖంజరు తీసుకొని ఏడుస్తున్నాడు....అతని పాపంవల్లనే మహాత్మాజీ చంపబడ్డాడు. సాధువులందేస్థలాన్ని భ్రష్టంచేశాడు....మొన్న రామప్రియ అర్ధరాత్రివేళ చేపలకూర తింటూఉండగా రామదాసు పట్టుకొన్నాడు.

రమజూదాసు భార్య ఏడ్చింది. మాదిగ తితరా పన్నెండుసంవత్సరాల కూతురూ బాపూజీ బాపూజీ అంటూ ఏడ్చింది.

బాపూ।

...కమల రేడియోముందు కూర్చున్నది. ఆమెకళ్ళనుంచి కన్నీరు కారుతున్నది. తల్లి తన చీరెచెరగుతో కన్నీళ్లు తుడుస్తూ తనూ ఏడుస్తున్నది - 'ఆయన నరరూపం ధరించి - తన లీలలు చూపించి వెళ్ళిపోయాడు।'

రేడియోలో ప్రత్యక్షవ్యాఖ్యానం ప్రసారం చేస్తున్నారు: 'ఇప్పుడు చందనంతో చితి తయారైనది. ఇంకొద్దిక్షణాలలో ....! చూడండి, పండిత నెహ్రూ, దేవదాసు గాంధీతో - మహాత్ముని సుపుత్రుడితో ఏదో చెబుతున్నారు....జన సమూహం....అపార జనసమూహం...ఇసుకవేస్తే రాలని జనసమూహం.... (కోలాహలం మరింత ఎక్కువవుతుంది। జై ....జై ....) అపార జనసముద్రంలో అలలాగా లేచింది. అందరూ ఒకేసారి చివరిసారిగా మహామానవుని పవిత్రచితిని చూడాలని కోరుకుంటున్నారు.

....అంబ్యులెన్స్....స్పృహతప్పి పడిపోయినవాళ్ళను మోసుకెడుతున్నది। ....ఇప్పుడు....పశ్చిమాకాశంలో సూర్యుడు తన ఎర్రదనాన్ని ప్రసరింపజేస్తూ అస్తమిస్తున్నాడు। ఇటు....మహామానవుడిచితిలో అగ్నిశిఖ....భూమిమీది సూర్యుడు అస్తమిస్తున్నాడు। క్షితి-జల-పావక అయిదుతత్వాలతో కూడిన దేహం....(గీతలోని శ్లోకం వినిపిస్తుంది)-జన్మబంధ వినిర్ముక్తాః పదం గచ్ఛంత్య నామయం...!'

'అమ్మా। అమ్మా।'

అమ్మా। అమ్మా। కమలకు స్పష్టంగా వినిపించింది. ఎవరో పిలుస్తున్నారు-తనను అమ్మా అని।

'ఏమైందే తల్లీ?' తల్లి పరుగెత్తుకుంటూ వచ్చింది. బయటినుంచి।

'నా బిడ్డ।....నా కొడుకు।....'

ఓం శాంతి। శా....ం....తి....।

## ఇరవై

'సీతారామ్। సీతారామ్।'

'ఏమండోయ్ బాపన్‌దాసుగారూ। రండి।' లక్ష్మి మోథా ముందుకు జరుపుతుంది.

'బాలదేవ్‌జీ ఎక్కడ?'

'రండి! గురోన్నమః! జై హింద్!' బాలదేవ్ వచ్చారు.

'జై హింద్!'

బావన్‌దాసును చూసేప్పటికి భయమేసింది. చిక్కి శల్యమై వగుదాకులాగా అయిపోయాడు! ..వెంట్రుకలు ఇంత తెల్లగా ఎలా అయిపోయాయి?...కంఠం కూడా మారిపోయింది. బాలదేవ్ అన్నాడు—'మీ రిటు రావడమే మానేశారు. ఆ రోజున నేనొక్కత్తె - రేడియోలో వార్త విన్నప్పటినుంచి - రెండవరోజు 'జలప్రవాహం' కర్మకాండవరకు అన్నీ చూసుకోవలసి వచ్చింది. ఎలాగో నంబాళించాను. శ్రాద్ధకర్మరోజున తాసిల్దారు విందుభోజనం ఏర్పాటు చేస్తానంటున్నారు. బ్రాహ్మలు, క్షత్రియులు, యాదవులు, హరిజనులు—అందరూ ఏకపంక్తిన కూర్చొని భోజనాలు చేస్తారు! మీరూ వచ్చారు. మంచిదయింది!'

'బాలదేవ్‌జీ! నే నుండను! అవసరమైనపనిమీద వెడుతూ, ఒకసారి మిమ్మల్ని చూసివెడదామని వచ్చాను! నేను వెంటనే, ఇప్పుడే వెళ్ళిపోతాను!'

'సరే, అక్కడి సంగతులేమిటో చెప్పండి!'

'అక్కడిసంగతు లేమి చెప్పమంటారు? రామక్రిష్ణ ఆశ్రమంలోకూడా 'హరిజనభోజనం' ఏర్పాటుచేశారు...'బ్లాక్ ప్రిన్స్' విన్నానే చదివిపోయింది... పాట్నానుంచి శివనాథ్‌బాబు వచ్చారు!...శశాంకజీ ప్రొవిన్షియల్ ప్రెసిడెంటు అయ్యారు. ఆయనకూడా ఇకముందు పాట్నాలోనే ఉంటారు. ఎం.ఎల్.ఏ. లంతా అక్కడేగా ఉండేది మరి!...స్వరాజ్యం వచ్చేసింది ..ఇంకేముంది?...ఛోటన బాబు రాజ్యం. నీతి వియమాలులేవి లుచ్ఛాకోరు! బ్లాక్‌మార్కెట్ చేసేవాళ్ళతో కోర్టులుచుట్టూ తిరుగుతూఉంటాడు. ఆఫీసర్లదగ్గరికెళ్ళి చేతులు నలుపుతాడు... అంతా నాశనమైపోయింది.' బావన్‌దాసు చెబుతూ చెబుతూ ఆగిపోయాడు!

'ఛోటన్‌బాబుసంగతి అడగకండి ..అతవి చుట్టపక్కాలందరూ కాంగ్రెసులో చేరారు.'

'బాలదేవ్! ఛోటన్‌బాబులాంటి ఛోటానాయకులవిషయం వదిలెయ్యండి. ఈ జబ్బు పైనుంచి కిందికి వచ్చింది...ఇది పాట్నాజబ్బు!...ఈ వ్యాధి ఇక ముందు ఇంకా బ్రహ్మాండంగా వ్యాప్తిచెందుతుంది...క్షత్రియులు, రాజపుత్రులు,

యాదవులు, హరిజనులు అందరూ కుమ్ములాడుకుంటున్నారు....వచ్చే ఎన్నికలనాటికి మూడురెట్లు ఎం.ఎల్.ఏ.లు ఎన్నికవుతారు। వాళ్ళవాళ్ళమనుషులు ఎన్నిక కావాలని పోట్లాడుకుంటారు। రాజపుత్రులు ఎక్కువమంది ఎన్నికైవస్తే ముఖ్యమంత్రిపదవి కూడా రాజపుత్రుల కులంవాళ్ళకు లభిస్తుంది. మొన్న ఆశ్రమంలో దీన్నిగురించే చర్చించుకుంటున్నారు. గాంధీజీ చితా భస్మాన్ని తీసుకొని శశాంక్జీ పాట్నానుంచి వస్తారని ఛోటన్‌బాబు, ఆఫీసు సెక్రెటరీ అనుకుంటూఉంటే విన్నాను. ఛోటన్ బాబు అనేదేమిటంటే - జిల్లాకోటా 'భస్మం' జిల్లా ప్రెసిడెంటే తీసుకరావాలిగాని శశాంకజీ ఎందుకు తీసుకురావాలీ అని। ఇందులో పెద్దరహస్యం ఉన్నది - అహ్హ హ్హ హ హ।' బావన్‌దాసు విచిత్రంగా నవ్వుతాడు. అలాంటినవ్వు ఎక్కడా చూడం. బాలదేవ్‌కూడా చూడలేదు।

'ఎందుకు ? ఎందుకు అలా నవ్వుతావు ?'

'అహ్హ హ్హ హ్హ !....ఆ ఆఫీసు సెక్రెటరీలేదూ. లేచి అన్నారూ - ఛోటన్ బాబూ। మీరన్నది అక్షరాలా నిజం। రైలు ఎలాగూ వెళ్ళిపోయింది. కటిహార్ దాకావెడితే రైలు అందవచ్చు - వెంటనే కార్లో ఇద్దరూ వెళ్ళిపోయారు। ప్రెసిడెంటూ, సెక్రెటరీ। ఆహా। ఇద్దరూ భస్మం తీసుకొని వస్తారు। దేశాన్ని భస్మం చేసి పారేస్తారు వీళ్ళంతా। భస్మాసురులు।'

'దాసుగారూ। చూడబోతే ఎవరో సోషలిస్టు మిమ్మల్ని....।'

'సోషలిస్టా ? సోషలిస్టు। సోషలిస్టు నాకేం చెబుతాడు ?....నాయనా, పార్టీలన్నీ ఒకటే। ఆ పార్టీలోకూడా పెద్దపెద్దవాళ్ళంతా మంత్రులు కావడానికి కొట్టుకు వస్తున్నారు. బాలదేవ్, అందరూ ఎం.ఎల్.ఏ. లూ మంత్రులూ కావడానికే చూస్తున్నారు। దేశంకోసమని, బీదసాదలకోసం. కార్మిక కర్షకులకోసం పాడుపడతామని చెప్పేవాళ్ళంతా ఈ లోభంతోనే పని చేస్తున్నారంటే నమ్ము।... ఆ పార్టీలో ఒక జయప్రకాశ్‌బాబున్నాడు। అహ్హ హ్హ హ్హ।....ఆయననుకూడా ఎవరో కాల్చి చంపేస్తారు।.... మళ్ళా భస్మం తీసుకరావడానికి ప్రెసిడెంటు సెక్రెటరీలు కలిసి....।'

కొత్త అటుకులు కొత్త బెల్లం ప్లేట్లో పెట్టుకొని తీసుకొచ్చింది లక్ష్మి.

కొంచెం ఫలహారం తీసుకోండి!.... కొంచెమే! పాలు విందుకోసమని తోడు పెట్టాను!'

బావనదాసు పక్కనున్న తపనంచి తెరిచాడు! 'అదేమిటండీ? ఫలహారం తీసుకోండి; సంచిలో ఎందుకు పెడుతున్నారండీ?' అని అడిగింది లక్ష్మి.

లక్ష్మి కళ్ళు చెమర్చాయి....ఇన్ని రోజులతరువాత వైష్ణవుడు ఇంటికొస్తే తినకుండా పంపించడమా! ఊహుఁ! వెళ్ళనివ్వదు?

'ఫలహారం మీరు తీసుకోవాలి. 'లక్ష్మి బలవంతం చేస్తుంది' - దాస్‌జీ విన్నవించుకుంటున్నాను!'

బావన్‌దాసు బాగా మారిపోయాడని బాలదేవ్ అనుకొన్నాడు—ఏమేమో మాట్లాడేస్తున్నాడు!....మొహం అదోలా వున్నది, కళ్ళు ఎర్రబడ్డాయి; బట్టలు మురికిగా వున్నాయి. జానాబెత్తెడుగుడ్డ నడుందాకా ఉన్నది. అదికూడా చిరిగి ముక్కలు ముక్కలయింది....ఎలా నవ్వుతున్నాడు?....గత పదహారు పదిహేడు సంవత్సరాలనుంచి బావన్‌దాసును ఎరుగు! ఇలా ఎప్పుడూ నవ్వేవాడు కాదు!.... అద్యామినియం చెంబూ, బక్కెట్టూ ఎప్పుడూ వదిలిపెట్టడు!

ఫలహారం ముగించి చెయ్యి కడుక్కుంటూ - బాలదేవ్‌జీ! ఇక నేను వెళ తాను. తూర్పులైనుబండి కొదాలియాస్టేషన్‌కెళ్ళి ఎక్కుతాను!....మీతో ఒక పని వున్నది! అని బావన్‌దాసు అన్నాడు.

బావన్‌దాసు సంచిలోనుంచి ఎర్రరంగు సంచితీసి, దానిలోనుంచి ఒక చిన్న పొట్లం బయటికి తీశాడు. 'బాలదేవ్‌జీ!....ఇవన్నీ మహాత్మాజీ రాసిన ఉత్తరాలు. గంగూలీగారు ఎప్పుడో ఒకసారి అన్నారు - నా కివ్వమని! వచ్చేప్పుడు మరచి పోయాను. మీరు పూర్ణియా ఎప్పుడు వెళతారు? నాలుగైదురోజుల తరువాతనా?... సరే! మీదగ్గరుంచండి. గంగూలీగారి కిచ్చెయ్యండి!....తప్పకుండా!'

ఎంతో శ్రద్ధాభక్తులతో జాగ్రత్తచేసిన ఆ పవిత్రమైన ఉత్తరాలను బావన్‌దాసు రెప్పార్పకుండా చూస్తున్నాడు....ఒక్కొక్కఉత్తరాన్ని విడివిడిగా తీశాడు. ఒక ఉత్తరం గాలిలో ఎగిరి, మంచంకిందికి పోయింది. బావన్‌దాసు దాన్ని తీసు

కొని కళ్ళ కద్దుకొన్నాడు....వాటిలోని ఒక్క అక్షరంకూడా చదవడం అతనికి రాదు। కాని ఉత్తరంలోని ఒక్కొక్క-శబ్దాన్ని పరిశీలిస్తున్నట్టుగా వాటివైపు చూస్తున్నాడు - నిజంగా చదివేస్తున్న వాడిలా।....చివరికి ఉత్తరాన్ని పూర్తిచేసి దీర్ఘంగా నిట్టూరుస్తాడు !

ఆ కట్టను చేతిలోకితీసుకుని కొంచెంసేపు అప్రయత్నంగా దానికి కట్టిన దారాన్ని ఊడదీయడం, కట్టడం చేశాయి అతని చేతివేళ్ళు। దీర్ఘంగా నిట్టూర్చి అకస్మాత్తుగా లేచినిలబడి—'తీసుకోండి।....సీతారాం। సీతారాం।।'

బాంటేవ్ కట్ట తీసుకొని లక్ష్మి చేతికిచ్చి - 'పెట్టెలో పెట్టు।' అన్నాడు।

లక్ష్మి ఉత్తరాలకట్ట తీసుకొని కళ్ళకద్దుకొని. తరువాత రొమ్ము కద్దుకుంటుంది. కన్నార్పకుండా ఆమె బావనదాసువైపు చూస్తున్నది।....'ఈ చిరిగిపోయిన బొద్దరుదుప్పటికి చలి ఎలా ఆగుతుందండీ బావన్‌దాసుగారూ।'

'దాసుగారూ। ఈ దుప్పటి చలిఆపదు। ఉండండి. పాతగొంగళి ఒకటి వున్నది పట్టుకెళ్ళండి!' లక్ష్మి ప్రార్థనాపూర్వకంగా అన్నది।

'వద్దమ్మా।' బావనదాసు జోలె తగిలించుకుంటూ అన్నాడు—'కంబళి వద్దమ్మా। వద్దు।'

లక్ష్మి మారుమాట్లాడదు...బావన్‌దాసుకు ఇక కంబళి అవసరంలేదు। ఇప్పు డాయనకు ఏ వస్తువూ అక్కర్లేదు।...।.లక్ష్మికి విషయమంతా ఇట్టే అవగతమవుతుంది.

ధర్తీఫాట్ మేఘ్ మిల్
కపడాఫాట్ డోర్
తన్ ఫాట్‌కీ బౌషధీ
మనఫాటే నహిఁ ఠౌర్।

—భూమి. వస్త్రం. శరీరం - వీటివిచ్ఛిత్తికి మార్గోపాయాలున్నాయి. కాని మనస్సు విరిగిన వ్యక్తికి ముక్తిలేదు.

'ఇక వస్తాను! జై హింద్!'

'జై హింద్!'

బావన్‌దాసు దొర్లుకుంటూ వెళ్ళిపోతున్నారు!....పోలరన్‌వాళ్ళ కుక్క అతనిమీదికి ఉరికింది మొరుగుతూ! కాని బావన్‌దాసు దానివైపు చూడనేలేదు! కుక్కకూడా ఆశ్చర్యంతో ఊరుకుండిపోతుంది. ధూత్ ధూత్ అనికూడా అన లేదు!....ఎటువంటి మనిషి? కుక్క తోకాడించుకుంటూ బావన్‌దాసు వెనుకే. మట్టివానన చూసుకుంటూ కొంతదూరం వెళ్ళింది.

'బావనదాస్‌జీ మనస్సు విరిగిపోయింది!' లక్ష్మి అన్నది.

'ఎందుకు విరిగిపోవాలి? అనవసరం! ఈ ఉత్తరాలు ఆ గంగూలీజీ ఏం చేస్తారు?'

కోదలియాస్టేషన్‌లో రైలెక్కినతరువాత బావన్‌దాసుకు - తీర్థయాత్రలకు బయలుదేరి నట్లనిపించింది. చాలాకాలంనుంచి జగన్నాథయాత్రకు వెళ్ళాలని ఎంతో కోరికగా వున్నది! కేదార్‌నాథ్, బద్రీనాథ్‌యాత్ర ఇదివరకే చేసివచ్చారు! అతని కళ్ళఎదుట జగన్నాథుడి చిత్రం, గొడుగు, చేతికర్రతో తీర్థయాత్రనుంచి తిరిగి వచ్చిన బావన్‌దాసు రూపం కనిపిస్తుంది!

జగర్‌నథియారౌ భాయ్

బావారౌ బిరాజే ఉడియాదేస్‌మే!

'మాఘమాసంలో ఎవరయ్యా జగన్నాథం సేవించివచ్చింది?' ప్రయాణీకుల్లోనుంచి ఎవరో అన్నారు.

'బావన్ గోసాయిగారూ! కొంచెం దగ్గరగా అనండి!' మరొకవ్యక్తి అన్నారు!

బావన్‌దాసు కిటికీలోనుంచి బయటికి చూస్తున్నారు! పొలాల్లో జనం ధాన్యం కోస్తున్నారు!....నదిలో చేపలు పడుతున్నారు. గేదెలు మేపుకుంటున్నారు. బావన్ చాలా చాలాచోట్లు తిరిగాడు—కలకత్తా కాంగ్రెస్, లక్నో కాంగ్రెసు, బెజవాడ, సబర్మతిఆశ్రమం, మహాత్మాగాంధీజీ జన్మభూమి కాతియావాడ్, ఆ తరువాత

బొంబాయి।....రైల్వేలైన్ ప్రక్కన పనిచేసే వివిన్నప్రదేశాల మనుషులమొహాలు. అతని కళ్ళముందర తారట్లాడినాయి।....ఖగడాస్టేషన్‌లోదిగి నాధ్‌బాబుదగ్గరకు వెళ్ళాలనిపించింది; కాని ఆయన కలకత్తా వెళ్ళారు। ఖోఖీ దీదీ. పిన్నికూడా వెళ్ళారు....ఖోఖీ దీదీ ఒకపర్యాయం బాసన్‌దాసుచిత్రం గీచింది।....పిన్ని మాయాశీలాగానే మాట్లాడుతుంది।....నాధ్‌బాబు ఉంటే ఇవ్వాళ్ళ బాసన్‌కు ఎంతో సహాయం లభించిఉండేది। చాలా పెద్దమనిషి। కోపంవస్తే మనిషిమొహం ఎర్ర బడిపోతుంది....క్రిందటిసంవత్సరం నాధ్‌బాబు. చౌధరీజీ బొంబాయి వెళ్ళినప్పుడు బాసన్‌కూడా వెంట ఉన్నాడు। మొగల్‌సరాయ్ స్టేషన్‌లో బండిలో ఏ పెట్టె ఖాళీగా కన్పించలేదు। రైలు కదలబోతూఉన్నది. నాధ్‌బాబు ఒక పెట్టెలోకి ఎక్కేందుకు హాండిల్ పుచ్చుకునేప్పటికి లోపల్నుంచి—'కన్పించడంలేదా. ఇది బెంగాల్ మెంబర్స్‌కు రిజర్వ్ చేశారు।' అని అన్నారు।

'బాగానే కనిపిస్తున్నది। బెంగాల్‌లో మీలాంటివారుకూడా ఉహించేది కూడా చూస్తున్నాను. మేంకూడా ఏ.ఐ.సి.సి. మెంబర్లమే। మీరూ ఆ మెంబర్లే। కాని మానవత్వం....।' నాధ్‌బాబు కోపంగా అనేశాడు!

లోపల్నుంచి ఎవరో నవ్వుతూ—'మానవతా తూతే అర్ కొథా బోల్‌బేన్ వామోశాయ్।....అ సూన్. అపనారాతో దేఖిబీ ఏక్ బారే 'త్రిమూర్తి'....।'

(దయచేసి మానవత్వం అనేప్రశ్న తీసుకరాకండి। కూర్చోండి వచ్చి. ఒకే సారి మాకు 'త్రిమూర్తుల్ని' సందర్శించే అదృష్టం కలిగింది।....)

అందరూ నవ్వారు। చౌధరీజీ. నాధ్‌బాబు. పెట్టెలో తదితరసభ్యులుకూడా।....చౌధరీజీ చాలా భారీమనిషి। ఇక నాధ్‌బాబు కొంచెం పొట్టి। గుండ్రటిమొహం. ఎప్పుడూ నవ్వుతూ ఉంటాడు। ఇక మూడోవాడు - వీడే బాసన్‌దాసు। ఆలోచించి చూడండి। నవ్వురాదూ మరి?....చౌధరీజీ పైన పడుకున్నాడు. నాధ్‌బాబు. బాసన్ దాసు కింద।

'ఆఁ, ఖగడా వచ్చేసింది।....సీతారామ్। సీతారామ్।'

ఖగడా స్టేషన్‌లోదిగి బాసన్‌దాసు ఒకసర్యాయం ఆకాశంమీదికి చూశాడు।

సాయంత్రానికల్లా వెళ్ళిపోవచ్చు!.... ఉహూం....నాథ్‌బాబు లేనప్పుడు ఇంకెవర్ని చూడాలి?....

కలీముద్దీపూరువైపు వెడుతున్నాడు. బావన్!....కలీముద్దీపూరు పాకిస్తాన్‌లో కలిసిపోవలసింది; తప్పిపోయింది. ఒకసారి భారతదేశంలో ఉంటామని గొడవ చేశారు. మరొకసారి పాకిస్తాన్‌లోకి వెడతామని!....ఊరిపేరునుబట్టి మాకే చెందాలని పాకిస్తాన్ కోరినట్టు తెలిసింది.

....సీతారాం. సీతారాం!....బావన్‌దాసు గబగబా నడుస్తున్నాడు!...., ఇవ్వాళ్ళ ఒకచోటికి వెళ్ళాలి....ఆ చోటునుగురించి అప్పుడే మనస్సులో అనుకో కూడదు!

నడుస్తూ నడుస్తూ శ్వాస పీల్చుకుంటున్నాడు - ఆగి ఆగి. చాలాసేపటివరకు ఏడ్చిన కుర్రవాడు శ్వాస పీల్చుకుంటున్నట్లు! బావన్ జోలెలో ఖంజరున్నది. దాని కున్న గజ్జెలు అతనినడకకు లయ కలుపుతూ మోగుతున్నాయి - కిన్న్ కిన్న్ కిన్న్ కిన్న్...!... గమ్యస్థలందగ్గరి కొస్తున్నది. కిన్న్ కిన్న్ కిన్న్ కిన్న్! మరి కొంచెం దూరం! అరకోసు.... కిన్న్ కిన్న్!

జై మహాత్మాజీ! జై బాపూ! ఒక పరీక్షలో ప్యాసు చేయించావు! ఇక ఇక్కడే! ఈ చెట్టుకింద! ఈ కాలిబాటదగ్గర - మకాం పెడతాము!

....నాగర్ నదీతీరం! ఉభయదేశాలవాళ్ళు ఈనదిని సరిహద్దుగా ఏర్పాటు చేసుకున్నారు! ఒక ఒడ్డు భారతదేశంలో, రెండవఒడ్డు పాకిస్తాన్‌లో! ఇటు భారత దేశం, అటు పాకిస్తాన్! నాగర్‌నది సంవత్సరంపొడుగూ ప్రవహిస్తూనే ఉంటుంది.

మాఘమాసపు వణికే చలి!....పడమరగాలి వీస్తున్నది!....ఈ రోజు ఇక్కడ బద్రీనాథ్‌లో పడినట్టు మంచు కురుస్తుందేమో?....సూర్యు డుదయించే దాకా ఇక్కడనుంచి కదిలేదిలేదు! ఈదారిన రాకపోతేనో బండి? దూరంగా వెలు తురు కన్పిస్తుంది - ఏదోగ్రామంనుంచి!.... చేతులు రెండూ రాపిడిచేసి వేడిని కల్పించుకుంటాడు....బళ్ళు ఇటే వస్తాయి. ఎవరు చెప్పారు తనకు? అతనిపేరు ప్రాణంపోయినా బయటపెట్టడు! సంచలబళ్ళు!....బట్టలు, పంచదార, సిమెం టుతోనిండిన బళ్ళు! అతనిపేరు చెప్పడు! ఉద్యోగం పోతుంది! కటహా కటహా

దులార్‌చంద్ కాప్రా - జాదంకంపెనీ యజమాని! అతని కంపెనీముందే నేపీ లాల్, భోలా, బావన్ పికెటింగ్ చేశారు. ఫారబిస్‌గంజ్ మేలాలో! రకరకాల వ్యాపారాలు చేసేవాడు! అతడే ఈనాడు కటహా తాణా కాంగ్రెసు కార్యదర్శి! అతనికి బళ్ళు రావలసింది! పస్తై ఇనస్పెక్టరుకు. కటహా తాణా ఇనస్పెక్టరుకు. కలముద్దీపూరు తోలుగేటు హవల్దారుకు అర్ధరూపాయి వాటా, దులార్‌చంద్ కాప్రా వాటా అర్ధరూపాయి! బళ్ళు మామూలుదారిన రావు! దొంగదారిగుండా వస్తాయి. సరుకు అటువైపు వ్యాపారులకు చేరుతుంది. అటువైపు అధికారులకుకూడా ఇలాగే వాటాలుంటాయి. లక్షలరూపాయల వ్యాపారం!—ఆ(, వస్తున్నాయి... బళ్ళు వస్తున్నాయి.

జై భగవాన్! జై మహాత్మా! సీతారామ్! సీతారామ్! బలాన్ని ప్రసాదించు ప్రభో! పరీక్షలో నెగ్గేట్టుచెయ్యి! బాపూ! బాపూ! అమ్మా! అమ్మా! జోలెలో దేనికోసమో వెదుకుతాడు!

జోలెను భుజానికి తగిలించుకొని నిలబడ్డాడు! ...నదిఒడ్డున ఏదో అరిచింది! టింటిక్!....కిన్న్....ఖంజరు సన్నగా మోగింది. 'భగవాన్! మహాత్మాజీ! బాపూ! అమ్మా! నన్ను నీదగ్గరకు తీసుకుపో! ఈ ప్రపంచంలోవుండి నేనేం చేస్తాను!.... ధర్మానికి రక్షణ లేదు.'

బళ్లు వచ్చాయి. చాలా దగ్గరికొచ్చాయి.

'బా-బో-య్? భూ ఽఽ త-ం!' ముందుబండివాడు భయపడి పక్కబండితో అంటాడు—'భూతం!'

'ఛి ఊం'....ఎద్లు బెదిరాయి! బళ్ళు ఆగిపోతాయి!

'సీతారాం! సీతారాం!'

కలిముద్దీపూరు తోలుగేటు సైనికుడు ముందుకొచ్చి, కొద్దిగా దగ్గి-'ఎవరు?' అని అడిగాడు.

పక్కగావున్న నీడకు ఎదురుగావచ్చి—'నన్ను బావన్‌దాస్ అంటారు!' అని అన్నాడు.

'రా-వ-న-దా-సు!' సైనికుడు విభ్రాంతుడై నిలబడిపోయాడు. తమ ఇతర్ని ....ముస్సైనమంచే ఎరుగు!

సైనికుడు మొహానికి టోపీ అడ్డం పెట్టుకున్నాడు. రావన్‌దాసు నవ్వి - 'రామబురూవన్‌సింగ్‌గారూ! ఇద్దాళ్ళు ఏదో ఒకటి తేలిపోవాలి. అలా మొహం దాచిపెట్టుకుంటారేమిటి?' అని అన్నాడు.

'దాసుగారూ! ఇందులో నా తప్పేముంది?....మీ కంతా తెలుసు!....'

'సింగ్‌గారూ! మాటలు కట్టిపెట్టండి. బళ్లు వెనక్కి వెళ్ళిపోవాలి అగదా! తిప్పించండి!'

'బళ్లు తిరిగి వెళ్ళవు!'

'బళ్లు తిరిగి వెళ్ళాలి!'

రెండున్నరవేల రూపాయలు రామబురూవన్‌సింగ్‌కు తనవంతు వాటాగా లభించాయి. ఇప్పుడేం చెయ్యాలి?

'దాసుగారూ; కొంచెం ఆగండి! ఇప్పుడే వస్తాను.'

'అలాగే! వెళ్ళి తెరవెనుకవున్నవాళ్ళను బయటికి తీసుకరండి!'

కలీముద్దీపూరులో ఒక హాల్టింగ్‌బంగళా ఉన్నది....ఆఫీసర్లు మకాంచేస్తూ ఉంటారు. ఊరుబయట వున్నది.

హాల్టింగ్ బంగళాలో వస్తై ఇనస్పెక్టరు, దులార్‌చంద్ కాప్రా, కలీముదీపూరు హవల్దారు టేబుల్‌చుట్టూ కూర్చొని మోరంగియా 'వరకు' సేవిస్తున్నారు. హాల్టింగ్ బంగళాలోవున్న వంటవాడుచేసిన కోడిమాంసం తిన్న ఏ వ్యక్తీ బక్షీసు ఇవ్వకుండా ఇంతవరకు వెళ్ళలేదు.

వస్తై ఇనస్పెక్టరు ఒక గుటకతాగి 'ఛీ, వట్టిమాంసం, మద్యంతో ఏం సరిపోతుంది? హవల్దార్! ఎక్కడైనా....రెండుపెట్టలు దొరుకుతాయేమో....!' నవ్వుతూ అన్నాడు.

'పెట్టలాండి?....మహాత్మాజీ శ్రాద్ధకర్మగదండీ! అందుకని అమ్మాయిలంతా విందుకెళ్ళారు!'

'ఊ....! ఈసంగతి నాకు ముందేతెలిస్తే కటహానుంచి ఇద్దరు రెఫ్యూజీ యువతుల్ని కొట్టుకొచ్చేవాణ్ణి! ఈ 'చుక్క'తో ఆ 'చుక్క' లేకపోతే ఆనందమేముంది!' అని దులార్‌చంద్ కాప్రా అన్నారు.

కర్ కార్ - కరక్! సబ్ ఇనస్పెక్టరు చతురానందసింగ్ కోడికాలు నమిలేస్తున్నారు.

కర్! కార్ - కరక్! బయట సైకిలుమోత!

'ఎవరు?'

'నమస్కారమండి! నేను రామబురూపన్‌సింగ్‌ని!'

'ఏమిటి?'

'అంతా తల్లకిందు లైందండీ! బావన్‌దాసు....!'

'ఆఁ....బావన్‌దాసా?....ఏదీ?'

అందర్నీ పురుగు ముట్టినట్టయింది. బృహస్పతి వంటవాడు పైగచేసి హవల్దారుతో—'పెట్ట దొరుకుతుంది! కాని....' అగి రెండుచేతులపేళ్ళూ చూపిస్తాడు!

'అగు అగు! నువ్వు కొంచెం బయటికెళ్ళు!' హవల్దార్ అన్నాడు.

అందరూ దీర్ఘంగా నిట్టూర్చారు—'ఇప్పుడేం చెయ్యాలి?'

'ఒక్కడేనా ఇంకెవరైనా....'

'ఒక్కడే!'

'....కాని....దీని అర్థం ఏమిటో తెలుసా?'

'దులార్‌చంద్‌గారూ!....కాప్రాగారూ!'

అందరిదృష్టులూ ఒక్కసారి కలుస్తాయి. దులార్‌చంద్ గ్లాసులో మద్యం పోసుకొని గటగట తాగేశాడు. అందరూ అతనివైపు ఆశగా చూశారు!....'నేను వంటాలీని!....అపైది మీరు అర్థం చేసుకోండి. నావనివి నేను పూర్తిచేయడానికి వెడుతున్నాను!'

....వడమటిగాలి నెమ్మదిగా వీస్తున్నది. హవల్దార్ సైకిలు నడుపుతూ

అన్నారు—'కాప్రాగారూ! ఈ చుట్టుపక్కల గ్రామస్థులనుగురించిన భయం మీ కేమీ ఉండవవసరంలేదు. పరిహద్దుగ్రామాలలో రాత్రిపూట ఎవరు బయటికొచ్చినా తుపాకితో కాల్చడం జరుగుతుందని ఇదివరకే అందరికీ తెలియజేశాం.

బావన్‌దాసు రాతివిగ్రహంలాగా బళ్ళదారి మధ్యలో నిలబడివున్నారు.

దులార్‌చంద్ కాప్రా చూశాడు—బావన్!

'ఎవరూ?....కాప్రాజీ! బండివెనకనుంచి తొంగిచూస్తున్నారేమిటి? ఎదురుగా రండి!' బావన్‌దాసు నవ్వారు.

'బావన్!....దారి కడ్డంగా లే! బళ్ళను పోనియ్!'

'ఎదుటికి రండి! బండిని పోనివ్వండి. మీరూ కాంగ్రెసు మెంబరే, నేను కాంగ్రెస్ మెంబర్నే! ఖాతాపుస్తకం తెరిచేవున్నది. మీ జమాఖర్చు మీరు రాయించుకోండి!.... ఈ పవిత్రమైనరోజున ఈ కళంకాన్ని నేను భరించలేను!'

ఇతనితో చర్చకు దిగడం వ్యర్థమని కాప్రాకు తెలుసు! హవల్దార్ చెవిలో ఏదో చెప్పాడు. ఆ తరువాత 'ఇన్‌స్పెక్టర్ ఖాన్!' అని పిలిచాడు.

ఈ ఇన్‌స్పెక్టర్ ఖాను కాప్రాకు బంటు!.... ఒక బండిలోనుంచి దిగి, మెదలకుండా ముందుబండిలోకెక్కి కూర్చున్నాడు.

'బావన్‌దాస్! వింటావా లేదా?'

'............'

'ఇన్‌స్పెక్టర్ ఖాన్! బండి తోలు!'

బండికి కట్టిన ఎద్దులు ఆశ్చర్యంతో ఉలిక్కిపడతాయి. బెదురుతాయి. ఛి ఊఁ! ఛి ఊఁ!! ముక్కుపుటాలనుంచి ధ్వనిని వదులుతూ ముందుకు నడవకుండా మొరాయిస్తాయి. కాప్రా ఒక ఎద్దుతోక పట్టుకొని మెలిపెట్టాడు. ఎముక పటమన్నది. కాని ఎద్దు గాడివదిలి పక్కనుంచి పరుగెత్తాయి.

రెండవబండి! ఒక ఎద్దుతోకను హవల్దార్, మరొకదానితోకను కాప్రా పట్టుకొని మెలిపెట్టి ముందుకు అదిలించారు. బండివాడు ఆశ్చర్యపోతాడు! పగ్గాలు పట్టుకొని అలాగే వుండిపోతాడు! ఏమిటిది?....

బళ్ళు సాగిపోతున్నాయి. సాగిపోతున్నాయి. బావన్‌దాసు మధ్యలో నిల బడ్డాడు. బళ్ళు అటూ ఇటూ వెళ్ళిపోతున్నాయి. ఎడ్లు బెదురుతున్నాయి. కాని....

మూడు, నాలుగు !....నాలుగుబళ్ళు!

ఇప్పుడు బావన్‌దాసు బండి కెదురుగావచ్చి నిలబడ్డాడు. ఎద్దులు ఎత్తి కుదేస్తాయి. బండి గాడిలో దొర్లిపడ్డాడు....చక్రం క్రింద!

ఫడ్ ఫడ్ ఫడ్!

...బాపూ!...అమ్మా!...

బండి దాటిపోయింది. కట్ - కర్ర్ - కట్!

బళ్ళు దాటిపోతున్నాయి. ఏభై బళ్ళు!

చివరిబండి వెళ్ళిపోయాక హవల్దారు, రామబుదూవన్‌సింగ్ కలిసి బావన్ ముక్కలు ముక్కలుగా తరగబడ్డ శవాన్ని, రక్తపుముద్దగామారిన శవాన్నితీసుకొని వెడతారు. నాగర్‌నదికి అటువైపున పాకిస్తాన్‌లో పడెయ్యాలి. ఇటువైపున...పొర పాటునకూడా దీన్ని ఉంచకూడదు!

దులార్‌చంద్ బావన్ జోలె తీసుకొని వాళ్ళవెంట నడిచాడు.

నాగర్‌నది దాటుతున్నప్పుడు బావన్ మెడలోని తులసీమాల జారి నాగర్‌నదీ ప్రవాహంలో మిళితమైంది - సీతారామ్!

ఉదయం పాకిస్తాన్ పోలీసులు గస్తీ తిరుగుతున్నప్పుడు చూశారు శవం!

'అరె! ఇది అటువైపువున్న మనుగుజ్జువాడి శవం! ఇక్కడి కెలావచ్చింది? అర్థమైంది!...ఇదుగో హనీఫ్! బొమ్మన్! ఈ శవాన్ని అటువైపుకు తీసు కెళ్ళండి!'

బావన్‌దాసు చల్లటిశవాన్ని, అతగాడి జోలె, తడితర నరంజామాతో బయలుదేరదీశారు!

బావన్ రెండు స్వతంత్రదేశాల - భారతదేశం, పాకిస్తాన్ - దేశాల విభా యితీవి, మానవత్వాన్ని రెండడుగులతో కొలిచాడు!

నాగర్‌నది మధ్య కొచ్చినతరువాత పాకిస్తాన్ పోలీసు ఆఫీసరు—'శవాన్ని నటిలో పడెయ్యండి। అతగాడి జోలె, జోలెతీసు కెళ్ళి అటువైపునున్న చెట్టుకు కట్టి రండి। త్వరగా!' అని ఆదేశించారు.

నాగర్ నదీప్రవాహం హఠాత్తుగా కలకల నినాదం చేసింది. పైనికుడు అంజరుమ నీళ్ళలో పడేస్తూ—'డమరుకాన్ని వాయించుకుంటూ 'రఘుపతి రాఘవ' పాడుకో!' అని అన్నాడు।...యునక్...।

## ఇరవయ్యొకటి

మేరీగంజ్ గ్రామంలోని ఏకైక భూస్వామి, ఏకైక జమీందారు, తాసిల్దారు బాబూ విశ్వనాథ్ మల్లిక్ ధాన్యపుకళ్ళం చూడండి।...ఇక్కడ వేసిన పందిర్లోనే గాంధీజీ శ్రాద్ధకర్మరోజున ఏకపంక్తి భోజనాలు జరిగాయి. పదిబీఘాల స్థలంలో ధాన్యం నూర్చడానికి కళ్ళం ఏర్పాట్లు జరిగాయి.

రామక్రిపాల్‌సింగ్ మిగిలిన కాస్త కొండా తాసిల్దారుకు కుదువబెట్టి తీర్థయాత్రలకు బయలుదేరాడు - కాశీ, కేదారనాథ్ — ఇంకా వీలయితే మరికొన్నిచోట్లకూ। తాసిల్దారు—'మిగిలిన డబ్బుకోసం ఉత్తరం రాయండి. ఎక్కడకు పంపమంటే అక్కడకు మనీఆర్డరు చేస్తాము.' అని అన్నారు.

ఇంటిఖర్చుకు, బట్టలకు, నకలదీప్‌కు శాంతి చేయించడానికి, సత్యనారాయణవ్రతానికి—మొత్తం రెండువందలరూపాయలు కావలసివచ్చి ఖేలావన్ సింగ్ అప్పు అడగడానికి తాసిల్దారుదగ్గరకు వెళ్లాడు. ఆయన విర్మోహమాటంగా సమాధానం చెప్పేశాడు—'చేతిలో చిల్లిగవ్వ లేదంటే నమ్ము!'...ఇంటివెనక కోతకు వచ్చి సిద్ధంగావున్న పొలం రాసిఇచ్చాక మూడువందలరూపాయల అప్పు దొరికింది.

అంతా కలుపుకుంటే ఈ పర్యాయము ఆయనకు అయిదువేల మణుగుల ధాన్యందాకా రాలవచ్చు।

తాంత్రికుల పేట. కమ్మర క్షత్రియుల పేట. బోయ క్షత్రియుల పేట. గహలోత క్షత్రియుల పేట. దాసివాళ్ళ పేటకు చెందిన కార్మిక కర్షకులఇళ్ళల్లో విత్తులు మాఘమాసంలోనే విందుకున్నాయి. ఇక ఇప్పుడు నూర్పే ధాన్యానికి నాలుగురెట్లు అప్పు ప్రతివాళ్ళకూ ఉన్నది. ఈ పర్యాయం గ్రామంలోని ఏ ఇంట్లోనూ పొయ్యి రాజేట్టు లేదు. పిల్లి లేచేట్టు లేదు. ఫేకావన్ యాదవ్ అయిదు అరకలభూమి ఒక అరకలోకి వచ్చింది. రామక్రిపాల్‌సింగ్ వ్యవసాయమే ఎత్తేశాడు. ముసలిదాన్ని తీసుకొని యాత్రలకు బయలుదేరాడు। శివశంకరసింగ్‌కు రెండు అరకలు।... తాసిల్దారు ఈ పర్యాయం ట్రాక్టర్ కొనబోతున్నారు. సుమరితదాసు అన్నాడు – 'దాంట్లోనే అన్నీ వుంటాయి. నాగలి, గొర్రు, గుంటక, ధాన్యం కోసేది, నూర్చేది- అన్నీ అందులోనే అమర్చివుంటాయి. మనుషుల అవసరమే లేదు. నీళ్ళపంపులు కూడా వస్తున్నాయి. ఇంద్రభగవానుడిమీద ఆధారపడవలసిన అవసరమే ఉండదు। కమలానదిలో పంపు తగిలించి ఇక్కడ మిషను తిప్పితేచాలు - పొలంలోకి నీళ్ళు ఉరుక్కుంటూ వస్తాయి' ...ఇంద్రభగవానుడి నెత్తినే చెయ్యి పెడుతూ ఉంటే ఇక మనుష లొక లెక్క. జమా? కటిహార్‌లో జూట్ మిల్లొకటి తెరిచారు. అంటే మొత్తం మూడు మిల్లులా?...సరే, మంచిదే। రెండురూపాయల కూలి దొరుకుతుంది? ఊళ్లో ఏముంది. బూడిద?

మహాత్మాజీమీద ఆశ పెట్టుకొనివుంటే ఆయనను కాస్తా పరలోకం పంపించేశారు।...బాలదేవ్‌ను అడిగిచూడండి - మహాత్మాజీస్థానంలో ఇప్పుడెవరొస్తారో? జవాహర్‌లాలా? కాని మహాత్మాజీ కౌపీనంతో కాలక్షేపం చేశారే।...

విరంచీ అంటున్నారు—'పన్నెండువర్ణాల ప్రజలూ, భేదభావంలేకుండా ఏకపంక్తి భోజనాలు జరిపినచోట ఆకాశాన్ని అంటే ధాన్యంరాశి ఏర్పడింది...'

....ఈసారి ప్రతివాళ్ళూ తమ పీలునుబట్టి ఒక 'కట్ట' (అయిదుచేతుల నాలుగంగుళాల భూమి)లో ధాన్యం. అరకట్టలో ధాన్యమో, సేరో, అర్ధసేరో - మహాత్మాజీ చందాగా ఇవ్వవలసివుంటుందని తాసిల్దారుగారు అన్నారు.

'మహాత్మాజీకి చందా? ఈ చందాతో ఏం చేస్తారు? కర్మకాండ అంతా అయిపోయిందిగా?'

'...అది కాదు! రహంవా గురుబంసీబాబు ఢిల్లీ వెళ్ళి కోటిరూపాయలో, ఒక లక్షో, ఒక వెయ్యో అనుకుంటాను...గుర్తు రావటంలేదు - మొత్తానికి చాలా పెద్ద మొత్తం తీసుకెళ్ళి గురుబంసీబాబు జవాహర్‌లాల్ నెహ్రూకి ఇచ్చి వచ్చారట!... మహాత్మాజీ చందా! గాంధీ నిధి! ఇంకా తీసుకెళ్ళి ఇవ్వాలట!'

'అఁ! ఎవరక్కడ గల్లంతు చేస్తున్నది?'

'ఇంకెవరు? రామప్రియ!'

రామప్రియ, రామప్రియ తల్లి గొంతులు విన్పించాయి. మఠంలో పోట్లాట జరుగుతున్నది. తగువులాట మరింత పెచ్చుపెరిగినట్టుంది - ఈరోజున!

రామదాసు గోసాయి ఈమధ్య రాత్రింబవళ్ళు గంజాయి ఎక్కువగా సేవిస్తున్నారట! ఏదో ఒకరోజున అతనూ హత్యకు పాల్పడవచ్చు!'

'నాయాలు!....ఇలాంటివాళ్ళ పాపకార్యాలవల్లనే ప్రపంచం ఇలా తగలబడింది....భ్రష్టం చేసిపారేశారు!....అది మఠంలాగా లేదు! లాల్‌బాగ్ తిరునాళ్ళ మీనా బజారులాగా తయారైంది. చుట్టుపక్కల పది పన్నెండు కోసులదూరంలో వున్న లోఫర్లువచ్చి ఇక్కడ మకాం పెడుతున్నారు!'

ఈమధ్య రాత్రిపూట తాసిల్దారు, సుమరితదాసుతో కలిసి మేడపైన ఏవో కాగితాలూ, దస్తావేజులూ సరిజేస్తున్నారు! ఒక్కోరోజున సుమరితదాసు మెట్లు దిగుతూ పడిపోతున్నాడు!....సంథాలతెగల ఇళ్ళల్లోని ఇప్పసారాయి చాలా ఘాటుగా చాలా విషాగా ఉంటుంది! పల్లెవాళ్ళ గంగాయ్ రోజూ ఒక 'బుడ్డి' తెచ్చిఇచ్చి వెడుతూఉంటాడు. అప్పుడప్పుడు తాసిల్దారుకూడా కిందికి దిగొచ్చి బాగా గొడవచేస్తూ ఉంటాడు. కమలను, కమల తల్లినీ, పనిమనిషి సేవియానూ తుపాకితో కాల్చి చంపుతానని బెదిరిస్తూ ఉంటాడు!

....ఒకరోజురాత్రి ఎంత ఎక్కువగా తాగాడంటే - తాసిల్దారు ప్రవర్తన చూసి ఆయనభార్య గుండె బాదుకున్నది. తల పీక్కున్నది! అన్ని తప్పుడుమాటలు ఆయన నోటివెంట రావడం ఆమె ఎప్పుడూ వినలేదు. జీవితంలో! తలుపు వేసి

వున్న కమల గదిదగ్గరకూడా అలాగే నోటికి హద్దూ అపూ లేకుండా మాట్లాడే వాడు. అప్పుడు కమల తలుపు తెరుచుకొని బయటికివచ్చి—'నాన్నా! కావాలంటే ఏదో ఒక శిక్ష నాకు విధించండి; అంతేగాని అమ్మనుమాత్రం తిట్టకు. ఆమె తప్పేముంది?' అని అన్నది.

కమలను చూడడంతోనే తాసిల్దారు మత్తు యావత్తూ ఒక్కసారిగా దిగి పోయింది. ఆయన గబగబా పైకి పరుగెత్తుకెళ్లారు.

ఆ రోజునుంచి తల్లి కమలనువిడిచి ఒక్కనిమిషంకూడా వేరుగా ఉండడం లేదు. గండుపిల్లివిచూపి పిల్లలప్లి కళ్ళు ఎంత తీవ్రంగా ఉంటాయి? తాసిల్దారు ఏ రోజున ఏ అఘాయిత్యానికి పాల్పడతాడోనని తల్లి భయపడుతున్నది!

ఒక వారంక్రిందట సారాయిలో ఒకమందుకలిపి తెచ్చి—'కమలకు తాగించు. ఆరోగ్యం బావుంటుంది. ఎంతో ప్రయత్నంమీద దీన్ని సాధించాను!' అని అన్నాడు.

ఆయన్ను నమ్మడం ఎలా? ఎప్పుడు ఏం చేస్తాడో?

ఊళ్ళోని ప్రతి ఇంట్లోనూ 'అలో లక్ష్మణా!' అనే ఆర్తనాదాలు వినిపిస్తు న్నాయి. ఉదయంనుంచి సాయంత్రందాకా, రాత్రిఅంతా కుప్ప నూర్పిళ్ళకు కూలికి కుదిరితే, ఆ వచ్చేకూలి, ఆ కళ్ళందగ్గరే అంతకుముం దెప్పుడో తీసుకున్న బాకీ కింద జమకట్టడానికి సరిపోతున్నది. మంగలి, చాకలి, మాదిగవాళ్ళ కివ్వవలసింది అలాగే ఉండిపోతున్నది. లాభంలేదు ఈసారి. కటిహార్ వెళదాం పద!....మిల్లు కూత కూస్తుంది రోజూ! వినిపించలేదా? మనల్నే పిలుస్తున్నది— 'రా ఓ ఓ ఓ ఓ ఓ హో హో హో.'

రాత్రిపూట సిద్ధాంతి దగ్గుతూంటే చాలా భయంకరంగా ఉంటుంది. ఖాంయె ఖాంయె! పగలు నరీఘా మధ్యాహ్నంపూట మామిడిచెట్టు కొమ్మమీద కూర్చొని కాకి అరుస్తుందే, అలాగు - ఖాంయెం ఖాంయెం!!

—భక్షిస్తుంది! అందర్నీ భక్షిస్తుంది. పింగళ వర్ణాదేవి సాగివస్తున్నది. వేలాది దంతాలతో నాలుక తెరుచుకొని వస్తున్నది! భక్షిస్తుంది! .. భక్షిస్తుంది!

భయపడుతున్న శిధిలాగా ఊరు మంచులో తడిసి, వణుకుతూ ఒదిగి ఒదిగి కూర్చున్నది!....

'ఏక హో, హో హో హో, జాగ్రత్త హో!'

తాసిల్దారు కళ్ళందగ్గర ముగ్గురు సంథాల్ వాళ్ళను, ఇంటి గేటుదగ్గర గూర్ఖా వాళ్ళను కాపలాకు నియమించారు. మరొక తుపాకికి లైసెన్సు కొత్తగా ఇచ్చారు- చరిత్ర పట్టుబడనంతకాలం ఈ దబ్బున్నవాళ్ళకు రాత్రిళ్ళు నిద్రపట్టదు!.... కాపలావాళ్ళ కేకలుకూడా భయంకరంగానే ఉంటాయి. ఈమధ్య బెంగాళాపక్క అడవిలో సాయంత్రంపూటనే ఒక వెలుగు కన్పిస్తున్నది. చాలా తీవ్రమైన వెలుగు! మళ్ళా రాత్రికి, ఆ తరువాత తెల్లవారుఝామున కనిపిస్తున్నది.

బాలదేవ్ ఇంకా మేల్కొనేవున్నారు. సాయంత్రమే పూర్ణియానుంచి తిరిగొచ్చారు....ఆయనకు నిద్ర పట్టడంలేదు! పూర్ణియా వెళ్ళేప్పుడు లక్ష్మి బావనదాసు ఉత్తరాలకట్ట ఆయనచేతికిచ్చింది. లఘుశంక తీర్చుకోవడానికి వెళ్ళినప్పుడు జేబులోనుంచి తీసి—! గంగూలీని కలుసుకోవడానికి వెళ్ళినప్పుడు ఆయన అడిగాడు—'బావన్‌దాసు మీకేమైనా ఇచ్చాడా?'

'లేదండి! ఇవ్వలేదండి'—బాలదేవ్‌కు చలికాలంలోనే చెమటలు పోశాయి. గంగూలీ ఒక్కసారిగా చింతాక్రాంతుడై పోయారు.

బాలదేవ్ బొందిలో ప్రాణంఉండగా వాటిని గంగూలీకి అందించడు, ఈ ఉత్తరాలను చూడడంతోనే జవాహర్‌లాల్ నెహ్రూ బావన్‌దాసును మినిస్టరు చేసి పారెయ్యవచ్చు. లేదా ఢిల్లీ పిలిపించుకోవచ్చు.

....ఇంతవరకు వచ్చిన లీడర్లు అందరూ బావన్‌దాసుతోనే నవ్వుతూ మాట్లాడారు.

....ఆమధ్య మినిస్టరు వచ్చినప్పుడు పెద్దపెద్ద లీడర్లు, ముక్తార్లు, మార్వాడీలు, వకీళ్ళు, జమీందార్లు సంతకాలుచేసి వినతిపత్రం సమర్పించుకొన్నారు - గవర్నమెంటు ప్లీడరు భగవతీబాబును కాంగ్రెసులో చేర్చుకోమని! అప్పుడు మినిస్టరు అందర్నీవదిలేసి బావన్‌దాస్‌ను సలహా అడిగాడు. బావన్‌దాసు చెప్పినట్లుగానే జరిగింది, చివరకు!....ఆయన్ను చేర్చుకోలేదు. భగవతీబాబు 'నంబై రెండు'లో జాతీయనాయకులకు ఉరిశిక్ష విధించేవిషయంలో ప్రభుత్వపక్షాన వాదించాడు.

మరి ఈ ఉత్తరాలు?....వాటిని ఇవ్వకూడదు!....లక్ష్మికేం తెలుసు? రెండుపూటలా వాటిని కళ్ళ కద్దుకొన్నది; ఆరోజునుంచీ....పూలు సమర్పించేది! అప్పుడప్పుడు ఆ ఉత్తరాలుతీసి చదివి కన్నీరు కార్చేది....పూర్ణియానుంచి తిరిగి రావడంతోనే - క్షేమం అడగడం అలావుంచి—'గంగూలీజీకి ఇచ్చారుగా?' అని అడిగింది.

'ఇచ్చేశాను. అంత అపనమ్మకం ఉంటే నాచేతి కెందుకిచ్చావు?'

బాలదేవ్‌కు నిద్ర రావడంలేదు. బండిలో గడ్డికింద దాచిపెట్టాడు ఆ ఉత్తరాల కట్ట. బాలదేవ్ లేచి బయటికెళ్లాడు.

'జాగ్రత్తహో!'—పహరావాళ్ళు కేకలు పెడుతున్నారు.

బాలదేవ్ అగ్నికుండందగ్గరకూర్చొని కట్టెల్ని సరిజేశాడు. క్రీగంటి చూపుతో లక్ష్మి పక్కవైపు చూశాడు! నెమ్మదిగా ఉత్తరాలకట్ట తెరుస్తున్నాడు. శరీరం వణికిపోతున్నది. నాలుక తడి ఆరిపోయింది. అగ్నికుండంలో నిప్పు మండుతున్నది. కట్టెలు చిటపటమంటున్నాయి. బాలదేవ్ ఒక ఉత్తరం తీశాడు—

'గాంధీబాబా! బాబా!....లక్ష్మి పక్కమీదనుంచి ఉరుకుతుంది—'గోసాయి గారూ. ఛీ ఛీ. ఏమిటి మీరు చేసేది? హే సద్గురు. క్షమించు. బాలదేవ్, పాపి, హంతకుడా..'

అగ్నికుండంలోని నిప్పు లక్ష్మి చీరె కంటుకున్నది....'నిప్పు అంటుకుంటే అంటుకొన్నది....ఏదీ గుప్పిట తెరవండి. ఆ కట్ట ఇలా తేండి. నేను అగ్నిలో మండిఆయినా పోతాను. కాని....'

బాలదేవ్ మూసినగుప్పిట తెరుచుకున్నది. లక్ష్మి ఉత్తరాలకట్ట హృదయానికి హత్తుకుంటూ నిలబడింది. వంటిమీదున్నబట్ట తనంతటతాను జారి కింద పడుతుంది. బాలదేవ్ కమండలంలోని నీళ్లు చల్లాడు.

'హే భగవాన్. హే సద్గురూ. జై గాంధీజీ. జై బావన్‌దాస్ జీ!.... హా. హా!' లక్ష్మి ఏడుస్తున్నది. వస్త్రహీనగా నిలబడిన లక్ష్మి ఏడుస్తున్నది.

చేతులూ కాళ్ళూ కాలిపోయాయి. పెద్దపెద్ద బొబ్బలు లేచాయి.

బాలదేవ్ తన దోమతెరలోకివచ్చి మొహం దాచుకుంటారు। పడుకొని ఆలోచిస్తున్నాడు - ఇక ఊహూఁ, ఇక్కడుండటం మంచిదికాదు। ఏ మొహం బెట్టుకొని ఇక్కడుంటాడు ? లక్ష్మి కళ్ళల్లోకి ఎలా చూడగలడు ? చూడలేడు. ఎప్పటికీ చూడలేడు। పూర్ణియా వెళ్ళిపోతాడు। అక్కడమంచే చన్ననపట్టీ వెళ్ళిపోతాడు. ఇక తన స్వగ్రామంలోనే ఉండిపోతాడు ; తన సమాజంలో, తన జాతి వాళ్ళమధ్య ఉండిపోతాడు।....జాతి చాలా ముఖ్యమైంది!....పెద్దపెద్ద నాయకు లంతా తమతమ జాతినిగురించి ఆలోచిస్తారు। ఆ జాతికిచెందిన పార్టీలోనే ఉంటారు। ఇదే రాజనీతి అంటే! లక్ష్మికేం తెలుసు? ఇక కాళీ బ్రహ్మచారి ఇక ఇక్కడే మకాం పెట్టేస్తాడు।...కాదు! వెడుతూ వెడుతూ కళంకం ఆపాదించడం మంచిది కాదు!....అలా చెయ్యడు తను!....

'గోసాయిగారూ। లేవండి। సత్సంగసమావేశానికి సమయమైంది.' లక్ష్మి మూలుగుతూ లేచింది. వళ్ళంతా బాగా కాలింది.

రోజటిలాగా లక్ష్మి లేస్తుంది. లేచి బాలదేవ్ మంచందగ్గరికెళ్ళి. దోమ తెర తొలగించి వేళ్ళను కళ్ళ కద్దుకుంటూ—'గురోన్నమః' అంటుంది.

బాలదేవ్ వెక్కివెక్కి ఏడుస్తున్నాడు—'లక్ష్మి!'

'లేవండి గోసాయిగారూ!'

## ఇరవై రెండు

మూడుమాసా లనంతరం. 1948 వ సంవత్సరం ఏప్రియల్‌మాసపు ఉదయం।

ఈ ప్రాంతంలో వైశాఖమాసంలో జనుము వేసేరైతులు సూర్యోదయానికిముందే పొలంవెళ్ళి నాలుగుదాళ్ళు దున్నవలసిఉంటుంది....గురకొయ్యలు ఆకాశంమీద మెరుస్తున్నాయి. కమలానది గుంటల్లో వాటినీడ ప్రతిబింబిస్తున్నది. నీలకమలం వికసించినట్టుగా స్ఫురిస్తున్నది।

విరంచీ భుజంమీద నాగలిపెట్టుకొని బక్కచిక్కిన ఎద్లను తోలుకొంటూ వెడుతున్నాడు.

కూరగాయలవాళ్ళ మూడుబీఘాల పొలం పాలుకు తీసుకొన్నాడు. కాని నష్టం వచ్చేట్టున్నది. అతని ఆకారం అగ్గిపెట్టెమీదుండే రైతు బొమ్మలాగా - చిక్కి శల్యమైన శరీరం. వణ్ణుటి రూపం. నడుంమీద మూట.

ఖేలావన్ ఇప్పుడు గేదెలు మేపుతున్నాడు. తెల్లవారుఝామున మూడు గంటలకు గేదెలు ఎంతబాగామేస్తాయో. పగలు అలా మెయ్యవు. ఇప్పు డతనికి గొడ్లు మేపుకునే వీలుకూడా లేదు. అందుకే ఇంటివైపు తోలుకెళుతున్నాడు....ఖేలావన్ యాదవ్. యాదవులపేట పెద్ద. గేదెలు మేపుకొని తిరిగొస్తున్నాడు.

ఆకాశంమీదికి కొద్దికొద్దిగా వెలుతురు ప్రవేశిస్తున్నది! అందరిమొహాలమీద సూర్యకాంతి పడుతుంది.

తాసిల్దారుగారి ట్రాక్టర్ తీసుకొని డ్రైవరు బయలుదేరాడు - భట్ భట్ భట్ భట్.

తాసిల్దారు మేడమీదనిలబడి చేతులు వెనక్కి కట్టుకొని పచార్లు చేస్తున్నాడు. భట్ భట్ భట్ భట్. మేడకప్పు అదురుతున్నది. దాని లయప్రకారం ఆయన హృదయంకూడా కొట్టుకుంటున్నది. ఎవరా వచ్చేది ఎవరు? పేరియా?

....మౌనం....నెమ్మదిగా, ఏమిటి? 'ఏమిటి?' తాసిల్దారు ప్రశ్నించాడు.

'ఊఁ! చెప్పమంటారా? మనమడు పుట్టాడు.' సోబయా నవ్వింది.

'మాట్లాడడు. బతికేవున్నాడా లేక....'

'ఆఁ! బుజ్జిబుజ్జిగా వున్నాడు.'

హే భగవాన్! తాసిల్దారు గడగడ వణికిపోతున్నాడు.

కమలానది అటువక్కన. సగం పండిన రబీపంట పొలాలకావల. దూరుగు దూదిచెట్ల సందుల్లోనుంచి కన్పించే ఆకాశం ఎర్రబడిపోయింది దక్షిణంగా....బంగళా తోటలో ఎర్రటిపూలతోనిండిన నిద్రగన్నేరు కొమ్మలు కాంతితో మెరిసిపోతున్నాయి.

ఈ భవనం నాలుగుగోడలుదాటి పిల్లవాడి ఏడుపు బయట విన్పించకూడదు. అలాంటి ఏర్పాటు జరుగుతున్నది. ఆ ఏర్పాటు తప్పకుండా జరిగితీరుతుంది....ఒక వేళ పిల్లవాడు గట్టిగాఏడిస్తే....మెడ పిసికిపారెయ్!....చంపేసెయ్!

ఢిల్లీలో రాజఘాట్ దగ్గర బాపూ సమాధిమీద ప్రతిరోజూ శ్రద్ధాంజలులు అర్పించడం జరుగుతున్నది. ప్రపంచంలోని ఏ దేశంనుంచివచ్చిన వ్యక్తిఅయినా సరే. అక్కడికివెళ్ళి తనజీవితం సార్థకమైనదని భావించుకుంటున్నాడు।

కరీముద్దీంపూరులో, నాగర్‌నదీతీరాన చెట్టుకు తగిలించిన ఖద్దరుజోలెను ఎవరో తీసేసుకొన్నారు. ఇంకెవరు తీస్తారు?....దులార్‌చంద్ కాప్రా ఒకనెల తరువాత వెళ్ళిచూస్తే జోలె వేలాడుతున్నది.

....జిల్లా కాంగ్రెసు వర్కర్ ఎవరుచూసినా వెంటనే గుర్తుపడతారు - బావన్‌దాసు జోలెసంచిని। జోలెను కాప్రా తీసేశారుగాని. జోలెకున్న పట్టీమాత్రం ఇంకా అలాగే అక్కడే వేలాడుతున్నది....

....ఎవరో దీనురాలు దీన్ని 'పీలికలపీర్ల' చెట్టుగాభావించి తన చీరెచెరగు చివరచించి ఒక కొమ్మన ముడేసింది. 'నా కోర్కె ఈడేరితే మరొక గుడ్డపేలిక అర్పించుకుంటాను।' అని ఆమె ఎంతో విశ్వాసంతో, ఎంతో ఆశతో ముడివేసింది- రెండు పీలికలు।

పూర్ణియా జైలుయెదుట ఒక పాత మర్రిచెట్టున్నది. దానికింద ఎండిన మర్రి ఆకులు అటూ ఇటూ ఎగురుతున్నాయి. ఆ మర్రిచెట్టుకిందవున్న అరుగుదగ్గర ఒక యువతి నిలబడివున్నది....ఆమెతో ప్యారీ వున్నాడు।

పట్టి వంటిమీద ఒక పాతతువాలు వేసుకొని. చడ్డీమాత్రం వేసుకొన్న వార్డరు మాటిమాటికీ బ్యారక్‌నుంచివచ్చి యువతివైపు చూస్తున్నాడు. పాట పాడుతున్నాడు—'పీ పన్నటి నడుమూ। చివరకు ఆమె నుద్దేశించి ప్రశ్నించాడు—

'మీరు డాక్టరుగారి భార్య కాదుగదా?'

ఆ యువతి తలూపి 'కాదు' అన్నది।

వార్డరు ప్యారీని చూస్తాడు. ప్యారీకు ఈ వార్డర్‌తో పరిచయమున్నది. పట్టి మూర్ఖుడు। ఎప్పుడూ చెడ్డమాటలు మాట్లాడుతూ ఉంటాడు। అందుకని అతడు మొహం తిప్పుకున్నాడు, మరొకవైపుకు।

జైలు ఇనుపగేటు ఝన్ ఝన్ మంటూ శబ్దం చేసుకుంటూ తెరుచుకుంటుంది. యువతి మొహంమీదినుంచి వ్యాకులతాభావం తొలిగిపోతుంది। ఆమె మొహంమీద ఈమధ్యనే ఏర్పడ్డ ముడతలు ఒక్కసారిగా వికసించుకుంటాయి।

డాక్టరు నవ్వుతూ, ముందుకు అడుగులు వేసుకుంటూ, చేతిలో చిన్నసంచి తీసుకొని వచ్చేస్తున్నాడు - లేబొరేటరీనుంచి ఇప్పుడే తిరికచేసుకొని వస్తున్నవాడి లాగా!

ప్యారూ మొహంలో ఏవేవో భావాలు దోబూచులాడుతున్నాయి. అంతర్యం మంచి ఉరకలుపెడుతూ తోసుకొస్తున్న సంతోషాన్ని అతడు అదిమిపట్టుకొన్నాడు. అతని నోరు అస్వాభావికంగా తెరుచుకొని వున్నది.

'నువ్వు ఎక్కడైనా జైల్లో వున్నావా ఏమిటి?'

'అంత అదృష్టంకూడానా!....తలవంచు, విశ్వనాథ్ ప్రసాదం.' అని యువతి రుమాలులోనుంచి ఎండిన బిళ్వపత్రి, పూలు తీసి డాక్టర్ ప్రశాంత్ కళ్ళకు అద్దుతుంది.

'ఏం ప్యారూ, ఏమిటి సంగతులు? మమతా! ప్యారూతో మాట్లాడావా లేదా?'

'ఉదయంనుంచి చేస్తున్నదేమిటి?' మమత నవ్వుతూ అన్నది—'గుర్రపు బండి పిలవండి - ప్యారిచాంద్ సర్కార్.'

ప్యారూ నవ్వుతూ, కుంటుకుంటూ కోర్టువైపుకు వెడతాడు.

'రాత్రి మూడుగంటలకు చేరుకొన్నాను, పూర్ణియాస్టేషను!....జ్యోతి దీ ప్రస్తుతం ఇక్కడే వున్నది. ఆమె మకాంకే వెళ్ళాను. ఉదయంలేచి కలెక్టరు ఇంటికి వెళ్ళాను. నీ రిలీజ్ ఆర్డర్ హేండ్ డెలివరీలో తీసుకొనివెళ్లాను. జ్యోతి దీ-కలెక్టరు టూర్‌మీదవెడితే మళ్ళా ఆలస్యమవుతుందేమోనని చెప్పింది!....సరే! ఇప్పుడెక్కడికి మనప్రయాణం?'

మమత చిరునవ్వు నవ్వింది.

'నువ్వు మేరీగంజ్ రావా?'

'ఎందుకు రాను?....నేను పదిహేనురోజులు శలవుపెట్టి మరీ వచ్చాను.'

ఎస్. పి. గారి నౌకరు ఉత్తరం తీసుకొనివచ్చాడు. డాక్టర్ని వాళ్ళింటికి ఆహ్వానించాడు.

# ఇరవై మూడు

ఇప్పుడు తాపిల్దారు కిందికి దిగిరావడం లేదు. పైనే ఉంటున్నారు. పగ లంతా కల్లు తాగుతున్నారు. రాత్రిపూట పంథాల్ పేటవాళ్ళ ఇప్పకల్లు! ఎప్పుడూ మైకంలోనే ఉంటున్నారు. మమరిశదాసును ప్రతిరోజూ అడుగుతూఉంటాడు— 'ఉపాయం ఏమైనా ఆలోచించావా?'

'నా బుర్ర పనే చేయడంలేదు?'

'పని చేయడంలేదూ? అయితే ఇదుగో ఒకగ్లాసు తాగు, తాగు నాయాల! తాగినట్టు ఎవరితోనైనా చెప్పావంటే తుపాకితో పేల్చేస్తా!'

కమలతల్లి తలుపు ఎప్పుడూ తెరవదు. నూతివైపుకు తెరుచుకునే తలుపు అప్పుడప్పుడు తెరుస్తుంది ...గది చీకటిలో. ఒకమూలన. ఒక చిన్నదీపం వెలుగు తున్నది. కమల ఒడిలో ఆమె శిశువు ఒట్టల్లో ఒదిగి నిద్రపోతున్నాడు.

....కమల కాటుక తయారు చేస్తున్నది.

ఛట్ ఛట్ ఛర్ర్ర్....

ఒక స్టేషన్ వ్యాగన్ పూర్ణియా మేరీగంజ్ రోడ్డుమీద పరుగెడుతున్నది.

బయలుదేరబోయేముందు మమత చూడకుండా ప్యారూ డాక్టర్ చేతికొక కవరిచ్చారు. ముందు డ్రైవర్‌పక్కన కూర్చున్న ప్యారూ అప్పుడప్పుడు మెడ తిప్పి వెనక్కు చూస్తున్నాడు. డాక్టరు ఉత్తరం చదువుకుంటున్నాడు:

'ప్రాణనాథా!'

కమల ఉత్తరం - ఒక వారంక్రిందట రాసిన ఉత్తరం।

ప్రాణనాథా,

ఈ ఉత్తరం సకాలంలో మీకు చేరుతుందో లేదో నాకు తెలియదు. అల స్యంగానైనాసరే ఈ ఉత్తరం మీకు చేరుతుందనే నమ్మకం నా కున్నది. నువ్వు నాదగ్గరకు పరుగెత్తుకుంటూ వస్తావు।....మీకు తెలుసా? నా కిప్పుడు కొంచెం భయం వేస్తున్నది. ఏ కెలా....ఏ కెలారాయను? అమ్మ అంటున్నది - నువ్వు నాన్న కొక ఉత్తరం రాసిగాని, లేదా తెలియజేయడంగాని చేస్తే బావుంటుంది -

ఏమని? నాకు కలగబోయే సంతానానికి నువ్వే తండ్రివని! అప్పుడు నేను బతుకు తాను; అమ్మకు నమ్మకం లేదు; నాన్న పూర్తిగా ఉన్మాదిగా మారిపోయాడు. ఎప్పుడేం జరుగుతుందో తెలియకుండా ఉన్నది. ఏ పుస్తకాలు నా కెన్నోసంగతులు నేర్పాయి. ఏ పుస్తకాలవల్ల నా కెంత సహాయం లభించింది! ఇప్పుడు నాకొక కొత్తపుస్తకం కావాలి। ప్రతి పేజీలోనూ 'కమల' అని రాసివున్న పుస్తకం। భయపడకు। జరగవలసిందేదో జరుగుతుంది. మంచే జరుగుతుంది....।

డాక్టరు ఒక్క గుక్కలో ఇంత చదివేశాడు. ఆ తరువాత మమతవైపు చూశాడు. రాత్రిఅంతా మేల్కొనికుండడంచేత చిన్న కునుకు తీస్తున్నది।....కారు ఊపుకు దెబ్బ తగులుతుందేమో!

'ఇంకెంతదూరం?' మమత మేల్కొని అడిగింది।

'మరొక గంట ప్రయాణం।' ప్యారీ అన్నాడు. డాక్టర్ ఆ తరువాత చది వాడు — 'నాన్న ఏ పిల్లవాణ్ణి చంపేస్తాడు।'

'వీల్లేదు, వీల్లేదు!'

'ఆఁ. ఏమిటి? వీల్లేదు?' మమత అడిగింది- 'ఏమిటి?'

డాక్టరు మమతచేతికి ఆ ఉత్తరం ఇచ్చి బయటికి చూస్తాడు. ప్యారీ వెనక్కుతిరిగి డాక్టర్ మొహంవైపు చూస్తున్నాడు.

మమత కళ్లు నులుముకుంటూ చదువుతుంది—'ప్రాణనాథా!' ఎవరిదీ ఉత్తరం? కమలదా?'

మమత చదువుతున్నది. డాక్టరు ఒకపర్యాయం ఆమెవైపు చూశాడు. విద్ర మైకంలోవున్న మమత కళ్ళు ఒక్కసారిగా మెరిసిపోయాయి।....ఉత్తరం ముగించి—'ఇంకెంతదూరం?' అని అడిగింది.

'మరొక గంట। మట్టిరోడ్డు।'

'గణేశ్ ఎక్కడున్నాడు?'

'అదొక పెద్ద గాధ! బ్రహ్మసమాజమందిరంలో చేర్పించాను. ఎక్కడ మంచి వచ్చాడో, అతని బాబాయినని చెప్పవచ్చి పెద్ద రాద్ధాంతంచేసి కులంపేరుతో గొడవచేస్తే - తీసుకెళ్ళమని చెప్పాను!'

'అతనితో గేదెలు కాయిస్తున్నాడు।' ప్యారీ అన్నాడు—'ఆ పూరతను రోజూ కోర్టు కొస్తూ ఉంటాడు।'

'మెడికల్ గజెట్‌కు ఈ రిపోర్టు పంపిందాము. చాలా సంక్షిప్తమైన రిపోర్టు. వనమూలికల్ని గ్రామాల్లో వాడుకల్లోవున్న చిట్కావైద్యాలనుగురించి! ఈ ఉత్తరాల ఆధారంగా తయారుచేశాను....!'

'నా రిసర్చ్ మానుకుంటున్నానని ప్రకటిద్దామనుకున్నానే।'

'డాక్టర్ నీ రిసర్చ్ అసఫలమైందని భావించనవసరంలేదు। కనీసం నువ్వు ఆ మట్టిని గుర్తించావు।....మట్టిని మనిషిని ప్రేమించడం। అంత చిన్నపనేమీ కాదు।'

డాక్టర్ మమతవైపు చూశాడు—కన్నార్పకుండా! మమత బయటికి చూస్తున్నది - విశాలమైన మైదానాలు।....చవిటినేల।....ఇదే అప్రసిద్ధికెక్కిన మైదానం-నేపాలునుంచి ప్రారంభమై గంగానదీతీరంవరకు - జనశూన్యమైన, పొగచూరిన గడ్డి। మైదానంలో ఎండిన గరికదుబ్బుకు పశువులకాపర్లు నిప్పుపెట్టారు - దూరం నుంచి వరుసగా వెలిగించిన దీపాలలాగా కన్పిస్తాయి.

....తాటితోపులోని తాటిచెట్ల చివరమీదుగా అస్తమిస్తున్న సూర్యుడి ఎర్రదనం క్రమేపి నల్లబడిపోతున్నది.

ఘర్ర్ ర్ర్ ర్!....

'సుమరితదాసూ! ట్రాక్టరు ఎక్కడికి తీసుకెడుతున్నారు డ్రైవరు? అడుగు।' తాపిల్దారు రెండంతస్తులమేడ పైకప్పుమీదినుంచి కేకవేశాడు।

'ట్రాక్టరుకాదు; కారు! కారు!'

'కారా? ఎవరొచ్చారు?'

'డాక్టరు!'

'ఏ డాక్టరు?'

సుమరితదాను పరుగెత్తుకుంటూ పైకి వెళ్లాడు—'మన డాక్టరుబాబే! వెంట ఒక ఆడపిల్లకూడా ఉన్నది....ప్యారీ ఉన్నాడు।'

తాసిల్దారు చేతిలోకి తుపాకి తీసుకు ... సుమరితదాసు ... గర వణికి పోతున్నారు—'అలాంటివని చెయ్యకండి!'

'అలాంటివని చెయ్యవద్దూ? ... చెయ్యమంటావు

'పిన్నిగారూ! పిన్నిగారూ!' ప్యారీ పిలిదారు.

'ఎవరూ? ప్యారీ నువ్వా?' తల్లి తలుపుసందులోనుంచి అడిగింది.

'డాక్టరుబాబు!'

'ఐ హేం ఐ హేం అం అం' పురిటింట్లోనుంచి కమల పసివాడు ఏడ్చాడు- 'ఐం హేం ఐం హాం.'

మమత తలుపుదగ్గరికెళ్ళి - 'తలుపుతెరువు పిన్నీ!' అని అన్నది!

'నేను మమతను! ముందు తలుపు తెరవండి.'

తలుపు రెక్కలు తెరుచుకుంటాయి. మమత పురిటిగదిలోకివెళ్ళి పోయింది.

....డాక్టరు ఒంటరిగా మెదలకుండా నిలబడ్డారు. మెట్లమీద పావుకోళ్ళ ధ్వని విన్పించింది....ఎవరో పెద్దగా చప్పుడు చేసుకుంటూవస్తున్నారు.

'ఎవరూ? డాక్టర్?' తాసిల్దారు కేక బెట్టారు.

'రండి! కూర్చోండి డాక్టర్‌బాబూ!'—సుమరితదాసు చిగుళ్ళు బయటికిపెట్టి నవ్వుతూ అన్నాడు—'రండి!'

'రావక్కర్లేదు! సుమరితదాసూ! ఎక్కడికి వచ్చారు. ఎవరిదగ్గరకు వచ్చారో. ఏం చేయడానికి వచ్చారో. ఏం తీసుకెళ్ళడానికి వచ్చారో అడుగు!'

సుమరితదాసు డాక్టర్‌దగ్గరికొచ్చి కళ్ళతోనూ. సైగచేసీ చెప్పారు— 'ఈమధ్య విషా కొంచెం ఎక్కువైంది. అందుకని ...!'

పురిటింటి తలుపుసందులోనుంచి కమలతల్లి చూస్తూ 'అన్నది—'అదేమిటండీ, అల్లుణ్ణి....!'

'అల్లుడా? నీ అల్లుడేమో? నా అల్లుడయితే నా పాదాలకు నమస్కారం చెయ్యడూ?'

డాక్టరు తాసిల్దారు చరణాలు తీసుకుంటాడు.

తాసిల్దా ఒక్కసారిగా పెద్దపెట్టున ఏడ్చారు. డాక్టర్ని బాహువుల్లో ఇము డ్చుకొని—'నా బాబూ!....బాబూ!' అని ఏడ్చారు.

సుచరితదాసు రాత్రికిరాత్రే ప్రతిఇంటికివెళ్ళి వార్తను అందజేశాడు— 'కమలపెళ్ళి ఎప్పుడో డాక్టర్‌తో అయిపోయింది. వివాహం నిర్ణయమైనప్పటినుంచి విఘ్నాలు వాటిల్లడంవల్ల అందుకని కాశీపండితులు గాంధర్వవివాహం జరిపించ మని ఆజ్ఞాపించారు. ఈ గాంధర్వవివాహంసంగతి ఎవరికీ తెలియనివ్వలేదు. మగ శిశువు జన్మిస్తే అందరికంటే ముందుగా తండ్రి చూడాలి; ఆ తరువాత తదితరులు, ....డాక్టర్‌బాబు వచ్చేశారు. రేపు 'ఛఠీ' (ఆరవరోజు) జరుపుకుంటున్నారు. విందు భోజనానికి రమ్మని చెప్పేందుకు వచ్చాను - మీ అందరికీ, రేపుదయంనుంచే బారసాల ఆనందోత్సవం ప్రారంభమవుతుంది.'

'ఇస్! ఇదంతా కాశీమజిలీ కథలోలాగా ఉన్నది. ఎవరికీ తెలియలేదు!'

బ్రాహ్మణవీధి పురోహితుడు దేవానన్‌ఝా ఊళ్ళోవాళ్ళతో అన్నాడు— 'ఇంగ్లీషు ఫ్యాషన్‌లవాళ్ళు ఏంచేసినా చెల్లుతుంది!'

సిద్ధాంతి చెవుల్లోకి ఈ వార్త చేరినప్పుడు మొహం ముడుచుకుపోయింది.

'ధనవంతుడు అధర్మం ఆచరించినా అది ధర్మంగానే చెల్లుబాటవుతుంది.' ఖేలావన్ యాదవ్ అన్నాడు.

అయితే ఆహ్వానాన్ని తిరస్కరించే ధైర్యం ఎవరికీ కలగలేదు.

ఉదయంనుంచే మాదిగలువచ్చి నాట్యంచేస్తూ తప్పెట్లు తాళాలు మోగిం చడం మొదలెట్టారు. ఆడవాళ్ళు గుంపులు గుంపులుగావచ్చి పాటలు పాడుతున్నారు. పాటలు పాడుతున్నారన్నమాటేగాని ఎవరిమొహంమీద ఉత్సాహం కన్పించడం లేదు...।

తాసిల్దారు చాలాసేపటివరకు తనగదిలో ప్రశాంతంగా కూర్చొని ఏదో ఆలోచించుకొన్నారు. ఆ తరువాత బయటకొచ్చి - 'సుచరితదాసూ! వెళ్ళి జనంతో చెప్పవయ్యా!...ప్రతికుటుంబానికి ఐదుబీఘాల పొలంచొప్పున తిరిగి ఇచ్చి వేస్తాను....సాయంత్రంలోపలే నేను కాగితాలన్నీ సిద్ధం చేయిస్తాను....సంథాల్ పేటవాళ్ళతో చెప్పు - వాళ్లుకూడావచ్చి కాగితాలు తీసుకెళ్ళిపోవచ్చు! ఒక్క పైసా

కూడా ఎవరూ 'నజరానా'లుగా ఇవ్వనవసరంలేదు।....నా కెందుకయ్యా ఇంకా ఈ విహాంమతులూ? ఇవన్నీ నే విన్తున్నానా? ఇస్తున్నది కొత్త ఖామందు! ఆయనగారి ఆజ్ఞ అయింది। విన్పించలేదా? అదుగో విను। ఏడుస్తున్నాడు। ఆజ్ఞాపిస్తున్నాడు! తిరిగి ఇచ్చివెయ్। ఇచ్చెయ్।—ఇచ్చివెయ్. శేలావన్‌కు అతనిపొలం. పొలంలోవి ధాన్యం ఇచ్చివెయ్!' అని అన్నాడు:

డాక్టర్ ప్రశాంత్, మమత ఒకరినొకరు చూసుకుంటారు.

'ఏమిటలా చూస్తున్నారు? నన్ను ఉన్మాదిగా భావిస్తున్నారా? అవును। ఎందు కనుకోరు? కృష్ణుడు తన విద్యాబుద్ధులన్నీ ఉపయోగించి ప్రయత్నం చేశాడు; కాని దుర్యోధనుడు సూదిమొనమోపే భూమికూడా ఇవ్వనని బుకాయిం చాడు. భూమి....। ధరిత్రీమాత। ఒక అంగుళం భూమికోసంకూడా జనం హైకోర్టు దాకా వెడతారు! నేను ఏడువందల బీఘాలభూమి ఇచ్చివేస్తున్నాను....పిచ్చివాళ్ళు మీరు। ఈ భూమి వాళ్ళదేనయ్యా। వేలంవేసిన భూమి. జప్తుచేసిన భూమి। వాళ్ళది వాళ్ళ కిచ్చివేస్తున్నాను. అందరికి చెప్పెయ్యండి - కొత్త యజమానిగారి ఆజ్ఞ అయిందని।'

జై! జై। జైహో।

ప్రేమతో. ఏదీ ఒక్కసారి అనండి—మహాత్మాజీకీ జై।

డిగ్ డిగ్ డిడిగ్

రింగ్ రింగ్ తా ధిన్ తా।

దా డిగ్గా దా డిగ్గా।

ఝుమర్ ఝుమర్। హుర్ర్ర్ హుర్ర్ర్।

ఆఁ।....ఇప్పుడు బావున్నది. ఇప్పుడు చూడండి! అందరిమొహాలమీద, వాడిన చర్మాలమీద ఎరుపురంగు తిరిగి వచ్చేసింది. వందలాదినేత్రాలలో సంతోషం వెల్లివిరిసింది. దీపాలు వెలిగినట్టు।

కుమార వీరోత్పల్‌కు ఇవ్వాళ్ళ స్నానం చేయించేరోజు! బారసాల.

మమత కమల కొడుకుపేరు—'కుమార్ నీలోత్పలం' అని పెట్టింది. డాక్టర్ ఈరోజు మొదటిసారి తన కొడుకును ఒడిలోకి తీసుకొని చూశాడు....చక్కగా. నిస్తేజంగా వున్నాడు. రక్తమాంసాల ముద్ద. 'పాట్నా తీసుకెళ్ళావంటే నీకొడుకు ఒక నెలరోజుల్లో ఎర్రబడతాడు.' అని అన్నది మమత. డాక్టర్ ఎన్నో డెలివరీ కేసులు చేయించాడు! కాని కుమార్ నీలోత్పల్! కమల తేజోహీనంగావున్న మొహం సిగ్గుతో ఎర్రబడింది. డాక్టరుచేతికి శిశువు నిచ్చేప్పుడు ఆమె విశాలనేత్రాలు క్రిందికి దించుకొన్నది. ఆమె లలాటంమీద సిందూరపురేఖ మిలమిల లాడుతున్నది. ....చీకట్లో నిలబడిన 'సిల్‌హూటెడ్' బొమ్మలాగా నిలబడిన తల్లి చెయ్యిచాపి ఒక భయంకరమైన నీడ చేతి కందిస్తున్నది - తన శిశువును. ....చీకటి....భయంకరమైన చీకటి. ...కాదు, కాదు. డాక్టరు తన ఎడంచేతివేళ్ళతో నీలోత్పల్ గుండె దడను తెలుసుకున్నాడు....'ఆహా! చిన్నయ్యగారి హృదయం ధుక్ ధుక్ మంటున్నది.'

సౌరగృహంలో పన్నెండురోజుల శిశువును దీర్ఘాయుష్మంతుడుగా, ఆరోగ్యవంతుడుగా, విద్యాబుద్ధులు, ధనసంపద కలిగినవాడుగా వర్ధిల్లాలని ఆశీర్వదించే బారసాలపాటలు పాడుతున్నారు. డాక్టరు మేల్కొన్నాడు!....అతని రిసర్చి! 'విఫలం కాలేదు. మట్టిని మనిషిని ఇంత గాఢంగా ప్రేమించడం ఏ లేబొరేటరీ వల్లా సంప్రాప్తించదు.' అని మమత అన్నది.

లేబొరేటరీ.....విశాలమైన ప్రయోగశాల. ఎత్తైన ప్రహరీగోడలమధ్యమున్న ప్రయోగశాల!....సామ్రాజ్యకాంక్షపరులైన శాసకుల విచ్చుకత్తులనీడన విజ్ఞానశాస్త్రవేత్తలు పరిశోధనలు జరుపుతున్నారు. ప్రయోగాలు చేస్తున్నారు!....బట్టతలలమీద ఎర్రటి, పచ్చని కాంతులు పడుతున్నాయి. విధ్వంసక, మారణహోమశక్తుల సమ్మేళనంతో సమస్తపృథ్విని వాయువుగామార్చగల బాంబును తయారుచేయడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఆటమ్‌ను బ్రేక్ చేస్తున్నారు! ....సాలీడు గూడులాగా....నలువైపులా కటికచీకటి. అంతా అవిరి! ప్రకృతి పురుషుడు....అండపిండం. మట్టి, మనిషి కళ్యాణాన్ని ఆకాంక్షించేవ్యక్తుల చిన్న సమూహం అంధకారంలో అన్వేషణ కొనసాగిస్తున్నది. కన్నుల పొడుచుకొన్నా కానరాని చీకటిలో ఒకరినొకరు ఢీకొట్టుకుంటారు!....

వేదాంతం....భౌతికవాదం....సాపేక్షవాదం....మానవతావాదం! హింసతో అర్ధ్రమైన ప్రకృతి విలపిస్తున్నది!....వేటకాడిబాణంతో గాయపడ్డ లేడిపిల్లవంటి మానవత్వానికి రక్షణ ఎక్కడ? అహ్హ హ్హ హ్హ హ్హ! అట్టహాసం! వేటగాళ్ళ అట్టహాసంతో ఆకాశం కదులుతున్నది।....చిన్న లేడిపిల్ల వణుకుతున్నది। చిన్న ఊపిరితిత్తుల తీవ్రమైన సంచలనం!....ఫీలోత్సల్।....ఈ అంధకారం ఉండడానికి వీల్లేదు। మానవతాపూజారుల సమ్మిళితవాణి ప్రతిధ్వనిస్తుంది. పవిత్రవాణి। వాళ్ళకు వెలుగు లభించింది. తేజోమయమైన వెలుగు! అనేకదెబ్బలకు గురిఅయిన పృథ్వీ గాయాలకి శీతల చందన లేపనం వేయడం జరుగుతున్నది. ప్రేమాహింసల సాధన సఫలమైంది. ఇక భయమెందుకు? విధాతసృష్టిలో మానవుడే అన్నిటికీ మించిన శక్తిశాలి। అతనిని ఓడించడం అసంభవం. ప్రచండశక్తివంతమైన బాంబులతో ఓడించడంకూడా కష్టమే।....ఉన్మాదులారా। మనిషి మనిషే. 'గినిపిగ్' కాదు।....మానవుడే సర్వోపరి।

అనేక వక్త్రనయన మనేకాద్భుత దర్శనమ్।

అనేక దివ్యాభరణం దివ్యానేకో ద్యతాయుధమ్।

దివి సూర్య సహస్ర....।

మమత పాడుతున్నదా? అయితే సూర్యోదయం కాబోతున్నది। పక్క గదిలో తాపీల్దారు గురకలుపెడుతూ నిద్రపోతున్నాడు. డాక్టరులేచి కిటికీలు తెరిచాడు. మసకచీకట్లో బంగళాతోట తటాలున నిలబడి ఎవరికోసమో ఎదురుచూస్తున్నది। రకరకాల పూలకళికలు నవ్వులు వెదజల్లడానికి సంసిద్ధపడుతున్నాయి. నాంత్యం న మధ్యం న పునస్తవాదిం....।

'ప్రశాంత్।' మమత నవ్వుతూ గదిలో ప్రవేశించింది - నెమ్మదిగా ప్రవహించుకుంటూ వచ్చే ఉదయపుగాలిలాగా! సద్యకిస్నాతా మమత విరబోసుకున్న తడిసిన కేశరాశిని డాక్టరు అంటిచూశాడు.

'ఫో। ఆడవాళ్ళ తడిసినజుట్టును పట్టుకోకూడదు। దోషం। టీ తాగుతావా? కుమారరాజాగారి పాలు వేడవుతున్నాయి. రాత్రిఅంతా మేల్కొనేవున్నట్టుగా

వుంది? పుక్కిలించి వూసెయ్! టీ తీసుకొస్తాను.' మమత నవ్వుతూ వెళ్ళి పోయింది.

పాపం మమతకు జీవితంలో టీ ఒక్కటే ఆమెకు విలాసం! ఒకసారి శీల అన్నది కూడాను—'మమతా దీ టీ తాగేమార్గాలు వెదుకుతూ ఉంటుంది. రోజుకు పదిహేను కప్పులు కావాలి!'

టీ కప్పు ప్రశాంత్ చేతికందిస్తూ మమత అడిగింది—'మహాత్మాజీ చివరి కోరిక ఏమిటో చదివావా? ఆయన ఒక వెలుగు; ఆ వెలుగులో ప్రపంచం నిర్భయంగా వేలాది సంవత్సరాల యానాన్ని ఇట్టే అధిగమించగలదని నా అభిప్రాయం!

'మమతా! మళ్ళా సాధనని నేను ప్రారంభిస్తాను. ఇక్కడే। ఈ గ్రామంలోనే। ప్రేమించడం వృత్తిగా పెట్టుకుంటాను. అశ్రుజలంతో తడిసిన ఈ భూమి మీద ప్రేమమొలకలు మొలిచి నవనవలాడతాయి। నేను సాధన చేస్తాను. గ్రామవాసిని భారతమాత మురికిచెరగు నీడనే! కనీసం ఒకగ్రామంలోని కొంతమంది ప్రాణుల వాడిన పెదవులమీద చిరునవ్వుల వన్నెల చిన్నెలు తీసుకరాగలనేమో। వాళ్ళహృదయాలలో ఆశను. విశ్వాసాన్ని ప్రతిష్ఠించగలనేమో....।'

మమత నవ్వింది–'విజయీభవ' అని ఎవరిముందో కొంగుచాచి విన్న ఆశీర్వదించాలని నా మనస్సు తహతహ లాడుతున్నది। ముందుకు సాగిపోయిన ఒక కర్మయోగి చరణరజాన్ని చేతుల్లోకి తీసుకొని అనాలనిపిస్తున్నది....' అని మమత ప్రశాంత్ పాదాలవైపుకు చెయ్యి చాచింది।

'మమతా।'

'మమతా దీ!....పిల్లి తీసుకో! పాలు కక్కుతున్నాడు!' కమల తన శిశువును ఒడిలో బెట్టుకొని నవ్వుతూ తీసుకొచ్చింది.

'ఇలాతే। ఎలా కక్కుతాడో చూస్తాను. ఎలా తాగించావు। పాలసీసా ఇలా తే।' మమత బాసెపెట్టువేసుకొని కూర్చొని పిల్లవాణ్ణి ఒడిలోకి తీసుకున్నది–'కమలా నువ్వు టాబ్లెట్ వేసుకున్నావా? వేసుకో।'

ప్రశాంత మమతవైపు చూస్తున్నాడు - శరత్‌బాబు నవలలోని ఈ నారి

తాను నమ్మినమార్గంవెంట నిశ్చలంగా, నిరామయంగా ఈనాటికీ ముందుకు కొన సాగిపోతున్నది, రూపాన్ని మార్చు, పేరు మార్చు, కాలాన్ని మార్చు, స్థానాన్ని మార్చు - కాని ఈమె ఎప్పటికి మారబోదు.

'ప్యారూకూడా పాట్నా వస్తాడా?' కమల అడిగింది.

'వస్తాడు!' మమత ముక్తసరి జవాబు చెప్పింది.

'అంయేం బం. బం....' నీలు ఏడ్చాడు.

'ఛీ ఛీ....! తాగుబోతూ! రాజా!....నా బంగారం!....నా మాణిక్యం! ఏడవకు! ఇంకా ఏడుపెందుకోయ్, మలవయ్యా?' మమత నవ్వింది.

కలిముద్దింపూరు దేవుదగ్గర 'గుడ్డపీలికల పీర్లచెట్టు'కు మొక్కు-కొని ఎవరో మరొక గుడ్డపీలిక ముడేశారు.

సమాప్తం.